# డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్క

## రచనలు - ప్రసంగాలు

### సంపుటం - 12

### అముద్రిత రచనలు



ప్రాచీన భారతీయ వాణిజ్యం, అస్పృశ్యులు - బ్రిటిష్ ప్రభుత్వ
బ్రిటిష్ రాజ్యాంగం - ప్రసంగాలు విభిన్న చట్టాలపై నోట్స్,
అన్ని మతాలకూ అస్పృశ్యులే - తదితర వ్యాసాలు






ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణలు

1996



డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్

ఎం.ఎ., పి.హెచ్.డి., డి.ఎస్.సి., బార్–ఎట్–లా, జె.పి., ఎల్.ఎల్.డి., డి. లిట్.

జననం : 14 ఏప్రిల్, 1891

పరినిర్వాణం : 6 డిసెంబర్,

# డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్

# రచనలు - ప్రసంగాలు

## సంపుటం-12


ప్రధాన సంపాదకులు

ఆచార్య నాయని కృష్ణకుమారి

ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం

సంపాదకులు

శ్రీ డి.వి. సుబ్బారావు

డా॥ సి. మృణాళిని

డా॥ మాడభూషి శ్రీధరాచార్యులు



అనువాదం - సారథ్యం

తెలుగు విశ్వవిద్యాలయం

ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

1996

# DR. BABA SAHEB AMBEDKAR RACHANALU- PRASANGALU VOLUME XII



First Print
March,1996

Copies: 2000

Popular edition : Rs. 60/-
Library edition : Rs. 100/-

*General Editor*
**Prof. NAYANI KRISHNA KUMARI**

*Editors:*
**Sri D.V.SUBBA RAO**
**Dr. C. MRUNALINI**
**Dr. M. SRIDHARACHARYULU**

*Copies can be had from:*
Deputy Resistrar
Publication Division,
Telugu University.
Hyderabad-500 004.

*Printed at*
**TWIN CITIES OFFSET PRINTERS**
Himayatnagar, Hyderabad-29

ISBN 81-86073-18-3

later to 10% the average rate during the Century would work out at
9% and it only rose above from 1768 to 1771. In 1720 a slight fall was
caused by the competition of the French Company, and a further fall
followed an increase of capital and the foundation of the Swedish Co
in 1732. In 1744 it rose again to 8% and continued at this rate
eleven years in spite of the continual war both in Europe on the Co
In 1755 the unsettled condition of the affairs at last had effect & a
of 2% resulted. In 1760 the cession of Burdwan & other provinces
the working costs of the Company and kept the dividend at 6%,
the sum distributed annually was £191,644. In 1767 in cons
of the acceptance of the territorial sovereignty of Bengal, the divid
was raised to 10% and the amount distributed reached £319,4
This rise was quite unjustifiable and was largely due to the exaggerate
mated of the prosperity of India. The inc and dividends declare
anticipation of large profits which were never fully realized..
paid by means of loans raised at exhorbitant interest. For fiv
the Company hung on in the hope of better days, but in 1772 t
crash came & the dividends fell from 12½% to 6%. Lord Nor
then intervened, and, for the future, the Company's dividends we
subject to the ministerial control. The Regulating Act was p
by renewed prosperity & the dividend continued to rise slowly. In 179
conclusion of the peace with Tipoo, whereby the Company rec
a revenue of £240,000 and an indemnity of £1,600,000

Facsimile of Dr. Ambedkar's handwriting
during his student-days in America in
the year 1915-16 ; pages from ' Ancient Indian Commerce '.

| Articles | East-Indies | | | West-Indies etc. | | |
|---|---|---|---|---|---|---|
| | £. | s. | d. | £. | s. | d. |
| Sugar per cwt | 1. | 12. | 0. | 1. | 4. | 0 |
| Coffee per lb | 0. | 0. | 9 | 0. | 0. | 6 |
| Spirits, Smoked per gallon. | 1. | 10. | 0 | 1. | 0. | 0 |
| " , not .. | 0 | 15. | 0 | 0 | 8. | 6 |
| Tamarinds per lb | 0 | 0. | 6 | 0 | 0. | 2 |
| Succades | 0. | 0. | 6. | 0. | 0. | 8 |
| Tobacco .. | 0. | 3. | 0 | 0. | 2. | 9. |
| Wood teak under 8 inches square per load | 1. | 10. | 0 | 0. | 10. | 0 |
| Ditto, not particularly enumerated ad valorem | 20 per Cent | | | 5 per Cent. | | |

The English tariff on Indian goods was not not only discriminating but di[illegible] with the use ~~to~~ to which they were put to in England as will be seen from [illegible] following answers of Mr Rev John Ranking to the question of the Committee House of Commons in 1873

Q. "Can you state what is the ad valorem duty on piece goods sold at the East India House?".

A. "The duty on the class called Calicoes is £3, 6s. 8p. per cent upon impor[illegible] and if they are used for home consumption there is a further duty of £68, 6s. 8d. per cent.

"There is another class called muslins, on which the duty on impor[illegible] is 10 per cent, and if they are used for home consumption of £27, 6s. 8[illegible]

# డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్

# రచనలు - ప్రసంగాలూ

# సంపుటి - 12

... ఈ భావాలు ఒక వ్యక్తి భావాలు. అధికారం చేతిలో కీలు బొమ్మగానీ, మహానుభావుల భజన పరుడుగానీ కాని ఒక వ్యక్తి భావాలు. పేదలు, పీడితుల విముక్తి కోసం అవిశ్రాంత పోరాటం జరపడమే ఏకైక లక్ష్యంగా పెట్టుకున్న వ్యక్తి నుంచి పెల్లుబికిన భావాలు. కానీ దానికి లభించిన ప్రతిఫలం - జాతీయ పత్రికలు, జాతీయ నాయకుల నుంచి తిట్లు, శాపనార్థాలూ. నియంతల సంపదతో పీడితులను విముక్తం చేయడం, సంపన్నుల నోట్లతో పేదలను ఉద్ధరించడం అనే అద్భుతాలు లేదా గారడీలను ప్రదర్శించడంలో వారితో చేరడానికి నిరాకరించినందుకు నాకు లభించిన ఈ ప్రతిఫలాన్ని చూసి ప్రవాహంలా ఉబికి వచ్చిన భావాలివి.

''కుల నిర్మూలన''లో
డా॥ అంబేద్కర్

ఆచార్య నాయని కృష్ణకుమారి
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం
హైదారాబాదు

# ముందు మాట

భారత రాజ్యాంగ నిర్మాతగా దళితవర్గాల నాయకుడిగా, రాజనీతి కోవిదుడిగా, న్యాయశాస్త్ర పారంగతుడుగా, ప్రజాభిమానాన్ని చూరగొన్న మనిషి డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్. కులవ్యవస్థలో కూరుకుపోయిన వారికి డా. అంబేద్కర్ ఒక ఆశాజ్యోతి. ఒక చైతన్య కేతనం. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వాల మేలుకలయికగా ఉండే సమాజం అంబేద్కర్ లక్ష్యం.

మహర్ కులంలో జన్మించిన అంబేద్కర్ విద్యార్థి దశనుండే సమాజం చేత దుర్భరమైన అవమానాలను ఎదుర్కొన్నారు. దాంతో చిన్నతనంలోనే ఆయన సంఘ సంస్కరణ, పీడిత జనోద్ధరణే పరమ లక్ష్యంగా ఎన్నుకొన్నారు. ఆయన ఏ వృత్తి చేపట్టినా ఆ లక్ష్యానికి దూరం కాలేదు. ఆ లక్ష్య సాధన కోసం డా॥ అంబేద్కర్ రాజకీయ కార్యకలాపాలు నిర్వహిస్తూ, ఎన్నో నిర్మాణాత్మక కార్యక్రమాలను కొనసాగించారు. ఆ క్రమంలోనే రచనలు చేయడం ప్రసంగాలు చేయడం ద్వారా ప్రచారం చేయడం, వంటి ప్రధాన మార్గాలను ఎంచుకున్నారు.

బలహీన వర్గాలలో చైతన్యాన్ని రగిలించి వారికి నాయకత్వం వహించి డా॥ అంబేద్కర్ తన రాజకీయ మహా ప్రస్థానానికి శ్రీకారం చుట్టారు. బొంబాయి రాష్ట్ర శాసన సభ్యత్వం, రాజనీతి శాస్త్రంలో విశేష పరిజ్ఞానం డా॥ అంబేద్కర్ కృషికి ఎంతగానో దోహదం చేసినాయి.

డా॥ అంబేద్కర్ అహర్నిశలు ప్రతి దశలోనూ దళితుల అభ్యున్నతి కోసం కృషిచేశారు. రాజ్యాంగంలో దళితుల కోసం ఏర్పాటయిన ప్రత్యేక హక్కులు, వసతుల కోసం నిర్విరామంగా కృషి చేసిన విషయం లోకవిదితమే.

దళిత జనాభ్యున్నతి కోసం ఆయన సాగించిన అవిశ్రాంత పోరాటానికి వెన్నుదన్నుగా భారత చరిత్ర, శ్రుతి స్మృతి పురాణాది ప్రాచీన వాఙ్మయాన్ని, అందుకు సంబంధించిన ఆధార గ్రంథాల్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నారు. తను చేపట్టిన మహత్తర సంస్కరణోద్యమాన్ని శక్తివంతంగా నడిపించారు.

డా॥ అంబేద్కర్ ఏ రంగంలో కృషి చేసినా రచనా వ్యాసంగాన్ని విడనాడలేదు. రాజకీయ, ఆర్థిక సాంఘిక, ధార్మికాది విషయాలపై అసాధారణ ప్రతిభతో ఆయన రాసిన రచనలు, చేసిన ప్రసంగాలు అంబేద్కర్ జ్ఞాన సంపదకు మణిహారాలు.

ప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఫలితంగా డా॥ అంబేద్కర్ గ్రంథావళిని మహారాష్ట్ర ప్రభుత్వం 1979లో డా॥ బాబా సాహెబ్ అంబేద్కర్ జన్మదినోత్సవ దినాన ఆంగ్లంలో వెలువరించి భారతావనికి అందించింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం డా॥ అంబేద్కర్ శతజయంతి ఉత్సవాల సందర్భంగా ఆయన రచనలు, ప్రసంగాలను తెలుగులోకి అనువదింపజేయాలని నిర్ణయించింది. ఈ విషయంలో అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డిగారి ఆసక్తి ఉత్సాహం అనువాద కార్యక్రమానికి ప్రేరకాలయినాయి. వారు నిధులను కూడ సమకూర్చినారు.

అనంతరకాలంలోను అప్పటి ముఖ్యమంత్రులు మాన్యశ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డిగారు, మాన్యశ్రీ తారక రామారావుగారు, ప్రస్తుత ముఖ్యమంత్రి మాన్యశ్రీ నారా చంద్రబాబు నాయుడు గారు డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమానికి మరింత చేయూత అందించినారు. అందుకు రాష్ట్ర ప్రభుత్వానికి ధన్యవాదాలు తెలుపుతున్నాను.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ అనువాద కార్యక్రమ నిర్వహణకు సారథ్య సంస్థగా తెలుగు విశ్వవిద్యాలయాన్ని నియమించింది. తెలుగు శాఖలు ఉన్న కొన్ని విశ్వవిద్యాలయాలు, ఇతర ముఖ్య సంస్థలు ఈ అనువాద కార్యక్రమంలో భాగస్వాములను చేసి తెలుగు విశ్వవిద్యాలయ పూర్వ ఉపాధ్యక్షులు పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు ఈ ప్రణాళికకు రూపకల్పన చేశారు. వారి నేతృత్వంలో అనువాద కార్యక్రమానికి ఆరంభం జరిగింది. ఆచార్య పేర్వారం జగన్నాథం గారు ఈ సంపుటాలను ప్రచురించడానికి ఎంతో చొరవ తీసుకున్నారు.

పైన పేర్కొన్న వివిధ సంస్థలు డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని బాధ్యతయుతంగా స్వీకరించాయి. అంతే కాదు ఆయా సంస్థలకి చెందిన వ్యక్తులే సంపాదక బాధ్యతలు నిర్వహించినారు. వివిధ రచయితలు, పండితులు చేసిన అనువాదాల్లో సంపాదకులు ఎంత ప్రయత్నించినప్పటికి కొంత భిన్నత, అనువాద శైలీ భేదాలు చోటు చేసుకోక తప్పలేదు.

డా॥ అంబేద్కర్ రచనలు - ప్రసంగాలు అనువాద కార్యక్రమానికి తగిన సలహాలు, సూచనలు ఇచ్చేందుకు ఒక పరిశీలనా సంఘం ఏర్పాటైంది. పార్లమెంటు మాజీ సభ్యులు శ్రీ కోట పున్నయ్య, ప్రముఖ విద్యావేత్త డా. టి.వి. నారాయణ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ మాజీ కార్యదర్శి శ్రీ జె. వీరాస్వామి సభ్యులుగా ఉన్నారు. పరిశీలనా సంఘ సభ్యులు చేసిన సూచనలననుసరించి వారి మార్గదర్శక సూత్రాలను దృష్టిలో ఉంచుకొని సారథ్య సంఘంగా తెలుగు విశ్వవిద్యాలయం అనువాద కార్యక్రమాన్ని ముందుకు నడిపిస్తున్నది. ఈ సందర్భంగా వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు తెలుపుతున్నారు.

డా॥ అంబేద్కర్ రచనలు - ప్రసంగాలు సంపుటాలను అనువదించే బాధ్యతను తెలుగు విశ్వవిద్యాలయం వెంటనే వివిధ విశ్వవిద్యాలయాలకు కొన్ని సంస్థలకూ అప్పగించింది. ఈ సందర్భంలో రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ, సాంఘిక సంక్షేమ శాఖలు ఏర్పాటు చేసిన సమావేశాలకు తెలుగు విశ్వవిద్యాలయం తరపున రిజిస్ట్రార్ శ్రీ. డి.వి. సుబ్బారావు హాజరై మా ప్రచురణల కార్యక్రమాన్ని క్రమబద్ధం చేశారు.

అంబేద్కర్ శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకుని తెలుగు విశ్వవిద్యాలయం అనువదించి ముద్రింపజేసిన ఏడవ సంపుటం తిరుపతిలో 14-4-1992 నాడు ఆవిష్కృతమైంది.

డా. అంబేద్కర్ జయంతిని పురస్కరించుకుని డా॥ అంబేద్కర్ ప్రిపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ అనువదించిన మొదటి సంపుటం హైదరాబాదులో 14-4-1993 నాడు ఆవిష్కృతమైంది.

ప్రస్తుత సంపుటం డా॥ అంబేద్కర్ గ్రంథావళిలో 12వది. దీని అనువాదాన్ని తెలుగు విశ్వవిద్యాలయం చేపట్టింది. ఈ గ్రంథంలో అంబేద్కర్ అముద్రిత రచనలు ఉన్నాయి. వీటిలో ప్రాచీన భారతీయ వాణిజ్యం, అస్పృశ్యులు, బ్రిటిష్ ప్రభుత్వం, బ్రిటిష్ రాజ్యాంగంపై ప్రసంగాలు, విభిన్న చట్టాలపై నోట్స్, అన్ని మతాల వారికీ అస్పృశ్యులే విసా తదితర వ్యాసాలు ఉన్నాయి.

ఈ పన్నెండో సంపుటి అనువాదంలో తెలుగు విశ్వవిద్యాలయం అనువాదకులు ఇతర సుప్రసిద్ధ అనువాదకులు పాల్గొన్నారు. ఈ సంపుటాన్ని డా॥ వి. కృష్ణారావు శ్రీ కె. శ్రీనివాస్, డా. సి. మృణాళిని, శ్రీ డి.వి. సుబ్బారావు, ఆచార్య జయధీర్ తిరుమలరావు, డా. మాడభూషి శ్రీధరాచార్యులు, శ్రీ ఆర్వీ.ఆర్. తదితరులు అనువాదం చేశారు. వారికి మా ధన్యవాదాలు.

దీక్షతో, దక్షతతో త్వరితగతిన అనువాదానికి మెరుగులు దిద్దిన సంపాదకులు డా. సి. మృణాళిని, శ్రీ. డి.వి. సుబ్బారావు, డా. మాడభూషి శ్రీధరాచార్యులు గార్లకు నా అభినందనలు తెలియచేస్తున్నాను.

డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని ప్రోత్సహించి, ఉత్సాహంతో ముందుకు నడిపిస్తున్న సాంఘిక సంక్షేమ శాఖాధికారులకీ, ఉన్నత విద్యాశాఖాధికారులకు కృతజ్ఞతలు.

ఈ సంపుటి అందరి హృదయాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

నాయని కృష్ణకుమారి

ధాత ఉగాది
20.3.1996

నాయని కృష్ణకుమారి

# ఈ గ్రంథాన్ని తెలుగులోకి అనువదించిన వారు

| | | |
|---|---|---|
| 1) | శ్రీ కె. శ్రీనివాస్ | 1 - 74 |
| 2) | డా॥ శ్రీధరాచార్యులు | 75 - 146 |
| | | 465 - 519 |
| 3) | డా॥ సి. మృణాళిని | 149 - 189 |
| 4) | డా॥ వి. కృష్ణారావు | 191 - 464 |
| 5) | ప్రొఫెసర్ జయధీర్ తిరుమలరావు | 667 - 685 |
| 6) | శ్రీ డి.వి. సుబ్బారావు | 521 - 666 |
| 7) | శ్రీ ఆర్.వి. ఆర్. | 689 - 746 |

# సంపాదకుడి మాట

డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ స్థాపించిన పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ వద్ద డా॥ అంబేద్కర్ రచించిన అనేక స్వలిఖితాలు ఇతర పత్రాలు ఉన్నాయి. డాక్టర్ అంబేద్కర్ రచించిన 71 వ్యాసాల జీరాక్స్ పత్రులను సొసైటీ మహారాష్ట్ర ప్రభుత్వానికి ఇచ్చింది. కనుక అవన్నీ ఈ సంపుటులలో పొందు పరచటానికి వీలయింది.

మూడో సంపుటి అయిదో సంపుటుల్లో చాలా వ్యాసాలను చేర్చాం. కొన్ని వ్యాసాలు ప్రచురితం కాలేదు. కాని ప్రస్తుత కాలానికి కూడా అవసరమని భావించి నిశితంగా పరిశీలన జరిగిన తర్వాతనే ఈ సంపుటిలో ప్రచురించడం జరిగింది.

ఈ సంపుటి ఆరు భాగాలుగా విభజితమయింది. తొలి భాగంలో భారతదేశానికి మధ్య తూర్పు, పాశ్చాత్య దేశాలతో క్రీస్తుశకం ఆరంభమయిన నాటి నుండి ఉన్న వాణిజ్య సంబంధాలపై డాక్టర్ అంబేద్కర్ వ్యాసాలున్నాయి. డాక్టర్ అంబేద్కర్ మాస్టర్ ఆఫ్ ఆర్ట్స్ డిగ్రీకోసం కొలంబియా విశ్వవిద్యాలయంలో ప్రాచీన భారతీయ వాణిజ్యంపై సిద్ధాంత గ్రంథాన్ని సమర్పించారని డా॥ అంబేద్కర్ జీవిత చరిత్ర రచయిత శ్రీ. సి. బి. ఖైర్‌మోడె పేర్కొన్నారు. ఈ విషయంపై మూడు వ్యాసాలు ఒకటి, రెండు, అయిదు అధ్యాయాల్లో ఉన్నాయి. డాక్టర్ అంబేద్కర్, సిద్ధాంత గ్రంథం విషయాన్ని ఆ తర్వాత మార్చారు. అయినా డాక్టర్ అంబేద్కర్ ఈ అంశంపై రాసిన వ్యాసాలు చరిత్ర విద్యార్థులకు ఎంతో ఉపయోగపడతాయి. భారతీయ చరిత్ర, క్రీస్తు పూర్వం నుంచి భారత్ వాణిజ్య సంబంధాలను బ్రిటిష్ పాలనా కాలందాకా లోతుగా స్పష్టంగా వివరించిన యువ అంబేద్కర్ నిశితదృష్టిని ఈ వ్యాసాల ద్వారా అర్థం చేసుకోవచ్చు. ఈ వ్యాసాలను ఆయన స్వయంగా ఎంతో అందంగా రాసారు.

ఈ సంపుటి రెండో భాగంలోని వ్యాసాలను డాక్టర్ అంబేద్కర్ లండన్‌లో జరిగిన రౌండ్ టేబుల్ సమావేశాలకు 1930-33 సంవత్సరాల మధ్య వెళ్లిన సందర్భంలో బహుశా రాసి ఉంటారు. ఇది 123 పేజీల టైపు ప్రతి. ఎన్నో చోట్ల ఖాళీలు వదిలారు. కొన్ని చోట్ల కొటేషన్‌లను కూడా చేర్చ లేదు. దేశంలో అస్పృశ్యతను నిర్మూలించేందుకు ఒక సాంఘిక శాసనం అవసరమని బ్రిటిష్ ప్రభుత్వానికి చెప్పడం కోసం ఈ వివరణాత్మక వ్యాసాన్ని రూపొందించారు.

ప్రభుత్వ లా కళాశాలలో లా బోధిస్తున్న కాలంలో 1934-35 మధ్య డాక్టర్ అంబేద్కర్ బ్రిటిష్ రాజ్యాంగంపై రూపొందించిన ఉపన్యాసాలు మూడో భాగంలో ఉన్నాయి. ఈ వ్యాసాలు మాకు

విడివిడిగా అందాయి. ముందుమాటలో 3 పేజీలున్నాయి. బుక్ - II లో 12 పేజీలు, పార్లమెంటు వివరణ 33 పేజీల్లో ఉంది. ఇందులో 3 అధ్యాయాలున్నాయి. అయిదో అధ్యాయం కింద లార్డ్స్, కామన్స్‌ల ప్రత్యేక హక్కులు అధికారాలు 21 పేజీల్లో విశ్లేషించారు. ఈ అధ్యాయాల్లోని కొన్ని పేజీల్లో కొన్ని లైన్లు మాత్రమే ఉన్నాయి. కొన్ని ఖాళీగా వదిలారు. ఆ విషయం అవసరమైన చోట పేర్కొన్నాం. ఈ పేజీలన్నీ ఫూల్స్కేప్ మీద టైప్ చేసినవి.

భారతీయ రాజ్యాల ప్రకటనలు, సార్వభౌమత్వం గురించి 21 పేజీల టైపు చేసిన వ్యాసం మరో అధ్యాయంలో ఉంది. ఇందులో డాక్టర్ అంబేద్కర్ స్వదస్తూరీతో చేసిన సవరణలూ, చేర్పులూ, మార్పులూ ఉన్నాయి. ఇది పత్రికలకు విడుదల చేయదలచుకున్న 'పత్రికా ప్రకటన అయి ఉండవచ్చు.

నాలుగో భాగంలో - 1929-37 మధ్య ప్రభుత్వ లా కాలేజ్ అధ్యాపకులకు నోట్స్‌గా ఉపయోగపడేందుకు గాను విభిన్న చట్టాలు శాసనాలపైన వివరణలున్నాయి. ఈ భాగంలో చేర్చిన వ్యాసాలలో పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ పంపినవి ఇవి:

1. కామన్ లా - 129 - చేతి వ్రాత పుటలు
2. డొమినియన్ స్థాయి - 43 - చేతి వ్రాత పుటలు
3. నిర్దిష్ట ఉపశాంతి శాసనం - 77 - చేతి వ్రాత పుటలు
4. ధర్మకర్తల చట్టం - 160 - చేతి వ్రాత పుటలు
5. కాల పరిమితి చట్టం - 58 - చేతి వ్రాత పుటలు
6. నేర ప్రక్రియ చట్టం - 109 - చేతి వ్రాత పుటలు
7. ఆస్తి మార్పిడి చట్టం - 128 - చేతి వ్రాత పుటలు
8. సాక్ష్య చట్టం - 223 - టైపు చేసిన పుటలు

సాక్ష్య చట్టం నోట్స్ తప్ప మిగిలినవన్నీ చేతివ్రాతలే. కంపోజింగ్‌కు అనుకూలంగా ఉండడం కోసం జీరాక్స్ ప్రతులు టైప్ చేయించడం జరిగింది. లైన్‌కాపీ కంపోజ్ అయిన తర్వాత, ప్రూఫులను చేతి వ్రాత జిరాక్స్ పేజీలతో మా కార్యాలయంలో పోల్చి చూడడం జరిగింది. ఈ సందర్భంగా చాలా పేజీలలో వ్రాత స్పష్టంగా లేదని, అందువల్ల కొన్ని చోట్ల సరైన అర్థం స్పష్టంగా లేదని గమనించాం. కనుక మూల ప్రతితో పోల్చ వలసిన అవసరం ఏర్పడింది. డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్ ఇల్లు 'రాజగృహం' లో పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ ఆయన సొంత రచనల ప్రతులను భద్రపరిచింది. అక్కడ కొన్ని నెలలపాటు అసలు ప్రతులతో ప్రూఫులను సరిపోల్చవలసివచ్చింది. డాక్టర్ అంబేద్కర్ అనేక సందర్భాల్లో ఎన్నో సవరణలు; మార్పులు, చేర్పులు చేసారని గమనించి, ఆ సవరణలన్నీ ప్రూఫ్‌ల్లో కూడా చేయడం జరిగింది.

అసలు నోట్స్ వరస క్రమంలో లేవు. కొన్ని మూల పుటలు ఎంతగా చెడి పోయాయంటే కొన్ని పదాలు మాసిపోయాయి. మరికొన్ని అసలే కనపడకుండా పోయాయి. ఆయన రచనలు యథాతథంగా ప్రచురించేందుకు వీలయినంత కృషి చేయడం జరిగింది.

డ్యాక్టర్ అంబేద్కర్ స్వీయ కథా వివరణ రూపంలో ఉన్న వ్యాసాలు పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ 1990లో ఒకే పుస్తకంగా ప్రచురించింది. ఈ సంపుటి అయిదో భాగంలో ''అన్ని మతాల వారికీ అస్పృశ్యులే'' అన్న శీర్షిక కింద కూడ ఈ వ్యాసాలు ప్రచురించడం జరిగింది.

ఆరోదీ ఆఖరిదీ అయిన భాగంలో డ్యాక్టర్ అంబేద్కర్ అనేకాంశాలపైరాసుకున్న అముద్రిత అభిప్రాయాలనుచేర్చడం జరిగింది. రోమన్‌సామ్రాజ్యంలో అమెరికాలో బానిసలగురించి కూడా ఒక వ్యాసంలో విశ్లేషించారు. బానిసత్వం కన్న అస్పృశ్యత ఎంత భయంకరమయిందో అంబేద్కర్ ఈ వ్యాసంలో స్పష్టంగా వివరించారు.

విభిన్న అంశాలపై డ్యాక్టర్ అంబేద్కర్ రాసిన వ్యాసాలను వివిధ వర్గాల క్రింద క్రోడీకరించడం కష్టం, మెకాలే వలె ఆయన అనేక విభిన్నమయిన అంశాలపై రాసారు. అంతకు ముందు విస్తృతంగా చదివారు. జాగ్రత్తగా నోట్స్ రాసుకున్నారు. పదాలు, పడికట్టు మాటలు, భావాలు ఆయన జ్ఞాపకంలో భాగంగా ఉండి పోయాయి. అవన్నీ ఆయన రచనల్లో ప్రతిఫలించాయి. ఈ బహుముఖ ప్రజ్ఞాశాలిని అర్థం చేసుకోవడానికి ఆ రచనలన్నీ ఈనాడు ఎంతో అవసరం.

పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ ప్రస్తుత అధ్యక్షులు శ్రీ జస్టిస్ ఆర్. ఆర్. భోలే, మాజీ అధ్యక్షులు శ్రీ. ఘనశ్యాం తల్‌వాట్‌కర్‌లకు నేను వ్యక్తిగతంగా కృతజ్ఞుడిని. అంబేద్కర్ రచనల ప్రాజెక్టు పట్ల, ఆయన వ్రాత ప్రతుల పట్ల వారు చూపిన శ్రద్ధాసక్తులు ప్రశంసనీయమయినవి. నిజంగా వారి చొరవ వల్లనే సొసైటీ అధ్వర్యంలో ఉన్న ఆ వ్రాత ప్రతులను పరిశీలించి ''బుద్ధుడు - ఆయన ధమ్మం'' అనే రెండో సంపుటి ప్రచురించడం ప్రభుత్వానికి సాధ్యమయింది. డ్యాక్టర్ అంబేద్కర్ పరిశోధనా కేంద్రం, రాజ్‌గృహ, దాదర్, బొంబాయి, లైబ్రేరియన్ ఇన్-చార్జ్ శ్రీ ఆర్.జి. రూకే మాకు ఎప్పుడూ సహాయకారిగా ఉన్నారు. మేం అడిగిన ప్రతీ సహాయం చేసారాయన.

ఈ సంపుటికి సంపాదకత్వం నెరపడంలో నాకు అడుగడుగునా ఎంతో సహాయసహకారాలు అందించిన వారు:

ఈ సంపుటికి సంపాదకత్వం నెరపడంలో నాకు అడుగడుగునా ఎంతో సహాయసహకారాలు అందించిన వారు:

1) ఈ రచనల ప్రాజెక్టును ప్రోత్సహించిన మహారాష్ట్ర మాజీ ముఖ్యమంత్రులు శ్రీ శరద్‌పవార్, శ్రీ సుధాకర్ రావ్ నాయక్

2) ఎల్లప్పుడూ మార్గదర్శకత్వం నెరిపిన మహారాష్ట్ర ప్రభుత్వ ఉన్నత విద్యా సాంకేతిక విద్యా కార్యదర్శి, శ్రీ జె.డి. జాధవ్, బొంబాయి మున్సిపల్ కార్పోరేషన్ అడిషనల్ కమిషనర్ శ్రీ. బి. ఎం. అంబైకర్.

3) విలువైన రిఫరెన్స్‌లు అందించిన బొంబాయి సిద్దార్ధ కళాశాల లైబ్రేరియన్ శ్రీ శ్రీకాంత్ తలవట్‌కర్.

4) ఉన్నత విద్యా, సాంకేతిక విద్య డిప్యూటి సెక్రటరీ, శ్రీ. బి. టి. కాంబ్లే, ప్రింటింగ్‌స్టేషనరీ డైరెక్టర్ శ్రీ. పి. ఎన్. మోరే, నాగ్‌పూర్ ప్రభుత్వ ముద్రణాలయం సిబ్బంది ఈ సంపుటిని అందంగా తీర్చిదిద్దడం కోసం కృషి చేసినారు.

5) మా కార్యాలయ సిబ్బంది శ్రీ నలీల్ వాగ్మేర్, శ్రీమతి ఎస్. ఎం. నేవారేకర్, శ్రీ ఆర్. టి. సూతార్

వీరికే కాదు, పొరబాటున పేర్కొన లేకపోయిన అనేక మంది మిత్రులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

సం॥
వసంత్ మూన్
సంపాదకుడు

# విషయానుక్రమణిక

## నాలుగో భాగం :

## చట్టాలపై వ్యాఖ్యానాలు



## అయిదో భాగం :

## అన్ని మతాల వారికీ అస్పృశ్యులే



## ఆరో భాగం :

## వివిధ అంశాల పైన నోట్స్

# ప్రాచీన భారతీయ వాణిజ్యం

అధ్యాయం 1 మధ్యప్రాచ్యంలో భారతదేశ వాణిజ్య సంబంధాలు.

అధ్యాయం 2 మధ్యయుగాలలో భారతదేశ వాణిజ్య సంబంధాలు.

అధ్యాయం 3 బ్రిటిష్ రాజపాలన నాటికి ఇండియా
(ఈ అధ్యాయాన్ని రాత ప్రతిలో 5 అధ్యాయంగా రాశారు, 3, 4 అధ్యాయాలు పోయినట్లున్నాయి).

( ఈ భాగంలో ప్రాచీన భారతీయ వాణిజ్యంపై పై మూడు అధ్యాయాలు (మూలంలో 1, 2, 5 అధ్యాయాలుగా పేర్కొన్నవి) ఉన్నాయి. 1913-15 మధ్యకాలంలో డాక్టర్ అంబేద్కర్ కొలంబియా విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. పరీక్షకోసం సమర్పించవలసిన పరిశోధన పత్రానికి ప్రాచీన భారతీయ వాణిజ్యాన్ని అంశంగా తీసుకున్నారు. తరువాత ఆయన వ్యాసాంగాన్ని మార్చుకున్నారు. అది '' ఈస్ట్ ఇండియా కంపెనీ పాలన, ఆర్థిక విషయాలు'' ఈ పరంపరలో ఆరో సంపుటంలో ఆ భాగం వుంది. 1913-15 కాలంలో డాక్టర్ అంబేద్కర్ దస్తూరి నకలును కూడా ఇక్కడ యువతరం ప్రేరణ కోసం సమర్పిస్తున్నాము. - సంపాదకులు)

## అధ్యాయం - I

# మధ్య ప్రాచ్యంలో భారతదేశ వాణిజ్య సంబంధాలు

రోమన్ చక్రవర్తులు తమ ఖడ్గాన్ని ప్రాచ్య, పాశ్చాత్య దిశలు రెండింటి వైపు ఝళిపించారు. ఫలితాలు వేరు. తూర్పున ''వారు జయించినది శిక్షించడానికి మాత్రమే''[1] పశ్చిమాన వారు ''తమ పాలితులను రోమ్నైజ్ చేయడమో (....)* యజమానులు లేదా స్వయంగా రోమనీకరణ పొందడానికి స్వచ్ఛంద ఏజెంట్లుగా మారేందుకు ఆ జాతులను వదిలివేయడమో చేశారు''[2] ఈ రోమనీకరణ ఫలితంగా పాశ్చాత్య దేశాలు తమ రోమన్ వారసత్వం గురించి గర్వపడతారు. ఈ సుసంపన్న వారసత్వం ఎలా సమకూరిందో శోధించడానికి ఎవరూ పూనుకోలేదు.

రోమన్ల సైనిక వ్యవస్థను, వారి న్యాయానుసరణను, దళాలు యుద్ధానికి ముందూ తరువాత ప్రదర్శించిన క్రమశిక్షణను చూద్దాం. ఉత్తరం నుంచి ఎట్రూస్కన్స్ (Etruscans) పశ్చిమం నుంచి లీగురియన్స్ (Lygurians), తూర్పు నుంచి సేబియన్లు (Sabians), దక్షిణం నుంచి గ్రీకులు కమ్ముకొన్నప్పుడు రోమన్లు అతికష్టం మీద శక్తిని కూడగట్టుకున్నారు. యుద్ధభేరి వినిపించగానే స్త్రీలు, పిల్లలు మినహా అందరూ అరుణపతాకం వెనుక పెద్ద సైనికపటాలం వలె మోహరించేవారు. కానీ, రోమ్ తనకున్న స్థలాన్ని మించి శక్తిని సమకూర్చుకుంది. కేంద్రీకరణ విస్ఫోటనానికి, విస్తరణకు దారి తీస్తుందన్న సూత్రాన్ని నిజం చేసింది రాజ్య దాహంతోనో, విదేశీ భయంతోనో అది మొదట ఇటాలియన్ ద్వీపకల్పాన్నంతటినీ కబళించడం మొదలుపెట్టింది. అయితే ఉద్దేశపూర్వకంగానో ఉద్దేశరహితంగానో సామ్రాజ్యవాదానికి తృప్తి వుండదు. కేవలం ఆయుధ బలంతో రోమ్ ఆక్రమణల పరంపర సాగించింది. యుద్ధమే తన పరమార్థం చేసుకుంది. పోటీవలెనే యుద్ధం కూడా తనను తాను నాశనం చేసుకొంటోందని దానికి తెలియదు. ఒక దెబ్బతో అది విశాల భూభాగాన్ని తన చేతిలోకి తెచ్చుకుంది కానీ, చివరకు ప్రేరక శక్తి వుడిగిపోవడంతో (వుడిగిపోక తప్పదు మరి) చివరకు తన కేంద్రం వద్దకు కుంచించుకుపోయింది.

వారి సైనిక విజయాలు, అమానుష ఖడ్గవిన్యాసాలు కాక రోమన్లు రోడ్ల నిర్మాణానికీ, పాలనా

వ్యవస్థకూ కూడా ప్రసిద్ధులు. ఈ కళలు సామ్రాజ్యవాదానికి సహజమైన, అవసరమైన సహచరాలు. (ఇవికాక)* పాక్స్ రోమనా (Pax Romana - సువిశాల సామ్రాజ్యం) అన్న పదబంధం పరిధికి మించిన మరే దోహదమూ రోమన్లు చేయలేదు.

రోమన్ సామ్రాజ్యవాదం ఛత్రం కింద (ప్రాచ్య దేశాల)** నిరంతరం, ''శాంతియుత హస్తం'' వుంది. ఖగోళ శాస్త్రం, గణితం, వైద్యం ఇవన్నీ తూర్పు దేశాల ప్రదానాలే. రోమన్ల ఆచరణాత్మక ప్రతిభతో పోలికలేని పాండిత్యం ప్రాచ్య దేశీయులది. రోమన్ రాజస్థానం ప్రాచీన దేశ దిగ్గంతులతో నిండి వుండేది. టాలేమీ (ptolemy), ప్లోటినస్ (Plotinus) ఈజిప్షియన్లు; పోరఫిరీ (Porphyry), ఇయాంబ్లికాస్ (Iamblichus) సిరియా బిడ్డలు, డియోస్కొరైడెస్ (Dioscorides) గాలెన్ (Galen) ఆసియా ఖండ మేధావులు. రోమన్ నాగరికతలో అధిక భాగం తూర్పు బానిసల సృష్టి . రోమన్ సామ్రాజ్యంలో నెలకొల్పిన పబ్లిక్ స్కూళ్ళలో రోమన్ పిల్లలకు చదువు చెప్పింది కూడా ఈ బానిసలే రోమన్లు బలాన్ని ప్రేమించేవారు కానీ, సౌందర్య ప్రేమికులు కారు. ''రోమ్, స్వయంగా కళారాహిత్యంతో వుండేది. కళలను, కళాకారులను స్వప్రయోజనం కోసం కట్టడి చేసి పెట్టింది. ట్రోజన్ మహాశిల్పంపై బంగారు, స్కార్లెట్ వర్ణాలంకరణలో కనిపించిన రోమన్ ప్రస్ఫుట వర్ణరచనలో ఆటవికానందం అభిరుచి కూడా ప్రాచీన వాణిజ్యంతో ప్రేరితమైనదే''[3] రోమన్ వాస్తుశిల్పం కూడా ప్రాచ్య దేశాల బానిసల సృష్టే. రోమన్ల శక్తియుక్తులన్నీ యుద్ధాలకే లేదా మనుగడ కోసం పోరాటానికి సరిపోయాయి. కానీ, తగినంత పోరాటం తరువాతైనా విరామాన్ని వాడుకుని తన ప్రజల, పాలిత ప్రజల ప్రజ్ఞాపాటవాలను వినియోగించుకోవలసింది. ''శాంతికి కూడా విజయాలుంటాయి, అవి యుద్ధ విజయాలకేమీ తీసిపోవు'' అని రోమ్ దురదృష్టవశాత్తూ గ్రహించలేకపోయింది. లేదా గ్రహించేసరికి పరిస్థితి చేయిదాటిపోయింది. రోమ్ ప్రశాంతి చిహ్నాన్ని నిర్మించుకున్నా **[4] అన్న వాస్తవాన్ని గమనించినప్పుడు రోమన్ అచ్చమైన సైనికవాదం మరింత ప్రస్ఫుటమవుతుంది. రోమ్‌కు కొన్ని పరిశ్రమలున్నప్పటికీ దాని ఉత్పాదక సామర్థ్యం అత్యల్పం. దాని ఉత్పత్తికంటె వినియోగం ఎక్కువ. ఫలితంగా నిరంతర ధన వ్యయం, (The Late fundia) రోమ్ వ్యవసాయాన్ని నాశనం చేసి రైతులను యాచకులను చేసింది. సిసిలీపై, ఈజిప్టుపై, ఆహారం కోసం ఆధారపడవలసిన పరిస్థితి ఏర్పడింది. భూసంపద అంతా కొద్ది మంది దగ్గర కేంద్రీకృతం అయివుండడంతో భూమి ఉత్పాదకత లేక వాస్తవానికి ఇటాలియన్ పంటే లేకుండా పోయింది. రోమ్ సర్వాన్ని తూర్పు దేశాల నుంచీ పొందసాగింది. తిరిగి యిచ్చేందుకు దాని దగ్గర ఏమీ లేదు.

పరిశ్రమలు, సంపద, సాంకేతిక సామర్థ్యం, కళాత్మక ఉత్పత్తులు, మేధో సంపద, రాజకీయాధికారం వీటన్నిటికోసం ప్రాచీన దేశాలలో ముఖ్యంగా పురాతన నాగరికతలున్న దేశాలలో వెదకాలి. కాన్స్టాంటిన్

అన్వేషించాలి''[5] పైగా ''అధ్యాయానికి సంబంధించిన అన్నిశాఖలు కూడా ప్రాచీన స్ఫూర్తితో ప్రభావితం అయినాయి.''[6] ఆ ప్రాచ్యం ''సాంకేతిక పరిజ్ఞానంతో కూలంకషత్వానికి కొత్తవి కనుగొనే పరిశోధక ప్రజ్ఞకు, శ్రామికుల సామర్థ్యానికి రోమ్ కంటె ఉన్నత స్థాయి కలిగినది''[7] పారిశ్రామిక కళా ఉత్పత్తుల దగ్గరనుంచి మొదలుపెట్టి పారిశ్రామిక రంగందాకా ప్రాచ్యం ప్రభావం పెరుగుతూ పోవడాన్ని గుర్తించవచ్చు; తూర్పు దేశాలకు చెందిన మహాకర్మాగారాలు యూరోపు భౌతిక నాగరికతను క్రమంగా మార్చివేశాయని గమనించవచ్చు; పరదేశి పద్ధతులు ప్రక్రియలు పురాతన స్థానిక కార్ఖానాలను ఎలా మార్చివేసిందో వాటి ఉత్పత్తులకు మునుపు లేని సంపూర్ణతను, ప్రజాదరణను ఎలా సాధించిపెట్టాయో చూడవచ్చు''.[8] అత్యంత పురాతనకాలం నుంచి పారిశ్రామిక విప్లవం దాకా ప్రపంచపు కార్ఖానాగా విలసిల్లిన భాగ్యం ప్రాచ్యానిదే. పశ్చిమ దేశాల కొత్త రాతియుగం మనిషికి రాతి గొడ్డలి చేసుకోవడం కూడా ఘనకార్యమై ఉన్న కాలంలో ప్రాచీన అద్భుతమైన ఇనుప బృహత్ స్తంభాలను ఉత్పత్తి చేయడంలో తలమునకలై వుందని గమనించాలి.

ఆ రకంగా ''ప్రాచ్యమే పశ్చిమానికి బలాన్నిచ్చింది''[9] జ్ఞానారంభానికి, పురోగతికీ, మసక మసక నాగరికతా ఉషోదయానికీ ప్రథమ సాక్షులు నైలూ, యుఫ్రెటీస్, యాంగ్త్యేకాంగ్, సింధు నదీ లోయలు.'' తూర్పు నుంచి వెలుగును గ్రహించి కొన్ని రెట్ల కాంతితో పశ్చిమం వైపు ప్రతిఫలింపజేయడమే గ్రీస్, రోమ్ చేసిన పనులు.''[10]

ఈ కోణం నుంచి చూస్తే 'చీకటి యుగం' అనే భూతం చరిత్రకారుడి అభూతకల్పనే అనిపిస్తుంది. యూరోప్‌లో ఏవైనా చీకటి యుగాలున్నాయా? వుంటే అసలక్కడ వెలుగెప్పుడుండింది? చరిత్ర ఆ విషయం చెప్పదు. వెలుగో, నాగరికతో ఏదో వుంటే గనుక అది మధ్యధరా సముద్రపు తూర్పు బేసిన్‌కు (ప్రాచ్యం నుంచి నిరంతరం ఇంధనం అందుకుంటూ) మాత్రమే పరిమితమై వుండింది. తక్కిన ఐరోపా ఖండమంతా మొన్నమొన్నటిదాకా ఆటవికయుగంలో వుంది. ఐరోపా నాగరికత వొంపు **(The curve of European Civilization)** నిరంతరం పెరుగుతూనే (దానికి మూలం ఏదన్నది ప్రక్కన పెడదాం) వుంది. చరిత్రకారుడు చెబుతున్న చీకటి యుగాలు అంతకుముందు శతాబ్దాలకంటె నాగరికతలో ఒక అడుగు ముందున్నవే. 'చీకటి యుగాలు' అన్న కల్పన యూరోప్ రోమ్ ఒకటే అనుకునే భ్రమ నుంచి పుట్టింది. ఒక అంశం లేదా భాగం ఆధారంగా మొత్తాన్ని పరిగణించడం కంటె బూటకం ఇంకొకటి లేదు.

వాస్తవాలను పరిగణిస్తే 'చీకటి యుగం' ప్రశ్న ప్రాచ్య చరిత్రకారుడు వేయాలి. మహోన్నత స్థాయి నుంచి ఈ మహాపతనం ఎందుకని, ఉషోదయం తరువాత ఈ ఆకస్మిక అంధకారం ఏమిటని

అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పవలసింది అతడే. అత్యంత పురాతనమైన, వృద్ధిలోకి వచ్చితీరవలసిన నాగరికతలు, పురోగతిని ఆశిస్తున్న నాగరికతలు చీకటి మలుపులోకి దూకి అకస్మాత్తుగా స్తంభించిపోవడం విషాదం. ఇటుకల మీదా ఫలకాల మీదా ఆధారాలను మాత్రం వదిలి కొన్ని నాగరికతలు అస్తమించాయి. మరికొన్ని ప్రయాసపడుతూ పునరుజ్జీవన మార్గంలో ఉన్నాయి.

భారతీయ నాగరికత పురాతనమైన వాటిల్లో ఒకటి. అయితే వాటన్నిటి లాగే ఇది కూడా స్తంభించిపోయింది. అయితే పునర్జీవనానికి కావలసినంతగా అది బతికింది, అది మళ్ళీ ఎన్నడూ మరణించబోదని ఆశిద్దాం. పాశ్చాత్య సంపర్కం 'స్తబ్దత'ను కుదిపింది. పురాతన చైతన్యశక్తిని మేలుకొల్పింది.

నాగరికత ఫలానాచోటే ఎందుకు ప్రారంభం కావాలి? మరొకచోట ఎందుకు అయివుండకూడదు? అని చరిత్రకారులు తరచూ విస్మయం ప్రకటిస్తుంటారు. అక్కడి ప్రజల సామర్థ్యం వల్లనా? భగవన్నిర్ణయమా? ఈ రెండూ ద్వితీయశ్రేణికారణాలే అని కొద్దిగా ఆలోచిస్తే తెలుస్తుంది. మొదటి కారణం పరిసరాలు. సంపన్నమైన పరిసరాలు, పరిరక్షణావకాశాలు, విదేశీ దాడుల నుంచి రక్షణ లేదా విడితనం వుంటే నాగరికత వర్ధిల్లితీరుతుంది.

భారతదేశ భౌగోళిక స్థితి ఆదిమనాగరికత వేదిక కావడానికి తగినటువంటిది. తమ సామర్థ్యాన్ని సురక్షితంగా వికసింపజేసుకోవడానికి, ప్రకృతి ఫలాలను అందుకోవడానికి భద్రమైన ఏకాంతాన్ని అన్వేషించే గిరిజన తెగలనేకం కూడా అసూయపడే ఏకాంత భూఖండాన్ని ప్రకృతి ఇండియాకు కానుకగా ఇచ్చింది. ఉత్తరాన చైనా, టిబెట్‌లతో వేరుచేసే హిమాలయపర్వతాలు, తూర్పున బర్మా, అస్సాంలతో వేరుచేసే తెనస్సెరిమ్ (Tenasserim), పశ్చిమాన ఆఫ్ఘనిస్తాన్‌తో (కారకోరం)* (హిందూకుష్)* పర్వతశ్రేణుల హద్దు వాటితో మొత్తం ద్వీపకల్పమే చిరు ప్రపంచంగా వుంటుంది. సహజమైన బలమైన సరిహద్దులను ఏర్పరచుకున్న చిరు ప్రపంచం. పర్వతాలు''[11] వాయవ్యంలోనూ, సముద్రం... తక్కిన దిక్కుల్లో కందకం వలె.''

ఈ తలక్రిందుల త్రిభుజ'' దేశం ప్రాకృతిక వనరుల సమృద్ధికి, వైవిధ్యానికి నెలవు. ''బ్రిటీష్ ఇండియాలో జంతుజాలం సమృద్ధిగా వుండడమే కాదు, గణనీయమైన వైవిధ్యంతో కూడినది. యూరోపు భూభాగం ఇండియా కంటె ఒకటిన్నర రెట్లు అధిక వైశాల్యం కలిగినది అయినా, మొత్తం యూరోప్‌లో ఉన్న వాటికంటె అత్యధిక సంఖ్యలో ఇండియాలో జీవరాశి వున్నది. ఇండియాలో నివసిస్తున్నవే కావు, ఇండియాపై ఆధారపడిన జంతుకోటి కూడా అత్యధికం''[12] వృక్షజాతుల్లో కూడా ఇండియాలో వైవిధ్య సంపద ఉన్నది. జంతు వృక్ష జాతి వైవిధ్యానికి కారణం ఇండియా

వాతావరణం. నేడు ప్రపంచంలోని అతికొద్ది దేశాలకు మాత్రమే దక్కిన ఆర్థిక స్వయంసమృద్ధి ఇండియాకు ఏనాడో దక్కడానికి ఇవన్నీ కారణభూతాలు.

ఆర్థిక ప్రేరణలే బలమైనవీ, అధిక క్రియాశీలమైనవీ కాబట్టి, ఇన్ని వనరులున్నప్పుడు మనిషి నిష్క్రియాపరుడిగా వుండలేడు. పరిసరాలను తన సంక్షేమం కోసం ఉపయోగించుకోవాలని అతడు తక్షణం ప్రయత్నిస్తాడు. ఇండియన్లు కూడా అందుకు మినహాయింపు కాదు. నేటి సగటు భారతీయుడి నమూనాలోనే అతని పూర్వీకుని కూడా లెక్కవేయడం పొరపాటు. ముఖకవళికల్లో రూపురేఖల్లో ఇద్దరికీ పోలిక వుండవచ్చు అంతే. దేశంపై తిరుగులేని హక్కు కలిగివున్న కాలంలో ప్రాచీన భారతీయుడు ఆదిమ దశలో ఆశించిన దానికన్నా హెచ్చు విజయాలు సాధించాడు. అతను సాధించిన వాటికి సంబంధించిన ఆధారాలు ఎక్కువగా లేవు కానీ, ఉన్న కొన్నింటినుంచే ఎంతో తెలుస్తుంది.

ప్రాచీన భారతీయుల బహుళ విజయాలు ముఖ్యమైనవే అయినప్పటికీ మనకు వాటితో అవసరం లేదు. వారి ఆర్థిక వ్యవహారాల పైన మాత్రమే దృష్టిని కేంద్రీకరించాలి.

మొదట మన శోధనలో సహాయపడగల మూలాధారాలను గమనించాలి. ప్రకృతి వైపు నుంచి ఆధారాలు లేకపోవడం విషాదకరం. జీవితంలోని ఆర్థిక వ్యవహారానికి సంబంధించి తప్ప అన్నిటి గురించి హిందువులు మాట్లాడతారు. కారణం అస్పష్టమేమీ కాదు. దాదాపు ''సోమరిపోతులు, శ్రమ చేయకుండా విందులు చేసేవారు'' అయిన వర్గం విద్యను గుత్తకు తీసుకుంది. బ్రాహ్మణులు లేదా భారతీయ మేధావి వర్గం ''ప్రస్ఫుటమైన విశ్రాంతి'' ''ప్రస్ఫుటమైన సంపద వినియోగం'' ఇతరుల పేరిట అనుభవించాయి. ఫలితంగా ప్రాచీన హిందువుల ఆర్థిక కార్యకలాపాలను పూజారి వర్గానికే పరిమితమైన సాహిత్యంలో ప్రస్తావించలేదు. ఆర్థికశాస్త్ర సంబంధమైన సారసత్వం ఇండియా నుంచి వెలువడకపోవడానికి ఇది కూడా కారణం. అందువల్ల భారతీయ వాణిజ్యానికి సంబంధించి విదేశీయులు చేసిన అరకొర ప్రస్తావనలపై ఆధారపడవలసి వస్తోంది.

వాణిజ్య అంశానికి వచ్చే ముందు ప్రాచీన భారతంలోని ఆర్థికాభివృద్ధిని శీఘ్రసమీక్ష చేద్దాం. బుద్ధునికి పూర్వకాలంలో ఈ విషయానికి సంబంధించి వివరించే ఆధారాలనిచ్చేవి ఏమీలేవు. బుద్ధుని జనన గాథలు - బుద్ధ జాతకకథలే ఈ విషయంపై తొలి ఆధారాలు. ఈ జాతకకథల కాలానికి ఎంతో ముందునుంచి భారతీయ సమాజంలో ఉనికిలో వుందని భావించగలిగిన ఆర్థిక వ్యవస్థల సాహిత్య ప్రస్తావనలు ఈ గాథలలో ఉన్నాయి.

# 1. వ్యావసాయిక వ్యవస్థ

ఎంతో పురాతనకాలం నుంచి ప్రాచీన హిందువు గ్రామ జీవితాన్ని గడుపుతున్నాడు. ప్రతి గ్రామంలో 30 నుంచి 100 కుటుంబాలుండేవి. ఇళ్ళు చెల్లాచెదురుగా వుండేవి కావు. ఒకేచోట దగ్గర దగ్గరగా చేరి వుండేవి. వ్యవసాయాన్ని అత్యున్నత వృత్తిగా పరిగణించేవారు. భారతీయ పరిగణనలో రైతు తరువాతి స్థానం వ్యాపారిది. సైనికుడి స్థానం సామాజిక శ్రేణులలో అట్టడుగుది.

రైతు, అతని కుటుంబమే నేలను సాగు చేసేవారు. అప్పుడప్పుడు కూలీలను నియమించుకునేవారు. "భూమి బదలాయింపును సాంప్రదాయ భావన స్పష్టంగా వ్యతిరేకించేది." అయినప్పటికీ భూములు కౌలుకు యివ్వడం కనిపిస్తుంది. సొంత కమతం వున్నవాడిని గౌరవంగా చూసేవారు. భూస్వామి భూమిలో పనిచేయడాన్ని మాత్రం గౌరవించేవారు కాదు. గ్రామీణ సమాజంలో ఫ్యూడలిజం వుండేదో లేదో ఖచ్చితంగా చెప్పే ఆధారం లేదు.

భవనాల నిర్మాణంలో, రోడ్లు, చెరువులు, పురపాలక భవనాల మరమ్మతుల్లో గ్రామస్తులు పరస్పర సహకారంతో పనిచేసేవారు.

"పంట మీద ఏటా తిల (Tilha) రూపంలో ప్రభుత్వం పన్నువేసేది. ఇది వస్తురూపేణా 1/6, 1/8, 1/10, 1/12 పద్ధతిలో ఉండేది." "ధాన్యం, పప్పులు, చెరకు ప్రధాన పంటలు; కూరగాయలు, చివరకు పండ్లు, పూలు కూడా పండించేవారు. వరి ప్రధాన ఆహారంగా వుండేది."

వ్యవసాయం సర్వసాధారణ వృత్తిగా వుండేది. బ్రాహ్మణుడు కూడా పశుపాలకుడుగా, చిన్న, పెద్ద భూయజమానిగా కనిపిస్తాడు. అయినా అతను కులభ్రష్టుడు కాడు. ప్రాచీన హిందువు, ఆ మాటకు వస్తే ఆధునిక హిందువుకు వ్యవసాయంపై ఉన్న ప్రేమ ప్రాచీన గ్రీకుల ఊహకు కూడా అందనంతటిది. ఆ ప్రేమే గోపూజలో ప్రతిఫలించింది.

హిందువుల గోభక్తి విదేశీయులు చాలామందికి అంతుపట్టని విషయం. భారతదేశంలో మిషనరీ ప్రచారం కోసం వచ్చే అరకొర మతవైఫల్య వీరుల చేతిలో హిందువులను బ్లాక్‌మెయిల్ చేసేందుకు సాధనమైంది.

రోమన్లు దేవతలకు కొమ్మలు కత్తిరించని ద్రాక్షచెట్ల మధువును అర్పించకపోవడంలో ఎంత ఆర్థికం వుందో గోపూజలో కూడా అంత ఆర్థికం వుంది. వ్యవసాయానికి ఎద్దులకు ఆవే జన్మనిస్తుంది. మాంసం కోసం గోవును చంపితే వ్యవసాయ సంపదకు నష్టం చేకూరుతుంది. అంత సంపూర్ణ

దూరదృష్టితో ప్రాచీనహిందువుగోమాంసాన్ని నిషేధించి, గోవధను నిరోధించాడు. కేవలం నియమాలను మనిషి ఎప్పుడూ శ్రద్ధగా పట్టించుకోడు, దానికి మతపరమైన మంజూరు వుండాలి; అందుకే హిందూ ధార్మిక సాహిత్యంలో గోవు చుట్టూ అన్ని పుక్కిటి పురాణాలు.

## 2. శ్రమశక్తి, పరిశ్రమలు, వాణిజ్యం - వాటి నిర్వహణ

ఆర్థిక జీవనంలో బానిసత్వానికి పెద్ద పాత్ర లేకపోవడం హిందువుల ఘనతగానే చెప్పాలి. బందీగా పట్టుకోవడం, న్యాయపరమైన శిక్ష, స్వచ్ఛందంగా ఆత్మహీనతను ఆపాదించుకోవడం, రుణగ్రస్తం కావడం - వ్యక్తులు బానిసలు కావడానికి ఇవి నాలుగు ప్రధాన కారణాలు. బానిసలను దయగా చూసేవారని, వారిని విముక్తం చేసే అవకాశం ఎప్పుడూ వుండేదని చెప్పడానికి ఆధారాలున్నాయి. అతికొద్ది మంది బానిసలు తప్పిపోగా, పెద్ద సంఖ్యలో ఉన్న స్వేచ్ఛా శ్రామికులకు డబ్బులేదా ఆహారం రూపంలో చెల్లించేవారు.

పారిశ్రామిక తరగతులలో ఈ క్రింది వారిని పేర్కొన్నారు.

ఎ) వడ్ఢకి - వడ్రంగి, నౌకా నిర్మాత, బండి తయారీదారు, వాస్తుశిల్పి వీరికి వడ్ఢకి అన్నది సరైన నామం.

బి) కమ్మర - లోహకారుడు, ఇతను ''నాగలికర్రు దగ్గరనుంచి గొడ్డలి దాకా, ఇనుప ఇంటినుంచి చురకత్తుల దాకా, నీటిపై తేలే సులభమైన సూదుల నుంచి వెండి బంగారు మిశ్రమాల దాకా'' చేయగలిగిన నిపుణుడు.

సి) పశనకొట్టక - మేస్త్రీలు ''గనులు దొలిచి రాళ్ళు రూపు మలచడమే కాదు... స్ఫటికంలో చిన్న ఖాళీని కూడా పూడ్చగల మేలు రకం పరికరాలున్న పనిమంతులు''.

''అన్ని వృత్తి పరిశ్రమలలోనూ చెప్పుకోతగినంత స్థాయిలో నిర్వహణం సామర్థ్యం. కొన్ని రకాలు కొన్ని ప్రత్యేక గ్రామాల్లో కేంద్రీకృతం అయ్యేవి, అవి నగరాల శివార్లలోనూ, అనుబంధ గ్రామాలలోను వుండేవి. వడ్రంగం, కమ్మరం, కుమ్మరం వంటివి ఉన్న గ్రామాలు చుట్టు ఉన్న గ్రామాలన్నిటి కేంద్రాలుగా వుండేవి... అలాగే నగరాలలో కొన్ని రకాల వృత్తులు కొన్ని వీధుల్లోనే కేంద్రీకృతమయ్యేవి ఉదా: దంతపు పని కార్మికులు, అద్దకం పనివారు'' ఈ వృత్తులన్నీ చక్కటి నియంత్రణలో వుండేవి ప్రతి వృత్తినీ ఒకరిద్దరు పెద్ద మనుషులు అజమాయిషీ చేసేవారు. వారు నగరంలోని పారిశ్రామిక సంస్థల పెద్దలో, పురపాలక సంఘ ముఖ్యులో అయివుండేవారు.

ఒక అధ్యక్షుడు (ప్రముఖ్) లేదా వయోవృద్ధుడు (జేఠక) నాయకుడిగా అనేక సంఘాలు (సేనియో) వుండేవి. వడ్రంగులు, లోహకారులు, చర్మకారులు, చిత్రకారులు వివిధ కళా నిపుణులు, ప్రత్యేక సంఘాలు కలిగివుండేవారు. జాలర్లు, పూలదండల పనివారు, బిడారు వర్తకులు కూడా సంఘాలు కలిగివుండేవారు.

వారసత్వంగా వృత్తిని స్వీకరించడం వుండేది. అయితే కుల వ్యవస్థ దుస్సహమైన కఠిన రూపంలో వుండేది కాదు. బ్రాహ్మణులు కూడా తరచూ నిమ్నవృత్తుల్లో వుండేవారు.

నదీ మార్గ రవాణా అత్యల్పంగా వుండేది. రవాణా ముఖ్యంగా రహదారి బిడారుల రూపంలోనే జరిగేది. పారిశ్రామిక కేంద్రాల మధ్య నుంచి రహదారులుండేవి. దశరథుని రాజధాని అయోధ్య (ప్రస్తుత ఔధ్) నుంచి కేకయ రాజ్య రాజధాని రాజగృహ (బియాస్ నదీ తీరంలోని హిమాలయాల సమీపంలోనిది. బియాస్ అంటే ప్రాచీన విపస. దీన్నే గ్రీకులు హిపాసిస్ అన్నారు) కురు రాజుల రాజధాని హస్తినాపురం (ఢిల్లీ) మీదుగా ఉన్న రహదారిని రామాయణం పేర్కొన్నది. ప్రాచీన భారతంలో రహదారుల గురించి అలెగ్జాండర్ వద్ద ఉండిన సమాచారం పొల్లు లేనిది. అది భారతీయ రహదారులను శోధించే సర్వేయర్లకు ఉత్తమ ఆధారం కూడా. నేటి అటక్ సమీపంలోని పెంకెలోటిస్ (పుష్కలావతి) నుంచి తక్షశిల మీదుగా బియాస్ నదిని దాటి పాటలీపుత్రం చేరే రహదారి వుండేదని ఈ ఆధారం వల్లనే తెలుస్తోంది. మరొక రహదారిని పుష్కలావతిని ఇంద్రప్రస్థాన్ని (ఢిల్లీని) కలుపుతూ ఉజ్జయినితో కలిసి వింధ్య పర్వతశ్రేణికి దిగి నెర్బుదా, తపతి దాటి ప్రతిష్ఠా నది మీదుగా దక్కన్ చేరుతుంది. బిడారుల ద్వారా రవాణా జరిపే దేశాలు ప్రధాన రహదారులుగా వుండేవి. ప్రాచీన భారతంలో స్వదేశీ విదేశీ వాణిజ్యానికి, ఎంత ప్రాముఖ్యం వుండేదంటే జాతకకథల్లో సాతవాహనుల (బిడారు వర్తకుల నాయకులు) సంఘం ప్రస్తావన కనిపిస్తుంది. బిడారు నాయకుడు లేదా సాత్రహు (పాళి) బిడారు ప్రయాణానికి నాయకత్వం వహించేవారు. ''ఎక్కడ విడిది చేయాలి, ఎక్కడ పశువులకు నీరు పెట్టడం కోసం ఆగాలి, బందిపోట్లు గురించి తీసుకోవలసిన ముందు జాగ్రత్తలు, నదులు వాగులు దాటవలసిన చోట్లు, సక్రమమైన మార్గం వీటన్నిటికీ సాత్రవాహుడి నుంచే మార్గదర్శకత్వం స్వీకరించేవారు'' వర్తక బిడారులు ఎక్కువగా రాత్రిపూటే ప్రయాణం సాగించేవి.

ప్రాచీన భారతంలో వర్తకం, పూర్తిగా వ్యక్తిగత స్థాయిలో వుండేది కాదు. కార్పొరేట్ వాణిజ్యం, భాగస్వామ్య వ్యాపారం కూడా అక్కడక్కడ వున్నట్లు ఆధారాలున్నాయి. వ్యాపారంపై ప్రభుత్వం అదుపు అతి తక్కువగా వుండేది. అది కూడా రాజులు చేసే కొనుగోళ్ళకు సంబంధించి మాత్రమే వుండేది. రాజ కుటుంబాలు కొనుగోలు చేసే వస్తువుల ధరలను నిర్ధారించడానికి విలువ అంచనాదారు

సృజన, మూఢనమ్మకాలు ఏర్పడ్డాయన్న బకిల్‌తో ఏకీభవించవచ్చు. లేదా చైనాతో హిమాలయ పర్వతాల అడ్డు పర్షియా, ఆఫ్ఘనిస్తాన్‌లతో హిందుకుష్ పర్వతాల అవరోధం, సుదీర్ఘ సముద్రతీరం వున్నప్పటికీ నావికా వ్యాపారం ఆకర్షించకుండా తీరంతో అడ్డుగా నిలిచిన తూర్పు పశ్చిమ కనుమలు- ఈ భౌగోళిక స్థితివల్ల ఇండియా ఒంటరిగా మిగిలిపోయిందన్న భూగోళ శాస్త్రవేత్త మాటలను కూడా మనం ఒప్పుకోవచ్చు.

పైన చెప్పిన అన్ని ఆరోపణలలోనూ వాస్తవం లేశ మాత్రమే. వాటిని ఆధారం చేసుకుని గోరంతలు కొండంతలుగా వాదనలు చేయడం తప్పు. అడ్డు గోడలు ఎంత బలమైనవైనా మనిషి అధిగమించలేనివి కావు. అన్నిరకాల అవరోధాలను అధిగమించడానికి మనిషి ఎల్లవేళలా ప్రయత్నించాడు, విజయం సాధించాడు.

దిగ్బంధం అన్నివైపులా వున్నా, ప్రాచీన భారతీయులు సహజమైన అవరోధాలను, ఇతర అవరోధాలను ఛేదించుకుని ఎంతో ముందుగానే హిందూ మహాసముద్రంపైకి లంఘించారు. హిందూమహాసముద్రానికి, మధ్యధరా సముద్రానికి చాలా ఉమ్మడి లక్షణాలున్నాయి. జిమ్నర్న్ (Zimnurn) వాదించినట్టు ''అన్నివైపులా భూభాగం- వేసవిలో మధ్యధరా ఓ కొలనులాగా వుంటుంది. నిజానికి దానికి రెండు రకాల స్వభావాలున్నాయి. దేవుడు దయగా చూస్తే అదొక సరసు, ఆగ్రహిస్తే మహాసముద్రం''[14] హిందూమహాసముద్రం అంటే విస్తరించిన మధ్యధరా వంటిదే తప్ప మరొకటి కాదు. దాని దక్షిణ తీరాన్ని తీసేస్తే అదొక మహాసముద్రమూ కాదు, సరస్సూ కాదు, రాజెల్ (Ratzel) చెప్పినట్లు అర్ధ మహాసముద్రం మాత్రమే. హిందూమహాసముద్రం ఉత్తర దిక్కు భూభాగంతో మూసుకుపోయి నిజమైన మహాసముద్రానికి వుండవలసిన సాగర వాతావరణం కానీ, భూవాతావరణంగానీ, లేకపోవడం వల్ల మెనుగాలులు, కెరటాలు అడ్డదిడ్డంగా పయనిస్తాయి. ఈశాన్య, ఆగ్నేయ రుతుపవనాలు భారతీయ వర్తకులు నడి సముద్రంలోకి అడుగుపెట్టడానికి దోహదం చేశాయి తప్ప వారిని తీరంలోనే నిలిపివేయలేదు.

''చరిత్ర ఆరంభదినాల నుంచి హిందూమహాసముద్రం ఉత్తర భాగంలో రాకపోకలు జరుగుతున్నాయి. ప్రాచ్య దేశాలకు పురాతన సముద్ర మార్గాన్ని అలెగ్జాండర్ తిరిగి కనిపెట్టడం అనేది - అంతకుముందటి అజ్ఞాత యుగాన్ని దృష్టిలో పెట్టుకుంటే సాపేక్షంగా ఆధునికమైన సంఘటనే. ఈ నౌకామార్గంలో భారతీయ వలసదారులు వర్తకులు, పూజారులు భారతీయ నాగరికత ద్రవ్యాలను సుదూర తూర్పుతీరంలోని సుండా (Sunda) ద్వీపాలకు తీసుకువెళ్ళారు. ప్రాచ్య ఖండపు పాత సామాగ్రి, శాస్త్రవిజ్ఞానం, మతాలు, పశ్చిమ దిశగా యూరోప ఆఫ్రికా వైపు కదిలినాయి. హిందూమహాసముద్రం తనదైన ఒక సొంత నాగరికతను రూపొందించింది. జావా నుంచి అబిసీనియా

దాకా ఉన్న అర్ధవృత్తానికి అనాగరికతతోనే రంగులద్దింది. అబిస్సినియా నుంచి మొజాంబిక్ వరకు అక్కడి జాతి వైవిధ్యం దృష్ట్యా కాసింత మసకగా ప్రభావం వేసింది.[15] అరేబియన్‌సాగర శక్తి అవతరించక ముందే భారతీయులు హిందూమహాసముద్రపు బలమైన వాణిజ్య దేశంగా రూపొందారు. ఆ తరువాత ఒమన్, యెమన్ దేశాల వర్తకులతో కలిసి తూర్పు ఆఫ్రికా తీర వాణిజ్యాన్ని పంచుకున్నారు. నేడు మస్కట్, అడెన్, జాంజిబార్, పెంబ, నాటల్ రేవులలో వారొక గణనీయమైన వర్తక తరగతిగా ఉన్నారు.''[16]

భారతదేశపు సహజ వనరులు, ఆర్థికాభివృద్ధి గురించిన ప్రాథమిక సమీక్ష తరువాత పురాతన నాగరికతకు చెందిన ఇతర దేశాలతో ఇండియా వాణిజ్య సంబంధాలు ఎలావున్నాయో చూద్దాం.

ఈజిప్టుతో ప్రారంభిద్దాం. చారిత్రక ప్రభాత సంధ్యా మసక వెలుగులో ఇండియా ఇతర దేశాలతో నెరిపిన వాణిజ్యం గురించిన ఆధారాలు ఏమంత బలమైనవి కావనే అనుకుందాం. అవి సాంప్రదాయంలో లేదా, తొలినాటి శిథిలాల్లో నిక్షిప్తమై మాత్రమే కనిపిస్తాయి. అయితే, తరువాత కాలంలోకి పోతున్న కొద్దీ ఈ ఆధారాలు పక్వమై నిర్ధారణలకు దారి తీస్తాయి.

ప్రపంచంలోని అత్యంత అరుదైన సానుకూల ప్రదేశంలో ఉన్న ఈజిప్షియన్లు ఆర్థికంగా సర్వస్వతంత్రులు. వారు తమ ఆర్థిక స్వావలంబన గురించి ఎంతగా గర్వపడతారంటే విదేశీ సంపర్కాన్నే వారు నిషేధించారని చెబుతారు; అయితే, ఇది కొంచెం అతిశయోక్తి. పై అభిప్రాయాన్ని కొట్టిపారేసే సానుకూల ఆధారాలు ఏమీలేవు,కానీ, అక్కడ తవ్వకాలలో దొరికిన విదేశీ వస్తువుల ప్రతికూల సాక్ష్యం చెబుతున్నాయి.

ఈజిప్షియన్లకు ఇండియాతో ప్రత్యక్ష వర్తకం వుండేదా లేదా అన్నది పెద్ద వివాదంగా వుంది. ఉభయపక్షాల వాదనలలోనూ అతివాదం వుంది. గార్డినర్ విల్కిన్‌సన్ **(Gardiner Wilkenson)** రామ్‌సెస్ 2 **(Ramses II)**గా గుర్తించిన సెసొస్ట్రిస్ **(Psesotris)** బలమైన నౌకా సైన్యంతో సముద్రాలు దాటుతూ అన్ని తీర దేశాలను జయిస్తూ హిందూమహాసముద్రంలోకి ప్రవేశించాడని, అతని పదాతి సైన్యం గంగాతీరం దాకా ఖడ్గముద్ర వేశారని హెరొడొటస్ **(Herodotus)** అంటాడు.[17] ఈజిప్టు నుంచి ఇజ్రాయిలీయుల మహానిష్క్రమణ **(Exodus)**కు ముందే ఇండియాకు దానితో వాణిజ్య సంబంధాలున్నాయి. తొలి నాటి వర్తకానికి ఫిలోటెరస్ రేవు నెలవుగా వుండింది.

''(ఈజిప్షియన్లకు) ఇండియాతో అలనాడే ప్రత్యక్ష రాకపోకలుండేవా లేదా అరేబియన్ వర్తకుల ద్వారా అరేబియా గుండా సంబంధాలుండేవా అన్నది ఇప్పుడు నిర్ణయించడం సాధ్యం కాదు, అయితే

పరోక్ష వర్తకమైనప్పటికి వారికి అపారమైన సంపదకు రాజమార్గమే థెబేస్ (Thebes) సమాధుల వద్ద దొరికిన ఆధారాలు ఈజిప్టుకు ఇండియన్ సరుకులు నిజంగా చేరాయని నిరూపిస్తున్నాయి.[18] ''జోసెఫ్ ఆ దేశానికి రావడానికి ముందే ఇండియన్ ఉత్పత్తులు ఈజిప్టుకు చేరాయి. ఇష్మెక్లైట్లు (Ishmeclities) అక్కడ అమ్మడానికి తీసుకువెళ్ళిన మసాలా దినుసులే అందుకు సాక్ష్యం. మూడో థోథ్మస్ (Thothmus) తరువాతి ఫారోల కాలం నాటి థెబేస్ వద్ద దొరికిన నీలపురాళ్ళు (Amethysts), హాక్‌మెటైల్ (Hacmatile) లాపిస్ - లాజుతి (lapis - lazuti) వంటి మణిమాణిక్యాలు ఇతర వస్తువులు భారత ఈజిప్టుల వ్యాపార అనుబంధం నిలకడగా కొనసాగిందని చెబుతున్నాయి.''[19]

సంస్కృతి ఎప్పుడూ వాణిజ్యం అడుగుజాడల్లో నడుస్తుంది. ఆధునిక కాలంకంటె ఇది ప్రాచీన కాలానికి ఎక్కువ నిజం. ప్రాచీన కాలంలో వర్తక బిడారులు సరుకులను మాత్రమే కాదు. నాగరికతను కూడా రవాణా చేసేవి వారు దాన్ని వెదజల్లి విశ్వవ్యాప్తం చేసేవారు ఇండియాతో సాంస్కృతిక సంబంధం ఈజిప్టు వాస్తుకళను ప్రభావితం చేసింది. ఏగ్జమ్ (Axom)లోని బృహదేకశిల భారతీయ ప్రేరణ ఫలితమేనని జేమ్స్ ఫర్గూసన్ (James Fergusson) (హిస్టరీ ఆఫ్ ఆర్కిటెక్చర్ 1, 142-3)లో అభిప్రాయపడ్డాడు. ''స్థూలంగా ఆలోచన ఈజిప్టుదే, సూక్ష్మాంశాలు అన్నీ ఇండియావి. తొమ్మిదంతస్థుల భారతీయ, గోపురానికి క్రీస్తు శకం మొదటి శతాబ్దంలో జరిగిన ఈజిప్షియన్ అనుకృతి అది''. అది బుద్ధగయలో వున్న భారతీయ బౌద్ధాలయాన్ని పోలివున్నదని ఆయనసూచించారు. ''ఉభయులు పరస్పర సంబంధంలోకి వచ్చినప్పుడు ఏం జరుగుతుందని ఆశిస్తామో ఆ ఆసక్తికర భారతీయ, ఈజిప్షియన్ కళాసమ్మేళనానికి అది గుర్తు. వారి వాణిజ్య అనుబంధాన్ని వాస్తుశిల్పంలో పొందుపరిచారు.''[20]

భారతదేశంలో తొట్టతొలి నివాసులైన ద్రావిడులకు (వీరు మూలవాసులు మాత్రం కాదు) పశ్చిమాసియా ప్రజలకు ఉన్న సంబంధాన్ని చూడడం ఇక్కడ అసందర్భం కాదు. గుస్తావ్ ఓపర్ట్ (Gustav Oppert) ఇలా అన్నారు. కుంసిఫామ్ శాసనాన్ని చదవగలిగిన తరువాత తురామియన్ (Turamian) రాజ్యాలు సాంస్కృతికంగా ముందజలో వున్నాయన్నది నిస్సందేహంగా నిర్ధారణయింది. ఓ వింత భౌతికవాదంతో కలుషితమై వున్నా, ఈ నాగరికత కొన్ని కళా శాస్త్ర విజ్ఞాన రంగాలలో ఉన్నత స్థాయి ప్రావీణ్యాన్ని సాధించగల సమర్థత వున్నదని నిరూపించుకొంది.

ఈ తురేనియన్లలో వివిధ భాషా తెగలవారున్నారు నేటి భారతీయ ద్రావిడులు కూడా తురేనియన్లకు చెందినవారు. వీరు ఆనాడు అరియానా, పర్షియాలలో వుండేవారు. ఐరోపాలో తురేనియన్లు ఎస్తోనియన్లుగా పశ్చిమ మధ్య ఆసియాలలో వివిధ జాతుల వారుగా అంతర్లీనమై వున్నారు. చైనాలోని

స్వర్గసామ్రాజ్యపు నాగరికతను వీరే అందించారు''. ఈ తురేనియన్లు ''ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్యాలు స్థాపించారు. తురేనియన్ల దేశం అరల్ సరస్సు (Lake Aral) చుట్టూ వున్న ప్రాంతమని భావిస్తున్నారు. ఆ తరువాత ఆసియాలో చాలా భాగం విస్తరించారు. 1500 సంవత్సరాల పాటు అక్కడ ఏలికలుగా ఉన్నారు'' ఈజిప్షియన్లు, అస్సిరెయన్లు అక్కడియన్లు, సుమేరియన్లు, ఫినీషియన్లు అందరూ తురేనియన్ జాతి శాఖలే. ''ఈజిప్షియన్లు సామ్రాజ్యం స్థాపించిన 250 సంవత్సరాలకు అంటే క్రీస్తుపూర్వం 2500 సంవత్సరాలకు, బాబిలోన్‌లో అక్కడియన్ వంశం దీర్ఘకాలం పాలించిన తరువాత- అర్యన్లు చల్డియా **(Chaldea)** పై ఆక్రమణ జరిపారు. అదే సమయంలో వారు పర్షియన్ గల్ఫ్‌కు చెందిన కన్నైట్లను వాయవ్యానికి పర్షియాలోని ద్రావిడులను ఆగ్నేయానికి - అంటే ఇండియాకు తరిమి కొట్టారు. ''ఆర్యన్లు ఇండియాపై దాడి చేసినప్పుడు ద్రావిడుల నుంచి తీవ్ర ప్రతిఘటన ఎదురైంది'' క్రీస్తుపూర్వం 15వ శతాబ్దం దాకా వారు పంజాబ్ సరిహద్దులు దాటి లోపలికి చొచ్చుకుపోలేకపోయారు.''[21] కాలక్రమణిక ప్రకారం తరువాతి ప్రాముఖ్యం ఇండియాకు, జుడియా రాజ్యానికి **(Judea)** మధ్య ఉన్న సంబంధాలకు ఉంది. బైబిల్‌లో ఆధారాలున్నప్పటికీ ఈ విషయానికి చారిత్రక ప్రమాణం ఇవ్వడం లేదు. ''కొట్టిపారేయడానికి వీలులేనంత బలమైన ఆధారాలున్నాయి.[22]'' పూర్తి భూభాగదేశమైనందున ఇండియాతో బలమైన ప్రత్యక్ష వర్తకం అభివృద్ధి చేసుకోగలిగిన స్థితిలో జుడియా లేదు. దానికి జలమార్గాలు లేవు, కాబట్టి రేవులు లేవు. భారతదేశానికి సముద్రమార్గాన్ని నియంత్రిస్తున్న ఈజిప్షియన్లపై, సెరియన్లపై అది పూర్తిగా ఆధారపడింది. భారతీయ నౌకలు సరుకులను యెమెన్‌కో అరేబియా ఫెలిక్స్‌కో తెచ్చేవి. భారతీయ సరుకులకు ఎమెన్ గొప్ప మార్కెట్ కేంద్రం. అదొక పంపిణీ కేంద్రం కూడా. అక్కడి నుంచి భారత సరుకులను సిరియాకు రహదారి మార్గంలోనూ, ఈజిప్టుకు ఈజిప్షియన్ నౌకలలోనూ తరలించేవారు. ''అత్యంత పురాతనకాలం నాటి ఈజిప్టు, సిరియాలు సుగంధద్రవ్యాలు, దంతాలు - వంటి వాటి కోసం అవురారుమంటూ వుండేవి. ఇండియా వాటిని ఆ దేశాలకు దండిగా పంపించగలిగింది.[23]'' కింగ్ సాల్మన్ అధికారంలోకి వచ్చాక భారతీయ వ్యాపారాన్ని తన అధీనంలోకి తీసుకోవాలని ప్రయత్నించాడు. ఈజిప్షియన్ రాజ్యశక్తి క్షీణదశలో వుండడాన్ని ఆయన గమనించాడు. తన తండ్రి జయించి తనకు వారసత్వంగా లభించిన ఇదుమీ **(Idumee)** రేవుకు ఎర్ర సముద్రంలో ఉన్న కీలక ఉపయోగాన్ని కూడా తాను గుర్తించాడు. అది ఇండియాతో నేరుగా వ్యాపార సంబంధాలను నెలకొల్పుకోవడానికి పనికి వస్తుందని అర్థమైంది. అయితే, యూదులకు నావికా వృత్తిలో అనుభవం లేనందున ఫినీషియన్ల రాజైన హిరైన్ సహాయాన్ని ఆయన అర్థించాడు. నౌకాయానంలో ఫినీషియన్లు తొలి వీరులు. వారికి ఇండియాతో ప్రత్యక్ష సంబంధాలుండేవో లేదో అన్న విషయంపై పెద్ద వివాదం వుంది. రాబర్ట్‌సన్ ఉండేదన్న అభిప్రాయంపై మొగ్గుచూపారు. రాజ్యంలోని పేదరికం వల్ల ఫినీషియన్లు

వాణిజ్యంపై ఎలా ఆధారపడ్డారో చెప్పి రాబర్ట్‌సన్ ఇంకా ఇలా వివరిస్తున్నారు. ''వారి వివిధ వాణిజ్య శాఖలలో ఇండియాతో వాణిజ్యం అనేది ఎంతో ముఖ్యమైనది, లాభసాటి అయినది. అయితే వారు మధ్యధరాలో వున్నందున, నౌకాయానం అంతగా అభివృద్ధి చెందనందున వారు నేరుగా సంబంధాలు పెట్టుకోవడానికి ప్రయత్నించలేదు. అయితే, వాణిజ్యంలో వారి క్రియాశీల స్ఫూర్తి కారణంగా అరేబియన్ గల్ఫ్ చిట్టచివరన ఉన్న కొన్ని ఓడరేవులను వారు ఇదుమకన్స్ నుంచి స్వాధీనం చేసుకుని అక్కడినుంచి ఇండియాతో నిరంతరం వాణిజ్య సంబంధాలను కొనసాగించారు. ఆఫ్రికా, తూర్పు, దక్షిణ కోస్తాలతో సంబంధాలకు కూడా ఆ రేవులో పనికి వచ్చాయి. అరేబియన్ గల్ఫ్ నుంచి జైరే వరకు చాలా దూరం భూరవాణా ద్వారా సరుకులను తీసుకువెళ్ళడం చాలా కష్టమైపోయినందున అరేబియన్ గల్ఫ్ అతి సమీపంలోని మధ్యధరా రేవు ఫినోకొలురా (Phinocolura)న వారు అధీనంలోకి తీసుకోవలసి వచ్చింది. తద్వారా ఇండియా నుంచి వచ్చిన సరుకులను మరింత దగ్గిర భూమార్గం ద్వారా తీసుకువెళ్ళడం సాధ్యమైంది. ప్రాచీన దేశాల సరుకులు (సింధుశాఖ) గల్ఫ్ అవతలి తీరంలో నైలునది వరకు తీసుకువెళ్ళడం కన్నా ఇది సులభమైంది. ఫెనోకొలురా నుంచి మళ్ళీ ఓడలెక్కించి టైర్ (Tyre) వరకు సులువైన సముద్ర మార్గంలో తీసుకవెళ్లి అక్కడినుంచి వివిధ ప్రాంతాలకు సరుకులను పంపిణీ చేసేవారు. మనకు ఖచ్చితమైన వివరాలున్న తొట్టతొలి ఇండియా మార్గం ఇది. ప్రాచ్య దేశాలకు ఆధునికంలో కనిపెట్టిన నౌకామార్గం కంటె ముందు, అనేకానేక సౌలభ్యాలున్న ఈ మార్గం ద్వారా ఫినిషియన్లు మరే ఇతర ప్రాచీనులకంటె కూడా ఇండియన్ సరుకులను చౌకధరలలో, సమృద్ధిగా ఇతర దేశాలకు అందించగలిగారు''[24] ఫినీషియన్లు తమ లిపిని భారతదేశంలో ప్రవేశపెట్టడం ఉభయుల మధ్య ఉన్న ప్రత్యక్ష సంబంధాలకు తార్కాణంగా నిలిచి రాబర్ట్‌సన్ అభిప్రాయాన్ని బలపరుస్తోంది. పొరుగున ఉన్న ఫినీషియన్ల వల్ల ప్రేరణ పొందడం వల్లనో ఏమో కింగ్ సాల్మన్ టైర్ రాజు హిరాం (Hiram)తో చేతులు కలిపి ఎలాత్, (Elath), ఎజైన్‌గొహెర్ (Eziongeher)లలో అనేక నౌకలతో నౌకా కేంద్రాలను ఏర్పాటు చేశారు. ఫినీషియన్ల నావికులు నడిపిన ఆ నావలు ఖోఫిర్ (Qphir) దాకా వెళ్ళి ఎన్నో సంపదలను తీసుకవచ్చాయి. వాటిని రాజులిద్దరూ పంచుకున్నారు. ఖోఫిర్ అనేది ఎక్కడుందనేది మరో అపరిష్కృత అంశం. ఇండియాలోని గుజరాత్‌లో అభిరా (Abhira) అనేదే ఖోఫిర్ అని ప్రొఫెసర్ లాసెన్ (Lassen) గుర్తించిన ఈ వివాదానికి తెరదించారు. మూడు సంవత్సరాల అంతరంలో ఈ నౌకాయానం పదేపదే జరిపి ఓడలనిండా విలువైన సరుకులు నింపుకువచ్చేవారు. ఎంతగా తెచ్చేవారంటే ''రాజు జెరుసలెంలో వెండితో రాళ్ళను పరిచాడు. లోయల్లో సమృద్ధిగా దొరికే సైకమోర్ (Sycamore) విలువైన చెక్క ఇచ్చే అరుదైన చెట్లు) లాగా సెడార్స్‌ను (Cedars విశిష్టమైన చెక్కనిచ్చే సతతహరితవృక్షం)ను వాడాడు''[25] ఆ రకంగా ప్రమాద భరితమైనప్పటికీ, నౌకా వర్తకపు అన్ని ప్రయోజనాలను ప్రజల కోసం రాబట్టారు.

ఫలితంగా - డీన్ స్టాన్లీ (Dean Stanley) సినాయ్ అండ్ పాలస్తీన్ (Senai and Palestine P.261) అన్న పుస్తకంలో అన్నట్లు ''ఆ రాజధానికి తెడ్ల పడవ వెళ్ళలేదు, యుద్ధనౌకా సమీపించలేదు. (ఈసాయ్ 33-21) అన్న మాటలకు అర్థం పాశ్చాత్యులు చెప్పినట్లు ప్రమాదము కాదు, వైభవమూ రక్షణ''.

ఇండియా, జూడియా వర్తకం సాల్మన్‌తో ఆరంభం కాలేదు, దానికెంతో ప్రాచీనత్వం వుంది. సాల్మన్ కాలానికంటె ముందే ఓఫిర్ ప్రస్తావన క్రానికల్స్ 29-4, 1 రాజులు 22-48, ఈసాయ్ 13-12లలో కనిపిస్తుంది. ఈ బైబిల్ ఆధారాలకు తోడు భాషాశాస్త్ర ఆధారాలు కూడా వున్నాయి. హిబ్రూపదం 'తుకి' తమిళ మలయాళాలలో నెమలికి కవితాత్మక పదంగా వాడే తోకీ నుంచి ఏర్పడినది. అలాగే హిబ్రూపదం అహలిమ్ లేదా అహలోత్‌లు, తమిళ మళయాళాల ''అఖిల్'' అపభ్రంశరూపమే''[26]

ప్రాచీన భారత వాణిజ్య కార్యకలాపాలలో బాబిలోనియా అవతరణ పెద్ద మలుపు. మధ్యధరాను కలుపుతూ ఈఫ్రెటస్, టైగ్రిస్ సమీపించే చోట ఉన్న బాబిలోనియా ఉత్తర, దక్షిణాసియాల సంగమ స్థలం కూడా. ఇటువంటి కీలకమైన స్థలంలో వున్న బాబిలోన్ ప్రాచ్య , పాశ్చాత్య వర్తకానికి మరో వేదిక కాక తప్పదు. ప్రాచ్య ప్రపంచపు అన్ని మార్గాలకు కూడా అది కూడలి ''క్రీస్తుపూర్వం ఆరు, ఏడు శతాబ్దాలలో మరీ ముఖ్యంగా క్రీ.పూ. ఆరో శతాబ్దంలో ఇండియా బాబిలోన్ మధ్య నౌకా వాణిజ్యం వర్ధిల్లిందని చెప్పడానికి'' తగినంత సాక్ష్యం వుందని కెన్నెడీ అన్నారు. ''ఆ వాణిజ్యం ప్రధానంగా ద్రావిడుల చేతిలో వుండింది. ఆర్యులకు కూడా అందులో వాటా వుంది. తరువాత కాలంలో అరేబియాల, ఆఫ్రికా తూర్పు తీరంలో, అన్ని కాలాల్లోనూ చైనా తీరంలో భారతీయ వర్తకులు స్థిరపడడాన్ని బట్టి బాబిలోన్‌లో కూడా వారి స్థావరాలు ఉండివుండాయనడానికి సందేహం లేదు. బాబిలోనియన్ వైభవానికి ఆరు, ఏడు శతాబ్దాలు, పరాకాష్ఠ. సెంక చెరిబ్ (Senkacherib) ధ్వంసం చేసిన తరువాత ఏసార్‌హడన్ (Esarhaddon) పునర్నిర్మించిన బాబిలోన్; పవిత్ర దేవాలయాలకు పేరు ప్రఖ్యాతులు పొందిన బాబిలోన్ ఇప్పుడు అకస్మాత్తుగా ప్రపంచంలోనే అతి గొప్ప వాణిజ్య కేంద్రంగా కనిపిస్తుంది. దాని శక్తికి హద్దు లేదు. అది ఉవ్వెత్తున పైకెగసి తన సాంప్రదాయక శత్రువు, పీడకురాలు అయిన నినెవె (Nineveh)ను కూలదోసింది. నెబుకద్నెజర్ (Nebuchadnezzar)తో అది ప్రపంచపు అద్భుతంగా మారిపోయింది. అయితే, దాని గొప్పదనపు రహస్యం ప్రాచ్య సంపదపై ఏకాధిపత్యం సాధించడంలో వుంది. చాల్డియన్ల (Chaldeans) నౌకాగర్జనల్లో వుంది. ప్రాచ్యవాసుల రాకపోకల్లో వుంది. అది దేశ దేశాలకు అసూయ కలిగించింది. ఫరోనెచో (Paharoh Necho) (612-569 BC) నైలు నుంచి ఎర్రసముద్రం దాకా సేతి I నిర్మించిన కాలువను మళ్ళీ తెరవడానికి తన ప్రజలను

ధారపోశాడు. వాణిజ్యం కోసం కొత్త ప్రపంచాన్ని వెదకడానికి ఆఫ్రికాను చుట్టి రమ్మని ఫినీషియన్ నౌకాబలాన్ని పంపాడు. భారతదేశ సంపద కోసం ఎంతోకాలం మునుపే, పోర్చుగీసుల స్పానియార్డుల మధ్య సాగిన వైరంతో ఇరవై ఒక్క శతాబ్దాలకు ముందే బాబిలోనియన్లు ఈజిప్షియన్ల వైరంతో ఊహించబడింది, సమం చేయపడ్డది[27] ఈ వాణిజ్య సంబంధం భారతీయ సాహిత్యంలో స్పష్టంగా ప్రతిఫలించింది. ప్రాచీన సాహిత్యంలో సముద్రాన్ని రాక్షస మత్స్యం 'మకర్'ను పదేపదే ప్రముఖంగా ప్రస్తావించారు. ఈ నేపథ్యంలోనే వైదిక దేవతలు అవతరించారు. ఈ కాలంలోనే హిందువు మేధ అద్భుతమైన విశ్వ సృష్టి రహస్యాలను కనిపెట్టడం మొదలుపెట్టింది. విష్ణుపురాణం ఇలా చెప్పింది ''భగవంతుడు భూమిని సముద్రంపై పరిచాడు. అది సముద్రంపై పెద్ద ఓడలాగా తేలనారంభించింది. దాని ఉపరితలం విశాలమైనదవడం చేత అది నీట మునగలేదు.'' మొత్తం వాంగ్మయమంతా వాణిజ్య వాదంతో పరిమళించింది. వైదిక వాంగ్మయం నుంచి స్వభావరీత్యా పూర్తిగా భిన్నమైన సారస్వతం ఇది. ఎంతగా భిన్నమైనదంటే ప్రొఫెసర్ మాక్స్ ముల్లర్ తన ''హిస్టరీ ఆఫ్ ఏన్షియెంట్ సాంస్కృత్ లిటరేచర్''లో చెప్పినట్టు బ్రాహ్మణులలో అంతా వైదిక గీతాల మూలోద్దేశాన్ని అపార్థం చేసుకోడమే కనిపిస్తుంది. సాంప్రదాయ పరంపర ఎక్కడో ఆకస్మికంగా, తీవ్రంగా తెగిపోకపోతే ఇంతటి అంతరం రావడం సాధ్యం కాదు'' ''అంతరం''కు కారణం వాణిజ్యం వెంట వచ్చిన విదేశీ ప్రభావం అయివుంటుంది. భారతదేశంపై ఈ విదేశీ ప్రభావం ఆరు, ఏడు, ఎనిమిది శతాబ్దాలది అయివుంటుంది'' తప్ప ''బుద్ధుని తరవాతి ప్రభావం మాత్రం ఖచ్చితంగా అయివుండదు. ఎందుకంటే ఆ మహోపాధ్యాయుడు దేశమంతా వైదికం కాని పరిణామవాదాన్ని విశ్వసించడాన్ని గుర్తించాడు. కాబట్టి అది విదేశీయుమే.[28] అయితే హిందువుల నౌకాయానం ఈ కాలంలో ప్రారంభమైనదనడానికి వీలులేదు, పైగా నౌకాయానం అప్పటికే వారికి అలవాటైపోయింది. దిఘాకేవద్ధ సూత్ర (క్రీ.పూ. 5వ శతాబ్ది)లో బుద్ధుడు ఉపమానపూర్వకంగా యిలా చెబుతాడు.

''పూర్వం సముద్ర వ్యాపారులు తమతోపాటు పడవపై తీరాన్ని కనిపెట్టే పక్షిని తీసుకువెళ్ళేవారు. తీరం కనిపించినప్పుడు ఆ పక్షిని వదిలేవారు. అది తూర్పునకు, దక్షిణానికి, పశ్చిమానికి, ఉత్తరానికి ఎగిరేది, అక్కడక్కడ ఎత్తుకు ఎగిరి పరికించేది. నేల దానికి కనిపించగానే ఆ దిశగా అది తిరిగి ఓడపైకి తిరిగి వచ్చేది. అలాగే ఇది కూడా, సోదరుడా!''ఇటువంటి పోలికను సాధారణ సంభాషణలో తీసుకురావడం అందరికీ పరిచయమైన పరిజ్ఞానం అయితే తప్ప కుదరదని రైస్ డేవిడ్స్ (Rhys Davids) వ్యాఖ్యానించారు.[29]

బాబిలోన్ ఎంత హఠాత్తుగా పైకెగసిందో అంతే ఆకస్మికంగా పతనమైంది. దాని పతనం డరియస్ (Darius) రాజు (క్రీ.పూ. 579-484) పాలనతో ప్రారంభమైంది. అంతకుముందు అసంఖ్యాకంగా

వున్న వాణిజ్య శాసన ఫలకాలు క్రీ.పూ. శతాబ్ది నుంచి కనిపించవు. పర్షియన్ ఆక్రమణ బాబిలోన్‌ను నాశనం చేయడం మాత్రమే కాదు, ఈజిప్టు వరకు విస్తరించింది. నదీ రవాణా మార్గాల కోసం నిర్మించిన కాలువలు శిథిలమైపోయాయి. నదుల ప్రవాహం ఆనకట్టలతో నిరోధించబడింది. ఫలితంగా అరబ్బులు వర్తక నేతలయ్యారు. బాబిలోన్, పాల్మీర్స్ వైభవంపై యెమెన్ కన్ను వేసింది. డరియస్ జైత్రయాత్రను సాగిస్తున్నా బాల్డియన్లు కూడా గెర్రా (Gerrha) ఇతర ప్రాంతాల్లో వలసలు ఏర్పాటు చేసుకొంటూ తన వర్తకాన్ని కొనసాగించారు.

డరియస్ జైత్రయాత్రల ద్వారా విస్తరించుకున్న సామ్రాజ్యం అలెగ్జాండర్ సామ్రాజ్యం దాకా వెళ్ళింది. భూదాహం నిండిన ఇద్దరు చక్రవర్తులు మంచి ఇరుగుపొరుగుగా వుండడం సాధ్యం కాదు. ఘర్షణ తప్పదు. అవకాశం కోసం చూస్తున్న అలెగ్జాండర్ తన జైత్రయాత్ర ప్రారంభించాడు. ఒక్క దెబ్బతో అతను డరియస్ రాజ్యాన్ని నాశనం చేశాడు. ఈజిప్టు మధ్య ఆసియా, ఉత్తర భారతదేశం దాకా తన సామ్రాజ్యాన్ని విస్తరించాడు.

అలెగ్జాండర్ మహాదండయాత్రకు ఉద్దేశాలు అనేకం. డరియస్ చేతిలో పొందిన అవమానాలకు ప్రతీకారం తీర్చుకోవడం అందులో ఒకటి. ప్రొఫెసర్ లాస్సెన్ కొంచెం తీవ్రమైన దైనా సాహసమైన ప్రతిపాదన చేశారు. అది అలెగ్జాండర్ స్వర్ణ దాహమే ఈ దండయాత్రకు కారణమని ''అందుకు ప్రేరణ గ్రీస్‌లో ఉన్న భారతీయ వస్తువులు, జుడియాతో వాణిజ్య సంబంధం లాగే గ్రీస్‌తో సంబంధం కూడా ఉభయ వర్తకుల భాషలపై ప్రభావం వేసింది.'' (గ్రీక్‌లో బియ్యం (ఒరిజ), అల్లం (జింగెబెర్), దాల్చినచెక్క (కార్పియస్) మాటలు తమిళ సమానార్థకాలు అరిసి, ఇంచివెర్, కరవలకు దగ్గరగా వున్నాయి. తమిళ గ్రీసు పదాల ఈ సామీప్యం తమిళదేశం నుంచి యూరోప్‌కు సరుకులు తీసుకువెళ్ళింది గ్రీకు వ్యాపారులేనని స్పష్టంగా సూచిస్తున్నది. పాశ్చాత్య వ్యాపారులను సూచించే 'యవన' శబ్దం (ప్రాచీన సంస్కృతి కల్పితంలో గ్రీకులను సూచించడానికే స్పష్టంగా వాడబడింది) గ్రీకు పదం జాయొనిస్ (Jaonis) నుంచి వచ్చింది. జవొనిస్ అంటే గ్రీకులు తమ భాషను పిలుచుకునే పేరు''[30] ఈ పద సమూహానికి చేర్చవలసిన మరో పదం దంతపు పన లేదా ఏనుగు అని అర్థం వచ్చే సోదరపదాలు యివి. (గ్రీక్‌లో ఇలెఫస్, ఈజిప్షియన్ ''ఇబు'' సంస్కృతం ''ఇభ'' - ప్రొఫెసర్ లాసెన్ అభిప్రాయంలో ఇవన్నీ సంస్కృత మూలం నుంచి ఏర్పడ్డాయి.

అలెగ్జాండర్ ఉద్దేశాలు ఏవైనా, భారతదేశాన్ని అత్యంత సమీపం నుంచి చూసిన తరువాత రెండు దేశాల మధ్య సన్నిహిత వాణిజ్య సంబంధం సాధించాలని భావించిన మాట సత్యం. భారతీయ సరుకులను తక్కిన ప్రపంచానికి అందించే లాభసాటి వర్తకంలో జైరేకు చెందిన ఫినీషియన్లు

ఏకఛత్రాధిపత్యం చెలాయిస్తున్నారని అలెగ్జాండర్ గమనించాడు. భారతదేశ సంపదను ప్రత్యక్షంగా తెలుసుకున్న తరువాత ఫినీషియన్లపై ఆయనకు అసూయ చాలా పెరిగిపోయింది.

అతను అప్పటివరకు చూసిన దేశం జన బాహుళ్యంలో, మంచి వ్యవసాయంతో, ప్రాకృతిక కళా, ఉత్పత్తుల విశేషాలతో అలరారుతోంది. ఇది అతను సైన్యాన్ని నడిపిన భారత భూభాగం. కానీ, ప్రతిచోట, బహుళ అతిశయోక్తులతోనే కావచ్చు, గంగానది వరకు దేశం లోలోపల ఇంకా చాలా వుందని, గంగా నదీతీరంలో వున్న ఆనందమయ ప్రాంతాలను చూస్తే ఇప్పటిదాకా చూసినవి ఎందుకూ సరిపోవని, అతనికి చెబుతూ వచ్చారు. బహుశా అందువల్లనే అతను తన సైనికులనందరినీ సమావేశపరచి సంపద, రాజ్యము, కీర్తి వరించే ఆ సుదూర భారత భూభాగానికి ప్రయాణం కొనసాగిద్దామని కోరి వుంటాడు.''[31]

అలెగ్జాండర్ చేజిక్కించుకున్న ఉత్తర భారత భాగం పోరస్ నుంచి జయించింది. అది నాలుగు వేల పట్టణాలకు తక్కువ కాని ''రాజ్యం'' ఎంత పరిమితార్థంలో దాన్ని అర్థం చేసుకున్నా చాలా పెద్ద సంఖ్యలో ఉన్న ప్రజలనుగురించి చెప్పడానికి అటువంటి వ్యక్తీకరణను వాడి వుంటారు. (అలెగ్జాండర్) నౌకాదళం (సింధు) నది దిగువకు ప్రయాణిస్తున్నప్పుడు నది రెండు వైపులా ఉన్న ప్రాంతాలు పోరస్ రాజ్యానికి ఏమాత్రం తీసిపోయేట్లు లేవు'' అని రాబర్ట్సన్ వ్యాఖ్యానించాడు.[32]

అలెగ్జాండర్ జనరల్ అయిన టాలెమీ **(Ptolemy)** అరిస్టోబులస్ **(Aristobulus)**, నియర్కస్ **(Nearchus)** భారతీయ జ్ఞానాన్ని గ్రీస్‌కు, అక్కడి నుంచి యూరప్‌కు అందించారు. ఈజిప్టును జయించిన అలెగ్జాండర్ ఇండియా, గ్రీస్‌ల వర్తకం ప్రారంభించాలనుకున్నాడు. ఈ ఉద్దేశంతోనే తన పేరిట అలెగ్జాండ్రియా నగరాన్ని నెలకొల్పాడు. ప్రాచీన ప్రపంచంలో అది పెద్ద వర్తక కేంద్రంగా వర్థిల్లింది. అనేక అవాంతరాలు వచ్చినా కొనసాగింది కూడా. తన సామ్రాజ్యంతో ఇండియాకు శాశ్వత సంబంధాలు ఏర్పాటు చేసుకోవాలని అతను కలలుకన్నాడు. అతను దీర్ఘకాలం బతికి వుంటే అన్నీ కాకపోయినా, అతని కొన్ని స్వప్నాలైనా నిజమయ్యేవి. దురదృష్టవశాత్తూ సామ్రాజ్యాన్ని స్థాపించిన వెంటనే చనిపోయాడు. ఆ వెంటనే రాజ్యం ముక్కచెక్కలైంది. వివిధ ప్రాంతాల పాలకులు రాజ్యాన్ని పంచుకున్నారు. ఒకరిపై ఒకరు పైచేయి కావడానికి ప్రలోభంతో ఈర్ష్యాద్వేషాలతో వారు పరస్పరం పోరాడారు. అలెగ్జాండర్ సామ్రాజ్యం పతనం కావడం వల్ల భారత గ్రీకు వ్యాపార సంబంధాలు నిలిచిపోయాయని భావించడం సబబుకాదు. జరిగింది అందుకు భిన్నం. సంబంధాలు మరింత సన్నిహితమయ్యాయి. కార్యశూరుడూ, రాజ్యకాంక్ష ఉన్నవాడూ అయిన సెల్యూకస్ పర్షియన్ రాజ్యాన్ని తన వంతుకు చేజిక్కించుకుని, అలెగ్జాండర్ జయించిన భారత భూభాగాలను కూడా తన రాజ్యానికి కలుపుకోవాలని చూశాడు. అటువంటి అక్రమాల ద్వారా లభించిన వాణిజ్యాల లాభాలను గురించిన

స్పృహ ఆయనకు వుంది. తనకున్న అపారమైన సైనిక బలంతో అనుకొన్నది సాధిద్దామనుకున్నాడు. అయితే, అతని ప్రత్యర్థి అతనికంటె ఉద్దండుడు. చంద్రగుప్తుడు (గ్రీకులకు సంద్రకొటెస్) ఇండియాను ఉదారుడైన నిరంకుశుడుగా పాలిస్తున్నాడు. ఆ యుగంలోనే అతను బుద్ధిబలం, భుజబలం వున్న ఆధునికుడు. శత్రువు బలాధిక్యాన్ని గుర్తించిన సెల్యుకస్ శాంతి ఒప్పందం చేసుకున్నాడు. ఇద్దరి మధ్య స్నేహ సంబంధాల కోసం మెగస్తనీసును చంద్రగుప్తుని ఆస్థానానికి రాయబారిగా పంపాడు. మెగస్తనీసు తరువాత డయమకస్ **(Daimachus)** రాయబారిగా వెళ్ళాడు. గ్రేసియో - బ్యాక్ట్రియన్ **(Graccio - Bactrian)** రాజ్యం ద్వారా గ్రీకులు ఇండియాతో చాలాకాలం పాటు సంబంధాలు కొనసాగించారు. అయితే వాటి స్వభావమేమిటో, వాటి విస్తృతెంతో చెప్పడానికి స్వల్పాతి స్వల్ప ఆధారాలు మాత్రమే వున్నాయి. చైనా చరిత్రకారులు ఇలా రాశారు; 'క్రీస్తు శకారంభానికి సుమారు నూటా ఇరవై ఆరు సంవత్సరాల ముందు శక్తివంతమైన టార్తారుల దళాలు మరింత బలవంతులు తమను ఎంట తరుముతున్నందున చైనాలోని తమ నెలవులను వదిలి పశ్చిమ దిశగా ముంచెత్తి వేశారు. నూట ముప్పై ఏళ్ళ కిందట స్థాపితమైన గ్రీకు సామ్రాజ్యానికి భరత వాక్యం పలికారు''[33]

అలా భూమార్గ సంబంధం తెగిపోయినా గ్రీక్ ఇండియాల సముద్ర వాణిజ్యానికి అలెగ్జాండ్రియానే నెలవుగా కొనసాగింది. లాగూస్ కుమారుడైన టాలెమో తాను గవర్నర్‌గా వున్న కాలంలో భారతీయ వాణిజ్యాన్ని చాలా ప్రోత్సహించాడు. అతని కుమారుడు టాలెమీ ఫిలడెల్ఫస్ **(Ptolemy Philadelphus)** బారతీయ సరుకులను అలెగ్జాండ్రియాకు నేరుగా తీసుకువెళ్ళేందుకు వీలుగా ఎర్ర సముద్రాన్నీ నైలు నదినీ కలుపుతూ కాలువ ప్రారంభించాడు. ఆ పని శక్తికి మించింది, మధ్యలోనే విరమించబడింది. అయితే అతను ఎర్రసముద్రం పశ్చిమ తీరంలో బెరెనీస్ **(Berenice)** అనే పట్టణాన్ని నిర్మించాడు. అది భారతీయ వర్తకానికి శాశ్వత కేంద్రంగా కొనసాగింది.

''ఈజిప్టు సిరియా చక్రవర్తులు భారతీయ వర్తకపు ప్రయోజనాలన్నీ తమ ప్రజలకు లభింపజేయాలని తీవ్రంగా పోటీపడుతుంటే, ఈ ఇద్దరికీ వినాశకరంగా పశ్చిమాన జనశక్తి లేచింది. సైనిక వ్యవస్థల బలంతో, రాజకీయ విధానాల వివేకంతో రోమన్లు బయలుదేరి ఇటలీ, సిసిలీలకు ప్రభువులైనారు. పోటీగా ఉన్న రిపబ్లిక్ కార్థేజ్‌ను పతనం చేశారు. ఎ.సి. 55 మసెడొనియాను, గ్రీస్‌ను జయించారు సిరియా దాకా విస్తరించారు. చివరగా అలెగ్జాండర్ ద గ్రేట్ వారసుడు నెలకొల్పిన ఏకైక రాజ్యం ఈజిప్టుపై కూడా విజయఖడ్గం ఝళిపించారు.''

ఆకర్షణీయమైన ఇండియన్ వర్తకం ఈజిప్టు పరాజయంతో రోమ్‌కు తరలి వెళ్ళింది. అయితే అదొక్కటే మార్గం కాదు. భారతీయ సరుకులు పశ్చిమ దేశాలకు వెళ్ళడానికి మరొక మార్గం కూడా వుండింది. అది భూమార్గం. జుడియాలో భారత వర్తకాన్ని కేంద్రీకరించడానికి సాల్మన్ ఆ దారిని

ఏర్పరిచాడు. యూఫ్రటిస్‌కు మధ్యధరాకు మధ్య దారిలో తాడ్‌మోర్ (Tadmore) లేదా దాల్‌మిరా (Dalmyra) గుండా వెడుతుందది. సిరియా కూడా రోమన్ల వశమయ్యాక, పాల్మీరా స్వతంత్రమై వృద్ధి చెందసాగింది. అదొక వర్తక పంపిణీ కేంద్రంగా మారింది. కానీ రోమన్ల లోభానికి హద్దులు లేవు. పాల్మీరా రాణి జెనోబియాతో అతి చిన్న విభేదంతో రోమన్లు నగరాన్ని స్వాధీనం చేసుకుని తమ రాజ్యంలో కలుపుకున్నారు.

భారతీయ వర్తకాన్ని గుత్త తీసుకోవాలంటే రోమన్లు పాల్మీరాను కలుపుకోవడం మాత్రమే చేస్తే చాలదు, ఎందుకంటే వారితో సమానమైన శక్తి మరొకటి తూర్పున అవతరిస్తోంది. మధ్య ఆసియాలో పార్థియన్లు ఆధిపత్యం సంపాదించి రోమన్ల సరిహద్దు దాకా తమ రాజ్యం పెంచుకున్నారు. పార్థియా, రోమ్‌ల మధ్య క్రీస్తు పూర్వం 55 నుంచి 20 దాకా పోరాటం జరిగింది. కానీ ఆధిపత్యం కోసం ఈ జరిగిన పోరాటం ఏ నిర్ణయమూ జరగకుండానే ముగిసింది. ''క్రీస్తు పూర్వం 55-20 జరిగిన యుద్ధం రెండు రాజ్యాలను పరస్పర గౌరవంతో మెలిగేట్లు చేసింది; యూఫ్రెటిస్ పశ్చిమ తీరమే రోమన్ రాజ్య సరిహద్దు అని, దాన్ని మీరి విస్తరించకూడదని ఆగస్టస్ సామ్రాజ్య విధానంగా ప్రకటించాడు''[34] క్రీస్తు శకారంభం తరువాత మొదటి రెండు శతాబ్దాలలో రోమన్ సామ్రాజ్య విధానం ''భారతదేశంలో ప్రత్యక్ష సముద్ర వ్యాపారాన్ని ప్రోత్సహించడం, పార్థియా ద్వారా ఉన్న భూ రవాణా మార్గాలను విస్మరించి తద్వారా రోమ్ నిరంతర శత్రువుపై ఆర్థికంగా ఆధారపడకుండా చూసుకోవడం''గా[35] వుండింది.

సువిశాల సామ్రాజ్యం కింద, ఇండియాతో వర్తకం చాలా వృద్ధి చెందింది, చాలా ప్రాముఖ్యాన్ని పొందింది. భారతదేశపు ఓడరేవుల వివరాలు, అక్కడికి భూమార్గ రవాణా విశేషాలు, బిడారు ప్రయాణాల వివరాలు వ్యాపారుల ఉపయోగార్థం గ్రంథస్థం చేయడం కూడా జరిగింది. క్రీస్తు శకం మొదటి శతాబ్దం మధ్యలో గ్రీకు ఈజిప్షియన్ అయిన హిప్పాలస్ భారతీయ రుతుపవనాల క్రమబద్ధతను కనుగొని, వర్తకుల ప్రయాణాలను సులభం చేశాడు. ఓ గ్రామ వ్యాపారి ''ది పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్‌సీ'' లేదా హిందూ మహాసముద్రానికి మార్గదర్శనం అన్న గ్రంథం కూడా దాదాపు అదే సమయంలో రాశాడు. మరొక గ్రీకు సాహసయాత్రికుడు చరాక్స్‌కు చెందిన ఇసాడోర్ (Isodore) పార్థియన్ రాజ్యాన్ని చుట్టివచ్చి భూ రవాణా మార్గాలలో బిడారుల వర్తకం గురించి విస్తృతంగా వర్ణించాడు. ఇంతకుముందు అది ప్రాచ్య సరుకులను ఇతరుల ద్వారా పొందేది. భారత్‌కు సంబంధించిన సమాచారాన్నంతా అరబ్బులు గోప్యంగా వుంచి తమ గుత్తాధిపత్యాన్ని కొనసాగించుకోవాలని చూశారు. భారతీయ సరుకులకు పార్థియన్లు సుంకాలను అధికం చేశారు. ''రోమ్‌తో జరిగే వర్తకమంతా పార్థియన్ రాజ్యానికి, అరబ్బులకు సుంకాలు చెల్లించవలసి వచ్చేది. ఇండియాకు సముద్రమార్గ

వ్యాపారాన్ని రోమ్ అభివృద్ధి పరుచుకుని అదుపులో పెట్టుకుంటే తప్ప మరో మార్గంలేదు''[36] రుతుపవనాలకు సంబంధించి కొలంబస్‌తో పోల్చదగ్గ హిప్పాలస్ చేసిన ఆవిష్కరణ, రోమన్ల కొరతను పూర్తిచేశాడు. హిందూ మహాసముద్రంలో రోమన్‌నౌకాయానం ఆరంభమైనతరువాత రాజ్యాధికారాల్లో పెను మార్పులు వచ్చాయి. పెటియా, గెర్రా (Gerrha), పాల్మీరా, పార్థియా కూడా ఒకదాని వెంట ఒకటి- సాంప్రదాయక వర్తకం నష్టపోయి ఆదాయాలు కోల్పోయి- రోమన్ల చేతిలోకి వెళ్ళిపోయాయి. దక్షిణ అరేబియాలోని హొమరైట్ రాజ్యం కష్టాల్లో పడింది, రాజధాని శిథిలమైంది. దాని సమర్థ పౌరులు కొందరు ఉత్తర దిక్కుకు తరలిపోయారు. ఘస్సనిడ్‌లు (Ghassanids) రోమ్‌కు తలవంచింది, తనపాత శత్రువుపతనంతో ఆ మేరకు అబిసీనియా లాభపడింది. పరిస్థితులు ఇదేరకంగా కొనసాగివుంటే, తరువాతి పరిణామాల క్రమం మారి వుండేది. ఇస్లామ్ అవతరించి వుండేది కాదు, థేమ్స్ నుంచి గంగ వరకు రోమన్ చట్టం, ప్రభుత్వం వుండేది. కానీ, చరిత్ర తర్కం గట్టిది. రోమన్ల చేతుల్లో పడ్డ సంపద స్వదేశంలో అంతర్యుద్ధాల అణచివేతకు, ఆక్రమిత ప్రాంతాల్లో తిరుగుబాట్ల అణచివేతకు ఖర్చు చేశారు. వర్తకపు బకాయిల చెల్లింపునకు పెద్ద మొత్తంలో డబ్బు తూర్పునకు తరలిపోసాగింది. నూతనంగా సంపద సృష్టి కావడానికి సాధనాలైన పరిశ్రమలు, ఉత్పత్తుల రంగంలో చెప్పుకోదగినంత పురోగతి లేని దేశానికి ఆ తరలింపు నిజంగా వినాశకారి అయింది.''[37]

భారత్‌తో రోమన్ల వ్యాపారానికి సంబంధించి మనకు తిరుగులేని సమాచారకోశం వుంది.

ఇందులో మొదటి రకం- ఇండియా, శ్రీలంకల నుంచి రోమ్‌కు పంపిన అనేక రాయబారాలు.

మొదటి రాయబారం శ్రీలంక నుంచి వెళ్ళింది. దాన్ని ప్లినీ (Pliny) రికార్డు చేశాడు. ఖచ్చితమైన తేదీని నిర్ధారించడం అసాధ్యం. అయితే, కొన్ని అనుబంధ ఆధారాల వల్ల ఆ రాయబారం కాలాన్ని క్రీస్తు శకం 41-54 ప్రాంతాలలో నిర్ణయించవచ్చు. ఆ రాయబారాన్ని క్లాడిస్ (Claudis)కు పంపారు. అగ్రిప్పినా (Agrippina) కుట్రలు, మెస్సలినా (Messalina) దుర్మరణం వంటి తీవ్ర సంఘటనలు జరిగిన కాలంలో రాయబారం చేరింది. ఆ తీవ్ర సంఘటనల మధ్య రాయబారం గురించి రోమన్ చరిత్రకారులు తగినంతగా ప్రస్తావించలేదు. రాయబారాన్ని పంపింది క్రీస్తుశకం 44-52 మధ్యకాలంలో శ్రీలంకను పాలించిన చంద్రముక సివ[38]

ఆ తరువాత మరిన్ని రాయబారాలు జరిగాయి. రెండోది. క్రీస్తుశకం 107లో ట్రోజన్‌కు, మూడోది క్రీస్తుశకం 138లో అంటోనియస్ పయస్‌కు, నాలుగోది 361లో జులియన్‌కు, ఐదోది జుస్టినియన్ 530లోనూ వెళ్ళాయి. భారత దేశీయులు వీటి గురించి ప్రస్తావించలేదు. రోమన్ చరిత్రకారుడే అరకొరగా రికార్డు చేశాడు. ఫలితంగా ఈ రాయబారాల అంతర్యం ఏమిటో తెలుసుకోవడం

చాలా కష్టం. అయితే, భారత రోమ్‌ల మధ్య సంబంధాలు సజీవంగా ఉన్నాయని, కొనసాగుతున్నాయని, ''సెర్వియస్, అతని కుమారుడు కమోడస్ కాలంలో'' అలెగ్జాండ్రియా, పాల్మీరా చురుకైన వాణిజ్యంతో వైభవంతో కళకళలాడుతున్న కాలంలో కూడా కొనసాగాయని ఈ రాయబారాలు తెలుపుతాయి. భారత్‌తో రోమన్ సంబంధాలు అత్యున్నత స్థాయిలో వున్నాయి. రోమన్ సాహిత్యం ఇండియన్ విషయాలను అధికంగా పట్టించుకుంది. గతంలో వలె అలెగ్జాండర్ నాటి చరిత్రకారుల నుంచో, సెల్యూకస్ రాయబారుల నుంచో ఉటంకింపులతో సరిపెట్టుకోకుండా ఇతర స్వతంత్ర ఆధారాల నుంచి సమాచారాన్ని రోమన్ సాహిత్యం గ్రహించింది.[39]

ఇతర ఆధారాలు, ముఖ్యంగా సాహిత్య స్వభావం కలిగిన ఆధారాలు ఇదే నిర్ధారణను బలపరుస్తాయి. క్రీస్తుశకం 420-478 కాలం గురించి రాసిన క్రీ.శ. 500 సంవత్సరం నాటి చైనా చరిత్రకారుడు షుంగ్-షూ (Sung-Shu)ను డాక్టర్ హిర్త్ (Dr. Hirth) తన ''చైనా - రోమన్ ప్రాచ్యం'' (China and the Roman Orient) అన్న పుస్తకంలో ఇలా ఉటంకించాడు: ''సుదూర పశ్చిమ సముద్రంలో టా-ట్స్'ఇన్ (సిరియా), ఇ'యెన్‌చు (ఇండియా) గురించి చెప్పాలంటే- రెండు హాన్ రాజవంశాల రాయబారులు ఈ మార్గంలో కష్టాల నెదుర్కొన్నప్పటికీ- ; వర్తక రవాణా పెరిగింది, విదేశీ తెగలకు సరుకులు పంపబడ్డాయి. పెనుగాలుల శక్తి వారిని కెరటాలపై సుదూరం పంపింది. మనకు తెలిసిన పర్వత శ్రేణుల కంటె భిన్నమైనవి అక్కడ వున్నాయి. వివిధ పేర్లున్న, ప్రత్యేకమైన లక్షణాలున్న రకరకాల తెగలవారున్నారు. వారి శ్రేణే ప్రత్యేకమైనది. భూమిలోనూ నీటిలోనూ లభించే అమూల్యమైన వస్తువులన్నీ వారి దగ్గర ఉన్నాయి. ఖడ్గమృగం, క్రిసోపేజ్‌తో చేసిన రత్నాలు, నాగమణులు, నారవస్త్రాలు ఇటువంటి ఆసక్తిదాయకమైనవి చాలా వున్నాయి ; వీటన్నిటికీ తోడు మనసుల్లో బుద్ధదేవునిపై భక్తి వున్నది. ఇవన్నీ కలిసి ఈ భాగాలకు వర్తకం నౌకాయానం విస్తరించడానికి కారణం అయ్యాయి.''

మరో చైనా చరిత్రకారుడు మా-తాన్‌లిన్ (Ma-Touanlin) తన పురాతన పరిశోధనల్లో ఇలా చెప్పారు. ''భారతదేశానికి (క్రీ.శ. 500-16) టా-ట్సిన్‌తో, రోమన్ సామ్రాజ్యంతో, అన్సి (Ansi) లేదా ఎవస్థితో చెప్పుకోదగ్గంత సముద్ర వాణిజ్యం వుంది.''[40]

తగినంత ప్రతిభవున్న ఓ రచయిత పాల్మీరా నాశనం తరువాత ఇండియా రోమ్‌ల మధ్య ప్రత్యక్ష వాణిజ్యం ముగిసిందని రాయడానికి సాహసించాడు. ఇథియోపియా ప్రధాన రేవు అయిన అడుల్ (Adule)లో రోమన్లు వారి వర్తకకేంద్రాన్ని స్థాపించారనీ, ''కాన్‌స్టాంటిన్ కింద ఆర్థికవైభవం వున్నప్పటికీ, రోమన్ల వర్తక కార్యక్రమాలు అడూల్‌ను దాటి ముందుకు పోలేద''ని ఆ రచయిత రాశారు.

పురాతత్వ ఆధారాలూ, చారిత్రక ఆధారాలూ తద్విరుద్ధమైన నిర్ధారణలను సూచిస్తున్నాయి. విన్సెంట్ స్మిత్ (Vincent Smith) ఇలా వ్యాఖ్యానించారు ; ''వర్తక వృత్తిలో వున్న రోమన్ పౌరులు గణనీయ సంఖ్యలో ఈ శకం మొదటి రెండు శతాబ్దాల కాలంలో దక్షిణ భారతదేశంలో స్థిరపడ్డారనడానికి ఆధారాలున్నాయి. బలవంతులైన యవనులుగా, అన్ని ఆయుధాలూ ధరించిన మూగ మ్లేచ్ఛులూ (అనాగరికులు) తమిళ రాజులకు అంగరక్షకులుగా ఉన్నారని తెలుస్తోంది. ఐరోపా సైనికులనే అలా వర్ణించారు. రోమన్ బంగారానికి ప్రతిగా కొన్ని మిరియాలను తీసుకుపోవడానికి ముజిరిస్ (క్రాగనోర్) వద్ద యవనుల భారీ నౌకలు ఆగి వుండేవి''[41] అక్కడ ఆనాడు రోమన్ వర్తకుల నివాస ప్రాంతాలుండడమేకాదు ''పాండ్యులు, ఇతర తమిళ రాజుల సైన్యంలో రోమన్ సైనికులు కూడా వుండేవారు''[42], ''పాండ్య-అర్యప్పడై-కదరెథ-నెడుంజ్-చెలియన్ హయాంలో రోమన్ సైనికులు మదుర కోట రక్షకులుగా నియమితులయ్యారు.[43] ఇండియా రోమ్‌ల మధ్య సన్నిహిత వాణిజ్య సంబంధాలుండేవని నాణేల ఆధారాలను బట్టి కూడా తెలుస్తోంది.

మార్క్ ఆంటోనీ కాలం నుంచి జుస్టినియన్ కాలందాకా, అంటే క్రీస్తుపూర్వం 30 నుంచి క్రీస్తుశకం 550 దాకా పార్థియన్లకు, సస్సానియన్లకు ప్రత్యర్థులైన స్నేహితులుగా వారికున్న రాజకీయ ప్రాముఖ్యం, ప్రాచ్య పాశ్చాత్య ప్రాంతాల మధ్య ఉన్న ఒక ప్రధాన వాణిజ్య రవాణా మార్గంపై ఆధిపత్యం ఉన్నవారిగా వారి వాణిజ్య ప్రాముఖ్యం- సింధు లోయ, బాక్ట్రియాలపై అధికారం సాధించిన (రోమ్‌కు ఇదే ముఖ్యమైనది) కుషాణులతో శకులతో స్నేహాన్ని సాధించిపెట్టాయి.''[44] ఈ వాస్తవం రోమ్ భారత్‌ల మధ్య ఉండిన సన్నిహిత వాణిజ్య సంబంధాన్ని స్పష్టం చేస్తోంది.

భారతదేశానికి విదేశాలతో ఉన్న వాణిజ్య సంబంధాల గురించిన ఈ క్లుప్త చిత్రణ తరువాత ఇక - భారతదేశంలో వాణిజ్య సరుకు గురించి, వర్తక మార్గాల గురించి, ప్రధానమైన ఓడరేవుల గురించి చూద్దాం.

భారతదేశపు ఓడరేవుల గురించి, వాణిజ్య సరుకుల గురించి సమాచారాన్నందించే ప్రధానమైన ఆధారాలు పెరిప్లస్, టాలమీ భూగోళశాస్త్రం, క్రైస్తవ టోపోగ్రఫీలు.

పెరిప్లస్ ఈ క్రింది ఎగుమతి సరుకులను పేర్కొన్నది.

1. జటామాంసి (Spikenard) 2. (Cortus)
3. గుగ్గిలం (Bdellium) 4. దంతం (Ivory)
5. (Qugate] 6. (Lycirem)

7. అన్నిరకాల కాటన్ వస్త్రాలు
8. సిల్క్ వస్త్రాలు
9. మాలో (Mallow)
10. నూలు
11. పిప్పళ్ళు (Long Pepper)
12. వజ్రాలు
13. నీల మణులు (Saphires)
14. తాబేటి చిప్పలు
15. పారదర్శకంగా వుండే అన్నిరకాల రాళ్ళు
16. ముత్యాలు
17. మలబత్రుమ్ (Malabatrum)
18. సాంబ్రాణి
19. నీలిమందు.

దిగుమతుల జాబితాలో: 1. మద్యం 2. రాగి 3. తగరం 4. సీసం 5. పగడాలు 6. పల్చటి వస్త్రాలు, అన్ని రకాల నాసి వస్త్రాలు 7. తియ్యటి పరిమళ గరిక 8. నాణ్యమైన అద్దాలు 9. కాటుకరాయి 10. సానుకూలమైన వర్తక సమతుల్యం నుంచి లభించే వెండి, బంగారు నాణేలు.

పెరిప్లస్ లేదా భారతదేశానికి సముద్ర మార్గదర్శిని అన్న పుస్తకంలో ఈ కింది వర్తక రేవులను పేర్కొన్నారు.

1. బరిగజా లేదా నేటి బరోవచ్- పశ్చిమ భారతంలో ప్రధాన వర్తక కేంద్రం. బరోవచ్‌లో రెండు పట్టణాలు పైతాన్, తగరలకు రవాణా మార్గం వుందని పేర్కొన్నారు.
2. సొప్పర - బస్సీన్ దగ్గర నేటి సుపర
3. కల్లియెన్ - నేటి కళ్యాణ్
4. సెముల్లా - బహుశా నేటి చెంబూర్
5. మండగోర
6. పలైపటమి
7. మెలిజీగరా
8. టిండిస్
9. ముజిరిన్
10. నెల్కిండ

సింధు నది సముద్రంలో కలిసే దగ్గర నుంచి గంగా సాగర సంగమం దాకా మధ్యనున్న అనేక పట్టణాలను, వాణిజ్య ప్రాధాన్యం వున్న రేవులను 'టామీ భూగోళం' పేర్కొంటుంది. ఇవి సిరస్త్ర

(సురత్), మనొగ్లొసన్ (మంగ్రోల్)- ఈ రెండూ గుజరాత్; అరియేక్ (మహారాష్ట్ర), సౌపర, ముజెరిస్, బకరీ, మైసోలి (మచిలీపట్నం), కౌనగర (కోణార్క్), ఇంకా అనేక ప్రదేశాలు''[45]

దక్షిణ భారతదేశంలోని వాణిజ్య రేవులను, పట్టణాలను కొందరు తమిళ కవులు అందంగా అభివర్ణించారు. వారిలో ఒకరు ఇలా అంటారు- ''యవనుల అందమైన భారీ నౌకలు చేరరాజుల మహాసముద్రపు నురగల నీటిమీద తేలియాడుతూ ముచిరి వర్తక నగరానికి బంగారాన్ని తీసుకువస్తాయి, మిరియాల బరువుతో వెనక్కి వెడతాయి'' మరొకరు అన్నది ''చేపలకు బదులుగా బియ్యం బుట్టల కొద్దీ ఇళ్ళకు తెస్తారు'' ''బస్తాలకొద్దీ మిరియాలను ఇళ్ళ నుంచి సంతకు తెచ్చారు. సరుకులను అమ్మగా ఓడలపై నుంచి లభించిన బంగారాన్ని చిన్న పడవలపై ముచిరికి తెస్తారు. సముద్రపు అలజడి సంగీతం ఎన్నడూ ముగిసిపోని ముచిరి, అరుదైన సముద్రపు ఉత్పత్తులను, పర్వత ప్రాంతాల వస్తువులను చేరరాజు కుద్దువన్ అతిథులకు బహూకరించే నగరం ముచిరి''[46] కావిరిపద్దినం (పెరిప్లస్‌లో కమరా, టాలెమీలో ఖచెరిస్) లేదా పుకార్ గురించిన వర్ణనలకు కూడా సమాన ప్రాధాన్యం వుంది. అది కావేరి నది ఉత్తర తీరంమీద కట్టిన పట్టణం. అక్కడ విశాలమైన, లోతైన ప్రవాహంలోకి నౌకలు ఏ అవరోధం లేకుండా సముద్రం నుంచి ప్రవేశించవచ్చు. ఈ పట్టణం రెండు భాగాలుగా వుంది. ఒకటి మరువర్-పక్రమ్- ఇది సముద్ర తీరాన్ని ఆనుకుని వుంది. మరువర్-పక్రమ్‌లో సముద్రతీరం దగ్గర ప్లాట్‌ఫారాలు, గోదాములు, ఓడల నుంచి దిగే ఆహారాన్ని నిల్వచేసే గిడ్డంగులు కట్టారు. ఇక్కడ సరుకులపై (చోళరాజ ముద్ర) సుంకాల చెల్లింపు తరువాత పులి ముద్రలు వేసేవారు ఆ తరువాత వాటిని వ్యాపారుల గిడ్డంగులకు పంపేవారు. అక్కడికి సమీపంలోనే యవన (విదేశీ) వర్తకుల వలస గ్రామం వుంది. అక్కడ ఎల్లప్పుడూ అనేక వస్తువులు అమ్మకానికి వుంటాయి. సముద్రాలకావల నుంచి వచ్చినవారు, వివిధ భాషలవారు అయిన విదేశీ వర్తకులకు ఇది కేంద్ర స్థావరం కూడా. సుగంధ ద్రవ్యాలు, పుష్పాలు, సాంబ్రాణి అమ్మేవారు, పట్టు, ఊలు, కాటన్ వస్త్రాలు కుట్టే దర్జీలు; గంధం, అఖిల్, పగడాలు, బంగారం, విలువైన రాళ్ళు వ్యాపారం చేసేవారు ధాన్యం వ్యాపారులు, చాకలివారు, చేపలు అమ్మేవారు కసాయివారు, కుమ్మరివారు, కంచరవారు, వడ్రంగులు, రాగి పని చేసేవారు, చిత్రకారులు, శిల్పులు, కంసాలివారు, చెప్పుల పనివారు, బొమ్మలు చేసేవారు- అందరూ ఆ మరువర్-పక్రమ్‌లో నివాసం ఏర్పరచుకున్నారు''[47]

భారతదేశం నుంచి పాశ్చాత్య దేశాలకు వెళ్ళే వర్తక రవాణా మార్గాలు రెండు రకాలుగా విభజించవచ్చు 1. భూమార్గాలు 2. సముద్రమార్గాలు.

వ్యక్తిగత వలస అన్నది నాగరిక మానవుడు చేసేది అన్న మాటలో నిజం వుంది. పురాతన జనం

వారి బలమైన మంద మనస్తత్వం వల్లనో, అభిమానం వల్లనో ఎప్పుడూ గుంపులు గుంపులుగా తిరిగాడు. ఈ అలవాటు వారి వర్తక విధానాలలో కూడా ప్రతిఫలించింది. చిల్లర వర్తకులుగా వున్నందుక పోటీ అనేది ఎప్పుడూ వర్తకాన్ని దెబ్బతీసేంత తీవ్రంగా లేదు. వర్తకుల బళ్ళ బిడారులు ఎంతో ప్రతికూలమైన పరిస్థితుల మధ్య ప్రయాణించేవి. ఎంతటి ప్రతికూల పరిస్థితులంటే, ఎంతో వ్యాపార మనస్తత్వం, అన్నిటినీ తేలికగా తీసుకునే స్వభావం వున్న ఆధునిక మానవుడు ఇన్ని కష్టాలు పడి ఇంత స్వల్పంగా సంపాదించడం కంటే లక్ష్మీదేవిని ఆరాధించడం మానుకుంటే సరిపోతుందనుకుంటాడు. వర్తక బిడారుల గురించి చెబుతూ హార్బర్ (Harbur) ఇలా అన్నారు; ''వర్తక బిడారు వెళ్ళే మార్గం స్వేచ్ఛగా ఎంచుకున్నది కాదు, అదొక స్థిరపడ్డ సంప్రదాయం. వారు ప్రయాణించవలసి వచ్చిన ఇసుక ఎడారుల సువిశాల మైదానాల్లో ప్రకృతి విశ్రాంతి కోసం అక్కడక్కడా చెల్లాచెదురుగా మాత్రమే కొన్ని స్థలాలను ఉంచింది. ఒకచోట చెట్టు నీడ, ఒకసారి చల్లటి ప్రవాహం పక్కన సేదదీరితే వర్తకుడూ, అతని బండిని లాగే గొడ్డూ కూడా ఊరట, విశ్రాంతి పొందుతాయి. అటువంటి విరామ స్థలాలు వ్యాపారానికి కేంద్ర స్థానాలయ్యాయి. ఒక్కోసారి అవి దేవాలయాలు, పవిత్రాలయాలు విరామ స్థానాలయ్యాయి. వాటి రక్షణలో వర్తకం వర్ధిల్లింది''[48] ఈ పరిస్థితుల నేపథ్యంలో వర్తక వాహనశ్రేణి దారి ఎప్పుడూ సరళరేఖలా వుండేది కాదు. అదెప్పుడూ వంకర టింకరగా వుంటుంది. ప్రాచీన వర్తకం పటాలను గనుక చూస్తే, వివిధ ప్రాంతాలలో చిన్న రోడ్లు కలుసుకోవడం, ఒకదాన్ని ఒకటి క్రాస్ చేయడం చూసి ఆశ్చర్యపోతాము. అయితే, ఇండియా నుంచి మధ్యధరాకు రెండు ప్రధాన వర్తక రహదారులను నిర్ధారించగలం. ఉత్తరాది వారు ఒక్సస్ నది గుండా కేస్పియన్ నది సముద్రంలో కలిసే ఉత్తర బేసిన్‌ను చుట్టు తిరిగి కాన్‌స్టాంటినోపుల్‌ను చేరడం. మధ్య భారతం వారు సూటిదారిలో వెళ్ళారని చెప్పవచ్చు. ఆ దారి చీలికలతో మార్కెట్ వద్ద తిరిగి కలుస్తుంది. ఆ దారి కాస్పియన్ సముద్రం దక్షిణ బేసిన్ వెంట ఆరంభమై, తెబ్రిజ్(Tebriz), ఎర్జెవెమ్ ట్రెబిజోండ్(Erze Trebizond) గుండా, నల్లసముద్రం గుండా కాన్‌స్టాంటినోపుల్ చేరుకునేది. ఇండియా, పాశ్చాత్య దేశాలకు మధ్య వుండిన రెండు ప్రధాన భూ రవాణా మార్గాలు ఇవి.

సముద్ర మార్గాలు కూడా రెండున్నాయి. అయితే వాటిలో ఒకటి సగం దూరం మాత్రమే సముద్ర మార్గం. ఈ రెండు దారుల్లో ఎర్ర సముద్రం గుండా వెళ్ళేది ఒకటి. భారతీయ రేవుల నుంచి బయలుదేరే నౌకలు హిందూ మహా సముద్రాన్ని దాటి దక్షిణ ఆఫ్రికా వైపో, ఉత్తరంగా పయనించి దక్షిణ అరేబియా రేవులనో అడెన్‌నో చేరేవారు. అక్కడినుంచి సెయింట్ ఆఫ్ బాబెల్-మండెబ్ (St. of Babel- Mandeb) (కన్నీళ్ళ ద్వారం) ద్వారా ఎర్రసముద్రంలోకి ప్రవేశించి అరేబియన్ తీరంలో జెడ్డాను, ఈజిప్షియన్ తీరంలో బెర్నిస్‌ను చేరేవారు. బెర్నిస్ నుంచి సరుకులను బళ్ళ దారిలో థేమ్స్‌కు,

కోస్‌కు తీసుకువెళ్ళేవారు. అక్కణ్నించి అవి నైలు మీదుగా అలెగ్జాండ్రియాకు, అక్కడి నుంచి ఐరోపాకు చేరుకునేవి. మరో ప్రధాన సముద్రమార్గం పర్షియన్ గల్ఫ్ గుండా వెళ్ళేది. బరోవచ్ నుంచి బయలుదేరిన ఓడలు తీరానికి సమీపం నుంచే నడుస్తూ మస్కట్‌ను, బర్మొజ్‌ను చేరి ఒమన్ గల్ఫ్ ద్వారా బస్సోరాకు చేరేవి. పర్షియన్ గల్ఫ్ ముఖద్వారం అయిన బస్సోరా నుంచి సరుకులు బళ్ళ వారిలో యూఫ్రేటస్, టైగ్రిస్, తీరాలవెంట బాబిలోనియా గుండా మధ్యధరాలోని అంటియోచ్(Antioch)కు చేరేవి.

ఈ రెండు సముద్రమార్గాలూ నేటికీ కొనసాగుతున్నాయి. కానీ, భూమార్గాల కథ వేరు. అవి మూతబడ్డాయి, శాశ్వతంగా మూతబడ్డాయి. వాటి మూసివేత చరిత్రే ఐరోపా చరిత్రను తీవ్రంగా ప్రభావితం చేసిన ఏకైక ఆసియాటిక్ ఖండ సంఘటన.

## అధః సూచికలు

1. ఎర్ల్ ఆఫ్ క్రోమర్ ఉటంకించిన ''ఏన్షియెంట్ అండ్ మోడర్న్ ఇంపీరియలిజమ్'' పే. 72

2. ఎర్ల్ ఆఫ్ క్రోమర్ ఉటంకించిన ''ఏన్షియెంట్ అండ్ మోడర్న్ ఇంపీరియలిజమ్'' పే. 73

3. డబ్ల్యు.ఆర్.పాటర్సన్ ''ది నెమిసిస్ ఆఫ్ నేషన్స్'' పే. 307

4. డబ్ల్యు.ఆర్.పాటర్సన్ ''ది నెమిసిస్ ఆఫ్ నేషన్స్'' పే. 334

5. ఫ్రాంజ్ కుమోంట్ ఓరియంటల్ రెలిజియన్స్ ఇన్ రోమన్ పేగనిజమ్, పేజి 2

6. ఫ్రాంజ్ కుమోంట్ ఓరియంటల్ రెలిజియన్స్ ఇన్ రోమన్ పేగనిజమ్, పేజి 6

7. ఫ్రాంజ్ కుమోంట్ ఓరియంటల్ రెలిజియన్స్ ఇన్ రోమన్ పేగనిజమ్, పేజి 8

8. ఫ్రాంజ్ కుమోంట్ ఓరియంటల్ రెలిజియన్స్ ఇన్ రోమన్ పేగనిజమ్, పేజి 9

9. బ్రూక్స్ ఆడమ్స్ ''ది లా ఆఫ్ సివిలైజేషన్ అండ్ డికే''

10. ఆర్.సి. దత్

11. ఇ.డబ్ల్యు. థాంప్సన్ ''హిస్టరీ ఆఫ్ ఇండియా'' పేజి 2

12. ఇంపీరియల్ గెజిటీర్ ఆఫ్ ఇండియా, సంపుటి I పేజి 215

13. భారతదేశంలో తొలినాటి ఆర్థిక వ్యవస్థ గురించిన సమాచారాన్ని కరోలిన్ ఫాలీరిస్ డేవిడ్స్, ఎం.ఏ, 1901 నాటి రాయల్ ఏషియాటిక్ రీసర్చెర్స్ జర్నల్‌లో రాసిన వ్యాసం నుంచి పేజి 859 స్వీకృతం.

14. ద గ్రేట్ కామన్‌వెల్త్ పే. 20

15. ఎలెన్ చర్చిల్ సెంపుల్ ''ఇన్ఫ్లుయెన్సెస్ ఆఫ్ జియోగ్రాఫిక్ ఎన్విరాన్‌మెంట్'' పేజి 309

16. ఎలెన్ చర్చిల్ సెంపుల్ ''ఇన్ఫ్లుయెన్సెస్ ఆఫ్ జియోగ్రాఫిక్ ఎన్విరాన్‌మెంట్'' పేజి 268

17. విలియమ్ రాబర్ట్సన్ ''డిస్క్విజిషన్ ఆన్ ఇండియా'' (1812) పే. 6

18. గార్డినెర్ విల్కిన్సన్ ''ది ఏన్షియెంట్ ఈజిప్షియన్స్'' సంపుటి 1, పేజి 161

19. గార్డినెర్ విల్కిన్సన్ ''ది ఏన్షియెంట్ ఈజిప్షియన్స్'' సంపుటి 1, పేజి 250

20. ''ది పెరిప్లస్ ఆఫ్ ఎరిత్రికన్ సీ'' అనువాదం, వ్యాఖ్య డబ్ల్యు. హెచ్. స్టాఫ్ పేజి 66-67

21. గుస్తావ్ ఓపెంట్ ''ఆన్ ది ఏన్షియెంట్ కామర్స్ ఆఫ్ ఇండియా'' ది మద్రాస్ జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండ్ సైన్స్, 1878లో ప్రచురితం. పేజీ 189, 190, 191; మలాబార్, ఈజిప్షియన్ ఆచారాల మధ్య పోలికలకు ఇ. జె. సిమ్‌కోక్స్ రాసిన ''ప్రిమిటివ్ సివిలైజేషన్స్'' సంపుటి Iలో 183, 550, 554, 569, 570, 574, సంపుటి IIలో 473 పేజీలను చూడండి.

22. డబ్ల్యు. రాబర్ట్సన్ ''డిస్క్విజిషన్'' పేజీలు 9, 10

23. ఐ. లెనర్మెంట్, ఇ. చెవలియర్ ''ఏన్షియెంట్ హిస్టరీ ఆఫ్ ఈస్ట్'' సంపుటి I, పేజి 144

24. డబ్ల్యు. రాబర్ట్సన్, ''డిస్క్విజిషన్'' పేజీలు 7-8

25. I రాజులు X 27

26. ఇ.జె. సిమ్‌కోక్స్- ''ప్రిమిటివ్ సివిలైజేషన్స్'' సంపుటి I, పేజి 545

27. జె. కెన్నడీ జె.ఆర్.ఏ.ఎస్. 1898, పే. 270-1

28. రెవరెండ్ జోసెఫ్ ఎడ్కిన్స్ జె.ఆర్.ఏ.ఎస్ 1886, పేజి 6

29. జె.ఆర్.ఏ.ఎస్. 1899, సంపుటి 31, పేజి 432

30. ఆర్.కె. ముఖర్జీ ''ఇండియన్ షిప్పింగ్'' పే. 121

31. డబ్ల్యు రాబర్ట్సన్ ''డిస్క్విజిషన్'' పేజి 16-17

32. డబ్ల్యు. రాబర్ట్సన్ ''డిస్క్విజిషన్'' పేజి 22

33. డబ్ల్యు. రాబర్ట్సన్ ''డిస్క్విజిషన్'' పేజి 37

34. ఇసిడోర్ ఆఫ్ చరాక్స్ ''పార్థియన్ స్టేషన్స్'' సంపాదకుడు డబ్ల్యు. హెచ్. స్కాఫ్ పేజీ 21

35. ఇసిడోర్ ఆఫ్ చరాక్స్ ''పార్థియన్ స్టేషన్స్'' సంపాదకుడు డబ్ల్యు. హెచ్. స్కాఫ్ పేజీ 19

36. పెరిప్లస్ ఆఫ్ ఎరిత్రియన్ సీ - డబ్ల్యు. హెచ్.స్కాఫ్ పేజి 5

37. తుడిచి వేయబడింది.

38. జె.ఆర్.ఏ.ఎస్. 1860, సంపుటి XVIII, పే. 349-50

39. జె.ఆర్.ఏ.ఎస్. 1860, సంపుటి XIX, పే. 276-ఉటంకితం

40. జె.ఆర్.ఏ.ఎస్. 1860, సంపుటి XIX, పే. 307

41. ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా పేజి 400-1

42. ముఖర్జీ "ఇండియన్ షిప్పింగ్" పే. 128లో ఉటంకించారు.

43. ముఖర్జీ "ఇండియన్ షిప్పింగ్" పే. 128

44. ముఖర్జీ "ఇండియన్ షిప్పింగ్" పే. 139

45. ఆర్.కె. ముఖర్జీ "ఇండియన్ షిప్పింగ్" పే. 134

46. ఆర్.కె. ముఖర్జీ "ఇండియన్ షిప్పింగ్" పే. 135

47. ఆర్.కె. ముఖర్జీ "ఇండియన్ షిప్పింగ్" పే. 135-136

48. కలకత్తా రివ్యూ సంపుటి 19, పేజి 345లో ఉటంకితం.

## అధ్యాయం - II

# మధ్య యుగాలలో భారత్ వాణిజ్య సంబంధాలు
## లేదా
# ఇస్లామ్ అవతరణ, పశ్చిమ ఐరోపా విస్తరణ

గ్రెగరీ ద గ్రేట్ పాలనలో రోమ్‌లో మతాధికారుల అధికారం స్థిరపడడమూ. ఇస్లామ్ పుట్టుకా ఏకకాలంలో జరిగాయి. అది మత రాజ్యాల కాలం. ప్రాచ్యం మరోసారి మతం వెల్లువను వ్యాపింపజేస్తోంది. యావత్ యూరప్ ఖండాన్నంతా మహమ్మదీయాకరణ చేయడంలో అది దాదాపు విజయవంతమైంది. ఇక ఆఫ్రికా, ఆసియా గురించి చెప్పనక్కరలేదు. అన్ని బృహత్ విషయాలవలెనే దీని ఆరంభం కూడా చిన్నగా జరిగిందే.

మహమ్మద్ జననానికి చాలాకాలం ముందు, అరేబియా వివిధ తెగల వారితో నిండి వుండేది. ప్రాచ్య, పాశ్చాత్య దేశాల మధ్య వాణిజ్య మజిలీగా వైభవాన్ని అనుభవించింది. అరబ్బుల ఈ తొలి ప్రాభవం పెట్రా నుంచి డమాస్కస్ దాకా వరసగా వున్న సంపన్న, అద్భుత నగరాల శిథిలాలలో ఎంతోకాలం సాగలేదు. రోమన్లు భారతదేశంతో ప్రత్యక్షవర్తకం ఆరంభించగానే క్షీణించింది. ఇండియా, అరేబియా ఉత్పత్తులు ఎర్ర సముద్రపు పశ్చిమ తీరంలోని మైయోస్ హార్మోస్ (MYOS HORMOS) కు వెళ్ళి, థేన్స్‌కు వెళ్ళి, అక్కడనుండి నైలు ద్వారా అలెగ్జాండ్రియాకు వెళ్ళేవి. ఫలితంగా అరబ్బులు భూమార్గంలో ''నిజమైన ఎడారి పుత్రులు''గా మారిపోయారు.

ఆర్థికంగా అరేబియాను మించిన పేద దేశం లేదు. గిబ్బన్ చెప్పినట్టు ఇసక దేశం, రాళ్ళ దేశం, ఆనంద దేశం అరేబియా. నేలా నీరూ కొరత కావడం మూలాన అరబ్బులు ఒక స్థిరనివాసం ఏర్పరచుకోలేకపోయారు. సంచార జాతుల వారిగా తెగలు తెగలుగా మతంలోనూ . రాజకీయంగానూ ఐక్యత లేని వారిగా మిగిలిపోయారు. అనైక్యత కారణంగా అరబ్బులు తరచు. విదేశీ ఆక్రమణదారుల చేతిలో పరాజితులవుతూ. వుండేవారు. అబిస్సీనియన్లు, పర్షియన్లు, ఈజిప్టు సుల్తానులు, టర్కులు అందరూ వంతులవారిగా యెమెన్‌ను స్వాధీనంలోకి తెచ్చుకున్నారు. పవిత్ర నగరాలు మక్కా, మదీనా తమ అధీనంలో వుండాలని అనేకమంది సిథియన్ నియంతలు డిమాండ్ చేసేవారు. అరేబియాలో

కొంత భాగం రోమన్ సామ్రాజ్యంలోకి చేరిపోయింది. అరబ్బులను శాశ్వతంగా లొంగదీసుకోవడం ఎవరికీ సాధ్యం కాలేదు. సెసోస్ట్రిస్, సైరేస్, పోంపీ, ట్రోజన్ వంటి మహా సామంత రాజ్యాలను అరబ్బులు కూలదోశారు. అరబ్బులలో ఈ స్వాతంత్ర్య స్వేచ్ఛకు కారణాలను వారి నివాస ప్రాంతాల భౌగోళిక పరిస్థితుల్లో అన్వేషించాలి.

అరబ్బుల విగ్రహారాధన మతం (Paganism) ఎంత మొరటుగా, కళారాహిత్యంతో వుండే వంటే, వాటిలో మత సంస్కారాల ఆడంబరానికీ, విస్తృత పురాణగాథలకీ, లేదా అత్యున్నత వేదాంత విచారానికి గానీ స్థానం లేదు. ''అరబ్బుల మతంలోని భారతీయుల మతం లాగే సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ, నిశ్చల నక్షత్రాలను . ఆరాధించడం వుంది''[1] ''ప్రతి తెగా, ప్రతి కుటుంబమూ, ప్రతి యోధ వ్యక్తీ మత సంస్కారాలను తమ అద్భుత ప్రార్థనా చిహ్నాన్ని సృష్టించిందీ, మార్చిందీ; కానీ, ప్రతి కాలంలోన. జాతి మతానికీ, మక్కా భాషకూ లొంగిపోయింది''[2] సొంత మతం నుంచి కొత్త మతానికి మారడం పెద్ద కష్టమేమీ కాలేదు, ఎందుకంటే భిన్న భిన్న మతాలవారు ఎన్నడూ ఉన్మాదులు కారు పైగా ఎంతో సహనశీలురు. విగ్రహారాధక అరబ్బులు ఉత్తరంలో క్రైస్తవులతోనూ, దక్షిణంలో నజ్రన్‌తోనూ ఈశాన్యంలో యూదులతోనూ, సమీపంలోని పర్షియన్ గల్ఫ్‌లో జోరాష్ట్రియన్లతోనూ శాంతియుత సంబంధాలతో జీవిస్తున్నారు. ఈ సాన్నిహిత్యం ఫలితంగా, ఆలోచనల పరస్పర ఆదానప్రదానాలు మహమ్మద్ జననానికి చాలకాలం ముందే అరబ్బులలో ఆధ్యాత్మిక ఏకేశ్వరారాధనకు దారితీసింది. హనీఫ్‌ల రూపంలో ఆ ఐక్యత కనిపించింది.

హనీఫీ ఉద్యమం వల్ల కానీ స్వతంత్రంగా కానీ- ఒంటెలు నడిపే అరబ్బు మహ్మద్- అంతర్గత కలహాలతో దిగజారిపోతూ, కాబాలోని అసంఖ్యాక విగ్రహాలకు నరబలులిస్తున్న అరబ్బులను ఉద్ధరించాలన్న ఆలోచన చేశాడు. అంత తక్కువ సంభారంతో తనకు తాను ప్రవక్తస్థాయిని ఆపాదించుకున్న వారెవరూ లేరు కానీ, మహమ్మద్ ధైర్యంగా ఇస్లాం పేరిట విశ్వాసమార్గాన్ని ప్రతిపాదించాడు. తన కుటుంబానికీ, దేశానికీ ప్రవచించిన ఆ మార్గం శాశ్వత సత్యమూ, అవసరమైన కల్పనా కలగలసినది. ''దేవుడొక్కడే, మహమ్మద్ ఆ దేవుని దూత''[3] మహమ్మద్ జననానికి సంబంధించిన పరిస్థితులు ప్రవక్తృత్వం ఆపాదించుకోవడానికి అనుకూలించాయి. అరేబియాలో అనేక తెగలున్నాయనీ, అవి పరస్పర సమానత్వంతో వున్నాయని ఇక్కడ గుర్తుంచుకోవాలి. కాబా ప్రార్థనామందిరాన్ని న్యాయంగానో అన్యాయంగానో అధీనంలో వుంచుకున్న కొరేష్ (Koresh) తెగను తక్కిన తెగలన్ని ఐక్యంగా గౌరవించసాగాయి. కాబా ఆరాధనా మందిరం పూజారి పదవి హషెమీయుల (**Hashemites**) కుటుంబానికి, ముఖ్యంగా మహమ్మద్ తాతకు సంక్రమించింది. అరబ్బులలో సర్వోన్నతమైన ఈ

పదవిని అనుకూలంగా మలచుకుని మహమ్మద్ ఏకేశ్వరవాద బోధనలు ప్రారంభించాడు. మహమ్మద్ బోధనల్లో కొత్తదంటూ ఏమీలేదు. ప్రవక్తలందరిలోనూ మహమ్మద్ కనిష్ఠమైన మౌలికత కలవాడు **(Least original of the Prophet)**. ఆయన ఖురాను జుదారోజమేకు కై స్తవానికీ మధ్యేమార్గం. ఆయన బోధనల విలువ ఏదైనప్పటికీ అరబ్బులు వాటిపై ఎంతో శత్రు భావం ప్రదర్శించారు. ఎంతగానంటే వారి దృష్టిలో హషెమీయుల స్థాయి పడిపోయింది. మిషనరీల ప్రచారంతో నేడు హిందువులలో పెరుగుతున్నట్లుగా మహమ్మద్ ప్రచార ఉధృతితో పాటుగా అరబ్బుల్లో మొండిపట్టు కూడా పెరిగింది. అసహనంతో అరబ్బులు మహమ్మద్‌ను హషెమీయులు వెలివేసేట్లు చేయగలిగారు. మహమ్మద్ ప్రాణానికి కూడా ప్రమాదం ఏర్పడింది; మహమ్మద్ మక్కాపై దృష్టి సారించాడు కానీ, అక్కడా తనకు సానుకూలంగా వుంటుందో లేదో తెలియని స్థితి. అందువల్ల మక్కాలో తనకు శిష్యులుగా మారిన కొందరి ద్వారా మదీనా వాసులతో చర్చలు జరిపాడు. వారి నుంచి హామీ పొందిన తరువాత మదీనాలో స్థిరనివాసం ఏర్పరచుకుని తన సృష్టి అయిన యువమతాన్ని సర్వనాశనం కాకుండా కాపాడుకోగలిగాడు. ''మక్కా బహిష్కృతులను మదీనా విశ్వాసంతో గౌరవంతో అక్కున చేర్చుకోకపోయి వుంటే, ఆ మతం ముక్కుపచ్చలారకముందే సమసిపోయి వుండేది.''[4] మదీనాలో నివాసం ఏర్పరచుకోవడం మహమ్మద్‌కు ఎంతో అనుకూలించింది. పారంపర్య పూజారి పదవికి తోడు రాజ్యాధికారం, న్యాయాధికారం, పాలనాధికారం కూడా ఆయనకు సంక్రమించాయి. తన బోధనలకు ఫిరంగుల అండదండలుండేంత బలమైన మత ప్రచార చక్రవర్తి అయ్యాడాయన. ''స్వతంత్ర ప్రజల అభీష్టం మక్కా ప్రవాసిని రాజసింహాసనంపై అధిష్ఠింపజేసింది. సంధులు కుదుర్చుకోవడం, ఆక్రమణ యుద్ధాలు, ఆత్మరక్షణ యుద్ధాలు చేయడం వంటి నిర్ణయాధికారాన్ని అప్పగించింది. అసంపూర్ణమైన మానవ అధికారాన్ని దైవశక్తి సమృద్ధి భర్తీ చేసింది, ఆయుధమై అండగా నిలిచింది. మదీనా ప్రవక్త కొత్త ప్రవచానలలో తీవ్రమైన, రక్తదాహపూరితమైన ధ్వని వినిపించింది. అంతకుముందటి మార్దవం శక్తిహీనత ఫలితమేనని ఇది నిరూపిస్తుంది. నచ్చజెప్పే పద్ధతులను అనుసరించి చూశారు, సంయమనకాలం ముగిసింది, ఇప్పుడతను భూమిమీది అవిశ్వాసుల దేశాల విషయంలో రోజులు, నెలల ఫలితాలతో నిమిత్తం లేకుండా తన మతాన్ని ఖడ్గంతో ప్రచారం చేయాలని, విగ్రహారాధన చిహ్నాలను ధ్వంసం చేయాలని ఆదేశించబడ్డాడు.''[5] మదీనాలోనే వుండి, తన తెగను, రాజ్యాన్ని విస్తరించనారంభించాడు. మొదట మక్కాకు చెందిన కొరేష్‌లను లొంగదీసుకున్నాడు. అరబ్బులు వ్యాపారులూ, బందిపోట్లు కూడా. మదీనాగుండా వెళ్ళే కొరేష్ వర్తకాన్ని మహమ్మద్ శిష్యులు వేధించనారంభించారు. విసిగిపోయిన కొరేష్‌లు మదీనాపై యుద్ధం ఆరంభించారు. కొంతకాలం వెనుకంజలో వున్న మహమ్మద్ త్వరలోనే దాడికి దిగి తన జన్మస్థల నగరాన్ని స్వాధీనం చేసుకున్నాడు. అలా అతను తన బలాన్ని, వనరుల్ని కూడా

పెంచుకున్నాడు. ''స్నేహం చేస్తారో, లొంగిపోతారో, యుద్ధం చేస్తారో తేల్చుకొమ్మని మహమ్మద్ శత్రువులకు అన్ని అవకాశాలూ యిచ్చేవాడు. వారు ఇస్లామ్ మతాన్ని స్వీకరిస్తే, తన తొలి శిష్యులతో పాటు అన్ని భౌతిక, ఆధ్యాత్మిక సదుపాయాలను కల్పించేవాడు. ఆ తరువాత వారు కొత్తగా స్వీకరించిన మతాన్ని విస్తరించడానికి అందరితో పాటు ఒకే పతాకం కింద ముందుకు నడిచేవారు''[6] జైత్ర యాత్రలలో పాల్గొనే అవకాశాన్ని వృత్తిగా తన అనుయాయులకు కల్పించిన మహమ్మద్, తన బాధ్యతను ఖలీఫ్‌లకు అప్పగించాడు. ''అలీ (Ali) ధైర్యసాహసాలు, మోవియా (Moowiyah) జాగరూకత వారి ప్రజల్లో ఉత్సాహాన్ని నింపాయి. ప్రజల్లో అరాచకాన్ని సృష్టించేందుకు ఉపయోగించే శక్తులన్నింటినీ ప్రవక్త విశ్వాసాన్ని, రాజ్యాన్ని విస్తరించడానికి ప్రయోజనకరంగా ఉపయోగించుకున్నారు. ఆడంబరంతో, అలసత్వంతో వుండే డమాస్కస్ రాజభవనంలో ఆ తరువాతి ఒమ్మియా (Ommiyah) రాకుమారులు కూడా అందరూ ఒకే రకంగా రాజనీతిజ్ఞ అర్హతలు కానీ, సాధుత్వ అర్హతలుగానీ లేనటువంటివారే. అయినాసరే, ఈ అనామక దేశాల భ్రష్టపాలకులంతా వరసగా పాదాక్రాంతులయ్యారు. ఈ అరేబియన్ మహత్తు సర్వవ్యాప్త విజయాలకు కారణంగా ఆ జాతి స్ఫూర్తినే చెప్పుకోవాలిగానీ, వారి నాయకుల సామర్థ్యాన్ని కాదు. వారి శత్రువుల బలహీనతను కూడా పెద్ద కారణంగానే చెప్పుకోవాలి. అదృష్టవశాత్తూ పర్షియన్, రోమన్, అనాగరక ఐరోపాల క్షీణ, అరాచక స్థితిగతుల సమయంలో మహమ్మద్ పుట్టాడు. ట్రోజన్ సామ్రాజ్యం కానీ, లేదా కానస్టాంటినో, బార్లెమగ్నెకానీ అయిన ఈ అరబ్బుల దాడులను తిప్పికొట్టేవారు. ఈ ఉన్మాదపు ఉప్పెన అరేబియా ఎడారిలో అనామకంగా అంతరించి వుండేది''[7] ''అంతే ఊపుతో, విజయాలతో వారు ఆగస్టస్ (Augustus) వారసులను, ఆర్టక్సెరక్సటస్ (Artaxerxtus) వారసులను ముట్టడించారు. శత్రురాజ్యాలు ఇంతకాలం తాము హీనంగా చూసిన శత్రువు చేతిలో అవలీలగా చిక్కిపోయాయి. ఒమర్ (రణయ)ను పాలించిన పది సంవత్సరాలలో అరబ్బులు ముప్పై నాలుగువేల నగరాలలో లేదా చిన్న నివాస ప్రాంతాలను లొంగదీసుకున్నారు, 14 వేల చర్చిలనో ఇతర ప్రార్థనా స్థలాలనో ధ్వంసం చేశారు. మహమ్మద్ మత అనుసరణార్థం 14 వేల మసీదులు కట్టారు. మక్కా విజయం తరువాత వంద సంవత్సరాలకు, అతని వారసుల ప్రాబల్యం, పాలన ఇండియా నుంచి 1. పర్షియా 2. సిరియా 3. ఈజిప్ట్ 4. ఆఫ్రికా 5. స్పెయిన్ పేర్లతో వున్న వివిధ సుదూర ప్రాంతాలపై నుంచి అట్లాంటిక్ సముద్రం దాకా విస్తరించింది''[8]

''ఈ విశాల మహమ్మదీయ సామ్రాజ్యంలో అవిభాజ్యమైన ఐక్యతను కానీ, ఆగస్టస్, ఆంటోనీల ప్రభుత్వాలలో వున్న పూర్తి విధేయత కానీ కనుగొనడం కష్టమే. అయితే, మహమ్మదీయ మతవ్యాప్తి కారణంగా ఈ సువిశాల ప్రాంతంలో సంస్కారంలో, అభిప్రాయాల్లో సర్వసాధారణమైన పోలికలు కనిపిస్తాయి. సమర్‌కండ్‌లోనూ, సెవిల్లిలోనూ ఖురాన్ భాషను, చట్టాలను సమాన భక్తి శ్రద్ధలతో

అధ్యయనం చేశారు. యూద్, భారతీయుడు మక్కా యాత్రా స్థలంలో సోదరుల వలె, సహ పౌరులవలె ఆలింగనం చేసుకున్నారు, టైగ్రిస్ నది పశ్చిమ ప్రాంతమంతా అరేబియన్ ప్రజాభాషగా స్వీకరించారు''[9]

ఈ చరిత్ర అంతా మహమ్మద్ పూర్తిగా, సూటిగా మతం ద్వారా జరిపిన అరేబియన్ విస్తరణ. అయితే, ఈ క్రమం యొక్క ఆర్థిక అన్వయం కూడా పరీక్షకు నిలబడుతుంది. ఒక సుప్రసిద్ధ రచయిత చెప్పినట్టు ''అరబ్బుల హఠాత్ పురోగమనం పైకి మాత్రమే హఠాత్ పరిణామంగా కనిపిస్తుంది. అనేక శతాబ్దాలుగా అరబ్బుల వలసకు రంగం సిద్ధమవుతోంది. అరేబియా ఆర్థిక పతనంతో ముడిపడివున్న ఆఖరి సెమెటిక్ మహాప్రవాసం అది... క్లుప్తంగా చెప్పాలంటే, మహమ్మద్‌కు చాలాకాలం ముందు, అరేబియా అల్లకల్లోలంగా వుండేది. అప్పుడు అరబ్ తెగలవారు, తెగల శాఖల వారు పక్కనే వున్న పర్షియన్, రోమన్ నాగరిక ప్రాంతాలలోకి నెమ్మదిగా చొరబడుతూ వచ్చారు. ఆ ప్రాంతాలకు ముందే వలసవచ్చి స్థిరపడిన సెమెటిక్ తెగల వారసులను వారు కలుసుకున్నారు.

ఆకలి, ధనదాహం- ఇవే ప్రేరక శక్తులు; మతం కాదు- అయితే, అవసరమైన ఐక్యతను, కేంద్రీకృత అధికారాన్ని మతం కల్పించింది. అరబ్బుల మతవిస్తరణ- ఆ నిర్దిష్ట కాలంలోనూ, తనంతట తానుగాను- ఓ స్వచ్ఛమైన విషయమే తప్ప రాజకీయ అవసరం కాదు. ఇస్లామ్ దానికో నినాదాన్ని, సంస్థా రూపాన్ని ఇవ్వకముందే కదలిక ప్రారంభమైంది''[10]

ఒక కొత్త మతాన్ని వ్యాపింపజేయాలన్న తపనతోపాటు, ఆ కాలపు ఆర్థిక శక్తుల ప్రోద్బలంతో మహమ్మద్ మక్కా యాత్ర జరిగిన 46 సంవత్సరాలకే మహ్మదీయ మతాన్ని కొత్తగా స్వీకరించిన వారు కానస్టాంటినోపుల్ ముందు ఆయుధాలతో ప్రత్యక్షమై దాన్ని ముట్టడించారు. (క్రీ.శ 668-675) ముట్టడి ఏడు సంవత్సరాలు సాగింది. ఫలితమేమీ లేదు. కానస్టాంటిన్ నోపుల్ బలాన్ని, వనరుల్ని మాత్రం తగ్గించగలిగారు. తమ మతానికీ, సామ్రాజ్యానికి వాటిల్లుతున్న ముప్పును చూసి రోమన్లు అంతే బలంతో, ఎంతో సాహసంతో, క్రమశిక్షణతో అరబ్బులను ఎదుర్కొన్నారు. ప్రాచ్య, పాశ్చాత్య ప్రాంతాలలో వారి ప్రజలను అది పునరుజ్జీవితుల్ని చేసింది. కొంతకాలం పాటు అరబ్బుల విజయపరంపరకు గ్రహణం పట్టింది. కాన్‌స్టాంటిన్ నోపుల్‌ను వారు వశపరుచుకోగలిగితే, క్రైస్తవ మత భవితవ్యానికి అది తప్పక హానికరమయ్యేది.

అరబ్బులు రెండోసారి కాన్‌స్టాంటినోపుల్‌ను ముట్టడించారు. కానీ (క్రీ.శ. 716-718) ఈసారి కూడా అదే ఫలితం.

ఈ విజయాలన్నిటి నడుమ, అరబ్బులు క్రమంగా సెల్జుక్ (Seljuk)ల వల్ల మరుగున పడసాగారు. వారు ప్రాభవం సాధిస్తున్నప్పుడు బాగ్దాద్ అబ్బసైడ్ ఖలీఫా ఖైరామ్ అధికారం మొదట బుయ్యైద్ (Buyids)ల షియా రాజవంశం వల్ల, తరువాత మరింత శక్తివంతులైన ఫాతిమైట్ (Fatimite)ల వల్ల మరుగున పడసాగింది. ఆ పరిస్థితులలో అబ్బసైడ్ ఖలీఫా తనను తిరిగి పాత వైభవానికి తీసుకొనిపోగల సెల్జుక్ టర్కులను ఆహ్వానించాడు. ''మహ్మదీయుల వైపు నుంచి చూస్తే ఇస్లామ్ మనుగడకే పెను ప్రమాదంగా పరిణమించిన అతి తీవ్ర షియావాద విచ్ఛిన్నకర ప్రభావం నుంచి ముస్లిమ్ ప్రపంచాన్ని విముక్తం చేసి, తిరిగి సంప్రదాయ ఇస్లాం అధికారాన్ని స్థాపించినందుకు ఇది వారి గొప్పతనమే. పైగా నాగరికతకు వారి నుంచి వచ్చే ప్రమాదమేమీ లేదు. ఎందుకంటే పర్షియన్, అరేబియన్ శక్తుల సన్నిహిత ఐక్యతను సాధ్యంచేసిన గట్టి తటస్థ శక్తికి వారు ప్రతినిధులు. జాతీయ-టర్కిష్-సాహిత్యకృతులు మొత్తం సెల్జుక్ హయాంలోనే అతి అరుదుగా వున్నాయి. వారు ఆ ఐక్యతను దాన్ని పణంగా పెట్టి మరీ సాధించారు''[11] సెల్జుక్‌లలో అసంఖ్యాక తెగలు లేదా కుటుంబాలు ఉన్నాయి. గుజ్ (Guzz)లు వారిలో ఒకరు. పరస్పరం పోటీపడే తెగల మధ్య, ఇతరుల అభిమానం లేని గుజ్ కుటుంబం అధికారం చేపట్టి పొరుగున వున్న మహ్మదీయ రాజ్యాలకు చేటుగా తయారయింది. పిగు అర్స్టాన్ ఇజ్రైల్ (Pigu Arstan Israil) నాయకత్వంలో వారు ఒక్సస్ (Oxus)ను దాటి పర్షియా తూర్పు ప్రాంతాలను విస్తరించారు. గజ్నవీయరాజు మహమూద్‌ను మెరో యుద్ధంలో 1040లో ఓడించి స్వతంత్రం ప్రకటించుకున్నారు. అత్యంత స్వల్ప వ్యవధిలోనే సెల్జుక్‌లు హెల్లెస్పాంట్ (Hellespont) దాకా మధ్య ఆసియా మొత్తంలో ఆధిపత్యం సంపాదించారు. ''గ్రీకు చక్రవర్తిని బందీగా పట్టుకున్న ఆల్ప్ అర్సలా (Alp Arsla) విజయం (1071) తరువాత ఆసియా మైనర్ టర్కీ లోపలిదాకా అందుబాటులోకి వచ్చింది. ఫలితంగా అర్స్టాన్ పిగు (ఇజ్రేల్) కుమారుడైన కుతుల్మిష్ (Kutulmish) కుమారుడైన సులేమాన్ (Suleiman)కు హెల్లెస్పాంట్ దాకా చొచ్చుకుని పోవడానికి వీలు కలిగింది. రోమన్ల ఇద్దరు శత్రువులు నిసిఫోరస్ బ్రైనియస్ (Nicephorus Bryennius) ఆసియాలోనూ, నిసిఫోరస్ బొటన్సియేట్స్ (Nicephorus Botanciates) ఐరోపాలోనూ. బందీలు కావడంతో మరింత ముందుకు వెళ్ళడానికి సులేమాన్‌కు వీలు చిక్కింది. పైని ఇద్దరు . సింహాసనం కోసం తగువు పడ్డారు. బై నియస్ సులేమాన్‌ను సాయమడిగాడు. సులేమాన్ బై నియస్‌కు కాన్స్టాంటినోపుల్ తీసుకువచ్చి సింహాసనంపై కూర్చోబెట్టాడు''[12] అతి త్వరలోనే వారు అంటియోక్ (Anttioch)ను వశపరుచుకుని వర్గి సిరియన్ రాచరికాన్ని స్థిరపరచుకున్నారు. తరువాత వారు విస్తరణను అద్భుతంగా కొనసాగించి 1234 కల్లా సెల్జుకియన్ రాజ్యంలో దాదాపు ఆసియా మైనర్ అంతా కలుపుకున్నారు.

కానీ, సెల్జుకియన్ రాజ్యం అంతర్గత విభేదాల వల్ల, బాహ్యా దాడుల వల్ల అల్పాయుషు అయింది.

సెల్జుకియన్ సామ్రాజ్యంపై బయటి దాడి మంగోలుల నాయకత్వంలో జరిగింది. మంగోలుల తొలి నాటి చరిత్రలో అస్పష్టతా, అద్భుతగాథలు వున్నాయి. మంగోలుల హీరో చెంఘిజ్ ఖాన్ 1227లో కాలియన్ లోయలో చనిపోతూ ''చైనా సముద్రం నుంచి నీపర్ నదీ తీరం వరకు వున్న సామ్రాజ్యాన్ని కొడుకులకు వదిలి వెళ్లాడు''[13] చెంఘిజ్‌ఖాన్ ఓగ్‌దాయ్ **(Ogdai)**ని ఖాఖాన్ లేదా తన వారసునిగా నియమించి, ఇతర వారసులకు సువిశాల సామ్రాజ్యంలో కొన్ని భాగాలు ఇచ్చాడు. ఓగ్దాయ్ తన రాజ్యాన్ని విస్తరించడానికి ప్రయత్నించాడు. ''మహాసైన్యం అగ్ర భాగాన దక్షిణ దిశగా చైనాలోకి పురోగమించి అప్పటికే ధ్వంసమైన కియు వంశ నాశనాన్ని పూర్తి చేశాడు. అదే సమయంలో తులి **(Tuli)** షెంసి **(Shemsi)** వైపు నుంచి హోనాన్‌లోకి దూసుకువచ్చాడు. ఈ ఉమ్మడి దాడిని కియు సైన్యంగట్టిగా ప్రతిఘటించింది. కానీ, మంగోలుల ప్రతిభా సాహసాల ముందు ప్రతిఘటన నిలవలేదు. ఊచకోత కోసిన శత్రువుల సమాధి మీదుగా వారు శత్రువుల రాజధాని కై-ఫెంగ్-ఫు **(Kai-Feng-Fu)**ను వశపరుచుకున్నారు. చకవర్తికై-ఫెంగ్-ఫు నుంచ జునింగ్-ఫు **(Juning Fu)**కు పారిపోయాడు. మంగోలులు అక్కడికి బయలుదేరారు. కొన్ని వారాలపాటు ముట్టడించిన తరువాత కోట మంగోలులకు లొంగిపోయింది. చక్రవర్తి ఉరిపోసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు''[14] తృప్తిచెందని బగ్దాయ్ 1235లో యాంగ్-సె-కియాంగ్ **(Yang-Se-Kiang)** దక్షిణాన వున్న సుంశ వంశీయ చైనా రాజ్యం పైకి కొరియా సేనలు నడిపాడు.

తూర్పు ఆసియాలో జైత్ర యాత్ర తరువాత, ఒగడి పశ్చిమాసియా వైపు దృష్టి సారించాడు. 1236లో అతడు జార్జియాపై, గేట్ అర్మేనియాపై దాడిచేసి టిప్లిస్, కర్స్‌లను వశపరచుకున్నాడు. తన అల్లుడు బటు నాయకత్వంలో పెద్ద సైన్యాన్ని తూర్పు ఐరోపాకు పంపాడు. బల్గర్ రాజధాని బొల్గరిని బటు స్వాధీనం చేసుకున్నాడు. ఓల్గా నదిని దాటి రియాజన్ **(Ryazan)**పై దాడి చేశాడు. 1237 డిసెంబర్ 21 నాడు రియాజన్ స్వాధీనం అయింది. బటు అక్కడ ''మృతుల కోసం విలపించడానికి కూడా ఎవరూ మిగలకుండా అత్యాచారాలు జరిపించాడు'' మాస్కోను, వ్లాదిమిర్‌ను, కోజెల్స్క్‌నూ బటు జయించాడు. పోలండ్, హంగరీ కూడా అలాగే స్వాధీనమయ్యాయి.

మంగోలుల ఉన్నతికి సమకాలంలోనే ఒట్టొమన్‌లనే టర్కులు అధికారంలోకి ఎదుగుతున్నారు. సుంగేరియా మైదానాలకూ, గోబి ఎడారికీ మధ్య నివసించే సంచార తెగలలో వారొకరు. ''ఒట్టొమన్ టర్కుల మూలపురుషుడిగా కారాఖాన్ కుమారుడు ఓఘుజ్‌ను చెబుతారు. వారి గురించిన తొలి ప్రస్తావన చరిత్ర లో 1227 నుంచి మొదలవుతుంది. ఆ ఏడాది ఓ దండు, సుమారు రెండు నుంచి నాలుగు వేల జనంతో, వారి పశువులతో.బానిసలతో వెడుతోంది. మంగోల్ దాడుల ఒత్తిడి కారణంగా వారంతా

తమ మధ్య ఆసియా నివాసాలను వదిలి వెడువెళ్లిన వారు, కోనియాకు చెందిన సెల్జుక్ సుల్తాన్ అల్లావుద్దీన్ కైకొబాద్ దగ్గర ఆశ యం పొందినవారు. వారంతా ఇప్పుడు తిరిగి తమ స్వస్థలాలకు నాయకుడు సులేమాన్ షా నాయకత్వంలో వెడుతున్నారు. వారు జేబెద్ సమీపంలో యూఫ్రెటస్‌ను దాటుతుండగా ప్రమాదవశాత్తూ సులేమాన్‌షా మరణించాడు. అది దండులో గందరగోళం కలిగించింది. అప్పటికి నదిని దాటనివారు దాటడానికి నిరాకరించారు. ఇది అపశకునమని భావించారు. 400 మంది యోధుల ఓ చిన్న దళం సులేమాన్ షా తనయుడు ఎర్రోఘ్రుల్ నాయకత్వంలో వుండడానికి నిర్ణయించుకున్నారు. ఎర్రోఘ్రుల్ (Ertoghrul) ఎర్జెరిమ్‌కు తూర్పున జెస్సిన్‌లో మొదటి విడిది చేశాడు. అల్లావుద్దీన్‌కు చేసిన రెండో విజ్ఞప్తి విజయవంతమైంది. వలస వచ్చిన వారి సంఖ్య చాలా తక్కువ. వారే మాత్రం ప్రమాదకారులు కాలేరు. అంగోరా దగ్గర కరజబాగ్ భూములు కొత్త వలసదారులకు కేటాయించారు. వారికక్కడ మంచి మేత పొలాలు, శీతాకాలపు విడుదలు వున్నాయి. ఎర్రోఘ్రుల్ సెల్జుకన్ చక్రవర్తికి ఆపదకాలంలో చేసిన సాయం వల్ల అతని జమీలో సుగుత్ కూడా చేరింది. ఎర్రోఘ్రుల్ 1288లో తొంభై సంవత్సరాల వయస్సులో మరణించాడు. కొడుకు ఒస్మాన్ అతని వారసుడిగా తెగ నాయకత్వం స్వీకరించాడు. చెంఘిజ్‌ఖాన్ సహాయకులలో ఒకడు టబ్రిజ్ (Tobriz) పాలకుడూ అయిన ఘజన్ మహమ్ముద్ ఖాన్ దాడులతో క్షీణించిన సెల్జుకియన్ రాజ్యం విచ్ఛిన్నమయ్యే దశకు చేరుకుంది. సామంతులలో చాలా మంది పతనానికే దోహదం చేశారు కానీ, పతనాన్ని ఆపడానికి ప్రయత్నించలేదు. తమ పాత జమీలను స్వతంత్రంగా పొందవచ్చుననే ఆశ వారిది. కానీ ఒస్మాన్ విధేయంగానే వున్నాడు. గ్రీకులపై అనేక పర్యాయాల విజయం తరువాత అతను తన రాజ్య పూర్వవైభవాన్ని పునరుద్ధరించాడు. అతని మొట్టమొదటి ఆక్రమణ కరోజా హిస్సార్ (1295). అక్కడ ప్రతి వారం జరిగే ప్రార్థనల్లో అక్కడి సుల్తాన్ పేరు బదులుగా ఒస్మాన్ పేరు చేర్చారు. ఆ సంవత్సరం అలావుద్దీన్ కైకొబార్ II తాను జయించిన భూములపై యాజమాన్యాన్ని తనకే దఖలు పరుచుకుని స్వతంత్ర రాజ్య చిహ్నాలైన గుర్రపుతోక, జేరి, పతాకం కూడా బహూకరించుకున్నాడు. ఒస్మాన్ జైత్రయాత్రను గ్రీకులపై కూడా కొనసాగించాడు. పరాక్రమం వల్లనూ, హర్మన్‌కాయా ప్రభువైన కెనసే మిఖల్ (Kense Mikhal)తో పొత్తు వల్లన. ఐనెఘ్వెల్, బిలెజిక్, యార్ హిస్సార్‌లకు అతను రాజయ్యాడు. 1300 సంవత్సరంలో సెల్జుక్ రాజ్యం విచ్ఛిన్నమైపోయింది. ఆ శిథిలాలలో నుంచి ఎన్నో చిన్న చిన్న రాజ్యాలు ఏర్పడ్డాయి. తన రక్షకుడు, పోషకుడూ అయిన సుల్తాన్ అలావుద్దీన్ II మరణం తరవాతే ఒస్మాన్ స్వాతంత్రాన్ని ప్రకటించుకున్నాడు. ఈ సంఘటన తరువాతే ఒట్టోమన్ రాజ్యం స్థాపన జరిగినట్టుగా టర్కిష్ చరిత్రకారుడు నిర్ధారించారు''[15] టర్కుల రాజ్యం చాలా విస్తారమైనది. ''టర్కులు ఆసియా మైనర్‌ను పాలించారు, టర్కులు ఈజిప్టును ఏలారు, చెంఘిజ్‌ఖాన్ వారసులు ఖలీఫాల రాజ్యాన్ని

ఆక్రమిస్తే, మంగోలుల కింద సామంతులుగా సిరియా, మెసపొటేమియాలను టర్కులు పాలించారు. పర్షియాలో చక్రవర్తి గౌరవం పొంది, వోల్గా అడవుల్లో, యురల్ పర్వతాలలో ఓక్సస్ మైదానాల్లో, తార్తారీ ఎడారుల్లో, మధ్య ఆసియా అంతా వ్యాపించి, చైనాలో సామ్రాజ్యం స్థాపించి హిందుస్థాన్‌లో కూడా ఓ చక వర్తుల పరంపరను స్థాపించాలని సన్నాహాలు చేస్తున్నారు. వారే మనకు గ్రేట్ మొగలుల పేరిట తెలుసును''[16]

కానీ టర్కుల బలం కొంతకాలం దెబ్బతిన్నది- ఇక వారి పని ముగిసిందనే అనుకున్నారు. ''సుల్తాన్ తన జీవిత లక్ష్యం శిఖరాగ్రాన్ని చేరుకున్నాడని భావించిన సమయంలో యూరోప్, ఆసియాలోని బైజంటైన్ రాజ్యంలో అతని మాట శిలాశాసనమైన కాలంలో, క్రైస్తవ రాజ్యాలు అతన్ని భయంగానూ, ప్రపంచపు చెర్నాకోలగానూ పరిగణిస్తున్న సమయంలో, అతన్ని అదిలించడానికి మరో కొరడా వచ్చింది. బాయెజిద్ విజయవంతంగా నెలకొల్పిన రాజ్యం కుప్పకూలిపోయింది. ఆ భయానక విజేత తార్తార్ తిమూర్ (Timur). మనం అతన్ని ''తామర్లేను'' (Tamurlane) అంటాము. చెంఘిజ్‌ఖాన్ సువిశాల రాజ్యం శిథిలాలలో తలెత్తిన చోటా నాయకులపై అతను ఆధిపత్యం సాధించాడు. తామర్లేను ప్రతీదీ కత్తితోనే సాధించాడు. బయోజిద్ అధీనంలో వున్న ప్రతి ప్రాంతాన్నీ కబళించాడు. తార్తారూ, టర్కూ 1402లో ముఖాముఖి తలపడ్డారు. కాన్‌స్టాంటినోపుల్ ముట్టడికి టర్కులు ప్రయత్నిస్తున్నప్పుడు సివాస్ దగ్గర తన సైన్యంపై తామర్లేను విజయం సాధించాడన్న వార్త సుల్తానుకు తెలిసింది. బయోజిద్ సైన్యాన్ని కూడగట్టుకుని స్వయంగా యుద్ధానికి దిగాడు కానీ అంగోరా వద్ద పరాజయం పాలయ్యాడు. టర్కిష్ రాజ్య భవనం కుప్పకూలిపోయింది.''[17] అసాధారణ ప్రతిభా నైపుణ్యాలతో, సాహసాలతో పెంచి పోషించిన టర్కిష్ సామ్రాజ్యం ''ఏషియాటిక్ నియంత'', మూర్తీభవించిన ''ప్రళయం'' చేతిలో బలయిపోయింది. ''ఒట్టొమన్‌ల చరిత్ర అకస్మాత్తుగా ముగిసినట్టు అనిపిస్తుంది. అధికార అగ్రాసనం నుంచి, సంకెళ్ళు వేసిన బందీగా అవమానం పొందేదాకా బయెజిద్ పొందిన పతనం వంటి పతనాన్ని, అంత భయంకరమైన, సంపూర్ణ ఉత్పాతాన్ని ప్రపంచం ఎంతో అరుదుగా మాత్రమే చూస్తుంది''[18]

అయితే దురదృష్టవశాత్తూ తామర్లేన్ మరణించి విజయఫలాలను అనుభవించలేకపోయాడు గానీ, అతని దెబ్బ ఒట్టొమన్ రాజ్యాన్ని చావుదెబ్బ తీయడం మాత్రమే కాదు, అంతకుమించి లేన్‌పూల్ (Lane Poole) ఇలా అన్నారు. ''టర్కుల పాలనలో ఆశ్చర్యకరమైన లక్షణం దాని సజీవశక్తి. ఎందరెందరో ప్రవక్తలు దాని అంతిమ ఘడియల్ని ప్రకటిస్తూ వచ్చినప్పటికీ, అది బతికి బట్ట కట్టింది. ప్రాంతం తరువాత ప్రాంతం సామ్రాజ్యం నుంచి విడిపోతున్నా, సువిశాల ప్రాంతంలో ఇంకా సుల్తాన్‌దే సర్వంసహాధికారం. ఇంకా అతనంటే అనేక జాతుల ప్రజలకు భయమూ, భక్తీ. గొప్ప

పాలకునికుండవలసిన లక్షణాలలో ఆ టర్క్‌కు ఎన్ని లక్షణాలున్నాయో చూసినప్పుడు, ఖడ్గంతో లొంగదీసుకున్న ప్రజలను శాంతింపజేయడానికి అతను చేసిన ప్రయత్నం శూన్యం అయినప్పుడు-అతని అధికారం అంత దృఢంగా వుండడం, అచంచలంగా వుండడం ఆశ్చర్యం కలిగిస్తుంది. మరో డజన్ సంవత్సరాలలో పోయిన ప్రాంతాలన్నీ మహమ్మద్ I సమర్థమైన, శక్తివంతమైన పాలనలో పునరేకీకరణ పొందాయి. 1402లో అది తిన్న చావుదెబ్బ వల్ల బలహీనం కావడంపోయి ఒట్టొమన్ రాజ్యం తిరిగి పుంజుకుంది. పతనం తరువాత అది మరింత శక్తితో తలెత్తింది. సరికొత్త సాహస దండయాత్రా విన్యాసాలకు సిద్ధమైన మహాకాయునివలె లేచింది''[19] కొత్త విజయావకాశాలను చూసిన మహమ్మద్ రాజధానిని ఆసియాలోని బ్రుసా నుంచి ఐరోపాలోని అడ్రియానోపుల్‌కు మార్చాడు. సెల్జుక్ టర్కులు హెల్స్‌పాంట్‌కు చేరుకున్నారు. కానీ, దానిని దాటే విషయం ఒట్టొమన్‌కు వదిలివేశారు. టర్కిష్ పాలకులందరి కల కాన్‌స్టాంటినోపుల్. ఒట్టొమన్ దాన్ని గుప్పిట పట్టినట్టు కలగన్నప్పటి నుంచి కాన్‌స్టాంటినోపుల్‌ను స్వాధీనం చేసుకోవాలని వారు తపిస్తున్నారు. ''అగ్గిపిడుగు బయోజిద్ దాన్ని ముట్టడించాడు. మూసా దానిపై మరింత ఒత్తిడి పెంచాడు. మురాద్ II దాన్ని జయించడానికి ఓపికగా పథకం రచించాడు. నగరాన్ని తప్ప గెలవడానికి మరేమీ లేని స్థితి, చుట్టుపక్కల వున్న ప్రాంతాన్నంతా ఒట్టొమన్లు లొంగదీసుకున్నారు. అలోజ్‌సర్, ఆ నగరం సంపద, అందం, బలం దాని వ్యూహాస్థానం ఇవి కాన్‌స్టాంటినోపుల్ స్వాధీనం చేసుకోవడమే టర్కుల పతాక లక్ష్యంగా మార్చేశాయి''[20] ఒట్టొమన్ చక్రవర్తులలో ఆరవ వాడైన మహమ్మద్ II ఆ నగరాన్ని పట్టుకోవడానికి ఏమి సాకు దొరుకుతుందా అని ఆత్రుతగా కనిపెట్టి వున్నాడు. చక్రవర్తి శత్రుభావాన్ని ఆసరాగా చేసుకుని అతను దాడికి సమాయత్తమైనాడు. 1453 మే 29 నాడు నగరం పతనమైంది. నగరం పతనం కావడం కంటె, అది దాడిని అంత దీర్ఘకాలం తట్టుకోవడమే నిజమైన అద్భుతం- ఎందుకంటే ''ఆ సమయంలో బైజంటైన్ రాజ్యం పెద్దగా ప్రతిఘటించే స్థితిలో లేదు. అయినా టర్కులు అంత సుదీర్ఘకాలం ఆ నగరాన్ని ముట్టడిలో వుంచారంటే కారణం వారి సామర్థ్యలోపమే తప్ప, కాన్‌స్టాంటినోపుల్ రక్షకుల సామర్థ్యం మాత్రం కాదు''[21] ఆసియా, ఐరోపా, ఆఫ్రికా ఈ మూడు ఖండాలకూ కీలకమైన కాన్‌స్టాంటినోపుల్‌ను మించిన వ్యూహాత్మక ప్రాంతం మరొకటి లేదు. ఈ నగరంపై ఎవరి పెత్తనం వుంటే వారు ఈ మూడు ఖండాలపై పెత్తనం పొందగలిగారు. కాన్‌స్టాంటినోపుల్ బలాన్ని, అది తట్టుకుని నిలిచిన దాడులను డాక్టర్ కన్నింగ్‌హామ్ (Dr. Cunningham) ఇలా వివరించారు. ''ఒక్కో శతాబ్దం వస్తున్న కొద్దీ, ఒక కొత్త ఆక్రమణదళం ప్రత్యక్షమయ్యేది. నాలుగో శతాబ్దంలో, ఆ నగరాన్ని స్థాపించిన వెంటనే, గోథాల నుంచి ప్రమాదం ఎదురైంది. ఐదో శతాబ్దంలో హూణులు, వాండల్స్; ఆరో శతాబ్దంలో స్లావ్‌లు, ఆ తరువాత ఏడో శతాబ్దంలో అరబ్బులు, పర్షియన్లు, ఎనిమిది, తొమ్మిది శతాబ్దాలలో మగ్యార్లు,

బల్గార్‌లు, రష్యన్లు. వెనిస్ విజయం తరువాత, నాలుగో క్రుసేడ్ తరువాత, లాటిన్ రాజ్యం ఏర్పాటు తరువాత కాన్‌స్టాంటినోపుల్ ప్రతిష్ఠ భంగమైనా, పునరుద్ధరణ జరిగిన రాజ్యం టర్క్‌ల దాడులకు సుదీర్ఘ ప్రతిఘటన ఇచ్చింది. అప్పుడప్పుడు తీవ్రంగా చలించిపోయిన 1453 దాకా ఆ నగరం లొంగి రానేలేదు''[22]

తరచూ జరిగిన ఈ దాడులను ఈ నగరం తట్టుకుని నిలబడడం, సాంప్రదాయ నాగరికత అవశేషాలను అది కాపాడడం అదృష్టం. క్రైస్తవులకు కూడా అదృష్టం ఏమిటంటే, క్రైస్తవం ఐరోపాలో నిజమైన శక్తిగా అవతరించడానికి ఎంతోకాలం ముందే మహమ్మదీయ ప్రభంజనానికి అడ్డుకట్ట వేయడం. అది అనాగరికత మొరటుతనాన్ని భరించి, ఉన్నత శ్రేణి నాగరికత స్వయంగా వృద్ధి చెందేందుకు వీలు కల్పించింది. తూర్పు వైపున కాన్‌స్టాంటినోపుల్ ఏం చేసిందో, టూర్స్ (Tours) పశ్చిమం వైపున, అంత గొప్పగా కాకపోయినా, చాలకాలం ముందే, అదే చేసింది. కాన్‌స్టాంటినోపుల్ చేజిక్కించుకోవడంలో నిరాశకు గురైన అరబ్బులు టర్క్‌ల కంటె ముందే దాన్ని వశపరుచుకుని, దక్షిణానికి వెళ్ళి, ఆఫ్రికాలో వారి మతాన్ని విజయవంతంగా వ్యాపింపజేస్తూ జిబ్రాల్టర్ (Gibralter) ద్వారా పశ్చిమం నుంచి ఐరోపాలోకి ప్రవేశించాలనుకున్నారు. వారి తొలి దాడుల్లో ఎటువంటి ప్రతిఘటనా ఎదురుకాలేదు. కారణం పాశ్చాత్య రాజ్యం గోథ్స్ అరబ్బుల యుద్ధ ప్రావీణ్యం ముందు నిలబడలేకపోయింది. క్రీస్తు శకం 711 నాటికి స్పెయిన్ అరబ్బుల, బాబెర్ల చేతిలోకి వెళ్ళిపోయింది. మూరిష్ జాతీయుల వలసతో కిక్కిరిసిపోయింది. విజయోత్సాహంతో అరబ్బులు గాల్ (Gaul) లోకి వెడదామనుకున్నారు కానీ, డ్యూక్ ఆఫ్ అక్విలేన్ (Duke of Aquilaine) ప్రతిఘటించాడు. అయితే, 732లో బోర్డెక్స్ (Bordeaux) వద్ద డ్యూక్ ఓడిపోయాడు. ఇనుమడించిన ఉత్సాహంతో అరబ్బులు పాయిటర్స్ (Poiturs) లోకి దూసుకుపోయి టూర్స్ వైపుగా పురోగమించారు. కానీ, అక్కడ వారికి బలమైన శత్రువును ఎదుర్కోవలసి వచ్చింది. హేమర్ (మోర్టెల్) చార్లెస్ నాయకత్వంలో ఫ్రాంకులు (Franks) టూర్స్ వద్ద అరబ్బులను ఓడించి, వారి పురోగమనానికి శాశ్వతంగా అడ్డుకట్ట వేశారు. పైరెనీస్ (Pyrenees)ని దాటడానికి అరబ్బులు ఆ తరువాత మరెన్నడూ ప్రయత్నాలు చేయలేదు. అరబ్బులు గనుక దీన్ని వశపరుచుకోగలిగి వుంటే ఐరోపా నాగరికత గతి ఏమై వుండేదో వూహించడం కూడా కష్టం. ఫ్రాంకుల కంటె మూరులు చాలా ముందున్నరనేది స్పష్టం. ప్రొఫెసర్ రాబిన్‌సన్ యిలా అన్నారు, ''చార్లెస్, ద హేమర్ అతని అనాగరిక సైనికులు టూర్స్ వద్ద మహ్మదీయులను ఓడించి వెనక్కి తరిమికొట్టగలగడం ఎంతో అదృష్టమని చరిత్రకారులు పరిగణిస్తుంటారు. కానీ, అరబ్బులను కనుక దక్షిణ ఫ్రాన్స్‌లో స్థిరపడేందుకు అనుమతించి వుంటే ఫ్రెంచి వారి కంటే ముందుగా వారు కళా, శాస్త్ర విజ్ఞాన రంగాలను ఎంతో శీఘ్రంగా అభివృద్ధిపరిచి వుండేవారు.''[23]

వేగంగా జరుగుతున్న ఆసియాటిక్ సంచార జాతుల కదలికలు మధ్య ఆసియాలో శాంతియత్నాలన్నిటినీ భగ్నపరుస్తుండగా, రోమన్‌సామ్రాజ్యం శీఘ్రగతిన శిథిలావస్థకు చేరుకుంటోంది. ఐరోపా స్తబ్దతలోకి జారుకుంటోంది. జర్మానిక్ ప్రజలు తరచూ యుద్ధంలోకి దిగేదాకా ఈ స్తబ్దత కొనసాగింది.

ఈ పరిస్థితులలో వాణిజ్యం క్షీణించక తప్పదు. మధ్య యుగాల వాణిజ్యానికి లెక్కలేనన్ని అవరోధాలు. పశ్చిమ ఐరోపా అంతటా ద్రవ్యం కొరత వల్ల పరస్పర వినిమయం బాగా మందగించింది. క్రైస్తవం ఏదైనా కావచ్చు కానీ ఆశావాద మతం మాత్రం కాదు. అది జీవిత సౌకర్యాలపై నిరసనగా వచ్చిన మతం. మతం వల్ల ఆర్థికం అణగారిపోయింది. "న్యాయమైన ధర'' సిద్ధాంతం, టోకు వర్తకంపై నిషేధం వాణిజ్యాన్ని బాగా కుంగదీశాయి. వడ్డీపై అప్పు తీసుకోవడంపై క్రైస్తవంలో ఉన్న ఆంక్ష వాణిజ్య కార్యకలాపాలలో అతి పెద్ద అవరోధంగా నిలిచింది. వడ్డీపై అప్పులివ్వడాన్ని నిషేధిస్తూ క్రైస్తవం మూకుమ్మడిగా అందరినీ ఆదేశించింది. ద్రవ్యం కొరత వున్న పరిస్థితులలో ఇటువంటి ఆదేశం ఎంత తిరోగామి ఫలితాన్నిస్తుందో అర్థం చేసుకోవచ్చు. క్రైస్తవం పరిధిలో లేని యూదులు మాత్రమే డబ్బు లావాదేవీలలో మిగిలారు. వారు ఆర్థిక వ్యవస్థకు చేసిన సేవ గణింపలేనిది. ''ఈ నష్టజాతకులు ఐరోపా ఆర్థికాభివృద్ధిలో ఎంతో ముఖ్యమైన పాత వహించారు. కానీ క్రీస్తును చంపిన అతి పెద్ద పాపం చేసిన నేరస్థులుగా క్రైస్తవులు వారిని హీనంగా చూశారు''[24] వీటన్నిటికీ తోడు రవాణా సుంకాలు నిరంకుశంగా విధించబడేవి. భౌగోళిక పరిజ్ఞానం నాడు భయానకమైన దయనీయ స్థితిలో వుండేది. సముద్రంపై ప్రమాదాలుండేవి. సముద్రపు దొంగల భయం తీవ్రంగా వుండేది. వీటన్నిటికీ తలమానిక వంటిది రోమన్ రహదారుల శైథిల్యం.

ఈ ప్రతికూల పరిస్థితులన్నిటి ప్రాబల్యం కింద, రోమన్ సామ్రాజ్య పతనం తరువాత పశ్చిమ ఐరోపాలో సుదీర్ఘకాలం నిశ్శబ్దం, స్తబ్దత నెలకొని వుండడంలో ఆశ్చర్యం లేదు.

కాన్‌స్టాంటినోపుల్ వాణిజ్యంపై పెద్ద శ్రద్ధ చూపలేదు. దానిది ముక్కు పిండి డబ్బు వసూలుచేసే విధానం. బాస్పరస్ (Bosphorus)పై తాను వుండడం వల్ల వచ్చే ప్రయోజనాలను అది ఎన్నడూ పూర్తిగా వినియోగించుకోవడానికి ప్రయత్నించలేదు. పాశ్చాత్య దేశాలకు, కాన్‌స్టాంటినోపుల్‌కు మధ్య జరిగిన వాణిజ్యం బాగా తక్కువ. వాణిజ్య కార్యకలాపాలకు ప్రేరకంగా నిలిచినవి సైనిక చర్యలు మాత్రమే.

(రచయిత ఖాళీస్థలం వదిలారు - సంపాదకులు)

★★★

సమకాలీన బైజంటైన్ సామ్రాజ్య పాలకుల కంటె సిరియా ఈజిప్టులలో సారాసెన్ (SaraCens) ల పాలనే ఎంతో వికాసశీలంగా వుండింది.

కానీ, శైథిల్యం అంతటిలోనూ ఇటలీ మధ్య యుగాల మేధావి, వర్తక శక్తులను పరిరక్షించింది. ఇటలీ ఈశాన్య, నైరుతి ప్రాంతాలలో క్రీ.శ. 9వ శతాబ్దిలో వాస్తవమైన వర్తక కార్యకలాపాలు అవతరించాయి. అది ఇటాలియన్ నగర రిపబ్లిక్‌ల అవతరణ శకం. ప్రాచ్య వాణిజ్యంతోనే వారు పుష్టి సాధించారు. ప్రతీ నగర రాజ్యమూ మహాద్భుత ప్రాచ్యాన్నుంచి లాభపడడానికి తలెత్తింది.

అన్నిటికంటె మొదటిది అమల్ఫీ (Amalfi). 820లో అది ప్రాచ్య సామ్రాజ్యం నుంచి స్వాతంత్ర్యం ప్రకటించుకుంది. దాని నావికా కార్యక్రమాలు ఎంత వేగంగా పెరిగాయంటే 20 సంవత్సరాల కాలంలో వారి నావికా బలం సారసెన్స్‌తో పోరాడగలిగినంత స్థాయికి వచ్చింది. దీని విదేశీ వర్తక కేంద్రా లు పాలెర్మో (Palermo), సిరక్యూస్ (Syracuse), మెస్సినా (Messina), డురజో (Durazzo), కాన్‌స్టాంటినోపుల్‌లలో వుండేవి. వాణిజ్య దేశంగా దాని కీర్తి ప్రతిష్ఠలు ఎంతగా వ్యాపించాయంటే ''ఇన్‌లాండ్ సముద్రం (Inland Sea) ప్రతి తీరంలోనూ వర్తకులలో టాబులా అమల్ ఫితానా (Tabula Amalfitana) నావికా చట్టాలే అమలులో వుండేవి. లాటిన్ ఐరోపాకు, లేవాంట్‌కూ ప్రధాన మాదకద్రవ్యంగా ఆ రిపబ్లిక్ నాణేలే చెలామణిలో వుండేవి.''[25]

ఓడరేవు చిన్నది కావడం వల్ల అమల్ఫీ పెద్ద వాణిజ్య కేంద్రం కాలేకపోయింది. ఫలితంగా ప్రత్యర్థులకు లొంగిపోవలసి వచ్చింది. నాపిల్స్ (Naples), సాలెర్నో (Salerno) లేదా బ్రిందిసి (Brindisi)లను లొంగదీసుకున్న నార్మన్లకు అది భౌగోళిక అధికారాన్ని దత్తం చేయవలసిందిగా, ఇతర నగర రాజ్యాలకు సముద్ర అధికారాన్ని కోల్పోవలసి వచ్చింది.

అమల్ఫీ పతనంతోటే వెనిస్ తలెత్తింది. ''అడ్రియాటిక్ రాణి చార్లెమాగ్నె (Charlemagne) కాలం నుంచే లాటిన్ దేశాల రాజకీయాలలో, వాణిజ్యంలో వెనిస్‌కు స్థానం ఏర్పడనారంభించింది. ఇటలీకి చెందిన అన్ని రేవు పట్టణాలకు మించి వెనిస్‌కు సదుపాయాలున్నాయి. ప్రధాన రాజ్య భూభాగానికి విడిగా సముద్రంలో వున్న ఈ వెనిస్‌కు విశాల సముద్రంలో సైతం చిన్న చిన్న ద్వీపాల కుడ్యరక్షణ వుంది. లోతుగా తవ్విన కొన్ని కలువలు మినహా చుట్టూతా చదునైన నేలలున్నాయి. విదేశీయులే కాదు, స్వదేశీ పౌరులు కూడా వెనిస్ అభేద్యమైన దుర్గంగా భావిస్తారు. ఆ ఖండపు రాజకీయ సమస్యలు అట్టిలా కాలం నుంచి దాన్నొక ఆశ్రయ రాజ్యంగా మార్చాయి. అడ్రియాటిక్‌లో నావికా రంగంలో ప్రత్యర్థులెవరూ లేకపోవడం వల్ల వాణిజ్య కార్యకలాపాలకీ, వలసీకరణకు,

దండయాత్రలకూ కూడా ఎంతో అవకాశం చిక్కింది''[26] వెనిస్ ఉదార తటస్థ వైఖరి, బైజంటైన్‌తో దాని విధేయత దాని వైభవాన్ని పెంచింది. తూర్పు రాజ్యం క్షీణించిన వెంటనే యావత్ అడ్రియాటిక్ తీరం దాని ప్రాబల్యంలోకి వచ్చింది. బైజంటైన్ తీరం అంటియోక్, ఇనోపెస్టియా, అడేనా, తార్పస్, అట్టలియా, స్ట్రోబిలోస్ బియోస్, యిఫిసస్, ఫోసియా హిరక్లియా, సిలింబ్రియా, క్రిసోపొలిస్, డెమిట్రియాస్, అడ్రియనోపుల్, ఏథెన్స్, థెబేస్, తిస్సలోనికా, నెగ్రోపొంట్, కోరింత్ కోర్ఫస్, డురజో మొదలైన ప్రధాన మార్కెట్లు వెనిసియన్ వర్తకానికి లభ్యమైనాయి. దాని వాణిజ్య విధానం ఎంతో దూరదృష్టితోనూ వివేకంతోనూ కూడుకున్నది. ''ఎల్లప్పుడూ బలవంతుని పక్షానే వుండడం, ప్రధానంగా నావికా పోరాటంలో'' అన్న సూత్రాన్ని ఏర్పరచుకుని, అనేక సందర్భాలలో దాన్ని అమలులో పెట్టింది వెనిస్. ఈరకంగా తన శత్రువులను అణచివేసి, బలవంతులతో పొత్తుపెట్టుకుని వెనిస్ తన ఘనతను సాధించుకుంది.

జెనోవా (Genoa) ప్రాచ్య వర్తకంలో పాలు పంచుకునేందుకు ఆలస్యంగా చేరిన మరో నగర రాజ్యం. క్రీ.శ. 1097లో అది అవతరించింది.

''పదకొండో శతాబ్దం చివర్లో ఏర్పడ్డ కాంపాగ్నా లేదా రాజకీయ సంఘంతో ఈ నగర రాజ్య ఆవిర్భావం ముడిపడి వుంది. ఒబెర్టి (Oberti) వంటి లౌకికతత్వం కలిగిన ప్రభువులపై నగర బిషప్పులు వ్యతిరేకతతో మద్దతు ఇచ్చి గెలిపించిన సభ్యుల అధీనంలో వున్న సంఘం అది''[27]

1097 నుంచి 1122 వరకు వెనిస్‌కు ఎన్నో ముఖ్యమైన వర్తక రాయితీలు లభించాయి. లెవంటైన్ (Levantine) తీరంలోనూ, ఆఫ్రికన్ తీరంలోనూ కూడా అది అనేక వాణిజ్య కేంద్రాలను స్థాపించింది. దాని వర్తకం అలెగ్జాండ్రియా ద్వారా ఈజిప్ట్ దాకా, టునిస్ దాకా, ఫ్రాన్స్, స్పెయిన్‌లలోని దక్షిణ తీర పట్టణాల దాకా విస్తరించింది.

పిసా (Pisa) ఆవిర్భావం కూడా జెనోవా ఆవిర్భావం వంటిదే. ఇది 1085 నుంచి మొదలైంది. దాని సాయుధ చర్యలు ముస్లిముల నుంచి, బైజంటైన్ సామ్రాజ్యం నుంచి దానికి వాణిజ్య రాయితీలను సాధించి పెట్టాయి. దాని వాణిజ్యం ఎంత పెద్దదంటే ''నేల నలుమూలల నుంచి వచ్చి నగర వీధులను ఉప్పెనలా ముంచెత్తుతున్న నావికా భూతాలను చూసి పాశ్చాత్య ఛాందసం ఖంగుతిన్నది. పేగన్లు, టర్కులు, లిబియన్లు, పార్థియన్లు, చాల్డియన్‌లు నగరం నిండా నిండిపోయారు. అన్నిటికీ మించి- జాతి, మతం, భాషలపై లాటిన్ గుత్త ప్రత్యేకతల ఆంక్షలన్నిటిపై వాణిజ్యవాదం సాధించిన విజయమే కనిపిస్తుంది.''[28] పిసాకు మించిన రాయితీలను, సదుపాయాలను మరే రిపబ్లిక్ కూడా పొందలేదు. స్వల్పకాలమే అయినప్పటికీ దాని నావికాయానం అద్భుతంగా సాగింది.

ఈ రిపబ్లిక్‌ల వాణిజ్య కార్యకలాపాలను వాటి శైశవ దశలో ప్రోత్సహించింది క్రుసేడ్‌లే. క్రుసేడ్‌ల సైనిక కోణం గురించి మనకు అవసరం లేదు. బహుశా అవి ఆ కాలంలోని అతిగొప్ప సైనిక విజయాలు కావచ్చును. ఇక్కడ వాటి వాణిజ్య అంశమే మనకు కావాలి.

సముద్రానికి దాని ప్రమాదాలూ, దాని భయాలూ దానికి వుంటాయి.[29] ఎవరూ సముద్రాన్ని వరించేవారు కాదు. ''ఆ కాలంలో భూమి మీది మనిషి ఎవరూ తప్పనిసరి అయితే తప్ప సముద్రం మీదకు వెళ్ళడానికి యిష్టపడే వాడు కాదు. సముద్రయానం అంటే బందిఖానాలో వున్నట్లు వుండడమే కాదు, దానికి తోడు మునిగిపోయే ప్రమాదం కూడా వుంది''[30] మొదటి క్రుసేడ్ (1096-99) లో భూమార్గాలను వాడి విసుగెత్తిన అనుభవం వల్ల జల రవాణా మార్గాల ప్రాముఖ్యం క్రుసేడర్లకు అర్థమైంది. అప్పుడు సముద్ర రవాణా ఇటాలియన్ రిపబ్లిక్‌ల చేతిలో వుండింది. అందువల్ల క్రుసేడర్లు పదే పదే ఈ రిపబ్లికాలను అభ్యర్థించేవారు. ఆ వ్యాపారంతో రిపబ్లిక్‌లు మరింత వృద్ధి చెందాయి.

''క్రైస్తవానికి సేవ చేయడం ద్వారా అవి (రిపబ్లిక్‌లు) తమకు తాము సేవ చేసుకున్నాయి. వారు వారి వర్తకాన్ని కొన్ని రెట్లు పెంచుకున్నారు; ప్రధానంగా వారి ఎగుమతి దిగుమతి వర్తకం బాగా పెంచుకున్నారు. అన్నిటికి మించి, లెవంటే తీరాల్లో దాదాపు రాజకీయ మనదగ్గ అధికార హోదాను సాధించాయి. కాలం గడిచే కొద్దీ క్రుసేడ్‌లో జరిపే వారు వాటిపై మరింతగా ఆధారపడ సాగారు. అధికారం ప్రధానంగా తమ చేతిలో చిక్కి, పవిత్ర యుద్ధాన్ని (Holy War) నిర్వహించవలసినభారం తమపై పడేదాకా రిపబ్లిక్‌లో క్రూసేడర్లతో యిష్టానుసారం వ్యవహరించగలిగాయి.''[31] ఈ క్రూసేడ్‌లను వివిధ దృక్పథాల నుంచి చూస్తున్నట్టున్నారు. కాథలిక్ చర్చ్‌కు ద్వంద్వ ప్రయోజనాలున్నాయి. రెండో క్రుసేడ్ సైనికుల గురించి సెయింట్ బెర్నార్డ్ అన్న మాటల్లో అది స్పష్టమవుతుంది. ''కుటిలులు, అపవిత్రులు, భ్రష్టులు, హంతకులు, దొంగ సాక్షులు కాని వారు ఆ అసంఖ్యాకుల్లో చాలా కొద్ది మంది మాత్రమే. వారి నిష్క్రమణతో రెండు లాభాలు. వారిని వదిలించుకుంటున్నందుకు యూరోప్‌కు సంతోషం, వారిని పొందుతున్నందుకు పాలస్తీనాకు ఆనందం; ఇక్కడి నుంచి నిష్క్రమణం, అక్కడికి ఆగమానం రెండు రకాలుగా వారు ఉపయోగపడ్డారు.''[32] మతంపై భక్తి శ్రద్ధలు వున్నవారికి, సహజంగా కాల్పనికాభినివేశం వున్నవారికి మాత్రమే క్రుసేడ్‌లపై అభిప్రాయాలు వుండవు. అసంతృప్తుడైనసాధువుకీ, బాధ్యతలను వదిలించుకోవాలనుకునే అశాంతజీవికి , నేరస్థుడికీ, పాపాత్ముడికీ కూడ క్రుసేడ్‌లపై వారి వారి అభిప్రాయాలో, లక్ష్యాలో వున్నాయి. కానీ సముద్రానికి దూరంగా వున్న ప్రాంతాల్లోని సాధారణ కేథొలిక్ ప్రభువులూ, కార్మికులూ క్రుసేడర్లను చూసిన దానికంటె భిన్నమైన దృక్పథంతో వాణిజ్య రిపబ్లిక్‌లకు చెందిన జీతగాళ్ల మారి వర్తకులూ, నావికులూ చూశారు; వారికి మతాభినివేశం లేదని కాదు, వుంది. కాని వారు దాన్ని ఓ అనివార్య భావనాస్థితిగా తీసుకోకుండా ఓ ఉపయోగకరమైన

సరుకుగా పెంచుకున్నారు; వారికి ఇస్లామ్‌పై గుడ్డి ద్వేషం అలవడలేదు. పాలస్తీనా దాకా వారు తీసుకువెళ్ళే యోధుల, యాత్రికులను ఉత్తేజపరిచే క్రీస్తు ప్రవచన స్థలాలపై ఉద్వేగపూరితమైన భక్తిభావము వారికి లేదు. వెనిస్‌లోనూ పిసాలోనూ జెనోవాలోనూ అమల్ఫీలోనూ పాలించిన వారి మనస్సులు కానీ, అమ్మకాలు కొనుగోళ్ళూ చేసిన వారి తలపుల్లోంచి కానీ వర్తక ప్రయోజనం అన్నది ఎన్నడూ విస్మృతం కాలేదు.''[33] క్రుసేడ్‌ల ఫలితాలు ఊహించిన దానికి భిన్నంగా వున్నాయి. క్రుసేడర్లు సాధించాలని ఎన్నడూ అనుకోని దాన్ని సాధించారు. వారు సాధించింది అల్పమైనది కాదు. ''నేలపై క్రుసేడర్ల ప్రాభవ కాలం అనేక పశ్చిమ నగరాలకు సముద్ర వైభవంలో ప్రాభవకాలం కూడా; మత యుద్ధాలు ముగిసిన తరువాత, పోరాట ఫలితాలు క్రైస్తవ వాణిజ్య వ్యాప్తిలోనూ; ప్రాచ్య నాగరికతలోని గణనీయమైన భాగమూ, మూరిష్ నాగరికతల సమ్మిశ్రయంలోనూ దర్శించగలగాలి. ఈ మహత్తర ఘర్షణలో ప్రాచ్య పాశ్చాత్య సమ్మేళనం రాజకీయార్థంలో ఐరోపాకూ, కేథలిక్ ప్రపంచానికీ శాశ్వతమైన ప్రయోజనాన్ని ఏమి సాధించలేదు. వాణిజ్య మాధ్యమం ద్వారా అది క్రైస్తవ దేశాల భక్తులను వారి నిజమైన భవిష్యత్తు వైపుగా మళ్ళించింది. క్రుసేడర్ల రణరంగ దాడులు విఫలం అయినా, ఆ పోరాటం కొత్త సంస్కృతిని, భౌతికసంపదను అధిక జ్ఞానాన్ని, అపారమైన ధనాన్ని, అశాంతమైన అసాధ్యమైన లక్ష్యాన్ని అలవరిచాయి. వీటి ఫలితాలను భౌగోళికంగా, ప్రాకృతిక శాస్త్ర విజ్ఞానపరంగా 15, 16 శతాబ్దాలలో సాధించిన మహత్తర ఆవిష్కరణలలో, ప్రపంచ వ్యాప్తంగా యూరోపియన్ ఆయుధాలూ, వ్యాపారమూ అంతిమ విజయం సాధించడంలో దర్శించవచ్చు.''[34] క్రుసేడ్‌ల దీర్ఘకాలిక ఫలితాల గురించిన ఈ వర్ణన అతిశయోక్తిగా కనిపించవచ్చును గానీ, అవి యూరోపియన్లకు ఉదారవాద విద్యను అలవరచడం నిస్సందేహం, క్రైస్తవ పాలకుల రాజ్యాలు కూలిపోయిన భూభాగాల్లో వర్తకులకు శాశ్వత ఆశ్రయం కల్పించి వర్తకానికి జీవం పోయడమూ వాస్తవం.

క్రుసేడర్లకు సహాయపడినందుకు ఇటాలియన్ రిపబ్లిక్‌లకు ప్రతిఫలం కూడా బాగా ముట్టింది. అనేక సదుపాయాలు కాక, ప్రతి ఒకటి తనకంటూ ప్రత్యేకమైన ''పలుకుబడి ప్రాంతాలను'' సంపాదించుకుంది, చైనాలోని ఆధునిక ''పలుకుబడి ప్రాంతాల'' వలె వాణిజ్య కేంద్రాలపై అదుపు కోసం లెవంట్స్ వెనుక అవి అన్నీ పరస్పరం కలహించుకున్నాయి. ''సిరియాకు చెందిన ముస్లిం అంతర్ భూభాగంలో నాలుగు ప్రధాన మార్కెట్లున్నాయి, అవి అలెప్పో, డమాస్కస్, హెమ్స్ లేదా ఎమెసా, హవత్. హవత్‌కు ఆవల బాగ్దాద్ మహా వాణిజ్య కేంద్రాలు, టైగ్రిస్ రేఖను కలుపుతూ మొసుల్ **(Mosul)**, బసోరా లేదా బస్రా మార్కెట్లు ఉండగా, పశ్చిమం వైపున అంటియోక్, లావోడిసియాను అబ్బాసైడ్ కాలిఫ్ ''మహానగరం'' నుంచి ఉన్న వర్తక మార్గానికి అలెప్పో ప్రధానకేంద్రం. ఈ మార్గం... ఇరాక్, పర్షియా, ఖొరసన్ వర్తకాలను మహామార్గమని ఎద్రిసి **(Edrisi)** అన్నాడు. అలెప్పోలోని పట్టు

మార్కెట్ దానికి దూర ప్రాచ్య దేశంతో వుండిన సంబంధాన్ని నిరూపిస్తుంది. పదమూడో శతాబ్దం దాకా కూడా అనేకమంది వెనిషియన్ వర్తకులు పట్టు వ్యాపారం కోసమో, పటికారం (alum] వర్తకం కోసమో ఇక్కడ నివసిస్తున్నారు. ఏంటియోక్‌ను పట్టుకున్నప్పుడు క్రుసేడర్లకు మిరియాలు లభించడం, ప్రచారంలో వున్న కథలు ఈ మార్గం గుండా మధ్యధరాతో భారతీయ వాణిజ్యం సాగిందనడానికి సాక్ష్యాలుగా వున్నాయి. (14వ శతాబ్దం ప్రారంభంలో) పెద్ద మనిషి శాన్యుటో పురాతన కాలంలో అత్యధిక ప్రాచీన వస్తువులు ఈ దారిగుండానే రోమన్ సముద్రానికి వెళ్ళి వుండాలని చెప్పిన మాట బహుశా నిజమే.''[35] సారాసెన్ల, క్రైస్తవుల సైనిక చలనం భారతదేశానికి వున్న ఎర్రసముద్రం మార్గాన్ని ప్రభావితం చేయలేదు. అలెగ్జాండ్రియా అప్పటికే 'రెండు ప్రపంచాల మార్కెట్‌గానే' వుంది.

ప్రాచ్య దేశాల సరుకులతో ఇటాలియన్ రిపబ్లిక్కులు వాణిజ్యాన్ని ప్రారంభించాయి. ఐరోపా ఖండపు ఉత్తర ప్రాంతీయ పర్వత దళాలతో వాణిజ్యం సాగించాయి. అప్పటికి ఉత్తరం అర్ధ అనాగరిక దశలో వుండింది. బాల్టిక్‌లో వ్యాపార కార్యకలాపాలు స్వల్పంగా వుండేవి. వైకింగులు (Viking) ''సగం వర్తకులు సగం సముద్రపు దొంగలు''. ''మనకు తెలిసినంత వరకు... ఉత్తర ఐరోపా వాణిజ్య కార్యకలాపాలు రెండు ముఖ్యమైన నిర్దిష్టతలలో ఫినీషియన్ల కంటె, వారి గ్రీకు ఆద్యుల కంటె భిన్నమైనవారు. అది వాటంత సమగ్రంగా వ్యవస్థితమైనది కాదు. ఫినీషియన్లు వాణిజ్య కేంద్రాలను ప్రత్యేక స్థలాల్లో ఏర్పాటు చేశారు. అవి సుదూరంలోని మాతృ నగరానికి శాశ్వత శాఖలుగా వుండేవి. వారు హక్కులను, బాధ్యతలను గుర్తించినవారు. కానీ, పట్టణాలకూ, వలసలకూ మధ్య గుర్రాల వ్యాపారం జరిగినట్టు లేదు. వైకింగు- సాహసిగా- తన శక్తి కొలదీ భాగ్యాన్ని పెంపొందించుకుందామని ప్రయత్నించి, అవసరం దొరకగానే తానొక ఏస్టేట్ కల్పించుకున్నాడు. ఈ ఆశ్వికులకు, ఇతర ట్యూటన్ల (ఆదిమ జర్మన్లు- Teutons) కంటె పట్టణ జీవితంపై అభిరుచి అధికమే కానీ, వ్యవసాయదారులుగా వలసదారులుగా మారడానికి వారప్పటికే సంసిద్ధమై వున్నారు. తమ శక్తిని, వర్తకాన్ని పరిమితం చేసుకోలేదు''[36] క్రైస్తవంలోకి మారడానికి ముందు వైకింగులు శాంతియుత వాణిజ్యానికి పెద్ద ఉపద్రవంగా వుండేవారు. ఈ ఆశ్వికులు క్రైస్తవంలోకి మారిన తరువాత ఫ్లెమిష్ పట్టణాలలో ప్రశాంత వాణిజ్యం కనిపించ నారంభించింది. దీనికీ ఇంగ్లండ్‌లో వున్ని ఉత్పత్తులకు చాలా సంబంధం వుంది. ఇంగ్లీషు వస్త్రాలు, ఫ్లెమిష్ వస్త్రాలు పరస్పరం మారకమయ్యేవి. ఫ్లెమిష్ డీలర్లు ''ఫ్లెమిష్ హౌజ్ ఆఫ్ లండన్''గా సంఘటితమై ''స్థిర'' (Staple] పట్టణాల ద్వారా వర్తకాన్ని నియంత్రించాలని నిర్ణయించుకున్నారు. ఫ్లాండర్స్ (Flanders)కు ఆవలి జర్మన్ వర్తకాన్ని జర్మన్ హౌజ్ నియంత్రించేది. ఉత్తర జర్మనీలోని అసంఖ్యాక పట్టణాల సన్నిహిత సమాఖ్య అది. ఇది జర్మన్ హన్‌సియాటిక్ లీగ్ (German Hanseatic League) మధ్య యుగాలలో చాలా విస్తృతమైన వాణిజ్య సంస్థ. కలప తారు, ఉప్పు, ఇనుము, వెండి

ఉప్పు చేపలు, కాల్చిన చేపలు, అంబర్ (Amber), కొన్ని ముతక తయారీ ఉత్పత్తులు మొదలైనవి బాల్టిక్ దేశాల నుంచి సేకరించి, ఇటలీ నుంచి, దూర ప్రాంతాల నుంచి తెచ్చిన సరుకులతో వినిమయం చేసుకునేవారు. అలా, ఈ ఇటాలియన్ రిపబ్లిక్‌ల ద్వారా ''అరేబియా, పర్షియా, ఇండియా, తూర్పు ఇండియన్ దీవుల నుంచి చివరకు చైనా నుంచి కూడా సరుకులు మధ్య యుగాల కాలమంతా, అంతకుముందు కూడా పశ్చిమ ఐరోపాకు సుదీర్ఘమైన, కష్టతరమైన ప్రయాణం చేసేవి. ముడి పట్టు, మేలి పట్టు వస్త్రాలు, పత్తి, మేలి పత్తి వస్త్రాలు, నీలి మందు, ఇతర అద్దకపు రంగులు, సుగంధ చెక్కలు జిగురులు మత్తు పదార్థాలు, ఇతర ఔషధాలు ముత్యాలు, కెంపు, వజ్రాలు, రత్నాలు, నీలాలు, మణులు, ఇతర విలువైన రాళ్ళు, బంగారం, వెండి, అన్నిటికీ మించి మసాలా దినుసులు, మిరియాలు, అల్లం, ఏలకులు, లవంగాలు అన్నీకూడా ఆసియా నుంచే వారు పొందేవారు''[37] అలా ఆసియా, ఐరోపాల మధ్య వాణిజ్యం నిరంతర సజీవ వ్యవస్థగా ఏర్పడి వివిధ మార్గాల ద్వారా వర్ధిల్లింది.

అయితే, ఈ వ్యవస్థ ఇస్లామ్ అవతరణతో తొలుత దెబ్బతిన్నది. భూతల మార్గాల ద్వారా బండ్ల బిడారుల ద్వారా వర్తకం జరిగినప్పుడు అదెంత శ్రమతో, ప్రయాసతో కూడినదో, సారసెన్ల సైనిక సంచలనాల వల్ల దానికెంతగా ఆటంకం కలిగేదో మనం వూహించవచ్చు. ఆసియా నుంచి ఐరోపాకు నాలుగు ప్రధాన మార్గాలుండేవని, ఆ నాలుగూ సారసెన్ల ప్రాంతాలగుండా వెళ్ళేవేనని గుర్తు తెచ్చుకోవాలి. ''క్రుసేడ్ల సమయంలో, పర్షియన్ గల్ఫ్- ఎర్ర సముద్రం మార్గాలను శత్రు మహమ్మదీయ రాజ్యాలు అదుపు చేస్తున్నప్పుడు, అధిక వ్యయంతో కూడిన దారిని చుట్టూ తిరిగి వెళ్ళే మరో దారిని ఆశ్రయించవలసిన అగత్యం ఏర్పడింది. ఈ మార్గంలో భూతల రవాణా అధిక దూరం చేయవలసి వచ్చేది, సరుకులను కూడా అనేక దఫాలు ఎక్కించడం, దింపడం వుండేది. ఈ మార్గం సింధునది మీదుగా మొదలై, అక్కడినుండి బండ్ల దారిలో కొండల మీదుగా వెళ్ళి; అక్కడి నుంచి ఓక్సస్ మీదుగా కాస్పియన్ సముద్రానికి చేరేది. ఈ ప్రాచీన మార్గాన్ని వెనిస్, జెనోవా ఇప్పుడు స్వీకరించారు. కాస్పియన్ నుంచి ఆ మార్గం వోల్గా దిశగా మళ్ళీ, జరిజిన్ (Zarizan) అన్న ప్రదేశానికి వెళ్ళి, అక్కడినుంచి డాన్ (Don)కు చేరేది. అక్కడ, నదీ సాగర సంగమంలో, ఇప్పుడు అజర్ (Azar) అని పిలిచే టానా (Tana) పట్టణంలో వెనిస్‌కు, జెనోవాకు వ్యాపారాలున్నాయి. వెనిస్‌కు 12వ శతాబ్దాంతం నుంచి అక్కడ వర్తక ప్రతినిధి కూడా వుండేవాడు. తరువాత జెనోవాకు నావికా జంక్షన్‌గా క్రిమియాలోని థొడేసియా (Theodosia) వుండేది. దాన్నే ఇప్పుడు జట్టా (Jatta) అని పిలుస్తున్నారు.''[38] ఇస్లాం క్రైస్తవాన్ని అన్ని దిక్కులా అదుపు చేసింది. దక్షిణంలో వలెనే తూర్పున కూడా శిలువ పురోగమనాన్ని చంద్రవంక అడ్డుకుంది''[39] కానీ, శిలువకూ, చంద్రవంకకూ జరిగిన ఈ తీవ్ర పోరాటం వల్ల వాణిజ్యం బాగా దెబ్బతిన్నది. ''భారతీయ వర్తక మార్గాలను ఒట్టోమన్‌లు స్వాధీనం చేసుకోవడం లేదా అడ్డుకోవడం

వల్ల మధ్యధరా రిపబ్లిక్‌లకు మాత్రమే ఉపద్రవం వాటిల్లలేదు. దెబ్బ మొదట జెనోవా, వెనిస్‌లపై పడింది. కాని ఆ షాక్ ఐరోపా వాణిజ్యపు యావత్ వ్యవస్థలోకి పాకిపోయింది. ఆసియా ఉత్పత్తులు మధ్య, ఉత్తర క్రైస్తవ రాజ్యాలకు చేరిన ప్రధాన మార్గం హాన్‌సియాటిక్ లీగ్''[40] ఇటాలియన్ రిపబ్లిక్‌ల ద్వారా వచ్చే ప్రాచ్య సరుకులపై నియంత్రణ ద్వారా హాన్‌సియాటిక్ బాగా లాభపడింది. ప్రాచీన కాలం నుంచి ''జర్మనీ, ఇటలీ ఉత్తర ప్రాంతం ప్రాచ్య ఉత్పత్తుల కోసం రిపబ్లిక్ (వెనిస్)పై ఆధారపడేవి. ఎప్పుడైతే 1017 మసాలా దినుసుల (* ) ఓడలు ప్రమాదానికి గురయ్యాయో, ఆ దృష్ట ..సను ఒక (* ) రచయిత పెను దురదృష్టంగా భావించాడు''[41] ''హాన్‌సియాటిక్ వాణిజ్యానికి భారతీయ వాణిజ్యం ఒక ప్రధాన దోహదంగా వుండేది. ఎప్పుడైతే ప్రాచ్య వ్యాపారం తగ్గిపోసాగిందో దాని ఐరోపా మార్కెట్లు కూడా క్షీణించసాగాయి.''[42] పాత వర్తక మార్గాలకు ఏర్పడిన అవరోధంలోనే పశ్చిమ ఐరోపా విస్తరణ (* ) ఇమిడి వుంది. ఈ మొత్తం పరిస్థితిని -15వ శతాబ్దం అంతంలో అమెరికాను కనుగొనడం ఎందుకు జరిగిందన్న దాని గురించి చెబుతూ (* ) ప్రొఫెసర్ ఎ.ఎఫ్. పోలండ్ చక్కగా క్లుప్తంగా చెప్పారు. 1492లోనో, ఆ ప్రాంతాలలోనో కొలంబస్ అమెరికాను కనుగొన్నది టర్కులు అవరోధంగా ఉన్నందుకని చెప్పడం అసంబద్ధమైనది. ఆ ..ంటి సంబంధం అంత స్పష్టమైనది కాదు. అయితే, స్పష్టమైన సంబంధాలు ఎప్పుడూ ఉపరితల సంబంధాలుగానే వుంటాయి. కానీ, ఇది మరి ప్రగాఢమైనది. జర్మన్లకో సామెత వుంది. Dermenschest was arisst- మనిషి అంటే తాను భుజించేదే (Man is what he eats). ఇది బహుశా (* ) ప్రజల లక్ష్య ప్రకటనోకావచ్చు....

(అసంపూర్ణంగా ఉన్నట్లుంది - సం.)

## అధఃసూచికలు

1. గిబ్బన్ - డిక్లైన్ ఫాల్ ఆఫ ద రోమన్ ఎంపైర్ సంపుటి 5, పేజి 327
2. గిబ్బన్ - డిక్లైన్ ఫాల్ ఆఫ్ ద రోమన్ ఎంపైర్ సంపుటి 5, పేజి 327-8
3. గిబ్బన్ - డిక్లైన్ ఫాల్ ఆఫ్ ద రోమన్ ఎంపైర్ సంపుటి 5, పేజి 337

---

1. షెనీ Ibid P. (వ్రాతప్రతిలో ప్రస్తావించలేదు - సం.)
2. Ibid P

* (బ్రాకెట్లలో ఈ గుర్తుతో వదిలిన ఖాళీ స్థలాలు - చదవడానికి వీలు లేకుండా ఉన్న భాగాలవి లేదా అక్షరాలు చెరిగి పోయినవి.

4. గిబ్బన్ - డిక్లైన్ ఫాల్ ఆఫ్ ద రోమన్ ఎంపైర్ సంపుటి 5, పేజి 356

5. గిబ్బన్ - డిక్లైన్ ఫాల్ ఆఫ్ ద రోమన్ ఎంపైర్ సంపుటి 5, పేజి 359

6. గిబ్బన్ - డిక్లైన్ ఫాల్ ఆఫ్ ద రోమన్ ఎంపైర్ సంపుటి 5, పేజి 359

7. గిబ్బన్ - డిక్లైన్ ఫాల్ ఆఫ్ ద రోమన్ ఎంపైర్ సంపుటి 5, పేజి 400-1

8. గిబ్బన్ - డిక్లైన్ ఫాల్ ఆఫ్ ద రోమన్ ఎంపైర్ సంపుటి 5, పేజి 401

9. గిబ్బన్ - డిక్లైన్ ఫాల్ ఆఫ్ ద రోమన్ ఎంపైర్ సంపుటి 5, పేజి 493

10. కేంబ్రిడ్జ్ మిడ్డె వల్ హిస్టరీ సంపుటి II, పే 331-2

11. ఎన్సైక్లోపేడియా బ్రిటానికా, 11వ ఎడిషన్ - ''సెల్జుక్''లు

12. ఎన్సైక్లోపేడియా బ్రిటానికా, 11వ ఎడిషన్ - ''సెల్జుక్''లు

13. ఎన్సైక్లోపేడియా బ్రిటానికా 11వ ఎడిషన్, XVIII సంపుటి, పే 712 ''మంగోలులు'

14. ఎన్సైక్లోపేడియా బ్రిటానికా 11వ ఎడిషన్, XVIII సంపుటి, పే 712 ''మంగోలులు'

15. ఎన్సైక్లోపేడియా బ్రిటానికా 11వ ఎడిషన్, XXVII సంపుటి, పే 441-3

16. స్టాన్లీ లేన్ - పూలె ''టర్కీ'' (న్యూయార్క్, 1899) పే. 7

17. స్టాన్లీ లేన్ - పూలె ''టర్కీ'' (న్యూయార్క్, 1899) పే. 7

18. స్టాన్లీ లేన్ - పూలె ''టర్కీ'' (న్యూయార్క్, 1899) పేజి. 73

19. స్టాన్లీ లేన్ - పూలె ''టర్కీ'' (న్యూయార్క్, 1899) పేజి 74-75

20. స్టాన్లీ లేన్ - పూలె ''టర్కీ'' (న్యూయార్క్, 1899) పేజి 107-108

21. ఎన్సైక్లోపేడియా బ్రిటానికా, XXVII సంపుటి, పే 443

22. డబ్ల్యు. కన్నింగ్‌హామ్ ''వెస్టర్న్ సివిలైజేషన్- ఏన్షియెంట్ టైమ్స్'' పే 197-98

23. బ్రౌన్లీ అండ్ రాబిన్సన్- ''అవుట్‌లైన్స్ ఆఫ యూరోపియన్ హిస్టరీ'' I భాగం, 1914, పే. 368

24. బ్రౌన్లీ అండ్ రాబిన్సన్- ''అవుట్‌లైన్స్ ఆఫ యూరోపియన్ హిస్టరీ'' I భాగం, పే. 506

25. రేమండ్ బీజ్లీ ''ది డాన్ ఆఫ మోడర్న్ జాగ్రఫీ'' సంపుటి II

26. రేమండ్ బీజ్లీ ''ది డాన్ ఆఫ్ మోడర్న్ జాగ్రఫీ'' సంపుటి II పే. 401

27. రేమండ్ బీజ్లీ ''ది డాన్ ఆఫ్ మోడర్న్ జాగ్రఫీ'' సంపుటి II పే. 419

28. రేమండ్ బీజ్లీ ''ది డాన్ ఆఫ్ మోడర్న్ జాగ్రఫీ'' సంపుటి II పే. 427-428

29. 'నెమిసిస్ ఆఫ్ నేషన్స్'' - బైబిల్

30. బ్రాస్లీ అండ్ రాబిన్‌సన్, అవుట్‌లైన్స్ ఆఫ్ యూరోపియన్ హిస్టరీ II భాగం, పే. 407

31. బ్రాస్లీ అండ్ రాబిన్‌సన్, అవుట్‌లైన్స్ ఆఫ్ యూరోపియన్ హిస్టరీ II భాగం, పే. 407

32. బ్రాస్లీ అండ్ రాబిన్‌సన్, అవుట్‌లైన్స్ ఆఫ్ యూరోపియన్ హిస్టరీ భాగం I, పే. 471

33. బ్రాస్లీ అండ్ రాబిన్‌సన్, అవుట్‌లైన్స్ ఆఫ్ యూరోపియన్ హిస్టరీ II భాగం, పే. 408

34. బ్రాస్లీ అండ్ రాబిన్‌సన్, అవుట్‌లైన్స్ ఆఫ్ యూరోపియన్ హిస్టరీ II భాగం, పే. 395

35. బ్రాస్లీ అండ్ రాబిన్‌సన్, అవుట్‌లైన్స్ ఆఫ్ యూరోపియన్ హిస్టరీ II భాగం, పే. 441

36. విలియమ్ కన్నింగ్‌హామ్ ''వెస్టర్న్ సివిలైజేషన్'' (మోడర్న్ టైమ్స్) పే. 110

37. ఎడ్వర్డ్ స్లో పె. చెనీ; సోషల్ అండ్ ఇండస్ట్రియల్ హిస్టరీ ఆఫ్ ఇంగ్లండ్, పే. 86

38. J. of Am. O.S

39. డబ్ల్యు.ఎమ్. కన్నింగ్‌హామ్ - ''వెస్టర్న్ సివిలైజేషన్'' (మోడర్న్ టైమ్స్) పే. 130

40. డబ్ల్యు.డబ్ల్యు. హంటర్ - ఎ హిస్టరీ ఆఫ్ బ్రిటిష్ ఇండియా సంపుటి 1, పే. 52

41. బ్రీస్లీ, సంపుటి II, పే. 405

42. డబ్ల్యు.డబ్ల్యు. హంటర్, Op. Cit. Vol. I, పే. 53

అధ్యాయం III *

# బ్రిటిష్ రాచపాలన నాటికి ఇండియా

ప్రపంచంలో మరెవరి కంటె కూడా సమర్థించుకోవలసిన (డిఫెన్స్) అవసరం సామ్రాజ్యవాదానికే ఉంది. ఆ అవసరాన్ని నెరవేర్చుకోవడంలో సామ్రాజ్యవాదులు ఎన్నడూ విఫలం కాలేదు.

సామ్రాజ్యవాదం అనే అర్థం వచ్చే పదం కూడా భాషలోలేని, నగర రాజ్యాల భావనే తెలియని గ్రీకుల వలె కాకుండా - రోమన్లు సామ్రాజ్యవాదానికి సమర్థనలను రూపొందించి వారసులకు సంప్రదాయాన్ని అందించారు.

ఇతరుల కంటె తమది ఉన్నతమైన సంస్కృతి అని, తాము ఉన్నత జాతి వారమని, తమది మెరుగైన పాలనావ్యవస్థ అనీ, జీవన కళలలో తాము నిష్ణాతులమని రోమన్లు చెప్పుకున్నారు. ఇతరులది కళారహితమైన హీన సంస్కృతి అని, హీన జాతి అనీ, నియంతృత్వ పాలనావ్యవస్థ అనీ వారు ప్రకటించారు. ఈ ప్రకటనల తాత్విక పర్యవసానంగానే అట్టడుగున పడివున్న సోదరులను నాగరికతలోకి ఉద్ధరించే - అంటే వారిని జయించి మానవత పేరిట తమ సంస్కృతిని వారిపై రుద్దే - పవిత్ర బాధ్యతను తాము స్వీకరించామని రోమన్లు వాదించారు.

బ్రిటిష్ వారు కూడా భారతదేశంలో తమ సామ్రాజ్యవాద విధానాన్ని ఈ రకమైన వాదనతోనే సమర్థించుకున్నారు. భారతీయ బ్రిటిష్ చరిత్రకారుడికి ఒకరకమైన ల్యూస్ బోస్వెల్లియానా (Leues Boswelliana)- ప్రశంసా వ్యాధి వున్నది. బ్రిటిష్ వారికంటె ముందు భారతదేశాన్ని పాలించిన పాలకులలోని మంచిని కాక చెడును ఏదోరకంగా భూతద్దంలో చూడడం వారి దృష్టికి అలవడింది. మొగల్, మరాఠ పాలకులను నియంతలనీ, బందిపోట్లనీ నిందించడంలోనే కాదు, యావత్ ప్రజానీకం ఆత్మస్థైర్యాన్నీ, వారి నాగరికతనీ దెబ్బతీయడంలో కూడా వారు అత్యుత్సాహం ప్రదర్శించారు. ఇతరుల ప్రతిభా సామర్థ్యాలను తక్కువ చేయడం ద్వారా మాత్రమే తమను తాము గొప్ప చేసుకోగల వ్యక్తుల విషయంలోనూ, రాజ్యాల విషయంలోనూ కూడా ఇది సహజమైన విషయమే.

బ్రిటిష్ ఇండియా చరిత్రను రచించే చరిత్రకారులు తరచు చేసే పొరపాటు బ్రిటిష్ పాలనను, వారి తక్షణ పూర్వీకుల పాలనతోనో ప్రాచీన పాలకుల పాలతోనో పోల్చి చూడడం. చరిత్ర రచనా నియమాలకు

(* వ్రాతప్రతిలో ఇది అధ్యాయం నెం. V అధ్యాయం III, IV లేవు - సం॥)

ఇది విరుద్ధం. వారు పోల్చవలసింది భారతీయ పాలకులనూ, ఇంగ్లండ్‌లోని వారి సమకాలీన పాలకులను. ఈ పద్ధతిని పాటిస్తే చారిత్రక దోషం చాలావరకు తొలగిపోతుంది. నార్మన్ ఆక్రమణదారుల హయాంలో ఆంగ్లో శాక్సన్‌ల దుస్థితిని గుర్తుంచుకుంటే మహమ్మదీయుల ఆక్రమణలలో హిందువుల దీనస్థితి గురించి చదవడానికి ఏహ్యంగా అనిపించదు. నార్మన్ ఆక్రమణదారుల కాలంలో ''ఇంగ్లీషు వాడిగా పిలవబడడమే నిందగా వుండేది. న్యాయాన్ని నిర్వహించడానికి నియుక్తులైన వారు అన్ని రకాల అన్యాయాలకు నెలవుగా వుండేవారు. న్యాయమైన తీర్పులు చెప్పవలసిన మేజిస్ట్రేట్‌లు అందరికంటే క్రూరమైన నియంతలుగా వ్యవహరించేవారు, సాధారణ బందిపోట్లను, దొంగలను మించిన దోపిడీదారులుగా వుండేవారు... పెద్ద మనుషులందరూ ధనకాంక్షతో దహించుకుపోతూ వుండేవారు. ఏ మార్గంలో డబ్బు సంపాదించాలన్న పట్టింపు వారికి వుండేది కాదు. అరాచకం ఎంత తీవ్రంగా వుండేదంటే ఓ స్కాట్లండ్ రాకుమారి తన శీల రక్షణ కోసం మతపరమైన వేషం వేసుకోవలసి వచ్చింది.''

మహ్మదీయ క్రౌర్యం అంటూ పదేపదే చెప్పే క్రూరత్వం జెరూసలెంపై ఆక్రమణ సందర్భంగా తొలి క్రూసేడర్లు చేసిన దుష్కృత్యాల దరిదాపుకు కూడా రాదు. నలభై వేల మంది సైనికుల పటాలాన్ని '' విచక్షణారహితంగా ఊచకోత కోశారు. ధైర్యవంతులను ఆయుధం రక్షించలేదు, భయస్తులను లొంగుబాటు రక్షించలేదు, వయస్సు కానీ, స్త్రీలు కానీ కరుణకు పాత్రం కాలేదు, తల్లులను నరికిన కత్తులే పసిపాపలను కూడా పొట్టనబెట్టుకున్నాయి. జెరూసలెం వీధులన్నీ హతుల దేహాల కుప్పలతో నిండిపోయాయి. ప్రతి యింటినుంచి నిస్సహాయత వేదనల ఆర్తనాదాలు ధ్వనించాయి.

మనం కనుక భారతదేశ చరిత్రను, ఇంగ్లండ్ చరిత్రను ఆసాంతం పరిశీలిస్తూ సమకాలీన సంఘటనలను పోల్చి చూస్తే ప్రతి స్థానిక రోలండ్ (Rowland)కు లేక ఇంగ్లీషు ఆలివర్ (Oliver) కనిపిస్తాడు. కాబట్టి మనం సర్ థామస్ మన్రో హెచ్చరికను భారతదేశపు ఆంగ్ల చరిత్రకారులతో పునరుద్ఘాటించి తీరాలి. మన్రో ఇలా అన్నారు. ''మనం ఇతర దేశాలను ఇంగ్లండ్‌తో పోలుస్తున్నప్పుడు సాధారణంగా నేటి ఇంగ్లండ్ గురించి మాట్లాడుతుంటాం. 'రిఫార్మేషన్' కంటె వెనుకకు వెళ్లాలన్న ఆలోచనే రాదు. ఆ దేశాల అభివృద్ధి దశ ఒక కొలమానంలో మనతో సరిపోల్చలేనిది కావచ్చును కాక, వారి స్థాయి సమీప గతంలోనే మన కంటె అధికమైనదే అయివుండాలి. అయినాసరే, ప్రతి విదేశాన్ని అనాగరికమైనదిగా, అజ్ఞానపుదిగా భావించడానికి ఉత్సాహపడతాం. కాబట్టి, మనమిప్పుడు బ్రిటిష్ వారి కంటె ముందు భారతదేశాన్ని పాలించిన ''నిరంకుశులు, బందిపోట్లు'' వైపు దృష్టిసారిద్దాం. వారి చర్యలను వారి పాలనలో భారతీయుల స్థితిగతులను అవలోకిద్దాం.

ఈస్ట్ ఇండియా కంపెనీ హయాంలో భారత ప్రజల ఆర్థిక స్థితిగతులను సరిగ్గా మదింపు చేయడానికి ఈ పరిజ్ఞానం మనకు ఎంతో అవసరం.

ప్రాచీనకాలంలో భారతదేశపు ఆర్థిక వైభవాన్ని గురించి ఇంతకుముందే చెప్పుకున్నాం కనుక ఇక్కడ ఆ అవసరం లేదు. మహ్మదీయ ఆక్రమణలు జరిగినపుడు భారతదేశ వైభవం గురించి హిందువులలో, మహ్మదీయులలో ఏకాభిప్రాయం ఉంది. కనౌజ్ వైభవం, సోమనాథ్ దేవాలయ సంపత్తి అందుకు సాక్ష్యాలు. భారతదేశాన్ని పాలించిన ముసల్మాన్ పాలకులు అనాగరికులనీ, నిరంకుశులనీ భావించడం పొరపాటు. అంతేకాదు, వారిలో చాలామంది అసాధారణ వ్యక్తిత్వం కలిగినవారు. మహ్మద్ గజనీ ''ప్రతిభాపాటవాలు కలిగిన వారిపై ఎంతో ఔదార్యం కనబరిచాడు. అతని రాజధానిలో సమీకృతమైన సాహితీ ప్రజ్ఞ ఆసియాలో మరే చక్రవర్తి కాలంలోనూ కానరాదు. సంపదను పొందడంలో మొరటుగా వున్నా, దాన్ని ఖర్చు చేయడంలో విచక్షణకు, హుందాతనానికి అతనికి సాటిలేరు.''

అతని తరువాత వారిలోని విశిష్టులలో ఒకరు స్త్రీ (సుల్తాన్ రజియా) ఫిరోజ్‌షా పాలనదక్షుడిగా సుప్రసిద్ధుడు. అతను చేసిన ప్రజోపయోగ కార్యక్రమాలు ''నీటిపారుదల అభివృద్ధికి 50 ఆనకట్టలు, 40 మసీదులు, 30 కళాశాలలు, 100 రహదారి విశ్రాంతి గృహాలు, 30 జలాశయాలు, 100 ఆస్పత్రులు, 100 స్నానశాలలు, 150 వంతెనలు, మరెన్నో వినోదశాలలు; అన్నిటికీ మించి కర్నాల్ పర్వతాలలో యమునా నదీ ముఖం నుంచి హోవుసి, హిస్సార్ దాకా నిర్మించిన కాలువ (దాన్ని బ్రిటిష్ ప్రభుత్వం పాక్షికంగా పునరుద్ధరించింది) ఈ కాలపు చరిత్రకారులు రైతులు ఈ చక్రవర్తి పాలనలో ఆనందంగా వుండడాన్ని, వారి నివాసాల శయ్యాసనాల చక్కదనాన్ని, స్త్రీలలో విస్తృతంగా వున్న వెండి బంగారాల వాడకాన్ని విశేషంగా పేర్కొన్నారు. క్రీస్తు శకం 1420లో ఇండియాను సందర్శించిన ఇటాలియన్ యాత్రికుడు మిలోడి కోంటి (Milode Conti) అభిప్రాయంలో దేశమంతా సుభిక్షంగా ఉన్నది. గుజరాత్‌లో తాను సందర్శించిన స్థితిగతుల గురించి ఆయన గొప్పగా రాశాడు. గంగా తీరమంతటా సుందరమైన ఉద్యానాల తోటల నడుమ ఆయన పట్టణాలను చూశాడు. వెండి బంగారాలు, రత్నాలు, వజ్రాలతో సమృద్ధిగా ఉన్న మహానగరమని తాను వర్ణించిన మారజియాకు వెళ్ళే దారిలో కోంటి నాలుగు సుప్రసిద్ధ నగరాల గుండా ప్రయాణించాడు. పదహారో శతాబ్ది ప్రారంభంలో యాత్రికులుగా వచ్చిన బార్బొరా (Barbor) బార్టెమా (Bartema)ల ఉల్లేఖనలలో కోంటి వర్ణనలు సరిపోలుతున్నాయి. ముఖ్యంగా బార్బొరా కాంబే (Cambay) గురించి వర్ణిస్తూ అది దృఢంగా నిర్మితమైన నగరమని, నానా దేశాల వ్యాపారులతో కళకళలాడుతోందని, ఫ్లాండర్స్ (Flanders) వంటి కళాకారులు, తయారీదారులతో ఆ వూరు వర్థిల్లుతోందని రాశాడు. సీజర్ ఫ్రెడెరిక్ (Caesar

Frederic) కూడా గుజరాత్ గురించి ఇటువంటి వర్ణన చేశాడు. దేశమంతటా తిరుగుబాట్లు చెలరేగుతూ, అరాచకం, అణచివేత నెలకొని వున్న మహ్మద్ తుగ్లక్ హయాంలో అనేక నగరాలలో, పట్టణాలలో పర్యటించిన ఇబ్నె - బట్టుటా (Ibne Batuta) నాటి అల్లకల్లోలానికి ముందు దేశంలో వున్న వైభవ స్థితిని గొప్పగా వర్ణించాడు.

మొగల్ సామ్రాజ్య స్థాపకుడైన బాబర్ భారతదేశంలోని సంపన్న స్థితిని చూసి, ఇక్కడి జన సంఖ్యపై, సర్వత్రా అసంఖ్యాకంగా వున్న చేతివృత్తుల వారిపై ఆశ్చర్యం వ్యక్తం చేశాడు. ఆయన ఔదార్యంతో పాలించిన పాలకుడు. ఆయన చేసిన ప్రజోపయోగ కార్యక్రమాలు ఆయన రాజనీతిజ్ఞతను వెల్లడిస్తాయి. మొగలుల నుంచి కొంతకాలం పాటు సింహాసనాన్ని చేజిక్కించుకున్న షేర్‌షా కూడా బాబర్‌వలె సేక ప్రజాకార్యక్రమాలు నిర్వహించాడు. ఒక్క అక్బర్‌ను మినహాయిస్తే, షేర్‌షా మహ్మదీయ పాలకులందరిలోకి గొప్పవాడని చెప్పవచ్చు. ఇక అక్బర్ సంక్షేమ పాలన గురించి చెప్పనవసరం లేదు, అది సుప్రసిద్ధం.

''ప్రజల విషయంలో పాలకుడి వలే కంటె తండ్రివలె వ్యవహరించిన'' షాజహాన్ పాలనలో ఎంతో వైభవం విలసిల్లింది. అతని హయాం ప్రశాంతంగా గడిచింది. తర్వాతి కాలంలో మొగలుల సమకాలికులుగా పాలించిన మరాఠా పాలకుల రాజ్యంలో ప్రజల స్థితిగతుల గురించి చెబుతూ ఓ యాత్రికుడు యిలా వివరించాడు ''సూరత్ నుంచి కనుమల గుండా ప్రయాణిస్తూ మరాఠీల దేశంలో ప్రవేశించినప్పుడు, యుద్ధాలూ వేదనా తెలియని, ఏ మార్పులకూ లోనుకాని ప్రకృతి ఉన్న నిరాడంబర, ఆనందమయ స్వర్ణయుగంలోకి అడుగు పెట్టినట్టు అనిపించింది. ప్రజలు ఎంతో ఉల్లాసంగా వున్నారు, ఎంతో శక్తితో, మంచి ఆరోగ్యంతో ఉన్నారు, అవధులు లేని అతిథి ఆదరణ ఎల్లెడలా కనిపించింది. ప్రతి ద్వారము స్వాగతం పలుకుతుంది. స్నేహితులు, ఇరుగు పొరుగు, ఆగంతకులు అందరూ ఒకటే.''

టిప్పు పాలనలో దక్షిణ భారతదేశంలోని ప్రజల స్థితిగతుల గురించి ఓ యాత్రికుడు యిలా రాశాడు. ఓ పరాయి దేశంలో పర్యటిస్తున్న వ్యక్తికి సంస్కారం కలిగిన, కష్టజీవులైన జనబాహుళ్యం, కొత్తగా వెలిసిన నగరాలు, విస్తరిస్తున్న వాణిజ్యం, పెరుగుతున్న పట్టణాలు, సుఖజీవనాన్ని తెలియజేస్తున్నట్టు సర్వత్రా వృద్ధి సాక్షాత్కరిస్తే అక్కడ ప్రజాభీష్టానికి తగిన ప్రభుత్వం వున్నట్టు నిర్ధారణకు రావడం సహజం. టిప్పు రాజ్యం దృశ్యాలు అవి. ఆ ప్రభుత్వానికి సంబంధించి మా నిర్ధారణ అది. ''అతని రాజ్యమంతటా జనబాహుళ్యం, సస్యశ్యామలత్వం...'' కఠినము, నిరంకుశము అయినప్పటికీ అతని ప్రభుత్వం సమర్థుడూ నియమశీలి అయిన సార్వభౌముని నియంతృత్వం. తన భాగ్యవిధాతలైన ప్రజలను అణచివేసేందుకు కాక వృద్ధిలోకి తెచ్చేందుకు వినియోగించే నియంతృత్వం.

సాధారణంగా అతని క్రౌర్యం తాను శత్రువులుగా భావించే వారిపై ప్రదర్శించేది మాత్రమే.

బెంగాల్ 'అపారమైన సంపదల ఖని'గా క్లైవ్ వర్ణించాడు. ముసల్మాన్ నిరంకుశుడూ, మరాఠా బందిపోటు వున్నప్పటికీ తూర్పున బెంగాల్‌గార్డన్ ఆఫ్ ఈడెన్‌గా, సుసంపన్న రాజ్యంగా ఖ్యాతిగాంచింది. దాని జనాభా అమితంగా వృద్ధి చెందింది. పొర్లిపోతున్న ధాన్యాగారాల వల్ల దూర ప్రాంతాలు కూడా సుభిక్షంగా వుంటున్నాయి. అక్కడి మగ్గాలపై నేసిన సున్నితమైన వస్త్రాలను లండన్, పారిస్‌ల కులీన స్త్రీలు ధరించసాగారు.'' కానీ ఇంగ్లీషు వారి రాకతో పరిస్థితులో మార్పు ప్రారంభమైంది. వైభవం భారతదేశానికి వీడ్కోలు పలికి యూనియన్ జాక్‌ను ఆశ్రయించింది. పార్లమెంటులోనూ, ఈస్ట్ ఇండియా కంపెనీలోనూ రెండువైపులా దుష్టశక్తులు మోహరించాయి.

కంపెనీ పాలనను ఏమైనా అనవచ్చును గానీ వివేకవంతమైనదని అనలేము. అది కఠినమైనది. అది భద్రతను ఇచ్చింది కానీ సంపదను నాశనం చేసింది. పాలనా యంత్రాంగం తీరుతెన్నులు ఉత్తమమైనవడానికి ఏమాత్రం వీలులేనివి. ''వ్యాపారుల కంపెనీ'' ని ఆడమ్ స్మిత్ (Adam Smith) ఇలా అభివర్ణించాడు. ''చక్రవర్తులు అయిన తరువాత కూడా తమని తాము పాలకులుగా పరిగణించుకోగలిగిన సామర్థ్యం లేనివారు... వర్తకం అంటే మారు బేరం కోసం సరుకులను కొనుగోలు చేయడమే తమ ప్రధాన వ్యవహారమని, ఈ వర్తక స్వభావానికి పాలక స్వభావం ఓ తోక వంటిది మాత్రమేనని మూర్ఖంగా భావించారు... పాలకులుగా వారు పాలిస్తున్న దేశం ప్రయోజనాలే వారి ప్రయోజనాలు కూడా కావాలి. వర్తకులుగా వారి ప్రయోజనాలు పూర్తిగా తద్భిన్నమైనవి.''[1] ఆఖరు అధ్యాయంలో ఆడమ్ స్మిత్ ప్రొప్రయిటర్ల్లు, డైరెక్టర్ల కోర్టుల గురించి చేసిన విమర్శ కూడా చాలా విలువైనది. భారతీయ స్టాక్ ప్రయోజనాలూ, ప్రభుత్వంలో వారికి ఉన్న ఓటు కారణంగా ప్రభావితమయ్యే దేశం యొక్క ప్రయోజనాలు ఏరకంగానూ ఒకటి కావని స్మిత్ అన్నారు. ''ఆ యజమానులకు భారతీయ స్టాక్ యజమానులు కావడం వల్ల ఏర్పడే ప్రయోజనాలు తప్ప మరే ప్రయోజనాలు లేకపోతే వారి ప్రయోజనాలకూ దేశం ప్రయోజనాలకు వైరుధ్యం లేదనుకోవచ్చు. కానీ, వారికి తరచు మరింత ప్రాముఖ్యం కలిగిన ప్రయోజనాలుంటాయి. తరచూ ఓ పెద్ద మనిషిని లేదా ఓ చిరు సంపన్నుడు పదమూడు పద్నాలుగు వందల పౌండ్లు యిస్తానని ముందుకు వస్తాడు. కేవలం ప్రొప్రయిటర్ల కోర్టులో ఓ ఓటును కొనుగోలు చేయడం కోసం, తద్వారా పలుకుబడి పొందడం కోసం. అది వారికి దోపిడీ సొమ్ములో వాటా మాత్రమే కాదు, భారతదేశంలో దోపిడీదారులను నియమించే అధికారంలో కూడా వాటా ఇస్తుంది. ఆ నియామకాలు చేసేది డైరెక్టర్లే అయినప్పటికీ, వారు ప్రొప్రయిటర్ల కోర్టు ఎన్నుకోవడం మాత్రమే కాదు, కొన్నిసార్లు వారి నియామకాలను కొట్టి పారేస్తుంది కూడా. గొప్ప ధనవంతుడుగానీ, సామాన్య సంపన్నుడు కానీ ఇటువంటి పలుకుబడిని కొన్నేళ్ళపాటు పొందగలిగితే,

తద్వారా భారతదేశంలో కొన్ని పదవులకు తన మిత్రులను నియమించుకోగలుగుతారు. తన ఓటుకు ప్రాతిపదిక అయిన చిన్న పెట్టుబడిపై వచ్చే డివిడెండ్ల గురించి కానీ, ఆ పెట్టుబడి లాభనష్టాల గురించి కానీ అతను పెద్దగా ఖాతరు చేయడు. ఓటు ద్వారా వాటా పొందిన ప్రభుత్వం అధీనంలోని మహాసామ్రాజ్యం వైభవం గురించి కానీ పతనం గురించి కానీ అతను పట్టించుకోడన్న మాట. పాలితుల కష్టసుఖాల గురించీ, తమ సామ్రాజ్య మెరుగుదల, తరుగుదలల గురించీ, తమ పాలన అపకీర్తుల గురించీ కానీ ఇంతగా అలక్ష్యంతో వ్యవహరించగలగడం మరే పాలకులకూ సాధ్యంకాదు. ఇటువంటి వర్తకదార్ల కంపెనీల ప్రొప్రయిటర్లకు మాత్రమే ఇది సాధ్యం''[2]

ఇది కంపెనీ పాలనను మొత్తంగా కొట్టి పారేయడం అవుతుందేమో. తరువాతి కాలంలో అవినీతిని క్రమంగా తొలగించగలిగినా, కంపెనీ పాలన తొలి రోజుల విషయంలో ఇందులో సత్యం వుంది.

భారతదేశంలో స్థానిక, లేదా అత్యున్నత ప్రభుత్వాలలో స్థానికులకు ఏ ప్రాతినిధ్యమూ లేదు. ఉన్నతాదాయ ఉద్యోగాలు వారికి నిషేధం. చిన్నపాటి గుమస్తా స్థాయికి మించి వారికి అవకాశాలు లేవు. గవర్నర్ల, సలహాదారుల హోదాలో అధికారులు దేశ ప్రజల తరపున ఆలోచించి పెట్టారు లేదా ఆలోచించవలసి వచ్చింది. భారతదేశ ఆంతరంగిక పాలనా వ్యవస్థను ఆరకంగా రూపొందించారు మరి. వారు అక్షరాలా సర్ జాన్ బౌలీ **(Sir John Bowley)** వలే లేదా చార్లెస్ డికెన్స్ వర్ణించిన ''పేదవాడి మిత్రుడి'' తరహాలో ఇలా వ్యవహరించారు. ''నా సహచరుడా, నీ ఏకైక వ్యవహారం నాతోనే. నీ కోసం నేను ఆలోచిస్తాను, నీకేది మంచిదో నాకు తెలుసు. నేను నీనిరంతర రక్షకుడిని. సర్వ సంరక్షకుని నిర్ణయం అది... మనిషి చేయగలిగినదంతా నేను చేస్తాను, పేదవాడి మిత్రునిగా తండ్రిగా నా బాధ్యతను నేను నిర్వర్తిస్తాను. ఆ వర్గానికి అవసరమైన ఏకైక గొప్ప పాఠం- నా మీదనే పూర్తిగా ఆధారపడడంను నరనరాన ఇంకింపజేసి అతనికి జ్ఞానబోధ చేయడానికి కృషి చేస్తాను. వారికిక సొంతమైన వ్యవహారం అంటూ ఏమీలేదు.''

ఈ బౌలీలు నిస్సందేహంగా దైవ ప్రతినిధుల వలెనే ఆలోచించారు కానీ, సహజంగానే ఆ ఆలోచన ఇంగ్లండ్‌కు అనుకూలంగా, ఇండియాకు మరణ సదృశంగా నిరూపితం అయింది.

**1600** సంవత్సరానికి ముందూ తరువాతా ఇంగ్లండ్ ఆర్థికస్థితి ఎలా వుండేదో గుర్తు చేసుకుంటే ఇంగ్లండుకు ఇండియా అర్పించుకున్నదేమిటో, ఆ తరువాత ఇంగ్లండు ఎలా వర్ధిల్లి ఇండియా ఎలా క్షీణించిందో తెలుస్తుంది.

**ఇంగ్లండ్ 1455** తరువాత ఏలా అధిక సంపన్నం అయిందో తులనాత్మకంగా సర్ జోసయ చైల్డ్

(Sir Josiah Child) ఆసక్తికరంగా అభివర్ణించారు. ఆయన చెప్పిన ప్రకారం 1545లో "ఇంగ్లండ్ వర్తకం అత్యల్ప స్థాయిలో వుండేది. వర్తకులు కొద్దిమందే వుండేవారు. కుటిలంగా వుండేవారు".... "కానీ, ఇప్పుడు వేయి పౌండ్ల ఆస్తిపరుల కంటే పదివేల పౌండ్ల ఎస్టేట్‌లున్న వారి సంఖ్య ఎక్స్ఛేంజ్‌లో అధికమయింది. అనుమానం వుంటే వయసు మళ్ళిన వారిని అడగండి, అరవై సంవత్సరాల క్రితం కూతురుకు 500 పౌండ్ల వాటా నేటి రెండు వేల పౌండ్ల వాటా కంటే అధికమని పరిగణిస్తారో లేదో, నాటి కులీన స్త్రీలు తాము హోదాకు తగిన దుస్తులు ధరిస్తున్నామని భావిస్తూ వేసుకున్న సెర్జిగౌన్‌ను ధరించడానికి పనిమనిషి కూడా ఇష్టపడుతుందో లేదో, గతంలో వున్న ప్రతి బగ్గీకి ఇప్పుడు వంద బగ్గీలయ్యాయి. మన పూర్వీకులు ఇరవై ఏళ్ళలో కట్టగలిగిన పన్నును ఇపుడు సులువుగా ఒక ఏడాదిలో చెల్లించగలుగుతున్నాం. మన సుంకాలు కూడా పైన చెప్పిన దానికంటె, అధికంగా, ఆరు రెట్లు పెరిగాయి. ఈ పెరుగుదల కూడా ధరల పెరుగుదల వల్ల కాక వర్తకం పెరిగినందువల్ల అధికంగా సంభవించింది."[3] క్రీస్తు శకం 1600 నాటికల్లా వర్తక వర్గం ఎంత బలశాలి అయిందంటే, "వాణిజ్యవర్గాల వ్యతిరేకత లేకపోతే ఒకటో ఛార్లెస్ పదవీభ్రష్టుడయ్యేవాడే కాదు, వారి సహాయమే లేకపోతే రెండో ఛార్లెస్ సింహాసనం దక్కించుకోగలిగేవాడే కాదు."[4]

ఇంగ్లండ్ సౌభాగ్యానికి భారతదేశం ఎంతో దోహదం చేసింది, లేదా భారతదేశం చేత దోహదం చేయించుకున్నారనడం సబబు. సంపద వృద్ధికారకమైన వర్తకానికి ప్రాముఖ్యం ఇచ్చి తీరవలసింది. వాణిజ్య పరిస్థితులకు స్టాక్ కొటేషన్ ఒక కొలమానం. ఆ కొలమానాన్నే ఉపయోగించి ఇంగ్లండ్‌లో భారతీయ వర్తకానికి ఏపాటి విలువ వుండేదో చూద్దాం. "(18వ) శతాబ్దమంతా కంపెనీ స్టాక్ ఎప్పుడూ అధిక ధరలోనే వుండేది. 1720లో అది 450 పౌండ్ల దాకా వెళ్ళింది. కానీ 1775 నాటికి 148 పౌండ్లకు పడిపోయింది. ఈ రెండో రేటే వాస్తవ విలువకు ఎక్కువ దగ్గరగా వుంది. సరాసరి డివిడెండ్ రేటు 10 శాతం అనుకుంటే, ఇది ఉత్పత్తి వ్యయంపై 5 1/3 సాధారణ వడ్డీ రేటు శాతం మాత్రమే. 1766 వరకు ఇది పడిపోతూనే వుంది. బెంగాల్ నుంచి వచ్చే రాబడిపై లాభావకాశాల దృష్ట్యా కృత్రిమంగా ధర పెరిగి 233 పౌండ్లకు చేరుకుంది. కర్నాటకలో 86 యుద్ధం ఫలితంగా తరువాత స్టాక్ రేటు 60 శాతం పడిపోయింది. 1799 నుంచి 1788 వరకు ధర సహేతుకంగానే వుంది. 1784 నాటి సంక్షోభంలో ఒకసారి 118 పౌండ్ల 10 షిల్లింగుల అత్యల్ప దశకు చేరుకున్నా సగటున 150 పౌండ్లున్నది. పిట్స్ చట్టం (Pitt's Act) తరువాత పరిస్థితి మెరుగుపడి 1787లో 185 పౌండ్లు కోట్ అయింది. ఆ తరువాత షేరు ధరలో ఆటుపోట్లు మొత్తం మీద తగ్గిపోయినాయి. ఇప్పుడిక కంపెనీ ఓ సర్వసత్తాక పాలకురాలు, కేవలం ఓ వర్తక సంస్థ కాదు. షేర్‌హోల్డర్లకు అది మంచి వడ్డీలు చెల్లించింది. దాని లాభాల కేపిటలైజ్డ్ విలువపై ఆధారపడి దాని స్టాక్ ధర కోట్ అయింది. స్పెక్యులేషన్‌కు ఇక అవకాశం లేదు.

బ్యాలెన్స్ షీట్ తరువాత సంవత్సరాల భారతదేశం బడ్జెట్‌ను పోలి వుండింది.''[5] షేర్ హోల్డర్లకు చెల్లించిన డివిడెండ్లు కూడా ఇంగ్లండ్ సంపత్తిలో ఇండియా ప్రదానం ఎంతవుందో తెలియజేస్తాయి. ''ఆటుపోట్లకు లోనవుతున్నప్పటికీ, 1709 యూనియన్ కంటె ముందు వర్తకం ఎప్పుడూ మంచి లాభాలను చూపేది. 1682లో డివిడెండ్ శిఖరాగ్రానికి 160 శాతానికి చేరింది. కానీ, శతాబ్దాంతానికి పరిస్థితి భిన్నంగా మారింది. యూనియన్ తరువాత 1709లో అది కేవలం 8 శాతం పెరుగుదల, 1710లో 9 శాతం, మరి రెండు సంవత్సరాల తరువాత 10 శాతం ఇలా... 18వ శతాబ్దం సగటు 9 శాతం మాత్రమే. 1768 నుంచి 1771 మధ్యకాలంలో మాత్రమే సగటు రేటుకంటె అధికంగా వుంది. ఫ్రెంచి కంపెనీ నుంచి పోటీ కారణంగా 1723లో కొద్దిగా పతనం, పెట్టుబడి పెరుగుదల, స్వీడిష్ కంపెనీ ఏర్పాటుల కారణంగా 1732లో మరో 1 శాతం పతనం సంభవించాయి. 1744లో అది మళ్ళీ 8 శాతానికి ఎరిగి, ఐరోపాలోనూ కర్నాటకలోనూ యుద్ధాలు జరిగినప్పటికీ, మరో పదకొండేళ్ళపాటు ఆ రేటునే నిలుపుకుంది. ఎడతెగని సమస్యల కారణంగా 1755 చివరకు 2 శాతం పతనం ఏర్పడింది. 1760లో బర్ద్వాన్‌ను మరికొన్ని ఇతర ప్రాంతాలను వదలుకోవడం వల్ల కంపెనీ నిర్వహణా వ్యయం పెరిగిపోయింది. ఫలితంగా డివిడెండ్ 6 శాతానికి తగ్గిపోయి, లక్షా 91 వేల 644 పౌండ్లను మాత్రమే వార్షిక డివిడెండుగా పంచారు. 1767లో బెంగాల్ ప్రాదేశిక సార్వభౌమాధికారాన్ని గుర్తించిన ఫలితంగా డివిడెండ్ 10 శాతానికి పెరిగింది. షేర్ హోల్డర్లకు పంచిన మొత్తం 3 లక్షల 19 వేల 408 పౌండ్లు. ఈ పెరుగుదల చాలా నిర్హేతుకమైనది, భారతదేశ సంపత్తిని అతిగా అంచనా వేసిన ఫలితం అది. భారీ లాభాలు మున్ముందు వస్తాయన్న అంచనాతో ఆ డివిడెండ్లు ప్రకటించారు కానీ, అనుకున్నట్టు రాకపోవడంతో అధిక వడ్డీరేటుపై ఋణాలు తెచ్చి డివిడెండ్లు చెల్లించవలసి వచ్చింది. మంచి రోజులు వస్తాయన్న ఆశతో కంపెనీ అయిదు సంవత్సరాల పాటు వేచి చూసింది. కానీ చివరకు 1722లో మరో పతనం (Crash) సంభవించి డివిడెండ్లు 12 1/2% నుంచి 6%కు పడిపోయాయి. అప్పుడు లార్డ్ నార్త్ (Lord North) కల్పించుకున్నాడు. ఆ తరువాత కంపెనీ డివిడెండ్లు మంత్రిత్వ శాఖ అధీనంలోకి వెళ్ళాయి. రెగ్యులేటింగ్ యాక్ట్ వచ్చింది. ఆదాయం వృద్ధిచెందనారంభించింది. డివిడెండ్లు నెమ్మదిగా పెరగనారంభించాయి. 1792లో టిప్పుతో శాంతి ఒప్పందం వల్ల కంపెనీకి 2,40,000 పౌండ్ల ఆదాయం, 16 లక్షల పౌండ్ల నష్టపరిహారం లభించాయి. ఫలితంగా 2 శాతం పెరిగాయి. 1802లో డివిడెండ్ 11%కు చేరుకుంది.''[6] ఇదికాక ''ఈస్ట్ ఇండీస్‌తో వర్తకం చేస్తున్న యునైటెడ్ కంపెనీ ఆఫ్ మర్చెంట్స్ ఆఫ్ ఇంగ్లండ్ ఆంగ్ల ప్రజలకు వారి సదుపాయాల నిమిత్తం'', ''1798 నుంచి 1803 సంవత్సరాల మధ్య చెల్లించిన మొత్తం 2 కోట్ల 53 లక్షల 43 వేల 215 పౌండ్లు అని మాక్‌ఫెర్సన్ అంచనా వేశారు''[7] 38 లక్షల 58 వేల 666 పౌండ్ల భారాన్ని భరించి ఇండియా ఇంగ్లండ్‌కు అమెరికాతో

యుద్ధంలో సహకరించడమే కాదు, అమెరికాలో విద్యావ్యాప్తికి కూడా దోహదం చేసింది. యేల్(Yale) భారతీయ వర్తకంలో సంపాదించిన సొమ్ముతోనే యేల్ కాలేజ్‌ను నెలకొల్పాడు.

ఇండియా నుంచి ఇంగ్లండ్ పొందిన ప్రత్యక్ష పరోక్ష లాభాలను సెయింట్ జార్జ్ టక్కర్ (St. George Tucker) మాటల్లో చూడవచ్చు:-

(1) ''వివిధ కాలాలలో ఈస్ట్ ఇండియా కంపెనీ తన స్వాధీన ప్రాంతాల నుంచి ప్రాదేశిక ఋణాల వడ్డీ పోగా ఏటా పదిహేను లక్షల స్టెర్లింగుల దాకా అదనపు రాబడిని పొందింది. ఈ అదనపు రాబడి ఇండియా నుంచి ఇంగ్లండుకు అందిన ప్రత్యక్ష లాభం.''

(2) ''ప్రాదేశిక ఋణాలలో ఐదింట నాలుగు వంతులు ఐరోపా బ్రిటిష్ ప్రజలవే కాబట్టి, కంపెనీకి చెల్లించిన వడ్డీ సుమారు ఏటా 200 లక్షల స్టెర్లింగులలో అధిక భాగం ఇండియా పరోక్షంగా తన మాతృ దేశానికి (Mother Country) పంపినట్టే'' ''ఈ పరోక్ష లేదా ప్రైవేటు ప్రదానం'' సేవింగ్స్, వాణిజ్య లాభాలు మొదలైనవి కలుపుకుని ''ప్రస్తుత కాలంలో ఏటా ముప్పై లక్షల స్టెర్లింగులు'' అని టక్కర్ అంచనా. (ప్రస్తుతం అంటే సుమారు 1821)

(3) ''గ్రేట్ బ్రిటన్ నౌకా వ్యాపారంలో ఇండియన్ షిప్పింగ్ భాగం చిన్నదేమీ కాదు'' (తూర్పు సముద్రాలలో రేవుల మధ్య వర్తకానికి వినియోగించిన భారతదేశ నిర్మిత నౌకల గురించి)

(4) ''జాతీయులలో కనీసం ఒక వర్గంలో లెక్కకు మించి వున్న యోగ్యులకు తగిన పదవులు కల్పించడం కష్టమైన తరుణంలో ఇండియా స్వాధీనంలోకి రావడం మంచి సదుపాయమైంది... ఇండియన్ సర్వీసు అత్యధికులను నియమించడానికి తద్వారా వారు తమకూ, తమ దేశానికీ లాభం చేకూర్చడానికీ పనికివచ్చింది.''

ఇంగ్లండ్ సంపత్తికి భారతదేశం చేసిన ప్రదానం ఇంత మాత్రమే కాదు.

పై పరోక్ష పద్ధతులు మాత్రమే కాకుండా, ఇండియాకు హాని చేయడానికి ఇంగ్లండ్ మరిన్ని ప్రత్యక్ష పరోక్ష చర్యలను చేపట్టింది. వాణిజ్య రక్షణా చర్యల వ్యవస్థ ద్వారా దాన్ని అమలు చేసింది. భారతీయ సరుకుల విషయంలో ఇంగ్లండ్ ఇండియాతో పోటీపడే స్థితిలో లేదు. సరుకుల తయారీ దేశంగా కూడా ఇంగ్లండ్ కంటె ఇండియాదే పైచేయి. రవాణా వ్యయం అధికంగా వున్నప్పటికీ భారతీయ సరుకులు ఇంగ్లండ్ సరుకులను వారి సొంత మార్కెట్లలోనే దెబ్బతీస్తున్నందున, పోటీని నాశనం చేసేందుకు ఇంగ్లండ్ కఠినమైన రక్షణ విధానాలు చేపట్టింది.

భారతీయ సరుకులపై విధించిన సుంకాలు ఎంత అధికంగా వున్నాయో చూడండి.

భారతీయ వస్తువులకు ఎంత ఎక్కువ ధరలు నిర్ణయించారో ఈ కింది పట్టిక తెలుపుతుంది.

| | |
|---|---|
| Alocs Duty P.C. | 280 |
| ఇంగువ | 622 |
| బెంజమిన్ | 373 |
| బొరాక్స్ | 102 |
| దాల్చిన చెక్క నూనె | 400 |
| Mace జాపత్రి | 3000 |
| (జాజికాయ) Netmegs) | 250 |
| Olibanum | 400 |
| యాలకులు | 266 |
| Cassia buds | 140 |
| లవంగాలు | 240 |
| Cocolus Indicus | 1400 |
| కాఫీ | 373 |
| Cubebs | 320 |
| Dragon's Blood | 465 |
| Gamboge | 187 |
| Gum Ammomiae | 466 |
| Myrph (సాంబ్రాణి) | 187 |
| Nux Vomica | 266 |
| Cassia నూనె | 343 |
| మిరియాలు (నల్లవి) | 400 |
| మిరియాలు (తెల్లవి) | 266 |
| Rhubals (Comma) | 500 |
| బియ్యం (జావా) | 150 |
| Rum (Bensal) | 1,142 |
| Saso Pearl | 100 |
| పంచదార (బెంగాల్ తెల్ల) | 118 |
| Ditoo (Hudding White) | 128 |
| Ditoo (Lor & Brown) | 152 |

అయితే, ఇంగ్లండ్ ఈ భారీ సుంకాలతో ఆగిపోలేదు. మరో అడుగు ముందుకువేసి భారతీయ సరుకులపై అసహ్యాజనకమైన వివక్షకు పాల్పడింది. ప్రపంచంలోని ఇతర ప్రాంతాల నుంచి దిగుమతి అయ్యే అవే వస్తువులపై కంటె భారతీయ వస్తువులపై దిగుమతి సుంకాన్ని చాలా అధికంగా విధించింది. తూర్పు ఇండియన్ దేశాల నుంచి, వెస్ట్ ఇండీస్ తదితర దేశాల నుంచి వచ్చే సరుకులపై దిగుమతి సుంకాలను మే అక్లోక్ కమర్షియల్ డిక్షనరీ **(M' Aclloch's Commercial Dictionary)** పేర్కొన్నది.

| వస్తువులు | ఈస్ట్ ఇండీస్ పౌండ్లు-షిల్లింగులు-పెన్నీల | వెస్ట్ ఇండీస్ తదితర దేశాలు పౌండ్లు-షిల్లింగులు-పెన్నీలు |
|---|---|---|
| ... | | |
| చక్కెర క్వింటాల్‌కు | 1-12-0 | 1-40 |
| కాఫీ పౌనుకు | 0-0-9 | 0-0-6 |
| స్పిరిట్స్ తీపివి గ్యాలన్‌కు | 1-10-0 | 1-0-0 |
| స్పిరిట్స్ తీపివి కానివి గ్యాలన్‌కు | 0-15-0 | 0-8-6 |
| చింతపండు పౌనుకు | 0-0-6 | 0-0-2 |
| **Succades** పౌనుకు | 0-0-6 | 0-0-3 |
| పొగాకు పౌనుకు | 0-3-0 | 0-2-9 |
| కలప- 8 చదరపు అంగుళాల టేకు | 1-10-0 | 0-10-0 |
| కలప- యాడ్‌వెలోరియం, ప్రత్యేకంగా మదింపు వేయనిది | 20 శాతం | 5 శాతం |

భారతీయ సరుకులపై సుంకాల విధింపులో వివక్షచూపడమే కాదు, ఇంగ్లండ్‌లో వాటి వాడకంపై కూడా తేడా చూపించారు. 1813లో దిగువ సభలో జాన్ ర్యాంకింగ్ **(John Ranking)** ఇచ్చిన సమాధానాలను బట్టి ఇది స్పష్టమవుతుంది:

ప్రశ్న: ఈస్ట్ ఇండియా హౌస్‌లో అమ్మే వస్త్రాలపై యాడ్‌వలోరియం డ్యూటీ (సరుకుల విలువను బట్టి విధించే సుంకం) ఎంతో చెబుతారా?

జవాబు: ''కాలికోస్ (Calicoes)-సాధారణ వస్త్రాలు) అనే శ్రేణి కింద దిగుమతి సుంకం 3 పౌండ్ల 6 ఊల్లింగుల 8 పెన్సు. అయితే అవే వస్తువులను గృహ వినియోగానికి వాడితే వందకు 68 పౌండ్ల 6 షిల్లింగుల 8 పెన్సు అదనంగా సుంకం''

''మస్లిన్స్ (Muslins)-మేలి వస్త్రాలు అనే మరో శ్రేణి వుంది. ఇందులో దిగుమతి సుంకం 10 శాతం. గృహ వినియోగానికి అయితే వందకు 27 పౌండ్ల 6 షిల్లింగుల 8 పెన్సు.''

''ఇక మూడో తరగతి వుంది. రంగు వస్త్రాలు. వాటి వాడకాన్ని ఇక్కడ (ఇంగ్లండ్) నిషేధించారు. వాటిపై దిగుమతి సుంకం నూటికి 3 పౌండ్ల 6 షిల్లింగుల 8 పెన్నీలు అవి ఎగుమతుల కోసం మాత్రమే''

''ఈ పార్లమెంట్ సమావేశాలలో స్థిరీకరించిన సుంకాలపై 20 శాతం కొత్త సుంకం విధిస్తున్నారు. అప్పుడు కాలికోలపై-- గృహ వినియోగానికి నూటికి 78 పౌండ్ల 6 షిల్లింగుల 8 పెన్నీల సుంకం, మస్లిన్‌లపై గృహ వినియోగానికి అయితే 31 పౌన్ల 6 షిల్లింగుల 8 పెన్నీలు.''

ఇంతవరకు ప్రత్యక్ష, పరోక్ష పార్లమెంటరీ వసూళ్ళు. ఇక గవర్నర్ల, గవర్నర్ జనరళ్ళ వసూళ్ళు తక్కువేమీ కాదు. ఇండియాతో సంబంధం ఏర్పడేనాటికి ఐరోపా ప్రజల ఆత్మస్థైర్యం ఏ స్థాయిలో వుండేదో వర్ణించిన సర్ డబ్ల్యు.డబ్ల్యు. హంటర్ మాటలను ఇక్కడ స్మరించుకోవడం అవసరం. ''మధ్యయుగాల స్థితి నుంచి బయటపడి ఐరోపా ఆసియా పాలనలో తన మొదటి ప్రయోగం చేస్తోంది. ప్రాచ్య ప్రపంచపు దోపిడీలో వారు మధ్యయుగాల ఆక్రమణవాదులను తమపై తాము విధించుకున్నారు; భారతీయ వర్తకంలో కూడా మధ్యయుగాల వాణిజ్యం కొనసాగించారు. ఈరకమైన భావనలు పైచేయిగా వున్న దశలోనే పోర్చుగల్, స్పెయిన్, హాలండ్, ఆసియాలో తమ బలాన్ని స్థిరం చేసుకున్నారు. ఇండియాలో ఇంగ్లీషు వారి పెత్తనం ఆ తరువాత వచ్చింది. పదహారో శతాబ్దపు ఐరోపా లక్ష్యాల స్థానంలో 18వ శతాబ్దపు లక్ష్యాలను మూర్తీభవించి ప్రవేశించింది. అర్ధ-మధ్యయుగవాద క్రైస్తవానికి వ్యతిరేకంగా పుట్టిన ఆధునికత అది. అయినప్పటికీ నాటి వర్తకంలో, భారత ప్రభుత్వంలో నెలకొనివున్న సంప్రదాయాల్ని పెకలించడానికి ఇంగ్లండుకు కూడా కష్టమైంది...''[8] ''అవినీతిమయమైన, అల్పసంఖ్యాకులదైన లెజిస్లేచర్‌ను స్వార్థమే నడిపించింది, నీతి నియమాలతో సంబంధం లేని స్థాయిలోనే రాజకీయ చర్చలు జరుగుతుండేవి... అత్యంత భౌతిక ప్రయోజనాల కోసమే జనం తగవులాడుకునేవారు. మహామహా వ్యక్తుల ఆంకాక్షలను కూడా బంగారమే స్వర్శయించింది. దాని ప్రమాదకర శక్తికి ఎన్నో దృష్టాంతాలను ఇండియా నాడు భరించింది''[9]

1757లో జరిగిన ప్లాసీ యుద్ధం, 1761లో జరిగిన వందెవాష్ యుద్ధం తర్వాత బెంగాల్, మద్రాస్‌లపై ఇంగ్లీషు వారికి ఆధిపత్యాన్ని ఇచ్చాయి. ఈ విజయాలను వెంటనే వారు ఉపయోగించుకోసాగారు. ప్లాసీ విజేత క్లైవ్ నిజంగానే కింగ్ మేకర్ అయ్యాడు. మంచి బేరం కుదుర్చుకున్న నవాబుకు మద్దతు ఇవ్వనారంభించాడతను. నవాబుల నుంచీ (ఎస్టేట్) జాగీర్ నుంచి పెద్ద మొత్తాల్లో లంచాలు పుచ్చుకోవడమే కాదు, ఉప్పు గుత్త వర్తకంపై అదుపు సాధించాడు. హోమ్ అధికారుల అభీష్టానికి భిన్నంగా సివిల్ సర్వెంట్స్- బర్క్స్ (Burke's) భాషలో 'వేటాడే పక్షులు- కు కొన్ని రకాల వ్యాపారాలు చేసి స్థానికులను మినహాయించి గుత్తాధిపత్యం సాధించేందుకు పూర్తి స్వేచ్ఛను ఇచ్చాడు; దీని ఫలితంగా ప్రజలు తీవ్రమైన అణచివేతకు గురయ్యారు, పేదరికం పాల బడ్డారు.

క్లైవ్ సంపదను, ప్రజల పేదరికాన్ని మెకాలే చక్కగా వర్ణించాడు. ''తనంత తాను తృప్తిపడవలసిందే తప్ప క్లైవ్ సంపాదనకు అంతులేదు. బెంగాల్ ఖజానా అంతా అతని ముందు పరిచివుంది. భారతీయ రాజులు వాసిన నాణేలు అనేకం రాసులు పోసి వున్నాయి. కేప్ ఆఫ్ గుడ్ హోప్‌కు ఏ ఐరోపా నావా చేరకముందే వెనిస్ వర్తకులు మసాలా దినుసుల కోసం ఇతర వస్తువుల కోసం చెల్లించిన పురాతన నాణేలు కూడా వున్నాయని గుర్తించడం కష్టం. బంగారం, వెండి, రత్నాలు, వజ్రాల రాశుల మధ్య క్లైవ్ సంచరించాడు, వాటిని స్వేచ్ఛగా వాడుకునే వీలు అతనికుంది... అలా మూడు కోట్ల మంది ప్రజలు దుర్భర స్థితిలో మగ్గిపోతుండగా కలకత్తాలో అపారమైన సంపద వేగంగా పోగుపడిపోయింది. ఇంగ్లీషు వారి ఈ దుష్పరిపాలన సమాజం అసలు ఉనికికే పాసగనంత స్థాయికి చేరుకుంది. కాంపోమియా **(Compomia)** తీరంలో స్నానశాలలను, పాలరాతి ప్రసాదాలను, అంబర్ **(Amber)** పానీయాలను, పాటపిట్టల విందులను, ఖడ్గధారి సైనిక పటాలాల జిరాఫీ దళాల ప్రదర్శనకు రాజ్యాన్ని పీల్చి పిప్పి చేసిన రోమన్ గవర్నర్ కానీ; మెక్సికోలోనో, లీమాలోనో దొరికిన స్థానికుల శాపనార్థాలను అక్కడే వదిలేసి బంగారు పూతల గుర్రపు బగ్గీల, వెండి నాడాల సరుకుల గురాలతో సగర్వంగా మాడ్రిడ్‌లో ప్రవేశించిన స్పానిష్ వైస్రాయ్ కానీ క్లైవ్ ముందు దిగదుడుపే.''

బెంగాల్ ప్రజలను క్లైవ్ సర్వనాశనం చేశాడు. మొదట గవర్నర్ జనరల్ హేస్టింగ్స్ రాజులవైపు దృష్టి సారించాడు. బెనారస్ రాజాను, ఔధ్ రాణిని అతను అవమానించిన తీరు, వారినుంచి దండుకున్న పద్ధతి, రోహిల్లాస్‌లో జరిపిన మారణహోమం 18వ శతాబ్ది రాజకీయ తాత్వికుడు ఎడ్మండ్ బర్క్ **(Edmond Burke)**లో కేథలిక్ సానుభూతిని ప్రేరేపించాయి. వారెన్ హేస్టింగ్స్‌పై బర్క్ చేసిన అభిశంసన వెర్రేస్‌ను సిసిరో ఇటువంటి కారణాలపైనే చేసిన అభిశంసనను పునరావృత్తం చేసింది. బర్క్ పీడితుల పక్షాన నిలబడి జరిగిన అన్యాయాలను చక్కదిద్దాలని, దోషులను శిక్షించాలని ఎలుగెత్తాడు. బర్క్ అభిశంసన ఆయన ఎంత తీవ్రంగా ప్రయత్నించినా విఫలం అయింది. అయితే దాని ప్రభావం లేకుండా

పోలేదు. ఈ ఒక్క వైఫల్యం వంద విజయాల పెట్టు. 'లైఫ్ ఆఫ్ బర్క్' (Life of Burke)లో లార్డ్ మోర్లే (Lord Morley) ఇలా అన్నాడు: ''హేస్టింగ్స్ నిర్దోషిగా బయటపడ్డాడనేది అనవసరం. ఈ అభిశంసన తగినంత బలమైన గుణపాఠాన్నిచ్చింది. అది- ఏషియన్లకు హక్కులు, యూరోపియన్లకు బాధ్యతలు ఉన్నాయని; ఉన్నతమైన జాతి తన పాలిత జాతి విషయంలో సమకాలంలో అత్యున్నతమైన నైతిక స్థాయిని అవలంబించాలని. తన దేశస్తులకు, వారిపై ఆధారపడ్డ వారికి నడుమ సంబంధంలో గౌరవం, కరుణ, నీతి వుండాలని భావించిన వాడిగా, మొదటి అపోస్తలుడిగా బర్క్ మన చిరకాల స్మరణకు పాత్రుడు.''

ఫలితంగా, పాలనాపరమైన ప్రత్యక్ష దోపిడీ పద్ధతి మొగ్గలోనే తెగిపోయింది; కానీ, కొన్ని ఇతర పరోక్ష దోపిడీ విధానాలు ఆ ప్రభుత్వంలోనే కొనసాగాయి. ఇవి ఆంతరంగిక రవాణా సుంకాలు (Inland Transit duties) కంపెనీ ఉద్యోగులు ప్రైవేటు వర్తకుల హోదాలో ఈ సుంకాల నుంచి పూర్తి మినహాయింపు పొందేవారు కానీ, 'స్థానికుల విషయంలో మాత్రం కఠినంగా వసూలు చేసేవారు. ఫలితంగా స్థానికుల ఆర్థిక పురోగతి మరింత కుంటుబడింది.

ఈ సుంకాల గురించి హోల్ట్ మెకెంజీ (Holt Mackengie) ఇలా చెప్పారు:

''కొన్ని వస్తువులు ప్రెసిడెన్సీకి చేరేలోపు ప్రతి చిన్న చౌకీ దగ్గరా ఆగి, పది కస్టమ్స్ హవుజ్‌ల గుండా వెళ్ళవలసి వచ్చేది. పదేపదే నిలిపివేతకు గురి అయ్యేవి.''

''వసూళ్ళు, ఆలస్యాలు ఏమీ లేవనుకున్నప్పటికీ దేశ వాణిజ్య లావాదేవీలకు వ్యవస్థ తీవ్ర అవరోధంగానే వుండింది. ప్రభుత్వం విధించిన 5 లేదా 7 1/2 శాతం సుంకాన్నీ, రవాణా ఛార్జీలను, ఇతర వర్తకపు వ్యయాన్ని కలుపుకుని ధరల వ్యత్యాసాన్ని సమం చేసే తప్ప చౌకీలు విభజించిన జిల్లాల నడుమ సరుకుల వినిమయానికి అవకాశమే వుండేది కాదు. ఫలితంగా ధరల సహజ వ్యత్యాసం మరింత పెరిగింది. న్యాయంగా వినియోగం పన్నుకు వర్తించవలసిన ప్రతి సూత్రానికీ విరుద్ధంగా భారమంతా సుంకంతో నిమిత్తం లేకుండా వినియోగదారుపైనే పడింది.

''ప్రభుత్వ వసూళ్ళకు తోడు కస్టమ్ హౌజ్ ఆఫీసర్లు కూడా చేరడంతో చిన్న పెట్టుబడులతో జరిగే వర్తకాన్ని పూర్తిగా అడ్డుకోక తప్పదని అనిపించింది. ధనిక వ్యాపారి ఎంతటి వసూళ్ళనైనా భరించగలడు. ఎందుకంటే భారీ పెట్టుబడికి అది పెద్ద లెక్కలోకి రాదు. పైగా ఆ హోదా, సంపద ఇష్టమొచ్చినంత డబ్బు గుంజడం నుంచి రక్షిస్తాయి. కానీ చిన్న వ్యాపారి ఓ మోస్తరు ఫీజు కూడా లాభంలో అధిక వాటాను కబళిస్తుంది, పైగా అతని స్థాయి వల్ల అధిక వసూళ్ళ నుంచి రక్షణా లభించదు.''

''ఇప్పటిదాకా ఇంగ్లండ్‌లోని అధికారుల దృష్టీ, వర్తక సంస్థ దృష్టీ యునైటెడ్ కింగ్‌డమ్‌లోని ఉత్పత్తులకు మార్కెట్ అన్వేషణే లక్ష్యంగా ఉండింది. ఆ తరువాత వారు భారతీయ ఎగుమతులకన్నా భారతదేశ దిగుమతుల పైనే ఎక్కువ దృష్టి సారించారు. 1810 నాటి IXవ రెగ్యులేషన్ విధించిన సుంకాలు అప్పటిదాకా ఇంగ్లండ్ నుంచి వస్తున్న అనేక సరుకులకు గండికొట్టాయి. ఎగుమతులలో నీలి, పత్తి, ఉన్ని, హెంప్ ఎగుమతులను మాత్రమే స్వేచ్ఛగా అనుమతించారు. ఇది కూడా ఇంగ్లండ్ ప్రయోజనాలను దృష్టిలో వుంచుకుని చేసిందే తప్ప భారతీయ లక్ష్యాల కోసం కాదని నా అనుమానం.''

ఈ దేశీయ రవాణా సుంకాల గురించి లార్డ్ ఎలెన్‌బరో **(Lord Ellenborough)** ఏమంటాడో చదవడం ఉపయోగకరం:

''ఇంగ్లండ్‌కు చెందిన కాటన్ ఉత్పత్తులు ఇండియాకు ఎగుమతి అయితే 2 1/2 శాతం సుంకం కట్టవలసి వచ్చేది. కానీ, ఇండియాకు చెందిన కాటన్ ఉత్పత్తులపై 71/2 శాతం నూలు సుంకానికి తోడు, తయారీ వస్తువు సుంకం 21/2 శాతం, డై చేసి వుంటే మరో 2 11/2 శాతం- ఇలా మొత్తం ఇండియన్ కాటన్ సరుకులకు (ఇండియాలో వినియోగిస్తే 171/2 శాతం సుంకం చెల్లించవలసి వచ్చేది.''

''ముడి చర్మంపై 5 శాతం, దాన్ని శుద్ధి చేసిన తరువాత అయితే మరో 5 శాతం, దానితో బూట్లు, షూస్ తయారుచేస్తే మరో 5 శాతం. భారతీయ చర్మ తయారీలు భారతదేశంలో వినియోగిస్తే మొత్తం 15 శాతం సుంకం అన్నమాట.''

''మన సొంత చక్కెరపై మన వైఖరి ఎటువంటి? మన పట్టణానికి దిగుమతి చేసుకున్నందుకు 5 శాతం కస్టమ్స్, 5 శాతం టౌన్ సుంకం, తయారీ తరువాత ఆ టౌన్ నుంచి ఎగుమతి చేస్తున్నప్పుడు మరో 5 శాతం. మొత్తం 15 శాతం.'' (భారతీయ చక్కెర భారతదేశంలో వాడకానికి 15 శాతం సుంకం)

''కనీసం 235 రకాల సరుకులపై ఈ దేశీయ సుంకాలు విధించారు. వ్యక్తిగత వాడకానికో, గృహ వినియోగానికో, సుంకాల నిర్వహణకు, తనిఖీ వ్యవస్థకు అన్నిటికీ కలుపుకుని సుంకాల రేట్లు. తనిఖీ వ్యవస్థ పెద్దగా ఆదాయానికి తోడ్పడకపోగా, విసుగు కలిగించే, అవమానకర స్వభావం కలిగినది. ప్రతి కస్టమ్స్ హౌజ్ ఆఫీసర్ కనుక నిజంగా తనిఖీ అధికారాన్ని వినియోగిస్తూ పోతే ఫలితంగా జరిగే అలస్యం వల్ల అంతర్గత వాణిజ్యం ఆగిపోయి వుండేది. డబ్బు నిండడానికి తప్ప తనిఖీ అధికారాన్ని వాడేవారు కాదు.''

వీటన్నిటికీ తోడు ఇండియాలో ఒకేరకమైన కరెన్సీ లేదు. భారతీయ పరిశ్రమలను నాశనం చేయడానికి ఇవన్నీ సాధనాలు. ఫ్రెడెరిక్ లిస్ట్ ఇలా అంటాడు. భారతీయ కాటన్, సిల్క్ వస్త్రాలను ఇంగ్లండ్‌లోకి స్వేచ్ఛగా దిగుమతి జరగనిస్తే ఇంగ్లీషు కాటన్, సిల్క్ తయారీదారుల పని ముగిసిపోయేది. శ్రమ శక్తి చౌకగా లభించడం, ముడిపదార్థాల లభ్యత మాత్రమే కాదు ఇండియాకు శతాబ్దాల అనుభవం, నైపుణ్యం, ఆచరణ బలాలుగా వున్నాయి.''

భారతదేశ చరిత్రకారుడు హెచ్.హెచ్. విల్సన్ ఈ అభిప్రాయాన్నే మరింత బలంగా చెప్పాడు. 'ఇది కూడా ఓ విషాద ఉదంతం' అని అంగీకరించాడాయన.

''తనకు అన్యాయం చేసిన దేశం మీదే ఇండియా ఆధారపడవలసి వస్తోంది. ఇండియాకు చెందిన కాటన్, సిల్క్ ఉత్పత్తులు ఇంగ్లండ్ తయారీల కంటె 50 నుంచి 60 శాతం తక్కువ ధరకు బ్రిటిష్ మార్కెట్‌లో అమ్మి లాభపడేవారని (1813లో) స్పష్టంగా పేర్కొనబడింది. ఆ తరువాత బ్రిటిష్ ఉత్పత్తుల మార్కెట్ రక్షణకు 70 నుంచి 80 శాతం దాకా సుంకాలు విధించడం లేదా సానుకూల నిషేధం అవసరమైంది. అలా జరగకపోయి వుంటే, అటువంటి నిరోధ సుంకాలు, ఉత్తర్వులు లేకుండా వుంటే ప్రెస్లీ, మాంచెస్టర్ మిల్లులు మూతబడి వుండేవి, స్టీమ్ శక్తి కూడా వుంటే వాటిని నడపగలిగి వుండేది కాదు. భారతీయ తయారీల బలిదానం ద్వారా అవి సృష్టి అయ్యాయి. ఇండియా స్వతంత్ర దేశం అయివుంటే, ప్రతీకార చర్యలు తీసుకుని వుండేది. బ్రిటిష్ సరుకులపై నిరోధక సుంకాలను విధించి వుండేది, తన సొంత పరిశ్రమ నిర్మూలనకు గురికాకుండా కాపాడుకునేది. ఈ ఆత్మరక్షణా చర్య తీసుకోవడానికి భారత్‌కు అనుమతి లేదు. ఇండియా పరాయివాళ్ళ దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వుంది. బ్రిటిష్ సరుకులు సుంకాలు లేకుండా దానిపై నిర్బంధంగా రుద్దారు. రాజకీయ అన్యాయం అనే ఆయుధంతో విదేశీ ఉత్పత్తిదారు తన పోటీదారును పీకనులిమి చంపేశాడు. సమాన స్థాయిలో పోటీపడితే ఆ పోటీదారుతో విదేశీయుడు పోటీపడలేడు''. ఫలితంగా చాప్లిన్ చెప్పినట్టు ''అనేకమంది ఉత్పత్తిదారులు జీవనాధారం కోసం వ్యవసాయంలోకి మళ్ళారు, అప్పటికే కిక్కిరిసిపోయిన వ్యవసాయంలోకి వెళ్ళారు.''

ఆరకంగా భూమి రెవిన్యూ విధానం వ్యవసాయాన్నీ, ఇంగ్లండు అనుసరించిన నిరోధక వాణిజ్య రక్షణ విధానాలు పరిశ్రమలను నాశనం చేశాయి. దేశ సంపద చూసి ముసిరిన ఈగల గుంపులు ఆఖరి బొట్టుదాకా పీల్చి పిప్పి చేశాయి.

ఫలితంగా ఏర్పడిన ప్రజల దైన్యానికీ, పేదరికానికీ అంతులేదు. ఈ స్థితిని అనేకమంది యాత్రికులు గవర్నర్లు కరుణాత్మకంగా అభివర్ణించారు. 1830 ప్రాంతాలలో ఇండియాలో పర్యటించిన బిషప్

హెబర్ (Bishop Heber) యిలా రాశారు. ''ప్రస్తుత పన్నుల రేటులో భారతీయ వ్యవసాయదారుడు కానీ, యూరోపియన్ రైతు కానీ మనుగడ సాగించేడు. శాశ్వత పన్ను మదింపు లేనిచోట్ల భూమి మీద పండించిన దానిలో దాదాపు సగటున సగం దాకా ప్రభుత్వమే వసూలు చేస్తోంది. భారతీయుల ఆహార అలవాట్లు ఎంత పొదుపైనవి అయినా, వారి వ్యవసాయ పద్ధతులు ఎంతగా సహజమైనవీ చౌకవి అయినా ఇంత మొత్తం చెల్లించవలసి రావడం విషాదమే. పైగా, ఏమాత్రం మెరుగుదలకు అవకాశం యివ్వకుండా నిరోధించే పద్ధతి ఇది. పంట అనువుగా వున్న రోజులలో కూడా ఇది ప్రజలను దుర్భర దారిద్ర్యంలోనే వుంచుతుంది. పంటల పరిస్థితి ఏమాత్రం బాగా లేకున్నా వసూళ్ళ రద్దు, పంపిణీ వంటి బాధ్యతలు ప్రభుత్వంపై పడతాయి. ప్రభుత్వం ఆరకంగా ఆదుకున్నప్పటికీ స్త్రీలు, పురుషులు, పిల్లలు వీధుల్లో చావకుండా, రహదారుల శవాలతో నిండిపోకుండా ఆపలేదు. బెంగాల్‌లో భూమి అత్యంత సారవంతమైనదన్న దానితో నిమిత్తం లేకుండా అక్కడ కరువు అన్నది తెలియదు. అక్కడ శాశ్వత పన్ను అంచనా పద్ధతి వున్నది. హిందుస్తాన్‌లో (ఉత్తరాది) రాజోద్యోగులందరిలో ఉన్న అభిప్రాయం ఏమిటంటే దేశీయ రాజుల పాలనలో కంటె కంపెనీ ప్రాంతాలలోని రైతాంగం నిరుపేదరికంలో, హీనంగా, నీరసంగా ఉన్నారు. నేను కూడా కొన్ని దృష్టాంతాల వల్ల ఆ అభిప్రాయంతో ఏకీభవించవలసి వచ్చింది. ముఖ్యంగా ఇక్కడ, మద్రాస్‌లో, భూసారం బలహీనంగా ఉన్నచోట ఈ తేడా మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. వాస్తవం ఏమిటంటే, దేశీయ రాజులెవరూ మనం డిమాండ్ చేసినంత కౌలును వసూలు చేయరు. మన వ్యవస్థలోని ఉన్నత నియమ లక్షణాలను ఆమోదిస్తూనే ప్రజలపై పన్నుల భారం అధికంగా వుందని, దేశం క్రమంగా నిరుపేదరికంలోకి కుంగిపోతోందని రహస్యంగా అభిప్రాయపడని వారు చాలా కొద్దిమందే నాకు తారసపడ్డారు. ఈ అభిప్రాయంతో అధికారికంగా ఏకీభవించడానికి కలెక్టర్లు ఇష్టపడరు. నిజానికి, అప్పుడప్పుడు కొందరు సమర్థులైన కలెక్టర్లు పన్నుల రేట్లు తగ్గించి అధిక మొత్తంలో ప్రభుత్వానికి వసూళ్ళు సాధించిన ఉదంతాలున్నాయి.

అయితే మొత్తంమీద వారు పరిస్థితిని నిరాశాజనకంగా చిత్రించడానికి ఇష్టపడేవారు కాదు. అలా చిత్రిస్తే కనుక ఆ పరిస్థితికి కారణాంతమేనన్న అభిప్రాయం ఏర్పడి మద్రాస్, లేదా కలకత్తాలోని సెక్రటేరియట్‌ల నుంచి తాఖీదులందేవి. ఇంగ్లండ్‌లోని డైరెక్టర్లు మరింత డబ్బు కోసం ఎలా సీరియస్‌గా ఒత్తిడి చేస్తారో తాము కూడా అంతే సీరియస్‌గా ప్రయత్నిస్తున్నామని చెప్పేవారు.'' వర్తకం, పరిశ్రమల గురించి చెబుతూ ఆయన ఇలా అన్నారు. ''సూరత్‌లో ఇప్పటి వర్తకం నామమాత్రమే, బొంబాయి పడవలలో పంపే ముడిపత్తి తప్ప మరేమీ లేదు. తయారీ సరుకులన్నిటినీ ఇంగ్లీషువారు కారుచౌకకు అమ్మేసేవారు. ఫలితంగా దేశీయ వ్యాపారుల పరిస్థితులలో నిరాశాపూరితమైన క్షీణత ఏర్పడింది.'' ఢాకాలోని క్షీణ వ్యాపారం గురించి ఆయనే ఇలా చెప్పారు: ''గతంలో ఉన్నదాంట్లో 60వ వంతుకు

ఇక్కడి వర్తకం పడిపోయింది. ఇక్కడి మహాభవంతులు, ఫ్యాక్టరీలు, ఫ్రెంచ్, డచ్, పోర్చుగీస్ చర్చిలు అన్నీ శిథిలమైపోయాయి.''

ఈ దుస్థితి నుంచి ఉద్ధరించమని కోరుతూ స్థానికులు పార్లమెంట్‌కు పిటిషన్ పెట్టుకున్నారు. ''ఇంగ్లీషు పరిశ్రమలలోనూ, ఇతరత్రానూ పండించిన వాటిని, ఉత్పత్తి చేసిన వాటిని ఇండియాకు ఎగుమతి చేయడానికి రకరకాలుగా ప్రోత్సహిస్తున్నారు కానీ, పత్తి, వస్త్రాల ద్వారా జీవిక పొందిన భారతదేశ స్థానికులు అన్నమో రామచంద్రా అని అలమటిస్తున్నారు. అమెరికన్ ఉత్పత్తులకు, ఇంగ్లండ్ పారిశ్రామికోత్పత్తులకు అందిస్తున్న సదుపాయాల పర్యవసానం ఇది'' కానీ ఈ అభ్యర్థన బధిర శంఖారావమైంది. భారతదేశ భాగ్యవిధాతలమని చెప్పుకున్న వారి దృష్టిలో ఇంగ్లండు ప్రయోజనాలకే పెద్దపీట లభిస్తూ వచ్చింది.

ప్రజల దుస్థితికి సంబంధించిన ''నిరాశాపూరిత వాస్తవాల''ను మరుగుపరచడానికీ కంపెనీ అధికారులు చూశారన్న బిషప్ హెబర్ మాట సత్యమే అయినా, స్వతంత్రాభిప్రాయాలు కలిగిన కొందరు మాత్రం ఈ విషయం కుండబద్దలు కొట్టినట్లు చెబుతూ వచ్చారు.

1766 మే 7 నాడు కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ ఇలా రాసింది: ''నింద్యార్హమైన స్థితిగతుల గురించి మాకు తెలుసును... మన ఉద్యోగుల అవినీతి, పీడన, వలస ప్రాంతంలో అంతటా కుసంస్కారం... ఏ యుగంలోనూ, ఏ దేశంలోనూ ఏరుగనటువంటి నిరంకుశ పీడకవర్తన ద్వారా పోగుచేసిన అపారమైన సంపద.''

స్వయంగా నేరగాడయిన క్లైవ్ కూడా ఈ అణచివేతను గుర్తించాడు. 1766 సెప్టెంబర్ 8 నాడు జార్జ్ డుడ్లీ (George Dudly)కి క్లైవ్ ఇలా రాశాడు: ''చాలా ఏళ్ళుగా అజ్ఞాతంలో మగ్గిపోయిన కొన్ని చర్యల గురించి పునర్విమర్శ చేసుకుంటే; శోధించి చూస్తే,భరించలేని సత్యాలు బయటపడతాయి. మనదేశానికి మచ్చ తెచ్చిపెడతాయి. ఎన్నో పెద్ద పెద్ద గొప్ప కుటుంబాల ప్రతిష్ఠ గుట్టువిప్పి రట్టు చేస్తాయి.''

కంపెనీ దుష్టపరిపాలనగురించి సర్ థామస్ మన్రో ఆగ్రహంతో చెప్పిన మాటలు ''మన ప్రభుత్వ వ్యవస్థ ఫలితంగా యావత్ ప్రజానీకం అవమానాల పాలు అవుతున్నప్పుడు, దానికంటె మనల్ని ఈ దేశం నుంచి బహిష్కృతం కావడం వాంఛనీయం.''

మార్టిన్ తన ''ఈస్టర్న్ ఇండియా'' (1838)లో ఇలా అన్నాడు; బ్రిటిష్ ఇండియా ఎటూ నష్టపోతున్న 30 లక్షల పౌండ్లు ముప్పై సంవత్సరాలలో (సాధారణ భారతీయ రేటు ప్రకారం) 12 శాతం

చక్రవడ్డీతో 72 కోట్ల 39 లక్షల స్టెర్లింగులవుతాయి... అంతటి నష్టాన్ని ఇంగ్లండ్ కూడా భరించలేదు, త్వరలో వట్టిపోతుంది. మరి రోజుకు రెండు మూడు పెన్నీలు సంపాదించే కార్మికులున్న ఇండియాపై దాని ప్రభావం ఎంత వుంటుందో! ఇండియాలోని కోట్లాది బ్రిటీష్‌పాలితులు కేవలం వినియోగయోగ్య జనంగా **(Consumpting Population)** మార్చితే, బ్రిటీష్ పెట్టుబడికి, నైపుణ్యానికి పరిశ్రమలకు ఎటువంటి మార్కెట్ లభిస్తుంది!'' బెంగాల్ సివిల్ సర్వీస్‌కు చెందిన ఫ్రెడెరిక్ జాన్ షోర్ **(Frederick John Shore)** ఇలా ఆవేదన ప్రకటించాడు:

''ఇండియా వైభవం ముగిసింది; ఒకనాడు దాని దగ్గర ఉన్న అపార సంపద హరించుకుపోయింది, కొద్దిమంది ప్రయోజనం కోసం కోట్లాది మంది ప్రయోజనాలను బలిపెట్టిన దుష్టపరిపాలనా వ్యవస్థ దాని సర్వశక్తులనూ దిగమింగింది. ఆంగ్ల ప్రభుత్వం నెలకొల్పిన పాలనా విధానంలో దేశమూ, ప్రజలూ క్రమంగా బికారులయ్యారు... ఆంగ్ల ప్రభుత్వం కనీవినీ ఎరుగని పద్ధతిలో దేశాన్ని ప్రజలను దండుకుని దరిద్రం మిగిల్చింది...''

''తమ స్వార్థ ప్రయోజనాల నిమిత్తం భారత జాతిని అన్ని సాధ్య మార్గాలలో లోబరచుకోవడమే ఇంగ్లీషు వారి ఏకైక సూత్రం... ప్రజా సంక్షేమమే మా లక్ష్యం అయితే వేరే పద్ధతులు అనుసరించే వాళ్ళం, వేరే ఫలితాలు కూడా వచ్చేవి.''

కానీ జరిగింది అది కాదు. పైగా ఇలా కాకుండా మరో రకంగా జరిగివుంటే అసహజమయ్యేది కూడా. ఎందుకంటే మిల్ చెప్పినట్లు, ''ప్రజల సొంత ప్రభుత్వం అనే దానికి ఓ అర్థం వుంది, ఓ వాస్తవికతా వుంది; ఒక ప్రజలకు మరొకరి ప్రభుత్వం అనేది వుండదు, వుండలేదు. ఒక ప్రజ మరొక ప్రజను తమ వినియోగం కోసం, డబ్బు చేసుకోవడం కోసం నెలవు కోసం, తన సొంత ప్రజల లాభాల కోసం పనిచేసే మనుషుల మంద కోసం అట్టిపెట్టుకోవచ్చు, అది వేరు.''

రోమన్ ప్రాంతీయ పాలనా వ్యవస్థకు ప్రతిరూపమే ఈస్ట్ ఇండియా కంపెనీ పాలన. అయితే, రోమన్ సామ్రాజ్యంలో స్థానికుల స్వేచ్ఛకు పరిరక్షించారు. మెనెసెన్ **(Monesen)** ఇలా అన్నాడు: ''రోమన్ ప్రాంతీయ రాజ్యాంగ వ్యవస్థ సారాంశంలో రోమన్ గవర్నర్ చేతిలోని కేంద్రీకృతమైన సైనిక శక్తి. అయితే, పాలనా యంత్రాంగం, న్యాయాధికారం మాత్రం స్థానిక జాతులకే వుండాలని భావించారు. ఫలితంగా జాతుల స్వేచ్ఛ రూపంలో పాత రాజకీయ స్వేచ్ఛ సురక్షితంగా వుండింది.''

కానీ, బ్రిటీష్ వారు అన్నిటినీ అణచివేశారు. ''రోమన్లు తమ ప్రాంతాలను విశాల దృష్టితో, పాలితుల సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని పాలించారన్న సుప్రసిద్ధ దురభిప్రాయాలను'' వదులుకోవాలని

ఫెర్రెరో (Ferrero) పట్టుబడుతున్నారు. అలాగే మనం కూడా ఈస్ట్ ఇండియా కంపెనీ పాలన గురించి ఉదారమైన అభిప్రాయాలపై జాగ్రత్తగా వుండాలి. ఎందుకంటే 1700 సంవత్సరాల అంతరం తరువాత మానవ స్వభావంలో నైతిక పురోగతి అద్భుతంగా వుందని నిరూపించడానికి శ్రమిస్తున్న వాళ్ళు మనలో ఉన్నారు.

ఈస్ట్ ఇండియా కంపెనీ కంటె ముందున్న పరిస్థితిపై క్లుప్తంగానే చర్చించినా, మొగలుల మరాఠాల అనంతర పాలకులు నైతికంగా మెరుగైన వారేమీ కాదని, స్థానిక నిరంకుశులు బందిపోట్లు అని చెప్పబడిన వారి పాలనలోనే మహోన్నత సంస్కృతీపరులమని చెప్పుకున్న వారి పాలన కంటె దేశ ఆర్థిక స్థితి మెరుగుగా వుందని చూపడానికి ఈ మాత్రం చర్చ చాలును.

పరిశ్రమలు నాశనమై, వ్యవసాయ రంగంలో 'రద్దీ' పెరిగిపోయి, తక్కువ ఉత్పాదకతపై అధిక పన్నులు భరించలేనంత భారం పెరిగి, స్థానిక సామర్థ్యాలను ప్రదర్శించే అవకాశాలు కరువై- భారతదేశ ప్రజలు కంపెనీ పాలన నుంచి రాణీ పాలనలోకి ప్రవేశించారు.

## అధఃసూచికలు

1. ''వెల్త్ ఆఫ్ నేషన్స్'' (కేనర్స్ ఎడిషన్) సంపుటి II పేజి 136-7
2. ''వెల్త్ ఆఫ్ నేషన్స్'' (కేనర్స్ ఎడిషన్) సంపుటి II పేజి 139
3. ''డిస్కోర్స్ ఆఫ్ ట్రేడ్'' (1775) పేజీలు 8,9,10
4. టి.బి. మెకాలే ''హిస్టరీ ఆఫ్ ఇంగ్లండ్'' III అధ్యాయం.
5. ఎఫ్.పి. రాబిన్సన్ ''ఈస్ట్ ఇండియా కంపెనీ'' పేజి 161
6. ఎఫ్.పి. రాబిన్సన్ ''ఈస్ట్ ఇండియా కంపెనీ'' పేజి 159, 160, 161
7. ''యూరోపియన్ కామర్స్ విత్ ఇండియా'' (1812) అనుబంధం నెం.II
8. డబ్ల్యు.డబ్ల్యు. హంటర్, ''ఎ హిస్టరీ ఆఫ్ బ్రిటిష్ ఇండియా'' సంపుటి 1, పేజి 6
9. జి.బి. హెర్ట్జ్ ''ది ఓల్డ్ కలోనియల్ సిస్టమ్'' పే. 4

రెండో భాగం

# అస్పృశ్యులు - బ్రిటిష్ ప్రభుత్వం

# రెండో భాగం

# అస్పృశ్యులు - బ్రిటిష్ ప్రభుత్వం

బ్రిటిష్ ప్రభుత్వం అణగారిన జాతులను ఏవిధంగా నిర్లక్ష్యం చేసిందో వివరించే 123 పేజీల నివేదిక ఇది. సైన్యంలో ఈ జాతులకు ప్రవేశాన్ని కల్పించలేదు. మరాఠీలో అంబేద్కర్ జీవిత చరిత్ర రాసిన శ్రీ సి. బి. ఖైర్‌మోడ్, ఈ వ్రాతప్రతిని అంబేద్కర్ రౌండ్ టేబుల్ సమావేశాల సందర్భంగా లండన్‌లో ఉన్నపుడు రచించారు. దీని తొలి పేజీ లభ్యం కాలేదు. దొరికిన ఈ వ్రాతప్రతిని ప్రచురించడం జరిగింది- సం.)

* అమెరికా ఖండానికి చెందిన ఆయన సముద్రయానం లక్ష్యం భారత్ చేరడం. కొలంబస్ సముద్ర సాహసం హఠాత్తుగా జరిగిన సంఘటన కాదు. పోర్చుగల్ యువరాజు హెన్రీ తన 42 సంవత్సరాల పాలన (1418-1460)లో భారత్‌కు నౌకా మార్గం కనుక్కొనేందుకు ఎంతో కృషి చేశారు. అతని నుంచి కొలంబస్ ప్రేరణ పొందాడు.

పోర్చుగీసు, డచ్, ఫ్రెంచి, ఇంగ్లీషువారు తమ ఒంటరితనం నుంచి బయటపడి నేరుగా భారత్‌కు యూరప్ నుంచి జలమార్గాన్ని కనుక్కోవాల్సిన అవసరం ఏమిటి? భారత్‌లోకి ఆంగ్లేయుల వలస- ఒక్క జాతికి మాత్రమే సంబంధించిన పని కాదు. యూరోప్‌లోని అన్ని దేశాల్లోనూ భారత్‌కు ముందు చేరుకోవాలన్న తపన పోటీ హెచ్చుగా ఉండింది. పోర్చుగీసు వారు ముందు వచ్చారు కనుక మిగిలిన దేశాలు వెనుకబడ్డాయనడానికి లేదు. కేప్ ఆఫ్ గుడ్‌హోప్ కన్న భారత్‌కు మరింత దగ్గర దారి ఉందని ఇంగ్లీషు, డచ్చి వారి నమ్మకం. ఈ మార్గం కనుక్కోవడంలో మాత్రమే వారికి జాప్యం కలిగింది. ఫ్రెంచివారు చివరికి చేరుకున్నా, పోర్చుగీసు వారి తర్వాత చేరింది వారే. 1529లో వారి తొలి ప్రయాణం సుమత్రాకు సాగింది.

ఇండియా చేరాలన్న ఈ ఆసక్తికి కారణమేమిటి? పోర్చుగీసు, స్పానియార్డులు, ఇంగ్లీష్, ఫ్రెంచ్, డచ్చి వారు భారత్‌కు సముద్రయానం కనుక్కొనేందుకు శతాబ్దాల నుంచి ఎందుకు ప్రయత్నిస్తున్నారు?

---

* ఈ వ్రాతప్రతి తొలి పేజీ దొరకలేదు. ఈ వ్యాసం శీర్షిక కూడా లభించలేదు. బొంబాయి పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ స్వాధీనంలో ఉన్న ఒక పేపర్‌లోని అవుట్‌లైన్ ఆధారంగా శీర్షిక ఎంపిక చేశారు - సం॥

అక్కడ లభించే విలాస వస్తువుల కోసం. సుగంధ ద్రవ్యాలు, మిరప, లవంగాలు, ఇతర పదార్థాలు కేవలం తూర్పు ప్రాంతంలో భారత్‌లో మాత్రమే లభిస్తాయి కనుక.

కేవలం సుగంధ ద్రవ్యాల కోసమే ఈ పోటీ అంటే వింతగా తోస్తుంది. కాని యూరోప్ విస్తరణ కాంక్షకు సుగంధ ద్రవ్యాలు ప్రముఖపాత్ర వహించడం నిజం.

ప్రొఫెసర్ షెనే సేకరించిన ఈ వివరాల ప్రకారం 15, 16వ శతాబ్దాలలో యూరోపియన్లు మసాలా దినుసుల పైన ఎంతగా మనసుపడ్డారో అర్థమవుతుంది.

''మధ్యయుగాల నాటి ముఖ్యమయిన విలాస వస్తువు- సుగంధ ద్రవ్యాలు. మద్యాలు, బీరుల్లో మసాలా దినుసులు, సువాసన పదార్థాలు వేసుకునేవారు సర్ తోపె రచనల్లోనూ. ఈ ప్రస్తావన వుంది. ''రాజు గారి అతిథులను ప్రాయసార్ట్ రాజమందిరంలోకి తీసుకువెళ్ళాడు. అక్కడ మద్యం, సుగంధ ద్రవ్యాలు అమర్చి ఉన్నాయి'' 1224లో మార్సిలీన్ అమ్మాయికి వరకట్నం కింద పోకలు, అల్లం, యాలకులు మొదలైనవి వచ్చాయని పేర్కొన్నారు.

''జాన్‌బాల్ దొరలు, రైతుల తేడాలను వివరించాడు. వారికి మద్యాలు, సుగంధ ద్రవ్యాలు, మంచి బ్రెడ్ ఉంటే మాకు ఆకులు అలమలు'' అని అతను వివరించాడు. లాటినెల్ తన పాత మిత్రులకు పోకలు ఇచ్చినట్లు పేర్కొన్నారు.

మిరియాలు వీటన్నింటిలోకి ఎంతో విలువైంది. డబ్బుకన్నా విలువైన బహుమతిగా మిరియాలు ఇచ్చుకునేవారు. ''మాటిల్డా డెఫాసర్ రాజుగారి బహుమతిలో ఇది ఉంది. ఆమె భూమి 8 పౌండ్ల విలువైంది. ఒక పౌండ్ మిరియాలు మరో పౌండ్ దాల్చిన చెక్క, ఒక రేస్ పట్టు'' అని ఒక ఇంగ్లీషు సర్వేలో ఉంది. ఈ సుగంధద్రవ్యాల వాడకం, డిమాండ్ ఆశ్చర్యకరంగా వుంది. మధ్యధరా ప్రాంతం నుంచి పెద్ద పెద్ద నౌకల్లో తెచ్చి అంగడిలో అమ్మేవారు. రైన్ నుంచి వెళ్తుంటే మిరియాల సంచులను తెచ్చే వారిని జర్మనీ గజదొంగలు దోచుకునే వారు. వెనీషియన్‌లు ఈజిప్టు సుల్తాన్ నుంచి ఏటా 4,20,000 పౌండ్ల మిరియాలు కొనుక్కునేవారు. ఇండియాకు వచ్చిన తొలినౌక 210,000 పౌండ్ల మిరియాలు తీసుకుపోయింది. 1520లో పోర్చుగీసు ఒక చిన్న భారతీయ రాజు మీద 2 లక్షల పౌండ్ల మిరియాలు ఇవ్వాలని జరిమానా విధించారు. ఆనాటి వంట సాహిత్యం, వాణిజ్య సమాచారం, ధరల పట్టికల్లో ఈనాటి వలెనే సుగంధ ద్రవ్యాల ప్రస్తావన విరివిగా ఉంది''

ఆనాటి యూరోపియన్ ప్రజలకు సుగంధద్రవ్యాలు ఎందుకంత అవసరం? ఒక జవాబు- రుచి. ''ఒకే రకమయిన ఆహారం, ముతక తిండి, నైపుణ్యం లేని వంట వంటి మధ్యయుగపు లోపాలన్నీ

ఇందుకు కారణం''[1] అందరికీ 'రుచి' అవసరమయితే పేదలకు అది 'అత్యవసరం'గా మారింది. పేదలకు ఇదొక అవసరం. ప్రాచీన కాలంలో ఆహారానికి తీవ్ర కొరత ఉండేది. యంత్ర పరికరాలు లేవు కనుక ఉత్పాదకత మరీ తక్కువ. రుచి లేదన్న కారణంతో యూరోపియన్ ప్రజలు ఆహారాన్ని పారేసే స్థితిలో లేరు- వెంటనే ఉపయోగించే అవసరం లేని పదార్థాలను దాచుకోవాలి. సుగంధద్రవ్యాలు ఆహార ధాన్యాల నిలువకు ఉత్తమమయిన సంరక్షక పదార్థాలుగా ఉపయోగపడతాయి. రుచితో పాటు ఈ కారణాల వల్ల సుగంధద్రవ్యాలకు విపరీతమయిన డిమాండ్ ఏర్పడింది.

సుగంధద్రవ్యాల కోసం ఇండియాకు చేరేందుకు నేరుగా సముద్రమార్గం అవసరమని ఎందుకనుకున్నారు? గుడ్‌హోప్ కేప్ ద్వారా సముద్ర మార్గం కనుగొనడానికి ముందు భారత్‌కు మూడు భూఉపరితల మార్గాలున్నాయి- ఉత్తర, మధ్య, దక్షిణ మార్గాల ద్వారా సుగంధద్రవ్యాలు యూరప్‌కు చేరేవి.

ఉత్తర మార్గం- దూర తూర్పు- పశ్చిమ ప్రాంతాల మధ్య ఉంది. చైనాలోని కొన్ని రాజ్యాల నుంచి పశ్చిమ దిశలో గోబి ఎడారి, సైలిస్టియల్ పర్వతాల దక్షిణం, లోఫ్ చెరువు ద్వారా ఖోటాన్, యార్కాండ్, కష్గర్, సామారో, బొఖారా ప్రాచీన నగరాల నుంచి కాస్పియన్ సముద్రం దాకా ఈ మార్గం విస్తరించింది. ఈ ప్రధానమయిన ఉత్తర మార్గానికి హిమాలయాలు, హిందూకుష్ పర్వత కనుమల నుంచి యునైటెడ్ స్ట్రీమ్ దాటి వచ్చిన మార్గాలు కలిశాయి. చైనా, ఇండియా ఉత్పత్తులు ఈ మార్గాల్లో వెళ్ళేవి. చైనా గోడ, కాస్పియన్ మధ్య ఎడారులు, పర్వత మార్గాలు, మైదానాలతో 80 నుంచి నూరు రోజుల ప్రయాణం అవసరమయ్యేది. చైనాకు ఇంకా ఉత్తర దిశ నుంచి ఈ ఏడారి, పర్వతాలకు ఉత్తరంగా బాల్‌కాష్ సరస్సు ద్వారా కాస్పియన్ సముద్రానికి తూర్పున మరో సమాంతర ప్రాచీన మార్గం కూడా వుంది. ఇక్కడ మార్గాలు మళ్ళీ చీలాయి. కొన్ని నైరుతి దిశలో ప్రయాణించి కొంత దూరం తర్వాత పైన వివరించిన మధ్య మార్గాలతో కలిసిపోయి నల్ల సముద్రాన్ని చేరి, ఆ తర్వాత ఆసియా మినార్ సిరియా ద్వారా మిడిటేరినియన్‌ను చేరుతుంది. ఇతర మార్గాలు కాస్పియన్ ఉత్తర కోస్తా మీదుగా, లేదా దాటుతూ ఆస్ట్రాఖాన్‌ను చేరేవి. ఆస్ట్రాఖాన్ నుంచి బయలుదేరిన మార్గం వోల్గా. తదితర నదుల వెంట నల్ల సముద్రం మలుపుదాకా తరలి డాన్ ముఖం దగ్గర టానా సమీపంలోనో, క్రిమియాలోని కాఫా దగ్గరో కలుస్తుంది.

మధ్య మార్గం మెసొపొటోమియా, సిరియాల మీదుగా లెవంట్‌కు ఉంది. ఇండియా నుంచి నౌకలు ఆసియాటిక్ తీరం వెంట పర్షియన్ లోయకు చేరి, దిగువ యూఫ్రేట్‌కు లేదా బాల్‌దియాలో

1. షెనీ, ibid P.10

ఖరీదయిన సరుకులు అమ్ముకునేవారు. ఈ వాణిజ్య సామాగ్రి మోసే నౌకలకు గల్ఫ్‌లోని ఓర్ముజ్ నుంచి బసోరా దాకా సముద్ర తీరాన ఉన్న రేవు నగరాలు వాణిజ్య కేంద్రాలుగా ఉపయోగపడేవి. తూర్పు దిశ నుండి వచ్చే దారులు ఈ తీర నగరాల్లో నిలిచిపోయేవి. దీంతో పర్షియా రాజ్యాలకు, ఆఫ్ఘనిస్తాన్ ద్వారా ఉత్తర భారత్‌కు చేరుకునే మార్గాల సమ్మిశ్రమం ఏర్పడింది. పర్షియన్ గల్ఫ్ శిఖరం నుంచి ఈ మార్గపు శాఖ ఒకటి టిగ్రిస్ నుంచి బాగ్దాద్‌కు చేరింది. ఈ కేంద్రం నుంచి కుర్దిస్తాన్ ద్వారా టాబ్రీజ్ (పర్షియా ఉత్తర రాజధాని) నగరానికి సరుకులు పంపేవారు అక్కడినుండి పశ్చిమ దిశలో నల్ల సముద్రం లేదా లాయాస్‌కు అక్కడి నుంచి మెడిటేరేనియన్‌కు చేర్చేది. మరో శాఖ ఒంటెల వరస ద్వారా బసోరాకు దారి చేసుకుని ఆ ఎడారి వెంట పశ్చిమ దిశగా విస్తరించి సిరియన్ నగరాలు అలెప్పో, ఆంటియోక్, డిమాస్కస్‌కు చేర్చేది. అవన్నీ చివరకు మెడిటెరేనియన్ తీరాన్ని లయోడిసియా ట్రిపోలి, బీరుత్, జాఫాలకు చేరగా మరికొన్ని సరుకులు ఇంకా దూరం వెళ్లి అలెగ్జాండ్రియాకు చేరుకునేవి.

దక్షిణాది మార్గం ప్రధానంగా సముద్ర మార్గం- కొన్ని భాగాలు తప్ప. ఎర్ర సముద్రం ద్వారా సాగే ఈ మార్గంలో ఇండియా, దూర తూర్పు ప్రాంతాల ఉత్పత్తులు ఈజిప్ట్‌కు సముద్రం ద్వారా చేరవేశారు అక్కడ నుండి నైల్ ముఖ ద్వారం నుంచి యూరోప్‌కు చేరేది.

భూమార్గాలు సుదీర్ఘమయినవీ- ప్రమాదకరమయినవి. భద్రత లేకపోవడమే గాక రవాణా కష్టదాయకమయింది. వ్యయంఎక్కువ. బందిపోట్లు నిలువునా దోచుకుంటే ప్రభుత్వాలు విపరీతమయిన పన్నులు విధించేవి. రెండు భూమార్గాల్లో మధ్య దారికన్నా ఉత్తరాది దారి పైవే కాదు భయంకరమయిన ఒంటెల యాత్రతో కూడుకున్న ఈ ప్రయాణంలో తక్కువ నిలువలు మాత్రమే తీసుకుపోగలిగేవారు కనుక ఎక్కువ వృధా అయ్యేది. ఈ మధ్య మార్గం లేదా ఇండో సిరియన్ మార్గం ఎప్పుడూ తెరిచి ఉండేది కాదు. రెండుసార్లు ఇది మూసుకుపోయింది. 632-651 క్రీ.శ.ల మధ్య సారాసిన్ అరబ్బులు ఇస్లాం ప్రేరణతో దండయాత్రలు సాగించి ఇండో సిరియన్ మార్గంలో అనేక దేశాలను కబళించినప్పుడు ఒకసారి ఈ దారి మూతపడింది. 11వ శతాబ్దంలో దండయాత్రల వల్ల మరోసారి మూతపడింది. దక్షిణాది మార్గం ఎక్కువగా సముద్ర మార్గం అయినా భద్రతారహితంగానే ఉండేది. హిందూ మహాసముద్రంలోనూ ఇతర సముద్రాల్లోనూ తుఫాన్లు రావడం వల్ల తూర్పు ప్రాంతపు నౌకలు విధ్వంసమయ్యేవి. సముద్రపు బందిపోట్ల బెడద కూడా ఎక్కువ. రేవు పన్నులు, శిస్తులు అధికం''[1] కాని ప్రొఫెసర్ షెనీ ఇలా అన్నాడు ''ఇన్ని ప్రతిబంధకాలు ఉన్నప్పటికీ తూర్పుతీర ఉత్పత్తులు భారీ పరిమాణాల్లో మెడిటేరియన్‌కు చేరేవి''[2] తద్వారా యూరోపియన్ వర్తకులకు చేరేవి.

1. షెనీ, Ibid P. (వ్రాతప్రతిలో ప్రస్తావించలేదు - సం॥)  2. Ibid

ఈ భూమార్గాలున్నప్పుడు మళ్ళీ సముద్ర మార్గం ఎందుకు? జవాబు ఏమిటంటే ఆసియాలో టర్కిష్, మంగోలు సంక్షోభాలు సారాసెనిక్ సంస్కృతిని దెబ్బతీసి యూరోప్‌తో వాణిజ్యాన్ని దెబ్బతీశాయి. టర్కీలు పర్షియాపై దాడి చేసినప్పుడు 1038లో మొదటి సంక్షోభం వచ్చింది. రెండు శతాబ్దాల తర్వాత చెంఘిజ్‌ఖాన్ నాయకత్వంలో మంగోలులు ఆసియాపై దండెత్తారు. 1258లో మంగోలులు బాగ్దాద్‌ను జయించారు. 1403లో తైమూర్ సిరియాను స్వాధీనం చేసుకుంది. 1453లో కాన్‌స్టాంటినోపుల్ టర్కీల వశమైంది. టర్కీలు, మంగోలుల దండయాత్రలు రెండు భూ మార్గాలను మూసివేశాయి. కొన్నాళ్ళపాటు దక్షిణాది మార్గం ఒక్కటే నడిచింది. 1516లో ఈజిప్టును టర్కీలు జయించినపుడు అదీ మూసుకుపోయింది.

యూరోపియన్ జాతీయులను భారత్‌కు తీసుకువచ్చినవి రెండు కారణాలు. ఒకటి సుగంధ ద్రవ్యాలు. రెండోది- భూ మార్గాలను టర్కీలు, మంగోలులు మూసివేయడం. ఈ కారణాల వల్ల యూరోపియన్ దేశాలు కొత్త సముద్ర మార్గం వెతికి విజయం సాధించాయి.

తూర్పు భారత్‌లో వాణిజ్యానికి వచ్చిన యూరోపియన్లు అక్కడే ఉండి ఆ ప్రాంతాలు జయించడం మొదలుపెట్టాయి. దాంతో ఆధిక్యత కోసం పోరాటం ప్రారంభమయింది. ఇంగ్లీషు, పోర్చుగీసు, డచ్చి వారి మధ్య వాణిజ్యంలో ఆధిక్యత కోసం పోటీ మొదలైంది. ఇంగ్లీషు, పోర్చుగీసు వారి మధ్య పోరాటానికి భారత్, పర్షియన్ గల్ఫ్ వేదికలయ్యాయి. 1612లో ఇండియాపై పోరాటాల్లో బ్రిటీష్ గెలిచింది. 1622లో పర్షియన్ గల్ఫ్‌లోనూ బ్రిటిష్ గెలుపొందింది.

1622 నుంచి ఇండియా పర్షియన్ గల్ఫ్ ఆంగ్లేయులకు వాణిజ్య మార్గాలను తెరిచింది వారి వాణిజ్యంలో ఏ ప్రతిబంధకమూ లేకుండా పోయింది. మలయా ఆర్కిపెలెగో- డచ్చి, ఆంగ్లేయుల మధ్య ఘర్షణకు వేదిక అయింది. 1823లో ఈ ఘర్షణలో ఆంగ్లేయులు ఓడిపోయారు. ఆంబోయానా మానవ మారణహోమంతో ఈ యుద్ధం ముగిసిన తర్వాత మలయా ఆర్కిపెలిగో వాణిజ్యాన్ని డచ్చి వారికే వదిలేసి ఇంగ్లీషు వారు భారత్ పైన దృష్టి కేంద్రీకరిచారు. ఇంగ్లీషు-ఫ్రెంచి వాళ్ళ మధ్య యుద్ధాలకు కూడా ఇండియా వేదిక అయింది. ఇందులో రాజకీయ సామ్రాజ్యాధిపత్యం కోసం పోరాటం జరిగింది. దక్షిణ, తూర్పు ప్రాంతాల్లో ఫ్రెంచి స్థావరాలను ఏర్పాటు చేసుకుంది. దక్షిణ ప్రాంతంలో 1744లో ఘర్షణ మొదలై 1760లో ముగిసింది. వారిడివాష్‌లో జరిగిన యుద్ధంలో ఫ్రెంచివారు పూర్తిగా ఓడిపోయారు. తూర్పు భారత్‌లో 1757లో ప్లాసీలో ఒకే ఒక యుద్ధం జరిగింది. ఫ్రెంచి వారు, వారి అండ పొందిన నవాబు ఓడిపోయారు. మిగిలిన యూరోపియన్లను జయించి ఇంగ్లీషు వారు భారత్‌కు ఏకైక ఏలికలైనారు.

★★★

అయితే భారత ప్రజలు- ఈ భారత స్వాధీనాన్ని ఏవిధంగా పరిగణించారు?

★★★

ఒక కోణం నుంచి పరిశీలిస్తే బ్రిటిష్ వారి భారత విజయం ఒక అనుకోని సంఘటన. భారత గమ్యానికి బ్రిటన్ ఒక నిర్ణేత కావడం అనుకోని విషయం. ఈ అంశంపై లార్డ్ కుర్జాన్ సరిగ్గానే చెప్పాడు.

(కుర్జాన్ చెప్పిన మాటలు వ్రాతప్రతిలో లేవు- సం.)

వారు భారత ప్రజలకు చేసిందేమిటి?

ఇది చాలా పెద్ద ప్రశ్న. ఎందరో ఈ ప్రశ్నకు విస్తారమైన సమాధానం చెప్పారు. ఇంకా ఏదో చెప్పడం అనవసరం. ఈ ప్రశ్న పరిధిని తగ్గించి బ్రిటిష్ వారు అస్పృశ్యులకు ఏం చేశారు? అని మాత్రం నేను ప్రశ్నిస్తాను. బ్రిటిష్‌వారు పాలకులైనపుడు అస్పృశ్యులను సముద్ధరించడానికి చేసిందేమిటి? విభిన్న కోణాల్లో ఈ ప్రశ్నను పరిశీలించాలి. పబ్లిక్ సర్వీస్, విద్య, సాంఘిక సంస్కరణల కోణం నుంచి జవాబు చెప్తాను.

భారతదేశంలోని ప్రభుత్వోద్యోగాలలో అస్పృశ్యులకు సముచిత ప్రాతినిధ్యం కల్పించడానికి బ్రిటిష్ ప్రభుత్వం ఏం చేసింది?

మొదట సైన్యం విషయం తీసుకొంటాను. అస్పృశ్యులకు పట్టిన గతిని సమగ్రంగా అర్థం చేసుకోవాలంటే భారతదేశాన్ని బ్రిటిషు వాళ్ళు జయించడానికి వీలు కలిగించేదేది అని తరచి చూడడం అవసరం.

భారతదేశంపై బ్రిటిష్ వారి విజయం ఒక అసాధారణ సంఘటన. ఇందుకు రెండు కారణాలు చెప్పుకోవాలి.

పదిహేనవ శతాబ్దాంతం నాటికి హఠాత్తుగా యూరప్ దేశాల పాలబడిన దేశాలు మూడు తరగతుల కిందికి వస్తాయి. వాస్కోడగామా కనిపెట్టిన దేశాలు ఒక తరగతికి చెందినవి. అవి పురాతనమైనవి; విస్తృతమైనవి; సువ్యవస్థిత రాజ్యపాలన కలిగినవి. కొలంబస్ కనిపెట్టిన దేశాలు రెండో తరగతి కిందికి వస్తాయి. అవి తక్కువ జనాభా కలిగిన దేశాలు. అక్కడ రాజ్య వ్యవస్థ ప్రాథమిక దశలో వుంది. ఇక మూడో తరగతికి చెందిన దేశాలు బొత్తిగా జనసంచారం లేని బయళ్ళు. ఇండియా మొదటి తరగతి

కిందికి వస్తుంది. భారతదేశం పరాక్రాంతం కావడం ఒక అసాధారణ సంఘటన అని చెప్పాల్సి రావడానికి ఇదొక కారణం.

రెండో కారణమేమంటే ఇండియా పరుల హస్తగతమైన నాటి కాలం. అది ఎప్పుడు జరిగింది? 1757-1818 సంవత్సరాల మధ్య ఇండియాను విదేశీయులు జయించారు.

1757లో తూర్పిండియా కంపెనీ సైన్యానికి- బెంగాల్ నవాబు సిరాజ్ ఉద్దౌలా సేనలకు మధ్య యుద్ధం జరిగింది. బ్రిటిష్ సైన్యం విజయం సాధించింది. ప్లాసీ యుద్ధంగా చరిత్ర ప్రసిద్ధమైంది అదే. ఆ యుద్ధపర్యవసానంగానే బ్రిటీషువాళ్ళు మొట్టమొదటిసారి భారత భూభాగాన్ని కైవసం చేసుకోగలిగారు. భారత భూభాగంపై సంపూర్ణ విజయాన్ని సాధించిపెట్టిన ఆఖరి యుద్ధం 1818లో జరిగింది. దాన్నే కోరేగావ్ యుద్ధం అంటారు. మరాఠా సామ్రాజ్యాన్ని తుదముట్టించి దాని స్థానంలో బ్రిటిష్ సామ్రాజ్యాన్ని నెలకొల్పిన యుద్ధం అదే. ఆవిధంగా భారతదేశాన్ని బ్రిటిష్ వాళ్ళు 1757-1818 సంవత్సరాల మధ్య పూర్తిగా జయించారు. అదే కాలంలో యూరప్‌లోని స్థితిగతులేమిటి? ఇంగ్లీషు ప్రజలు ( ఆంగ్లేయులు) ఆనాడు ఏ స్థితిలో ఉన్నారు? యూరప్ మహాగందరగోళంగా ఉన్న కాలం అది. నెపోలియన్ యుద్ధాలు యూరపును ఊపేసిన కాలం అది. వాటిల్లో 1815లో జరిగిన వాటర్లూ యుద్ధం చిట్టచివరది. ఈ యుద్ధాల్లో ఇంగ్లాండుది వట్టి ప్రేక్షక పాత్ర కాదు; నిండా మునిగి తేలింది. మొత్తం యూరప్ దేశాలకు సారథ్యం వహించింది; నెపోలియన్‌ను, ఫ్రెంచి విప్లవాన్ని తుత్తునియలు చేయడానికి వాటితో కూటమిని ఏర్పాటు చేసింది. ఆ ఘోర పోరాటంలో ఇంగ్లాండుకు స్వీయభద్రత కోసం ప్రతి పైసా, ప్రతి మనిషి, ఎక్కడెక్కడి ఓడా, ప్రతి ఒక్క తుపాకీ అవసరమయ్యాయి. సొంత గడ్డకు సుదూరంగా వేరే రణ క్షేత్రంలో పోరు సాగిస్తున్న తూర్పిండియా కంపెనీకి ఆ కారణంగా ఏమాత్రం తోడ్పాటు అందివ్వలేకపోయింది. అందివ్వలేకపోవడమే కాదు, యూరప్ యుద్ధ క్షేత్రంలో నెపోలియన్ పైన సాగిస్తున్న పోరాటానికిగాను తూర్పిండియా కంపెనీ నుంచే ఇంగ్లాండు అంగ, అర్థబలాన్ని ఓడల్ని అరువు తెచ్చుకొంది. యూరప్‌లోని యుద్ధాలకు మద్దతుగా ఇంగ్లాండుకు తూర్పిండియా కంపెనీ ఏ మేరకు సహాయపడాల్సి వచ్చిందో మాక్ ఫర్సన్ ఇచ్చిన వివరాలు చూస్తే బోధపడుతుంది.

యూరప్‌లో నెపోలియన్‌తో ఇంగ్లాండు భీషణ సంగ్రామంలో పూర్తిగా నిమగ్నమైపోయి తూర్పిండియా కంపెనీకి ఏమాత్రం సాయపడలేని స్థితిలో ఉన్న అటువంటి సమయంలో ఇండియాను వారు జయించారు. కాబట్టే ఇండియాపై ఆ విజయం అసాధారణ సంఘటన. ఈ అసాధారణ సంఘటన ఎలా సాధ్యమైంది? కారణం ఏమని చెప్పాలి?

అందుకు మెకాలే వివరణ ఇచ్చాడు.

ఇంగ్లాండు ప్రజలంతా నమ్మే వివరణ అది; నమ్మగోరే వివరణ కూడా. అది ఎంతోకాలం పాటు చలామణీ కావడం బట్టి ఇంగ్లీషు వాళ్ళ మనస్సులనే కాదు, సమస్త ఐరోపా, అమెరికా ప్రజల మనస్సులనూ ఆకట్టుకొంది. ఇంగ్లీషు జాతి యువతరం మనస్సుల్లో ఆ అభిప్రాయం నాటుకొనే లాగా ప్రయత్నం జరిగిందనేది నిజం. అది అర్థం చేసుకోదగిందే. ఒక సామ్రాజ్యవాదజాతితో ఆధిక్య భావన అనేది ముఖ్యమైన మౌలికాంశం. కాబట్టి మెకాలే వివరణ అనన్యంగా ఆ అధిక్య భావాన్ని ఉప్పొంగించింది.

కాని, మెకాలే అభిప్రాయం సరయిందేనా? చారిత్రక వాస్తవాలు ఆ అభిప్రాయాన్ని బలపరుస్తాయా? ఈ విషయాన్ని మెకాలే కన్నా ఇంకా వాస్తవికమైన దృక్పథంతో అధ్యయనం చేసిన ప్రొఫెసర్ సీలీ ఇలా అంటారు;

''కంపెనీ ఆధిపత్యాన్ని నిర్ణయాత్మకంగా నిరూపించిన ఆర్కాట్, ప్లాసీ, బక్సర్ లాంటి తొలి య ద్ధాల్లో కంపెనీ వైపున యూరోపియన్ల కన్నా స్వదేశీ సిపాయిలే ఎక్కువగా ఉన్నట్టు ప్రతిసారీ కన్పిస్తుంది. ఇంకా పరిశీలిస్తూ పోతే, సిపాయీలు యుద్ధంలో సమర్థంగా పోరాడలేదని గాని లేదా ఇంగ్లీషు సైనికులే యావత్ యుద్ధ భారం వహించారని గాని వినపడదు. జాత్యాడంబరమంటే పడిచచ్చిపోయే చరిత్రకారుల బాల్య చాపల్యం గురించి వ్యాఖ్యానించిన వాళ్ళెవరూ కూడా ఆ యుద్ధాన్ని వర్ణించడంలో మన ఇంగ్లీషు రచయితలకు సిపాయిల విషయంలో సూక్ష్మ పరిశీలన కొరవడటం గమనించి ఆశ్చర్యపోరు. క్లైవు పైన మెకాలే వ్యాసం చదవండి. 'సామ్రాజ్యాభిమాన ప్రజానీకం', 'సత్వవంత సముద్ర వరప్రసాదులు వగైరా సమాసాల పుట్ట! క్లైవును ఆయన ఇంగ్లీషు గణాల్ని ప్రతిఘటించగల వాళ్ళు లేరు' ఇత్యాది పొగడ్తలూ ఇంకెన్నో. కాని ఇంగ్లీషు సైనికుల కన్నా స్వదేశీ సిపాయీలే లెక్కకు మిక్కిలిగా ఉన్నారనీ, సైనికపరంగా సామర్థ్యంలో వాళ్లు ఇంగ్లీషు వారికి దీటుగా ఉన్నారనీ ఒక్కసారి ఒప్పుకొంటే పరాక్రమంలో ఇంగ్లీషు సైనికుల సహజసిద్ధమైన ఆధిక్యం కారణంగానే మనకు విజయం సిద్ధించిందనే వాదం నేలమట్టమైపోతుంది. మన సైన్యంలోని ఒక్కొక్కరు శత్రుసైన్యంలోని పదిమంది పెట్టు అయిన ఆ యుద్ధాల్లో ఒక్కొక్క ఇంగ్లీషు సైనికుడు పదిమంది స్వదేశీ సిపాయీలతో సమానం అని మనం అనవచ్చు. మరి సిపాయీల విషయంలోనూ మనం అదే మాట అనాల్సి వుంటుంది. అంటే ఈ ఇద్దరి మధ్య నిస్సందేహంగా తేడా ఉన్నప్పటికీ అది క్రమశిక్షణలో, సైనిక శాస్త్రంలో తేడా అయినట్లుగా జాతి భేదం బట్టి కాదు. అయితే చాలా సందర్భాల్లో నాయకత్వం విషయంలో తేడా ఉండడం నిస్సందేహం.

భారతదేశంపై బ్రిటిష్ విజయానికి వివరణ ఇస్తూ మిల్ రాసింది పరిశీలించండి. 'భారతదేశాన్ని జయించడానికి కనిపెట్టిన ముఖ్యాంశాలు రెండున్నాయి. ఒకటి- యూరోపియన్ క్రమశిక్షణ ముందు

నిలబడలేని స్వదేశీ సైన్యాల బలహీనత; రెండు- ఇంగ్లీషు వారి కొలువులో చేరిన స్వదేశీ సిపాయీలకు యూరోపియన్ క్రమశిక్షణను అలవర్చడం.'' 'ఈ రెండు ముఖ్యాంశాల్ని కనిపెట్టింది ఫ్రెంచివారు' అని కూడా మిల్ రాశారు.

ఇంగ్లీషు సైనికు[illegible]దేశీ సిపాయీలకన్నా మెరుగ్గా పోరాడారని, ఆ ఉభయులూ కలిసి సాధించిన ఘనవిజయాల్లో ఇంగ్లీషు సైనికులు తమకు దక్కాల్సిన దానికన్నా ఎక్కువ వాటాను కొట్టేశారని ఒప్పుకోవాల్సి వచ్చినప్పటికీ భారతదేశంలోని జాతులను ఇంగ్లీషు జాతి జయించినట్లుగా చెప్పడం వాస్తవం కాదు. ఇండియాలోని రాజ్యాలను జయించిన సైన్యాల్లో కేవలం అయిదోవంతు మాత్రమే బ్రిటిష్ వారున్నారు. ఈ విజయాల్లో మన వాటా ఎక్కువ అని అతిశయోక్తిగా చెప్పుకుంటున్నాం. కాని ఆ విజయం పట్ల మనకు తప్పుడు అవగాహన, తప్పుడు వివరణ ఉన్నాయి. సైన్యంలో నాలుగు వంతులు ఎవరు? ఇండియాలోని సంస్థానాల సైనికులే. కనుక భారత్‌ను విదేశీయులే జయించారనడం కష్టం. అంతః శత్రువుల చేతనే భారత్ పరాజయమయింది.''[1]

ప్రొఫెసర్ సీలీ ఇచ్చిన వివరణ చాలావరకు వాస్తవం. బ్రిటిష్ వారు భారతీయ సైనికుల సాయంతో భారత్‌ను జయించారు. ఈ అంశాన్ని నిర్లక్ష్యం చేయకపోవడం భారత్‌కు, బ్రిటిష్‌కూ కూడా మంచిది. విదేశీయుల సైన్యంలో చేరిన ఈ భారతీయులెవరు? ఆ ప్రశ్నను ప్రొ. సీలీ వేయలేదు. కాని అది చాలా అవసరమైన ప్రశ్న. ఈస్టిండియా కంపెనీ సేనలో చేరి బ్రిటిష్- ఇండియాను జయించేందుకు ఉపయోగపడిన వారెవరు? దీనికి ఎంతో అధ్యయనం తరువాత నేనిచ్చే జవాబు- ఈస్టిండియా కంపెనీలో చేరిన సైనికులు భారతదేశపు అస్పృశ్యులు. క్లైవ్‌తో కలిసి ప్లాసీ యుద్ధంలో పోరాడిన వారు దుసాద్‌లు. దుసాద్‌లు అస్పృశ్యులు. కోరే- [illegible]లో బ్రిటిష్ వారితో కలిసి పోరాడినవారు మహర్‌లు; మహర్‌లు అస్పృశ్యులు. కనుక తొలి, చివ[illegible] యుద్ధాల్లో ఆంగ్లేయులకు అండగా నిలిబడి బ్రిటిష్ ఆక్రమణను సంపూర్ణం చేసిన వారు అస్పృశ్యులు. భారత సైన్య పునర్నిర్మాణంపై నివేదిక ఇవ్వడానికి 1859లో నియమితమయిన పీల్ కమిషన్‌కు ట్వీడిల్ డాల్ మార్క్యెస్ రాసిన 'నోట్'లో ఈ నిజాన్ని అంగీకరించారు. ఆయన ఇలా అన్నాడు-

(ఆవిధంగా అన్న మాటలు వ్రాతప్రతిలో లేవు- సం)

అస్పృశ్యులు బ్రిటిష్ వారితో కలిసి పోరాడటాన్ని తీవ్రమైన ద్రోహంగా ఎందరో పరిగణిస్తారు. ఇది ద్రోహమో కాదో గాని అస్పృశ్యుల ఈ చర్య సహజమయింది. స్వదేశీయుల చేత అణచివేత చర్యల

1. సీలీ, Expansion of England P. 200-202

నుంచి విముక్తం కావాలన్న ఆశతో శత్రువుతో ఒక వర్గం ప్రజలు కలిసి పోరాడిన ఉదాహరణలు చరిత్రలో ఎన్నో ఉన్నాయి. అస్పృశ్యులను నిందించే వారు ఇంగ్లీషు లేబరింగ్ క్లాసెస్ వారు (17లో) విడుదల చేసిన మానిఫెస్టో చదవాలి (అసంపూర్ణంగా వదిలేశారు. వ్రాతప్రతిలో లేవు - సం)

అస్పృశ్యుల ప్రవర్తన ఒకేరకంగా ఉందా? ఇంగ్లీషు కార్మికులు సాగిస్తున్న దుర్భర జీవితం కన్నా అస్పృశ్యులది దారుణమయిన బ్రతుకు. ఇంగ్లీషు కార్మికులకు విదేశీ సైన్యాన్ని ఆహ్వానించేందుకు ఒక్క కారణం ఉంటే అస్పృశ్యులకు వంద కారణాలు ఉన్నాయి.

బ్రిటిష్ వారి విజయానికే కాదు వారు నిలదొక్కుకోవడానికి కూడా అస్పృశ్యులు దోహదం చేశారు. 1857లో సైనిక తిరుగుబాటు బ్రిటిష్ పాలనను అంతమొందించే చర్య. బ్రిటిష్ వారిని తరిమికొట్టి భారత్‌ను తిరిగి జయించే ప్రయత్నం. సైన్యంలో బెంగాల్ సైనికులు ఈ తిరుగుబాటుకు నాయకత్వం వహించారు.[1] బొంబాయి సైన్యం, మద్రాస్ సైన్యం బ్రిటిష్ వారికి విధేయులుగా ఉండి తిరుగుబాటును అణచివేశారు. బొంబాయి, మద్రాస్ సైన్యంలో ఎవరున్నారు? వారు ఎక్కువగా అస్పృశ్యులు. బొంబాయిలో మహర్‌లు, మద్రాస్‌లో పరియాలు. కనుక భారత్‌ను జయించడానికే కాక నిలదొక్కుకోవడానికి కూడా అస్పృశ్యులు సహకరించారనడం నిజం.

మరి బ్రిటిష్ వారు అస్పృశ్యులతో సైన్యంలో ఏవిధంగా ప్రవర్తించారు? 1890లో బ్రిటిష్ ప్రభుత్వం అస్పృశ్యులు భారత సైన్యంలో చేరకుండా నిషేధం విధించింది. ఫలితంగా ఇదివరకే సైన్యంలో చేరిన అస్పృశ్యులు మాత్రం మిగిలిపోయారు. వారిని తొలగించకపోవడం బ్రిటిష్ వారి దయ. కాని రానురాను వారు చనిపోవడం పెన్షన్‌పై తొలగిపోవడంతో 1910 నాటికి అస్పృశ్యులు సైన్యంలో లేకుండాపోయారు. సైన్యం నుంచి అస్పృశ్యులు తొలగింపుకన్నా కృతఘ్నత మరొకటి ఉండదు.

ద్రోహం, విశ్వాసఘాతుకమయిన ఈ చర్యకు బ్రిటిష్‌వారు ఎందుకు పాల్పడ్డారు? సైన్యంలో అస్పృశ్యుల నిషేధానికి వారు ఏ కారణమూ చూపలేదు. 1890లో సైనికుల సామర్థ్యం కోసం ఈ విధాన నిర్ణయం తీసుకున్నారే కాని మరే ఉద్దేశం లేదని ఆ తర్వాత అనడం వినిపించింది. కాని అది నిజమేనా? పునర్ వ్యవస్థీకరణ నియామకాల ఆధారంగా ఈ పాలసీ రూపొందించారు.

రెజిమెంట్‌లో అన్ని వర్ణాలు కలిసి ఉండాలన్న పాత విధానం కన్నా కొన్ని వర్గాల ప్రాధాన్యం

1. బెంగాల్ ప్రభుత్వ అధీనంలో వుంది కనుక 'బెంగాల్ సైన్యం' అన్నారే కానీ బెంగాలీ వారు ఉన్నారు అని కాదు. ఇందులో నిజానికి బెంగాలీయులు లేనే లేరు. ఇతర సైనికులే ఉన్నారు.

ఉండాలనే వ్యవస్థా సూత్రాన్ని 1890లో ప్రవేశపెట్టారు. క్లాస్ రెజిమెంట్, లేదా క్లాస్ స్క్వాడ్రన్, కంపెనీ విధానం ఆధారంగా ఇండియన్ ఆర్మీ వ్యవస్థీకరించాలని కొత్త సూత్రం. అంటే ఒకే క్లాస్ లేదా కులం వారితో రెజిమెంట్ రూపొందించడం. తర్వాత ప్రతి స్క్వాడ్రన్, కంపెనీని ఒకే వర్గంతో తయారుచేయడం. పాత విధానం ఏమిటంటే జాతి మతం తేడా లేకుండా సమర్థులను తీసుకోవడం. కాని రెండో సూత్రం ప్రకారం భౌతిక సమర్థత, తెలివి- కన్నా 'జాతి' ప్రధాన లక్షణం. సైనిక నియామకాల కోసం భారతీయులను కులాలు, మతాల ప్రాతిపదికన కావాలని విభజించారు. క్షత్రియ వంశాలు క్షత్రియేతర వంశాలుగా విభజించి క్షత్రియేతర వంశాలను సైన్యం నుంచి పూర్తిగా తొలగించారు. క్షత్రియ వర్గంలోని కులాల వారిని మతాల వారినే సైన్యంలో చేర్చుకునేవారు.

ఈ సూత్రాలను అంగీకరించడం చాలా కష్టం. సైన్యంలో వర్గ స్వరూపాన్ని రక్షించే ఈ సూత్రం వెనుక "కొంత మేరకు రాజకీయ కారణాలున్నాయి. 1857 తిరుగుబాటులో వలె బ్రిటిష్‌కు వ్యతిరేకంగా సంకీర్ణ వర్గాలు ఏర్పడకుండా నిరోధించడమే కారణం. ఇదివరకటి మిశ్రమ రెజిమెంట్ పద్ధతే మంచిదని నా ఆలోచన"[1] ఈ సూత్రం మంచిదే అనుకున్నా అస్పృశ్యులను నిరోధించే అవసరమేమిటి? కుల ప్రాతిపదికన ఏర్పాటయిన విధానంలో సిక్కు, డోగ్రా, గూర్ఖా, రాజపుత్ర రెజిమెంట్‌లు ఉన్నపుడు అస్పృశ్యుల రెజిమెంట్ ఎందుకు ఉండకూడదు. క్షత్రియవర్గం నుంచే సైనికులను ఎంచుకోవాలన్న సూత్రాన్ని ఆమోదించినా అది అస్పృశ్యులకు ఎందుకు నష్టం కలిగించాలి. వారినెందుకు క్షత్రియేతర వర్గంలో చేర్చాలి. 150 సంవత్సరాల నుంచి భారతీయ సైన్యంలో వెన్నెముకగా నిలిచిన అస్పృశ్యులను క్షత్రియేతర వర్గంగా ఎందుకు పరిగణించాలి? అస్పృశ్యులు క్షత్రియేతర వర్గానికి చెందబోరని బ్రిటిష్ వారు భావించారనడానికి గ్రేట్ వార్‌లో అస్పృశ్యులపై నిషేధాన్ని ఎత్తివేసి ఒక బటాలియన్‌ను రూపొందించారు. దీన్ని 'మహర్'లు అని పిలిచేవారు. వారి సామర్థ్యాన్ని (------)* వంటి మహనీయుడు కూడా ప్రశంసించాడు. అవసరం తీరిన తర్వాత బటాలియన్‌ను రద్దు చేశారు అస్పృశ్యులు నిరసించారు. సర్ ...... ఈ విధంగా అన్నాడు. (ఆ కొటేషన్ వ్రాతప్రతిలో లేదు - సం.)

ఈ ధృవీకరణ తర్వాత అస్పృశ్యులు క్షత్రియేతర వర్గానికి చెందుతారని ఎవరంటారు?

కనుక అస్పృశ్యులను సైన్యం నుంచి తొలగించడానికి పైన చెప్పిన రెండు కారణాలు తప్పు అని తేలిపోయింది. వారి అసలు కారణం ఏమిటి? నా అభిప్రాయం ప్రకారం- వారు అస్పృశ్యులు కావడమే

1. 'With Indians in France' లో జనరల్ విల్‌కాక్స్ అభిప్రాయాన్ని కూడా చదవండి. వ్రాతప్రతిలో పేజినెంబర్ లేదు.

* (వ్రాతప్రతిలో ఖాళీగా వదిలారు - సం॥)

అసలు కారణం. అస్పృశ్యుల ప్రవేశం వారికి సమస్యలు సృష్టించనంత కాలం వారిని రమ్మంటారు. బ్రిటిష్ చరిత్ర తొలి రోజుల్లో స్పృశ్యులు బ్రిటిష్ సైన్యంలో లేరు కనుక అస్పృశ్యుల వల్ల వారికి ఏ సమస్యా లేదు. భారతీయ పాలకులు ఉన్నంతకాలం స్పృశ్యులు బ్రిటిష్ సైన్యానికి దూరమే. సైనిక తిరుగుబాటు వైఫల్యం తర్వాత భారతీయ పాలకులు వణికిపోయారు. హిందువులు బ్రిటిష్ సైన్యంలో చేరడం మొదలయింది. అప్పటికే బ్రిటిష్ సైన్యం అస్పృశ్యులతో నిండింది. స్పృశ్యులు, అస్పృశ్యులు, బ్రిటిష్ వారి మధ్య 'సర్దుబాటు' సమస్య తలెత్తింది. న్యాయం-సౌకర్యం మధ్య విభేదం తలెత్తినపుడు సౌకర్యానికే బ్రిటిష్ వారు ప్రాధాన్యం ఇచ్చారు. కనుక అస్పృశ్యులను అన్యాయంగా కృతజ్ఞతారహితంగా సైన్యం నుంచి వెడలగొట్టారు.

ఈ బహిష్కరణకు కారణాలు ఏవైనా కానీ, న్యాయాన్యాయాలు ఏవైనా కానీ, ఈ బహిష్కరణ దుష్ప్రభావం అస్పృశ్యుల సాంఘిక జీవన స్థితిగతుల మీద తీవ్రంగా పడింది. అస్పృశ్యులకు మిలిటరీ సర్వీసు ఒక్కటే కొంత సంపాదన ఇవ్వగలిగే వృత్తి. అస్పృశ్యులు ఈ రంగంలో ప్రతిభావంతమయిన సేవలు చేసి జమాదార్, సుభేదార్, సుభేదార్‌మేజర్‌లుగా ఎదిగారు. మిలిటరీ వృత్తి వల్ల అస్పృశ్యులకు హిందువుల దృష్టిలో తగినంత ప్రాధాన్యం, విలువ, గౌరవం కలిగాయి. తద్వారా అధికారం, హోదా, పరువు ఉన్న పదవులు పొందే అవకాశాలు ఏర్పడ్డాయి. 150 సంవత్సరాల పాటు సైన్యంలో పనిచేసి అది వారసత్వ వృత్తిగా భావించి, ఇతర వృత్తులకు అనర్హత ఆపాదించుకున్నారు. అప్పుడు 1890లో సైన్యానికి మీరు పనికిరారు అని వారికి చెప్పారు. వారికి కొత్త పరిస్థితులలో సర్దుకునే అవకాశం కూడా ఇవ్వలేదు- 1935లో ఆంగ్లో-ఇండియన్‌లకు జరిగినట్టే. ఆ విధంగా మిలిటరీ సర్వీసులు మూతపడగానే అస్పృశ్యులు అనుకోని ప్రహారానికి దిగ్భ్రాంతికి గురై, తేరుకోలేకపోయారు. వారు ఎంతో ఎత్తునుంచి- ఎంతో లోతుల్లోకి ఎంతంటే- పాత సంస్థాన ప్రభుత్వాల పాలనలో కూడా లేనంత దిగువ స్థాయికి విసిరి వేయబడ్డారు.

మిలిటరీ సర్వీసులలో ప్రవేశానికి ఇంత కథ జరిగింది. సివిల్ సర్వీసులలో వారి ప్రవేశం సంగతేమిటి?

సివిల్ సర్వీసులో చేరేటపుడే పై చదువులు చదివి ఉండాలి. యూనివర్శిటీ డిగ్రీలున్నవారికే ప్రవేశించే ఆశలుంటాయి. ఇండియా జనాభాలో చదువురాని అసంఖ్యాకుల్లో అస్పృశ్యులే ఎక్కువ. సివిల్ సర్వీసులు వారికి వచ్చే అవకాశాలు దాదాపు మృగ్యమే. ఇటీవలే అస్పృశ్యులలో కొందరికీ యూనివర్శిటీ డిగ్రీలు దక్కాయి. వారిగతి ఏమిటి? వారు ఇంటింటికీ తిరిగి బిచ్చమెత్తుకుంటున్నారంటే అతిశయోక్తి కాదు. వారు సివిల్ సర్వీసులో చేరడానికి రెండు అంశాలు అడ్డొస్తున్నాయి. బ్రిటిష్

ప్రభుత్వం వారికి ఏ ప్రాధాన్యతా ఇవ్వలేదు. సివిల్ సర్వీసుల్లో సరిగ్గా ప్రాతినిధ్యం లేని కులాలకు ప్రాధాన్యత ఇవ్వాలన్న సూత్రాన్ని బ్రిటిష్ ప్రభుత్వం గుర్తించలేదని కాదు. ఉదాహరణకు బ్రిటిష్ ప్రభుత్వం కనీస అర్హతలున్న మహ్మదీయులకు ప్రాధాన్యం ఇవ్వాలని గుర్తించింది. అంతేకాదు ఈ సూత్రాన్ని అమలు చేసిందనడానికి ఐ.సి.ఎస్‌లో ఖాళీలను పూరించాలని నిర్ణయించిన సంవత్సరం నుంచే మహ్మదీయుల ఎంపిక మొదలయింది.

కనీస అర్హతలు కలిగిన వారెందరో ఉన్నా బ్రిటిష్ ప్రభుత్వం అస్పృశ్యులలో ఒక్కరిని కూడా నియమించలేదు.

అస్పృశ్యులకు సివిల్ సర్వీసుల్లో స్థానం లభించకపోవడానికి మరో కారణం రిక్రూట్‌మెంట్ విధానం. బ్రిటిష్ ప్రభుత్వంలో శాఖాధిపతికి నియమించే అధికారం ఇచ్చారు. ఈ శాఖాధిపతులు అగ్రవర్ణాల హిందువులు. అగ్రవర్ణపు హిందువు సహజంగానే అస్పృశ్యుడైన అభ్యర్థికి అనుకూలంగా స్పందించే అవకాశమే లేదు. అతనికి గాఢమయిన రాగద్వేషాలుంటాయి. మొదట అతని కుటుంబం, తర్వాత అతని స్నేహితులు, అటు తర్వాత తన కులంలోని వ్యక్తులు అతనికి ప్రధానం. అతని విస్తారమయిన మిత్రకోటిలో తగిన అభ్యర్థి దొరకడం సులువే.[1] చాలా అరుదుగా అతను తన కులానికి చెందని వారిపై దృష్టి సారిస్తాడు. స్పృశ్యుడైన హిందువు ఎవరూ పోటీలేని పక్షంలోనే అస్పృశ్యుడి పేరు పరిశీలిస్తారు. ఎవరైనా స్పృశ్యుడి పోటీ ఉంటే అస్పృశ్యుడికి అవకాశమే ఉండదు. కనుక సివిల్ సర్వీసుల్లో అస్పృశ్యుడికి చిట్టచివరి పరిశీలనే. కనుక అతని నియామక అవకాశాలు మరీ తక్కువ.

అస్పృశ్యుల కోసం రెండు సర్వీసులు ఉండేవి. ఒకటి పోలీసు సర్వీసు. మరొకటి ప్రభుత్వ కార్యక్రమాల్లో కింది స్థాయి ఉద్యోగాలు. పోలీసు సర్వీసుల్లో వారి స్థితి ఏమిటి?

జవాబు- వారికి పోలీసు సర్వీసులు మూసివేశారు.

17 డిసెంబర్ 1928, యునైటెడ్ ప్రావిన్సెస్ శాసనమండలిలో ఒక తీర్మానం ప్రతిపాదించారు. పోలీసు సర్వీసు, ఇతర ప్రభుత్వ సర్వీసుల్లో అస్పృశ్యుల ప్రవేశంపై అన్ని నిషేధాలను, పరిమితులను

తొలగించాలని ఆ తీర్మానం కోరింది. ప్రభుత్వ ప్రతినిధి మాట్లాడుతూ ఇలా అన్నారు.

---

1. ఖాళీల పూరింపులో ఇది విధానమన్నది నిర్వివాదం. శాఖాధిపతి కులం తెలిస్తే ఆ శాఖలో పనిచేసే వారి కులం తెలిసినట్టే అని అందరూ అనుకుంటారు.

''గౌరవ సభ్యులు ప్రవేశాలను అందరికీ అందిస్తామని అంటే నాకు అభ్యంతరం లేదు. కాని నేరస్తుల జాతికి చెందిన, చమర్ వంటి నిమ్న కులాలకు చెందిన వారిని పోలీసుల్లో చేర్చుకోవాలంటే నేను అంగీకరించను.''

పంజాబ్ శాసనమండలిలో లాలా మోహన్‌లాల్ జులై 22, 1927న ఈ ప్రశ్న అడిగారు.

లాలా మోహన్‌లాల్: పోలీసుల్లోకి అణగారిన వర్గాల సభ్యులను స్వీకరించాలో లేదో గౌరవ ఆర్థిక సభ్యులు దయచేసి తెలుపుతారా? లేకపోతే పోలీసు సర్వీసుల్లో అణగారిన వర్గాల వారిని తీసుకోవాలని ప్రభుత్వం ఆదేశాలు జారీ చేస్తుందా?

గౌరవనీయ సర్ జాఫ్రే డె మౌంట్ మొరెన్సీ: అణగారిన తరగతుల వారిని పోలీసుల్లో తీసుకోలేదు. సమాజంలో అన్ని తరగతుల వారు అణగారిన వారిని సమానంగా చూసినట్టు సాక్ష్యం వచ్చే వరకు (ఇది అమలు జరగకపోవచ్చు) సర్వీసు ప్రయోజనాల దృష్ట్యా వీరు సమర్థతా అవసరాలను తీర్చగలరని ప్రభుత్వం సంతృప్తి చెందితే, శారీరక, తదితర నియామక నియమాలను పాటించగలిగితే వారిని కూడా నియామకాల్లో పరిశీలించేందుకు ప్రభుత్వం సిద్ధంగా ఉంది.

బొంబాయి ప్రభుత్వం 1928లో ఈ అంశాలపై నియమించిన కమిటీ ఈ నివేదికను సమర్పించింది.

(వ్రాతప్రతిలో ఈ అంశం లేదు)

ఇక కిందిస్థాయి ఉద్యోగాలు కూడా వారికి లభించడం లేదు. దీన్ని చాలామంది నమ్మరు. కాని ఇది నిజం. పోలీసు సర్వీసులోకి ఎందుకు రానీయరో ఈ నౌకరీలోకి కూడా అందుకే రానీయరు. అస్పృశ్యత. పోలీసు తన విధి నిర్వహణలో భాగంగా ఎవరినైనా అరెస్టు చేయవలసి వస్తుంది. ఎవరి ఇంట్లోకయినా వెళ్ళవలసి ఉంటుంది. సర్చి వారెంట్ ఉంటే ఇల్లంతా వెతకాలి. అరెస్టు కావలసిన వ్యక్తి హిందువు అయి, కానిస్టేబుల్ అస్పృశ్యుడైతే ఎట్లా? పోలీసులు అందరూ ఒకే కాలనీలో ఉండాలి. ఒకే కుళాయి నుంచి నీరు తీసుకోవాలి. హిందూ కానిస్టేబుల్, తన పొరుగున అస్పృశ్య కానిస్టేబుల్ ఉంటే ఎట్లా వ్యవహరిస్తాడు? పోలీసుల్లో అస్పృశ్యులను చేర్చుకోకపోవడానికి ఇవే కారణాలు. ఇక కింది స్థాయి ఉద్యోగాల్లో వారికి అడ్డం వచ్చేవి కూడా ఇవే కారణాలు. ఒక ప్రభుత్వ కార్యాలయంలో కింద ఉద్యోగి అందరికీ నౌకరు వలె పనిచేయాలి. అంటే అందరు హిందువులతో సంబంధాలు ఉంటాయి. అతడు

తాకితే కలుషితం అయ్యే స్థితి కనుక అతన్ని ఎవరు రానిస్తారు? శాఖాధిపతి దగ్గర పనిచేసే బంట్రోతు అతని ఇంట్లో కూడా పనిచేయవలసి ఉంటుంది. అధికారికి 'టీ' తెచ్చి ఇవ్వాలి. పిల్లలను చూసుకోవాలి. అస్పృశ్యుడికి ఈ ఉద్యోగం ఇస్తే అధికారి ఈ సేవలను వదులుకోవాలన్నమాట. ఈ ఉచిత సేవలు వదులుకోవడం కన్నా అస్పృశ్యులకు పనిచేసే హక్కు తొలగిస్తేనే సరి. కనుక అస్పృశ్యులను దాదాపు అన్ని సర్వీసుల నుంచి బహిష్కరించారు. కనుకనే బొంబాయి కమిటీ ఒక ప్రత్యేక తీర్మానం చేయవలసి వచ్చింది.

## III

బ్రిటిష్ ప్రభుత్వం అస్పృశ్యుల విద్య కోసం ఏం చేసింది- ఉదాహరణగా బొంబాయి ప్రెసిడెన్సీ గురించి చెప్తాను. బ్రిటిష్‌పాలనను, విద్యకు సంబంధించినంత వరకు మూడు దశలుగా వర్గీకరించవచ్చు.

## I. 1813 నుండి 1654 వరకు

1. 1815లో బొంబాయి ఎడ్యుకేషన్ సొసైటీ ఏర్పాటుతో బొంబాయిలో విద్య మొదలయింది. యూరోపియన్ పిల్లలకే ఆ సొసైటీ విద్యను పరిమితం చేయలేదు. సూరత్, థానాల్లో స్థానికుల పిల్లల బళ్ళో చేరాలని ప్రోత్సహించారు. 1820 మొదట్లో స్థానిక పిల్లలకు విడిగా నాలుగు పాఠశాలలు తెరిచారు. 250 మంది విద్యార్థులు చేరారు. ఆగస్టులో స్థానికుల విద్య కోసం మరికొన్ని చర్యలు తీసుకున్నారు. భారతీయ భాషా పుస్తకాల ప్రచురణకు, భారతీయ భాషల్లో బోధనలకు పాఠశాలలు నెలకొల్పేందుకు ఒక ప్రత్యేక కమిటీని ఏర్పాటు చేశారు. నిజానికి సొసైటీని పేదలకు విద్య నేర్పడానికే నెలకొల్పారని, ఈ కార్యక్రమాలు లక్ష్యాన్ని మించినవని తర్వాత తెలుసుకున్నారు. కనుక 1822లో కమిటీ ప్రత్యేక కార్పొరేషన్‌గా మారి బొంబాయి నేటివ్ స్కూల్ బుక్ అండ్ స్కూల్ సొసైటీగా పేరు మారింది. గౌరవ మౌంట్ స్టువర్ట్ ఎల్ఫిన్ స్టోన్ కొత్త సొసైటీ తొలి అధ్యక్షుడైనారు. చీఫ్ జస్టిస్, బొంబాయి ప్రభుత్వ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ సభ్యులు ముగ్గురు ఉపాధ్యక్షులైనారు. మేనేజింగ్ కమిటీలో 12 మంది యూరోపియన్లు, 17 మంది స్థానిక ముఖ్యులు సభ్యులుగా కాప్టెన్ జార్జ్ జెర్విస్ ఆర్.ఇ, సదాశివ్ కాశీనాథ్ ఛాత్రీ సెక్రెటరీలుగా ఉన్నారు. ప్రభుత్వం నెలకు రూ.600 చొప్పున ఇచ్చే గ్రాంట్‌తో సొసైటీ పని ప్రారంభించింది. 1865లో బొంబాయి ప్రభుత్వం వెనువెంటనే విడిగా సొంత ఖర్చు మీద జిల్లాల్లో పట్టణాల్లో ప్రాథమిక పాఠశాలలు నెలకొల్పి వాటి నిర్వహణను కలెక్టర్లకు అప్పగించింది. ఈ రెండు స్వతంత్ర సంస్థల వ్యవహారాలను చూసేందుకు 1840లో బోర్డ్ ఆఫ్ ఎడ్యుకేషన్ నెలకొల్పారు. ఇందులో ఆరుగురు సభ్యులు. ముగ్గురిని ప్రభుత్వం, మరో ముగ్గురిని నేటివ్ ఎడ్యుకేషన్ సొసైటీ నియమించేది. 1835లో పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డైరెక్టర్ నియమితులయ్యే వరకు విద్యా శాఖ బోర్డు నిర్వహణలో ఉంది.

2. మార్చి 1, 1855న బోర్డ్ రద్దయింది. అప్పుడు బోర్డు ఆధ్వర్యంలో బొంబాయి ప్రెసిడెన్సీలో 15 ఇంగ్లీష్ కళాశాలలు, పాఠశాలలు 2850 మంది విద్యార్థులతో నడుస్తున్నాయి. 256 భారతీయ భాషా పాఠశాలల్లో 18,853 మంది చదివే వారు. బోర్డు ఆ నివేదికలో ఇలా పేర్కొంది:

> ''24, ఆగస్టు (1855)లో అహ్మద్ నగర్‌లో నిమ్నజాతుల కోసం ఒక పాఠశాల నెలకొల్పాలని కోరుతూ ఒక దరఖాస్తు అందింది. తాజా నియమాల ప్రకారం ఉపాధ్యాయుల జీతంలో సగం భరిస్తామని వారు చెప్పారు. స్కూలు భవనం వారే కట్టారు. 30 మంది విద్యార్థులు వస్తారు. కాని ఆ పాఠశాల అక్కడి సంపన్నులు ఉన్నత తరగతుల వారి అభీష్టానికి వ్యతిరేకం కనుక తక్కువ జీతానికి ఉపాధ్యాయుడు లభించడం కష్టమైంది. కాని దరఖాస్తు నిబంధనల కనుగుణంగా ఉండడం వల్ల ఆమోదించక తప్పలేదు. నవంబర్‌లో పాఠశాల తెరిచారు. ఈ తరగతి ప్రజల కోసం ఒక పాఠశాల తొలిసారి నెలకొల్పిన విషయాన్ని చెప్పడం కోసం ఈ ప్రస్తావన.''

3. బోర్డు తొలిసారి నిమ్న జాతులకు పాఠశాల నెలకొల్పిందని చెప్పిన ఈ ప్రకటన తర్వాత అసలు 1855కు ముందు బ్రిటిష్ ప్రభుత్వం నిమ్నజాతుల విద్య కోసం అనుసరించిన విధానం ఏదయినా ఉందా? అన్న ప్రశ్న తలెత్తుతుంది. జవాబు కోసం 1813 నుంచి 1854 వరకు ప్రెసిడెన్సీలో బ్రిటిష్ విద్యావిధానం చరిత్రలోనే తొంగిచూడవలసి ఉంటుంది. పీష్వా ప్రభుత్వంలో అణగారిన వర్గాలకు విద్య అసలు అందేది కాదు. ప్రభుత్వ విద్యలో వారికి ఆస్కారమే ఉండేది కాదు ఎందుకంటే పీష్వా ప్రభుత్వం మత సిద్ధాంతాలకు అనుగుణంగా శూద్రులకు, అతి శూద్రులకు (వెనుకబడిన తరగతులు) బ్రతికే హక్కు, స్వాతంత్ర్యం, ఆస్తి హక్కుల వలె విద్యా హక్కుకు లేదనే మన సూత్రాల ప్రకారం నడిచే ప్రభుత్వం. కనుక ఆ ప్రభుత్వం పతనం కాగానే ఇన్నాళ్లూ అనేక అనర్థతలకు గురయిన అణగారిన వర్గాలు నిశ్చింతగా ఊపిరి పీల్చుకున్నాయి. బ్రిటిష్ ప్రభుత్వం పైన ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. ఎందుకంటే అది ప్రజాస్వామ్య ప్రభుత్వం కనుక 'ఒక వ్యక్తికి ఒక విలువ' సూత్రాన్ని నమ్ముతారని, అతను పెద్దవాడయినా చిన్నవాడయినా సమానంగా విలువ ఉంటుందని ఆశించారు. ఆ సూత్రాలకు అనుగుణంగా ఉంటే పీష్వాలకు భిన్నంగా ఉండేది. మరో కారణం- అణగారిన వర్గాలు బ్రిటిష్ ప్రభుత్వం భారత్‌ను జయించడానికి సహకరించింది కనుక తమకు సహాయం చేస్తారని, ప్రత్యేకంగా కాకపోయినా, అందరితో సమానంగా చూస్తారని సహజంగానే ఆశించింది.

4. స్థానిక ప్రజలలో విద్యావ్యాప్తి విషయమై బ్రిటిష్ చాలాకాలం మౌనం పాటించారు. భారతదేశ పాలకులలో ఉన్నతాధికారులు- దేశ ప్రజలకు విద్య నేర్పాలనే నైతిక బాధ్యతను గుర్తించినప్పటికీ 1813

వరకు ఆ బాధ్యత గురించి బహిరంగ ప్రకటన చేయలేదు. జార్జ్ IV చాప్టర్ 155 చట్టం 53, సెక్షన్ 43 ద్వారా పార్లమెంట్ ఈ విధంగా ప్రకటించింది. ''భారత్ రెవిన్యూలో మిగులు నుంచి ప్రతి సంవత్సరం లక్ష రూపాయలకు తక్కువ కాకుండా నిధులు కేటాయించి స్థానిక భారతీయుల సాహిత్యాన్ని పునరుద్ధరించడానికి విద్యావంతులను ప్రోత్సహించడానికి వెచ్చించాలి. ఇండియాలోని బ్రిటిష్ భూభాగాల్లో నివసించే వారిలో విజ్ఞానశాస్త్ర పరమయిన అంశాలు ప్రవేశపెట్టి అభివృద్ధి చేసేందుకు వెచ్చించాలి.'' కాని ఆ చట్టం అమలు చేసి స్థానికుల విద్యాభివృద్ధిని సువ్యవస్థితం చేసే ప్రయత్నమేదీ 1823 వరకు జరగలేదు. గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్‌కు 1814లో జూన్ 3న కోర్ట్ ఆఫ్ డైరెక్టర్లు పంపిన ఒక లేఖలో 1813 చట్టం సెక్షన్ 43ను అమలుచేసే విధానం గురించి రాస్తూ పార్లమెంట్ ఉద్దేశ్యం అమలు కావాలంటే హిందువులలో సంస్కృత భాష బోధనను ప్రోత్సహించాలని సూచించింది. అయితే స్థానికులకు సువ్యవస్థిత విద్యా పథకం అమలు చేయాలన్న గట్టి ప్రయత్నాలు ప్రారంభించినపుడు అణగారిన వర్గాల వారు ఎంతో నిరాశకు గురైనారు. ఎందుకంటే విద్య కేవలం ఉన్నత వర్గాలకే అని బ్రిటిష్ ప్రభుత్వం కావాలని ప్రకటించింది. ఈ మాట నమ్మకపోతే బొంబాయి ప్రెసిడెన్సీ వారి 1850-51 సంవత్సరపు బోర్డ్ ఆఫ్ ఎడ్యుకేషన్ నివేదికలోని ఈ భాగాలు చదవండి.

అయిదవ పేరాగ్రాఫ్- **కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ అభిప్రాయాం మేరకు బోర్డు ప్రవేశపెట్టిన విధానం**- ''గౌరవ కోర్టు ఉత్తర్వుల ననుసరించి, ఎర్ల్ ఆఫ్ ఆక్‌లాండ్, మేజర్ కాండీ వంటి ప్రముఖులు భారత్‌లో విద్య గురించి పరిశోధించి చెప్పిన అభిప్రాయాల ఆధారంగా, స్థానికులు స్వయంగా తమ అవసరాలు తెలుపుతూ ఇచ్చిన వినతిపత్రాల ఆధారంగా, మీకు పూర్వం కౌన్సిల్‌లో వున్న లార్డ్‌లు ఇప్పటి పరిస్థితిని వ్యతిరేకం చేయాలని ఆదేశించినందున ఈ ప్రెసిడెన్సీలో ఒక విద్యా పథకం రూపొందించాం''

ఎనిమిదవ పేరాగ్రాఫ్- **ఉన్నత వర్గాలలో విద్యా విస్తరణ అవకాశాలపై కోర్టు అభిప్రాయాలు:** గౌరవ కోర్టు సూచనలు, మాకు అర్థమైన దాన్ని బట్టి లేదా మీరు అనుమతించదగిన పదాల ద్వారా ఈవిధంగా భావిస్తున్నాం. లభ్యమయిన పరిమిత నిధులతో ఏ వర్గానికి ప్రభుత్వ విద్యను విస్తరింపజేయాలి. 1830లో గౌరవ కోర్టు మద్రాసుకు ఈవిధంగా రాసింది. ''ప్రజల నైతిక, మేధో విలువలను పెంపొందించే విద్యాభివృద్ధి ఏదంటే ఉన్నత వర్గాలకు సంబంధించిన విద్య, తీరిక కలిగి, ఇతర ప్రజలపై ప్రభావం చూపగల వ్యక్తులకు సంబంధించిన విద్య. ఈ వర్గాల్లో బోధనా ప్రమాణాలు పెంచడం ద్వారా ఇతరుల ఆలోచనా విధానాన్ని ప్రభావితం చేసి సమాజం భావాల్లో మార్పు సాధించవచ్చు. మీరు కూడా స్థానికులలో అర్హులైన, సరైన అలవాట్లు, ఉన్నత స్థానాలలో ఉండతగిన వ్యక్తులను ఇదివరకెన్నడూ లేనివిధంగా భారత ప్రభుత్వంలో పౌరపాలనలో నియమించాలన్న మా ఆదుర్దాను

మీరు గమనించే ఉంటారు; భారత్‌లో నూరు లేదా నూట నలభై మిలియన్ల (ఈ లెక్కల వల్ల వచ్చేదేమీ లేదు) ప్రజలలో యూరోప్ కళలు విజ్ఞానాన్ని విస్తరించేందుకు వారిని విద్యావంతులు చేసే అవసరం, సౌకర్యం ఉండాలి- ఇంగ్లాండ్‌లో ఒక్క ఎడ్యుకేషన్ బోర్డుకు కేటాయించే నిధులకన్నా తక్కువ సొమ్మును ఇచ్చే బదులు ఎడ్యుకేషనల్ బోర్డుల వద్ద దేశ వనరులన్నీ ఉన్నాయనే భ్రమలు సాధారణ ప్రజలకు కలిగించకూడదు.''

**తొమ్మిదవ పేరాగ్రాఫ్: గత పదేళ్ళలో విద్యా సంబంధమయిన అంశాల పరిశీలన అవసరం:**- చివరి పేరాగ్రాఫ్‌లలో చేసిన వాదనలను పరిశీలిస్తే, ముఖ్యమయిన అంశాలను విశ్లేషిస్తే కొన్ని విద్యావిధానాలు ఫలితాలు లేకుండా కనిపించవు. అందుకు సరైన పరిశ్రమ, నిష్పాక్షికత, విశ్వాసం చూరగొనే విధంగా, అనవసర వివాదాలు, ఊహాత్మకమయిన ప్రశ్నలు లేకుండా పట్టుదలతో కృషి చేయడం అవసరం. ఇప్పుడు కూడా గత పరిస్థితుల అవగాహన అవసరమని ఇప్పటి పరిస్థితులు స్పష్టం చేస్తున్నాయి. 1850లలో అంటే రెండో దశాబ్దంలో, ప్రభుత్వ బోర్డు ఆధ్వర్యంలోకి పాఠశాలలన్నీ వచ్చిన దశాబ్దంలో బోర్డులో ఉన్న అధిక సంఖ్యాక సభ్యులు వారి అనుభవాలు, సమావేశాల ద్వారా వీలయినంత ఎక్కువ సమాచారం సేకరించడం వల్ల కొన్ని పరిశీలనకు రాని, ఆసక్తికరమయిన అంశాల గురించి వివరాలు తెలుపగలుగుతారని భావించవచ్చు. బోర్డులో వారి తర్వాత వచ్చేవారు ఎదుర్కొనే అనేక అంశాలకు ప్రశ్నలకు జవాబులు ఇవ్వగలుగుతారని అనుకోవచ్చు.

**10వ పేరాగ్రాఫ్: బెంగాల్, బొంబాయిలలో సహజంగా ఒక క్రమ పద్ధతిలో విధానం అభివృద్ధి చెందడం:** గణనీయమయిన విద్యా సమస్యలు వాటంతట అవే మా దృష్టికి వచ్చిన విషయాన్ని మేం ఇప్పుడు మా పరిధిలో వివరిస్తాం. అయితే సమస్యలు, వివాదాస్పద ప్రశ్నలు ఏవైతే భారతీయ విద్యా రంగంలో తలెత్తాయో, వాటికి పరిష్కారాలను కూడా వ్యవస్థలో వాటంతట అవే ఉద్భవించాయని, బొంబాయితో పాటు ఇతర ప్రెసిడెన్సీలలో విద్యావ్యవస్థ తనంతతానుగా ఏర్పడిందని మేం భావిస్తున్నాం. ఈ వ్యవస్థ ఈ దేశానికి సరిగ్గా సరిపోయిందనీ, సమయావసరాలను బట్టి విద్యా విధానం అవతరించింది కనుక అది సాధారణ అవసరాలు ఏవిధంగా పరిణమిస్తాయో చెప్తున్నది.

**11వ పేరాగ్రాఫ్:- బొంబాయిలో విద్య-గణాంక వివరాలు:** తర్వాతి పుటలో 1840- ఏప్రిల్ 1850 మధ్య పాఠశాలలన్నీ తొలిసారి బోర్డు అధీనంలోకి వచ్చిన తర్వాత ప్రభుత్వ అధీనంలో నుంచే పాఠశాలల సంఖ్య, విద్యార్థుల సంఖ్య తులనాత్మకంగా ఇవ్వడం జరిగింది. తర్వాత కాలంలో 4 ఆంగ్ల, 83 ప్రాంతీయ భాషా పాఠశాలలు, అందులో నూరు శాతం పైగా పిల్లల సంఖ్య పెరగడం జరిగింది. ఇప్పటికి 12,712 మంది ఈ కింది శాతాల ప్రకారం ప్రభుత్వం కింద విద్య నేర్చుకుంటున్నారు.

ఇంగ్లీషు విద్య - 1699

ప్రాంతీయ విద్య - 10730

సంస్కృత విద్య - 283

పట్టికల ద్వారా పోలిక: 1840లో 97 పాఠశాలలు, 5491 విద్యార్థులు, 185 పాఠశాలలు, 12,712 విద్యార్థులు)

**12వ పేరాగ్రాఫ్ – అదే అంశం:** బొంబాయి ప్రెసిడెన్సీ జనాభా- అధికారలెక్కల ప్రకారం 10 మిలియన్లకు చేరింది. ప్రష్యన్ జనాభా లెక్కల ప్రకారం (1842-43 పేజీ 26 పూర్వ నివేదిక) లో పేర్కొన్న కొలమానం ప్రకారం ఈ జనాభాలో కనీసం 9 లక్షల మంది మగపిల్లలు 7-14 సంవత్సరాల వయసు మధ్య ఉంటారు. వీరు స్కూల్‌కి వెళ్ళగలిగినవారు. అంటే బడికి వెళ్ళగలిగే వయసున్న పిల్లలలో ప్రతి 69 మందిలో ఒకరికన్నా ఎక్కువ మందికి విద్య నేర్చుకునే అవకాశం ప్రభుత్వం కల్పించడం లేదు.

**పేరాగ్రాఫ్–13;- అదే అంశం:-** అంతేగాకుండా, భారతీయ భాషా పాఠశాలల్లో విద్యాబోధన చాలా అసమర్థంగా ఉందని కూడా అంగీకరించిన అంశమే. విలోగ్బీ మినట్‌లో పేర్కొన్న విమర్శల్లో ఈ పాఠశాలల్లో పనికిరాని ఫలితాలపై ఎన్నో వాక్యాలున్నాయి. బోర్డు ఈ విషయాన్ని అంగీకరించడమే కాదు ఈ విషయాన్ని ప్రస్ఫుటంగా చెప్పాలని కూడా ఎన్నోసార్లు ప్రయత్నించారు. ప్రాంతీయభాషా పాఠశాలలకు వ్యతిరేకంగా ప్రముఖులు అభిప్రాయాలు తెలిపారు కూడా. ఈ లోపాలకు సూచించిన పరిష్కారాలేమిటి? విలోగ్బీ ఈ అంశాలను చాలా సక్రమంగా వివరించారు:- ''ఉన్నత వర్గాలకు చెందిన పాఠశాల ఉపాధ్యాయులు, సాధారణ పాఠశాలలు, సమర్థవంతమయిన పర్యవేక్షణ, ప్రాంతీయ సాహిత్యానికి అదనపు అంశాలు చేర్చడం.'' బోర్డు ఈ అంశాలను ఎన్నో సంవత్సరాల నుంచి పరిశీలిస్తున్నది. కాని అదనపు ఖర్చు లేకుండా ఒక్క అడుగు కూడా ముందుకు వేయడానికి వీల్లేదు. బోర్డుకు అదనపు ఆర్థిక సహాయం చేసే అధికారం ప్రభుత్వానికి ఉండడం భావ్యం కాదని గౌరవ కౌన్సిల్ రాసిన లేఖ ద్వారా అర్థమవుతున్నది.

**పేరాగ్రాఫ్–14:** సాధారణ ప్రజలకు విద్య నేర్పడానికి వనరులు లేవన్నది సారాంశం: 175 ప్రాంతీయ భాషా పాఠశాలలకు సరైన వ్యవస్థాత్మక నిర్మాణం ఇవ్వడానికి, 10,730 మంది బాలలకు మంచి ప్రాథమిక విద్యాబోధన ఇవ్వడానికే సరైన నిధులు ఇవ్వలేకపోతే బొంబాయి ప్రెసిడెన్సీలో 'నూటానలభై మిలియన్ల' ప్రజలకు అందులో తొమ్మిది లక్షల బాలురకు విద్యాబోధన అనే ప్రశ్నే

తలెత్తదన్న విషయం ఈ అంశాల ద్వారా బోధపడుతుంది. ఇవి ప్రభుత్వం అంచనాలకు లేదా అందుబాటుకు అందలేదని కాదు. ఆచరణాత్మక రంగం నుంచి విద్యా బోర్డులను దారి తప్పనీయ రాదనేదే లక్ష్యం.

**పేరాగ్రాఫ్–15: పరిమిత వనరులలో ఉత్తమ నిర్వహణకు సంబంధించి కోర్ట్ ఆఫ్ డైరెక్టర్ల అభిప్రాయం:** చివరి పేరాలో పేర్కొన్న సారాంశాన్ని గౌరవ కోర్టు మనసులో పెట్టుకున్నదనే భావిస్తున్నాం. అతి చిన్న స్థాయిలోనే వారు విద్యాభివృద్ధి ప్రయత్నాలు సాగించాలనీ, అందుకే వివిధ ప్రభుత్వాలకు పరిమిత వనరులతో అద్భుత ఫలితాలు సాధించాలనే సూచనలు పంపారు. ఈ అంశం కింద మద్రాస్ ప్రభుత్వానికి పంపిన ఉత్తర్వులను ఇదివరకే వివరించాం. అదే రోజు ప్రభుత్వం పంపిన లేఖలో అదే అభిప్రాయం ప్రస్ఫుటమయింది. నాగరిక యూరోప్ సాహిత్యం, యూరోపియన్ విజ్ఞానశాస్త్రం విశేషాలను స్థానికులలో ఉన్నత వర్గాలకు నేర్పగలగడం మేం ఆశిస్తాం. తీరిక, సహజమయిన పలుకుబడి ఉన్న వర్గాలకు 'శీల సంపద' కలిగిస్తే అది ప్రజలందరి శీలాన్ని నిర్ణయిస్తుందని ఆశిస్తాం.''

**పేరాగ్రాఫ్–16 భారత్‌లోని అగ్రవర్ణాల గురించి ఆసక్తి:** భారత్‌లో ప్రభుత్వ విద్యా ప్రభావం పరిధిలోకి జనాభాలోని చాలా చిన్న వర్గాలన్నీ మాత్రం తీసుకురాగలమని, వీరు ''ఉన్నత వర్గాల'' వారే అయి ఉండాలని గౌరవ హైకోర్టు భావించిందని స్పష్టమయింది. వీరెవరో తెలుసుకోవడం అవసరం. ఈ సందర్భంలో యూరోపియన్ పృచ్ఛకుల యూరోపియన్ ఉదంతాలతో పోల్చుకోనవసరం లేదు. యూరప్‌లో ముఖ్యంగా ఇంగ్లాండ్‌లో సంపద, రాజకీయ, సామాజిక పలుకుబడి విషయంలో అగ్రవర్ణాలకు ఇతర తరగతులకు మధ్య స్పష్టమయిన తేడా ఉంది. భారత్‌లో అటువంటి 'రేఖ' లేదు. అన్ని నియంతృత్వాలలో మామూలు జీవితం నుంచి పౌరులను ఉన్నత స్థాయికి పెంచడమే రాజుల లక్ష్యం. కనుక వారి ప్రవర్తనలో గొప్ప సామ్యం కనబడుతుంది. ఇంగ్లాండ్‌లో బిచ్చగాడిని కర్మాగారంలో బలవంతపు పనికి అర్హుడుగా పరిగణిస్తారు. కాని భారతదేశంలో బ్రాహ్మణ సిద్ధాంతం ప్రకారం బిక్షగాడు ఒక గౌరవనీయ వ్యక్తి. అన్ని సుఖాలను త్యాగం చేసి కోరికలను త్యజించి, విద్యార్జన, దైవం పట్ల ఏకాగ్రత కోసం భిక్షాటన వృత్తిగా తీసుకోవాలని భావిస్తారు.

**పేరాగ్రాఫ్–17 - భారత్‌లో ఉన్నత వర్గాలు:** భారత్‌లో ఉన్నత తరగతులకు చెందినవారిలో పలుకుబడిగలిగిని వారుగా ఈ కింది వారిని పేర్కొనవచ్చు.

1. భూయజమానులు, జాగీర్‌దారులు, మాజీ రాజులు సంస్థానాల పాలకులు. స్థానిక రాజ్యాల్లో అధికారాల్లో ఉన్న వ్యక్తులు, క్షత్రియ వర్గం వారు.

2. వ్యాపార వాణిజ్యాల్లో సంపాదన ఆర్జించిన వారు, వ్యాపార వర్గం.

3. ప్రభుత్వంలో ఉన్నతోద్యోగులు.

4. బ్రాహ్మణులు. బొంబాయిలో పర్‌భూలు, షెన్వీలవలె, బెంగాల్‌లో కాయస్థుల వలె కలం బలంతో నిలబడిన రచయితలు, విద్యార్జన ద్వారా ఒక స్థాయికి చేరుకున్నవారు.

**పేరాగ్రాఫ్ 18 - బ్రాహ్మణులు** - ఎక్కువ పలుకుబడి కలిగినవారు. ఈ నాలుగు తరగతుల్లో అత్యధిక ప్రభావం, పోల్చడానికి వీళ్లేని పలుకుబడి కలిగి, అధిక సంఖ్యలో ఉన్నవారు, ప్రభుత్వం సులువుగా పని తీసుకోగల వారు బ్రాహ్మణులు. దేశం మొత్తంమీద పాత జాగీర్దారులు, క్షత్రియ తరగతులు మన పాలనలో రోజురోజుకూ క్షీణిస్తున్న విషయం మనకు తెలుసు. వారి పాత వృత్తి పోయింది. కొత్త వృత్తులు స్వీకరించడానికి వారే అభ్యంతరమూ చూపలేదు. వారంతా శాంతి కాముకులే. భూస్వామ్య అధికార వర్గాలను ప్రోత్సహించేందుకు ప్రెసిడెన్సీలో ఎల్ఫిన్‌స్టోన్, ఆయన వారసులు చేసిన ప్రయత్నాలు విఫలమయినాయి. ఆడంబరాలు, విపరీత వ్యయాలు తప్ప మరేదీ నచ్చని జాతికి పౌర అధికార హోదా గౌరవాలు కల్పించే యత్నాలు జరిగాయి. హిందూ దేశపు మైదానాలలో వారి తాతలు సాధించిన విజయాల ఘనచరిత్ర విలాసవంతమయిన జీవితం తప్ప మరేమీ రుచించని వర్గాలు అవి. ఇక వాణిజ్య వర్గాలలో కూడా, ఏవో కొన్ని మినహాయింపులు తప్ప, ఉన్నత విద్య ప్రభావం అంతగా కనిపించిని దాఖలాలు లేవు. అన్ని దేశాలలో వలెనే, యూరప్‌లో ఇతర నాగరిక దేశాలకన్న భారత్‌లో కాస్త ఎక్కువగా అమలులో ఉన్న అలవాటు ప్రకారం వాణిజ్య వర్గాల పిల్లలకు పాఠశాల విద్యను త్వరగా ముగించుకుని వ్యాపారంలోకి దిగే పరిస్థితులు ఉంటాయి. తమ వ్యాపారానికి వృత్తికి అనుగుణమయిన ప్రత్యేక చదువులను మాత్రం చదువుకుంటారు. చివరకు ప్రభుత్వ ఉద్యోగులు - ప్రభుత్వం దగ్గరకు పనిమీద వచ్చే అనేక మందిపై వారికి పలుకుబడి ఉంటుంది. ప్రభుత్వంతో సంబంధం లేని పలు వర్గాలపై వారికి ఏ ప్రభావం లేదు. ఇంగ్లాండ్‌లో వలె ప్రభుత్వ ఉద్యోగులమీద ఒకవిధమైన అపనమ్మకం ఇక్కడ కూడా ఉంది. వారి పట్ల ఏహ్యత కూడా ఉంది.

**పేరాగ్రాఫ్-19** - బ్రాహ్మణుల పేదరికం: పై విశ్లేషణ సుదీర్ఘమయినా కొన్ని అభిప్రాయాలు ఏర్పరచుకోవడానికి తప్పనిసరి. బ్రాహ్మణులు, ఇతర సమాన అగ్రవర్ణాలవారు బ్రిటిష్ ప్రభుత్వం వారి విద్యావ్యాప్తి బీజాలు నాటడానికి అనుగుణమయిన ప్రభావ వర్గాలని ఈ విశ్లేషణ తెల్పుతుంది. కాని ఈ బ్రాహ్మణులు, తత్సమాన అగ్రవర్ణాలవారు కటిక పేదవారు. దేశంలోని ఎన్నో భాగాలలో బ్రాహ్మణుడికి పర్యాయపదం 'భిక్షగాడు'.

**పేరాగ్రాఫ్-20**. సంపన్న వర్గాలు ప్రస్తుతం ఉన్నత విద్యను సమర్థించవు: మీరు ఏప్రిల్1850 నాటి లేఖలో మేము తప్పనిసరిగా అనుసరించాలని పేర్కొన్న అంశాలు ఎంతగా అమలు చేయజాలనివో పరిశీలిద్దాం. 'విద్యకోసం డబ్బు వెచ్చించగల సంపన్నులకు, అసాధారణ తెలివితేటలున్న యువకులకు' మాత్రమే ఉన్నత విద్యను పరిమితం చేయాలన్న బోర్డు నిర్దేశించి అమలు యత్నం కూడా చేసింది. ఇది ఎంతవరకు సాధ్యం. ఈ సూత్రం అమలుచేసే యత్నంలో బోర్డు తెలుసుకున్నదేమిటంటే సంపన్నులు ఉన్నత విద్య పట్ల పూర్తి విముఖంగా ఉన్నారు. పేదలలో అసాధారణ ప్రజ్ఞావంతులెవరో తెలుసుకునే మార్గాలేమీ లేవు. సంపన్న వర్గాలలో ఉన్నత విద్య పట్ల ఆసక్తి కలిగిన కొద్దిమంది బెంగాల్‌లో ఎక్కువగా కనిపించారు. బొంబాయికన్న బెంగాల్‌లో విద్యావ్యాప్తికి ప్రభుత్వం విస్తృత యత్నాలు చేసిన తర్వాత ఈ అభిప్రాయం ఏర్పడింది. అటువంటి వర్గాలు పెరిగి, యూరోపియన్లతో సామాజిక సమానతను, సంవర్గాన్ని కలిగి ఉండే స్థాయి తెచ్చుకోవలసిన అవసరం ఉంది. భారత్‌లోని సంపన్న వర్గాల విరాళాలు; విద్యార్థుల ఫీజులు ఆధారంగా విద్యాబోధన మార్గాలు విస్తరించజాలవన్న విషయం కూడా నిర్ధారితమయింది.

**పేరాగ్రాఫ్-21 - నిమ్న తరగతుల్లో విద్యాబోధన:** ఈ అంశాల నుంచి సంవత్సరాల పాటు వచ్చిన అనుభవం నుంచి మనం గమనించక తప్పని విషయం ఏమిటంటే అగ్రకులాల పేద పిల్లల కోసం విద్యా కవాటాలు విస్తృతంగా తెరవాల్సిన అవసరం ఉంది. మన నుంచి విద్య నేర్చుకోవడానికి వారూ ఉత్సాహంగానే ఉన్నారు. ఇక్కడ మనం గమనించి తీరవలసిన మరో ప్రశ్న తలెత్తుతుంది. ప్రభుత్వ సంస్థలలో ఉచిత బోధనకు అగ్రవర్ణాల పేద పిల్లలను అనుమతిస్తే - ధేడ్‌లు, మహర్‌ల వంటి దళిత కులాల పిల్లలను ఏవిధంగా నిరోధిస్తారు?

**పేరాగ్రాఫ్-22. హిందువుల సాంఘిక అపోహలు:** బొంబాయిలో ఈ రెండో తరగతి వర్గాన్ని ఏర్పాటుచేసి, బోర్డు సేవలో ఉన్న ప్రొఫెసర్లు ఇతర ఉపాధ్యాయుల వద్ద శిక్షణ ఇప్పించి సమాజంలో వారిని ఉన్నత విద్యావంతులుగా తీర్చిదిద్దగలిగితే న్యాయమూర్తి, గ్రాండ్ జ్యూరీ, రాణిగారి శాంతి సంస్థ వంటి ఉన్నత పదవులకు స్థానిక ప్రతిభావంతుల కోటాలో అర్హత సంపాదించగలరనడానికి సందేహంలేదు. అయితే హిందూ సమాజంలో నిమ్న వర్గాలకు ఉన్నత పదవులను ఇవ్వడాన్ని వ్యతిరేకించే కొందరి ద్వేషానికి, వత్తిడులకు లొంగిపోయి బ్రిటిష్ ప్రభుత్వం ఒక ఉదారవ్యతిరేక ధోరణి కలిగి ఉండడం బలహీనత. కులాల అడ్డుగోడలపై బహిరంగంగా దాడిచేయాలి.

**పేరాగ్రాఫ్-23 గౌరవ మౌంట్ స్టువర్ట్ ఎల్ఫిన్‌స్టోన్ వివేకవంతమయిన అభిప్రాయాలు:** కాని ఇండియాలో విశాల హృదయుడైన, ఉదారుడైన పాలకుడు ఎల్ఫిన్‌స్టోన్ వివేకవంతమయిన

అభిప్రాయాలు సరైన కార్యప్రణాళికను సూచిస్తున్నాయి. ఆయన అభిప్రాయం: ''క్రైస్తవ మిషనరీల నిమ్న జాతుల పిల్లలు మంచి విద్యార్థులని గమనించారు. అటువంటి వ్యక్తులకు ఏవిధమయిన ప్రత్యే ప్రోత్సాహాన్ని ఇవ్వాలో జాగ్రత్తగా ఉండాలి. విభాజితమయిన ఈ సమాజంలో వారు అట్టడుగు ఉన్నారు. ఒకవేళ మన విద్యావిధానం వేళ్ళు ఈ వర్గాల్లో ఏర్పడితే ఇక విస్తరించవేమోనన్న భయ గురించి ఆలోచించాలి, మనం ఒక కొత్త వర్గానికి నాయకులుగా మారడం, ఇతరులకన్న ఉపయుక్తమయి విజ్ఞానవంతులుగా రూపొందించడం జరిగినా ఈ విద్యకు అర్హులమనుకునే కులాల అపోహలక గురికావడం తప్పదు. ప్రభుత్వం కూడా సైనికుల మీదనో కొందరు సైనిక వర్గాలమీదనో ఆధారపడవల రావడం జరగవచ్చు; కాని అది మనం విద్యకు విస్తృతమయిన ప్రాతిపదిక కల్పించాలన్న లక్ష్యాని విరుద్ధమవుతుంది.

5. కనుక, 1855కు ముందు బొంబాయి ప్రెసిడెన్సీలో దళితులకు ప్రత్యేక పాఠశాలలు తెర లేదంటే, బ్రిటిష్ ప్రభుత్వం కావాలని విద్యా విధానాన్ని అగ్రవర్ణాల పేదలకు, ముఖ్యంగా బ్రాహ్మణుల పరిమితం చేయడం వల్లనే అని స్పష్టమైపోయింది. ఈ విధానం సమంజసమయిందా లేదా అనేది వే ప్రశ్న. మొత్తానికి ఈ కాలంలో ప్రభుత్వం దళిత వర్గాలకు విద్యాగంధం విస్తరించడానికి అంగీకరించలేదు

## II - 1854 నుంచి 1882 వరకు

6. 19 జులై 1854న కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ పంపిన 49వ డిస్పాచ్‌లో ఈవిధంగా పేర్కొన్నారు.

''ఇంతకాలం విద్యకు ఏవిధంగానూ నోచుకోని అసంఖ్యాక ప్రజానీకానికి జీవితంలో ప్రతిదశలోనూ అవసరమయిన ప్రయోజనకరమైన ఆచరణాత్మక విజ్ఞానాన్ని అందించడం సాధ్యమై అది ఎంత ముఖ్యమో, ఇన్నాళ్ళూ ఎంత ప్రధానంగా ఉండి కూడా నిర్లక్ష్యానికి గురయిందో మన పరిశీలించవలసి ఉంది. కనుక వీరికి విద్యను అందించే లక్ష్య సాధనకు, మున్ముందు ప్రభుత కార్యక్రమాలను విస్తృతంగా పెంచేందుకు ఖర్చులను గణనీయంగా పెంచాలని మేం భావిస్తున్నాం''

సామూహిక విద్యకు పునాది వేయడం అని ఈ లేఖలో సరిగ్గానే పేర్కొన్నారు. 1882ల భారతీయ విద్యపై హంటర్ కమిషన్ ఈ విధానం ఇచ్చిన ఫలితాలను మొదటిసారి పరిశీలించింది. ఆ 28 సంవత్సరాలలో సాధించిందేమిటో ఈ కింది అంకెలు వివరిస్తాయి.

## ప్రాథమిక విద్య 1881-82

| | పాఠశాలల సంఖ్య | మొత్తంమీద శాతం |
|---|---|---|
| క్రైస్తవులు | 1,521 | 0.49 |
| బ్రాహ్మణులు | 63,071 | 20.17 |
| ఇతర హిందువులు | 202,345 | 64.69 |
| మహ్మదీయులు | 39,231 | 12.54 |
| పార్సీలు | 3,517 | 1.12 |
| ఆదిమ, కొండజాతులు | 2,713 | 0.87 |
| నిమ్నజాతి హిందువులు | 2,862 | 0.87 |
| యూదులు ఇతరులు | 373 | 0.12 |

## సెకండరీ విద్య 1881-82

| | మాధ్యమిక పాఠశాలలు | | ఉన్నత పాఠశాలలు | |
|---|---|---|---|---|
| | విద్యార్థుల సంఖ్య శాతం | మొత్తం విదార్థుల్లో | విద్యార్థుల సంఖ్య శాతం | మొత్తం విద్యార్థుల్లో |
| క్రైస్తవులు | 1,429 | 12.06 | 111 | 2.26 |
| బ్రాహ్మణులు | 3,639 | 30.70 | 1,978 | 40.29 |
| ఇతర హిందువులు — రైతులు | 624 | 5.26 | 140 | 2.85 |
| ఇతర హిందువులు — నిమ్నతరగతులు | 17 | 0.14 | -- | -- |
| ఇతర హిందువులు — ఇతర కులాలు | 3,823 | 32.25 | 1,573 | 32.04 |
| మహ్మదీయులు | 687 | 5.80 | 100 | 2.04 |
| పార్సీలు | 1,526 | 12.87 | 965 | 19.66 |
| ఆదిమజాతి, గిరిజనులు | 6 | 0.05 - | - | -- |
| ఇతరులు | 103 | 0.87 | 9.2 | 0.86 |

## కళాశాల విద్య 1881-82

| | | విద్యార్థుల సంఖ్య | శాతం |
|---|---|---|---|
| క్రైస్తవులు | | 14 | 3 |
| బ్రాహ్మణులు | | 241 | 50 |
| ఇతర హిందువులు | రైతులు | 5 | 1 |
| | నిమ్నతరగతులు | 0 | 0 |
| | ఇతర వర్గాలు | 103 | 21.3 |
| మహ్మదీయులు | | 7 | 1.5 |
| పార్సీలు | | 108 | 21.5 |
| ఆదిమజాతులు, గిరిజనులు | | 0 | 0 |
| ఇతరులు | | 2 | 0.4 |

7. ఈ అంకెలు ఏం చెప్తున్నాయి? సామూహిక విద్య ప్రభుత్వ విధానమే అయినా, 1884కు ముందు సామాన్య జనానికి ఏవిధంగా విద్య అందుబాటులో లేదో ఆ తర్వాత కూడా అంతే. నిమ్నజాతులు ఆదిమ జాతులు, ఇతరదిగువ కులాల వారు చదువు విషయంలోనూ చాలా దిగువస్థాయిలో ఉన్నారు. 1881-82లో హైస్కూల్‌లోగానీ, ప్రెసిడెన్సీ కళాశాలలో గానీ నిమ్నకులాల వారు ఒక్కరూ చేరలేదు. దళిత కులాల పిల్లలను ఇతరులతో సమానం చేయాలనే ఈ కార్యక్రమం విఫలం కావడానికి కారణమేమిటి? ఈ ప్రశ్నకు జవాబివ్వడానికి మళ్లీ ప్రెసిడెన్సీ విద్యా విధానపు చరిత్రలోకి వెళ్లక తప్పదు.

8. 1854లో కోర్ట్ ఆఫ్ డైరెక్టర్లు పంపిన లేఖలో దాదాపు 40 సంవత్సరాలు గడిచిపోయిన తర్వాత తొలిసారి సామాన్య ప్రజానీకానికి విద్యాబోధన చేయవలసిన బాధ్యతను ప్రభుత్వం గుర్తించడం విశేషం. అయినా ఈ లేఖలో విధానాన్ని తప్పుబట్టిన మహానుభావులు పాత విధానాన్నే అనుసరించాలని పోరాటానికి దిగారు. బలహీన వర్గాలను వారి స్థాయికి మించి పైకి తీసుకువస్తే బ్రిటిష్ పాలనకే ముప్పు అనే భయాలు లార్డ్ ఎలెన్ బరో, బోర్డ్ ఆఫ్ కంట్రోల్ ప్రెసిడెంట్‌ను, ఆవహించాయి. ప్రెసిడెంట్, కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ చైర్మన్‌కు 28.4.1858 ఈ కింది జాగ్రత్తలు తీసుకోమని హెచ్చరించారు.

''మిత్రులారా! 1854లో కోర్ట్ ఆఫ్ డైరెక్టర్లు పంపిన ఆజ్ఞల మేరకు భారత్‌లోని విభిన్న ప్రాంతాల్లో అమలుచేసిన విద్యావిధానం స్థితిగతులను సమీక్షిస్తూ ఎన్నో ఉత్తరాలు అందాయి. వ్యవస్థాపితమయిన

ఈ విధానం వల్ల ఆశించిన ఫలితాలు అందలేదని ఆ లేఖలు వివరిస్తున్నాయి. కాని ఊహించినదానికన్న ఎక్కువ ఖర్చులు మాత్రం పెరుగుతూనే ఉన్నాయి.

* * *

**పేరాగ్రాఫ్ - 11**: సంపన్నులైన వారిని గుర్తించకుండా వదిలేసి కార్మిక వర్గానికి మాత్రం తమ పిల్లలను బడులకు పంపాలని తీవ్రంగా వత్తిడి చేస్తే తప్ప అనుకున్న లక్ష్యం నెరవేరే అవకాశం లేదు.

**పేరాగ్రాఫ్- 12**: ఫలితాలు ఆరోగ్యకరమయిన సమాజాన్ని సృష్టించే విధంగా లేవు. నిమ్న తరగతులలోని విద్యావంతులకు వారి ఆశలకు తగిన అవకాశాలను ప్రభుత్వం ఇవ్వలేకపోతున్నది.

**పేరాగ్రాఫ్- 13**: అనేకమంది ప్రజలపై ప్రభావం చూపగల విధంగా పేద ప్రజలకు ఉన్నత విద్యాబోధన చేసి అసంతృప్తి వర్గాన్ని సృష్టించవలసి వస్తున్నది.

**పేరాగ్రాఫ్- 14**: విద్య, నాగరికత ఉన్నత వర్గాల నుంచి నిమ్న వర్గాలకు దిగివస్తుందే కాని విద్య అందుకున్న వర్గాలు సమాజాన్ని పటిష్టం చేస్తాయి. కాని కింది స్థాయి నుంచి విద్య వారి పైస్థాయికి విద్యా నాగరికతలు వెళ్లవు. ఒకవేళ కేవలం నిమ్న తరగతులకే విద్య నేర్పినా అది విదేశీయులకు నష్టం కలిగిస్తుంది.

**పేరాగ్రాఫ్- 15**: మనం విద్యావ్యాప్తి చేయదల్చుకుంటే మొదట ఉన్నత వర్గాలకు విద్య నేర్పుదాం.

**పేరాగ్రాఫ్- 16**: ఈ పని రెండు మార్గాల ద్వారా అవుతుంది. కళాశాలలు స్థాపించి కేవలం ఉన్నత వర్గాల వారికి మాత్రమే ప్రవేశం కల్పించడం ఒకటి; స్థానిక ప్రముఖుల పిల్లలలో అర్హులైన వారికి సైన్యంలోనూ ఇతర కమిషనులలోనూ గుర్తింపు ఇవ్వడం - రెండవది.''

**9.** యూరోపియన్ అధికారులకు అస్పృశ్య వర్గాల పట్ల ఉన్న వ్యతిరేకతను **1859**లో సెక్రెటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా లేఖలో సరిదిద్దారు. ఈ లేఖలో సామూహిక విద్యాబోధన ప్రభుత్వ బాధ్యతగా మళ్ళీ గుర్తించారు.

**10.** సామూహిక విద్యా బోధనను ప్రభుత్వ బాధ్యతగా గుర్తించడం వల్ల దళిత వర్గాలకు ఒరిగిందేమీ లేదు. ఎందుకంటే అనేక జిల్లాల్లో ప్రజల కోసం పాఠశాలలను నెలకొల్పినప్పటికి అందులో దళిత వర్గాల పిల్లలకు ప్రవేశానికి సంబంధించిన సమస్యను పరిష్కరించనేలేదు. నిజానికి **1856**లోనే

ఈ సమస్య తలెత్తింది. కాని ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం దళిత వర్గాలకు అనుకూలంగా లేదు. 1856-57 సంవత్సరానికి బొంబాయి ప్రెసిడెన్సీ డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ నివేదికలో ఈ అంశం రుజువైంది:-

''**పేరాగ్రాఫ్ 177**: గిరిజనులు నిమ్న కులాల వారికోసం పాఠశాలలు: నిమ్న కులాల వారికోసం ప్రభుత్వం ప్రత్యేక పాఠశాలలను స్థాపించలేదు. సుప్రీం ప్రభుత్వం అటువంటి పాఠశాలలకు ఆమోదం తెలుపలేదు. ప్రభుత్వం నడిపే సాధారణ పాఠశాలలన్నీ పైకి అన్ని కులాల వారి కోసం అని చెప్పారు. 1855-56 నివేదికలో నేను వ్యక్తంచేసిన అభిప్రాయాల మేరకు ప్రభుత్వం ఈ క్రింది ఉత్తర్వును జారీచేసింది. -''ప్రభుత్వ పాఠశాలలో నిమ్న కులాలకు చెందిన విద్యార్థుల ప్రవేశానికి సంబంధించి ప్రభుత్వం ముందుకు ఒకే ఒక ఫిర్యాదు వచ్చింది. ధార్వార్ ప్రభుత్వ పాఠశాలలో ప్రవేశం కోసం మహర్ బాలుడు స్కూలు ఫీజు చెల్లించడానికి సిద్ధంగా ఉన్నప్పటికి అతనికి ప్రవేశాన్ని తిరస్కరించారని 1856 జూన్‌లో ఒక ఫిర్యాదు దాఖలైంది.

''ఈ సందర్భంలో ప్రభుత్వం ఒక తీవ్రమైన సంఘర్షణకు గురైంది. ఒకవేళ ప్రవేశం కల్పిస్తే ఏ ఉన్నత వర్గాల వికాసం కోసం ప్రభుత్వ విద్యా విభాగాన్ని స్థాపించారో ఆ వర్గాల వ్యతిరేకతను ఎదుర్కోవలసి వస్తుంది. ఒకే ఒక వ్యక్తి, అదీ మహర్ బాలుడు స్కూలు ప్రవేశం కోసం అడిగినంత మాత్రాన అగ్రవర్ణాల విద్యార్థులు మాత్రమే హాజరు అవుతున్న పాఠశాలల్లో అతనికి ప్రవేశం కల్పించి తద్వారా ఆ పాఠశాల జనబాహుళ్యానికి ఉపయోగపడకుండా ఉండే ప్రమాదం ఎదుర్కోవడం కన్నా అతనికి ప్రవేశాన్ని కల్పించకపోవడమే సరైనదని ఒక తీర్మానం* ద్వారా నిర్ణయించారు.

* 21 జూలై 1856న ప్రభుత్వం ఆమోదించిన తీర్మానం పూర్తి పాఠం.

1. ఈ లేఖలలో ప్రస్తావించిన సమస్య ఆచరణలో తీవ్రమైన ఇబ్బందులను సృష్టించే సమస్య.

2. ప్రవేశం కోసం దరఖాస్తు పెట్టుకున్న మహర్ బాలుడి వైపే న్యాయం ఉందనడంలో సందేహం లేదు.. కాని అతనికి విద్యా సౌకర్యాన్ని నిరాకరించే సామాజిక అపోహలు ధార్వార్‌లో మరికొంతకాలం కొనసాగుతాయని ప్రభుత్వం విశ్వసిస్తున్నది.

3. ఐతే ఒకరు లేదా కొందరు వ్యక్తుల కోసం, యుగాలుగా కొనసాగుతున్న సామాజిక అపోహలను ఉన్నట్టుండి మార్చితే విద్యా లక్ష్యానికి తీరని హాని కలుగుతుందేమోనని ప్రభుత్వం భావించక తప్పదు. అతను కోరిన విధంగా ప్రవేశాన్ని కల్పించడం ద్వారా ఆ ఇబ్బందిని వెంటనే తొలగించడం కూడా ఈ ప్రభుత్వానికి సాధ్యం కాదు.

బొంబాయి ప్రభుత్వం ఈ విషయంలో జారీచేసిన ఉత్తర్వులను భారత ప్రభుత్వం లేఖా నంబర్ 111, తేదీ 23.1.1857 ద్వారా ఈ క్రింది విధంగా గుర్తించింది:-

''బొంబాయి ప్రభుత్వం ఈ విషయంలో చాలా తెలివిగా వ్యవహరించిందని గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ భావిస్తున్నారు. కాని బెంగాల్ ప్రెసిడెన్సీలోని ఏ ప్రభుత్వ పాఠశాలలోనైనా ఆ విద్యార్థికి తిరస్కరించి ఉండేవారు కారని నన్ను చెప్పమని వారు కోరారు.''*

ఈ ఉత్తరం అందిన తరువాత ఈ ప్రభుత్వం దేశవ్యాప్తంగా పాఠశాలలను కొన్ని కులాలకే పరిమితం చేసే ప్రయత్నాలను చూస్తూ వదిలివేయదని నిర్ణయించినట్లు భారత ప్రభుత్వానికి హామీ ఇవ్వాలని తీర్మానించింది. అయితే దీనివల్ల ప్రభుత్వ పాఠశాలల ఉనికి, ప్రతిష్ట, సమర్థత దెబ్బతినకుండా చూడాలని కూడా భావించింది. బెంగాల్‌లో ప్రభుత్వ పాఠశాలల ఉపయోగంలో ఉన్న ఈ సూత్రం అమలు గురించి విచారణ జరపాలని కూడా నిశ్చయించింది.

11. బెంగాల్‌లో అమలవుతున్న విధానాన్ని పరిశీలిస్తే - అక్కడి పాఠశాలల్లో నిమ్నకులాల అభ్యర్థులకు ప్రవేశం ఇవ్వాలా వద్దా అని స్థానిక అగ్రవర్ణాల భావాలను బట్టి ప్రతి కేసులో నిర్ణయించే అధికారాన్ని జిల్లా కమిటీలకు బెంగాల్ అధికారులు వదిలి వేశారని తేలుతుంది. భారత ప్రభుత్వం అభిప్రాయాలకు ఇది విరుద్ధం. అందరికి విద్యాజ్యోతి వెలిగించాలన్న లక్ష్యంతో నెలకొల్పిన పాఠశాలల్లో స్పృశ్య వర్గాల సరసన అస్పృశ్యులను కూర్చోనీయక పోవడం వల్ల దళితులు నిరాశకు గురయినారు.

12. కనుక 1854 నాటి లేఖ ప్రకారం జనబాహుళ్యానికి విద్య అనే విధానం, ఈ విధంగా దళిత వర్గాలకు తప్ప మిగిలిన అందరికీ అందుబాటులో ఉండింది. 1854లో దళిత వర్గాలకు చదువుపై నిషేధం తొలగించడం కేవలం ఒక నామమాత్రపు చర్య. ప్రభుత్వం కొందరికి విద్య లేదనే వీల్లేదని సూత్రప్రాయంగా అంగీకరించినా, దాని ఆచరణను జాగ్రత్తగా తప్పించివేసింది. కనుక ఆచరణలో మునుపు ఉన్న నిషేధం కొనసాగిందన్నమాట.

---

* ఏప్రిల్ 28, 1858 నాడు 58వ లేఖ ద్వారా కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ ఈ విషయంలో క్రింది ఉత్తర్వును జారీచేసారు:-

''ప్రభుత్వ విద్యా సంస్థలన్నీ అన్ని వర్గాల వారికి ఉద్దేశించినవి. న్యాయమైన ఈ సూత్రాన్ని భంగపరచడం కూడదు. ఈ సూత్రాన్ని అమలు చేయడం ప్రథమ కర్తవ్యం. కొన్ని సందర్భాలలో ఈ సూత్రం అమలు చేయడం వల్ల కొందరు విద్యార్థులు పాఠశాల నుంచి వెళ్ళిపోవచ్చు. పోతే ఈ సూత్రం అమలును వ్యతిరేకించేవారు పాఠశాలలకిచ్చే విరాళాలను నిలిపివేసి ఆ నిధులను వేరే పాఠశాలల ఏర్పాటుకు వాడుకోవచ్చును.''

దళిత వర్గాల చదువు విషయం పట్టించుకున్న ఏకైక సంస్థ క్రైస్తవ మిషనరీ మాత్రమే. మౌంట్ స్టువర్ట్ ఎల్ఫిన్‌స్టోన్ మాటల్లో ''నిమ్న జాతుల్లో ఉత్తమ విద్యార్థులు వారికి లభించారు'' అని చెప్పవచ్చు. కాని మత విషయంలో నిష్పాక్షికతను పాటిస్తున్నామన్న నెపంతో ప్రభుత్వం క్రైస్తవ మిషనరీలను ప్రోత్సహించలేదు. కనుక మిషనరీ పాఠశాలలకు ఆర్థిక గ్రాంట్‌లు ప్రెసిడెన్సీ నుంచి లభించనేలేదు. 1854 విద్యా విధానపు లేఖాపత్రంలో మిషినరీ పాఠశాలలకు నిధులు ఇవ్వడంపై నిషేధం లేకపోయినా నిధులు ఇవ్వలేదు.



13. ఈ ప్రతిష్టంభన పరిష్కారానికి ప్రభుత్వం రెండు మార్గాలను అనుసరించింది. (1) నిమ్న జాతుల పిల్లల కోసం ప్రభుత్వం విడిగా పాఠశాలలు నెలకొల్పడం (2) గ్రాంట్-ఇన్-ఎయిడ్ నిబంధనలు సవరించి మిషనరీ పాఠశాలలకు ప్రోత్సాహం అందించడం. ఈ రెండు మార్గాలను అవలంభించకపోయి ఉంటే దళిత వర్గాల విద్యా ఫలితాలను ఇచ్చి ఉండేదే కాదు. 1882 హంటర్ కమిషన్ నివేదికలో దళితులకు ఆ మాత్రం విద్య లభించిందని చెప్పుకునే అవకాశం ఉండేది కాదు.

## III. 1882 నుంచి 1923 వరకు

14. బొంబాయి ప్రెసిడెన్సీ చరిత్రలో 1882 తర్వాత, 1923 మరో మైలురాయి అవుతుంది. ప్రాథమిక విద్య ప్రావిన్షియల్ ప్రభుత్వం నుంచి స్థానిక సంస్థల అధీనంలోకి ఆ సంవత్సరమే మారింది. కనుక 1923 నాటి పరిస్థితిని పరిశీలించడం అవసరం. బొంబాయి ప్రెసిడెన్సీలో 1923లో విభిన్న కులాల విద్యా ప్రగతి పరిస్థితిని ఈ కింది పట్టిక ద్వారా తెలుకోవచ్చు.

| ప్రెసిడెన్సీలో ఈ వర్గాల జనాభా | జనాభా ప్రకారం స్థానం | విద్యా విషయక స్థానం | | |
|---|---|---|---|---|
| | | ప్రాథమిక | సెకండరీ | కళాశాల |
| అభివృద్ధి చెందిన హిందువులు | 4వ | 7వ | 1వ | 1వ |
| ఇంటర్మీడియెట్ హిందువులు | 1వ | 3వ | 3వ | 3వ |
| వెనుకబడిన హిందువులు | 2వ | 4వ | 4వ | 4వ |
| మహ్మదీయులు | 3వ | 2వ | 2వ | 2వ |

15. విద్యా విషయంలో ఈ విభిన్న వర్గాల మధ్య తీవ్రమయిన వ్యత్యాసాలు కనిపిస్తాయి. జనాభాలో వారి స్థానాన్ని, విద్యా రంగంలో వారి స్థానాలను పోల్చి చూస్తే, మధ్య తరగతి హిందువులు,

జనాభాలో తొలి స్థానంలో ఉన్నా, కాలేజీ విద్యలో 3వ స్థానంలో, సెకండరీ, ప్రాథమిక విద్యల్లో కూడా మూడవ స్థానంలోనే ఉన్నారు. బడుగు వర్గాలు జనాభాలో రెండో స్థానంలో ఉన్నా మూడు స్థాయిల విద్యలలో చిట్టచివరి స్థానాల్లో ఉన్నారు మహ్మదీయులు జనాభాలో మూడో స్థానంలో ఉన్నా, కళాశాల చదువులో, సెకండరీ, ప్రాథమిక విద్యలలో రెండో స్థానంలో ఉన్నారు. ఇక అభివృద్ధి చెందిన హిందువులు జనాభాలో ఆఖరి స్థానంలో ఉన్నా అన్ని విద్యారంగాలలో అగ్రస్థానంలో ఉన్నారు. కనుక 1882లో ఉన్న పరిస్థితుల్లో ఏ మార్పూ లేదని విశదమవుతుంది.

16. 1923-24 సంవత్సరానికి బొంబాయి ప్రెసిడెన్సీలోని డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్స్ట్రక్షన్ నివేదిక ఆధారంగా ఈ పట్టిక తయారు చేశారు. ఇందులో విభిన్న వర్గాల మధ్య విద్యా ప్రగతిలో వ్యత్యాసాలు కనిపిస్తాయి. విభిన్న కులాల మధ్య ఈ తేడా ఎంతగా ఉందో మాత్రం అర్థంకాదు కనుక పరిస్థితి స్పష్టంగా ఉండదు. తేడాలను మరింత స్పష్టంగా తెలుసుకోవడానికి ఈ కింది పట్టిక రూపొందించారు.

పట్టిక

| జనాభాలో వర్గాలు* | ప్రాథమిక విద్య ప్రతి వెయ్యి మందికి విద్యార్థుల సంఖ్య | సెకండరీ విద్య ప్రతి లక్షమందికి విద్యార్థులు | కళాశాల విద్య ప్రతి 2 లక్షల మందికి విద్యార్థులు |
|---|---|---|---|
| అభివృద్ధి చెందిన హిందువులు | 119 | 3,000 | 1000 |
| మహ్మదీయులు | 92 | 500 | 52 |
| మధ్యతరగతి | 38 | 140 | 24 |
| వెనుకబడినవారు | 18 | 14 | ఎవరూ లేరు (లేదా ఒకరు) |

* బొంబాయి విద్యాశాఖ ప్రెసిడెన్సీ జనాభాను శాఖీయ అవసరాల కోసం నాలుగు విభాగాలుగా వర్గీకరించింది. బ్రాహ్మణులు, తత్సమాన కులాలలో అభివృద్ధి చెందిన హిందువులు'' కాగా, మారతలు, తత్సమాన కులాలు ''మధ్యతరగతి హిందువులు'', మిగిలినవారు నిమ్నజాతులు, దళిత వర్గాలు, గిరిజనులు, నేర జాతులు - వీరందరూ 'వెనుకబడిన తరగతులు' అని పిలిచారు. వీరికి మరో నాలుగవ తరగతి వర్గం కలిపారు. వారు ప్రెసిడెన్సీలో, సింధ్‌లో ఉన్న మహ్మదీయులు.

ప్రాథమిక, సెకండరీ, కళాశాల విద్యల్లో ఏ కులంవారు మిగతావారికన్నా ఎంత ముందున్నారో ఈ పట్టిక వివరిస్తుంది. విభిన్న వర్గాల మధ్య తీవ్రమయిన వ్యత్యాసం ప్రకటితమవుతుంది. అంతేకాదు, కొందరి స్థానం దిగ్భ్రాంతి కలిగిస్తుంది. ఈ అంకెల నుంచి రెండు అంశాలు స్పష్టమవుతాయి.

(1) ప్రెసిడెన్సీలో వెనుకబడిన వర్గాల చదువు శోచనీయ స్థితిలో ఉంది. జనాభాలో వారు రెండో స్థానంలో ఉన్నా విద్యలో మాత్రం ఆఖరిదే కాదు, మరీ అట్టడుగు స్థానంలో ఉన్నారు. (2) ప్రెసిడెన్సీలో మహ్మదీయులు విద్యలో ఎంతో అభివృద్ధి సాధించారు. కేవలం 30 సంవత్సరాలలో వారు వెనుకబడిన, మధ్యతరగతి వర్గాలను దాటి బ్రాహ్మణులు ఇతర అగ్రవర్ణాలకు దాదాపు దగ్గరయిపోయారు.

18. ఈ విధంగా ఎందుకు జరిగింది? ప్రభుత్వం అనుసరించిన అసమాన విధానమే దీనికి సమాధానం. విద్యపై నాలుగు సంవత్సరాల నివేదికలో పేర్కొన్న ఈ కింది వాక్యాలలో రెండు వర్గాల మధ్య చూపిన అసమానత ఎంత తీవ్రమో తెలుస్తుంది. (1892-96) నాలుగు సంవత్సరాల నివేదికలో మహ్మదీయులకు విద్య విషయంలో లభించిన గుర్తింపు కింది వాక్యాల్లో కనిపిస్తుంది.

''బొంబాయిలో మహ్మదీయ విద్యకు సంబంధించిన అంకెలు, ప్రతికూల పరిస్థితులు లేకపోతే మరింత ప్రగతి చూపేవని డైరెక్టర్ పేర్కొన్నారు. జనాభాలో మిగిలిన వారికన్నా అత్యధికంగా ప్రభుత్వ సంస్థలను మహ్మదీయులే వాడుకున్నారని ఎప్పుడో గుర్తించారు. మహ్మదీయుల విద్యను ప్రోత్సహించేందుకు చేసిందేమిటో డైరెక్టర్ ఈవిధంగా వివరించారు:-

''మొదట - ప్రతి జిల్లాలో డిప్యూటీ లేదా సహాయ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్‌గా మహ్మదీయ అధికారిని నియమించారు. కైరా, షోలాపూర్, హైదరాబాద్‌లలో ముగ్గురు మహ్మదీయ డిప్యూటీలున్నారు. మరొకరు రెవిన్యూ విభాగంలో ఉన్నత పదవిలో ఉన్నారు. కనుక జిల్లాలో మహ్మదీయ జనాభాతో సంబంధం లేని పాలనాధికారి లేడు. బొంబాయి, కరాచీ, జునాగఢ్ (కతియవార్‌లో మహ్మదీయ రాజ్యం) లో మహ్మదీయుల కోసం తక్కువ ఫీజు పాఠశాలలు నెలకొల్పారు. అంజుమన్ (మహ్మదీయ సంఘాలు) చిన్న చిన్న పాఠశాలలు ప్రారంభించారు. విద్యా శాఖ కూడా వారికోసం ప్రత్యేక ప్రమాణాలను ప్రత్యేక సౌకర్యాలను కల్పిస్తూ ప్రావిన్షియల్, లోకల్ బోర్డు స్కాలర్‌షిప్‌లను ఏర్పాటు చేశారు. ఒకనాటి బరోడా దివాన్ ఖాన్ బహదూర్ కా షాబుద్దీన్ ప్రత్యేక స్కాలర్‌షిప్‌లను నెలకొల్పారు. సింధ్‌లో ఖైర్‌పూర్ సంస్థానం వారసుడు ఆర్ట్స్ కాలేజిలో విద్యార్థులకు కొన్ని ఆహార స్కాలర్‌షిప్‌ను ఏర్పాటు చేశారు. (నెలకు 25 రూపాయల విలువే అయినా వీటి వివరాలు సేకరించడం నాకు కష్టమయింది) ప్రాథమిక పాఠశాలల్లో ఫీజు విషయంలో మహ్మదీయుల పట్ల చాలా ఉదారంగా ఉండేవారు. హిందువులకన్నా సులువైన రీతిలో పరీక్షలు నిర్వహించి ప్రత్యేక రూల్స్ ద్వారా

మహ్మదీయులకు శిక్షణా కళాశాలల్లో చేర్పించారు. మహ్మదీయ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్‌లను నియమించడం ద్వారా మహ్మదీయులకు ప్రత్యేక ప్రోత్సాహాలను బొంబాయిలో జాయింట్ స్కూల్స్ కమిటీ కల్పించింది.''

19. (1902-1907) నాటి అయినవ చతుఃసంవత్సర నివేదికలో దళిత వర్గాల చదువుల గురించి ఈవిధంగా పేర్కొన్నారు.

''959. బొంబాయి - బొంబాయి సెంట్రల్ డివిజన్‌లో నిమ్న కులాల పిల్లలకు పాఠశాలల్లో ఉచితంగా పుస్తకాలు, పలకలు ఇచ్చి ఉచితంగా ప్రవేశం కల్పించేవారు ... కతియవార్‌లో ముగ్గురు మాత్రమే నిమ్నజాతి పిల్లలు చదువుకునేవారు. దక్షిణ విజన్‌లో 72 ప్రత్యేక పాఠశాలలు నడిపేవారు. కాని టీచర్లు క్వాలిఫైడ్‌కాదు.

20. హంటర్‌కమిషన్ సిఫార్సుల నుంచే ఈ అసమానతలు మొదలయినాయి. మహ్మదీయులకు ఎంత లాభదాయకమయిన, పక్షపాత ధోరణితో సిఫార్సులు చేసిందో తెలుసుకోవాలంటే దళితుల విషయంలో చేసిన సిఫార్సులతో పోల్చిచూడాలి. మహ్మదీయుల కోసం కమిషన్‌చేసిన 17 సిఫార్సులలో ఇవి గమనించతగినవి:-

(1) మునిసిపల్, ప్రావిన్షియల్ లేదా స్థానిక నిధుల నుంచి విధిగా మహ్మదీయుల విద్య ప్రోత్సహించడానికి కేటాయించాలి.

(7) మహ్మదీయులకు ఆంగ్ల ఉన్నత విద్య విషయమై ఉదారంగా ప్రోత్సహించాలి.

(8) అవసరమయిన చోట్ల మహ్మదీయులకు ప్రోత్సాహం కల్పించే విధంగా ప్రాథమిక పాఠశాలల్లో, మాధ్యమిక పాఠశాలల్లో, మెట్రిక్యులేషన్ ఫలితాల ఆధారంగా ఫస్ట్ ఆర్ట్స్ పరీక్షల్లో, కాలేజీల్లో కూడా స్కాలర్‌షిప్‌లు ఇచ్చే వ్యవస్థను నెలకొల్పాలి.

(9) ప్రభుత్వ నిధులతో నిర్వహించే అన్నిరకాల పాఠశాలల్లో మహ్మదీయ విద్యార్థుల కోసం విడిగా కొంత భాగం కేటాయించాలి.

(10) మహ్మదీయుల కోసం విద్యావిషయక ధర్మాదాయ పథకాలు ప్రభుత్వ నిర్వహణలో అమలయ్యేచోట ఆ పథకాల ద్వారా వచ్చే నిధులను కేవలం మహ్మదీయుల ఉన్నత విద్యా వ్యాప్తి కోసమే ఖర్చుచేయాలి.

''గౌరవ సభ్యులు ప్రవేశాలను అందరికీ అందిస్తామని అంటే నాకు అభ్యంతరం లేదు. కాని నేరస్తుల జాతికి చెందిన, చమర్ వంటి నిమ్న కులాలకు చెందిన వారిని పోలీసుల్లో చేర్చుకోవాలంటే నేను అంగీకరించను.''

పంజాబ్ శాసనమండలిలో లాలా మోహన్‌లాల్ జులై 22, 1927న ఈ ప్రశ్న అడిగారు.

లాలా మోహన్‌లాల్: పోలీసుల్లోకి అణగారిన వర్గాల సభ్యులను స్వీకరించాలో లేదో గౌరవ ఆర్థిక సభ్యులు దయచేసి తెలుపుతారా? లేకపోతే పోలీసు సర్వీసుల్లో అణగారిన వర్గాల వారిని తీసుకోవాలని ప్రభుత్వం ఆదేశాలు జారీ చేస్తుందా?

గౌరవనీయ సర్ జాఫ్రే డె మౌంట్ మొరెన్సీ: అణగారిన తరగతుల వారిని పోలీసుల్లో తీసుకోలేదు. సమాజంలో అన్ని తరగతుల వారు అణగారిన వారిని సమానంగా చూసినట్లు సాక్ష్యం వచ్చే వరకు (ఇది అమలు జరగకపోవచ్చు) సర్వీసు ప్రయోజనాల దృష్ట్యా వీరు సమర్థతా అవసరాలను తీర్చగలరని ప్రభుత్వం సంతృప్తి చెందితే, శారీరక, తదితర నియామక నియమాలను పాటించగలిగితే వారిని కూడా నియామకాల్లో పరిశీలించేందుకు ప్రభుత్వం సిద్ధంగా ఉంది.

బొంబాయి ప్రభుత్వం 1928లో ఈ అంశాలపై నియమించిన కమిటీ ఈ నివేదికను సమర్పించింది.

(వ్రాతప్రతిలో ఈ అంశం లేదు)

ఇక కిందిస్థాయి ఉద్యోగాలు కూడా వారికి లభించడం లేదు. దీన్ని చాలామంది నమ్మరు. కాని ఇది నిజం. పోలీసు సర్వీసులోకి ఎందుకు రానీయరో ఈ నౌకరీలోకి కూడా అందుకే రానీయరు. అస్పృశ్యత. పోలీసు తన విధి నిర్వహణలో భాగంగా ఎవరినైనా అరెస్టు చేయవలసి వస్తుంది. ఎవరి ఇంట్లోకయినా వెళ్ళవలసి ఉంటుంది. సర్చి వారెంట్ ఉంటే ఇల్లంతా వెతకాలి. అరెస్టు కావలసిన వ్యక్తి హిందువు అయి, కానిస్టేబుల్ అస్పృశ్యుడైతే ఎట్లా? పోలీసులు అందరూ ఒకే కాలనీలో ఉండాలి. ఒకే కుళాయి నుంచి నీరు తీసుకోవాలి. హిందూ కానిస్టేబుల్, తన పొరుగున అస్పృశ్య కానిస్టేబుల్ ఉంటే ఎట్లా వ్యవహరిస్తాడు? పోలీసుల్లో అస్పృశ్యులను చేర్చుకోకపోవడానికి ఇవే కారణాలు. ఇక కింది స్థాయి ఉద్యోగాల్లో వారికి అడ్డం వచ్చేవి కూడా ఇవే కారణాలు. ఒక ప్రభుత్వ కార్యాలయంలో కింద ఉద్యోగి అందరికీ నౌకరు వలె పనిచేయాలి. అంటే అందరు హిందువులతో సంబంధాలు ఉంటాయి. అతడు

వారికి ప్రత్యేక పాఠశాలలు తెరవడం అసాధ్యం కనుక. ఆ సిఫార్సు కూడా నిష్ఫలమే. బలహీన వర్గాల వారు అధిక సంఖ్యలో ఉన్నచోట మరికొన్ని పాఠశాలలు నెలకొల్పాలన్న మరో సిఫార్సు కూడా వృథాయే. ఎందుకంటే గ్రామీణ ప్రాంతాల్లో ఒక్కచోటనే బలహీనవర్గాలవారు అధిక సంఖ్యలో ఉండడం సాధ్యం కాదు కనుక. అదనపు ప్రాథమిక పాఠశాలలకు అదనపు నిధులు ఇవ్వాల్సి ఉంటుంది కనుక ప్రభుత్వానికి అంగీకారం కాబోదు.

22. వెనుకబడిన తరగతుల విద్యావసరాల పట్ల హంటర్ కమిషన్ శీతకన్ను ఎందుకు వేసిందో అర్థం కావడంలేదు. మహ్మదీయుల పట్ల ఉదారంగా ఉండడం అవసరం అనుకుంటే వారికన్నా సాంఘికంగా, ఆర్థికంగా, విద్యాపరంగా వెనుకమడి ఉన్న బలహీన వర్గాలను పట్టించుకోవడం న్యాయం కాదా? హంటర్ కమిషన్ ఒకసారి బలహీన వర్గాలను వెనక్కుతోసివేసిన తర్వాత వారు అక్కడే ఉన్నారు. ఏ ప్రభుత్వమూ వారిని పట్టించుకోలేదు. ఫిబ్రవరి 21, 1923న విద్యా విభాగంలో భారత ప్రభుత్వం చేసిన తీర్మానాన్ని ప్రభుత్వ నిర్లక్ష్యానికి తీర్మానంగా చెప్పవచ్చు. విభిన్న ప్రావిన్స్‌లకు సమగ్ర విద్యా విధానంగురించి చక్రవర్తి నిధుల నుంచి ఎక్కువ మొత్తంలో స్థానిక ప్రభుత్వాలకు డబ్బు కేటాయించాలన్న ఈ తీర్మానం ఎంతో ప్రధానమయింది. ఈ తీర్మానంలో ప్రభుత్వం ప్రాంతీయ ప్రభుత్వాలకు మహ్మదీయ మతస్తులకు, ''స్థానిక వర్గాలకు'' విద్య అవసరాలను ప్రస్తావించారేగాని ఎక్కడా బలహీన వర్గాల గురించి కనీసం పేర్కొనలేదు. మహ్మదీయుల విద్యను ప్రోత్సహించేందుకుగాను 1913లో విద్యా కమిటీలో మహ్మదీయుడిని నియమించడం ద్వారా బొంబాయి ప్రభుత్వం ఈ తీర్మానాన్ని వెంటనే అమలు చేసింది. ప్రభుత్వం బలహీన వర్గాలను ఇంత ఘోరంగా నిర్లక్ష్యం చేయడం వల్ల ధర్మమయిన ఆగ్రహం రాకమానదు. జనవరి 6న మహోఘనతవహించిన మహాచక్రవర్తి కలకత్తా యూనివర్సిటీలో ప్రసంగిస్తూ చేసిన ప్రకటనను అమలు చేయడానికి ప్రభుత్వం 1913లో నిధులు పెద్దఎత్తున గ్రాంట్ చేశారు. ఈ ప్రకటనలో ఈ విధంగా పేర్కొన్నారు:

> ''ఈ ప్రాంతమంతటా కళాశాలలు, పాఠశాలలు విస్తరించాలనేది నా ఆకాంక్ష. వీటి నుండి బయటికెళ్ళే విద్యార్థులు జీవితంలో బాధ్యతాయుతమైన, పరిణతి చెందిన పౌరులుగా పరిశ్రమలు వ్యవసాయంతో పాటు అనేక రంగాలలో ఉన్నతంగా ఎదగాలి. నా భారత ప్రజల గృహాలు కళకళలాడాలని, మంచి వైద్యం సుఖవంతమైన జీవితంతో, గొప్ప ఆలోచనలతో వారి శ్రమ మరింత ఆనందమయం కావాలనేదే నా కోరిక. ఇదంతా విద్య ద్వారానే సంభవించగలదు. భారతదేశంలో విద్యావ్యాప్తి నా హృదయానికి దగ్గరైన విషయం''

## IV

బ్రిటిష్ ప్రభుత్వ కాలంలో సామాజిక సంస్కరణల పరిస్థితి ఎలా ఉండేది?

ఆఖరి తరానికి చెందిన ప్రముఖ ప్రగతిశీల మేధావి రాజా సర్, టి. మాధవరావు ఇలా అన్నారు.

> ''ఎవరైనా ఎక్కువసేపు గమనించినా, ఆలోచించినా భూమండలం మీద రాజకీయ, దురాచారాల కంటే తనకు తానుగా విధించుకున్న, సృష్టించుకున్న దురాచారాల వల్ల ఎక్కువగా బాధలకు గురవుతున్నది హిందూ సమాజం మాత్రమేనని అర్థమవుతుంది.''
>
> మిగతా సమాజాలతో పోల్చి చూడటం సంగతెలా వున్నా ఇతర అన్ని సమాజాల కంటే హిందువులు సామాజిక దురాచారాల వల్ల ఎక్కువ నష్టపోతున్నారనేది నిస్సందేహంగా చెప్పవచ్చు.

మరో నిజాయితీగల ప్రముఖ సంఘ సంస్కర్త మహదేవ గోవిందరానడే కూడా హిందూ సమాజానికి సంబంధించి ఎంతో పరిశీలన జరిపారు. ఆయన ఇలా అన్నారు.

> ''ప్రతి దానిలోనూ లబ్ధిపొందాలని చూడటం, ఆర్థికంగా లాభ నష్టాలు బేరీజు వేసుకుంటూపోతే ఏ సమాజంలోనూ సంస్కరణలు వీలు కావు, ముఖ్యంగా సాంప్రదాయం, హోదాలకు ఇంతగా ప్రాముఖ్యత ఇచ్చే మన సమాజంలో అసలు సాధ్యం కాదు. మన ప్రజలు కొన్ని దుర్లక్షణాలు ఉన్నా సాంప్రదాయాలను ఉల్లంఘించేందుకు అంగీకరించరు. అలా ఉల్లంఘించడమంటే దైవాజ్ఞలను ధిక్కరించినట్లేనని భయపడతారు. నిజానికి ఛాందస సమాజానికి జీవించే శక్తి కొరవడింది. అక్కడ సంస్కరణలకు ఎంత మాత్రం వీలుండదు''

నిజానికి అన్ని సామాజిక రుగ్మతలు మతం ఆధారంగా ఏర్పడినవే . హిందూ స్త్రీ లేదా పురుషుడు ఏ పని చేసినా దానికి మతంతో ఏదోరకంగా సంబంధం ఉండి తీరుతుంది. ఒక హిందువు తిన్నా, తాగినా, స్నానం చేసినా, దుస్తులు ధరించినా, పుట్టినా, పెళ్ళి చేసుకున్నా, చివరకు చనిపోయినా, అంతా మత నియమాల ప్రకారమే జరుగుతుంది. అతనికి అన్నీ పవిత్ర చర్యలే. చివరకు ఎవరైనా అతడిని నువ్వు పాపం చేస్తున్నావు అంటే జవాబు ''ఒకవేళ నేను పాపినైతే, ఆ పాపాన్ని మత నియమాల ప్రకారమే చేస్తున్నాను'' అని వస్తుంది.

సమాజం ఎప్పుడూ ఛాందసంగానే ఉంటుంది. మార్పుకు లోనుకావలసిన పరిస్థితులు ఎంతో వత్తిడి తెస్తే తప్ప, అదీ నెమ్మదిగా మారదు. ఎప్పుడు మార్పు మొదలైనా, పాతకు కొత్తకు మధ్య

పోరాటం తప్పదు. గట్టి మద్దతు లభిస్తే తప్ప కొత్త ఓడిపోయే ప్రమాదం ఉంటుంది.

సామాజిక సంస్కరణను తప్పనిసరిగా ముందుకు తీసికెళ్ళాలంటే చట్టపరమైన మద్దతు ఎంతో అవసరం. చట్టం మద్దతు లేకుండా సామాజిక రుగ్మత దేనినీ నిర్మూలించలేం. మరి ఆ రుగ్మత మతంతో ముడిపడిందైతే చట్టం అవసరం మరింత ఎక్కువవుతుంది.

బ్రిటిష్ హయాంలో సామాజిక సంస్కరణ కోసం వచ్చిన చట్టాలెన్ని? సంఘ సంస్కరణ విజయంలో బ్రిటిష్ వారి చరిత్ర చూస్తే నిరుత్సాహకరంగా కన్పిస్తుంది. 150 ఏళ్ళ కాలంలో కేవలం ఆరు చట్టాలు మాత్రమే సామాజిక రుగ్మతల నిర్మూలన కోసం వచ్చాయి.

బ్రిటిష్ వారు రూపొందించిన మొదటి చట్టం బెంగాల్ క్రమబద్ధీకరణ 21/1795. ఇది బెనారస్ ప్రావిన్స్‌లో బ్రాహ్మణులు కూర్వాలు ఏర్పాటు చేయకుండా ఆడ శిశువులు బాలికలను చంపకుండా లేదా గాయపరచకుండా చూసేందుకు ఉద్దేశించింది. అదేవిధంగా రాజ్‌కుమార్‌ల తెగ వారు కూడా ఆడ పిల్లలను చంపకుండా ఈ చట్టం నిర్దేశిస్తుంది.

## ఉపోద్ఘాతం

1. బ్రాహ్మణుల పట్ల హిందువుల గౌరవం, ఆ వ్యక్తుల అనుల్లంఘనీయ వ్యక్తిత్వానికి, నష్టాలకు, ఆ కులం పట్ల నెలకొన్న నిర్దిష్ట భావాలకు ఉన్న గౌరవం బెనారస్, కుంతిత్, బంధో పరగణాలలోని కొన్ని ప్రాంతాలలో వారి మరణ కారణాలకు, వారి విద్య, అవిద్యకు సంబంధించి హిందూ మతంలో స్థిరపడిన కొన్ని భయాందోళనల వల్ల, ఆ బ్రాహ్మణులకు వ్యతిరేకంగా కొన్ని శాసనాలను అమలు చేయడానికి గానీ, ప్రభుత్వ పక్షాన ఏదైనా ప్రక్రియ ప్రారంభించడానికి గానీ వ్యతిరేకత వ్యక్తమవుతుంది. బ్రాహ్మణులు ఇటువంటి సందర్భాలలో తమ శరీరాలను కత్తులతో బాధిస్తారు. విషం మింగుతామని బెదిరిస్తారు. విషం కాకపోతే మరో హానికరమయిన పొడి మింగుతామంటారు. ''కుండం (కూర్వ)'' అనే ఒక పరిధి నిర్మించుకుని, అందులో కట్టెలు పేర్చి, మండే వస్తువులు వేసి, నిరశన (నిజమో-నాటకమో) జరిపి, ఒక వృద్ధురాలిని బలికి సిద్ధం చేసి, కుండంలో అగ్ని రగిల్చి ఎవరయినా ప్రభుత్వ పక్షాన వత్తిడి తెచ్చినా, వ్యతిరేక చర్యలు చేపట్టినా నిరసన వ్యక్తం చేస్తారు. బ్రాహ్మణులు తమకు కావలసిన పరిష్కారం లభించకపోతే లేదా నిరాశ, నిరుత్సాహం నష్టం కలిగితే న్యాయంగానో, అన్యాయంగానో ఆశించిన కార్యం నెరవేరకపోతే వార తమ ఇంటి ఆడవారిని, పిల్లలను బయటకు తీసుకువచ్చి,

ప్రభుత్వ ప్రతినిధి రాకను నిరోధిస్తూ కూర్చొబెడతారు. ఖడ్గం తీసి వారి తలలు నరుకుతామని బెదిరిస్తారు. వారిని బంధించినా, వత్తిడి చేసినా, ఇతర అత్యాచారాలు జరిపినా వారు స్వయంగా గాయాలు చేసుకోవడమేగాక, ఆడవారిని, ఇతర కుటుంబ సభ్యుల తలలను ఖడ్గాలతో నరుకుతారు. ఆ సమయానికి బలి చేయడానికి కొందరు అంతకుముందే సిద్ధం చేస్తారు. మహిళలు కూడా అయిష్టంగా అందుకు విధిలేక ఒప్పుకుంటారని భావించడానికి వీల్లేదు. వారు చిన్నప్పటి నుంచి పెంచుకున్న ఆలోచనాధోరణి ప్రకారం ఏదో ఒక రోజు తాము అటువంటి సత్కార్యానికి అంకితం కావలసి వస్తుందని, ఆత్మగౌరవం రక్షణకు, నిరసనను, పగను వ్యక్తం చేయడానికి ఆత్మ బలిదానం మంచిది, గౌరవ ప్రదమయినదని భావిస్తారు. ఇటువంటి సూత్రాల ఆధారంగానే బ్రాహ్మణులు వారికి రావలసిన హక్కులను, బాకీలను వసూలు చేసేందుకు, విరాళాలు తీసుకునేందుకు, ఆయుధాలు, విషంతోనూ బయలుదేరి ఆ వ్యక్తి ఇంటి ముందుకు చేరతారు. ''ధర్నా'' అనే పద్ధతిని అనుసరిస్తూ వ్యవహరిస్తారు. వారి లక్ష్యం నెరవేరే దాకా ఆ ఇంటిముందు నిరాహారదీక్ష చేస్తారని అనేక మంది వివరించారు. నిరాహారంగా బ్రాహ్మణుడు ఇంటి ముందు కూర్చుంటే ఆయన సంతృప్తి పడేంత వరకు ఇంట్లో భోజన కార్యక్రమాలు జరగడానికి వీల్లేదు. ఈ పని పూర్తయ్యే వరకు ఆ ఇంటికి వేరే రాకపోకలు కూడా వుండవు. ఎవరూ అందుకు ప్రయత్నించడానికి కూడా వీల్లేదు. అట్లా జరిగితే బ్రాహ్మణుడు తనను తాను గాయపరుచుకోవచ్చు లేదా విషం తీసుకోవచ్చు. వీరిని 'ధర్నా' నుంచి తొలగించడానికి భటులు గానీ, న్యాయస్థానం అధికారులు కాని భయంకర పరిణామాలు లేకుండా ఏమీ చేయజాలరు. బంధించినా కూడా వారు ఆత్మహత్యా ప్రయత్నం చేయకుండా ఉండరు. అయితే ఇటువంటి క్రూరమయిన దురాచారాలను మళ్ళీ పునర్జీవం పొందకుండా ఆపవలసి ఉంది. రాజ కుమారుల చేతిలో ఈ దురాచారం ఉంది. జీవిక లేకపోతే పసి బాలికలను చంపడం వంటి అనాగరిక దురాచారాలను నిరోధించేందుకు ఈ రెగ్యులేషన్ చేయడమైంది.

## కుండం ఏర్పాటుచేసిన మహిళలు, పిల్లలపై ఖండన, గాయం, హత్యకు సిద్ధపడిన బ్రాహ్మణులు

II. బ్రాహ్మణుడిపై లేదా బ్రాహ్మణులపై ఎవరైనా జిల్లా కోర్టుకు నగర మెజిస్ట్రేటుకు రాతపూర్వకంగా చేసిన ఫిర్యాదులో అసమ్మతి వల్ల గానీ, నిరసనను గానీ, మరే

కారణంతో గానీ వారు కుండం ఏర్పాటు చేసినట్టు గానీ, చేతులు కాళ్ళు ఖండించడానికి, గాయపరచడానికి లేదా తమ పిల్లలు, మహిళలను వధించడానికి ఉపోద్ఘాతంలో వివరించిన విధంగా ఏర్పాట్లు చేసినట్లయితే, నిజానికి సంబంధించి ప్రమాణం చేసి చెప్పించుకున్న తర్వాత, మెజిస్ట్రేట్ వెంటనే ఆ బ్రాహ్మణునితో గాని, బ్రాహ్మణులతో గానీ మాట్లాడి, పర్షియన్ భాషలో, హిందుస్తానీ భాషలో నాగరీ లిపిలో వ్రాతపూర్వక నోటీసును తన అధికార ముద్రతో రూపొందించి ఆ బ్రాహ్మణునికి నేరుగా గానీ, బంధువులు, మిత్రులు, ఇతరసంబంధితుల ద్వారా గానీ నోటీసు ఇప్పించి, లేదా అందుకు సాధారణంగా అనుసరించవలసిన పద్ధతులను అనుసరించి, ఆ నోటీసును కోర్టు ప్రతినిధి ద్వారా నోటీసును బ్రాహ్మణునికి అందించాలి. ఆ నోటీసులో కుండం తొలగించాలని, దాని చుట్టూ కూర్చోబెట్టిన ఆడవారిని, పిల్లలను తొలగించాలని, వారిని గాయపరిచే, లేదా వధించే ప్రయత్నాలకై నేరారోపణలు చేస్తూ సమాచారం పూర్తి చేయాలి. ఆ బ్రాహ్మణుడు కుండం తొలగించడం, మహిళలు పిల్లలను గాయపరచకుండా వధించకుండా వదలాలని నోటీసులో సూచించిన పనులు చేస్తే వకీలు ద్వారాగానీ, జిల్లా కోర్టు ద్వారాగానీ, ఆ బ్రాహ్మణుడిని 'కుండం' ఏర్పాటుకు పురికొల్పిన సమస్యపై విచారణ జరిపిస్తామని నోటీసులో హామీ ఉండాలి. ఒకవేళ నోటీసులో ఆ హామీని అనుసరించి ఆ బ్రాహ్మణుడు పాటించకపోతే ఆ విషయం నోటీసుపై రాసి ధృవీకరించాలి. మెజిస్ట్రేట్ ఆ బ్రాహ్మణుడి నిర్బంధానికి గాను తన అధికార ముద్ర సంతకం కింద వారంట్ జారీచేయాలి. అందులో ఆ బ్రాహ్మణుడిపై నేరారోపణ ఉండాలి. వారంట్ అమలుకై మహ్మదీయ మతానికి చెందిన ప్యూన్లను గానీ ఎవరైనా హిందువునుగాని ఉపయోగించవచ్చు. ఆ బ్రాహ్మణుడిని మెజిస్ట్రేట్ ముందు నిలబెట్టిన తర్వాత రెగ్యులేషన్ IX, 1793 సెక్షన్ 5లో నిర్దేశించిన విధానం ప్రకారం వారితో వ్యవహరించాలి. ఆరోపిత నేరాలు అప్పటికే జరిగిపోయి ఉంటే నేరం చేసిన వారిని, సహకరించిన వారిని జైలుకు పంపాలి. లేదా బెయిల్‌పై వదలాలి. తర్వాతి సెషన్‌లో వారిపై సర్క్యూట్ కోర్టులో విచారణ జరిపి, ఫిర్యాదిని, సాక్షులలను రప్పించి, ఆ సెషన్‌లో వివరించిన విధంగా చర్యలు తీసుకోవాలి.

## పై నేరాలు చేసినందుకు కోర్టు విచారణ, విధించవలసిన శిక్షలు

III. సర్క్యూట్ కోర్టు వారు రెగ్యులేషన్ IX, 1793, XVI, 1795లో నిర్దేశించిన ప్రక్రియను అనుసరించి ఆ బ్రాహ్మణుడిని విచారించాలి. మహ్మదీయ చట్టం ఈ

స్థానిక నేరాలకు ఉపయోగించకూడదు. కుండం ఏర్పాటు చేసినట్టు గానీ, ఇతర నేరాలకు పాల్పడినట్టు గానీ రుజువైన పక్షంలో ఖైదీకి అతని వార్షిక ఆదాయంతో సమానమయిన సొమ్ము జరిమానాను చెల్లించాలని, లేదా నేరానికి సహాయం చేసినందుకు వార్షిక ఆదాయంలో నాలుగో వంతు చెల్లించాలని జరిమానా విధించవచ్చు. ఈ జరిమానా చెల్లించే వరకు వారు జైలులో ఉండాలి. లేదా అందుకు సరైన జమానత్ చూపాలి. విడుదలైన ఆరు నెలల్లోగా చెల్లించేందుకు గానీ, ఇతర సెక్యూరిటీ ఇవ్వడం లేదా ఈ నేరానికి మళ్ళీ పాల్పడనని హామీ ఇవ్వాలి.

## నిజామత్ అదాలత్‌కు జరిమానా తగ్గించే అధికారం

IV. సెక్షన్ 3 కింద సర్క్యూట్ కోర్టులో జారీ చేసిన శిక్షలను వెనువెంటనే తాత్కాలికంగా రద్దు చేయకుండా పది రోజుల్లో నిజామత్ అదాలత్‌కు పంపాలి. ఆ కోర్టు శిక్షలను తగ్గించడంగానీ, సమంజసం అని భావిస్తే జరిమానాలను యథాతథంగా అమలు చేయడంగానీ జరగాలి. నిజామత్ అదాలత్ ఉత్తర్వులు జారీ చేసేదాకా సర్క్యూట్ ఉత్తర్వులు యథాతథంగా అమలు చేయవలసి ఉంటుంది.

## సెక్షన్ 2 కింద మెజిస్ట్రేట్ వారంట్ జారీచేసిన తర్వాత బ్రాహ్మణుడు పారిపోతే శిక్ష

V. సెక్షన్ 2 కింద జిల్లా లేదా నగర మెజిస్ట్రేట్ జారీచేసిన వారంట్‌ను ఎవరైనా బ్రాహ్మణుడు నిరోధించినా, నిరాకరించినా, కోర్టు ప్యూన్‌లను తిరస్కరించినా, పారిపోయినా, ఏదైనా గదిలోకి వెళ్ళి గడియపెట్టుకున్నా, కస్టడీలోంచి తప్పించుకున్నా, ఏదోరకంగా వారంట్ అందకుండా అమలు కాకుండా చూసినా, కలెక్టర్‌కు వెంటనే లేఖ రాస్తూ ఆయన భూములను తాసిల్దార్ ద్వారా జప్తు చేయించాలని కోరవచ్చు. ఆ భూములు ఆస్తిగా గానీ, తాకట్టు కింద గానీ, పొలాల రూపంలోగానీ, 'లఖరాజ్'గా కానీ ఉన్నా సరే జప్తు చేయమని అడగవచ్చు. వారు లొంగిపోయేవరకు వాటిని జప్తులోనే ఉంచాలి. ఆ భూమి ద్వారా వచ్చిన వసూళ్ళు నుంచి ప్రభుత్వానికి బాకీ ఉన్న పన్నులు మినహాయించుకుని మిగిలిన సొమ్మును ఆ బ్రాహ్మణుడికి లొంగిపోయిన తర్వాత చెల్లించాలి. కుండం ఏర్పాటు, తన ఇంటి మహిళల, పిల్లలపై దాడి, ఖండన, వధ

యత్నాల నేరాల విచారణకు లొంగిపోయిన తర్వాత ఆ భూములను వారికి విడుదల చేయవచ్చు. వారిని సెక్షన్ 3, 4 కింద విచారణ జరిపించాలి.

## బ్రాహ్మణుడు కుండం ఏర్పాటు చేసినా, మహిళలను, పిల్లలను చంపడానికి లేదా గాయపరచడానికి సిద్ధమైనా కలెక్టర్- రెవిన్యూ శాఖ విధానం ప్రకారం చర్య తీసుకునేందుకు మెజిస్ట్రేట్‌కు దరఖాస్తు చేసుకోవడం

VI. తనపై దస్తక్, లేదా రిట్ (ఆజ్ఞ) లేదా పన్ను (రెవిన్యూ) బకాయిలు చెల్లించాలని రెవిన్యూ శాఖ తాసీల్దారు, కలెక్టర్ జారీ చేసిన ఉత్తర్వుకు వ్యతిరేకంగా బ్రాహ్మణుడు కుండం ఏర్పాటు చేసినా మహిళలు పిల్లలను చంపేందుకు లేదా గాయపరిచేందుకు చర్యలు తీసుకున్నా బెనారస్ కలెక్టర్ గానీ తాసీల్దార్ గానీ రెగ్యులేషన్ VI 1795 ప్రకారం దస్తక్‌లు జారీ చేయవచ్చు. తాసీల్దార్ జారీ చేసిన దస్తక్‌ను కనుక వ్యతిరేకిస్తే, అతను ఆ దస్తక్ అమలుకు వెంటనే వత్తిడి చేయకుండా కలెక్టర్‌కు వెంటనే ఫిర్యాదు చేయాలి. దస్తక్‌ను అందించే కోర్టు ప్యూన్ వ్రాతపూర్వక ప్రకటనను జతచేయాలి. ఆ సమాచారంపైన గానీ, లేదా తన దస్తక్‌ను కూడా వ్యతిరేకించారని తెలిసిన సమాచారం పైన గానీ కలెక్టర్ ప్రభుత్వ న్యాయవాది ద్వారా ప్రభుత్వానికి బాకీ ఉన్న సొమ్ము గురించి జిల్లా లేదా నగర మెజిస్ట్రేట్‌కు ఫిర్యాదు చేయాలి. ఆ భూములు ఏ కోర్టు పరిధిలో ఉంటే ఆ కోర్టుకు ఫిర్యాదు చేయాలి. దస్తక్ అందించవలసిన ప్యూన్ ప్రమాణపూర్వకంగా సాక్ష్యం ఇచ్చిన తర్వాత, కలెక్టర్ ఇచ్చిన వినతిపత్రంలో పేర్కొన్న అంశాల, నిజాన్ని ధృవీకరిస్తూ సాక్ష్యాన్ని ఇచ్చిన తర్వాత, లేదా మరే ఇతర నమ్మకస్తుడయినా ఆ బ్రాహ్మణుడు కుండం ఏర్పాట చేశాడని, తన వాళ్ళను చంపబోయాడని సాక్ష్యం చెప్పిన తర్వాతయినా, ఆ మెజిస్ట్రేట్ బ్రాహ్మణుడికి రాత పూర్వకంగా పర్షియన్ భాషలో హిందుస్తానీ భాషలో గానీ నాగరి భాషలో గానీ నోటీసు రాసి, ఆయనకు లేదా ఆయన బంధువులకు ఇచ్చి, వారికి బంధువులెవరూ లేకపోతే అతని మతానికే చెందిన ప్యూన్ ద్వారా నోటీసు ఇచ్చి, కుండం తొలగింపు లేదా గాయపరచదలచిన మహిళల్ని, పిల్లలను వదిలేయమని, రెవిన్యూ బకాయిలు చెల్లించమని ఆదేశించాలి. లేదా ఇందుకు వ్యతిరేకంగా వారు చెప్పుకునేదేమయినా ఉంటే ఆ విషయాలు

చెప్పే అవకాశం ఇవ్వాలి. కేసు బలాబలాల ఆధారంగా విచారణ జరిపి తీర్మానం చేయాలి- అందుకు రెగ్యులేషన్ VI, 1795లో పేర్కొన్న సూత్రాలను, రెవిన్యూ అక్కౌంట్‌లను డిమాండ్‌లను అనుసరించాలి. బ్రాహ్మణులు కుండం తొలగించి, మహిళలను, పిల్లలను గాయాలు చేయకుండా చంపకుండా వదిలి, రెవిన్యూ బకాయి చెల్లించి, స్వయంగా గానీ, వకీలు ద్వారా గానీ నగర లేదా జిల్లా కోర్టుకు జమానతు చెల్లిస్తే బకాయి డిమాండ్ న్యాయమైందా కాదా అనే విషయంలో సరైన విచారణ జరుపుతామని నోటీసులో హామీ ఇవ్వాలి. నోటీసు ద్వారా బ్రాహ్మణులు ఈ పనులు మానకపోతే, ఆ విషయాన్ని రాతపూర్వకంగా పేర్కొని ఆ కాగితంపై పార్టీల చేత, ధృవీకరణ సంతకాలు చేయించి మెజిస్ట్రేట్‌కు పంపాలి. ఆ బ్రాహ్మణుడి నిర్బంధానికి మెజిస్ట్రేట్ అధికారికంగా వారంట్ జారీ చేయాలి. అందులో నేరం, బాకీ, ఆరోపణ అన్నీ వివరంగా పేర్కొనాలి. మహ్మదీయ మతస్థులయిన ప్యూన్‌ల చేత వారంట్లు సెక్షన్ 2లో పేర్కొన్న పద్ధతి ప్రకారం అమలు చేయాలి. బ్రాహ్మణులు వారంట్‌ను తిరస్కరించినా, వారంట్‌తో వచ్చిన వారిని నిరోధించినా, కస్టడీ నుంచి తప్పించుకున్నా లేచి ఇంట్లో తలుపులు పెట్టుకుని బయటకు రాకపోయినా, ఎక్కడికైనా వెళ్ళిపోయినా, వారంట్ అమలు కాకుండా చేసినట్లయితే, మెజిస్ట్రేట్ ఈ విషయం తెలియగానే తాసీల్దార్‌కు లేఖ ద్వారా ఆ బ్రాహ్మణుని భూములు లేదా ఆస్తి జప్తు చేయాలని, తాకట్టును, పొలాలను, జప్తు చేయాలని ఆదేశించవచ్చు. భూములు ఆ విధంగా జప్తులో ఉండగా, లాభాలు ప్రభుత్వానికి చెందుతాయి. ఎంతదాకా అంటే బాకీ తీరేవరకూ. లాభాల నుండి గానీ లేదా బ్రాహ్మణులు చెల్లించడం ద్వారా గానీ బాకీ తీర్చడం లేదా, బ్రాహ్మణుడు స్వయంగా హాజరై విచారణకు లొంగిపోయే వరకు, జప్తులో ఉంచాలి. ఆయనతో పాటు, సహకరించిన వారిని కుండం ఏర్పాటు, మహిళలు, పిల్లలగాయపరచడం, చంపడంలో తోడు ఉన్నవారిని కూడా విచారించాలి. అదేవిధంగా శిక్ష తగ్గించే అధికారం కూడా సెక్షన్ 2,3,4 ప్రకారం ఉంటుంది.

## కుండం ఏర్పాటుచేసి, నిప్పు రగిల్చిన బ్రాహ్మణులను, ఆ కుండంలో ఎవరయినా చనిపోతే హత్యా నేరానికి విచారించాలి

VII ప్రభుత్వానికి గానీ, ప్రభుత్వ అధికారులు, సేవకులకు వ్యతిరేకంగా, వారి పనులను నిరసిస్తూ బ్రాహ్మణులు కుండం ఏర్పాటుచేసి, ఎవరినైనా దహించి చంపితే,

ఆ కుండం కట్టిన బ్రాహ్మణులపైన వారు ఇందుకు నియమించిన ఉద్యోగులను, పార్టీలను, కట్టెలు పేర్చిన వారిని, తగలబెట్టిన వారిపైన హత్యా నేరం మోపి విచారణ జరిపి సర్క్యూట్ కోర్టు నమ్మే విధంగా రుజువు చేసిన తర్వాత బ్రాహ్మణులకు, ఇతరులకు మరణశిక్ష విధించాలి. వార ఖతల్ (హత్య) కు పాల్పడినట్టుగా భావించి, మహ్మదన్ శాసనం ప్రకారం కుట్ర పన్ని చేసిన హత్యగా పరిగణించి, ప్రజలకు ఇదొక ఉదాహరణగా చాటి చెప్పేందుకు గాను శిక్షితులైన వారిపై 'శిక్ష'ను ప్రకటించాలి. వెంటనే శిక్షితులకు విచారణ జరిపిన తీరు, విచారణలో తేలిన అంశాలు, విధించిన శిక్ష గురించి వివరించాలి. రెగ్యులేషన్ IX, 1793. సెక్షన్ 47లో పేర్కొన్న ప్రకారం ఈ వివరాలను శిక్షితులకు చెప్పడమేగాక నిజామత్ అదాలత్‌కు తెలిపాలి. నిందితులు ఆ కోర్టు తుది తీర్పు వెలువడే వరకు జైలులో ఉండాలి. నిజామత్ అదాలత్ ఆ శిక్షను అంగీకరిస్తే నిందితులను కలకత్తాకు పంపాలి. అక్కడి నుంచి వారికి సెక్షన్ 23, రెగ్యులేషన్ XVI, 1795 ప్రకారం యావజ్జీవ దేశ బహిష్కార శిక్షకు గురిచేయాలి. ఈ సెక్షన్ బ్రాహ్మణులు బెనారస్ ప్రావిన్స్‌లో హత్యచేసి మరణ శిక్షకు గురయితే శిక్ష తగ్గించాలి. సర్క్యూట్ కోర్టు విధించిన శిక్షను అమలుచేసే కారణం లేదనుకుంటే నిజామత్ అదాలత్ శిక్ష తగ్గించవచ్చు. గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్‌కు నేరారోపితులైన బ్రాహ్మణులు, వారికి సహకరించిన వారికి విధించిన శిక్షలు తగ్గించాలని, లేదా క్షమించాలని కోర్టు కోరవచ్చు.

## మహిళలను, పిల్లలను గాయపరిచిన బ్రాహ్మణులకు శిక్షలు

VIII. ఉపోద్ఘాతంలో వివరించిన సందర్భాలలో బ్రాహ్మణులు కింద సెక్షన్లలో వివరించి పరిస్థితుల ప్రకారం లేదా దాదాపు అటువంటి పరిస్థితులలో ఖడ్గంతో కాని, ఇతర ఆయుధాలతో కాని తనను తాను గానీ, తనవారిని గానీ పిల్లలను గానీ, ఇతర మహిళలను పిల్లలను గానీ, తనపై ఆమీల్, తాసీల్దార్, అధికారులు, నౌకర్లు, రెవిన్యూ, న్యాయ ప్రతినిధులు తీసుకున్న చర్యలకు వ్యతిరేకంగా, నిరసన పూర్వకంగా గాయపరిస్తే, లేదా ఇతరుల చర్యలకు నిరసనగా గాయపరిస్తే సర్క్యూట్ కోర్టు వారిని బహిష్కార శిక్షకు గురి చేయవచ్చు. ఆ శిక్షను కూడా నిజామత్ అదాలత్‌కు పంపి క్షమాభిక్షను, శిక్ష తగ్గింపును సెక్షన్ 7 ప్రకారం కోరవచ్చు.

## మహిళలను పిల్లలను చంపిన బ్రాహ్మణులకు శిక్షలు

IX ఉపోద్ఘాతంలో వివరించిన కారణాలు పరిస్థితుల మధ్య గానీ, లేదా ఈ రెగ్యులేషన్‌లో తర్వాత సెక్షన్‌ల ద్వారా వివరించిన పరిస్థితుల మధ్య ఖడ్గాన్ని, ఇతర ఆయుధాలను గానీ ఉపయోగించి తమ లేదా పర మహిళలను, పిల్లలను లేదా వారిలో కొందరిని- తమకు వ్యతిరేకంగా జరిగిన అమీల్, తాసీల్దార్ లేదా ఇతర అధికారులు, నౌకర్లు, రెవిన్యూ, న్యాయ శాఖ ప్రతినిధులు చేపట్టిన చర్యలకు, లేదా ఇతర వ్యక్తుల చర్యలకు నిరసనగా చంపినట్టయితే, ఆ అంశాలు రుజువైతే సర్క్యూట్ కోర్టు మరణశిక్ష విధించవచ్చు. దాన్ని నిజామత్ అదాలత్ పరిశీలనకు పంపాలి. శిక్షతగ్గింపు, క్షమాభిక్ష కోసం సెక్షన్7 కింద అడగవచ్చు. 1789 జూన్17వ తేదీన గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ జారీచేసిన ఉత్తర్వు ప్రకారం, బెనారస్ రెసిడెంట్ జులై7, 1789న జారీచేసిన ఉత్తర్వులకు లోబడి నేరస్తులయిన బ్రాహ్మణుల కుటుంబాలను బెనారస్ ప్రావిన్స్ నుండి, కంపెనీ సరిహద్దుల నుండి బహిష్కరించవచ్చు, వారి భూములను, ఇతర ఆస్తులను స్వాధీనం చేసుకోవచ్చు. వాటిని ప్రభుత్వం అమ్మివేయవచ్చు. హత్యా నేరం కింద శిక్ష విధించే తీర్పులోనే సర్క్యూట్ కోర్టు అన్ని రకాల ఉత్తర్వులను చేర్చవచ్చు. వాటిని వెంటనే నిజామత్ అదాలత్‌కు పంపుతూ, బ్రాహ్మణ కుటుంబంలో వారి సెక్స్, వయసు, సంఖ్య వివరించి వారిని కఠినంగా బహిష్కరించవచ్చు లేదా సలహా ఇస్తూ, బ్రాహ్మణులకు విధించిన శిక్షను ధృవీకరించాలా, అమలు చేయాలా, తగ్గించాలా, ఆస్తి స్వాధీనం చేసుకోవాలా అని సూచించాలి. నిజామత్ అదాలత్ గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్‌కు ఈ శిక్షలను ధృవీకరించాలని, లేదా తగ్గించాలని, లేదా క్షమించాలని, వారి ఆస్తి స్వాధీనం చేసుకోవాలని, వారి కుటుంబ ఆస్తులు స్వాధీనం చేసుకోవాలని గానీ కోరవచ్చు. గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ ఉత్తర్వులు జారీచేసే వరకూ ఈ శిక్షలను, భూమి స్వాధీనం వ్యవహారాలను అమలు చేయవచ్చు. గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ అంగీకరించి సంబంధించిన మేరకు శిక్షను స్వాధీనాన్ని అమలు చేయవచ్చు. స్వాధీనం చేసిన ఆస్తుల అమ్మకాన్ని కూడా ఆయన నిర్దేశించిన విధానం ప్రకారం అమలు చేయాలి.

## నేరస్తుల కుటుంబ ఆస్తుల స్వాధీనానికి పరిమితులు

X. సెక్షన్ 9 కింద నిజామత్ అదాలత్ విచక్షణను వినియోగించి గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్‌కు లేఖ రాస్తూ సర్క్యూట్ కోర్టు విధించిన శిక్షలను తగ్గించాలని సూచించే

గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ బహిష్కార శిక్షను నేరం చేసిన వ్యక్తికే లేదా మరికొందరికే పరిమితం చేయాలని నియమం. అటువంటి కేసులలో ఆస్తి స్వాధీనాలు ఉండవు. బహిష్కారం మినహాయించిన వ్యక్తుల ఆధీనంలోనే ఆ ఆస్తులు ఉంచాలి.

## ధర్నాలో ఉన్న బ్రాహ్మణులకు సంబంధించిన రెగ్యులేషన్స్

XI. మొదటిది: గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ 1792, నవంబర్ 2న ప్రచురించిన ఉత్తర్వు,.ఆ తర్వాత డిసెంబర్ 22, 1792న బెనారస్‌లో జారీ అయిన ఉత్తర్వు, 1794 నవంబర్ 7న గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ జారీచేసిన మరో ఉత్తర్వు ప్రకారం ధర్నా నిరోధానికి ఆ నేరానికి పాల్పడిన బ్రాహ్మణుల విచారణ శిక్షలకు సంబంధించి ఈ కింది నియమాలు రూపొందించారు.

## ధర్నాలో కూర్చున్న బ్రాహ్మణులను బంధించేందుకు మెజిస్ట్రేట్ ఆదేశించాలి

రెండోది: ధర్నాలో బ్రాహ్మణులు కూర్చున్నట్లు అందిన ఫిర్యాదు మేరకు, ఆ సమాచారం నిజమే అని ప్రమాణపూర్తిగా చెప్పిన తర్వాత మెజిస్ట్రేట్ అరెస్టు వారంట్‌ను తన సీలు, సంతకంతో జారీ చేయాలని, ఫిర్యాదులో కూర్చున్న వ్యక్తి అరెస్టుకు ఆదేశించాలి, మెజిస్ట్రేట్ ఆవిధంగా బంధితులైన వ్యక్తుల నేరాలను, పరిస్థితులను విచారించేందుకు ఫిర్యాది, ఇతర సాక్షుల వ్యక్తుల వాంజ్మలాలను స్వీకరించాలి. ఈ కేసుతో సంబంధం, సమాచారం ఉన్న ఇతరుల నుంచి రాత పూర్వకంగా ప్రకటనలను తీసుకోవాలి. విచారణ తర్వాత ఆరోపించిన నేరం రుజావు కాకపోతే వారిని అనుమానించడానికి వీల్లేకపోతే ఆ బ్రాహ్మణులను వెంటనే విడుదల చేయాలని మెజిస్ట్రేట్ ఆజ్ఞాపించాలి. రెగ్యులేషన్ IX, 1793 సెక్షన్ 17 ప్రకారం అందుకు కారణాలను నమోదు చేయాలి. లేదా నేరం జరిగినట్టు రుజువైతే లేదా ప్రధాన నిందితులు, అతనికి సహకరించిన వారు నేరం జరిపారని అనుమానించగలిగితే వారిని జైలులో ఉంచడమో, బెయిల్‌కు బద్ధులను చేయడమో, తదుపరి విచారణకు వారిని ప్రాసిక్యూషన్‌కు గాను, సాక్షుల హాజరీకి గాను సెక్షన్ 5, రెగ్యులేషన్ IX, 1793 కింద సర్క్యూట్ కోర్టుకు పంపాలి. ఈ రెగ్యులేషన్, 1795 రెగ్యులేషన్ XVI ప్రకారం సర్క్యూట్ కోర్టు విచారణ జరపాలి. సాక్ష్యుల ముగిసిన తర్వాత కోర్టు పండితుడికి

కేసు పంపి ''వ్యవస్థ'' లేదా శాస్త్రం ఏం చెప్పిందో వ్రాతపూర్వకంగా వివరించాలని కోరాలి. సాక్ష్యంలో పేర్కొన్న అంశాలు నిజాన్ని రుజువు చేసినట్టేనా పరిశీలించాలి. ధర్నా రుజువై, ''వ్యవస్థ'' కూడా ఆ అంశాన్ని ధృవీకరిస్తే నిందితులైన ఖైదీలను బనారస్‌నుంచి బహిష్కరించాలని, హక్కులను స్వాధీనం చేసుకుంటూ శిక్ష విధించాలి. సర్క్యూట్ కోర్టు నిజామత్ అదాలత్‌కు ఈ కేసును పంపి, ఆ కోర్టు పూర్తిగా ధృవీకరించి, శిక్షను అమలు చేయాలని కోరేవరకూ, లేదా ప్రావిన్స్ నుంచి బహిష్కరించే శిక్షను తగ్గించాలని, 'ధర్నా' దేనికయితే నిర్వహించారో ఆ ఆస్తిని, హక్కులను స్వాధీనం చేసుకోవాలని, లేదా తదితర సమంజసమయిన ఉత్తర్వులు వచ్చేవరకూ శిక్షను అమలు చేయవద్దు.

## నేరం జరిగినా, 'ధర్నా'కు సంబంధించిన అన్ని శాసనపరమయిన అంశాలు రుజువు కాకపోతే సర్క్యూట్ కోర్టు అనుసరించవలసిన ప్రక్రియ.

XII 'ధర్నా' నేరాన్ని ధృవీకరించే పరిస్థితులు ఉన్నట్టు ప్రమాణపూర్వకంగా, సెక్షన్ II కింద పండిట్ ''వ్యవస్థ''లో పేర్కొనకపోతే, సర్క్యూట్ కోర్టు ధర్నా జరిగిందని, తనకు లభించిన సాక్ష్యాధారాలతో అభిప్రాయపడితే, 'ధర్నా'ను రుజువు చేయడానికి అవసరమయిన అన్ని శాసనపరమయిన అంశాలు హిందూ ధర్మశాస్త్రాల ఆధారంగా వ్యవస్థాపితం కాకపోయినా (1794 నవంబర్ 7 నాటి గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ ఉత్తర్వు ప్రకారం) ఖైదీలనుంచి ముచల్కా లేదా మళ్ళీ ధర్నాకు పాల్పడబోమని, 'ధర్నా' వంటి ఏ ఇతర చర్యను చేపట్టబోననే హామీని తీసుకోవాలి. సర్క్యూట్ కోర్టులో ప్రాసిక్యూట్ అయిన తర్వాత విచారణ జరిపిన న్యాయమూర్తులు అందరూ లేదా అధికులు, ఆచర్య 'ధర్నా' కిందికి వస్తుందని భావిస్తే, రెండోసారి ఆ నేరానికి పాల్పడినట్టు రుజువైతే అందుకు ధర్నాకు విధించే శిక్షకు, గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ ఆదేశించిన పకారం, గురికావలసి వస్తుంది. అంతేగాక రాజ్యం నుంచి బహిష్కారం, క్లెయిమ్‌లో హక్కులు కోల్పోవడం వంటి శిక్షలకు కూడా గురవుతారు.

## రాజకుమారులు తమ ఆడ పిల్లలను పోషించలేక వారి వినాశనానికి వదిలేస్తే విచారణ విధానం

XIII. 1789 డిసెంబర్‌నెలలో జారీచేసిన ఉత్తర్వుల ప్రకారం రాజ కుమారులు తమ పసి బాలికలను ఆకలి చావులకు గురిచేసే విధానాన్ని ఆపకుంటే బెనారస్‌లో నగర జిల్లా కోర్టుల ద్వారా రాజకుమారులు తమ పసి బాలికలను కావాలని పోషించకుండా వదిలేసి, వారి మరణానికి కారణమయితే, ఉపోద్ఘాతంలో పేర్కొన్నట్టు, లేదా ఏ ఇతర విధానంలోనైనా అందుకుపాల్పడితే, మెజిస్ట్రేట్‌కు సమాచారం అందితే, ఆ సమాచారం నిజమని ప్రమాణపూర్వకంగా తెలిపితే, ఆ రాజకుమారుడిని సెక్షన్ 5, రెగ్యులేషన్ IX **1793** కింద పేర్కొన్న విధంగా నిర్బంధించి, విచారణకు ఆదేశించాలి. నేరం జరిగిందని మెజిస్ట్రేట్ భావిస్తే, ఖైదీకి ఆ నేరంలో బాధ్యత ఉందని తేలితే, మెజిస్ట్రేట్ అతనిని జైలుకు పంపి సర్క్యూట్ కోర్టులో విచారణకు పంపాలి. ఇంతకుముందు పేర్కొన్న సెక్షన్ ప్రకారం సమాచారం ఇచ్చిన, ఫిర్యాదు చేసిన వ్యక్తులు కోర్టుకు హాజరుకావడానికి అన్ని చర్యలూ తీసుకోవాలి. 1793 రెగ్యులేషన్ **IX, 1795** రెగ్యులేషన్ **XVI** పేర్కొన్న విధానం ప్రకారం ఖైదీని ఇతర హత్యా నేరాలకు విచారణ జరపాలి.

బ్రిటిష్ వారు చేపట్టిన రెండో సాంఘిక శాసనం బెంగాల్ రెగ్యులేషన్ VI ఆఫ్ 1802. సావ్‌గర్, తదితర బాలల బలి నిరోధించడానికి ఈ రెగ్యులేషన్ చేశారు. అది ఈ విధంగా ఉంది:-

## రెగ్యులేషన్ VI క్రీ.శ. 1802

సావ్‌గర్, ఇతర ప్రాంతాల్లో బాలల బలి నిరోధించేందుకు ఒక రెగ్యులేషన్. 1802 ఆగస్టు 20న గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ జారీ చేసినది.

I.సావ్‌గోర్, బన్స్‌బర్యా, చాగాఢ్, గంగా నదిపై తదితర ప్రాంతాలలో పిల్లలను నీట విసిరి, లేదా సొర చేపలకు ఎరగా వేసి బలి ఇచ్చే అమానుష నేరాలు అమలులో ఉన్నాయని గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్‌కు విన్నవించారు. సావ్‌గర్‌లో ప్రతి నవంబర్, జనవరి నెలల్లో వచ్చే పూర్ణిమ రోజున క్రమం తప్పకుండా అటువంటి బలులు, పెద్ద వారిని కూడా బలి చేయడం జరుగుతున్నది. అక్కడి ప్రాంతాల ఆచారం ప్రకారం పిల్లలను సావ్‌గర్ సముద్రంలో విసిరిన తర్వాత మళ్ళీ వారిని రక్షించే వారు కారు. మరికొన్ని సందర్భాల్లో విచిత్రంగా మరీ క్రూరమయిన బలిని అమలుచేసే వారు.

నిజానికి ఇది హిందూ న్యాయం ప్రకారం ఆమోదయోగ్యమయిన బలి కాదు. ప్రజలు విస్తృతంగా పాటించే మత నియమాలకు కూడా అనుగుణం కాదు. ఏనాడు మహ్మదీయ, హిందూ ప్రభుత్వాలు ఈ బలులను అధికారికంగా సమర్థించలేదు. కనుక ఈ నేరానికి పాల్పడిన వారిని శిక్షకు గురి చేయవచ్చు. ఆచారం అనే మిషతో బాధ్యత తప్పించుకునే వీల్లేదు. కాని ఇటువంటి మరీ దారుణ అమానుషాన్ని సమర్థవంతంగా నిరోధించేందుకు గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ బెంగాల్, ఒరిస్సా, బెనారస్‌లలో అమలయ్యేందుకు గాను ఈ రెగ్యులేషన్ జారీ చేస్తున్నారు.

II. ఎవరైనా వ్యక్తిగానీ, వ్యక్తులుగానీ కావాలని ఉద్దేశపూర్వకంగా ప్రాణం తీసేందుకుగాను పిల్లలను, పెద్దలను లేదా పరిపక్వత రాని వారిని సముద్రంలో, గంగలో మరే నదిలో, లేదా నీటిలో విసిరినా, విసిరేందుకు కారణమయినా, అతని అనుమతి ఉన్నా లేకపోయినా ఆ విసిరివేత వల్ల ఆ వ్యక్తి మునిగిపోయినా, సొర చేపలు, ఇతరాల వల్ల నశించినా, ఇంకే రకంగానైనా నశించినా, అందుకు బాధ్యులయిన వ్యక్తిని, వ్యక్తులను ఉద్దేశపూర్వక హత్యా నేరానికి పాల్పడిన వారుగా పరిగణించి, నేరం రుజువైతే మరణశిక్ష విధించాలి. అతనికి ఈ క్రియలో సహకరించిన, ప్రోత్సహించిన వారందరూ సహ నేరస్తులుగా భావించి అందుకు అనుగుణంగా శిక్షించాలి. ఈ సెక్షన్లో పేర్కొన్న నేరాలకు పాల్పడిన నేరస్తులను, సహక నేరస్తులను నిజామత్ అదాలత్ కోర్టుకు పంపి సెక్షన్ LXX, రెగ్యులేషన్ IX, 1793 కింద శిక్షను నిర్ధారించి శాసన్ అధికారల ఫత్వాకు అనుగుణంగా వ్యవహరించాలి. సెక్షన్ LXXIX, రెగ్యులేషన్ IX, 1793 కింద ఈ ఖైదీని గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్‌కు క్షమాభిక్షకు అర్హుడుగా భావించితే అందుకు పంపాలి.

III. పై సెక్షన్‌లో పేర్కొన్న విధంగా విసిరి వేయబడిన పిల్లవాడు లేదా వ్యక్తి (పరిపక్వత రాని) వినాశనం కాకుండా రక్షింపబడినా, ఏ ఇతర మార్గం ద్వారా నైనా తప్పించుకోగలిగితే, ఆ వ్యక్తిని ఆ ప్రమాదానికి గురిచేసిన వారిని, అందుకు సహకరించిన వారిని, తీవ్ర నేరానికి పాల్పడిన వ్యక్తులుగా పరిగణిస్తూ, లా అధికారుల ఫత్వాల మేరకు సర్క్యూట్ కోర్టులు కేసుకు అనుగుణంగా విచారించి శిక్షించాలి.

IV. ఈ దురాచారం అమలులో ఉన్న జిల్లాల మెజిస్ట్రేట్‌లు పిల్లలను బలిచేసే అమానుషం మళ్ళీ జరగకుండా అన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. ఈ రెగ్యులేషన్‌లో అంశాలను ఆయా ప్రాంతాల్లో, ఆయా కాలాల్లో బలులు జరిగే సందర్భాల్లో అందరికీ ప్రకటించి తెలియజేయాలి.

రెండో సాంఘిక శాసనం 'సతీ'కి సంబంధించినది. అది బెంగాల్ రెగ్యులేషన్ XVII ఆఫ్ 1829, అది ఈ విధంగా ఉంది.

## రెగ్యులేషన్ XVII క్రీ.శ. 1829

'సతీ' ఆచారం, లేదా హిందూ విధవ స్త్రీల సజీవ దహనం లేదా సజీవ ఖననం క్రిమినల్ కోర్టుల్లో శిక్షించ దగిన నేరాలుగా ప్రకటించేందుకు ఈ రెగ్యులేషన్‌ను గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ 1829 డిసెంబర్ 4న జారీ చేశారు.

## ఉపోద్ఘాతం

I. సతీసహగమనం, హిందూ విధవ స్త్రీల సజీవదహనం, లేదా సజీవఖననం పూర్తిగా మానవత్వాన్ని భంగపరిచే సంఘటన. హిందూ మతంలో ఎక్కడా అది అనుసరించవలసిన విధి అని పేర్కొనలేదు. నిజానికి భర్త మరణించిన స్త్రీ స్వచ్ఛమయిన నిరామయ జీవితాన్ని గడపాలని నిర్దేశించింది. అదీగాక ఈ దురాచారం దేశంలోని అత్యధిక ప్రాంతాల్లో అమలులో లేదు. కొన్ని జిల్లాల్లో దాని ఉనికి కూడా లేదు. ఈ దురాచారం అమలులో వున్న ప్రాంతాల్లో కూడా అతి భయంకర దారుణాలు జరపడం వల్ల హిందువులు కూడా ఇది దుర్భరమయిన దుశ్చర్య కింద నిషేధించ తగిన పని అని భావిస్తున్నారు. ఈ దురాచారాన్ని నిర్మూలించడానికి ఇదివరకు చేసిన ప్రయత్నాలు విఫలం కావడం వల్ల గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్, సతీసహగమనాన్ని పూర్తిగా తొలగించాలంటే దీన్ని నిషేధించక తప్పదనే అభిప్రాయానికి వచ్చారు. బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశంలో అనుసరించే ప్రప్రథమ, అత్యంత ప్రధానమయిన విధానమయిన సెక్యూలరిజాన్ని, న్యాయం మానవతను భంగపరచనంత వరకు మత సంప్రదాయాల పాటింపులో జోక్యం చేసుకోరాదనే సిద్ధాంతాన్ని విడనాడకుండానే ఈవిధమయిన సదభిప్రాయాలతో, ఫోర్ట్ విలియం ఆధ్వర్యంలో ఉన్న పౌరులందరికీ దేశహద్దులన్నిటికీ వర్తించే విధంగా ఈ క్రింది నియమాలను శాసనంగా రూపొందించడం అవసరమని భావిస్తున్నది.

II. ఇందుమూలముగా సతీ దురాచారం, అంటే భర్త చనిపోయిన హైందవ స్త్రీల సజీవ దహనం, సజీవ ఖననం చట్ట వ్యతిరేకమనీ, క్రిమినల్ కోర్టుల ద్వారా శిక్షలో తగిన నేరమని ప్రకటించడమైనది.

III. మొదటిది: అందరు జమీన్‌దారులు, తాలూక్‌దార్‌లు, మాల్‌గుజారీ లాఖీరాజ్ భూముల యజమానులు. సదర్ రైతులు, అన్నిరకాల భూముల కిరాయిదారులు, వారిపై ఆధారపడిన తాలూక్‌దారులు, నాయబ్‌లు, ఇతర స్థానిక ఏజెంట్లు, స్థానిక అధికారులు, రెవిన్యూ, ప్రభుత్వ భూమి కిరాయి వసూలుదార్లు, కోర్ట్ ఆఫ్ వార్డ్స్ వసూలుదార్లు, మండల్స్, గ్రామ పెద్దలందరికీ ఇందుమూలముగా తెలియజేయడమేమిటంటే ఇక ముందు సెక్షన్‌లో వివరించబోయే ''బలి''కి సంబంధించిన ప్రయత్నాలు జరుగుతున్నాయని తెలియగానే ఆ సమాచారాన్ని వెనువెంటనే సమీప పోలీసుస్టేషన్ అధికారికి తెలియజేయవలసి వుంటుంది. ఆ బాధ్యత కలిగిన జమీందారు కాని, పైన వివరించిన ఏ ఇతర వ్యక్తిగానీ కావాలని ఈ సమాచారం చెప్పకపోయినా, ఆలస్యం చేసినా అతనిపై మెజిస్ట్రేట్ లేదా జాయింట్ మెజిస్ట్రేట్ 200 రూపాయలకు మించని ఏ సొమ్మునైనా జరిమానాగా చెల్లించాలని ఆదేశించవచ్చు. ఒకవేళ చెల్లించకపోతే ఆరు నెలలకు లోపున ఎంతకాలపు జైలుశిక్షనైనా విధించవచ్చు.

## 'బలి' ఉద్దేశం తెలియగానే పోలీసుదరోగా వ్యవహరించవలసిన తీరు

రెండోది:- ఈ రెగ్యులేషన్ ద్వారా నిషేధితమయిన బలి జరగబోతున్నదని తెలియగానే పోలీసుదరోగా బలి జరుగబోయే స్థలానికి స్వయంగా వెళ్ళాలి లేదా మహరీర్‌ను, జమేదార్‌ను, మరికొందరు హిందూమతానికి చెందిన బర్కందాజ్‌లన వెంట ఇచ్చి అక్కడికి పంపాలి. పోలీసు అదికారి అక్కడ బలి జరపడానికి జమ అయిన వ్యక్తులకు ఆ పని చట్ట వ్యతిరేకమనీ చెప్పి వారిని అక్కడినుంచి వెళ్ళిపొమ్మని చెప్పాలి. ఒకవేళ ఆ పని జరిపితే వారంతా నేరంలో భాగస్వాములుగా క్రిమినల్ కోర్టుల ద్వారా శిక్షలకు పాత్రులవుతారని చెప్పాలి అయినా అక్కడ సమావేశమయిన వ్యక్తులు, చెప్పిన మాటలు వినకుండా 'బలి' చేయడానికి సిద్ధమయితే పోలీసు అధికారులు తమ పరిధిలో ఉన్న అధికారాలను వినిహచారణకు అవసరమయిన చర్యలు తీసుకోవాలి.

## ఆ 'బలి' జరిగేదాకా సమాచార తెలియకపోతే ఏ విధంగా వ్యవహరించాలి

మూడోది:- పోలీసు అధికారులకు, నిషేధించిన బలి సమాచారం సంఘటన జరిగేదాకా తెలియకపోయినా లేదా వీరు వెళ్ళేసరికి ఆ సంఘటన జరిగిపోయినా,

అసహజ మరణాల విషయంలో ఏవిధంగా సమగ్ర విచారణ జరుపుతారో ఆవిధంగా పూర్తి విచారణ జరిపించాల్సి ఉంటుంది. తర్వాత మెజిస్ట్రేట్‌కు, జాయింట్ మెజిస్ట్రేట్‌కు సమాచారం ఇచ్చి వారి ఆదేశాలను పొందాలి.

IV మొదిటిది: పోలీసు దరోగాలు, పైన చెప్పిన సెక్షన్ల ప్రకారం పంపిననివేదికలు అందుకున్న తర్వాత మెజిస్ట్రేట్ లేదా జాయింట్ మెజిస్ట్రేట్ తన అధికార పరిధి విస్తరించిన ప్రాంతంలో జరిగిన 'బలి' సంఘటన పూర్వాపరాలను విచారించాలి. సంబంధిత వ్యక్తులను రప్పించి సర్క్యూట్ కోర్టులో విచారణకు అవసరమయిన చర్యలు తీసుకోవాలి.

## హైందవ భర్తృహీన మహిళ బలికి సహకరించిన, ప్రోత్సహించిన వ్యక్తులను నేరపూరిత హత్యకు పాల్పడినట్టు పరిగణించి విచారించాలి.

రెండవది: ఈ రెగ్యులేషన్ జారీ తర్వాత భర్త మరణించిన హైందవ స్త్రీ సజీవదహనం, సజీవ ఖననానికి పాల్పడిన వ్యక్తులకు సహాయం చేసిన తోటి నేరస్తులను, మరణానికి ఆ మహిళ స్వయంగా అంగీకరించినా అంగీకరించకపోయినా, నేరపూరిత హత్యా నేరస్తులుగా పరిగణిస్తూ సర్క్యూట్ కోర్టు విచక్షణననుసరించి జైలుశిక్షగానీ, జరిమానాగానీ, రెండింటినీ గానీ, పరిస్థితిని బట్టి నేర తీవ్రతను బట్టి విధించాలి. ఆ మహిళ 'బలి'తో తనకు సహకరించుమని ఆమె కోరిందని చెప్పడం వల్ల ఏ మినహాయింపూ లభించదు.

మూడవది: బెయిల్‌కు సంబంధించిన సాధారణ సూత్రాలను అనుసరించి మెజిస్ట్రేట్ గానీ జాయింట్ మెజిస్ట్రేట్ గానీ తమ విచక్షణను ఉపయోగించి అంతకుముందు నేరారోపణకు గురయిన వ్యక్తులకు బెయిల్ ఇవ్వవచ్చు లేదా నిరాకరించవచ్చు.

## కొన్ని కేసుల్లో మరణశిక్ష విధించే అధికారం నిజామత్ అదాలత్‌కు ఉంది

V. 'సతీ'కి పాల్పడడానికి బలవంతం చేసి హింసించి హైందవ విధవరాలి

సజీవదహనానికి సజీవ ఖననానికి గాను తాగిన మత్తులో గానీ, ఇతర ఉద్వేగంలో గానీ, తదితర కారణాల వల్లగానీ సహకరిస్తే, ఖైదీకి వ్యతిరేకంగా భయంకరమయిన నేరం రుజువైన పక్షంలో దయతలచడానికి ఏ కారణమూ లభించని దశలో, నిజామత్ అదాలత్ కోర్టు మరణశిక్ష విధించకుండా ఈ రెగ్యులేషన్‌లోని ఏ సెక్షన్ కూడా అడ్డుకోజాలదని ప్రకటించడం అవసరమని భావించడమైనది.

మూడో సాంఘిక శాసనం కుల అన్వర్థతల తొలగింపు చట్టం XXI ఆఫ్ 1850. అది ఈవిధంగా ఉంది.

## కుల అన్వర్థతల తొలగింపు చట్టం (XXI ఆఫ్ 1850)

బెంగాల్ కోడ్ సెక్షన్ 9, రెగ్యులేషన్ VII, 1832లో వివరించి సూత్రాన్ని ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వ పరిధిలోని సరిహద్దు అంతటికీ విస్తరించేందుకు చేసిన చట్టం.

## ఉపోద్ఘాతం

సివిల్ వ్యాజ్యంలో కక్షిదారులు విభిన్న మతావలంబకులు అయినపుడు, ఒకరు హిందూ అయివుండి మరొకరు మహ్మదీయుడైనపుడు లేదా ఒకరు లేదా అంతకన్నా ఎక్కువ వ్యక్తులు హిందూ, మహ్మదీయ మతాలకు చెందిన వారయినప్పుడు వారి ఆస్తి హక్కును (మత చట్టాలు లేకపోతే వారికి కలిగి ఉండే హక్కును) తొలగింపచేసి ఆయా మత శాసనాలను అమలు చేయడానికి అనుమతించరాదని సెక్షన్9, రెగ్యులేషన్ VII, 1832, బెంగాల్ కోడ్‌లో పేర్కొన్న సూత్రాన్ని ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వం చలామణి అయ్యే భూభాగమంతటా అమలుకావడానికి వీలుగా ఈ శాసనం చేయడమైనది.

మతం మారే హక్కును, కులం కోల్పోయే పరిస్థితిని రద్దుచేసే లేదా ప్రభావితం చేసే చట్టాలు, సంప్రదాయాలు అమలు కాబోవు.

1. ఈస్టిండియా కంపెనీతో ప్రభుత్వం అమలవుతున్న భూభాగంలో ఏదయినా చట్టం లేదా సంప్రదాయం వ్యక్తి మతం మారినందుకు లేదా మతం నుంచి వెలివేయబడినందుకు లేదా వ్యక్తి కులం కోల్పోయినందుకుగాను ఆ వ్యక్తి ఆస్తి హక్కును హరించినా, వారసత్వపు హక్కును దెబ్బతీసినా, ఈస్టిండియా కంపెనీ కోర్టులలో, ఆ

పరిధిలో రాయల్ ఛార్టర్ ద్వారా నెలకొల్పిన కోర్టులలో ఆ చట్టాలు సంప్రదాయాలు అమలుకావు.

## హిందూ భర్తృహీన పునర్వివాహ చట్టం

నాలుగో సాంఘిక శాసనం ''హిందూ భర్తృహీన స్త్రీ పునర్వివాహ చట్టం XV ఆఫ్ 1856. అది ఈవిధంగా నిర్దేశిస్తుంది.

భర్తను కోల్పోయిన హిందూ స్త్రీలు పునర్వివాహం చేసుకోకుండా నిరోధించే చట్టపరమయిన అడ్డంకులను తొలగించే చట్టం.

## ఉపోద్ఘాతం

ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వం పరిధిలో ఆధీనంలోని భూభాగంలోని సివిల్ కోర్టులలో అమలయ్యే శాసనాల ప్రకారం కొన్ని మినహాయింపులు తప్పిస్తే హిందూ మహిళలు భర్తను కోల్పోయిన తర్వాత, అప్పటికే ఒక వివాహం అయి ఉందన్న కారణంగా రెండో సక్రమ వివాహం చేసుకోవడానికి అనర్హురాలనే, రెండో వివాహం ద్వారా సంతానం కలిగితే అది అక్రమ సంతానమనే, కనుక వారు ఆస్తిని వారసత్వంగా పొందే హక్కు లేదనే సూత్రాలు అమలులో ఉన్నాయి; మరియు

దీనివల్ల మహిళలకు, ఆ మత సూత్రాల అసలైన సారాంశం ప్రకారం చట్టపరమయిన అనర్హతను ఆపాదిస్తుందని హిందువులు భావిస్తున్నారు. మరో సంప్రదాయాన్ని అనుసరించదలచుకున్న హిందువులు, అంతరాత్మ నిర్దేశాన్ని పాటించి వ్యవహరించదలచుకున్న హిందువులను న్యాయస్థానాల్లో అమలయ్యే ఈ శాసనాలు నిరోధించకూడదని హిందువులు కోరుతున్నారు; మరియు

హిందువులను ఇటువంటి శాసనిక అనర్హతల నుంచి విముక్తం చేసి వారు కోరిన విధంగా హైందవ భర్తృహీన పునర్వివాహం చేసుకోవడానికి అడ్డొచ్చే ప్రతిబంధకాలను తొలగిస్తే నైతిక సూత్రాలను, ప్రజా సంక్షేమాన్ని ప్రోత్సహించే అవకాశం ఉంటుందని, ఈవిధంగా శాసనం చేయడమైనది.

## హైందవ భర్తృహీనల పునర్వివాహాలకు చట్టపరమైన అర్హత

(1) స్త్రీ ఇదివరకే వివాహితురాలైందనే కారణంతో గానీ, మరో పురుషుడితో వివాహం నిశ్చయమైందనే నెపంతో గానీ, రెండో వివాహం చేసుకున్న సమయంలో ఆ

పురుషుడు మరణించాడనిగానీ, ఏదైనా ఆచారం, హిందూ చట్టం సారాంశం అందుకు వ్యతిరేకిస్తుందని గానీ- ఇద్దరు హిందువుల మధ్య వివాహాన్ని అక్రమం చేయడానికి వీల్లేదు. ఆ వివాహం తర్వాత జన్మించిన సంతానాన్ని అక్రమం అనడానికి వీల్లేదు.

## మరణించిన భర్త ఆస్తి పైన హక్కు ఆ మహిళ పునర్వివాహంతో కోల్పోతుంది

2. మరణించిన భర్త ఆస్తిలో వైధవ్యం పొందిన ఆ మహిళకున్న అన్ని హక్కులు, ఇతర లాభాలు, మనోవర్తి, వారసత్వంగా ఆస్తి పొందే హక్కు వీలునామా ద్వారా పొందే హక్కు గానీ, పునర్వివాహం చేసుకోవచ్చుననే స్పష్టమయిన అనుమతి లేని పక్షంలో పరిమితమయిన లాభాలతో ఆస్తి హక్కు ఇచ్చిన దశలో, బదిలీచేసే అధికారం లేని పరిమిత ప్రయోజనాలు కూడా ఆమె పునర్వివాహంతో తొలగిపోతాయి. ఆమె ఆ సమయానికి మరణించినట్లుగా భావించి, ఆమె తర్వాత వరసలో ఉన్న ఆమె భర్త వారసులకు ఆమె మరణం తర్వాత సంక్రమించే విధంగా ఆస్తులు హక్కులు సంక్రమిస్తాయి.

అయిదో సాంఘిక శాసనం మహిళతో సంయోగక్రియ జరపడానికి గరిష్ట వయోపరిమితిని నిర్దేశించే చట్టం. ఇది 1860లో XLVవ చట్టం (భారత శిక్షాస్మృతి) సెక్షన్ 375. ఈ కింది విధంగా నిర్దేశిస్తారు.

> ''ఈ కింద పేర్కొన్న మినహాయింపులలో తప్ప, ఈ కింది అయిదు సందర్భాల్లో ఏ సందర్భంలోనైనా మహిళతో సంయోగక్రియ జరిపితే ఆ వ్యక్తి 'మానభంగం' (రేప్) చేసినట్లు అనవలసి వస్తుంది:-
>
> మొదటి: ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా.
>
> రెండవ: ఆమె సమ్మతి లేకుండా.
>
> మూడవ: తను ఆమె భర్త కాదని తెలిసినా ఆమె అతడిని తన భర్త అని నమ్మి, అతనితో తనకు చట్టబద్ధమయిన వివాహం జరిగిందని విశ్వసించి ఆమె అందుకు సమ్మతించినపుడు
>
> నాలుగవ: (ఖాళీగా వదిలేశారు... సం.)
>
> అయిధవ: ఆమె పది సంవత్సరాలలోపు వయస్సురాలయినపుడు ఆమె సమ్మతించినా, సమ్మతించకపోయినా...

వివరణ: (ఖాళీగా వదిలేశారు... సం.)

మినహాయింపు: పది సంవత్సరాలలోపు వయసు లేని భార్యతో వ్యక్తి సంయోగక్రియ జరిపితే అది మానభంగం కాదు.

## అస్పృశ్యుల సంగతేమిటి?

భారతదేశంలో కులం, అస్పృశ్యత రెండు గొప్ప సాంఘిక దురాచారాలు. మొత్తం హిందూ సమాజాన్ని కులం నిర్వీర్యం చేసింది. అస్పృశ్యత ఒక పెద్ద వర్గాన్ని అణచివేసింది. అయినా బ్రిటిష్ ప్రభుత్వం ఈ రెండింటినీ పట్టించుకోలేదు. ఇండియన్ కోడ్‌లో కులాన్ని, అస్పృశ్యులకు సంబంధించిన శాసనం ఎంత వెతికినా దొరకదు. కులం అస్పృశ్యత సాంఘిక విషయాలే కావచ్చు. కాని పంక్తి భోజనాలు, కులాంతర వివాహాలతో ఈ విషయంలో అదృశ్యమౌతాయి. చట్టం ఒకరిని మరొకరితో కలిసి భోజనం చేయమని బలవంత పెట్టజాలదు. ఒకరు మరొకరిని వివాహం చేసుకుని తీరాలని వత్తిడి చేయడం కూడా చట్టానికి సాధ్యం కాదు. కాని చట్టం- ఒక వ్యక్తిని తన కులం కాని వ్యక్తితో వివాహం చేసుకోకుండా నిరోధించే 'కులం'పై ఆంక్షలు విధించవచ్చు. కులం నియమాలను కట్టుబాట్లను ఉల్లంఘించిన వ్యక్తిపైన కుల బహిష్కరణ శిక్ష విధించే అధికారం ద్వారా ''కులం'' సమాజంలో నిలబడుతున్నది. అటువంటి కుల బహిష్కారశిక్ష నేరమని శాసనం చేయడం సాధ్యమే. అదీగాక అస్పృశ్యత విషయంలో అన్యాయాలు కేవలం సాంఘికపరమయినవే కావు. అవి ప్రాథమికంగా పౌరసత్వానికి సంబంధించినవి. పాఠశాల ప్రవేశానికి అనర్హత, ఉమ్మడి బావి నుంచి నీళ్ళు తోడుకోనీయని ఆంక్షలు, ప్రజల రహదారిలో నడవనీయని నిర్బంధాలు, ఉద్యోగాల్లో చేర్చుకోని నిర్బంధాలు, ఇవన్నీ పౌరసత్వ పరమయిన అనర్హతలు. కనీసం పౌరహక్కులను రక్షించడం వరకయినా బ్రిటీష్ ప్రభుత్వానికి శాసనం చేసే బాధ్యత ఉంది. అది సాధ్యం కూడా. కుల అనర్హతల తొలగింపు చట్టం వంటి శాసనమయినా చేయలేరా? కనీసం ఈ రెండు దురాచారాలు ఉన్నాయన్న ధ్యాస కూడా లేకుండా పాలన సాగిస్తున్నారు. **1861** లోనే మనదేశంలో శాసనమండలులు ఏర్పడ్డా, శాసనాలు జారీచేస్తున్నా, అస్పృశ్యత గురించి ఒకటి రెండు సందర్భాల్లో మాత్రమే ప్రస్తావించారు. మొదటిసారి **1916**లో పార్సీ ప్రముఖుడు సర్ మానెక్‌జీ దాదాభాయ్ కేంద్ర శాసనసభలో ఈ క్రింది తీర్మానాన్ని ప్రతిపాదించారు.

> ''...గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్‌కు ఈ కౌన్సిల్ చేసే సిఫార్సు ఏమిటంటే- అణగారిన వర్గాలని పిలువబడే ప్రజల కోసం వారి నైతిక, భౌతిక విద్యా ప్రమాణాలను బాగు చేయడం కోసం అధికార, అనధికారులతో చిన్న ప్రాతినిధ్య సంఘాన్ని ఏర్పాటు చేసయినా సరే కొన్ని సహాయ కార్యక్రమాలను రూపొందించాలి. ఇందుకోసం ప్రాథమిక

చర్యగా స్థానిక ప్రభుత్వాలను పాలనాధికారులను పిలిపించి ఆయా స్థానిక సమస్యలకు అనుగుణంగా పథకాలు రూపొందించాలి''

ఈ తీర్మానానికి సానుభూతి చూపని వారెవరూ లేరు. హిందూ శాసనమండలి సభ్యులు ఈ తీర్మానాన్ని కేంద్ర శాసనసభ ముందుకు తెచ్చినందుకు తీవ్రంగా ఆగ్రహించారు.

పండిట్ మదన్‌మోహన్ మాలవ్య ఈ విధంగా అన్నారు.

''సర్. కొన్ని సందర్భాల్లో మనముందుకు, సభ పరిశీలనకు కొన్ని అంశాలను తెస్తున్న తీరు పట్ల నిరసన తెలపడానికి ఈ సభగౌరవానికి సంబంధించిన స్పృహ నన్ను పురికొల్పుతున్నదని చెప్పడానికి నేను చింతిస్తున్నాను...

శ్రీ దాదాభాయ్, నా స్నేహితుడు చేసిన ప్రతిపాదనకు నా హృదయపూర్వకంగా సమర్థిస్తున్నాను. హిందూ మతం మీద కొన్ని వ్యాఖ్యలు చేయడానికి ఆయన పరిధి దాటి వ్యవహరించారు. ఆయన ఆ వ్యాఖ్యలు చేయకుండా ఉండవలసింది... హిందువుకు సంబంధించినవన్నీ నేను మంచివే అనడం లేదు. మన మతంలో అక్కడో ఇక్కడో ఉన్న అపోహలకు మూఢనమ్మకాలకు నేను క్షమాపణ చెప్పేందుకు రాలేదు. ఈ సామాజిక ఈర్ష్యాద్వేషాలను వదలుకోలేకుండా ఇబ్బందిపడేది ఒక హిందూమతమే కాదు... అమర్యాద కాదు అనుకుంటేనేను ''మృతురాలైన భార్య చెల్లెలితో పెళ్ళి''కి సంబంధించిన బిల్లును ఉదహరిస్తాను. ఇంతకన్నా ఘోరమయిన దురాచారాలతో హిందువులు పోరాడవలసి ఉంది. అయితే ఈ సభ సభ్యుడు ఇక్కడ ఉన్న లేదా బయట ఉన్న హిందువులకు అసమానతలు ఏవిధంగా దూరం చేయాలనే విషయంపై పెద్ద ఉపన్యాసం ఇవ్వనవసరం లేదు. ప్రభుత్వం చేపట్టతగిన పరిపాలనా, శాసనపరమయిన వ్యవహారాలతో మాత్రమే ఈ కేంద్ర శాసనసభకు పరిమితం కావలసి ఉందని నేననుకుంటున్నాను. నేనిదివరకే చెప్పినట్లు ప్రభుత్వం బాగా ఆలోచించి ఏర్పరచుకున్న ఉదారమయిన, వివేకవంతమయిన విధానం ప్రకారం మతపరమయిన, సామాజిక - మత సంబంధమయిన అంశాలలో ప్రభుత్వం జోక్యం చేసుకోరాదు. కనుక ఈ తీర్మానంలో ప్రతిపాదించిన నిందలు ప్రస్తావనకు తేవలసింది కాదు. ఈ నిందల నిజానిజాలను గానీ, సమంజసత్వాన్ని గాని, ఇతర అభిప్రాయాల గురించి గానీ నేను చర్చలోకి దిగదలచుకోలేదు. నా స్నేహితుడు హిందూ మతస్తులు ఈ దేశంలో ఆ కొస నుంచి ఈ కొస వరకు నేరస్తులని ఆరోపిస్తుంటే, కిమ్మనకుండా విన్నాను. మా హిందువులు

ఎన్నో అపోహలకు దురాచారాలను పోరాడి జయించవలసి ఉందని నాకు తెలుసు. కాని నేను మనవి చేసేదేమిటంటే ఆ విషయాలు చెప్పాల్సిన చోటు ఇది కాదు.

సర్ సురేంద్రనాథ్ బెనర్జీ వంటి సాంఘిక సంస్కర్త కూడా సంతోషంగా లేరు. ఆయన ఈవిధంగా అన్నారు:

''...నా మిత్రుడు, తీర్మాన ప్రతిపాదకుడయిన గౌరవ సభ్యుడు హిందూ మతం మీద ఈ విధంగా దాడి చేసేందుకు పరిధిని మించి (ఉద్దేశరహితంగానే కావచ్చు) వ్యవహరించడం నాకు బాధగా ఉంది. ఈ ప్రపంచం ఎంత పురాతనమైనదో అంత పురాతనమయిన నాగరికతను, సంప్రదాయాలను వారసత్వంగా మనం స్వీకరించాం అని ఆయన దృష్టిలో పెట్టుకోవాలి. ఆ నాగరికతలో నిస్సందేహంగా లోపాలున్నాయి. కాని నాగరికత తొలి రోజుల్లో సామాజిక స్థిరతను, శాంతి భద్రతను ఆ వ్యవస్థ కాపాడింది. గతంలో లక్షలాది మందికి ఆ నాగరికత ఊరట కలిగించింది. ఇప్పటి పరిస్థితులకు అనుగుణమయిన ఒక జాతీయ విధానాన్ని నిర్మించే ప్రయత్నం చేస్తున్నాం. మనకు గతం నుంచి వచ్చిన అన్నింటినీ ఒక్కసారిగా ప్రక్కకు తోయడం సాధ్యం కాకపోవచ్చు. మన ప్రాచీనులు నిర్మించిన సామాజిక నిర్మాణాలను మనం గుర్తించాం. వాటిని తొలగించడానికి ఆసక్తి కూడా వుంది. అయితే క్రమంగా, నెమ్మదిగానే గాని విప్లవాత్మకంగా కాదు. నెమ్మదయిన పరిణామక్రమం ద్వారా మాత్రమే. నా స్నేహితుడు మా పట్ల కొంత సానుభూతి చూపాలి. సమస్యలను ఎదుర్కొనేందుకు కొంత ఉదారమయిన స్నేహ హస్తాన్ని అందించాలి. నా గౌరవ మిత్రుడు ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకోవాలన్నారు. ఇటువంటి సందర్భాల్లో ప్రభుత్వం చర్యల తీసుకోవాలని నేనూ అంటాను. కాని ఇదేమిటో పరిశీలిస్తే సాంఘిక సమస్య అని అర్థమవుతుంది. బ్రిటిష్ ప్రభుత్వం ఇటువంటి సాంఘిక సమస్యల నుంచి దూరంగా వ్యవహరించాలనుకోవడం, ఆ ప్రభుత్వ ప్రాచీన ఆచారాలకు అనుగుణంగా తీసుకున్న సరైన నిర్ణయమేనని నేను భావిస్తున్నాను''

''అణగారిన వర్గాలలో పారిశ్రామిక ఉద్యమం సాధించడానికి ప్రభుత్వం విద్య ద్వారా వారికి సహాయం చేయవచ్చు. అసలు సమస్య, సమస్యలన్నింటిలోకి సమస్య- సాంఘిక సముద్ధరణ. కాని ఆ విషయంలో ప్రభుత్వం ఒక దయాళువయిన ప్రేక్షకుడిగా ఉండిపోవలసిందే. మన ప్రయత్నాలకు ప్రభుత్వం సానుభూతి చూపవలసిందేగాని, అందులో చురుకూగా పాల్గొనజాలదు.''

గౌరవనీయులైన దాదాభాయ్ తన వాదాన్ని సమర్థించుకోవాల్సిన అవసరం ఏర్పడింది. ఆయన ఈవిధంగా జవాబిచ్చారు.

> ''సర్, నేను ఒక విచిత్రమయిన దురదృష్టకర స్థితిలో ఇరుక్కున్నాను. ఈ కౌన్సిల్‌లో రెండు పార్టీలున్నాయి. కాని ఈ సందర్భంలో రెండు పార్టీలూ దాడి నుంచి రక్షించుకోవలసిన స్థితిలో ఉన్నాయి. నా ఈ తీర్మానానికి ఎవరయినా మద్దతు తెలిపారంటే అంత ఉత్సాహం లేకపోయినా, అనధికార సభ్యులే. ఈ తీర్మానాన్ని నేను సంతోషంతో ప్రవేశపెట్టడం లేదు. ఇది తప్పించగలిగితే నాకు ఎంతో సంతోషంగా ఉండేది. మన రిఫార్మ్‌డ్ కౌన్సిల్ పదవీకాలం మొదలై ఆరేళ్ళు అయింది. రెండో పదవీకాలం కూడా ముగిసిపోతున్నది. నేను సభ్యుడిగా ఉన్న ఈ అయిదేళ్ళలో ప్రజల స్వేచ్ఛను, ప్రజల శ్రేయస్సు, సంస్కృతి కోసం పోరాడే ఏ వ్యక్తి అయినా- నా స్నేహితులు శ్రీ సురేంద్రనాథ్ బెనర్జీ లేదా పండిట్ మదన్‌మోహన్ మాలవ్య వంటి వారెవరయినా ఇటువంటి తీర్మానాన్ని ప్రతిపాదిస్తారనుకున్నాను కాని అణగారిన వర్గాల బాధలు తీర్చడానికి ఒక తీర్మానాన్ని ఎవ్వరూ ప్రతిపాదించలేదు. కాంగ్రెస్ శిబిరాల్లోనూ చర్చించారు. కాని ఈ సభలో ఎన్నడూ చర్చించలేదు. నేను పార్సీనయినా, హిందూ నియోజకవర్గం ప్రతినిధి హోదాలో ఇటువంటి మంచి విషయాన్ని ఈ సభలో చర్చించడం నా బాధ్యత అనుకున్నాను''

ప్రభుత్వానికి సహజంగానే ఈ తగాదా సంతోషాన్నిచ్చి ఉంటుంది. హిందూ సభ్యుల నైతిక అండతో సర్ రెగినాల్డ్ క్రాడక్ తన లోపాలను కప్పిపుచ్చుకుంటూ ప్రభుత్వం పక్షాన తీర్మానాన్ని తిరస్కరిస్తూ ఈవిధంగా చెప్పారు.

> ''సర్ దాదాభాయ్ తీర్మానం లక్ష్యాల పట్ల మాకు సానుభూతి ఉంది. మేము స్థానిక ప్రభుత్వాలు, దళితుల అభివృద్ధి కోసం ఏం చేస్తారో, ఏం చేయదలచుకున్నారో, ఏం చేస్తున్నారో వివరంగా చెప్పాలని కోరుతున్నాం. మాకు ప్రత్యేక కమిటీలతో నమ్మకం లేదు. ఈ సమస్యలు ఎంత విస్తృతమయినవో, కమిటీల ద్వారా వీటిని పరిష్కరించడం ఎంత అసాధ్యమో నేను ఇదివరకే కౌన్సిల్‌కు తెలిపాను. ప్రభుత్వం మొత్తం పైనుంచి చివరిదాకా ఈ సమస్యలతో ఎలా సతమతమవుతున్నదో తెలుసు. దాదాభాయ్ తీర్మానం ఆశయాల పట్ల సానుభూతి చూపడం తప్ప, స్థానిక ప్రభుత్వాలకు ఈ ప్రశ్నను పంపుతామని చెప్పడం తప్ప మేం ఏమీ చేయజాలము. అంతవరకు వెళ్ళడం మాకు

సాధ్యం కనుక ఆ హామీ ఇవ్వగలుగుతున్నాం. కనుక గౌరవ సభ్యులు ఈ తీర్మానాన్ని ఉపసంహరించుకోవాలని కోరుతున్నాను.''

రెండోసారి అస్పృశ్యులగురించి 1928లో లెజిస్లేచర్‌లో ప్రస్తావనకు వచ్చింది. ఎం. ఆర్. జయకర్ ఈ కింది తీర్మానాన్ని ప్రతిపాదించారు.

''అస్పృశ్యులకు, అణగారిన వర్గాలకు విద్యాబోధన విషయంలో రాయితీలను ప్రత్యేక సదుపాయాలను కల్పించాలని స్థానిక ప్రభుత్వాలను ఆదేశించాలని గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్‌కు ఈ శాసనసభ సిఫార్సు చేస్తున్నది. పోలీసు, తదితర పబ్లిక్ సర్వీసులలో కూడా వారికి ప్రవేశం కల్పించాలని సిఫార్సు చేస్తున్నది.

ఈ సందర్భంలో కూడా 1916కన్నా భారత ప్రభుత్వం ఏమంత ఉత్సాహం ప్రదర్శించలేదు. ప్రభుత్వం తరపున జి.ఎస్. బాజ్‌పాయ్ ఈ విధంగా చెప్పారు.

''స్థానిక ప్రభుత్వాలు బాధ్యతగుర్తించి, చేయగల కార్యక్రమాలను నిర్వర్తిస్తున్నాయి. అవి తమ లక్ష్యాన్ని సాధించాయని నేను చెప్పబోవడం లేదు. కాని అణగారిన వర్గాల అభివృద్ధికి సంబంధించి ఒక చైతన్యం వచ్చిందని, బాధ్యతలు తెలిశాయని, ప్రయత్నించాలన్న కర్తవ్యం బోధపడిందని నేను చెప్పగలను. కనుక వారి విధులతో జోక్యం చేసుకోవాలని ఎవరూ డిమాండ్ చేయనవసరం లేదు. ఆదేశించనవసరం లేదు. శాసనసభ కనుక ఈ జాతీయ సమస్య గురించి స్థానిక ప్రభుత్వాలకు ప్రభుత్వం సమాచారం పంపాలని భావిస్తే, అందుకు ప్రభుత్వం సిద్ధంగా ఉంది''

ఈ ప్రసంగం చేసినందుకు శ్రీ బాజ్‌పాయ్‌ని ప్రశంసిస్తూ కరతాళ ధ్వనులు చేశారని అధికారిక నివేదికలో పేర్కొన్నారు.

సాంఘిక సమస్యలకు సంబంధించి బ్రిటిష్ ప్రభుత్వం ప్రతిస్పందన ఈవిధంగా ఉంటుందని తేలింది. ఎంత దారుణమయిన రికార్డు ఇది. ఎంత హీనమయిన రికార్డు ఇది. 60 సంవత్సరాల శాసనసభ చరిత్రలో ఆరు సాంఘిక చట్టాలు మాత్రమే. మొదటినుంచి సాంఘిక సంస్కరణల పట్ల ఎంత నిరోధక స్వభావంతో వ్యవహరిస్తున్నదో తేలింది. 1860 వరకు తానొక బాధ్యతాయుతమయిన ప్రభుత్వం అన్న ముసుగులో ఉంది. 1860లో ఆ ముసుగు తొలగిపోయింది. ఆ తర్వాత సంస్కరణలు ఆగిపోయాయి. 1881లో బాల్య వివాహాలను నిషేధిస్తూ చట్టం తెచ్చేందుకు పెద్ద ఉద్యమం రావలసి వచ్చింది. సాంఘిక సంస్కరణ చేయడం సంగతి ప్రక్కకు పెట్టి తాము సాంఘిక సంస్కరణకు

వ్యతిరేకమని బాహాటంగా ప్రకటించారు. ప్రభుత్వం ఆ సంవత్సరం ఒక తీర్మానంలో ఈవిధంగా ప్రకటించింది.

''మలబారి నోట్స్‌లో లేవనెత్తినటువంటి విషయాల పట్ల భారత్‌లో బ్రిటీష్ ప్రభుత్వం కొన్ని సాధారణ మార్గదర్శక సూత్రాలను అనుసరిస్తుంది. ఒకవేళ కుల నియమం లేదా సంప్రదాయం క్రిమినల్ శాసనాన్ని ఉల్లంఘిస్తే శాసనాన్నే అమలు చేస్తుంది. కులం, సంప్రదాయం సూచించిన సూత్రాలే సివిల్ లాలో అమలు చేయతగినట్టుగా ఉన్నా, అవి సామాజిక నీతికీ, ప్రభుత్వ విధానానికి వ్యతిరేకమయితే అమలు చేయదు. లేదా కులం సంప్రదాయం సూచించే సూత్రాలు, సివిల్, క్రిమినల్ న్యాయాల సహాయం లేకుండానే పౌరులు అమలు చేసుకోగలిగితే ప్రభుత్వ జోక్యం అనవసరం అని భావిస్తాం.

ఇటువంటి సాధారణ సూత్రాలను కొన్ని నిర్దిష్టమయిన అంశాలకు అన్వయించే దశలో విభిన్న అభిప్రాయాలు రావడంలో అనుమానం లేదు. అటువంటి సందర్భాల్లో ఇంగితజ్ఞానంతో పరీక్షించి నిర్ణయం తీసుకోవాలి. సామాజిక, మతపరమయిన అంశాలలో ప్రభుత్వం శాసనపరంగా కాని పాలనాపరంగా కానీ జోక్యం చేసుకోవాలో తేల్చుకునే ముందు ఇంగితజ్ఞానం ప్రయోగించాలి. ఆ పరీక్ష ఏమిటంటే ''ప్రభుత్వం తనవద్ద ఉన్న సాధారణ పాలనా యంత్రాంగం ద్వారా తన ఆజ్ఞలు అమలు చేయగలదా?'' అని. తన సాధారణ యంత్రాంగం ద్వారా ఆదేశాల అమలు సాధ్యం కాని పక్షంలో ప్రభుత్వం జోక్యం చేసుకోకపోవడం ఉత్తమం.

ఈ కేసులో ఈ పరీక్ష జరిపితే మహాఘనత వహించిన కౌన్సిల్ ప్రభువులు ఎందుకు జోక్యం చేసుకోవద్దనుకున్నారో అర్థమవుతుంది. శ్రీ మలబారి సూచించిన సంస్కరణలు ఎన్నో జాతుల వ్యవహారాలకు, వ్యతిరేకతలకు సంబంధించినవి. వాటిని కాలానికి, విద్య ద్వారా సాధించే ప్రజల మానసిక నైతిక వికాసానికి వదిలేయడం మంచిది.

''కులం నిర్దేశించిన ప్రమాణాలతో సంబంధం లేకుండానూ, మరికొన్ని సందర్భాల్లో వాటిని వ్యతిరేకిస్తూ బ్రిటీష్ ప్రభుత్వం శాసనం ద్వారా కొన్ని నైతిక ప్రమాణాలను నెలకొల్పింది. ఈ ప్రమాణాలు స్థానిక సంప్రదాయాలు, ఆచారాలు, ఆలోచనలపై ప్రభావం చూపవచ్చు. శాసనం ప్రభావం, సాంఘిక ఆచారాల ప్రభావాలు

విభిన్నంగా ఉండి వాటి మధ్య పోటీ ఏర్పడినప్పుడు శాసన వ్యవస్థ తన సహజ పరిమితులకు లోబడి ఉండాలి. మితిమీరి- సాంఘిక అభిప్రాయాన్ని వ్యతిరేకం చేసుకోవడం కూడదు''.

ఈ తీర్మానంలో నిర్దేశించిన విధానం- సాంఘిక సంస్కరణల విషయంలో బ్రిటిష్ ప్రభుత్వ విధానంగా స్థిరపడిపోయింది.

## V

బ్రిటిష్ ప్రభుత్వం అస్పృశ్యులను పట్టించుకోకుండా వారిని యథాస్థితిలో ఎందుకు వదిలేసింది?

తీవ్రమయిన నిర్లక్ష్యమనే ఈ నేరానికి సర్ రెగినాల్డ్ క్రాడాక్ వివరణ ఇచ్చుకున్నారు. 1916లో ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో సర్ మానెక్‌జీ దాదాభాయ్ ప్రతిపాదించిన తీర్మానానికి ప్రభుత్వం పక్షాన ఇచ్చి సమాధానంలో బ్రిటిష్ ప్రభుత్వం అస్పృశ్యుల విషయమై అవలంబించిన విధానాన్ని ఈ క్రింది విధంగా వివరించారు:-

> ''వారిగురించి (అస్పృశ్యులగురించి) సమస్య ప్రభుత్వం వారినిగుర్తించకపోవడం కాదు. శతాబ్దాలనుంచి వస్తున్న అలవాట్లు, అపోహలు తొలగించనిదే వారిపైపొరుగువారి వత్తిడులు తొలుగిపోవు. వీరు అత్యధికంగా గ్రామాల్లో నివసిస్తారని, పట్టణాల్లో వెనుక సందుల్లో ఉంటారని, వారి ఇరుగు పొరుగు వారితో కలిసిపోయేంత విశాలహృదయులు కాలేదని మీరు గుర్తుంచుకోవాలి. చాలామంది వక్తలు వివరించినట్లుగా ఈ సమస్య కేవలం పాలనాపరమయింది కాదు. సాంఘిక పరమయిన, మత పరమయిన సమస్య ఇది.''

> ''స్కూల్స్ విషయంలో ఎన్ని కష్టాలుంటాయో నాకు తెలుసు. మహర్ పిల్లలను పాఠశాలల్లోకి అనుమతించని ఊళ్ళు ఎన్నో ఉన్నాయి. లేకపోతే వారిని వరండా వరకూ రానిస్తారు. అక్కడ ఉపాధ్యాయుడి కంట పడతారు. లేదా పూర్తిగా అక్కడినుంచి వెళ్ళగొట్టబడతారు. కాని ఈ సమస్యను క్రమంగా పరిష్కరించుకోవాలి. ఎక్కడికక్కడ నేనీ సమస్యను ఎదుర్కొన్నాను. నేను అప్పుడు అక్కడి వారికి చేస్తున్న తప్పేమిటో ఎంతఅసమంజసమో వివరించారు. వారూ మీ వలెపన్ను చెల్లిస్తారు. వారిని స్కూల్స్‌లోకి రానివ్వండి. ఇంకా మీ అపోహలు అంతరించకపోతే- కనీసం ఆ అపోహలను సమంజసమయిన రీతికి తగ్గించండి. కనీసం వారి కోసం ప్రత్యేకంగా ఒక స్కూల్

నెలకొల్పేందుకు సహకరించండి. కొంతయినా దానం చేయండి ని వారి చెప్పాను. కొందరు ముందుకు వచ్చి బావులు తవ్వించడానికి వారి కోసం బడులు నెలకొల్పడానికి విరాళాలిచ్చారు. సహాయం చేశారు. ఆ విధంగా కష్టం గడచిపోయింది. అయితే ఇందుకు కాస్త సమయం పడుతుంది. ప్రభుత్వం ఎవరినీ వత్తిడి చేయజాలదు. రైళ్ళు ప్రయాణించినప్పుడు, ప్రభుత్వానికి పిటిషన్లు ఇచ్చినపుడు వారు కాస్తంత చేరువవుతారు. అంతమాత్రాన వారికి ఆఫీసుల్లో సరైన సమానత గౌరవం లభిస్తుందని అనుకోవడానికి వీల్లేదు. తరచుగా పొరుగు వారికి భయపడి ఆఫీసులో వీరితో పనులు చేయించుకోరు. బొంబాయి ప్రభుత్వం చేసిన ప్రకటనను ఈ తీర్మానం ప్రతిపాదించిన వ్యక్తి ''శుష్క-ప్రియం''గా విమర్శించారు. అయితే సమస్య ఎంత జటిలమైందో ఆ వాక్యం సరిగ్గా వివరిస్తుందని నేను భావిస్తాను. ప్రభుత్వం ఈ దురదృష్టవంతులకు సాయం చేసేందుకు ఎన్ని విధాల ప్రయత్నం చేసినా- ఈ కులాలు, తెగల భవిష్యత్తు పాక్షికంగా వారిపైనే ఆధారపడి ఉంది. పాక్షికంగా ఇతర అగ్రవర్ణాల మీద ఆధారపడి ఉంది. వారు కావాలంటే స్నేహ హస్తం చాచవచ్చు? లేదా కరుడుగట్టిన గుండెతో వారిని ఇంకా దిగజార్చుతారా?

''అణగారిన వర్గాలకు సంబంధించి ఇది వాస్తవమయిన అంశమని నేను భావిస్తున్నాను''

సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీలో జయకర్ 1918లో ప్రతిపాదించిన తీర్మానంపై చర్చ జరిగినపుడు ప్రభుత్వం పక్షాన జవాబిచ్చిన బాజ్‌పాయ్ ఇదే ధోరణి ప్రదర్శించారు.

''మీరు వారికి ప్రత్యేక పాఠశాలలు, ప్రత్యేక సౌకర్యాలు కల్పించడం ద్వారా అస్పృశ్యుల సమస్య పరిష్కారం కాదు... ఈ అణగారిన వర్గాల పట్ల సమాజంలోని అన్ని వర్గాల్లో వేగంగా సమభావం కల్పించినప్పుడు మాత్రమే పరిష్కారం అవుతుంది.''

హిందువుల అంతరాత్మల్లో సత్వరమయిన మార్పులకు సమస్య పరిష్కారాన్ని వదలడం ద్వారా బ్రిటీష్ ప్రభుత్వం అస్పృశ్యులను నిర్లక్ష్యం చేసింది. ఒక ప్రభుత్వం వలె వ్యవహరించి అస్పృశ్యుల అభ్యున్నతికి కృషి చేయాల్సిన బాధ్యత తమకు లేదన్నట్టు వ్యవహరించింది. బ్రిటీష్ వారు తమ పౌరుల్లో ఇంత అణగారిన వర్గాలను నిస్సహాయంగా వదిలేసిన ఈ నిర్లక్ష్యాన్ని ఏవిధంగా సమర్థించుకుంటుంది? జవాబు సుస్పష్టం. అస్పృశ్యత అనే దురాచారాన్ని వారు సృష్టించలేదని తప్పించుకుంటారు. అది వారు సృష్టించిన దురాచారం కాదు కనుక, ఈ సమస్య హిందువులతో ముగిసి ఉండాలి

కాదు కనుక వారిపై నింద లేదని వాదిస్తారు. 1856లో బొంబాయి ప్రభుత్వం ఈ విషయాన్ని స్పష్టంగా వివరించింది. ధార్వార్ ప్రభుత్వ పాఠశాలలో అవసరమయిన ఫీజు చెల్లించడానికి సిద్ధంగా ఉన్నా తనకు సీటు ఇవ్వలేదని ఒక మహర్ బాలుడు జూన్ 1856లో బొంబాయి ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టుకున్నాడు. బొంబాయి ప్రభుత్వం ఇది చాలా ముఖ్యమయిన సమస్యగా భావించి 25 జులై 56 నాడు ఒక తీర్మానం జారీ చేసింది. ఇది ఆ తీర్మానం పూర్తి పాఠం:

"1. ఈ లేఖలో తలెత్తిన ప్రశ్నలో చాలా తీవ్రమయిన ఆచరణాత్మకమయిన సమస్య.

2. మహర్ పిటిషన్‌లో అతని తరఫునే పూర్తి న్యాయం ఉందనడంలో సందేహం లేదు. ప్రస్తుతం అతనికి విద్యా సౌకర్యాన్ని నిరాకరిస్తున్న ఈ అపోహలు ధార్వార్‌లో త్వరలోనే తొలగిపోతాయని ప్రభుత్వం విశ్వసిస్తున్నది.

3. అయితే ఒకరు, ఇద్దరి కోసం యుగాల నుంచి పాతుకుపోయిన కొన్ని అభిప్రాయాల విషయంలో ప్రభుత్వం జోక్యం చేసుకోవడానికి తొందరపడితే విద్యా రంగానికి ఎంతో తీవ్రమయిన నష్టం కలుగుతుందని భావించవలసి ఉంది. ఈ పిటిషనర్ ఈ రోజు ఎదుర్కొంటున్న సమస్య ఈ ప్రభుత్వంతో ఉత్పన్నమయింది కాదు. అంతేకాదు ఆ బాలుడు అభ్యర్థించినట్టు అతనికి న్యాయం చేయడం కోసం ప్రభుత్వం ఈ సమస్యను ఉన్నపళంగా పరిష్కరించలేదు.

ప్రభుత్వ విధులకు సంబంధించి ఇది సులభంగా లేవనెత్తదగిన వాదం అయితే కావచ్చు కాని ఇది బాధ్యతాయుతమయిన అభిప్రాయం కాదు. ఒక నాగరిక ప్రభుత్వానికి ఉండవలసిన దృక్పథం అసలే లేదు. పరిపాలించడానికి భయపడే ప్రభుత్వం ప్రభుత్వమే కాదు. అది పన్నులు వసూలు చేసుకోవడానికి ఏర్పడిన ఒక సంస్థ మాత్రమే. బ్రిటిష్ ప్రభుత్వం పన్నుల వసూలు యంత్రాంగం కన్నా కాస్త ఎక్కువే అనిపించుకోదలచింది. తనది నాగరిక ప్రభుత్వం అని చెప్పుకున్నది. మరి ఎందుకు ఒక తప్పును, అన్యాయాన్ని తొలగించే చర్య తీసుకోజాలదు? దానికి అధికారం లేదా? లేక ఆ అధికారాన్ని వినియోగించేందుకు భయపడుతున్నదా? లేక భారతదేశ సాంఘిక, మత వ్యవస్థలో ఏవిధమయిన అన్యాయం లేదని అభిప్రాయపడుతున్నదా?

జవాబు ఏమిటంటే బ్రిటిష్ ప్రభుత్వానికి అధికారం ఉంది- విపరీతమయిన అధికారం. ఆ అధికారాన్ని ఎందుకు వినియోగించలేదంటే కొంతకాలం పాటు హిందూ సాంఘిక వ్యవస్థలో ఏ

లోపమూ లేదనే భావించింది. తర్వాత లోపాలున్నాయని అంగీకరించక తప్పని స్థితి వచ్చినపుడు వారిలో భయం పై స్థాయికి వచ్చింది.

''క్రైస్తవ సత్యాన్ని'' వ్యాపింపజేయడానికి అనుమతిస్తే ఏ విషమ పరిణామాలు ఎదురవుతాయోనన్న భయంతో బ్రిటిష్ మొదట్లో వ్యవహరించింది. కాని స్థానిక అపోహలను అమితంగా గౌరవించే బ్రిటిష్ వైఖరి అంతే గర్హనీయం. కలకత్తా మిషనరీ మిస్టర్ వార్డ్ 1802 నాటి తన సంచికలో ఈవిధంగా పేర్కొన్నాడు.

''గత వారం కాళీ ఘాట్‌కు ఊరేగింపుగా ప్రభుత్వ ప్రతినిధి బృందం బయలుదేరింది. కంపెనీ పక్షాన హిందూ దేవతకు కృతజ్ఞతాపూర్వక సమర్పణం చేసుకున్నది. ఎందుకంటే ఈ దేశంలో ఇంగ్లీషు వారికి లభించిన విజయాలకట. అయిదువేల రూపాయలు ఇచ్చుకున్నారు. ఈ విగ్రహానికి ఎన్నో వేల రూపాయల చెల్లించడం ఎందరో చూశారు. మేము చాలా బాధపడ్డాం ఈ పనికి. దీనివల్ల స్థానికులు మన పైన ఆధిక్యత పొందుతారు''[1]

వారెన్ హేస్టింగ్స్ కాలంలో ఈస్ట్ ఇండియా కంపెనీ ఉద్యోగి రాబర్ట్ లిండ్సే మరో ఉదాహరణను కల్పించారు. స్లిహెట్‌లో రెసిడెంట్ కొత్త కార్యాలయంలో తన తొలి ప్రవేశాన్ని వర్ణిస్తూ ఆయన ఈవిధంగా చెప్పాడు.

''షా జులాల్ అనే గురువు ప్రార్థనాలయంలో కొత్త రెసిడెంట్‌కు నమస్కారాలు పెట్టడం ఆచారం అని నాకు చెప్పారు. ఇస్లాం మతస్తులు ఈ ప్రార్థనాలయానికి దేశంలోని విభిన్న ప్రాంతాల నుంచి వస్తారు. ఈ సమాధిని దర్శించిన తర్వాత ఈ మతఛాందసుల ప్రమాదకర వ్యక్తులని బోధపడింది. ఈ మత ఛాందసాలతో పోరాడడం నా పని కాదు. కనుక నా పూర్వీకుల వలె నేను కూడా వెళ్ళాను. బూట్లు గడప ముందే విడిచి లోపలికి వెళ్ళి సమాధిపైన అయిదు బంగారు మొహరాలు సమర్పించుకున్నాను. ఆవిధంగా పునీత అయిన తర్వాత నా నివాసానికి వచ్చి అక్కడ పాలితుల గౌరవాన్ని స్వీకరించాను''

బ్రిటిష్ ప్రభుత్వం స్థానిక మత ఛాందసాలతో మమేకం కావడానికి ఎంత ఆతురత చూపిందో-

1. సిరాంపూర్ మిషన్ చరిత్ర సంపుటి 1 పేజీ 157లో ఉటంకించినది.

1833లో బిషప్ వోరీ మద్రాసు ప్రభుత్వాని ఇచ్చిన ఒక స్మారక విజ్ఞప్తిని చూస్తే తెలుస్తుంది. ఈ స్మారక విజ్ఞాపనలో ఉదహరించిన సంఘటనలు ఇవి:

''మొదటిది- ప్రభుత్వంలో సివిల్ మిలిటరీ సర్వీసుల్లో ఉన్న క్రైస్తవ ఉద్యోగులు ఇతరేతర మత ఉత్సవాలకు, మహ్మదన్ మత ఉత్సవాలకు హాజరై వారి పట్ల గౌరవం చూపడం అవసరం. రెండోది- కొన్ని సందర్భాల్లో విగ్రహాలకు సమర్పణలు చేసి అంజలి ఘటించవలసి ఉంటుంది. మూడవది- ముఖ్యమైన యూరోపియన్ అధికారి పర్యవేక్షణలో పగోడాల చేత మలినమైన, నీచమైన సేవలు గరిపించవలసి ఉంటుంది. 1817 రెగ్యులేషన్ VII నిబంధనల ప్రకారం పగోడాల, మసీదుల నిర్వహణ ధర్మాదాయ బాధ్యతలు క్రైస్తవ అధికారులకు ఉన్నాయి కనుక విగ్రహ సంబంధమైన ముఖ్యమైన ఉత్సవాలను ఆ విగ్రహాల వెంట ఉండాల్సిన వ్యక్తులు దేవాలయ వేశ్యలను వినియోగించడం కాని, తొలగించడం కాని లేదా ఏ ఇతర ఖర్చును కాని భరించడానికి కాని క్రైస్తవ అధకారి ఉత్తర్వులను ప్రభుత్వపరమైన అంగీకారాన్ని పొందకుండా చేయడానికి వీలు లేదు. నాలుగవది- బ్రిటిషు అధికారులు తమ ప్రభుత్వ దళాలతో మహమ్మదీయ విగ్రహ సంబంధ ఉత్సవాలలో సబ్బత్ రోజున కూడా గౌరవసూచకంగా తుపాకీ కాల్పులు జరిపి ప్రార్థన చేయవలసి ఉంటుంది. ఈ విధంగా ప్రభుత్వ అధికార ఒత్తిడులకు తరచూ లొంగి క్రైస్తవులు తమ అతి పవిత్ర సంస్థలను అపవిత్రం చేస్తూ అపవిత్రమైన, నీచమైన మూఢ విధానాలలో పాలు పంచుకోవలసి వస్తున్నది.

దీన్నిబట్టి ఇండియాలో బ్రిటిషు ప్రభుత్వం మతపర సత్యాలను ప్రచారం చేయడంపై ఒత్తిడులు తేవడంతోనే సరిపెట్టుకోకుండా బహిరంగంగా సాధికారికంగా భూతప్రేతాల పూజల వంటి దుష్టకార్యాలకు సహాయం చేస్తున్నది. హిందూయిజంలోని జుగుప్సాకరమైన క్రౌర్యాలకు నీచమైన పనులకు ప్రత్యేకమైన ప్రోత్సాహాన్ని ఇస్తున్నది, ఇటువంటి నరకప్రాయమైన తతంగాలకు తమ ఉత్సవ ముఖ్య అతిథులను పంపుతున్నది. విగ్రహ దేవాలయాల ఆస్తులను నిర్వహిస్తున్నది. నాట్యకర్తలను పోషిస్తున్నది. ఈ విధమైన గౌరవాలు కల్పించడం అంటే ఆ మతాన్ని అత్యున్నతంగా చూడడమే అన్నమాట.''

1841 తరువాతగాని ప్రభుత్వం హిందూ మహమ్మదీయ మతపరమైన ఉత్సవాలలో పాలు పంచుకోవడం మానలేదు. అది మిషనరీలు పెద్ద స్థాయిలో ఒత్తిడి తెచ్చినందువల్లనే.

పోర్టు సేయింట్ జార్జ్ మిలిటరీ కార్యదర్శి జులై 6, 1841 తేదీతో కమాండర్ ఇన్ చీఫ్‌కి రాసిన ఒక లేకలో ఈ విధంగా తెలిపారు. ''కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ భారత ప్రభుత్వం ద్వారా పంపిన ఆదేశాల ప్రకారం దేశీయ పండుగలకు ఉత్సవాలకు ప్రభుత్వ దళాలు, మిలిటరీ బాండులను హాజరుపరచడం వారిచేత వందనం సమర్పించడము ఇకముందు మానివేయాలని, హిందూ మహమ్మదీయ మతాలకు సంబంధించిన ఉత్సవాల నుంచి ప్రభుత్వాన్ని, ప్రభుత్వాధికారులను సాధ్యమైనంతగా విడదీయాలని'' తెలిపారు. దేశీయ రాజకుమారులు ఇటువంటి సందర్భాలలో, ఇటువంటి ఉత్సవాలకు మతపరమైన కార్యక్రమాలకు వెడుతుండగా కాని, తిరిగి వస్తుండగా కాని వారిని గౌరవించే సాంప్రదాయాలను మాత్రం పాటించవచ్చు. ఈ మార్పును దేశీయ ప్రజల మనసులను, వారి అభిప్రాయాలను దెబ్బతీయకుండా చాలా జాగ్రత్తగా ప్రవేశపెట్టాలని పేర్కొన్నారు. ఈ ఉత్తర్వులను కమాండర్ ఇన్ ఛీఫ్ వివిధ డివిజన్‌లకు జనరల్స్‌గా ఉన్న అధికారులకు పంపారు. వారి ద్వారా రెజిమెంట్‌లకు పంపారు.

దేశీయ దురభిప్రాయాలతో ఇంతగా దిగజారి అందుకోసం అధికార వనరులన వృథా చేసిన ప్రభుత్వం సంస్కరణలను చేస్తుందని ఆశించగలమా?

బ్రిటిష్ ప్రభుత్వం ముందు సానుభూతితో దెబ్బతిని స్తంభించిపోయింది. ఆ సానుభూతి తొలగిపోయిన తరువాత భయం పెరిగిపోయింది. ఈ భయం రెండు కారణాల వల్ల ఏర్పడింది. మొదటి కారణం- భారత ప్రజలకు అది చేసిన వాగ్దానాలకు సంబంధించింది. కొత్తగా రాజ్యాన్ని సంపాదించిన తరువాత అంతకుముందు పాలనలో అమలైన మత స్వేచ్ఛను రక్షిస్తామని వారి మత సంస్థలను గాని సాంప్రదాయాలను గాని దెబ్బతీయబోమని వాగ్దానం చేయడం బ్రిటిష్ ప్రభుత్వ ఆచారం. కర్ణాటక ప్రజలకు 1801లో ఈ క్రింది విధమైన వాగ్దానం చేశారు.

''గౌరవనీయులైన గవర్నర్ ఇన్ కౌన్సిల్ కర్ణాటక పౌరులకు బ్రిటిష్ ప్రభుత్వ సాధారణ ఉదార, న్యాయ, రక్షణ, భద్రత వంటి సహజ లక్షణాలను మళ్ళీ వివరించవలసిన అవసరం లేదని విశ్వసిస్తూనే ప్రస్తుత కార్యక్రమాల ద్వారా కంపెనీకి బదిలీ అయిన పవిత్రమైన విధులను అంగీకరిస్తూ కంపెనీ అధికారానికి ఆనందంగా లోబడిపోయే విధేయతను చూపుతున్న కర్ణాటక ప్రజలకు స్వాగతం చెపుతూ నిర్వచించిన చట్టాలు ప్రజా పరిరక్షణకు లోబడి, ప్రతి న్యాయమైన నిర్ధారితమైన పౌరహక్కును మత

సంస్థల నిర్వహణా స్వేచ్ఛను ప్రాచీన సాంప్రదాయాల ఆచరణను అనుమతిస్తుందని ప్రకటిస్తున్నది.''

మే 1834లో కూర్గ్‌ను జయించిన తర్వాత ఆ ప్రజలను ఉద్దేశించి ఈ విధమయిన ప్రకటన చేశారు.

> ''బ్రిటిష్ ప్రభుత్వ రక్షణలో ఉండాలని కూర్గ్ ప్రజల ఏకాభిప్రాయం కావడం చేత, మహా ఘనత వహించిన గవర్నర్ జనరల్ ఇంతదాకా వీర రాజేందర్ వడయార్ పాలనలో ఉన్న ప్రాంతాన్ని గౌరవనీయ కంపెనీకి బదిలీ చేసేందుకు తీర్మానించారు. కూర్గ్ నివాసులు మళ్ళీ దేశీయ పాలనలోకి వెళ్ళబోరని వాగ్దానం చేస్తున్నాం. వారి పౌర హక్కులు, మతపరమయిన సాంప్రదాయాలు గౌరవిస్తామని, వారి భద్రత, సౌకర్యం, ఆనందం కోసం బ్రిటిష్ ప్రభుత్వం ఎంతో ఆసక్తి చూపుతుందని హామీ ఇస్తున్నాం.''

1849లో పంజాబ్‌ను తమ భూభాగంలో కలుపుకున్న తర్వాత ప్రజలకు ఈ క్రింద వాగ్దానాన్ని చ్చారు.

> ''బ్రిటిష్ ప్రభుత్వం ముసల్మాన్, హిందూ, శిక్కు ప్రజలెవరికైనా వారి సొంత మతాలను అనుసరించే స్వేచ్ఛను కల్పిస్తుంది. కాని ఒకరి మత ఆచారాలను, సంప్రదాయాల ఆచరణలో మరొకరు జోక్యం చేసుకోవడాన్ని సహించబోము.''

ఇంకా ఇటువంటి ప్రకటనలను ఎన్నో ఉదహరించవచ్చు. వాటిని వాగ్దానాలుగా భావించారు. టువంటి వాగ్దానాలు ఇవ్వడం న్యాయమైనా కాకపోయినా, ఒకసారి ఇచ్చిన తర్వాత అమలు చేయకుండా ్రణీకరించడం భావ్యం కాదనే అభిప్రాయం వుంది. ఇది సాధారణంగా అందరూ అనుకునేదే. కాని ఈ గ్దానాల పదాల అర్థాలను వెలికితీసి యథాతథంగా అన్వయించేవారు, ఏమాత్రం తేడా రాకుండా ాసి, ఏ మినహాయింపులు లేకుండా చూసి, భారతీయులతో ''మీరు ఇన్నాళ్ళూ కొత్త పాలనలో ఏ డ్డూ లేకుండా అనుభవించారు.'' అనీ ''ఈ మార్గం నుంచి తప్పితే నమ్మకద్రోహం అవుతుంది'' ని చెప్పినట్టు వివరించారు. బహిరంగంగా తిరుగుబాటు చేస్తారేమోనన్న భయం కూడా ఉంది. రుగుబాటు భయం బ్రిటిష్ ప్రభుత్వానికి కలిగిందంటే అది వారికి తెలియనిది కాదు. నిజానికి కసారి రుచి చూశారు కూడా. 1801 లో వెల్లూరు సైనిక తిరుగుబాటు, 1857లో మరో తిరుగుబాటు. న్ని సిపాయిల తిరుగుబాటు అన్నారు. వెల్లూరు తిరుగుబాటు చిన్న మంట. సిపాయిల తిరుగుబాటు వానలం. రెండు సందర్భాల్లోనూ హిందూ మతాచారాలలో జోక్యం చేసుకోవడమే కారణమని

ఆరోపణ. ఈ రెండు తిరుగుబాట్లు గుణపాఠం నేర్పడానికి చాలు. బ్రిటిష్ పాలకులు ఆ పాఠాన్ని మరచిపోలేదు కూడా. 1801 నాటి వెల్లూరు తిరుగుబాటు తర్వాత బ్రిటిష్ ప్రభుత్వం సాంఘికంగా నూతనత్వాన్ని ప్రవేశపెట్టడానికి జాగ్రత్తపడింది. 1857 సిపాయిల తిరుగుబాటు తర్వాత ఏవిధమయిన సాంఘిక సంస్కరణకు కూడా విముఖంగానే ఉంది. ఎట్టి పరిస్థితుల్లోనూ బ్రిటిష్ ప్రభుత్వం ప్రమాదాన్ని కొని తెచ్చుకోదలచుకోలేదు. ప్రమాదం అంటే చిన్నది కాదు- మహాప్రమాదం. తిరుగుబాటు వారినెంతగా భయపెట్టిందంటే 'మార్పు' అంటే భారతదేశాన్ని కోల్పోవడమే అని భావించారు. కనుక సంఘ సంస్కరణ అనే అంశం జోలికి వెళ్ళలేదు.

సాంఘిక సంస్కరణ పట్ల బ్రిటిష్ ప్రభుత్వ ధోరణిని అర్థం చేసుకోవచ్చు. ప్రభువు ఎంత గొప్ప చక్రవర్తి అయినా రెండు రకాల పరిధులు ఉంటాయని ప్రొఫెసర్ డైసీ[1] అన్నాడు.

> ''అధికారంలో ఉన్న వారి ప్రయోజనాలు, లక్ష్యాలు, లక్షణాలను బట్టి ఆంతరంగికంగా ఒక పరిధి ఏర్పడుతుంది. సుల్తాన్ మహ్మదిజంను, పోప్ కాథలిజంను, బ్రాహ్మణుడు కులాన్ని, బ్రిటిష్ ప్రభుత్వం తమకిష్టమయిన వారిని నిషేధించకపోవడానికి కారణం ''నిషేధించలేక'' కాదు. వారికా పని చేయడం 'ఇష్టం' ఉండదు కాబట్టి. అదేవిధంగా భారతదేశంలో అధికార యంత్రాంగం ప్రజల అభివృద్ధికి అవసరమయిన కొన్ని పనులు చేయలేదంటే, దాని సామ్రాజ్యతత్వం, లక్షణం, లక్ష్యం, ప్రయోజనం కారణం, భారత సమాజంలోని, జీవించే విభిన్న వర్గాల పట్ల సానుభూతి లేకపోవడం, వారి అవసరాలు, బాధలు, ఆశలు, ఆశయాలు పట్టించుకోకపోవడం, వారి కోరికలను వ్యతిరేకించడం, విద్య అభివృద్ధి చేయకపోవడం, స్వదేశీని తిరస్కరించడం, జాతీయత ధ్వనించే ప్రతిదాన్నీ ఖండించడం, ఎందుకంటే ఇవన్నీ వారి మౌలిక అధికారానికి వ్యతిరేకం కనుక. కాని తమ కిష్టమయిన కార్యాలను చేయడానికి కూడా అధకారం లేకపోవడం బాధ్యతారహిత ప్రభుత్వానికే సాధ్యము. బయటిశక్తుల వత్తిడికి అధికారం పరిమితమైంది. కొన్ని కార్యాలు అది చేయగలదు. కాని తన అధికారానికి వ్యతిరేకతను రెచ్చగొడ్తుందనుకుంటే చేయడానికి సాహసించదు. రోమన్ ప్రజల పూజలను సీజర్ మార్చే సాహసం చేయడు. వలసల మీద ఆధునిక పార్లమెంట్ పన్నులు వేయదు- వేయాలని ఎంతగా ఉన్నా. అదే కారణంగా భారత ప్రభుత్వం కుల వ్యవస్థను రద్దు చేయజాలదు. ఒకే భార్య సూత్రాన్ని అమలు చేయదు. వారసత్వ చట్టాన్ని మార్చదు.

1. లా ఆఫ్ కాన్స్టిట్యూషన్ 1915, పేజీ 74-82

కులాంతర వివాహాలను చట్టబద్ధం చేయదు. తేయాకు సాగు మీద పన్నులు వేయదు. ప్రగతి అంటే ప్రస్తుత సాంఘిక జీవన సరళిలో ప్రవర్తనా నియమావళిలో జోక్యం చేసుకోవడమే. ప్రజల ప్రభుత్వం, ప్రగతిపథం నుంచి వేరు కాలేదు. ఎందుకంటే విధేయత ఎక్కడ అంతరించి తిరుగుబాటు ఎక్కడ మొదలవతుందో వారికి తెలుసు. భారత ప్రభుత్వం ప్రజల ప్రభుత్వం కాదు కనుక వారికి ప్రజల నాడి తెలియదు. సారాంశమేమిటంటే భారత్‌లో పాలకులు ఈ రెండు పరిమితుల మధ్య స్తంభించిపోయారు. జీవనాన్ని అభివృద్ధి చేయడానికి దోహదం చేసే స్థితిలో లేదు. కార్యక్రమంలో కొంత భాగాన్ని ప్రభుత్వం స్వీకరించదలచుకోదు. మరికొంత భాగాన్ని స్వీకరించజాలదు. కొంత ప్రగతి కనబడతున్న మాట సత్యమే. అయితే ప్రపంచంలోని ఏ ప్రజా శాంతి భద్రతల ఫలాలను అనుభవించి మూగజీవుల వలె నోరు మూసుకుని కూర్చోదు. అధికార యంత్రాంగం రోడ్లు బాగు చేసిందని, శాస్త్రీయ పద్ధతుల్లో కాలువలు నిర్మించారనీ, రైల్ ద్వారా ప్రయాణం పెంచిందనీ, తపాలా ద్వారా ఉత్తరాలు రూపాయికే బట్వాడా చేసిందనీ, తంతి ద్వారా సందేశాలు పంపిందని, భూగోళశాస్త్రం, ఖగోళశాస్త్రం, వైద్యానికి సంబంధించి లోపాలను సవరించిందనీ, అంతరంగిక కలహాలన ఆపిందని ప్రజలు సంతోషించేంత మూర్ఖులు కాదు. ఎంత శాంత స్వభావులైనా ప్రజలు కూడా ఏదో ఒక రోజు కేవలం సమర్థతా సాధనంగా మిగిలిపోయిన ప్రభుత్వం కన్నా ఉత్తమమయిన ప్రభుత్వం కావాలనే కోరుకుంటుంది.''

ప్రజలు ఆర్థిక, రాజకీయ సాంఘిక స్వాతంత్ర్యాన్ని కోరుకుంటారు. ఇది సృష్టించడం బ్రిటిష్ ప్రభుత్వానికి ఇష్టం లేదు.

''దీనిఫలితంగా, ప్రజల నైతిక, సాంఘిక జీవితానికి సంబంధించినంతవరకు మొఘల్‌సామ్రాజ్యం నుంచి ప్రభుత్వం బ్రిటిష్‌సామ్రాజ్యానికి మారిందే కాని వ్యవస్థ మారలేదు. బ్రిటిష్ ప్రభుత్వానికి కొంత మటుకు తనంత తాను, మరికొంతమటుకు అవసరం దృష్ట్యా జోక్యం చేసుకోకపోవడమనే సూత్రాన్ని అవంబించడం వల్ల ప్రజలు గత ప్రభుత్వంలో శ్రమించినా, జరిపించినా, బ్రతికినా చచ్చినా, ఈ చరిత్రగతి మరిచిపోయినా, ప్రజలకు పెద్ద తేడా ఏమీ కనిపించలేదు.[1] రాజకీయ కోణం నుంచి చూసినా ఒక నియంత మారి మరో నియంత వచ్చాడు. వారికి కనిపించిన వ్యవస్థను,

1. బర్మాను జయించిన రోజున ఎన్నికల పన్ను ఉంది కనుక దాన్ని మాత్రమే కొనసాగించారు.

ఏర్పాట్లను వారు అదేవిధంగా జాగ్రత్తగా రక్షించారు- ఒక నైనా దర్జీవాడు తనకు నమూనా కోసం ఇచ్చిన పాత కోటు వలెనే కొత్త కోటును కూడా ఇంపులు, మాసికలతో అచ్చం అట్లాగే కుట్టిన విధంగా.''[1]

మత వ్యవహారంలో జోక్యం చేసుకోకూడదనే విధానం అర్థం చేసుకోగలిగినా, అస్పృశ్యులకు సంబంధించినంత వరకు అదొక పొరబాటు అవగాహన. పరిణామాలు కూడా భయంకరంగా ఉంటాయి. అస్పృశ్యులను హిందువులే మనుషులుగా గుర్తించి వారి మానవ హక్కులు అంగీకరించడం ద్వారానే వారి ఉద్ధరణ జరుగుతుందనుకోవచ్చు. కాని అంతటితో అది ముగియదు. వారి మానవ హక్కులకు గుర్తింపును ఏవిధంగా సాధిస్తారనేది ప్రశ్న. ఈ లక్ష్యం సాధించడానికి రెండే మార్గాలున్నాయి. ఒకటి- అతడి హక్కులు గుర్తించతగినవిగా తయారుచేయడం. రెండు- ఆ హక్కులు గుర్తించి గౌరవించకపోతే శిక్షించడం. మొదటి పద్ధతిలో వారిని విద్యావంతుల్ని చేసి హక్కుల గురించి తెలిపి ఒక అధికారిక స్థాయి కల్పించే బాధ్యత ఉంటుంది. రెండో పద్ధతిలో అస్పృశ్యతను శిక్షించతగిన నేరంగా సాంఘిక సంస్కరణ ప్రవేశపెట్టడం. ఈ రెండింటిలో ఏ పని చేయడానికీ బ్రిటిష్ ప్రభుత్వం సిద్ధంగా లేదు. ప్రభుత్వ ఉద్యోగాల్లో బ్రిటిష్ ప్రభుత్వం అస్పృశ్యులకు ప్రాధాన్యత ఇచ్చేందుకు ఇష్టపడదు. హిందూ సమాజాన్ని సంస్కరించే బాధ్యత స్వీకరించదు. కనుక అస్పృశ్యుడు బ్రిటిష్ ప్రభుత్వం కన్నా ముందు ఏవిధంగా ఉన్నాడో అదే అస్పృశ్యుడుగానే మిగిలాడు. అతను పౌరుడే కాని అతనికి పౌరుడికి ఉండే హక్కులు లేవు. అతను చెల్లించిన పన్నులతో నడిచే పాఠశాలల్లో అతని పిల్లలకే ప్రవేశం లేదు. అతను చెల్లించిన పన్నులతో తవ్విన బావుల్లో నీరు తాగే హక్కు అతనికి లేదు. దేశం ఉన్నతి కోసం అతను పన్నులు చెల్లిస్తాడు. కాని అతనికి ఆ దేశంలోని అధికారిక ఉద్యోగాల్లో స్థానం లేదు. అతను పాలితుడే కాని పౌరుడు కాదు.

అస్పృశ్యుడికి తాగే నీరు, చదువు ఎంతో అవసరమయింది. తనను తాను రక్షించుకోవడానికి అతనికి ఒక హోదా, ఉద్యోగం ఎంతో అవసరం. అతని పేదరికం దృష్ట్యా పన్ను చెల్లింపుల నుంచి మినహాయింపు అవసరం. కాని ఇవన్నీ తిరస్కరించారు. తలకిందులు చేస్తారు. స్పృశ్యుల చదువుల కోసం అస్పృశ్యులపైన పన్నులు వేశారు. ప్రభుత్వ కార్యాలయాల్లో పనిచేసే స్పృశ్యుల జీతాల కోసం అస్పృశ్యులపై పన్నులు వేశారు.

అస్పృశ్యులకు బ్రిటిష్ పాలన చేసిన మంచి ఏమిటి? విద్యలో- ఏమీ లేదు. సర్వీసుల్లో- లేదు. హోదాలో- లేదు. ఒక్క విషయంలో వారు కొంత సాధించారు. చట్టం దృష్టిలో సమానత. అందులో

1. బెర్నార్డ్ హాటన్ ''బ్యూరోక్రాటిక్ గవర్నమెంట్''

పెద్ద విశేషమేమీ లేదు. చట్టం ముందు సమానత అందరికీ ఉన్నదే. అందులో కనిపించే గొప్ప ఏమీ లేదు. ఎందుకంటే అధికార హోదాలో ఉన్నవారు తమ అధికారాన్ని వినియోగించి అస్పృశ్యులకు ఈ సమానత సూత్రం వల్ల లభించే లాభాన్ని అందకుండా చూస్తారు. ఇంతజేసినా, బ్రిటిష్ ప్రభుత్వానికి ముందు ఆ మాత్రం సమానత లేదు కనుక అస్పృశ్యులకు ఆ సమానత కొత్త ప్రయోజనమే. మనుధర్మశాస్త్రం సమానతా సూత్రాన్ని గుర్తించ లేదు. మను న్యాయానికి అసమానతే ప్రాణం. అదే అన్ని జీవన విధానాలలో, సాంఘిక సంబంధాలలో, అన్ని విభాగాలలో వ్యాపించింది. అది గాలిని కూడా కలుషితం చేసి అస్పృశ్యులను బాధించింది. కనుక సమానతా సూత్రం ఒక గొప్ప వ్యాధి నిరోధకంగా పనిచేసింది. అది కనీసం గాలిని శుభ్రం చేసి అస్పృశ్యుడు స్వేచ్ఛగా గాలి పీల్చుకునే అవకాశం కల్పించింది. ఇది అస్పృశ్యులకు లభించిన కొత్త విషయం. గతంతో పోలిస్తే ఇది చిన్న ప్రయోజనమేమీ కాదు.

# మూడో భాగం

# బ్రిటిష్ రాజ్యాంగంపై ప్రసంగాలు

# మూడో భాగం

# బ్రిటిష్ రాజ్యాంగంపై ప్రసంగాలు

## విషయసూచిక



## ఉపోద్ఘాతం

బ్రిటిష్ రాజ్యాంగంపై ఈ ప్రసంగాలను 1934-35 సంవత్సరంలో బొంబాయి ప్రభుత్వ న్యాయ కళాశాల విద్యార్థుల కోసం నేను వెలువరించాను. ఈ ప్రసంగాలను ప్రచురించేటప్పుడు, బ్రిటిష్ రాజ్యాంగ సూత్రాలను ఒక భారతీయుడు వ్యాఖ్యానించ ప్రయత్నించడం సాహసమేనని నేను మరిచిపోలేదు. భారత రాజ్యాంగ సంస్కరణలపై నియమించిన సంయుక్త సంఘం ఎదుట ఒక భారతీయ సాక్షిని క్రాస్ పరీక్ష చేస్తూ సర్ ఆస్టెన్ చాంబర్లేన్ ఈ విధంగా అన్నారు. ''భారతదేశ పరిస్థితుల గురించి ఈ సాక్షి చెప్పినపుడు, నేను ఎంతో గౌరవంతో ఆలకిస్తాను. కానీ బ్రిటిష్ రాజ్యాంగాన్ని అతను వివరించినపుడు మాత్రం, నా అభిప్రాయం నాదే'' (సాక్ష్య వివరాలు, సంపుటి 11C, 9812) ఈ వ్యాఖ్యలో ఎంతో నిజం వుందన్న విషయాన్ని కాదనలేను. అందువల్లే బ్రిటిష్ రాజ్యాంగంపై రాయదలచుకున్న భారతీయుడు కొంత ఆగి ఆలోచించవలసిందే: అయితే, రాయాలని కృతనిశ్చయం చేసుకున్న భారతీయుడికి ధైర్యం కలిగించే అంశం ఒకటుంది. ఇంతవరకూ బ్రిటిష్ రాజ్యాంగంపై ఎక్కువగా వ్యాఖ్యానించింది బ్రిటిషేతరులైన విదేశీయులే. పైగా వారి వ్యాఖ్యలను బ్రిటిష్‌వారు గౌరవంతో వినడమే గాక, వాటి ఆధారంగా తమ అభిప్రాయాలను మార్చుకున్నారు కూడా. ఇంతకూ సర్ ఆస్టెన్

చాంబర్లేన్ వ్యాఖ్యలు నా పనికి అవరోధం కలిగించనవసరం లేదు. ఎందుకంటే, నా సొంత వ్యాఖ్యలు చేయడం లేదు. నా వివరణలు బ్రిటిష్ పౌరుల కోసం కాదు కూడా. కేవలం డైసీ రాసిన బ్రిటిష్ రాజ్యాంగ సూత్రాలను భారతీయ విద్యార్థులకు సులభగ్రాహ్యం చేయడమే నా ఉద్దేశం. భారతీయ విద్యార్థుల దృష్టితో చూస్తే, డైసీ గ్రంథంలో రెండు లోపాలు కనిపిస్తాయి. పాఠకుడికి బ్రిటిష్ రాజ్యాంగంలోని కొన్ని విషయాలు తెలిసే ఉంటాయన్న విశ్వాసం ఈ గ్రంథంలో కనిపించడం ఆ లోపాల్లో ఒకటి. ఉదాహరణకు, పార్లమెంటు అంటే ఏమిటి, దాని నిర్మాణం, విధులు ఎటువంటివి అన్న విషయం పాఠకుడికి తెలుసునన్నట్లుగా ఈ రచన సాగుతుంది. ఈ నమ్మకం ఇంగ్లీషు విద్యార్థుల విషయంలో న్యాయమే అయినా, తొలిసారిగా డైసీ పుస్తకం అధ్యయనం చేస్తున్న భారతీయ విద్యార్థుల విషయంలో వర్తించదు. బ్రిటిష్ రాజ్యాంగంలోని ఈ మౌలికమైన విషయం తెలియనపుడు, సార్వభౌమాధికారం, న్యాయశాస్త్ర నియమం, రాజ్యాంగంలో సంప్రదాయం పాత్ర ఇత్యాది విషయాల ప్రాముఖ్యం విద్యార్థికి పూర్తిగా అర్థంకాదు. ఈ సూత్రాల గురించి డైసీ ఇచ్చిన వివరణలు విద్యార్థికి చెప్పేటప్పుడు, డైసీ గ్రంథంలో లేని విషయాలను ఎప్పటికప్పుడు ఉపాధ్యాయుడే చెప్పవలసి వుంటుంది. పైగా, బ్రిటిష్ రాజ్యాంగం, డైసీ రాజ్యాంగ గ్రంథం చివరి ప్రతి ప్రచురణ నాటినుంచి ఈనాటి వరకూ, న్యాయశాస్త్ర నియమాల్లోనూ, సంప్రదాయాల విషయంలోనూ ఎంతో విస్తృతి చెందింది. ఈ విస్తృత ఫలితాలు రెండు భిన్న విధంగా వున్నాయి. ఒకటి డైసీ ఇచ్చిన కొన్ని ఉదాహరణలు ఇప్పుడు అనుచితంగా ఉంటాయి. రెండవది, రాజుకు, పార్లమెంటుకూ, డొమినియన్లలో వున్న సంబంధం విషయంలో ఎన్నిరకాల మార్పులు వచ్చాయంటే, ఒక్క డైసీ గ్రంథం మీదే ఆధారపడే భారతీయ విద్యార్థి పరిజ్ఞానం చాలా వెనుకబడి వుంటుంది. నేను చేసిన ఈ ప్రసంగాల్లో, కొన్ని విషయాలు చేర్చడం, కొన్నింటి రూపాలను మార్చడం మినహా, వేరే కొత్తదనం ఏమీ లేదు. బ్రిటిష్ రాజ్యాంగంపై డైసీ సిద్ధాంత గ్రంథాన్ని, ఆయా లోపాలు పరిహరించి, భారతీయ విద్యార్థి అవసరాల మేరకు సవరించాలన్న ఉద్దేశంతో మాత్రమే ఈ ప్రసంగాలు చేశాను.

## i బ్రిటిష్ రాజ్యాంగాన్ని నిర్దేశించిన సూత్రాలు

డైసీ అభిప్రాయం ప్రకారం, బ్రిటిష్ రాజ్యాంగాన్ని ఇతర దేశాల రాజ్యాంగాల నుంచి వేరుపరిచే సూత్రాలు ప్రధానంగా మూడు వున్నాయి. ఈ సూత్రాలు:

1. పార్లమెంటుకు శాసనపరమైన సర్వాధికారాలు ఉండడం.
2. రూల్ ఆఫ్ లా (న్యాయపాలన) ప్రవర్తిల్లడం.
3. రాజకీయ సంప్రదాయాలపై రాజ్యాంగం ఆధారపడడం.

ఈ సూత్రాలు, బ్రిటిష్ రాజ్యాంగాన్ని ఇతర రాజ్యాంగాల నుంచి వేరు పరచేవన్న అభిప్రాయంపై రెండు వ్యాఖ్యానాలు నిరభ్యంతరంగా చేయవచ్చు. ఇందులో మొదటిది- డైసీ చెప్పిన రూపంలో ఈ లక్షణాలు పూర్తి అమల్లో ఏనాడూ లేవు. ఉదాహరణకు 1930లో వెస్ట్ మిన్స్టర్ రాజ్యాంగ సవరణ ప్రకారం పార్లమెంటు సంపూర్ణ శాసనాధికారాల్లో మార్పులు వచ్చాయి. రెండవది- రూల్ ఆఫ్ లా ప్రవర్తిల్లడం, మూడవది సంప్రదాయాలపై ఆధారపడడం, ఇవి కేవలం బ్రిటిష్ రాజ్యాంగానికే పరిమితమైనవి కావు. అన్ని దేశాల రాజ్యాంగాల్లోనూ సంప్రదాయాల ప్రస్తావన వుంది. రూల్ ఆఫ్ లా, మరో రూపంలోనైనా, అమెరికాలో అమల్లో వుంది. అయితే, ఇవి రెండూ కూడా బ్రిటిష్ రాజ్యాంగంలో అమల్లో వున్నంత విస్తృతంగా మరెక్కడా అమల్లో లేవన్న విషయం నిజమే. ఈరకంగా చూస్తే, బ్రిటిష్ రాజ్యాంగాన్ని తదితర రాజ్యాంగాల నుంచి వేరుపరిచేందుకు ఈ లక్షణాలు ఉపకరిస్తాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

బ్రిటిష్ రాజ్యాంగం వ్యాఖ్యాతల్లో తొలివరసన నిలిచే హాంటెస్క్యూ, ఆ రాజ్యాంగాన్ని అధ్యయనం చేసిన తర్వాత, అప్పటి ఫ్రెంచి రాజ్యాంగంలో కనిపించిన అంశాలు బ్రిటిష్ రాజ్యాంగంలో ఉన్నాయన్న నిర్ణయానికి వచ్చారు. బ్రిటిష్ రాజ్యాంగం ప్రకారం, దేశంలోని శాసన వ్యవస్థ, కార్యనిర్వాహక వ్యవస్థ, న్యాయవ్యవస్థ నిర్మాణంలోనూ, విధులలోనూ కూడా ఒకదాని నుంచి మరొకటి భిన్నంగా ఉన్నాయని ఆయన పేర్కొన్నారు. ఈ మూడు తమ విధులకు తాము పరిమితమై, రెండవ వ్యవస్థలో వేలుపెట్టే అధికారం లేకుండా ఉన్నాయి. బ్రిటిష్ రాజ్యాంగంలోని ఈ అంశమే బ్రిటిష్ పౌరుడికి స్వేచ్ఛను ప్రసాదించిందనీ, ఈ అంశం లేనందువల్లే తమ దేశ పౌరులకు స్వేచ్ఛ లభించలేదని ఆయన భావించాడు. ఈ మూడు వ్యవస్థల వేర్పాటును ఒక మహత్తరమైన లక్షణంగా ఆయన భావించి, ఫ్రెంచి రాజ్యాంగం కూడా దీన్ని అవలంబించాలని సిఫారసు చేశారు. తదనంతరం వచ్చిన నూతన రాజ్యాంగాలన్నిటిలోనూ హాంటెస్క్యూ సూచన ఒక ప్రాతిపదికగా భాసించింది. ఒక రాజకీయ విద్యార్థి తప్పుడు నిర్ణయాలు ఎన్ని దేశాలను అపమార్గం పట్టించాయో చెప్పడానికి ఈ ఒక్క ఉదాహరణ చాలు. ఎందుకంటే, హాంటెస్క్యూ బ్రిటిష్ రాజ్యాంగాన్ని తప్పుగా అర్థం చేసుకున్నాడు. శాసన, కార్యనిర్వాహక, న్యాయవ్యవస్థల వేర్పాటును బ్రిటిష్ రాజ్యాంగం గుర్తించనేలేదన్నది ముమ్మాటికీ నిజం. బ్రిటిష్ రాజు శాసన వ్యవస్థలో భాగస్వామి, న్యాయవ్యవస్థకు అధిపతి, కార్యనిర్వాహక వ్యవస్థకు అత్యున్నత అధికారి. రాజుగారి పేరిట ప్రభుత్వ కార్యకలాపాలను నిర్వహించే మంత్రివర్గం పార్లమెంటులో సభ్యత్వం కలిగి వుంటుంది. అంటే కార్యనిర్వాహక వ్యవస్థ, శాసన వ్యవస్థ వేర్వేరుగా లేవన్నది స్పష్టం. న్యాయవ్యవస్థకు అధికారి అయిన లార్డ్ ఛాన్సలర్ మంత్రివర్గంలో సభ్యుడు. అంటే కార్యనిర్వాహక వ్యవస్థ, న్యాయవ్యవస్థ వేర్వేరుగా లేవన్నట్లే. దీన్నిబట్టి, ఈ మూడు ప్రభుత్వ వ్యవస్థలూ వేర్వేరుగా లేకపోవడమే కాదు, రాజ్యాంగం

ప్రకారం వాటి అధికారాలు పరిమితంగా ఉన్నాయన్న వ్యాఖ్య కూడా నిరాధారమైంది. ఎందువల్లనంటే, అమెరికాలో వాడే అర్థంలో విభిన్న శాఖలకు విధులను కేటాయిస్తూ వాటి అధికారాన్ని పరిమితం చేసే రాజ్యాంగం అన్నమాట ఇంగ్లండ్‌లో లేదు. బ్రిటిష్ రాజ్యాంగం క్రింద, పార్లమెంటుకు సర్వాధికారాలున్నాయి. కార్యనిర్వాహకశాఖకూ, న్యాయ శాఖకూ విధుల్లో పరిమితులున్నంత మాత్రాన, పార్లమెంటు విధులకు పరిమితులున్నాయని భావించనవసరం లేదు. పార్లమెంటు నిర్ణీతకాలం కోసం, కొన్ని విధులను కొన్ని శాఖలకు కేటాయిస్తుందని మాత్రమే దాని అర్థం. న్యాయ వ్యవస్థ, కార్యనిర్వాహక వ్యవస్థల పరిమితులననుసరించి పార్లమెంటు విధుల్లో కూడా పరిమితులు ఏర్పడతాయని అనుకోకూడదు. నిజానికి, ఈ పరిమితులు కూడా పార్లమెంటే విధిస్తుంది కనుక, వాటిని విస్తృతం చేయడానికి గానీ, మరింత కుదించడానికి గానీ పార్లమెంటుకు అధికారం వుంది.

## పార్లమెంటు శాసన సర్వాధికారాలు

పార్లమెంటుకు శాసన విధానాల్లో సర్వాధికారాలు ఎలా ఉన్నాయో అర్థం చేసుకోవడానికి రెండు విషయాలను మనం ఆకళింపు చేసుకోవాలి. మొదటిది, బ్రిటిష్ రాజ్యాంగం కింద, ఏ చట్టాన్నయినా చేయడానికి, తొలగించడానికీ పార్లమెంటుకు అధికారం వుంది. రెండవది, పార్లమెంటు చేసిన ఏ చట్టాన్నయినా అధిగమించడానికీ, ఉపేక్షించడానికీ ఏ వ్యక్తికీ లేదా వ్యవస్థకూ హక్కు లేదని బ్రిటిష్ రాజ్యాంగం స్పష్టం చేసింది. ఇక్కడ పార్లమెంటు, చట్టం అన్న పదాలను చట్టబద్ధమైన అర్థంలో స్వీకరించాలని చెప్పడం అవసరమే అవుతుంది. ఇదివరకే చెప్పినట్టుగా, పార్లమెంటు అంటే రాజు, హౌస్ ఆఫ్ లార్డ్స్, హౌస్ ఆఫ్ కామన్స్. వారందరూ కలిసి చేసినదే చట్టం కాగలదు కానీ, ఎవరికీ వేర్వేరుగా ఏ చట్టం చేసే హక్కు లేదు. 'చట్టం' అన్న పదాన్ని కూడా ఖచ్చితమైన శాసనవిహితమైన అర్థంలో ప్రయోగించాలి. న్యాయస్థానం అమలుపరిచే నియమ నిబంధనలనే చట్టం అని పిలుస్తున్నాం. పార్లమెంటు శాసన సర్వాధికారాల్లో ఏయే అంశాలున్నాయో చెప్పిన తర్వాత, ఈ సర్వాధికారం పార్లమెంటుకు ఉన్నట్టు ఎలా రుజువు చేయగలమన్న ప్రశ్న ఉదయిస్తుంది.

బ్రిటిష్ రాజ్యాంగం గురించి రాసిన న్యాయవాదులందరూ పార్లమెంటుకు శాసన సర్వాధికారాలున్నాయన్న సిద్ధాంతాన్ని అంగీకరించారు. సర్ ఎడ్వర్డ్ కోక్ బ్రిటిష్ రాజ్యాంగం గురించి చెబుతూ, పార్లమెంటు అధికారం, పరిధి ఎంత సంపూర్ణమైనవంటే, వాటిని ఏ ఇతర కారణాలు గానీ, ప్రక్రియ గానీ ఏ రకంగానూ నియంత్రించలేవని అన్నారు.

(4 ఇన్‌స్టిట్యూట్, పుట 36)★

బ్రిటిష్ రాజ్యాంగం వ్యాఖ్యాతల్లో ప్రసిద్ధుడైన బ్లాక్ స్టోన్ ఇలా అన్నాడు. ''మతపరమైన, పౌర సంబంధమైన, సైనిక సంబంధమైన, నేర సంబంధమైన అన్ని విషయాలకు సంబంధించిన చట్టాలను చేయడానికీ, ధ్రువీకరించడానికీ, విస్తృతపరచడానికీ, నియంత్రించడానికీ, రద్దు చేయడానికీ, తొలగించడానికీ, పునరుజ్జీవింపచేయడానికీ, అన్నింటికీ సర్వమూ, అపరిమితమూ అయిన అధికారం పార్లమెంటుకు వుంది. ఇతర రాజ్యాల రాజ్యాంగాలు వేరే వ్యవస్థలకు కేటాయించిన ఈ సార్వభౌమాధికారాలను బ్రిటిష్ రాజ్యాంగం పార్లమెంటుకు ఇచ్చింది. సాధారణ న్యాయ పరిధికి అందని అన్నిరకాల తప్పులు, సమస్యలు, కార్యకలాపాలు, పరిష్కారాలు ఈ అసాధారణ న్యాయ సంస్థ పరిధిలో ఉంటాయి. ఎనిమిదవ హెన్రీ, మూడవ విలియంల విషయంలో చేసినట్టుగా రాజుగారి వారసత్వ అధికారాలను పార్లమెంటు క్రమబద్ధం చేయగలదు. 8వ హెన్రీ, అతని ముగ్గురు పిల్లల పరిపాలనా కాలంలో చేసినట్టుగా అప్పటి ప్రజల మతాన్ని మార్చగలదు. 'పార్లమెంటు చేయగలిగిన పనులను ఈ భూమ్మీద మరే అధికార వ్యవస్థా చేయలేదు' అన్న మాటలు నిజం.

ఫ్రెంచి న్యాయవాది ఒలోమి, కోక్‌తోనూ, బ్లాక్ స్టోన్‌తోనూ ఏకీభవిస్తూ, ''స్త్రీని పురుషుడిగా, పురుషుడిని స్త్రీగా మార్చడం మినహా పార్లమెంటు అన్నీ చేయగలదు'' అన్నాడు.

న్యాయవాదులందరూ అంగీకరించిన పార్లమెంటు శాసన సర్వాధికారాలను, బ్రిటిష్‌పార్లమెంటు చరిత్రలోని అనేక సంఘటనలు నిరూపిస్తున్నాయి. ఈ క్రింది వాటిని పరిశీలిస్తే అది అర్థమౌతుంది.

## (1) పార్లమెంటు సార్వభౌమాధికారం, విలీన చట్టం

స్కాట్లాండ్, ఐర్లండ్‌లలో చేసిన విలీన చట్టాలు ఒప్పందాల వంటివి. వీటిలో పేర్కొన్నవి ఆనాడు యూనియన్‌కు అత్యవసరమైన, మౌలికమైన షరతులుగా భావించారు. వీటిని రద్దు చేయడానికి బ్రిటిష్‌పార్లమెంటుకు అధికారం లేదని కూడా స్పష్టం చేశారు. స్కాట్లాండ్‌తో చేసుకున్న విలీనచట్టం ప్రకారం, స్కాట్లాండ్ విశ్వవిద్యాలయాలలో పనిచేసే ప్రతి ప్రొఫెసర్, మత విధుల నిబద్ధతే, వృత్తి నిబద్ధత కూడానని ప్రమాణ స్వీకారం చేయాలి. ఇది ఈ ఒప్పందంలోని ఒక ప్రాథమికమైన షరతుగా పరిగణించారు. అయితే, 1853 స్కాట్లాండ్ విశ్వవిద్యాలయాల చట్టంలో ఈ షరతును పునరుద్ఘాటిస్తూనే, అధ్యాపకులందరూ మత విశ్వాసానికి కట్టుబడి ఉండనవసరం లేదని పేర్కొన్నారు. ఐర్లండ్‌లో చేసుకున్న విలీన చట్టం ప్రకారం, ''ఇంగ్లండు చర్చి, ఐర్లండు చర్చి ఒక ప్రొటెస్టెంట్ ఎపిస్కోపల్ చర్చిగా ఏర్పడి, ఇంగ్లండ్, ఐర్లండ్ ఐక్య చర్చిగా పిలవబడతాయని, ఈ ఐక్య చర్చి

★ మూల రచన నుంచి ప్రమురితం. 36వ పుట అలభ్యం - సం.

నిబంధనలకు అనుగుణంగా సిద్ధాంతం, ప్రార్థనా విధానం, క్రమశిక్షణా పద్ధతులు అమలు జరుగుతాయనీ, ఇంగ్లండ్, ఐర్లండ్ చర్చిల విలీనం ఈ రెండు దేశాల విలీనంలో ప్రాథమికమైన అనివార్యమైన భాగమని భావించాలని'' పేర్కొనడం జరిగింది. దీని ప్రకారం, పార్లమెంటు సంపూర్ణ శాసనాధికారాలను పరిమితం చేసినట్టే. అయితే 1869లో ఐరిష్ చర్చి చట్టం ద్వారా పార్లమెంటు ఐర్లండ్ చర్చిని రద్దు చేసినపుడు అలా చేసే అధికారం పార్లమెంటుకు ఎలా వచ్చిందని ఎవరూ ప్రశ్నించలేదు.

(ii) 1707లో చేసిన Septerial Act, పార్లమెంటు సంపూర్ణ శాసనాధికారాలకు మరో ఉదాహరణ. 1694 చట్టం ప్రకారం, పార్లమెంటు కాలపరిమితి మూడేళ్ళు. 1716లో తాజా ఎన్నికలు జరగవలసి వుంది. అయితే ఎన్నికలు జరిగితే తమ మంత్రివర్గానికీ, తన అధికారానికీ నష్టం వాటిల్లుతుందని భయపడిన రాజు, అప్పటి మంత్రివర్గం, ఈ చట్టాన్ని సవరించి, పార్లమెంటు కాలపరిమితిని మూడేళ్ళ నుంచి ఏడేళ్ళకు పొడిగించడానికి పార్లమెంటును ఒప్పించారు. ఈ చర్య దిగువ సభపై (హౌస్ ఆఫ్ కామన్స్) ప్రజల విశ్వాసాన్ని వమ్ము చేసిందని విమర్శకులు తిట్టిపోశారు. ప్రజా ప్రతినిధులు, ఎగువసభ సభ్యులు కూడా నిరసన వ్యక్తం చేసి, సవరణ ద్వారా, విఫలురైన పార్లమెంటు సభ్యుల నుంచి విముక్తి పొందే అవకాశాన్ని ప్రజలకు లేకుండా చేశారని ఆరోపించారు. అయితే, వీరంతా రాజకీయ విమర్శలు చేశారే తప్ప, ఈ చట్టంలోని శాసనబద్ధతను గురించి ప్రశ్నించలేదు. ఈ చట్టం ఉచితమా, అనుచితమా అన్నది ఒక ప్రశ్నయితే, తన జీవితకాలం నిర్ణయించే చట్టాన్ని తానే సవరించడానికి పార్లమెంటుకు హక్కు వుండాలన్నది ముఖ్యమైన ప్రశ్న. నాటి విమర్శలన్నీ ఈ చట్ట సవరణలో మొదటి అంశాన్ని (అనౌచిత్యాన్ని) పరిగణనలోకి తీసుకున్నవే గానీ, రెండో ప్రశ్నను (శాసనసబద్ధత) పట్టించుకోలేదు. ఈ Septerial Act పార్లమెంటు శాసనాధికారాల పరిధిలోకి వస్తుందనే అందరూ భావించారు.

పార్లమెంటు సంపూర్ణ శాసనాధికారాలను స్పష్టం చేసే ఇదే చట్టంలోని మరో అంశాన్ని కూడా పరిశీలించాలి. పార్లమెంటు కాలపరిమితిని పొడిగిస్తూ, దాన్ని భవిష్యత్తులో పార్లమెంటుకు కూడా వర్తింపచేస్తూ చట్టం చేసివుంటే, ఎవరూ ప్రశ్నించే అవకాశం వుండేది కాదు. అయితే ఈ చట్టం రాబోయే పార్లమెంటుల కాలపరిమితిని పెంచడంతో పాటు, ఈ చట్టం చేసిన పార్లమెంటు పరిధిని కూడా విస్తృతం చేసింది. ఇది నిస్సందేహంగా రాజకీయ అధికారాల కోసం చేసిన అక్రమమూ, దౌర్జన్యకరమైన చట్టమే. ఇటువంటి అక్రమ చర్యను చట్టబద్ధంగా పరిగణించారు. నిజానికి, పార్లమెంటు శాసనాధికారాలను వివరించడానికి చరిత్రలో ఇంత వెనక్కి, అంటే Septerial Act వరకూ వెళ్ళవలసిన పనిలేదు. ఈ శతాబ్దిలోని 1914 మొదటి ప్రపంచ యుద్ధం రోజుల్లో అప్పటి పార్లమెంటు తనని తాను రద్దు చేసుకోవడానికి బదులు, తన కాలపరిమితిని పెంచుకుంది.

పార్లమెంటు సంపూర్ణ శాసనాధికారాలకు మరో ఉదాహరణ మినహాయింపు చట్టాలు; చట్టబద్ధంగా తనకు విధించవలసిన శిక్షను తప్పించుకునే స్వేచ్ఛను ఈ చట్టం పార్లమెంటుకు ప్రసాదించింది. అక్రమాలను చట్టబద్ధం చేసే ఈ చట్టం పార్లమెంటు సార్వభౌమాధికారానికి పరాకాష్ట.

## ప్రజల వ్యక్తిగత హక్కులలో జోక్యం

సాధారణంగా శాసనసభలకు ప్రజల హక్కులను క్రమబద్ధం చేసే శాసనాధికారం వుంటుంది. అయితే వారి వ్యక్తిగత జీవితాలకు సంబంధించిన హక్కులు పార్లమెంటు పరిధిలోకి రాని పవిత్రమైనవిగా, ప్రత్యేకమైనవిగా భావించడం జరుగుతుంది. అయితే, బ్రిటిష్ పార్లమెంటు తన అధికారాలపై ఈ పరిమితులను ఏనాడూ అంగీకరించలేదు. క్లారెన్స్, గ్లోస్టర్ డ్యూక్‌ల కేసులో, వారు జీవించి ఉండగానే, వారి కుమార్తెలకూ, భార్యలకూ ఆస్తి చెందుతుందని పార్లమెంటు ఆదేశించింది. డ్యూక్ ఆఫ బకింగ్‌హామ్ శిశువుగా ఉన్నప్పుడే, చట్టపరమైన విషయాలన్నిటికీ అతన్ని యుక్తవయస్కుడిగానే పరిగణించాలని పార్లమెంటు ఆదేశించింది. సర్ రాబర్ట్ ప్లే ఫిన్‌స్టన్ చనిపోయిన చాలాకాలం తర్వాత, అతను దేశద్రోహి అని తీర్పు చెబుతూ, పార్లమెంటు ఒక శాసనం జారీ చేసింది. మార్క్విస్ ఆఫ్ విన్‌ఛెస్టర్ కేసులో చట్టబద్ధ వివాహం ఫలితంగా జన్మించిన సంతానాన్ని పార్లమెంటు అక్రమ సంతానంగా తీర్మానించింది. దీనికి విరుద్ధంగా, డ్యూక్ ఆఫ లాంకాస్టర్, కేథరీన స్విన్ ఫోర్డ్‌లకు వివాహేతుపూర్వం జన్మించిన సంతానాన్ని చట్టబద్ధమైన సంతానంగా పార్లమెంటు ప్రకటించింది. కేథరిన్‌కు వివాహానికి ముందే డ్యూక్ వల్ల హెన్రీ, జాన్, థామస్ అనే కుమారులు, జోన్ అనే కుమార్తె జన్మించారు. వీరందరినీ ఒక పార్లమెంటు చట్టం ద్వారా చట్టబద్ధమైన సంతానంగా ప్రకటించారు. పార్లమెంటు ఒక వ్యక్తి జీవితంలో చట్టాన్ని క్రమబద్ధం చేయడమేకాక, సాధారణ న్యాయాన్ని కూడా తనకిష్టం వచ్చినట్టు మార్చగలదనడానికి ఇవే నిదర్శనాలు

## ఒకటవ అధ్యాయం

# పార్లమెంటు అంటే ఏమిటి?

1. ఈ రోజుల్లో పార్లమెంటు హౌస్ ఆఫ్ కామన్స్ ( ప్రజాప్రతినిధుల సభ) అందులో హౌస్ ఆఫ్ లార్డ్స్) ప్రసక్తి లేదు. రాజుగారి పేరు అసలే లేదు. బ్రిటిష్ రాజ్యాంగం కార్యకలాపాల్లో హౌస్ ఆఫ్ కామన్స్‌కు ఉన్న అత్యధిక అధికారం వల్ల ఈ రూఢి ఏర్పడింది. యూధ్యర్థంలో ఇది ఎంత నిజమైనా, శాసన బద్ధంగా చూసినపుడు ఇది తప్పుడు అభిప్రాయమే. శాసనం ప్రకారం, పార్లమెంటులో మూడు అంశాలుంటాయి. రాజు, హౌస్ ఆఫ్ లార్డ్స్, హౌస్ ఆఫ్ కామన్స్. శాసనాధికారాలు సంయుక్తంగా ఈ ముగ్గురికీ చెందుతాయి. పార్లమెంటులో వున్న రాజుగారికి ఇది వర్తిస్తుంది. అంటే ఉభయ సభలు చేసిన చట్టానికి రాజుగారు ఆమోదముద్ర వేస్తారు. రాజుగారి ఆమోదం లేనిదే ఏదీ చట్టరూపం దాల్చదన్నది సైద్ధాంతికంగా నిజం. రాజుగారు పిలిపిస్తేనే ఉభయ సభలు సమావేశం కావాలనడంలోనే పార్లమెంటులో రాజుగారికి ఎంత ముఖ్యమైన పాత్ర వుందో తెలుస్తున్నది. ఉభయ సభలు స్వచ్ఛందంగా కలుసుకుని సభా కార్యకలాపాలు నిర్వహించలేవు. అదేవిధంగా సభలను సమావేశపరచడానికి, వాయిదా వేయడానికీ, రద్దు చేయడానికీ రాజుకు సంపూర్ణాధికారాలున్నాయంటే రాజుగారు ఎంత శక్తిమంతుడో తెలుస్తుంది. అయితే, ఉభయ సభల ఆమోదం లేనిదే, ఈ పరిధిలో ఎటువంటి శాసనం చేయడానికి రాజుగారికి అధికారం లేదు. రాజ్యాంగ శాసనంలో చేర్చినది తప్ప, మరే చర్యను రాజుగారు చేపట్టదలుచుకున్నా, ఉభయ సభల ఆమోదాన్ని ఆయన పొందితీరాలి.

2. సకల శాసనాధికారాలు పార్లమెంటులో రాజుగారికే వుంటాయనీ, ఉభయ సభలూ, రాజుగారి ఆమోదం లేనిదే ఏ చట్టం అమల్లోకి రాదనీ చెప్పడానికి రెండు పరిమితులున్నాయి.

## 3. రాజుగారి వీటో అధికారాలు:

ప్రతి చర్య శాసనం కావడానికి రాజుగారి అంగీకారం అత్యవసరమని చట్టంలో పేర్కొన్నమాట నిజమే. కానీ, ఆమోదం తిరస్కరించే అధికారాన్ని, (వీటో అధికారాన్ని) చాలావరకు రాజులు దుర్వినియోగం చేశారు. అయితే 1707లో ఆనీ రాణి స్కాచ్ సైనిక బిల్లుకు సమ్మతి నిరాకరించిన తర్వాత ఇప్పటివరకూ దేశాధిపతులు వీటో అధికారాన్ని ఎవరూ ఉపయోగించలేదు. రాజుగారు వీటో అధికారాలు ఉపయోగించకపోవడానికి శాసన విహితమైన కారణాలేవీ లేవు. ఇప్పటికీ రాజుగారికి అపరిమితమైన వీటో అధికారాలున్నాయి. అయితే, ఉభయ సభలూ అంగీకరించిన అంశాన్ని రాజుగారు తిరస్కరించకూడదన్నది బ్రిటిష్ రాజకీయ సంప్రదాయంలో స్థిరపడింది. వీటో అధికారాన్ని

వినియోగించుకోనంత మాత్రాన అది పునరుద్ధరించలేనంతగా నశించి పోయిందని భావించనవసరం లేదు. ఉదాహరణకు హౌస్ ఆఫ్ కామన్స్ ఒక బిల్లును ఆమోదించిన తర్వాత మంత్రి వర్గం రాజీనామా చేసిందనుకుందాం. కొత్త మంత్రి వర్గం బిల్లును వ్యతిరేకించినప్పటికీ, హౌస్ ఆఫ్ లార్డ్స్, బిల్లు అమల్లోకి రావాలని పట్టుబట్టిందనుకుందాం. ఇటువంటి సందర్భంలో కూడా రాజుగారు తమ అంగీకారాన్ని వాయిదా వేయకూడదనడం తొందరపాటు ప్రతిపాదనే అవుతుంది.

## 2. హౌస్ ఆఫ్ లార్డ్స్ వీటో అధికారాలు:

ఒకప్పుడు హౌస్ ఆఫ్ లార్డ్స్ శాసనసభతో సమాన హక్కులు గల సమన్వయ శాఖగా ఉండేది. హౌస్ ఆఫ్ కామన్స్‌తో సరిసమానంగా దీని ప్రతి చర్యా పార్లమెంటు చట్టమయ్యేది. అయితే, ఆచరణలో క్రమేపీ ఆర్థిక విషయాలకు సంబంధించి పూర్తి అధికారాన్ని, ఇతర శాసనాల విషయంలో ఆధిపత్యాన్ని, హౌస్ ఆఫ్ కామన్స్ చేజిక్కించుకుంది.

1671లో, హౌస్ ఆఫ్ కామన్స్ ఈ రకంగా ఒక తీర్మానం చేసింది. "కామన్స్ రాజుగారికి సమర్పించే సహాయక వ్యవహారాల్లో పన్ను రేటును సవరించే హక్కు లార్డ్స్‌కి లేదు".

1676లో, కామన్స్ ఈవిధంగా తీర్మానించింది: "నిధులు మంజూరు చేసే బిల్లులన్నీ కామన్స్‌లోనే మొదట ప్రవేశపెట్టాలి. ఈ నిధుల లక్ష్యాలు, ఉద్దేశాలూ, పరిమితులు, షరతులు, అర్హతలను నిర్దేశించడానికీ, ప్రకటించడానికీ పూర్తి అధికారాలు కామన్స్‌కే ఉన్నాయి. హౌస్ ఆఫ్ లార్డ్స్ వాటిని సవరించకూడదు."

ఆర్థికేతర శాసనాలకు సంబంధించి, హౌస్ ఆఫ్ లార్డ్స్ తమతో విభేదించవచ్చును కానీ, ఏదో ఒక దశలో హౌస్ ఆఫ్ కామన్స్ నిర్ణయానికి లార్డ్స్ తలవొగ్గాలి. ఆనాటి నుంచే ఈ నిర్ణయం ఆచరణలో వుంది. అయితే అది ఒక రాజకీయ సంప్రదాయం రూపంలో మాత్రమే వుందిగాని, శాసన రూపం దాల్చలేదు. శాసనం ప్రకారం హౌస్ ఆఫ్ లార్డ్స్‌కు, ఆర్థికం లేక ఆర్థికేతర బిల్లులకు ఆమోదాన్ని నిరాకరించే హక్కు వుంది. అంటే ఈ విషయంలో కూడా శాసన విరుద్ధంగా ప్రవర్తించకపోయినా, హక్కును వినియోగించనివ్వకుండా చేసారు. 1910లో సంప్రదాయానికి విరుద్ధంగా లాయిడ్ జార్జి బడ్జెట్ ప్రతిపాదనను హౌస్ ఆఫ్ లార్డ్స్ ఆమోదించడానికి నిరాకరించింది. దీనితో ఉభయ సభల మధ్య వైషమ్యం ఏర్పడింది. 1911 పార్లమెంటు చట్టంతో ఈ వివాదానికి తెరపడింది. హౌస్ ఆఫ్ లార్డ్స్ వీటో అధికారాలను కీలకమైన విధంగా పరిమితం చేసిన ఈ చట్టం బ్రిటిష్ రాజ్యాంగంలోని చటాల్లో అతి ముఖ్యమైంది.

**1911** పార్లమెంటు చట్టం ప్రభుత్వ బిల్లులకు మాత్రమే సంబంధించింది. ఇది ప్రైవేటు బిల్లులకు వర్తించదు. ప్రైవేటు బిల్లుల విషయంలో హౌస్ ఆఫ్ లార్డ్స్ వీటో అధికారాలు చెక్కుచెదరకుండా ఉన్నాయి. ప్రభుత్వ బిల్లులలో అన్నిటికీ కాకపోయినా, కొన్నిటికి ఇది వర్తిస్తుంది. పార్లమెంట్లు కాలపరిమితికి సంబంధించిన బిల్లుకు ఇది వర్తించదు. పార్లమెంటు చట్టం క్రింద, ఇటువంటి బిల్లులను వీటో చేసే అధికారం కామన్స్‌కు మాత్రమే కొనసాగుతుంది. అయితే, మరికొన్ని ప్రభుత్వ బిల్లులలో హౌస్ ఆఫ్ లార్డ్స్‌కు ఇదివరకు వున్న వీటో అధికారాలు అదే విధంగా కొనసాగవు. వీటిలో కూడా అన్నిటికీ ఒకే నియమం వర్తించదు. ఈ సరికొత్త పార్లమెంటు చట్టం ప్రభుత్వ బిల్లులను రెండు వర్గాలుగా విభజిస్తుంది. (1) ఆర్థిక సంబంధమైన ప్రభుత్వ బిల్లులు; (2) ఆర్థికేతరమైన ప్రభుత్వ బిల్లులు. హౌస్ ఆఫ్ కామన్స్ స్పీకర్ అభిప్రాయాన్ని అనుసరించి ఈ క్రింది అంశాలు కలదాన్ని ప్రభుత్వ ఆర్థిక బిల్లుగా పరిగణిస్తారు. అవి: పన్నుల విధింపు, రద్దు; చెల్లింపు, సవరణ, క్రమబద్ధీకరణలకు సంబంధించినవి; ప్రభుత్వ సమగ్ర నిధి లేక పార్లమెంటు సమకూర్చిన ఇతర రుణాల చెల్లింపుపై నిబంధనలకు సంబంధించినవి; లేక ఇటువంటి చెల్లింపులు సవరణ లేక రద్దుకు సంబంధించినవి; ప్రభుత్వ నిధుల పంపిణీ, జప్తు, స్వీకారం, మంజూరు, ఆడిట్‌లకు సంబంధించినవి; ప్రభుత్వ నిధులకు సంబంధించిన రుణాల సమీకరణ లేక హామీల విషయాలకు సంబంధించినవి. ఈ చట్టం ప్రకారం, హౌస్ ఆఫ్ కామన్స్ ఆమోదం పొంది పార్లమెంటు సమావేశాలు ఇంకా నెల రోజులు జరుగుతాయనగానే ఆర్థిక బిల్లును హౌస్ ఆఫ్ లార్డ్స్‌కు పంపినట్లయితే, నెల రోజుల్లోగా లార్డ్స్ దానికి ఆమోదం తెలపని పక్షంలో, హౌస్ ఆఫ్ కామన్స్ మరోరకంగా ప్రకటిస్తే తప్ప, ఆ బిల్లు సత్వరమే రాజుగారికి సమర్పింపబడి, ఆయన ఆమోదం లభించగానే చట్టంగా మారుతుంది. లార్డ్స్ ఆమోదం లభించినా, లభించకున్నా, బిల్లు చట్టం కాక తప్పదు.

ఇతర ప్రభుత్వ బిల్లుల విషయంలో **1911** పార్లమెంటు చట్టం ఈరకంగా నిర్దేశించింది. ఒక బిల్లు వరసగా మూడు పార్లమెంటు సమావేశాలలో (ఆ పార్లమెంటులు వేర్వేరయినప్పటికీ) హౌస్ ఆఫ్ కామన్స్ ఆమోదం పొంది, నెల రోజుల గడువుతో లార్డ్స్‌కు వెళ్ళిన పక్షంలో, హౌస్ ఆఫ్ లార్డ్స్ దాన్ని మూడుసార్లూ వ్యతిరేకించినా, రాజుగారి ఆమోదానికి వెళుతుంది. రాజుగారు తన ఆమోదముద్ర వేసిన పక్షాన, లార్డ్స్ వ్యతిరేకించినప్పటికీ అది చట్టమౌతుంది. అయితే, ఈ బిల్లు హౌస్ ఆఫ్ కామన్స్ మొదటి సమావేశంలో రెండోసారి చదివిన తేదీకి, మూడవ సమావేశంలో ఆమోదం పొందిన తేదీకి మధ్య రెండేళ్ళు గడిచి వుండాలి.

**1911** పార్లమెంటు చట్టంలోని ప్రధానమైన అంశాలివి. ఆర్థిక బిల్లుకాక, ఇతర ప్రభుత్వ బిల్లుల విషయంలో హౌస్ ఆఫ్ లార్డ్స్‌కు వున్న వీటో అధికారాలను నామమాత్రం చేసి, కేవలం హౌస్ ఆఫ్

కామన్స్ ప్రతిపాదనలకు నిర్ణీత కాలంలో ఆమోదం తెలిపే యంత్రాంగంగా మాత్రమే లార్డ్స్‌ను ఈ నూతన చట్టం మార్చివేసింది. పార్లమెంటుతో సమానాధికారాలు గల సభగా ఏ శాసనాన్నయినా నిరోధించడానికి ఒకప్పుడు వున్న హక్కును ఈ చట్టం వల్ల లార్డ్స్ కోల్పోయింది.

సంప్రదాయానుసారంగానూ, శాసన విహితంగానూ వచ్చిన ఈ సవరణలకు లోబడే, రాజుగారికీ, లార్డ్స్‌కీ అధికారాలున్నాయి. కనక, పార్లమెంటులో రాజుగారు, హౌస్ ఆఫ్ లార్డ్స్, హౌస్ ఆఫ్ కామన్స్ అనే మూడంశాలున్నాయనీ, ముగ్గురి ఆమోదం లేనిదే ఏ బిల్లు శాసనం కాజాలదనే చెప్పడం 1911 చట్టానికి పూర్వం ఎంత నిజమో, నేటికీ అంతే నిజం.



## మూడవ అధ్యాయం

# బ్రిటిష్ రాజు

## (1) రాజుగారికి రాజ్యాధికార హక్కు:

1688లో రెండవ జేమ్స్ దేశం వదిలి వెళ్ళినపుడు వచ్చిన తీర్మానానికి పూర్వం, రాజరికపు హక్కు వంశపారంపర్యమా లేక ప్రజల ఎంపిక ఫలితమా అన్నది ఖచ్చితంగా నిర్ణయింపబడలేదు. కానీ, అటు తర్వాత, ఈ అధికారం పార్లమెంటు ప్రసాదించేదేననీ, ఎందుకంటే రాజరిక వారసత్వాన్ని మార్చగలదనీ నిస్సందేహంగా నిర్ధారితమైంది. ప్రస్తుతం రాజరిక అధికారానికి సంబంధించిన చట్టానికి మూలం 1701లో అమోదించిన ఆక్ట్ ఆఫ్ సెటిల్‌మెంట్. ఈ చట్టం ద్వారా రాజ్యాధికారాన్ని విలియం, మేరీలకు, వారి సంతానానికి వారసత్వ హక్కుగా తీర్మానించారు. ఇందులో రెండు షరతులున్నాయి. రాజ్యానికి వారసుడు (ఆడ గానీ మగ గానీ) వంశాంకురమై వుండాలి, వారు ప్రొటెస్టెంట్ మతానుయాయులై వుండాలి.

## (2) రాజుగారి హక్కులు, బాధ్యతలు:

రాజుగారి హక్కులు శాసన విహితం కావచ్చు. లేక సంప్రదాయానుసారంగా వచ్చినవి కావచ్చు. శాసన విహితమైన హక్కులంటే పార్లమెంటు చట్టం ద్వారా రాజుగారికి సంక్రమించేవి. సాంప్రదాయక హక్కులంటే, రాజుగారికి సాధారణ న్యాయం ప్రకారం అనూచానంగా లభిస్తూ, పార్లమెంటు స్వాధీనం చేసుకోని హక్కులు. శాసన విహితమైన నిర్వచనం, నిర్ధారణ, ఆయా శాసనాల సంప్రదింపుల వల్ల స్పష్టమౌతాయి కనక వాటిని చర్చించవలసిన అవసరం లేదు. అయితే, సాంప్రదాయక హక్కులు ఏ శాసనం నుంచీ సంక్రమించినవి కావు కనక, వాటిని నిర్ధారించడం కష్టం. ఎప్పటికప్పుడు వాటికి సంబంధించిన సమస్యలు ఉత్పన్నమైనపుడు, ఈ హక్కుల గురించి న్యాయస్థానంలో విచారణ ద్వారా తెలుసుకోవలసి వుంటుంది. సాంప్రదాయక హక్కులను ఈ దిగువ పేర్కొన్న శీర్షికల క్రింద చర్చించడం సముచితం.

### (అ) వ్యక్తిగతమైన సాంప్రదాయక హక్కులు

(1) రాజుగారు తప్పు చేయజాలరు: దేశంలో జరిగే ప్రతి అధికారిక చర్య రాజుగారి పేరిటే జరుగుతుంది కానీ, రాజుగారు ఏ చర్యకూ బాధ్యత వహించవలసిన అవసరం లేదు.

రాచరికపు చర్యలకు బాధ్యులు మంత్రులే. కనుక, రాజు పేరిట జరిగిన కార్యకలాపాలపై ఎవరూ ఆయనకు వ్యతిరేకంగా దావాలు వేయలేరు. ఏదైనా ఒప్పందం ఉల్లంఘన విషయంలో ఒక పౌరుడికి అన్యాయం జరిగినప్పటికీ, అతను రాజుగారిపై న్యాయస్థానానికి ఫిర్యాదు చేయలేడు. అయితే ఈ నిబంధనకు "సక్రమ విధానానికి అర్జీ' అనే సవరణ సమకూర్చడం ద్వారా ప్రజలకు కొంత వెసులుబాటు కల్పించారు. దీని ప్రకారం, బాధితుడు రాజుగారికి తన సమస్యా పరిష్కారం కోసం పిటిషన్ పెట్టుకోవచ్చు. అయితే, రాజుగారి తరఫు న్యాయాధికారి అయిన అటార్నీ జనరల్, దానికి అనుమతించితేనే, న్యాయస్థానం ఆ అర్జీని విచారించగలుగుతుంది. ఇందులో కూడా కొన్ని పరిమితులున్నాయి. సాధారణంగా ఇద్దరు పౌరుల మధ్య అనివార్యమైన నిబద్ధత, రాజుగారి విషయంలో వర్తించదు. తన కార్యనిర్వహణకు విఘ్నం కలిగిస్తుందని అనుకుంటే, ఏ ఒప్పందం నిబంధననైనా రాజుగారు ఉల్లంఘించవచ్చు. అంటే, రాజుగారి వద్ద పనిచేసే వ్యక్తి కాలపరిమితి ఎన్నేళ్ళవరకూ ఉన్నప్పటికీ, అతని వల్ల కార్యనిర్వహణ దెబ్బతింటుందని రాజుగారు భావిస్తే, అతన్ని పని నుంచి తొలగించవచ్చు. అతనికి రాజుగారి నిర్ణయాన్ని న్యాయస్థానంలో సవాలు చేయడానికి గానీ, నష్టపరిహారం కోరడానికి గానీ హక్కులేదు.

(2) రాజుగారికి మరణం లేదు: రాజుగారు అమరుడు. అంటే రాజ్యాధికారంలో వున్న వ్యక్తి మరణించవచ్చు. కానీ రాజుగారికి మరణం లేదు. అధికారంలో వున్న రాజుగారు మరణించగానే, ఎట్టి ఆటంకం, విరామం లేకుండా అతని వారసుడు సింహాసనం అధిష్ఠిస్తాడు. బ్రిటిష్ ప్రజల నినాదమైన "రాజుగారు మరణించారు. రాజుగారు కలకాలం జీవించుగాక' అన్నది చట్టబద్ధమైన వాక్యే. బ్రిటిష్ రాజు అధికారం చేపట్టడానికి పట్టాభిషేకం జరగవలసిన పనిలేదు. రాజుగారు మరణించిన క్షణం నుంచీ అతని వారసుడు అధికారం చేపట్టినట్లే. కేవలం జన బాహుళ్యానికీ, ప్రపంచానికీ రాజు ఎవరో తెలియజెప్పేందుకు మాత్రమే పట్టాభిషేకం జరుగుతుంది.

(3) చట్టపరమైన చర్యల్లో రాజుగారికి కాలపరిమితి లేదు: మరోరకంగా చెప్పాలంటే, పౌరుడికి చట్టపరమైన చర్యల్లో కాలనియతి ఉన్నట్లుగా, రాజుగారికి ఉండదు. ఒక వ్యక్తిపై దావా వేయడానికి, సామాన్య పౌరుడైతే, చట్టంచేసిన నిబంధనలకు, కాలపరిమితిని పాటించవలసి వుంటుంది. కానీ రాజుగారికి అటువంటి పరిమితులు లేవు. అయితే ప్రస్తుతం ఈ నిబంధనల్లో సవరణ జరిగి, దావా విషయాల్లో మాత్రం రాజుగారికి కూడా కాలపరిమితి

విధించారు. ఈ సవరణ ప్రకారం రాజుగా 60 ఏళ్ళలోగా దావా వేయాలన్న సుదీర్ఘమైన కాలపరిమితి విధించారు. కానీ, ఒక వ్యక్తిపై విచారణ కోరే విషయంలో మాత్రం రాజుగారికి ఎటువంటి కాలనియతి లేదు.

(4) ఏదైనా ఒక సంఘటనలో, రాజుగారి హక్కులకు, పౌరుడి హక్కులకూ మధ్య వైరుధ్యం ఏర్పడితే, పౌరుడి హక్కు వీగిపోతుంది. ప్రభుత్వానికి సంబంధించిన ఆదేశ సూత్రాలు, ప్రత్యేకంగా రాజుగారిని ప్రస్తావించి చెబితే తప్ప, రాజుగారికి వర్తించవు.

## ii రాజకీయ హక్కులు (అధికారాలు)

రాజకీయ హక్కులను రెండు శీర్షికల క్రింద విభజించవచ్చు (1) దేశ ఆంతరంగిక వ్యవహారాలకు సంబంధించినవి; (2) విదేశీ వ్యవహారాలకు సంబంధించినవి. దేశ ఆంతరంగిక వ్యవహారాలకు సంబంధించినవి కార్యనిర్వాహక వ్యవస్థ, న్యాయవ్యవస్థ, శాసన వ్యవస్థలకు సంబంధించి మూడు విధాలుగా ఉంటాయి. బ్రిటిష్ రాజ్యాంగం ప్రకారం, కార్యనిర్వాహక వ్యవస్థ, రాజుగారి ఆధ్వర్యంలో ఉంటుంది. ఈ వ్యవస్థకు సర్వాధిపతిగా ఉండడం ఆయన హక్కు. ఈ హోదాలో మంత్రులు, ఇతర రాజకీయ అధికారులు, శాశ్వత అధికారులను నియమించే అధికారం ఆయనకు ఉంది. అలాగే, వారిని తొలగించే హక్కు కూడా ఆయనకు వుంది. రాజుగారు సైనిక, నావికా, వైమానిక దళాలకు, పౌర సర్వీసులకు అధిపతి. ఏ శాఖలో నియమించబడినా, ప్రభుత్వ సేవలో నియమితుడైన ప్రతి వ్యక్తీ రాజుగారి సేవకుడే. న్యాయపరమైన అధికారాల విషయానికి వస్తే, ఒకనాడు రాజుగారు స్వయంగా న్యాయపీఠంపై ఆసీనుడై, న్యాయం చెప్పేవాడు. కానీ ఈ హక్కును రాజుగారు కోల్పోయారు. లోగడ రాజుగారికి ఒక న్యాయస్థానాన్ని సృష్టించడానికీ, దాని విచారణ పరిధిని నిర్ణయించడానికి సంపూర్ణమైన అధికారాలుండేవి. ఒకటవ ఛార్లెస్ స్టార్ ఛేంబర్‌నూ, కోర్ట్ ఆఫ్ హై కమిషన్‌ను నియమించడం, అప్పట్లో రాజుగారి న్యాయాధికారాలు ఎంత విస్తృతంగా ఉండేవో స్పష్టం చేస్తుంది. ప్రస్తుతం రాజుగారికి ఈ అధికారం కూడా లేదు. ఇప్పటి రాజు తన హక్కును, అంటే, పార్లమెంటు అనుమతితో నిమిత్తం లేకుండా చేయగలిగింది. కామన్‌లా అమలు కోసం న్యాయస్థానాన్ని ఏర్పాటు చేయడం ఒక్కటే. కానీ, ఈ హక్కును కూడా రాజు సరిగ్గా వినియోగించుకో లేకుండా వున్నారు. ఎందుకంటే, ఇటువంటి న్యాయస్థానం ఏర్పాటుకు ఆర్థిక శాసనం చేయవలసిన అవసరం వుంది. ఆర్థిక శాసనాలన్నిటికీ పార్లమెంటు ఆమోదం ఉండాలన్నది తెలిసిన విషయమే. ప్రస్తుతం నాలుగు అల్పమైన న్యాయాధికారాలను మాత్రమే రాజు వినియోగించగలుగుతున్నారు. అవి:

(1) ప్రైవీ కౌన్సిల్‌కు అప్పీలు చేసుకోడానికి అనుమతిని ఇవ్వడం; (2) న్యాయమూర్తులను నియమించడం; (3) ఒక నేరస్తుడికి క్షమాభిక్ష పెట్టడం.

రాజుగారికి, శాసనాధికారాలు కూడా ఒకప్పుడు విస్తృతంగా ఉండేవి. పార్లమెంటు ఆమోదంతో పనిలేకుండా, స్వతంత్రంగా చట్టాలు చేయడం, కొన్ని కేసులలో చట్టాన్ని నిలుపుజేయడం, లేకపక్కన పెట్టడం వంటి హక్కులు రాజుకు ఉండేవి. కానీ ఇప్పుడు ఈ అవకాశం లేదు. పార్లమెంటు ఆమోదం పొందిన చట్టాల అమలును నిలిపివేయడానికి గానీ, తోసిపుచ్చడానికి గానీ ఇప్పుడు రాజుగారికి అధికారం లేదు. బ్రిటిష్ కాలనీల విషయంలో తప్ప, మరే విషయంలోనూ, శాసనాలు చేసే అధికారం కూడా రాజుగారికి లేదు. ప్రస్తుతం రాజుగారికి వున్న శాసనపరమైన అధికారాలు: (1) పార్లమెంటును సమావేశపరచడం; (2) పార్లమెంటును వాయిదా వేయడం; (3) పార్లమెంటును రద్దు చేయడం.

దేశీయ పాలనా వ్యవహారాలకు సంబంధించిన మరో రెండు వర్గాలలో రాజుగారి హక్కులను పరిశీలించిన తర్వాత విదేశీ వ్యవహారాలలో హక్కుల గురించి చెప్పవలసి వుంటుంది. ఈ రెండు వర్గాలు మతపరమైన హక్కులు, రెవెన్యూ హక్కులు (ఆదాయం)

మతపరమైన హక్కులు: రాజుగారు ఇంగ్లండు చర్చికి శాసనరీత్యా సర్వాధికారి. ఈ సర్వాధిపతి హోదాలో, చర్చిలో ఉండవలసిన ఆర్క్ బిషప్‌లు, బిషప్‌లు తదితర ఉన్నతాధికారులను ప్రధానమంత్రి సలహాపై రాజు నిర్ణయిస్తాడు. చర్చి సమావేశాలలో ఉభయ సభలను సమావేశపరచడానికీ, వాయిదా వేయడానికీ, రద్దు చేయడానికీ రాజుగారికి పూర్తి హక్కులున్నాయి. అలాగే మతపరమైన న్యాయస్థానాల నిర్ణయాలపై ప్రీవీ కౌన్సిల్‌లో అప్పీలు చేసుకోడానికి రాజుగారు అనుమతి ఇవ్వవచ్చు.

రెవెన్యూ హక్కులు: బ్రిటిష్ ప్రభుత్వం ఆదాయాన్ని రెండు తరగతుల క్రింద విభజించవచ్చు: (1) సాధారణ రెవెన్యూ అంటే హక్కువల్ల సంక్రమించే రెవెన్యూ, ఇది ఈ క్రింది వనరుల వల్ల లభిస్తుంది. (1) బిషప్ ఆస్తుల స్వాధీనం: అంటే ఒక బిషప్ ఆస్తులు అతని వారసుడికి చెందినప్పటికీ, ఆ స్థానం భర్తీ కానపుడు దానిపై వచ్చే లాభాలు రాజుగారికి చెందుతాయి. (2) ఇంతకు పూర్వం పోప్‌కు చెల్లింపబడి తర్వాత రాజుగారికి బదిలీ అయిన చర్చి ఆదాయంలోని తొలి ఏడాది లాభాలైన "అన్నేట్స్" పొందడానికి రాజుగారికి హక్కు వుంది. అదేవిధంగా ఇదివరకు పోప్‌కు చెల్లింపబడిన చర్చి వార్షిక ఆదాయంలోని పదోవంతు అయిన "టెన్త్స్"పై కూడా రాజుగారికి హక్కు వుంది. ప్రస్తుతం ఇవి ఆనీ రాణి నిధిలో జమ అవుతున్నాయి. (3) రాజుగారి భూములపై వచ్చిన లాభాలు. (4) మహాసముద్ర మత్స్య సంపద, భూగర్భ ధనరాశులు, సొంతదారులేని ఆస్తులు, రాచరిక గనులు, వారసులు లేని ఆస్తులపై రాజుకు అధికారులుంటాయి.

సాధారణ రెవెన్యూ క్రింద పేర్కొన్న నిధులు 1715 వరకూ రాజుగారికి చెల్లింపబడ్డాయి. ఆయేడు "పౌర జాబితాల చట్టం' ఏర్పడి, తద్వారా రాజుగారు తనకు హక్కు భుక్తంగా లభించిన ఆదాయాన్ని పార్లమెంటుకు సమర్పించారు. ఈ నిధులు నాటినుంచి ప్రభుత్వ "సంచిత నిధిలో జమ అవుతున్నాయి. దానికి ప్రతిఫలంగా పార్లమెంటు రాజకుటుంబానికి ఒక నిర్ధారిత మొత్తాన్ని సమకూరుస్తుంది. ప్రభుత్వ సంచిత నిధినుంచి జమచేసే ఈ నిధులనే"పౌర జాబితా'గా వ్యవహరిస్తారు. ఈ పౌరజాబితా శాశ్వతమైన ఏర్పాటుకాదు. అధికారంలో వున్న రాజుకు, అప్పటి పార్లమెంటుకు మధ్య జరిగిన ఒప్పందం మాత్రమే. ఈ ఒప్పందం ఆ రాజు జీవించి వున్నంతవరకూ అమల్లో వుంటుంది. కొత్త రాజు అధికారంలోకి వచ్చినపుడు, ఆయన జీవిత పర్యంతం వర్తించే నూతన ఒప్పందం చేసుకుంటారు. ఎటువంటి ఒప్పందం చేసుకోని పక్షంలో, సాధారణ రెవెన్యూకు సంబంధించి రాజుగారికి హక్కు భుక్తంగా సంక్రమించే ఆస్తులు పునరుద్ధరింపబడతాయి. సాధారణ రెవెన్యూ హక్కు భుక్తంగా లభించే అధికారానికి పౌర జాబితా ఏర్పాటు వల్ల ఎట్టి విఘాతం కలగదు. రెవెన్యూను ఖర్చు చేసుకునే విషయంలో మాత్రమే అది వర్తిస్తుంది కానీ రెవెన్యూను పెంచే హక్కుకు విఘాతం కలిగించదు.

## II. విదేశీ వ్యవహారాల విషయంలో రాజుగారి హక్కులు

విదేశీ రాయబారులను ఆహ్వానించడానికీ, తమ దేశ రాయబారులను విదేశాలకు పంపడానికి రాజుగారికి హక్కు వుంది. రాజుగారి చేత నియమితులైన ఈ రాయబారులకు పౌర, నేరచట్టాల నుండి మినహాయింపు లభిస్తుంది కనక, వీరి నియామకం రాజుగారికి వున్న హక్కుల్లో ముఖ్యమైనది. ఈ మినహాయింపులగురించి తర్వాత చర్చిద్దాం. ఈ మినహాయింపు, రాజుగారి చేత రాయబారిగా గుర్తింపు పొందడంపై ఆధారపడి వుంటుందనీ, ఈగుర్తింపు రాజుగారి హకు భుక్తమైన అధికారమనీ తెలుసుకుంటే ఈ దశలో సరిపోతుంది.

యుద్ధం చేయడానికీ, శాంతి నెలకొల్పడానికీ రాజుగారికి సంపూర్ణమైన అధికారం వుంది.

ఏ విదేశంతోనైనా ఒప్పందం కుదుర్చుకునే హక్కు రాజుగారికుంది. అది రాజకీయ ఒప్పందం కావచ్చు, వాణిజ్య ఒప్పందం కావచ్చు. చట్టరీత్యా తన ప్రజలకు సంక్రమించిన హక్కులకు తన ఒప్పందాలు విఘాతం కలిగించకుండా మాత్రం రాజుగారు జాగ్రత్త వహించవలసి వుంటుంది.

రాజుగారి హక్కులకు సంబంధించి పరిగణనలోకి తీసుకోవలసిన ప్రశ్నలు కొన్ని వున్నాయి. ఇందులో మొదటిది- పార్లమెంటు అధికారానికీ, రాజుగారి హక్కులకూ వున్న సంబంధం స్వరూపం

ఎటువంటిది? రెండవ ప్రశ్న- ఒకవేళ రాజుగారు తన హక్కులను గానీ, శాసనబద్ధమైన అధికారాలను గానీ అమలు పరచలేకపోతే ఏమౌతుంది?

మొదటి ప్రశ్నను పరిశీలిస్తే, ముందుగా, రాజుగారికి ఫలానా హక్కు వుందనీ, లేదనీ అనడం వెనక అర్థమేమిటి? రాజుగారు తన హక్కు ప్రకారం నడుచుకుంటాడుగానీ, పార్లమెంటు అనుమతి అవసరం లేదనడం వెనక అర్థమేమిటి? అంటే ఆ అధికారం అతనికి ఉండదనే చెప్పాలి. అయితే, ఈ హక్కులు రాజుగారికి సహజ సిద్ధంగా లభించేవి అన్నంత మాత్రాన, పార్లమెంటు నియంత్రణకు అతీతమైనవని భావించనవసరంలేదు. పైగా, రాజుగారి హక్కును క్రమబద్ధం చేయడానికీ, సవరించడానికీ, రద్దు చేయడానికీ, పార్లమెంటుకు అధికారం వుంటుంది. కనక, పార్లమెంటు చట్టం ద్వారా సవరించినంత మేరకే రాజుగారికి హక్కులుటాయనడం సబబు. ఒకప్పుడు రాజుగారికి సహజంగా లభించిన హక్కును, తదనంతరం పార్లమెంటు చట్టం ద్వారా క్రమబద్ధం చేసిన పక్షంలో, తిరిగి తన హక్కును అమలు జరపడానికి రాజుగారికి స్వేచ్ఛ ఉండదు. ఆయన పార్లమెంటు చేసిన చట్టానికి లోబడే నడుచుకోవాలి. కనక, పార్లమెంటు ఆయన హక్కుల్లో జోక్యం చేసుకోనంత కాలమే రాజుగారికి ఈ హక్కు భుక్తమైన అధికారాలు ఉంటాయని మొదటి ప్రశ్నకు సమాధానం చెప్పుకోవచ్చు.

రాజుగారు తన సహజమైన హక్కులను, శాసన విహిత హక్కులను వినియోగించుకోలేని పరిస్థితుల్లో ఏమౌతుంది? రాజపదవికి కొన్ని ముఖ్యమైన విధులుంటాయి. వాటిని రాజుగారు నిర్వర్తించలేకపోవడమన్నది చాలా కీలకమైన విషయం. రాజుగారి ఈ అసమర్థతకు కారణాలు నాలుగు రకాలుగా ఉండవచ్చు. (1) రాజుగారు తన రాజ్యంలో లేకపోవచ్చు, (2) రాజుగారికి యుక్తవయస్సు వచ్చి వుండకపోవచ్చు, (3) రాజుగారికి మతి భ్రమించి వుండవచ్చు, (4) రాజుగారు నైతికంగా కర్తవ్య నిర్వహణకు అర్హుడు కాకపోవచ్చు.

రాజుగారు రాజ్యంలో లేకపోవడం చెప్పుకోదగ్గ అభ్యంతరం కాదు. ఆధునిక కమ్యూనికేషన్ సౌకర్యాలు ఎటువంటి దూరాన్నయినా తరిగిస్తున్నాయి. సమాచారం అందచేయడం సులభమౌతుంది. కనక, ఎంత దూరంలో వున్నా రాజు తన విధులను జాప్యం లేకుండా నిర్వహించగలరు. అదీకాక తాను దేశాంతరం వెళ్ళినపుడు రాజు మరో వ్యక్తికి తన అధికారాన్ని అప్పగించే అవకాశం కూడా వుంది.

చట్టం ప్రకారం చూస్తే, మైనారిటీ తీరక పోవడం కూడా పెద్ద సమస్య కాదు. శిశువు రాజు కాలేడనీ, మైనర్ బాలుడికి కూడా రాచరిక పనులు చేసే సామర్థ్యం ఉంటుందనీ బ్రిటిష్ చట్టం భావిస్తుంది. కనక, మైనారిటీ తీరని రాజు తనకు నిర్దేశించిన విధులను, అధికారాలను సక్రమంగా నిర్వర్తించగలడు. సాధారణంగా ఒక రాజు, శిశువును వారసుడిగా వదలి మరణిస్తే, పార్లమెంటు ఆ

రాజ్యానికి ఒక రాజప్రతినిధిని తానే నియమిస్తుంది. కానీ దీనికి హేతువు, చట్టం విధించిన శాసనం కాదు, కేవలం పనులు సజావుగా జరగాలన్న జాగ్రత్త మాత్రమే.

రాజుగారి మతిభ్రమణం మాత్రం క్లిష్టమైన సమస్యే. మతి చలించిన రాజు తన అధికారాలను మరొకరికి బదలాయించలేడు. పార్లమెంటు రాజ ప్రతినిధి ద్వారా బిల్లులకు అనుమతి సంపాదించడం కూడా కష్టమే. ఎందుకంటే, మతి చలించిన రాజుకు ఏ బిల్లునీ అనుమతించే హక్కు లేదు. బ్రిటిష్ రాజుల్లో ఆరో హెన్రీ (1454), మూడవ జార్జి (1788) అధికారంలో ఉండగా, మతి స్థిమితం కోల్పోయారు. ఆ సందర్భంలో అవలంబించిన పద్ధతి మతి అసంబద్ధమైనదీ, అప్పటి రాజ్యాంగ నిబంధనలకు కట్టుబడివదీనని చెప్పవచ్చు.

రాజుగారు అధికారంలో ఉండడానికి నైతికంగా అనర్హుడు అని నిరూపించడం మాత్రం క్లిష్టమైన పని. ప్రజలు ఫలానా రాజుగారిని ఇష్టపడడంలేదన్నపుడు రాజు రాజీనామా చేస్తాడా? ఒకవేళ అతను రాజీనామా చేయకపోతే అతన్ని తొలగించవచ్చునా? రాజుగారికి మతి భ్రమించడానికి, అతని నైతిక అనర్హతకూ సంబంధించి చట్టంలో ఎట్టి నిబంధనలూ చేర్చలేదు. ప్రస్తుతం బాధ్యతాయుతమైన ప్రభుత్వ విధానం అమలులోకి వచ్చింది కనక, రాజుగారి నైతిక అనర్హత అనే ప్రశ్న ఉదయించకపోవచ్చు. కానీ రాజుగారికి మతి స్థిమితం తప్పడమన్న సమస్య ఏనాడైనా ఉదయించవచ్చు.

## రాజుగారి మృతి ప్రభావం

### 1. పార్లమెంటుపైన

తొలిదశలో నిబంధనల ప్రకారం, రాజుగారి మృతి వల్ల పార్లమెంటు తప్పనిసరిగా రద్దయిపోతుంది. రాజ్యాంగం ప్రకారం పార్లమెంటు సభ్యులు రాజుగారి పిలుపుమేరకు సమావేశమయ్యే ఆయన సలహాదారులు మాత్రమే. రాజుగారు పిలిపించడం, సభ్యులు సమావేశం కావడం, వారి మధ్య వ్యక్తిగత బంధంగా పరిగణించేవారు కనక, రాజుగారి మరణంతో, ఆ బంధం తెగిపోయినట్లే. మరణించిన రాజుగారి సలహాదారులైన పార్లమెంటు సభ్యులు నూతన రాజుకు సలహాదారులు కాలేరు. కొత్త రాజు కొత్త సలహాదారులను సమావేశపరచవచ్చు. కొత్త సలహాదారుల నియామకం, పాత పార్లమెంటు రద్దయి, నూతన పార్లమెంటు ఏర్పడిన తర్వాతే సాధ్యమౌతుంది. ఈ నిబంధనను 7-8 మూడవ విలియం, 15వ ప్రకరణం* సవరణలో సవరించారు. ఈ సవరణ ప్రకారం, రాజుగారు మరణించిన తర్వాత, కొత్త రాజు రద్దు చేయనంతకాలం, పాత పార్లమెంటు ఆరునెలల వరకూ పనిచేస్తుంది. తర్వాత

1867 సంవత్సరంలో (30, 31 విక్టోరియా 2వ ప్రకరణం, 102) ఈ నిబంధనను తొలగించి, పార్లమెంటు కాలపరిమితిని, రాజుగారి మృ తితో ఎటువంటి సంబంధం లేదని నిర్ణయించారు.

## 2. కార్యనిర్వాహకవర్గంపై ప్రభావం

తొలి దశ నిబంధనల ప్రకారం, రాజుగారి మృతి అనంతరం, పార్లమెంటు రద్దయినట్లే ---

కార్యనిర్వహణ అధికారులందరూ రాజీనామా చేయాలి. అయితే క్రమేపీ ఈ నిబంధనను సవరించారు. 1707 రాజుగారి వారసత్వ చట్టం సవరణ ప్రకారం, రాజు మరణించిన తర్వాత ఆరు నెలల వరకూ కార్యనిర్వహణాధికారులు అధికారంలో ఉండవచ్చు. అనంతరం * సంవత్సరంలో చేసిన సవరణ మేరకు వీరి పదవీ కాలం పొడిగింపబడింది. 1901 లో రాజుగారి మృతికి సంబంధించిన చట్టం, కార్యనిర్వహణాధికారుల పదవులకు, రాజుగారి మరణంతో ఎట్టి సంబంధం లేదని నిర్ణయించింది.

* వ్రాత ప్రతిలో ఈ స్థలం ఖాళీగా వుంది సం.

## మూడవ ప్రకరణం

# హౌస్ ఆఫ్ లార్డ్స్

ఎగువ సభ అయిన హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో మూడు తరగతులకు చెందిన ఉన్నత వంశీయులు (పీర్స్) ఉంటారు.

(1) ఇంగ్లండ్, యునైటెడ్ కింగ్‌డంలలో రాజవంశాల వారసత్వం కలిగినవారు.

(2) రాజవంశీయుల ప్రతినిధులైనవారు.

(3) పదవి కారణంగా ఉన్నతస్థానం పొందినవారు.

హౌస్ ఆఫ్ లార్డ్స్ నిర్మాణంలో మొట్టమొదట అడగవలసిన ప్రశ్న ఇది: ఈ సభలో పీర్స్‌గా ప్రాతినిధ్యం పొందడానికి ఉండవలసిన అర్హత ఏమిటి?

ఇంగ్లండ్, యునైటెడ్ కింగ్‌డంలలో పీర్స్ (PEERS = సమస్కంధులు)

రాజుగారు వ్యక్తిగతంగా ఒక్కొక్కరికీ పీర్ హోదాలో పార్లమెంటుకు హాజరు కావలసిందని ఆదేశాలు పంపినవారే ఇంగ్లీష్ పీర్స్, యునైటెడ్ కింగ్‌డం పీర్స్ అనే పేరుతో చలామణీ అవుతారు. ఇంగ్లండ్ పీర్ వ్యవస్థను రాజుగారి శాసనం ద్వారానే ఏర్పరుస్తారు. ఈ శాసనం ద్వారా ఏర్పరచిన పీరేజ్ విషయంలో సమస్యలు తలెత్తవు..అయితే రాజుగారు ఏ వ్యక్తినైనా ఆజన్మాంతం పీర్‌గా నియమించడం సాధ్యమా అన్నది ప్రశ్న. ఈ విషయం ఒకసారి వివాదానికి దారితీసింది. రాజుగారు ఆజన్మాంతం పీర్‌గా నిర్ధారించిన వ్యక్తి హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో కూర్చోడానికి అర్హుడా అన్న విషయమ్మై వివాదం తలెత్తింది. 1856లో వెనస్ డేల్ కేసులో ఈ వివాదం ఏర్పడినపుడు రెండు విషయాలను ధ్రువపరిచారు. అవి:

(1) ఆజన్మాంతం పీర్‌గా గానీ, వంశానుగత పీర్‌ని గానీ నియమించడానికి రాజుగారికి సర్వాధికారాలున్నాయి.

(2) అయితే ఆజన్మాంత పీర్ హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో కూర్చోడానికి అర్హుడు కాడు. రాజుగారు అతనికి ఆమేరకు ఆదేశం (సమన్లు) పంపకూడదు.

**పీర్ వ్యవస్థలో వంశానుక్రమం పాటించడమన్నది సంప్రదాయానికి సంబంధించిన విషయమేకానీ, చట్టబద్ధమైంది కాదు కనక, రాజుగారికి పీర్ వ్యవస్థను సృష్టించడానికి మాత్రమే అధికారం వుంటుంది.**

రాజుగారి ఆదేశానుసారం కాక, వేరేగా పీర్‌లైన వారి హక్కుల మాటేమిటి? అని ప్రశ్నించినపుడు, వీరు కూడా రాజుగారి సమన్లు అందితేనే పార్లమెంటుకు హాజరు కావాలి.

అయితే, ఈ సమన్లకు సంబంధించి రెండు ప్రశ్నలు చిరకాలంగా బ్రిటిష్ రాజ్యాంగ వ్యవస్థను చీకాకు పరుస్తున్నాయి. ప్రతి పీర్‌కు సమన్లు కోరే హక్కు వుందా? ఏ పీర్‌కైనా సమన్లు పంపడానికీ, పంపకపోవడానికీ రాజుగారికి హక్కు వుందా? పీర్స్ తరఫున వచ్చిన వాదం ప్రకారం, బారొనీ ద్వారా పీర్ పదవి పొందినవారు మాత్రమే సమన్లకు అర్హులు; ఈ తరగతికి చెందని వారికి సమన్లు పంపే అధికారం రాజుగారికి లేదు. అయితే, రాజుగారి తరఫు వాదం ప్రకారం, బారొనీ వల్ల పీర్ పదవి పొందడంలో ప్రత్యేకత ఏమీ లేదు. రాజుగారు సమన్లు పంపడంలో ఎటువంటి పరిమితులకు లొంగనవసరం లేదు. ఈ వివాదం అనంతరకాలంలో సమసిపోయింది. ప్రస్తుతం, శాసన లేఖ ద్వారా పీర్ పదవి పొందని వారికి సమన్లు అందుకునే అర్హత విషయమై ఈ రెండు నిబంధనలను పొందుపరిచారు.

1) బారొనీ వుందన్న ప్రాతిపదిక మీద సమన్లను కోరే హక్కు ఎవరికీ లేదు.

2) లోగడ సమన్లు పొంది హౌస్ ఆఫ్ లార్డ్స్‌కు హాజరైన వ్యక్తికి వారసుడైన పీర్‌ను సమన్ల ద్వారా పంపించే హక్కు రాజుగారికి వుంది. అంటే, గతంలో సమన్లు పొందిన వ్యక్తి పీర్ పదవి కోల్పోయి ఎంతకాలమైనా, అతని వారసుడికి సమన్లను పొందే హక్కు వారసత్వపు హక్కుగా సంక్రమిస్తుంది. అంటే, ఇంగ్లీష్ పీర్ వ్యవస్థ వంశానుగతమైనదే. కనుక, వంశానుగతంగా సమన్లు పొంది లార్డ్స్‌లో కూర్చునే హక్కు వారికి వుంది.

3) పీర్ వ్యవస్థ వంశానుగతమైనదే అయినప్పటికీ, దీనిలో మళ్ళీ రెండు నిబంధనలున్నాయి. అవి 1. జ్యేష్ఠ పుత్ర నియమం 2. పురుష వారసత్వ నియమం చెల్లుతుంది.

## ప్రాతినిధ్య పునాదులపై పీర్స్‌గా నియమితులైనవారు

ఈ విభాగానికి చెందేవారు రెండు రకాలు. స్కాట్లాండ్‌కు చెందిన ప్రతినిధులు, ఐర్లండ్‌కు చెందిన ప్రతినిధులు. 1707లో యునైటెడ్ ఆఫ్ గ్రేట్ బ్రిటన్ పేరు కింద ఒక రాజు, ఒక రాజ్యంగా ఏర్పడడానికి స్కాట్లాండ్, ఇంగ్లాండ్‌ల మధ్య ఏర్పడిన ఒప్పందం ప్రాతిపదికపై స్కాట్లాండ్ ప్రతినిధుల నియామకం జరిగింది. ఐర్లండ్, బ్రిటన్‌ల విలీనం 1800లో జరిగింది. స్కాట్లాండ్ లాగే ఐర్లండ్‌కు కూడా అంతకుపూర్వం వారసత్వ లక్షణాలతో పీర్ వ్యవస్థ ఉండేది. ఈ రెండు రాజ్యాలు బ్రిటన్‌లో విలీనం కావడంతో ఏ దేశంలోని పీర్స్‌కు ఎంత ప్రాతినిధ్యం ఇవ్వాలన్న ప్రశ్న ఉదయించింది. ఇంగ్లీష్ పీర్స్

తమకందరికీ కొత్త పార్లమెంట్‌లో కూర్చునే హక్కు వుందని వాదించారు. స్కాట్లాండ్, ఐర్లాండ్ పీర్స్ కూడా తమకు అలాంటి హక్కే వుందని ప్రతివాదన చేశారు.

ఎట్టకేలకు ఈ సమస్యా పరిష్కారానికి ఒక ఒప్పందం కుదిరింది. దీని ప్రకారం:

1. ఇంగ్లీష్ పీర్స్ అందరికీ కొత్త పార్లమెంటులో కూర్చునే హక్కు వుంది.

2. స్కాట్లాండ్ పీర్స్ తమలో 16 మందిని పార్లమెంటులో తమ ప్రతినిధులుగా ఎన్నుకోవాలి.

3. ఐర్లండ్ పీర్స్ తమలో 28 మందిని పార్లమెంటులో ప్రతినిధులుగా ఎన్నుకోవాలి.

అధికారంలో వున్న పార్లమెంటు పదవీకాలం ముగియగానే స్కాట్లాండ్ పీర్స్ పదవీకాలం కూడా ముగుస్తుంది. పార్లమెంటు రద్దు కాగానే మళ్లీ 16 మంది కొత్త ప్రతినిధులను ఎన్నుకోవాలి. కానీ ఐర్లండ్ ప్రతినిధులు జీవితకాల సభ్యులుగా ఉంటారు. పార్లమెంటు రద్దయినపుడు వీరు మళ్ళీ ఎన్నిక జరపవలసిన అవసరం లేదు. ఐర్లండ్ పీర్స్‌లో ఎవరైనా అనర్హులుగా ప్రకటింపబడడం, మరణించడం వంటి సందర్భాల్లో మాత్రమే కొత్త ప్రతినిధులను ఎన్నుకుంటారు.

ఈ మూడు తరగతుల పీర్స్‌తో పాటు, యునైటెడ్ కింగ్‌డం పీర్స్ అన్న పేరుతో నాలుగో విభాగం కూడా చేర్చడం జరిగింది. ఈ పీర్ పదవిని రాజుగారు ఇంగ్లీష్ పౌరుడికే కాక, స్కాట్లాండ్, ఐర్లండ్ ఈ పౌరుడికి కూడా ఇవ్వవచ్చు. ఈ విధంగా పీర్స్‌గా నియమితులైన వారికి స్కాట్లాండ్, ఐర్లండ్ ఒప్పందాల నిబంధనలు వర్తించవు.

## అధికార రీత్యా పీర్స్‌గా నియమితులైనవారు

పదవుల ప్రతిపదికపై హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో పీర్స్‌గా ఉన్నవారు రెండు రకాలు 1. మత వ్యవస్థకు ప్రతినిధులైన లార్డ్‌లు 2. న్యాయవ్యవస్థకు ప్రతినిధులైన లార్డ్‌లు. 26వ చట్టం ప్రకారం, చర్చి అధికారులకు హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో కూర్చునే అధికారం వుంది. వీరిలో కాంటర్‌బరీ, యార్క్‌ల ఆర్చ్‌బిషప్‌లూ, లండన్, దర్‌హాం, విన్‌ఛెస్టర్‌ల బిషప్‌లూ 'లార్డ్స్ స్పిరిట్యుయల్'గా వ్యవహరిస్తారు. మిగిలిన 21 మంది మతపరమైన పీర్స్‌లో వివిధ చర్చిల బిషప్‌లు సీనియారిటీ క్రమం ప్రకారం సభలో కూర్చుంటారు. కనక ఈ 21 మందిలో ఎవరైనా రాజీనామా చేసినా, మరణించినా, వారి వారసుడికి ఆ పదవి లభించదు. అతని తర్వాత సీనియారిటీ వున్న వ్యక్తికే లభిస్తుంది.

## న్యాయవ్యవస్థకు ప్రతినిధులైన పీర్స్

హౌస్ ఆఫ్ లార్డ్స్, శాసనసభ మాత్రమేకాక, న్యాయమండలి కూడా. ఇంగ్లండు, స్కాట్లాండు, ఐర్లండ్‌లలోని న్యాయస్థానాలపై అప్పీలు చేసుకోవడానికి అవకాశమిచ్చే అత్యున్నత న్యాయస్థానం ఇదే. హౌస్ ఆఫ్ లార్డ్స్ విధుల్లో న్యాయనిర్ణయం కూడా ఒకటైనపుడు, అందులో సభ్యులైన పీర్స్ కూడా న్యాయనిర్ణయంలో భాగస్వాములు కావడం సహజం. సాధారణంగా పీర్స్ స్థానంలో వున్న వారికి న్యాయపరమైన శిక్షణ వుండదు. అటువంటి వ్యవస్థ అత్యున్నత న్యాయస్థానంగా వ్యవహరించడం ప్రమాదకరమే. అయితే ఈ అధికారాన్ని లార్డ్స్ నుంచి తీసేయడం సాధ్యం కాలేదు. కనుక, రాజీమార్గంగా, 1876లో అప్పిలేట్ న్యాయపరిమితి చట్టం అనే చట్టాన్ని రూపొందించారు. ఈ చట్టం ప్రకారం హౌస్ ఆఫ్ లార్డ్స్‌కు అత్యున్నత న్యాయనిర్ణయాధికారాలు యథాతథంగా ఉంటాయి కానీ, కేసు విచారణకు వచ్చినపుడు కనీసం ముగ్గురైనా న్యాయశిక్షణ పొందిన సభ్యులు హాజరైవుండాలి. వీరిని లార్డ్స్ ఆఫ్ అప్పీల్ అంటారు. ఈ ముగ్గురు- 1. ఆ సమయానికి లార్డ్ ఛాన్సలర్‌గా వున్న వ్యక్తి, 2. ఉన్నత న్యాయాధికార పదవులు నిర్వహించిన ప్రస్తుత సభ్యులు, 3. రాజుగారు అసాధారణ హక్కుగా నియమించిన లార్డ్స్ ఆఫ్ అప్పీల్.

1876 చట్టం ప్రకారం రాజుగారు ఈ విధంగా లార్డ్స్ ఆఫ్ అపీల్‌ను నియమించే అధికారాలు పొందారు. అప్పట్లో న్యాయనిర్ణయాధికారాన్ని వినియోగించినంత కాలమే వారు పీర్స్‌గా ఉండేవారు. కానీ 1887లో ఈ చట్టాన్ని స్వల్పంగా సవరించి, వార్డ్స్ ఆఫ్ అప్పీల్ సభ్యత్వాన్ని జీవితకాల సభ్యత్వంగా మార్చారు.

హౌస్ ఆఫ్ లార్డ్స్ గురించి చెప్పుకున్న తర్వాత, దానికి సంబంధించి తలెత్తే మరికొన్ని ప్రశ్నలను పరిశీలించవలసి వుంది. హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో కూర్చోడానికి పీర్స్‌కు ఉన్న అర్హత ఏమిటి? హౌస్ ఆఫ్ కామన్స్‌లోనైతే ఆయా నియోజకవర్గాల నుంచి ప్రజల చేత ఎన్నుకోబడడం సభ్యుల అర్హత. కానీ హౌస్ ఆఫ్ లార్డ్స్‌కు ఇది వర్తించదు. రాజుగారి వద్ద నుంచి విడివిడిగా పార్లమెంటుకు హాజరుకావలసిందని సమన్ల లేఖ పంపడమే వారు పార్లమెంటుకు రావడానికి వీలు కల్పించే అర్హతా పత్రం. ఎవరిని పిలిపించాలో నిర్ణయించే నామినేషన్ అధికారాలు రాజుగారికి ఉన్నప్పటికీ ఈ అధికారాలను ముందుగానే క్రమబద్ధం చేశారు. కనక రాజుగారు ప్రతి పార్లమెంటు విషయంలోనూ ఒకే పద్ధతిని అవలంబించాలి గానీ, స్వంత అభిప్రాయాల మేరకు, నియామక విధానాన్ని మార్చకూడదు.

రాజుగారి సమన్లపైనే పీర్ హక్కులు ఆధారపడి వుండగా, సమన్లు పంపడంలో రాజుగారికి కూడా

కొన్ని పరిమితులున్నాయి. బ్రిటిష్ పౌరసత్వం లేని విదేశీయ పీర్‌ను పార్లమెంటులో కూర్చోమని ఆహ్వానించడానికి రాజుగారికి హక్కులేదు.

పీర్ హక్కుల ఆమోదం, విరమణలకు సంబంధించిన మరో ప్రశ్నకు సమాధానం చెప్పుకోవలసి వుంది. పీర్ పదవి మరొకరికి బదిలీ చేయడంగానీ, అమ్మడంగానీ, బహూకరించడంగానీ జరిగే ప్రసక్తి లేదు. అది వారసత్వపు నిబంధన ప్రకారం, వంశపారంపర్యంగా లభించవలసిన పదవి మాత్రమే. అదేవిధంగా ఒక పీర్ తన బిరుదాన్ని ప్రభుత్వ స్వాధీనం చేయడానికి కూడా వీలు లేదు. పీరేజ్ పొందిన వ్యక్తి ఎప్పటికీ పీర్‌గానే ఉంటాడన్నది దీని వెనక సూత్రం.

హౌస్ ఆఫ్ లార్డ్స్‌కీ, పీర్ వ్యవస్థకీ మధ్య వ్యత్యాసాలకు సంబంధించి మూడవ ప్రశ్న ఉదయిస్తుంది. వాడుకలో ఈ రెండు వ్యవస్థలనీ పర్యాయపదాలుగానే పేర్కొనడం జరుగుతుంది. కానీ చట్టరీత్యా వీటి మధ్య తేడా వుంది. ఒక వ్యక్తి పీర్ కావచ్చుగానీ హౌస్ ఆఫ్ లార్డ్స్ సభ్యుడు కాకుండా ఉండవచ్చు. దీనికి జీవితకాలం పీర్ బిరుదం పొందిన వారిని ఉదాహరణగా చెప్పుకోవచ్చు. అధికార రీత్యా పీర్ కానివారు కనీసం వంశానుగతమైన పీర్ అయితే తప్ప, హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో కూర్చోరాదన్న నియమం ప్రకారం, జీవితకాలం పీర్‌గా నియమితుడైన వ్యక్తి హౌస్ ఆఫ్ లార్డ్స్ సభ్యుడు కాజాలడు. దీనికి విరుద్ధంగా, వంశానుగతంగా పీర్ కాని వ్యక్తి కూడా హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో సభ్యుడు కావచ్చు. దీనికి ఉదాహరణగా మతబోధకులైన సభ్యులను, న్యాయాధికారులైన సభ్యులను చెప్పుకోవచ్చు. ఆర్చ్ బిషప్‌లూ, బిషప్‌లు, లార్డ్ ఆఫ్ అప్పీల్ వీరందరూ తమ పదవుల్లో కొనసాగుతున్నప్పుడే రాజుగారి సమన్ల లేఖ ద్వారా హౌస్ ఆఫ్ లార్డ్స్ సభ్యత్వం పొందవచ్చు. అయితే, పీరేజ్ ఒక వంశపారంపర్య హక్కుగా పరిగణించే అర్థంలో వీరికి ఆ పదం వర్తించదు.

**ఎగువసభ, దిగువసభ ప్రతినిధుల అధికారాలు, హక్కులు**

పార్లమెంటులో భాగస్వాములుగా తమ అధికారాన్ని బలపరుచుకునేందుకు, తమ విధుల సక్రమ నిర్వహణకు, ఉభయ సభలకు ఉమ్మడి హోదాలో కొన్ని నిర్దిష్టమైన హక్కులుంటాయి. ఉభయ సభల సభ్యులుగా సామూహిక హక్కులతోపాటు, వ్యక్తిగత హోదాలో కూడా తమ పరిరక్షణకు, స్వేచ్ఛ, గౌరవాల సంరక్షణకూ ప్రతి సభ్యునికీ కొన్ని హక్కులుంటాయి.

### ఒకటవ విభాగం

# 1. పార్లమెంటు హక్కులు

## 1) హౌస్ ఆఫ్ కామన్స్ హక్కులు:

అన్యులకు ప్రవేశం నిరోధించి రహస్య సమావేశాలు జరిపే హక్కు తమకుందని హౌస్ ఆఫ్ కామన్స్ భావిస్తూ వచ్చింది. రెండు వేర్వేరు పరిస్థితులు ఈ హక్కుకు దారితీశాయి. మొదటిది కామన్స్‌లో స్థానాల ఏర్పాటుకు సంబంధించింది. ఈ పద్ధతి చాలా లోపభూయిష్టంగా వుండి, పార్లమెంటు సభ్యులు, అన్యులూ అందరూ కలగాపులగంగా కూర్చునేవారు. దీనివల్ల వోటింగ్ సమయంలో సభ్యులతోపాటు, బయటివారిని కూడా లెక్కపెట్టడం జరిగేది. ఈ పొరపాటు నివారించడానికి, అన్యులను నిరోధించే హక్కు తమకివ్వాలని హౌస్ ఆఫ్ కామన్స్ కోరింది. రెండవది రాజుగారి గూఢచర్య కార్యకలాపాలకు సంబంధించింది. ఆ రోజుల్లో దిగువ సభలో సభ్యుల ప్రసంగాలను రాజుగారికి నివేదించడానికి నిర్దిష్టమైన పద్ధతి లేనందువల్ల, రాజుగారు తనకు మిత్రులెవరో, శత్రువులెవరో తెలుసుకునేందుకు గూఢచారులను నియమించేవారు. వీరు సభ్యుల ప్రసంగాలు విని రాజుగారికి నివేదించేవారు. తత్ఫలితంగా రాజుగారు తనకు శత్రువర్గమని భావించిన వారి పట్ల తన అప్రసన్నతను ఏదో రూపంలో వ్యక్తం చేసేవారు. దీనివల్ల సభ్యుల స్వేచ్ఛకు ఆటంకం కలిగింది. రాజుగారి గూఢచారుల నుంచి రక్షించుకునేందుకు కూడా కామన్స్ సభ్యులు, అన్యులకు ప్రవేశం నిరోధించే హక్కు తమకు ఉండాలని కోరారు.

ఈ హక్కు ప్రకారం, అన్యులు సభలో ప్రవేశించకూడదనీ, చర్చలు వినకూడదనీ ఆదేశించలేదు. నిజానికి వారు తరచూ చర్చలు వింటూండేవారు. అయితే ఎవరైనా ఒక సభ్యుడు, ఒక అన్యుడిని గుర్తిస్తే దాన్ని సభాపతి దృష్టికి తీసుకురావడానికి హక్కు లభించింది. అలాంటపుడు సభాపతి తప్పనిసరిగా ఆ అన్యుడిని వెళ్ళిపొమ్మని ఆదేశించాలి. అయితే దీనివల్ల ఏదో ఒక సభ్యుడి కోరిక మేరకు, ఎవరినైనా సరే స్పీకర్ వెళ్ళగొట్టవలసి రావడం అసౌకర్యానికి దారితీసింది. అందువల్ల 1875లో పార్లమెంటు ఒక తీర్మానం ద్వారా దీన్ని సవరించింది. దీని ప్రకారం, ఒక సభ్యుడు అన్యుడిని గమనిస్తే, లేచి నించుని ''సర్. ఇక్కడ అన్యులున్నట్టు గమనించాను'' అని చెప్పాలి. స్పీకర్ ఆ విషయాన్ని సభ

ముందుంచి, అత్యధిక సభ్యుల సూచన మేరకు చర్య తీసుకోవాలి. ఈ సవరణ తీర్మానం వల్ల, అన్యుల నిషేధం ఒక సభ్యుడి ఇష్టాయిష్టాలపై ఆధారపడి వుండక, అత్యధిక సభ్యుల నిర్ణయంపై ఆధారపడి వుంటుంది. అయితే, ఏ అన్యుడినైనా సభ్యుల తీర్మానంతో ప్రమేయం లేకుండా బయటకు పంపించే హక్కు స్పీకర్‌కు ఎప్పుడూ వుంటుంది.

హౌస్ ఆఫ్ కామన్స్, తమ చర్చలను రహస్యంగా ఉంచాలని కోరే హక్కు, వాటి ప్రచురణను నిషేధించాలని కోరే హక్కు తమకు ఉండాలని స్పష్టం చేసింది. 1771లో జరిగిన ఒక సంఘటన ఈ హక్కును తిరుగులేకుండా చేసింది. లండన్‌నగరంలో నివసించే ఒక ముద్రాపకుడు కామన్స్‌లో జరిగిన చర్చలను, వారి అనుమతి లేకుండా ముద్రించాడు. ఇది తమ సభా హక్కుల ఉల్లంఘనగా భావిస్తూ, హౌస్ ఆఫ్ కామన్స్, స్పీకర్ తరపున ఒక దూతను, ముద్రాపకుడి అరెస్టు కోసం పంపించింది. ముద్రాపకుడు తనపై తన ఇంట్లోనే చేయిచేసుకున్నాడని ఆరోపిస్తూ, ఆ దూతను పోలీసులకు అప్పగించాడు. ఆ తర్వాత జరిగిన నేర విచారణలో, నగర మేయర్, మరో ఇద్దరు పౌర ముఖ్యులతో కూడిన బెంచి, హౌస్ ఆఫ్ కామన్స్‌కు, తన నియమావళి ప్రకారం, నగరంలో అరెస్టు వారంటు జారీచేసే హక్కు లేదని తీర్పు చెప్పి ఆ దూతను నిర్బంధించింది. అయితే ఆ దూతను తర్వాత బెయిల్ మీద విడిచిపెట్టారు. అనంతరం హౌస్ ఆఫ్ కామన్స్, మేయర్‌నూ, పౌర ముఖ్యులనూ, దూత వాంగ్మూలం నమోదు చేసిన న్యాయస్థానం గుమాస్తాను పిలిపించింది. దూత వాంగ్మూలం వున్న పేజీని చింపివేసి తాము జారీ చేసిన వారంటును సవాలు చేసినందుకు మేయర్‌కూ, ఇద్దరు పౌర ముఖ్యులకూ శిక్ష విధించింది. ఆనాటి నుంచీ చర్చలు రహస్యంగా ఉంచే విషయంలో హౌస్ ఆఫ్ కామన్స్ హక్కులను ప్రశ్నించే సాహసం ఎవరూ చేయలేదు. ఈనాడు మనకు కనిపించే చర్చల నివేదికలు, కామన్స్ దయతో అంగీకరించినవే. వాటిని ఏక్షణమైనా సభ నిషేధించవచ్చు. ప్రపంచ యుద్ధం సమయంలో ఇలాగే జరిగింది. సభలో ఎన్నో విషయాలను చర్చించి కూడా, వాటి వివరాలను ప్రచురించలేదు.

హౌస్ ఆఫ్ కామన్స్‌కు ఉన్న మరో హక్కు సభకు సక్రమమైన రాజ్యాంగం ఏర్పాటు చేయడానికి సంబంధించినది. ఈ హక్కు కింద మూడు విషయాలను చర్చించాలి.

1) ఖాళీలను భర్తీ చేయడం: కొత్త పార్లమెంటు ఏర్పాటుకు సార్వత్రిక ఎన్నికలు జరిపే హక్కు రాజుగారికే ఉన్నప్పటికీ, పార్లమెంటు సమావేశంలో ఉండగా ఏర్పడిన ఖాళీలను భర్తీ చేసే హక్కు హౌస్ ఆఫ్ కామన్స్‌కే వుంది. అందువల్ల, పార్లమెంటు సభ్యులలో ఒక స్థానం ఖాళీ అయినపుడు, ఆ స్థానం ఎన్నికకు సంబంధించిన రిట్‌ను సభ ఆదేశం ద్వారానే జారీ చేస్తారుగానీ, రాజుగారి ఆదేశం ద్వారా కాదు. ఆ సమయంలో పార్లమెంటు సమావేశాలు లేనిపక్షంలో, కొన్ని షరతులకు లోబడి స్పీకరే రిట్ జారీ చేయవలసి వుంటుంది.

దీనికింద సంక్రమించే మరో హక్కు వివాదాస్పదమైన ఎన్నికల నిర్ధారణకు సంబంధించినది. ఈ విషయంలో ఎవరికి హక్కు వుందనే వివాదం చాలాకాలం రాజుగారికీ, కామన్స్ సభకూ మధ్య చెలరేగింది. ఆ హక్కు తనకే చెందుతుందని ఇద్దరూ వాదించారు. మొదట్లో, ఒక నియోజకవర్గం ఎన్నికకు సంబధించిన రిట్‌ను పార్లమెంటుకు పంపేవారు. ఈ స్థానం భర్తీ చేసే అధికారం హౌస్ ఆఫ్ కామన్స్‌కు ఉందని గుర్తించడమే దీనికి కారణం. అయితే నాలుగవ హెన్రీ పాలనకాలం నుంచీ ఈ రిట్‌ను రాజుగారికే తిప్పి పంపేవారు. అంటే పార్లమెంటు స్థానం భర్తీ చేసే అధికారం రాజుగారికే ఉన్నట్టు గుర్తించారు. ఈవిధంగా ఈ హక్కు ఇద్దరి మధ్య 1604 దాకా నలిగింది. అయితే ఆ సంవత్సరం ఈ హక్కు తమదేనని కామన్స్ పట్టుబట్టడంతో వారికీ, ఒకటవ జేమ్స్‌కీ మధ్య కలహాలు తలెత్తాయి. ఆ సంవత్సరంలోనే దివాలా తీసినవారు, దేశ బహిష్కృతులు పార్లమెంటుకు ఎన్నుకోబడకూడదని రాజు ఒకటవ జేమ్స్ ఆదేశం జారీ చేశారు. బక్స్ కౌంటీకి అప్పుడు ఎన్నికైన గుడ్‌విన్ అనే వ్యక్తి దేశ బహిష్కృతుడు కావడం వల్ల, రాజు అతని ఎన్నికను రద్దు చేస్తూ, మరో రిట్ జారీ చేశారు. అపుడు ఫార్టెస్క్యూ అనే వ్యక్తి ఎన్నికయ్యాడు. అయితే, రాజుగారి ఆదేశాన్ని ఉపేక్షిస్తూ, గుడ్‌విన్‌నే ఎన్నికైన అభ్యర్థిగా అంగీకరిస్తూ, కామన్స్ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. మరోవైపు, ఈ విషయాన్ని నిర్ధారించే అధికారం తనకే ఉందని రాజుగారు పట్టుబట్టారు. హౌస్ ఆఫ్ లార్డ్స్, హౌస్ ఆఫ్ కామన్స్ సమావేశమై ఈ విషయాన్ని చర్చించినపుడు, రాజుగారు తన ఓటమినంగీకరించి, కామన్స్ హక్కులను గుర్తించాలని లార్డ్స్ రాజుగారికి సూచించారు. ఎన్నికల వివాదాలు అటు సభకూ, ఇటు అభ్యర్థులకూ కూడా ఆందోళనకరంగా పరిణమించాయి. వీటన్నిటిలోనూ పార్టీ రాజకీయాలు చోటుచేసుకునేవి. చివరికి 1868లో వివాదాస్పదమైన ఎన్నికల విషయాలు నిర్ణయించే అధికారం న్యాయస్థానానికే వదిలివేయాలని తీర్మానించడంతో సభకు నిశ్చింత లభించింది.

ఈ అంశం కింద మూడవ హక్కు, సభనుంచి ఒక సభ్యుని బహిష్కరించడానికి సంబంధించింది. సభలో కూర్చునే అర్హతను కోల్పోయాడని భావించినపుడు సభ్యుడిని బహిష్కరిస్తారు. అయితే బహిష్కరణ అనర్హతగా పరిగణింపబడదు. అటువంటి వ్యక్తి మళ్ళీ సభకు ఎన్నికకావచ్చు. అయితే ఎన్నిక కావడం, సభలో కూర్చోవడం అనేవి రెండూ ఒకే హక్కు కిందికి రావు. ఎన్నిక కావడమన్నది ఎన్నుకునే వారిపై ఆధారపడి వుంటుంది. సభలో కూర్చోనివ్వడమన్నది సభా నియమాలకు సంబంధించిన విషయం. హౌస్ ఆఫ్ కామన్స్‌కు ఎన్నికై కూడా, సభలో కూర్చోవడానికి అనుమతి లభించని సంఘటనలు కొన్ని జరిగినాయి. ఉదాహరణకు విల్క్స్ అనే వ్యక్తి మిడిల్‌సెక్స్ కౌంటీ నుంచి వరుసగా నాలుగుసార్లు ఎన్నికయ్యారు. అయితే సభలో కూర్చోడానికి అతనికి ఒకసారి కూడా స్థానం లభించలేదు. కామన్స్ కోరిన మరో హక్కు, సభా వ్యవహారాలలో నిర్ణయాధికారం తనకు మాత్రమే

ఉండాలని గుర్తించాలన్నది. ఈ హక్కు కింద, సభ ఆంతరిక వ్యవహారాల క్రమబద్ధీకరణ, సభ నడిపే విధానం ఇత్యాది విషయాలకు సంబంధించిన సమస్యల్లో నిర్ణయాధికారం కేవలం సభకే ఉండాలి గానీ, ఏ న్యాయస్థానానికీ ఉండకూడదని కామన్స్ కోరింది. ఈ హక్కు స్వభావం, పరిధులు బ్రాడ్లా వర్సెస్ గొసెట్స్ కేసులో స్పష్టంగా తెలిశాయి. నార్తాంప్టన్ నుంచి కామన్స్ సభ్యుడిగా ఎన్నికైన బ్రాడ్లా 1880 మే 3వ తేదీన, ప్రమాణ స్వీకారం చేయవలసివుండగా, తాను నాస్తికుడు కనుక, ప్రమాణస్వీకారానికి బదులు బాధ్యతల స్వీకారానికి అంగీకారం మాత్రమే తెలుపుతానని అన్నారు. హౌస్ ఆఫ్ కామన్స్ కమిటీ దీన్ని తిరస్కరిస్తూ, అంగీకారం తెలపడమనేది న్యాయస్థానాలలో చెల్లుతుంది కానీ, పార్లమెంటులో చెల్లబోదని చెప్పింది. ప్రమాణస్వీకారం ఒక్కటే అతనికి శరణ్యమని కమిటీ స్పష్టం చేసింది. కమిటీ నివేదికకు తలవొగ్గి బ్రాడ్లా ప్రమాణస్వీకారం చేయడానికి స్పీకర్ టేబుల్ వద్దకు వచ్చారు. అయితే, అతను నాస్తికుడు కనుక, ప్రమాణస్వీకారం నామమాత్రం అవుతుందనీ, అతని అంతరాత్మ దానికి కట్టుబడి వుండదనీ సభ అభ్యంతరం చెప్పింది. బ్రాడ్లాను ప్రమాణస్వీకారం చేయడానికి అనుమతించాలో వద్దో నిర్ణయించేందుకు మరో కమిటీని ఏర్పాటు చేశారు. ఈ కమిటీ నివేదిక ప్రకారం, అతను ప్రమాణస్వీకారం చేయకూడదు. అయితే అతని అంగీకారం తెలపవచ్చు. కానీ ఈ అంగీకారం కూడా న్యాయస్థానం నుంచి నిర్ధారణ పొందాలి. దీని ప్రకారం, బ్రాడ్లా అంగీకారం తెలపడానికి అనుమతించే తీర్మానాన్ని ఆమోదించారు. అయితే వాళ్ళు దీనికి మరో సవరణ చేసి, అతను అంగీకారం తెలపడాన్ని, ప్రమాణస్వీకారం చేయడాన్నీ కూడా నిరాకరించారు. కానీ బ్రాడ్లా, తనకు ప్రమాణస్వీకారం చేసే హక్కు వుందని వాదించగా, స్పీకర్ అతన్ని సభనుంచి విరమించుకొమ్మని కోరారు. అతను నిరాకరించడంతో, పోలీసుల చేత అతన్ని గెంటించారు. పోలీసు, బ్రాడ్లాల మధ్య జరిగిన ఘర్షణలో బ్రాడ్లా తీవ్రంగా గాయపడ్డారు. అప్పుడు అతన్ని అంగీకార ప్రకటనకు అనుమతిస్తూ ఎప్పటికీ వర్తించే ఆదేశం జారీ చేశారు. బ్రాడ్లా అంగీకారం ప్రకటించారు. కానీ ఆ తర్వాత, న్యాయస్థానం, పార్లమెంటు సభ్యుడు అంగీకార ప్రకటన చేయకూడదని ప్రకటించింది. దానితో అతని స్థానం ఖాళీ అయింది. 1889లో ఆ స్థానానికి మళ్ళీ బ్రాడ్లా ఎన్నికయ్యారు. అదే సన్నివేశం పునరావృతమైంది. అతను ప్రమాణస్వీకారం చేయడానికి టేబిల్ వద్దకు వచ్చినపుడల్లా, సభ అతన్ని అనుమతించకూడదని తీర్మానించింది. ఒకసారి, స్పీకర్ ఆదేశం మేరకు సార్జెంట్ గాస్సెట్ బ్రాడ్లాను సభనుంచి వెళ్ళగొట్టి, తర్వాత బహిష్కరించారు. బ్రాడ్లా రాణి న్యాయపీఠానికి దరఖాస్తు పెట్టుకుని, తనను ప్రమాణస్వీకారం నుంచి నిరోధించకుండా సార్జెంట్ గాస్సెట్‌ను అడ్డగించేందుకు ఉత్తర్వులు జారీ అయ్యేలా చేశాడు. సార్జెంట్ రక్షణ కోసం సభ సాధారణంగా జారీచేసే ఆదేశాన్నే ప్రకటించింది. గాస్సెట్‌పై చర్యకు బ్రాడ్లా కోరిన సాయం చేయడం సభ ఆంతరిక వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడమే అవుతుంది కనుక, తనకు ఆ అధికారం లేదని చెబుతూ రాణి న్యాయపీఠం, బ్రాడ్లాకు సహాయం నిరాకరించింది.

సభ గౌరవాన్ని, అధికారాన్ని పరిరక్షించుకునే హక్కు తనకు వుందని హౌస్ ఆఫ్ కామన్స్ భావించింది. తమకు అవమానకరంగా ఉన్న చర్యలు ఏవేవని కామన్స్ లెక్కగట్టిందో చెప్పడానికి ప్రయత్నించడం నిష్ఫలమే కాగలదు. మొత్తం మీద ఈ క్రింది సూత్రాలను సభ ప్రస్తావించింది:

1. సభా వ్యవహారాల క్రమబద్ధీకరణకు సంబంధించి ఎటువంటి ఆదేశాన్ని, నిబంధననైనా ఉల్లంఘించడం- సభా హక్కుల ఉల్లంఘనమే అవుతుంది. సభలో చర్చలపై రూపొందించిన తీర్మానాలకు విరుద్ధమైన విషయాలను ప్రచురించడం, చర్చలను వక్రీకరించి ప్రచురించడం, ఒక ఎన్నికైన సంఘానికి చెప్పిన సాక్ష్యాన్ని సభముందుంచక పూర్వమే ప్రచురించడం- ఇవన్నీ సభా ఉల్లంఘన కిందకే వస్తాయి.

2. కొన్ని నిర్దిష్టమైన ఆదేశాలను అతిక్రమించడం. సభకుగానీ, సభాపతికిగానీ సాక్ష్యం ఇవ్వవలసిన సాక్షుల విషయంలో అక్రమాలకు పాల్పడ్డ వారి పట్ల అతి తీవ్రమైన చర్యలు తీసుకోవాలని ప్రతి సమావేశం ముందు సభలో తీర్మానాలను ఆమోదిస్తారు. సాక్షులను సాక్ష్యం ఇవ్వనివ్వక నిరోధించేవారు, తప్పుడు సాక్ష్యం ఇచ్చేవారు మొదలైన వారంతా నిర్దిష్టమైన ఆదేశాలను అతిక్రమించి; సభా హక్కుల ఉల్లంఘన చేసినవారి కిందకే వస్తారు.

3. పార్లమెంటుకు పరువు నష్టం కలిగించే విధంగా, సభా స్వభావంపైగానీ, సభా వ్యవహారాలపై గానీ అగౌరవకరమైన ఆరోపణలు చేయడం సభా హక్కుల ఉల్లంఘన కిందకి వస్తుంది. ఈ నిబంధన కింద సామాన్య ప్రజలనే నేరస్తులుగా భావించాలని అనుకోకూడదు. పార్లమెంటు సభ్యులు కూడా ఇటువంటి చర్యలకు పాల్పడితే శిక్షార్హులే. 1819లో పార్లమెంటు సభ్యుడైన హోబ్‌హౌస్, పార్లమెంటరీ సంస్కరణల సంఘం ప్రతిఘటన చర్యను ఖండిస్తూ ఆకాశరామన్న కరపత్రాన్ని విడుదల చేశారు. అయితే ఆ తర్వాత ఆ కరపత్ర లేఖకుడు తానేనని ఒప్పుకోగానే సభ అతన్ని సభా హక్కుల ఉల్లంఘన నేరం కింద నేరస్తుడిగా నిర్ణయించింది. 1838లో పార్లమెంటు సభ్యుడైన ఓకొమెడ్, ఎన్నికల సంఘాల న్యాయపరమైన విధుల నిర్వహణలో కామన్స్ సభ్యులు అక్రమాలకు పాల్పడ్డారని ఒక బహిరంగ సభలో ఆరోపించిన సంఘటన కూడా జరిగింది.

4. పార్లమెంటు సభ్యులుగా విధి నిర్వహణలో ఉన్నపుడు సభ్యుల పనుల్లో జోక్యం చేసుకోవడం కూడా సభా హక్కుల ఉల్లంఘనమే.

ఇవికాక సభ్యులు సభలోకి వస్తున్నపుడు లేదా వెళ్తున్నపుడు లేదా సభలో వారి ప్రవర్తన కారణంగా వారిని అవమానించడం, వారిపై దాడి చేయడం, సభ ముందు చర్చకు రావలసి వున్న ఏదైనా

ప్రతిపాదనకు అనుకూలంగా లేక ప్రతికూలంగా ప్రకటన చేయాలని సభ్యులపై వత్తిడి తీసుకురావడం, వోటింగ్ విషయంలో సభ్యులకు లంచాలివ్వడం కూడా సభాహక్కుల ఉల్లంఘనం కిందకే వస్తాయి.

### రెండవ విభాగము

## సభ్యుల ప్రత్యేకాధికారాలు

**1. నిర్బంధం నుంచి స్వేచ్ఛ** : పార్లమెంటు సమావేశాలు జరుగుతున్నపుడు, జరగడానికి 40 రోజులు ముందు, ముగిసిన40 రోజుల తర్వాతి వరకు, పార్లమెంటు సభ్యులను అరెస్టు చేయకూడదనే నిబంధన వల్ల, వారికి నిర్బంధం నుంచి స్వేచ్ఛ లభిస్తుంది. ఒకప్పుడు ఈ హక్కు సభ్యులతో పాటు వారి పనివారికీ, ఎస్టేట్లకూ కూడా వర్తించేది. కానీ ఇప్పుడు సభ్యులకే పరిమితమైంది.

**2. వాక్‌స్వాతంత్ర్యం**: విలియం, మేరీలు చేసిన రాజశాసనం ఎస్2, సి2 ప్రకారం, పార్లమెంటరీ చర్చలు, వ్యవహారాల్లో సభ్యులకు పూర్తి వాక్‌స్వాతంత్ర్యం ఉంటుంది. వారిని ప్రశ్నించే హక్కు కానీ, వారి పలుకుల ఆధారంగా శిక్షించే హక్కు గానీ పార్లమెంటు బయట మరే న్యాయస్థానానికీ లేదా ఇతర వ్యవస్థకూ ఉండవు.

### మూడవ విభాగము

## సభా హక్కుల ఉల్లంఘనను శిక్షించే పద్ధతులు

సభా హక్కుల ఉల్లంఘనకు పాల్పడిన వారిని సభ ఐదు రకాలుగా శిక్షించవచ్చు. ఉల్లంఘన మరీ తీవ్రమైనది కానపుడు, అరెస్తు చేసిన వ్యక్తి క్షమార్పణ కోరుకున్న పక్షంలో కేవలం మందలింపుతో, సభ అతన్ని విడుదల చేయడానికి ఒప్పుకోవచ్చు. లేదా, అభిశంసన తర్వాత అతన్ని విడుదల చేయవచ్చు. సభాహక్కుల ఉల్లంఘనం తీవ్రమైనదైతే, అతన్ని జైలుకు పంపడం గానీ, జరిమానా విధించడం గానీ, బహిష్కరించడంగానీ, చేయవచ్చు. 'బహిష్కారం' అన్న శిక్ష కేవలం సభా హక్కులను ఉల్లంఘించిన పార్లమెంటు సభ్యులకే వర్తిస్తుందన్నది స్పష్టం.

### నాల్గవ విభాగము

## హౌస్ ఆఫ్ లార్డ్స్ ప్రత్యేకాధికారాలు

హౌస్ ఆఫ్ లార్డ్స్ హక్కులు కూడా దాదాపు హౌస్ ఆఫ్ కామన్స్ హక్కుల వలెనే ఉంటాయి. కనుక, వాటిని వేరుగా వివరంగా చర్చించనవసరం లేదు. వీరిద్దరి హక్కుల్లో తేడా వున్నది ఒకే ఒక విషయంలో. కామన్స్ హక్కులు ఆ సభకు మహారాజు బహూకరించినవి. ప్రతిసారీ కొత్త పార్లమెంటు

ఏర్పడినపుడు స్పీకర్ ఈ హక్కులను రాజుగారి నుంచి కోరుకోవాలి. కానీ లార్డ్స్ హక్కులు, వారికి స్వతహాగానే లభిస్తాయి. రాజుగారి నుంచి తీసుకోనవసరం లేదు.

ఐదవ విభాగము *

# హౌజ్ అధికారులు

హౌస్ ఆఫ్ లార్డ్స్‌లోనూ, హౌస్ ఆఫ్ కామన్స్‌లోనూ సభా వ్యవహారాలు నడపడనికీ, హక్కులను అమలు జరపడానికీ నిర్దిష్టమైన అధికారాలుంటాయి. స్పష్టత కోసం, ఈ రెండు సభల అధికార్ల గురించి వారి స్థాయి, విధుల గురించి వేర్వేరుగా చర్చించడం జరుగుతుంది.

ఆరవ విభాగము *

# హౌస్ ఆఫ్ కామన్స్

## 1) స్పీకర్ (సభాపతి):

పార్లమెంటు ఎన్నికైన తర్వాత హౌస్ ఆఫ్ కామన్స్ జరిపే మొదటి సమావేశంలో స్పీకర్‌ను ఎన్నుకోవడం జరుగుతుంది. ప్రత్యేక తీర్మానం ద్వారా తొలగిస్తే తప్ప, ఆ పార్లమెంటు ఉన్నంతకాలం స్పీకర్ ఆ పదవిలో కొనసాగుతారు. మొదట్లో, రాజు స్పీకర్‌ను ఎన్నుకునే హక్కు కలిగి వుండేవాడు. **1679**లో అప్పటి రాజు రెండవ ఛార్లెస్‌కూ, హౌస్ ఆఫ్ కామన్స్‌కొ మధ్య స్పీకర్‌ను ఎంచుకునే హక్కు గురించి వివాదం చెలరేగింది. కామన్స్ సర్ ఎడ్వర్డ్ సేమూర్‌ను ఎన్నుకుంది. రాజు అతన్ని స్పీకర్‌గా ఆమోదించడానికి నిరాకరించాడు. రాజు ప్రతిపాదించిన వ్యక్తిని కామన్స్ ఆమోదించలేదు. చివరకు రాజీ కుదిరి, కామన్స్ ఎన్నుకున్న మరో వ్యక్తి స్పీకర్‌గా నియమించబడ్డాడు. రాజు దీనికి అభ్యంతరం చెప్పలేదు. ఆనాటి నుంచి, స్పీకర్‌ని ఎన్నుకునేందుకు కామన్స్‌కు ఉన్న హక్కును ఏ రాజూ సవాలు చేయలేదు.

ఏడవ విభాగము

# స్పీకర్ విధులు

హౌస్ ఆఫ్ కామన్స్ స్పీకర్ మూడు నిర్దిష్టమైన అధికారాల్లో విధులు నిర్వహిస్తాడు. సభ ప్రతినిధిగా అతను ఈ క్రింది విధులు నిర్వహిస్తాడు-

---

* మూలంలో దీన్ని ఆరవ విభాగంగా పేర్కొన్నారు - సం.

* మూలంలో విభాగం సంఖ్య పేర్కొనబడలేదు - సం.

1. సభా హక్కులను సాధించి, సభచేపట్టే ధన్యవాద తీర్మానాన్ని ప్రకటిస్తాడు. మందలింపులు, అభిశంసనల ప్రకటనలు సక్రమంగా జరిగేలా చూస్తాడు.

2. సభా హక్కుల ఉల్లంఘన క్రింద శిక్షింపబడే వ్యక్తి కట్టుబాట్లను గురించిన వారంట్లు స్పీకర్ జారీ చేస్తాడు. సభ ఆదేశాల ప్రకారం మందలింపుకుగానీ, సభ విధించే శిక్షకు గానీ వినడానికి సభలో హాజరుకావాలని ఆదేశిస్తూ వారంట్లను జారీ చేస్తాడు.

3. సభా స్థానాల ఖాళీలు భర్తీ చేయడానికి రిట్లను కూడా జారీ చేస్తాడు. 1911 పార్లమెంటు చట్టం అంతకుపూర్వం అతనికి లేని కొత్త విధిని స్పీకర్‌కు విధించింది. ఈ చట్టం కింద, స్పీకర్‌న్యాయాధికారిగా వ్యవహరిస్తూ ఒక బిల్లు ఆర్థిక బిల్లు అయినదీ, కానిదీ నిర్ణయించవలసి వుంటుంది.

సభా వ్యవహారాల సమయంలో స్పీకర్ సభాధ్యక్షుడిగా కూడా వ్యవహరిస్తాడు. ఈ పదవికి కింద అతను ఈ క్రింది విధులు నిర్వర్తించాలి.

1) చర్చలు జరుగుతున్నప్పుడు క్రమశిక్షణ పాటించేలా చూడాలి.

2) పాయింట్స్ ఆఫ్ ఆర్డర్‌పై తలెత్తే సమస్యలు పరిష్కరించాలి.

3) ఆ సమయంలో జరుగుతున్న చర్చకు సంబంధించిన ప్రశ్నలను సభ ముందుంచాలి.

4) ఈ ప్రశ్నలపై సభ నిర్ణయాన్ని ప్రకటించాలి.

## ఎనిమిదవ భాగము

# స్పీకర్ క్రింద పనిచేసే అధికారులు

హౌస్ ఆఫ్ కామన్స్ స్పీకర్ క్రింద ఇద్దరు అధికారులు పనిచేస్తారు. ఒకరు కామన్స్ గుమాస్తా, రెండవవారు పోలీసు అధికారి- సార్జెంట్. గుమాస్తా విధి, సభా కార్యక్రమాలను నమోదు చేయడం. హౌస్ ఆఫ్ కామన్స్ ముందు ఏరోజుకారోజు చర్చకు వచ్చే విషయాలన్నిటినీ నమోదు చేసే జర్నల్‌ను అతను నిర్వహిస్తాడు. సార్జెంట్‌సభా వ్యవహారాలు శాంతియుత వాతావరణంలో కొనసాగేలా చూస్తాడు. అంతర్గత శాంతిభద్రతలు, సభాహక్కుల ఉల్లంఘన విషయాలకు సంబంధించి, సభ, స్పీకర్‌ల ఆదేశాలు అమలును అతను పర్యవేక్షిస్తాడు.

# హౌస్ ఆఫ్ లార్డ్స్

స్పీకర్: హౌస్ ఆఫ్ లార్డ్స్ స్పీకర్ ఎన్నుకోబడడు. లార్డ్స్‌కు స్పీకర్‌ను ఎన్నుకునే హక్కు లేదు.

నియమావళి ప్రకారం, లార్డ్స్ స్పీకర్‌గా లార్డ్ ఛాన్సలర్ ఉంటారు. అతను రానపుడు లార్డ్ కీపర్ ఆఫ్ ది గ్రేట్ సీల్ స్పీకర్‌గా వ్యవహరిస్తారు. వీరిద్దరూ హాజరుకాని పక్షంలో, ఒక డిప్యూటీ స్పీకర్ ఆ విధులను నిర్వహిస్తాడు. రాజుగారి కమిషన్ నియమించే పలువురు డిప్యూటీ స్పీకర్లలో ఒకరు విధులను నిర్వహిస్తారు. ఒకవేళ వీరందరూ రానిపక్షంలో, ఆ రోజుకు మాత్రం లార్డ్స్ ఒక స్పీకర్‌ను ఎన్నుకుంటారు. హౌస్ ఆఫ్ లార్డ్స్ స్పీకర్ పీర్ అయివుండవలసిన అవసరం లేదు. సామాన్య సభ్యుడు కూడా ఈ విధి నిర్వర్తించవచ్చు. లార్డ్ కీపర్ ఆఫ్ ది గ్రేట్ సీల్‌గా సామాన్యుడు ఉన్నపుడు, అతనే స్పీకర్‌గా వ్యవహరించిన సందర్భాలున్నాయి. ప్రతిష్ఠాత్మకమైన ఈ సభ అధ్యక్షుడు సభలో సభ్యుడు కానవసరం లేకపోవడం చాలా విచిత్రమైన అంశం. ఈ స్పీకర్ కూర్చునే ఆసనం కూడా హౌస్ ఆఫ్ లార్డ్స్ పరిధికి ఆవలే ఉంచుతారు. తద్వారా, లార్డ్స్‌లో సభ్యుడు కాని వ్యక్తి స్పీకర్ విధులు నిర్వహించడానికి అనుమతిస్తారు.

## లార్డ్స్‌లో స్పీకర్ విధులు

హౌస్ ఆఫ్ కామన్స్ స్పీకర్ విధులకు, హౌస్ ఆఫ్ లార్డ్స్ స్పీకర్ విధులు పూర్తి విరుద్ధంగా ఉంటాయి. ఇద్దరూ సభాధ్యక్షులన్న మాట తప్పితే, వీరిరువురి అధికారం, విధులకు సంబంధించి ఎటువంటి సామ్యం లేదు. 20వ స్థాయీ ఆదేశం వల్ల ఈ విషయం స్పష్టమౌతుంది. దీని ప్రకారం హౌస్ ఆఫ్ లార్డ్స్ స్పీకరైన లార్డ్ ఛాన్సలర్ విధులు: లార్డ్ ఛాన్సలర్ సభనుద్దేశించి ప్రసంగించినపుడు శిరస్త్రాణం లేకుండా మాట్లాడాలి; సభా ప్రతినిధిగా సభను వాయిదా వేయడం వంటి నిర్ణయాలు లార్డ్స్ అనుమతి లేకుండా తీసుకోకూడదు; సాధారణ బిల్లులకు సంబంధించి మాత్రం స్వతంత్ర నిర్ణయాలు తీసుకోవచ్చు- అయితే వాటిని కూడా తిరస్కరించే హక్కు లార్డ్స్‌కు ఉంటుంది. ఏ బిల్లు ముందు ప్రతిపాదించాలన్న విషయంపై లార్డ్స్ సభ్యుల మధ్య అభిప్రాయభేదాలు వస్తే, అది చర్చకు పెట్టాలి. లార్డ్ ఛాన్సలర్ ప్రత్యేకంగా ఏదైనా చెప్పదలచుకున్న పక్షంలో, ఒక పీర్‌గా తన స్థానానికి వెళ్ళి మాట్లాడాలి; పీర్‌గా మాట్లాడుతున్నపుడు అతను తన ఛేంబర్స్‌లో ఎడమ వైపుకు వెళ్ళాలని గుర్తుంచుకోవాలి.'' ఈ ఆదేశం వల్ల లార్డ్స్‌లో స్పీకర్ అధికారాలు ఎంత పరిమితమైనవో స్పష్టమౌతోంది.

1) సభలో శాంతి భద్రతలు పరిరక్షించే విషయంలో ఇతర పీర్స్ కంటే ఎక్కువ అధికారాలు స్పీకర్‌కు ఏవీ లేవు.

2) హౌస్ ఆఫ్ కామన్స్ స్పీకర్‌లా పాయింట్స్ ఆఫ్ ఆర్డర్ నిర్ణయించే హక్కు అతనికుండదు. అతను గనక పీర్ అయితే ఎవరైనా లేవనెత్తే పాయింట్ ఆఫ్ ఆర్డర్‌పై ప్రసంగించే అధికారం వుంటుంది. అయితే ఆర్డర్‌పై నిర్ణయించే అధికారం మెజారిటీ సభ్యులకే వుంటుంది.

3) లార్డ్స్‌లో స్పీకర్‌కు సభా కార్యక్రమాల నిర్వహణలో పరిమితమైన అధికారాలే ఉన్నందువల్ల సభను సంబోధించి ప్రసంగించేందుకు ఒక పీర్ సభ నిర్ణయం మీదే ఆధారపడవలసి వుంటుంది. ఒకేసారి ఇద్దరు పీర్స్ మాట్లాడడానికి లేచి నించుంటే, వాళ్ళలో ఒకరు వెనక్కి తగ్గితే తప్ప, సభ ఇద్దరిలో ఒకర్ని ముందు మాట్లాడమంటుంది. ఇద్దరికీ వేర్వేరు పార్టీల మద్దతు ఉంటే, భేదాభిప్రాయం తప్పదు. హౌస్ ఆఫ్ కామన్స్‌లో వలె ఇలాంటి వివాదాలను ఇక్కడ స్పీకర్ నిర్ణయించడం జరగదు.

స్పీకర్‌కు ఇలాంటి అసంపూర్ణమైన అధికారాల ఫలితంగా, క్రమం తప్పి ప్రవర్తించే ఒక పీర్‌ను, మరో పార్టీకి చెందిన పీర్ సక్రమంగా నడచుకొమ్మని ఆదేశిస్తే, క్రమబద్ధం కాని వాదోపవాదాలు చెలరేగుతాయి. దీనివల్ల పరస్పరం మందలింపులే తప్ప, సక్రమమైన చర్చ జరగదు. లార్డ్ ఛాన్సలర్ అధికారాలు ప్రశ్నలు చెప్పడానికీ, ఇతర లాంఛనాలు నిర్వహించడానికే పరిమితమై వున్నందువల్ల అతను జోక్యం చేసుకునే అధికారం లేక మిన్నకుంటాడు.

## ఇతర అధికారులు

లార్డ్ ఛాన్సలర్ కింద ముగ్గురు అధికారులు ఉంటారు.

1) పార్లమెంటు గుమాస్తా - హౌస్ ఆఫ్ కామన్స్‌లో గుమాస్తాలా ఇతను కూడా సభా కార్యక్రమాల వివరాలను, నిర్ణయాలను ఒక పత్రికలో నమోదు చేస్తాడు.

2) హౌస్ ఆఫ్ కామన్స్‌లో సార్జంట్‌లా ఇక్కడ కూడా జెంటిల్‌మన్ అషర్ సభలో శాంతి భద్రతలను పరిరక్షిస్తాడు.

3) లార్డ్ ఛాన్సలర్ అంగరక్షకుడిగా మరో సార్జంట్ ఉంటాడు.

## II సార్వభౌమాధికారం - భారతదేశ రాష్ట్రాల స్వతంత్ర ప్రకటన

భారతదేశానికి డొమినియన్ హోదా రాగానే ఆగస్టు 15న ట్రావన్‌కోర్, హైదరాబాద్‌లు స్వతంత్ర, సార్వభౌమ రాజ్యాలుగా ప్రకటించుకోవాలన్న నిర్ణయం, ఈ నిర్ణయాన్నే తాము కూడా అనుసరించాలన్న ఇతర రాష్ట్రాల ఆలోచన, సరికొత్త సమస్యను తెచ్చిపెట్టాయి. రాష్ట్రాలు తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకోవచ్చునా? రాష్ట్రాలు తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకోవాలా?

మొదటి అంశానికి వస్తే - రాష్ట్రాలు తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకోవడమన్నది 1946 మే

12వ తేదీన కేబినెట్ మిషన్ జారీచేసిన ప్రకటన ఆధారంగా జరిగింది. ఈ ప్రకటనలో బ్రిటిష్ ప్రభుత్వం, తను ఎట్టి పరిస్థితులలోను సార్వభౌమాధికారాన్ని భారత ప్రభుత్వానికి బదిలీ చేయలేదనీ, చేయబోదనీ స్పష్టం చేసింది: దీన్నిబట్టి, అంతకుముందు బ్రిటిష్ రాజ్యానికి ధారాదత్తం చేసిన అధికారాలు తిరిగి ఆ రాష్ట్రాలకే చెందుతాయి గానీ, భారత ప్రభుత్వానికి చెందవు. బ్రిటిష్ ప్రభుత్వం భారత ప్రభుత్వానికి సార్వభౌమాధికారాన్ని బదిలీ చేయలేదన్న కేబినెట్ మిషన్ ప్రకటన, రాజకీయ సిద్ధాంత ప్రకటన కాదు. అది చట్టపరమైన ప్రకటన. అయితే రాష్ట్రాలకు ఈ ప్రకటనను ఈవిధంగా అన్వయించడం సమంజసమేనా అన్న ప్రశ్న ఉదయిస్తుంది.

కేబినెట్ మిషన్ రూపొందించిన ప్రతిపాదనలో కొత్త విషయమేమీ లేదు. 1929లో బ్రిటిష్ రాజుకూ, భారత రాష్ట్రాలకూ మధ్య సంబంధాన్ని పరిశీలించడానికి నియమించిన బట్లర్ కమిటీ ప్రతిపాదనలనే కేబినెట్ కమిషన్ పునరుద్ఘాటించింది.

బట్లర్ కమిటీ ఎదుట మాట్లాడిన భారత రాజవంశీయులు రెండు ప్రతిపాదనలు చేసిన విషయం రాజనీతి విద్యార్థులకు తెలిసిందే. అవి:

i) రాజవంశీయులకు, రాష్ట్రాలకు మధ్య జరిగిన ఒప్పందాలలోని షరతులను సార్వభౌమాధికారం అధిగమించకూడదు. ఈ షరతులు, సార్వభౌమాధికారాన్ని పరిమితం చేస్తాయి.

ii) సార్వభౌమాధికారాన్ని దృష్టిలో పెట్టుకుని రాజుకు, భారత రాజవంశీయులకు పేర్కొన్న సంబంధాలు ఆంతరంగికమైనవి కనక, రాజు, ఈ రాజవంశీయుల ఆమోదం లేకుండా, సార్వభౌమాధికారాన్ని భారత ప్రభుత్వానికి బదిలీ చేయజాలడు.

అయితే ఈ రెండు ప్రతిపాదనల్లో మొదటిదాన్ని బట్లర్ కమిటీ కొట్టివేసింది. సార్వభౌమాధిపత్యమంటే సార్వభౌమమే కానీ, ఒప్పందాల్లో షరతుల వల్ల అది పరిమితమయ్యే ప్రసక్తి లేదని కమిటీ నిష్కర్షగా చెప్పేసింది. అయితే, విచిత్రంగా, రెండవ ప్రతిపాదనను మాత్రం కమిటీ ఆమోదించింది. మొదటిది కొట్టివేయడం వల్ల రాజవంశీయులకు కలిగిన ఆగ్రహాన్ని శాంతింపజేయడానికి, రెండవది అంగీకరించారా అన్న ఊహాగానాల వల్ల ప్రయోజనం లేదు. మొత్తం మీద, రెండవ ప్రతిపాదన ఆమోదం భారత రాజనీతి శాఖకూ, రాజవంశీయులకూ సంపూర్ణంగా తృప్తినిచ్చింది.

భారత ప్రభుత్వానికి సార్వభౌమాధికారాన్ని బదిలీ చేయడం కుదరదన్న సిద్ధాంతం దురుద్దేశపూర్వకంగా చేసినదీ, విషయాలను సరిగ్గా అర్థం చేసుకోకపోవడం వల్ల తలెత్తినదీ. ఈ

సిద్ధాంతం ఎంత అసహజమైనదంటే, బ్రిటిష్ చట్ట చరిత్రను రాసిన ప్రొఫెసర్ హోల్డ్స్‌వర్త్, ఈ సిద్ధాంతాన్ని 1930 అక్టోబర్ లాక్వార్టర్లీ రివ్యూలో సమర్థించుకోడానికి తన తెలివితేటలను కుమ్మరించవలసి వచ్చింది. దురదృష్టవశాత్తూ, రాజ్యాంగ చట్టం చదువుకున్న ఏ భారతీయ విద్యార్థి అతని వాదనను ఖండించకపోవడం వల్ల, అదే తుది మాటగా నిలిచిపోయింది. అందువల్ల కేబినెట్ మిషన్ అదే సక్రమమైన సిద్ధాంతం అనుకుని బ్రిటిష్ ప్రభుత్వం, భారత రాష్ట్రాల సంబంధంలో దాన్నే అమలు జరిపింది. బ్రిటిష్ ప్రభుత్వంతో ఒప్పందం గురించి కేబినెట్ మిషన్‌తో సంప్రదింపులు జరుపుతున్నపుడు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ, ఈ సార్వభౌమాధికారంపై ప్రతిపాదనను సవాలు చేయకపోవడం విచారకరమైన విషయం. అయితే, కేబినెట్ మిషన్ ఏమి చెప్పినప్పటికీ, ఈ విషయాన్ని స్వతంత్రంగా పరిశీలించి, తమ సొంత నిర్ణయాన్ని తీసుకుని, దాని అమలుకు కట్టుబడి వుండే హక్కును భారతీయులకు ఎవరూ నిరాకరించలేరు.

కేబినెట్ మిషన్ సార్వభౌమాధికారం గురించి చేసిన ప్రతిపాదనలకు వ్యతిరేకంగా ఈ క్రింది వాదనలు చేయవచ్చు.

1) బ్రిటిష్ రాజు అధికారానికే సార్వభౌమాధికారం అన్నది మరో పేరు. రాజుగారి సామాన్య అధికారాలకంటే సార్వభౌమాధికారం రెండు విషయాల్లో విభేదిస్తుంది.

(అ) సామాన్య అధికారాలు, శాసన చట్టం వల్ల కాక సామాన్య చట్టం వల్ల లభించగా, సార్వభౌమాధికారం, ఆచరణలో వున్న ఒప్పందాల ఆధారంగా లభిస్తుంది.

(ఆ) సామాన్య చట్టాధికారం వల్ల రాజుగారి అధికారం తన దేశంలో వున్న ప్రజలందరిపైనే కాక, తాత్కాలికంగా తన దేశంలో వున్న విదేశీయులపై కూడా చలామణి అవుతుంది. అయితే సార్వభౌమాధికారం భారత రాష్ట్రాలకు మాత్రమే వర్తిస్తుంది. రాజుగారి అధికారాల్లో సార్వభౌమాధికారం చాలా ప్రత్యేకమైనదనడంలో సందేహం లేదు.

2) రాజుగారి ప్రత్యేకమైన హక్కు అయినందువల్ల, రాజ్యాంగ చట్టంగా పిలవబడే మున్సిపల్ (స్వదేశీ) చట్టానికి సార్వభౌమాధికారం లోబడి వుంటుంది.

3) రాజ్యాంగ చట్ట సూత్రాల ప్రకారం, ఈ అధికారం రాజుగారికే వున్నా, దానిని అమలు జరపడంలో మాత్రం ఆయన తన మంత్రుల సలహాలు తీసుకోవాలి. మంత్రుల సలహా తీసుకోకుండా రాజు స్వతంత్రించి వ్యవహరించకూడదు.

పైన పేర్కొన్న చివరి ప్రతిపాదనను మరింత వివరించవలసి వుంది. ఎందుకంటే, రాజుగారు ఏ మంత్రుల సలహాలు తీసుకోవాలన్న ప్రశ్న ఉదయిస్తుంది. దానికి జవాబు- ఏ దేశ వ్యవహారాలకు సంబంధించిన అధికారమో, ఆ వ్యవహారాలు చూసే శాఖ సలహాలను రాజుగారు తీసుకోవలసి వుంటుంది. వెస్ట్ మిన్‌స్టర్ శాసనం రాకముందు, బ్రిటిష్ రాజ్యమంతా ఒకే డొమినియన్‌గా ఉండేది. కనక, తన హక్కుల అమలుకు సంబంధించి, మంత్రివర్గం సలహాలనే రాజు తీసుకునేవారు. వెస్ట్ మిన్‌స్టర్‌శాసనం జారీ అయిన తర్వాత, కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, ఐర్లండ్ ప్రత్యేక రాజ్యాలుగా ఏర్పడ్డాయి. అందువల్ల, అప్పటినుంచి రాజు, ఆయా దేశాల వ్యవహారాలను పర్యవేక్షించే మంత్రుల సలహాపైనే చర్యలు చేపట్టడం ప్రారంభమైంది. అలా తప్ప మరోలా చేయడానికి వీల్లేదు. దీని అనుసారంగా, భారతదేశం ఒక డొమినియన్‌గా ఏర్పడినపుడు, రాజు తన హక్కుల అమలులో భారతీయ కేబినెట్ సలహాలను పాటించవలసి వుంటుంది.

సార్వభౌమాధికారాన్ని భారత ప్రభుత్వానికి బదిలీ చేయలేమని వాదించేవారు, **1935** భారత ప్రభుత్వ చట్టం, **1933** భారత ప్రభుత్వ చట్టంలోని 30వ సెక్షనులో ఈ విషయం ప్రస్తావించకపోవడాన్ని తమకు ఆధారంగా పేర్కొంటారు. దీని ప్రకారం, భారత పౌర, సైనిక ప్రభుత్వ స్వామ్యం ( బ్రిటిష్ ఇండియా కాదని గమనించాలి) అప్పుడు కౌన్సిల్‌లో వున్న గవర్నర్ జనరల్ అధీనంలో ఉంటుంది. దీన్నిబట్టి సార్వభౌమాధిపత్యాన్ని భారత ప్రభుత్వానికి బదిలీ చేయలేమని తెలుస్తోందని వీరు వాదిస్తారు. ఈ వాదన అర్థరహితమైంది. భారత ప్రభుత్వ చట్టంలో దీనికి సంబంధించిన ప్రస్తావన ఉండడం, ఉండకపోవడమన్నది అసందర్భమే కాక, దీనివల్ల రుజువయ్యేదేమీ లేదు. ఈ నిబంధన చట్టంలో లేకపోవడం, భారతదేశం ఎట్టి పరిస్థితుల్లోనూ రాజుకు సార్వభౌమాధిపత్యం విషయంలో సలహా ఇవ్వకూడదని, రుజువు చేయడం లేదు. అలాగే ఈ నిబంధన చట్టంలో ఉన్నంత మాత్రాన, **1833** నుంచి **1935** వరకు, రాజుకు ఈ విషయంలో సలహా ఇచ్చే అధికారం భారతదేశానికి ఉండేదని భావించనవసరం లేదు. ఎందుకంటే, ఇదే నిబంధన కింద, **1833** నుంచి **1935** వరకు కూడా సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఆదేశాలకు గవర్నర్ జనరల్ బద్ధుడై వుండాలని కూడా స్పష్టం చేశారు. అంటే, భారత సార్వభౌమాధిపత్యం విషయంలో రాజుకు సలహాలిచ్చే అధికారం కూడా సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కే ఉన్నందువల్ల గవర్నర్ జనరల్ ఈ విషయంలో చేయగలిగింది ఏమీలేదు.

**1833** నుంచి **1935** లోపు, భారతదేశం పాలనకు సంబంధించి, సార్వభౌమాధిపత్యం బదిలీ విషయంలో పార్లమెంటు ఆమోదించిన చట్టాలు, ఈ విషయంలో రాజుకు సలహాలివ్వడానికి భారత ప్రజలకు గల అధికారాన్ని ఏరకంగానూ కాదనలేవు. రాజ్యాంగ శాసనం ప్రకారం, ఒక దేశం డొమినియన్‌గా ఏర్పడినపుడే, రాజుకు సలహాలిచ్చే అధికారం పొందుతుంది. అయితే డొమినియన్‌గా ఏర్పడక మునుపు

వేరే విధమైన సలహాలు ఇచ్చారన్న విషయంతో వీరికి నిమిత్తం లేదు. 1935 చట్టంలో, భారతదేశం బాధ్యతాయుత ప్రభుత్వం కలిగి వుండలేదు. ఒకవేళ కలిగివున్నా, భారత రాష్ట్రాలకు సంబంధించి రాజుకు తన హక్కులగురించి సలహాలనిచ్చే అధికారం భారతదేశానికి ఉండేది కాదు. ఎందువల్లనంటే, బ్రిటిష్ సామ్రాజ్య రాజ్యాంగ శాసనం బాధ్యతాయుత ప్రభుత్వాన్ని, డొమినియన్ హోదాను వేర్వేరు స్థాయిలుగా గుర్తిస్తుంది. బాధ్యతాయుత ప్రభుత్వం కింద, రాజుగారికి మంత్రివర్గం సలహాలనిచ్చే హక్కు, రాజు వాటిని ఆమోదించవలసిన బాధ్యత, కేవలం దేశ అంతర్గత వ్యవహారాలకే పరిమితమై వుంటాయి. విదేశాంగ వ్యవహారాల్లో రాజుకు సలహాలనిచ్చే హక్కు బ్రిటిష్ కేబినెట్‌కే వుంది. అయితే డొమినియన్ హోదా పొందిన తర్వాత మాత్రం, ఆ దేశ మంత్రి వర్గం ఇచ్చే సలహాలను, దేశీయ, విదేశీయ వ్యవహారాలు రెండింటిలోనూ రాజు స్వీకరించవలసి వుంటుంది. అందువల్లే ఒక డొమినియన్, బ్రిటిష్‌కేబినెట్ జోక్యం లేకుండా ఒక విదేశంతో ఒప్పందాలు చేసుకోగలదు. కనక, భారత ప్రభుత్వాన్ని, సార్వభౌమత్వం విషయంలో రాజుకు సలహానిచ్చేందుకు అనుమతించకపోవడమన్నది, రాజ్యాంగపరమైన నిషేధం కిందికి రాదు. భారతదేశానికి డొమినియన్ స్థాయి లభించిన క్షణాన్నే, సార్వభౌమాధిపత్యం విషయంలో రాజుకు సలహాలనిచ్చే హక్కు సంక్రమిస్తుంది. ఇంతవరకు చెప్పినదంతా బ్రిటిష్‌సామ్రాజ్యం రాజ్యాంగశాసనసారాంశం తప్ప మరేమీ కాదు. ఈ శాసనం పరిణామక్రమాన్ని గురించి, సామ్రాజ్యంలో ఒక భాగం డొమినియన్ హోదా పొందినపుడు దానికి రాజుకు సలహానిచ్చే ప్రత్యేకమైన హక్కు సంక్రమించడం గురించి ఇంతవరకూ చెప్పడం జరిగింది. ఇదే హక్కును డొమినియన్ హోదా పొందిన భారతదేశానికి ఎందుకు నిరాకరించారన్న విషయం అర్థం చేసుకోవడం కష్టం. సహేతుకంగా ఆలోచిస్తే, కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, ఐర్లండ్‌లకు వచ్చినట్టే ఈ హక్కు భారతదేశానికి కూడా లభించింది. ప్రొఫెసర్ హోల్డ్స్‌వర్త్ ఇందుకు భిన్నమైన నిర్ణయం తీసుకోవడానికి, పైన పేర్కొన్న రాజ్యాంగ శాసనంలోని నిబంధనలేవీ దోహదం చేసేవి కావు. నిజానికి ఆయన వాటిని తు.చ. తప్పకుండా అంగీకరిస్తారు. ఆయన భిన్నమైన నిర్ణయం తీసుకోవడానికి కారణం, భిన్నమైన వాదన చేయడం. ప్రొఫెసర్ హోల్డ్స్‌వర్త్ వేసిన ప్రశ్న - రాజు భారత ప్రభుత్వానికి సార్వభౌమాధిపత్యాన్ని దానం చేస్తాడా, బదిలీ చేస్తాడా అన్నది. నిజానికి ఇది కాదు అసలు విషయం. అసలు విషయం ఏమిటంటే, భారత డొమినియన్‌కు సార్వభౌమాధిపత్యం గురించి రాజుకు సలహా ఇచ్చే హక్కు వుందా లేదా అన్నది. మరోరకంగా చెప్పాలంటే, సార్వభౌమాధిపత్యం బదిలీ చేయడం సాధ్యమేనా అన్న ప్రశ్నతో మనకు సంబంధంలేదు. మనకు సంబంధం వున్నదల్లా, సార్వభౌమాధిపత్యాన్ని ఎలా అమలు జరపాలన్నది. ప్రొఫెసర్ హోల్డ్స్‌వర్త్ కనక అసలు విషయం ఇదేనని గుర్తించి వుంటే, ఇటువంటి భిన్నమైన నిర్ణయం తీసుకునేవారు కాదని నా నమ్మకం.

ఇప్పటివరకూ, రాజుగారు భారత ప్రభుత్వానికి సార్వభౌమాధికారం బదిలీ చేయలేరని పేర్కొనే కేబినెట్‌మిషన్ ప్రకటన భాగాన్ని చర్చించాను. ఇప్పుడు రాజుగారు భారత ప్రభుత్వానికి సార్వభౌమాధిపత్యం బదిలీ చేయబోరని తెలిపే ప్రకటనను పరిశీలించవలసి వుంది. కేబినెట్ మిషన్ ప్రకారం, సార్వభౌమాధికారం అంతరించిపోతుంది. ఇది విస్మయం కలిగించే ప్రకటనే కాక, రాజ్యాంగ శాసనంలోని ఒక సుస్థిరమైన సూత్రానికి విరుద్ధంగా వుంది. ఈ సూత్రం ప్రకారం, రాజుగారు తన హక్కులను వదిలిపెట్టడం గానీ, మరొకరికి అప్పగించడం గానీ చేయలేడు. సార్వభౌమాధిపత్యాన్ని బదిలీ చేయలేనట్లే, దాన్ని వదిలిపెట్టలేడు కూడా. ఈ సూత్రం చెల్లుబడిని అంగీకరిస్తూ 1840లో రాణి వర్సెస్ఎదుల్జీ బైరాజీకేసులో ప్రీవీ కౌన్సిల్ సమర్పించింది. మూర్ పి.సి.5, 276వ పుటలో ఛార్టర్ ద్వారా కూడా రాజు తన హక్కును వదిలివేయలేడని స్పష్టం చేశారు. (పు 294) కనక, రాజు సార్వభౌమాధికారం చలాయించడని కేబినెట్ మిషన్‌చేసిన ప్రకటన, బ్రిటిష్‌సామ్రాజ్యాన్ని పరిపాలించే రాజ్యాంగ శాసనానికి విరుద్ధంగా ఉందని వెల్లడౌతున్నది. రాజుగారు సార్వభౌమాధికారాన్ని అమలు జరపవలసిందే. అయితే ప్రత్యేకమైన శాసన వ్యవస్థ అనుమతించిన పక్షంలో రాజు తన ఆధిపత్యం హక్కును మరొకరికి సమర్పించవచ్చు. కానీ సార్వభౌమాధిపత్యాన్ని వదిలిపెట్టడానికి రాజుగారిని అనుమతిస్తూ బ్రిటిష్ పార్లమెంటు శాసనం రూపొందించడం న్యాయబద్ధమూ, సముచితమూ అవుతుందా కాదా అన్నది ప్రశ్న. భారతీయులు, ఇలాంటి శాసనం న్యాయబద్ధమూ కాదు, సముచితమూ కాదని వాదించవచ్చు. దీనికి కారణం సులభంగా గుర్తించవచ్చు. భారతదేశం డొమినియన్ అయిన తర్వాత, సార్వభౌమత్వాన్ని రద్దుచేసే శాసనాన్ని భారత డొమినియన్ పార్లమెంటు ఆమోదించాలే తప్ప, బ్రిటిష్ పార్లమెంటుకు ఆ అధికారం ఉండదు. అలాగే, సార్వభౌమత్వం రద్దుచేస్తూ బ్రిటిష్ పార్లమెంటు ఆమోదించే శాసనం అనుచితమౌతుంది. దీనికి కారణం కూడా స్పష్టమే. సార్వభౌమాధిపత్యానికి కొలబద్ద సైనికాధిపత్యం. ఈ సైన్యం భారతీయ సైన్యం. దాన్ని పోషిస్తూ వచ్చినది బ్రిటిష్ ఇండియానే. బ్రిటిష్ ఇండియా చేత పోషింపబడి, వైస్‌రాయ్, గవర్నర్ జనరల్‌ల ద్వారా రాజుగారికి సేవ చేసిన ఈ సైన్యం లేకపోతే, రాజు తన సార్వభౌమాధిపత్యాన్ని పటిష్టం చేసుకోవడం, పరిరక్షించుకోవడం సాధ్యమయ్యేవి కావు. భారత ప్రజల ప్రయోజనం కోసం రాజు ఒక విశ్వాసం రూపంలో చేపట్టిన ఈ అధికారాన్ని బ్రిటిష్ పార్లమెంటు ఒక శాసనం ద్వారా నిర్వీర్యం చేస్తే, ఒకరకంగా భారత ప్రజల విశ్వాసాన్ని కోల్పోయినట్లే, బ్రిటిష్ రాజుకు భారత సంస్థానాధీశులతో ఒప్పందం ద్వారా సంక్రమించిన అవకాశం సార్వభౌమాధిపత్యం. కనక, స్వతంత్ర భారతదేశం, సార్వభౌమాధికారాన్ని వారసత్వంగా తీసుకునే హక్కును ప్రకటించడం న్యాయమే.

ఈ సందర్భంలో ఒక ప్రశ్న అడగవచ్చు. భారతదేశం స్వతంత్ర దేశం అయిన తర్వాత ఏమౌతుంది?

రాజరికమే అదృశ్యమౌతుంది కనక, రాజుకు సలహాలిచ్చే ప్రసక్తే ఉండదు. స్వతంత్ర భారతదేశం రాజరిక వ్యవస్థలోని ఆధిపత్య హక్కులను వారసత్వంగా పొందుతుందా అంటే దానికి జవాబు అవును, పొందుతుంది. స్వతంత్ర భారతదేశం వారసత్వ దేశమౌతుంది. ఈ ప్రశ్నకు సమాధానం కోసం, దేశాల వారసత్వ హక్కుకు సంబంధించిన అంతర్జాతీయ న్యాయాన్ని పరిశీలించవలసి వుంటుంది. ఓపెన్‌హీమ్ అభిప్రాయంలో ఒక దేశం మరొక దేశం నుంచి అధికారం చేపట్టినపుడు, పూర్వ దేశం అనుభవించిన కొన్ని హక్కులు ఇది కూడా పొందుతుంది. హాల్"అంతర్జాతీయ న్యాయం' ప్రకారం, ఆస్తి, దానికి సంబంధించిన లాభాలు ఒప్పందాల ద్వారా సంక్రమిస్తే, అవి వారసత్వంగా తర్వాతి రాజ్యానికి లభిస్తాయి. భారతదేశానికి కూడా ఇది వర్తిస్తుంది. ఈ విషయంలో హాల్"అంతర్జాతీయ న్యాయం'లోని ఈ క్రింది మాటలు అన్వయిస్తాయి:

"పాత రాజ్యం నిరాటంకంగా తన ప్రతిపత్తిని కొనసాగిస్తున్నపుడు, ప్రత్యేకంగా కోల్పోతే తప్ప, తనకు వ్యక్తిగతంగా లభించిన వాటిని కలిగే వుంటుంది. ఆ విధంగా ఒక ఒప్పందం ద్వారా లభించిన ఆస్తులు, తత్సంబంధిత ప్రయోజనాలు తనకు విడిగాగానీ, తన ప్రజల ద్వారాగానీ లభించినపుడు, అవి కొనసాగుతాయి. అయితే, తను కోల్పోయిన భూభాగానికి సంబంధించిన హక్కులు, అంటే భూభాగం స్వాధీనం, సరిహద్దు విభజన రేఖలకు సంబంధించినవీ, వాటి పరిధిలోని ఆస్తులకు సంబంధించినవి, తద్వారా స్థానిక ప్రాముఖ్యం కలిగినవి, స్థానిక సంస్థల అధీనంలో వున్నవీ, కొత్త రాష్ట్రానికి సంక్రమిస్తాయి."

దీనివల్ల తేలేదేమిటంటే, భారతీయ రాష్ట్రాలు స్వతంత్రం వచ్చిన తర్వాత కూడా అంతకు పూర్వ స్థితినే కలిగి వుంటాయి. ఇప్పుడున్న పరిధివరకూ అవి సర్వాధికారాలూ కలిగి వుంటాయి కానీ, భారతదేశం డొమినియన్‌గా వున్నంత కాలం రాజరిక పాలనకూ, భారతదేశం స్వతంత్రం సంపాదిస్తే, భారత ప్రభుత్వానికీ ఇవి లోబడే వుంటాయి తప్ప, స్వతంత్ర రాష్ట్రాలు కాజాలవు. రాష్ట్రాలు తమ స్వతంత్రాన్ని ప్రకటించుకోవచ్చు. కానీ, ఏదో ఒక సార్వభౌమాధికారం ఉన్నంతవరకు, భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటికీ, భారతదేశంగానీ, మరో విదేశం గానీ తమకు స్వతంత్ర రాష్ట్రం స్థాయిని అంగీకరించదని ఈ రాష్ట్రాలు గుర్తించాలి. భారత రాష్ట్రాలు సార్వభౌమాధిపత్యం నుంచి స్వేచ్ఛ పొందాలంటే సార్వభౌమత్వం, పరదేశాధిపత్యంల (**Sovereignty, Suzerainty**) విలీనం సాధించాలి. సమైక్య భారతావనిలో అంతర్విభాగాలుగా రాష్ట్రాలు ఏర్పడినపుడే ఈ విలీనం సాధ్యమౌతుంది. రాష్ట్రాల ప్రతినిధులకు ఈ విషయం తెలిసే వుండాలి. కానీ వారు మరిచిపోయినట్లు కనిపిస్తోంది కనక, ఆర్‌టిసిలో ఏం జరిగిందో వారికి మరోసారి గుర్తుచేయాలి. ప్రారంభంలో, సమాఖ్యలో చేరడానికి రాష్ట్రాలు సిద్ధంగా లేవు. బట్లర కమిటీ, సార్వభౌమాధిపత్యం అన్నిటికంటె ఉన్నతమైన ఆధిపత్యమని

సిద్ధాంతీకరించినట్లు తెలిసిన తర్వాతే వారు సమాఖ్యలో చేరడానికి అంగీకరించారు. దీనివల్ల, రాజరికంలోని సార్వభౌమాధికారాలు యథాతథంగా సమాఖ్యకు అందచేయడం జరుగుతుందని గుర్తించడం వల్ల వారి ధోరణి మారింది. మనలో చాలా మందికి తెలిసినట్లే, ఆ సమయంలో సంస్థానాధీశులు, సార్వభౌమాధిపత్యం పరిధి నుంచి మొదటి జాబితాలోని అంశాలను మినహాయించాలని, అప్పటి సెక్రటరీ ఆఫ్ స్టేట్‌ని కోరారు. దీనికి అతను జవాబు చెప్పలేక వారిని కసురుకున్నాడు. ఆయన వైఖరి మాటెలావున్నా, సమాఖ్యను విలీనం చేయడం ద్వారా సార్వభౌమాధిపత్యాన్ని బలహీనపరచువచ్చునన్న విషయాన్ని రాజకుమారులు గుర్తించారని మనం గ్రహించాలి. ఈ విషయం ఇప్పటికీ వర్తిస్తుంది. భారత రాష్ట్రాలు ఇప్పటికీ దాన్ని గుర్తించి, స్వాతంత్ర్యం అనే ఎండమావి వెంట పరిగెత్తక పోవడం వివేకమనిపించుకుంటుంది. కనక, సార్వభౌమాధిపత్యం అంతరించిపోతుందన్న కేబినెట్ మిషన్ ప్రకటనను భారత ప్రజలు ఖండించాలి, సార్వభౌమాధిపత్యం అంతరించిందనీ, తాము దానికి వారసులమనీ, దాని అమలును కొనసాగిస్తామనీ, కొన్ని రాష్ట్రాలు బ్రిటిష్ వారు నిష్క్రమించిన తర్వాత కూడా సమైక్య భారతంలో కలవకపోయినప్పటికీ ఇది అమలు జరుగుతుందనీ, భారత ప్రజలు నొక్కిచెప్పాలి. మరోవైపు రాష్ట్రాలు కూడా స్వతంత్ర భారత రాష్ట్రాలుగా తమ ఉనికి ఐదేళ్ళుకూడా మనజాలదని గుర్తించాలి. సంస్థానాధీశులు యూనియన్‌లో చేరి, రాజ్యాంగ అధిపతులు కావడం వారికే లాభదాయకం. యూనియన్‌లో చేరవద్దని వారికి సలహా ఇచ్చే దివాన్‌లు నిజానికి వారికి హాని కలిగిస్తున్నారు. సమాఖ్య విలీనం వల్ల బాధ్యాతాయుత ప్రభుత్వం నెలకొల్పవలసి వచ్చే మాట నిజమే. అయితే దానివల్ల ఒక లాభం వుంది - సంస్థానాధీశులు వంశపారంపర్య హక్కును యూనియన్‌హామీగా ఇస్తుంది. సంస్థానాధీశులు అంతకంటె ఎక్కువ ఎలాగూ ఆశించలేదు. స్వతంత్రంగా వుండాలి, ఐక్యరాజ్యసమితి గుర్తింపును, రక్షణను పొందడం స్వర్గతుల్యం. తమపై భారతదేశ సార్వభౌమాధికారాన్ని గుర్తించని రాష్ట్రాలను ఐ.రా.స. గుర్తిస్తుందా అన్నది సందేహమే. ఒకవేళ గుర్తించినా, ఆ భారత రాష్ట్రాలు మొట్టమొదట బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పరచనిదే, విదేశీ దాడుల నుంచి గాని, అంతఃకలహాల నుంచి గానీ వారిని కాపాడడానికి ఐ.రా.స. ఎటువంటి సహకారం అందించదు. ఈ విషయాలన్నీ స్పష్టంగానే కనిపిస్తున్నాయి. చూపున్నవాడు దాన్ని చదివితీరుతాడు. చదవడానికి నిరాకరించిన వాడికి, స్వప్రయోజనాల కోసం గుడ్డిగా ప్రవర్తించేవారికి పట్టినగతే పట్టగలదు.

# నాలుగో భాగం

# చట్టాలపై వ్యాఖ్యానాలు

1. సాధారణ న్యాయం (కామన్ లా) (Common Law)

2. సామంత రాజ్యాల హోదా (Dominian Status)

3. నిర్దిష్ట ఉపశాంతి చట్టం (The Law of Specific Relief)

4. ధర్మనిధి చట్టము (Law of Trust)

5. కాల పరిమితి చట్టం (The Law of Limitation)

6. బ్రిటిష్ ఇండియాలో నేర ప్రక్రియ చట్టం
   (The Law of Criminal Procedure)

7. ఆస్తి మార్పిడి చట్టం (The Transfer of Property Act]

8. సాక్ష్యచట్టం (The Law of Evidence)

# I. సాధారణ న్యాయం (కామన్ లా)

## సమతా న్యాయంతో సాధారణ న్యాయ సంబంధం

1. బ్రిటిష్ వ్యవస్థలో సమత (ఈక్విటీ) ఒక ప్రత్యేక సాంకేతిక అర్థాన్ని సంతరించుకుంది. అందువల్ల అది సాధారణ న్యాయం నియమాలకంటే భిన్నమైందని మనం అనుకుంటాము.

2. మంచికో చెడుకో బ్రిటిష్ చట్టం రెండు స్రవంతులుగా విభజితం అయింది.

3. అయితే చట్టమూ సమత మధ్య పరస్పర ఆధారిత సంబంధం పూర్తిగా అదృశ్యం కాలేదు.

4. సాధారణ న్యాయమూ సమత ప్రత్యర్థి వ్యవస్థలని మనం అనుకోరాదు. సమత స్వయం నిర్దిష్ట వ్యవస్థ కాదు; సాధారణ న్యాయం ఉనికిని ప్రతి దశలోనూ అది స్పందిస్తుంది.

## సమత న్యాయస్థానం (ఈక్విటీ కోర్టు) లో ఉపశాంతి నియమం.

1. ఛాన్సరీ అభివృద్ధి చేసిన సమత సాధారణ నియమాన్ని మనం పరిశీలించినట్లైతే అది తాత్విక, ఆధ్యాత్మిక అంతరాత్మ భావన అంగీకారంపై రూపొందిందని చెప్పవచ్చు.

2. అంతరాత్మకు సంబంధించిన సాధారణ నైతిక నియమంపై బ్రిటిష్ సమతా భావన వ్యవస్థీకరించబడింది.

3. అయితే ఛాన్సలర్లందరూ ఈ నియమాన్ని ఒకే విధంగా అనుసరిస్తున్నారని చెప్పలేము. ట్యూడర్ల హయాంలో వారిలో కొందరు పూర్తిగా తమ చిత్తం వచ్చినట్టుగా వ్యవహరించారు. అందువల్లనే సెల్డన్, చాన్సలర్ పాదం పొడుగును బట్టి అతడు వ్యవహరించేవాడని వ్యాఖ్యానించటం జరిగింది! అయితే అంతరాత్మ ప్రబోధం చాలా వరకూ చాన్సలర్‌ను అతని ఇష్టాయిష్ట నిర్ణయం కంటే ఎక్కువ స్థిరంగా ఉంచే ఒక కఠిన ప్రక్రియ ప్రారంభం అయింది. 1676 నాటికి లార్డ్ నాటింగ్ హామ్ చాన్సలర్‌కు అంతరాత్మ సహజమైన భావన అనే వాదాన్ని ఖండించారు. 1818లో లార్డ్ సెల్డన్ న్యాయమూర్తి వ్యక్తిగత నిర్ణయం సమత న్యాయమూర్తి వ్యాఖ్యానానికి అతీతంగా ఉంటుందన్నాడు. అప్పటి నుంచి సమత అంతరాత్మ భావనగా స్థిరపడింది.

## చాన్సలర్ అధికారానికి పరిధులు

1. ఉపశాంతిని కల్పించటానికి ఉన్న అధికారం ఈ క్రింది పరిమితులకు లోబడి ఉంటుంది:-

(i) చట్టం హక్కులను కల్పించని సందర్భాల్లోనే అంతరాత్మ ప్రబోధం ప్రకారం హక్కులు ఉండాలని భావించినప్పుడు దీనిని ఉపయోగించవచ్చు. సమతకు ప్రత్యేకించిన పరిధి ఇది.

(ii) అంతరాత్మ ప్రకారం చట్టం హక్కులు కల్పించిన సందర్భంలో న్యాయం పొందటానికి సంతృప్తికరమైన అవకాశాలు లేనప్పుడు దీనిని ఉపయోగించవచ్చు. దీనిని సమత ఉమ్మడి పరిధి అంటారు.

(iii) అంతరాత్మ హక్కులను కల్పించినప్పటికీ న్యాయం పొందటానికి అవకాశాలు ఉన్నప్పటికీ ప్రక్రియ లోపభూయిష్టం అవటం వల్ల న్యాయం సమకూరదు అని భావించినప్పుడు దీనిని ఉపయోగించవచ్చు. దీనిని అనుబంధ అధికార పరిధి అంటారు.

## సమత హక్కు స్వభావం

(1) నైతిక హక్కు, చట్టబద్ధమైన హక్కుకు వ్యత్యాసంగా అధ్యయనం చేసినట్లైతే సమత హక్కు స్వభావం అర్థం చేసుకోవటం సాధ్యమవుతుంది. కేవలం నిర్వచనం ఒక్కటే ఎక్కువ ఉపయోగకరంగా ఉండదు.

(2) ఉపోద్ఘాతంగా హక్కును గురించి ఒక ఖచ్చితమైన భావనతో ప్రారంభిద్దాము. ప్రతి వ్యక్తి హక్కు కలిగి ఉన్నాడనటంలో అర్థం ఏమిటి?

(i) ఒక వ్యక్తి స్వయం ప్రేరితం ద్వారా తను చేయదలుచుకుంది చేసినప్పుడు లేదా ఇతరుల చర్యలను ప్రభావితం చేసినప్పుడు అతనికి అతని ఇష్టప్రకారం చేయటానికి "శక్తి" ఉందని చెప్పవచ్చు.

(ii) అతనికి ఈ "శక్తి" ఉన్నా లేకపోయినా ప్రజాభిప్రాయం అతడికి సదరు ఇష్టప్రకారం వ్యవహరించటానికి ఉందని భావించినప్పుడు దానికి వ్యతిరేకత ఏర్పడినప్పుడు దానిని ప్రతిఘటించినప్పుడు అతడికి తన ఇష్టాన్ని అనుసరించటానికి "నైతిక హక్కు" ఉందని చెప్పవచ్చు.

(iii) ప్రజాభిప్రాయం ఆమోదించినా, లేక ఆమోదించక పోయినా "రాజ్యం" అతడికి తన ఇష్టానికి అనుగుణంగా వ్యవహరించటానికి మద్దతునిచ్చినట్లైతే అది అతడి "చట్టబద్ధమైన హక్కు" అవుతుంది.

(3) బలానికి సంబంధించిన ప్రశ్న అయినప్పటికీ అది వ్యక్తి శక్తి లేదా ప్రోద్బలంపై ఆధారపడి ఉంటుంది. నైతిక హక్కు ప్రజాభిప్రాయం సమర్థనపై ఉంటుంది. చట్టబద్ధమైన హక్కు రాజ్యం దానిని సమర్థించి అమలుజరిపే దానిపై ఆధారపడి ఉంటుంది. వ్యవస్థాపిత సమాజంలో ఒక చర్యను ఆమోదించి మరో చర్యను నిషేధించటం ద్వారా చట్టబద్ధమైన హక్కు కొనసాగుతుంది. అందువల్ల రాజ్యం గుర్తింపు, రక్షణపై చట్టబద్ధ హక్కు ఉనికి ఉంటుంది. హక్కు అమలు విధి, ఈ విధిని విస్మరిస్తే అది తపు అవుతుంది.

## చట్టబద్ధ హక్కు లక్షణాలు

1. నైతిక హక్కుకు భిన్నంగా రాజ్యం అమలుపరిచే హక్కు చట్టబద్ధమైన హక్కు.

2. చట్టబద్ధమైన హక్కు చట్టం గుర్తించిన పద్ధతిలో ఒక శీర్షిక క్రింద ఉంటుంది. దానిని చట్టం గుర్తించిన ప్రక్రియ ప్రకారం సంపాదించుకోవాలి. ఉదాహరణకు కబ్జా, ప్రిస్క్రిప్షన్, ఒప్పందం, వారసత్వం మొదలైనవి.

3. స్వత్వాన్ని సృష్టించే అంశం ఒక వ్యక్తికి సొంతదారు హక్కును కల్పిస్తూ అదే హక్కుకు సంబంధించిన స్వత్వాన్ని మరొకరికి రద్దు చేస్తుంది.

4. చట్టబద్ధమైన హక్కు ఒక బాధ్యతను సృష్టిస్తుంది. ఆ బాధ్యత వ్యక్తిగతమయింది కావచ్చు, సమాజపరమైంది కావచ్చు.

## చట్టబద్ధమైన హక్కుతో సమత హక్కుకు ఏ విషయంలో సామ్యం ఉంటుంది? ఎందులో వ్యత్యాసంగా ఉంటుంది?

1. సమత హక్కు రాజ్యం అమలుపరచలేని నైతిక హక్కు వంటిది కాదు. అది రాజ్యం అమలుపరిచే చట్టబద్ధమైన హక్కు వంటిది.

2. చట్టబద్ధమైన హక్కును సృష్టించే ప్రక్రియ ద్వారా సమత హక్కును ఏర్పాటు చేయనవసరంలేదు. ఈ రెండు హక్కులకు మధ్య ఉన్న ముఖ్య వ్యత్యాసం ఇదే.

**ఉదాహరణలు**

**(i)** భూమిని చట్టబద్ధంగా తాకట్టు పెట్టాలంటే దానికి ఒక అంగీకార పత్రం అవసరం. సదరు పత్రం లేకుండా సమత తాకట్టును ఏర్పాటు చేసుకోవచ్చు.

(అ) లిఖిత రూపంలో ఒప్పందం ఉంటే తప్ప వ్యాపార చట్టం ఏ భూమి తాలూకు అమ్మకాన్ని, లేదా ఒప్పందాన్ని అంగీకరించదు.

అయితే అప్పు తీసుకున్న వ్యక్తి భూమి హక్కు పత్రాన్ని (టైటిల్ డీడ్) రుణదాతగా దఖలుచేసినట్లైతే సదరు దఖలు ఏ ఇతరత్రా పత్రాలు లేకపోయినప్పటికీ రుణదాతకు అప్పుచేసిన వ్యక్తిని బద్ధుడను చేస్తుంది.

(ఆ) రుణదాతకు రుణం తేదీ వరకు తాకట్టుపెట్టి అద్దె పొందవచ్చునని అంగీకరించినట్లయితే అది సమతా తాకట్టు అవుతుందేకాని చట్టపరమయిన తాకట్టు కాదు.

**(ii)** మరొకరికి కేటాయింపు చట్టపరమైన, సమత పరమైన:

(1) చట్టపరమైన కేటాయింపు లిఖిత రూపంలో కేటాయించిన వ్యక్తి సంతకంతో ఉండాలి - అతని ప్రతినిధి సంతకం సరిపోదు.

(2) కేటాయింపు పత్రం రుణదాతకు రుణగ్రస్తుడు చెల్లించేలా నిర్దేశనం ఉండాలి.

(3) రుణగ్రస్తుడు స్పష్టంగా కేటాయింపు గురించి ఒప్పందంలో ప్రకటించాలి.

సమతాపరమైన: **(i)** కక్షిదారుల ఉద్దేశం స్పష్టంగా ఉంటే ఒప్పందం ఏ రూపంలో ఉన్నా సరిపోతుంది.

**(iii)** ఛార్జ్ చట్టబద్ధమైన మరియు సమతాపరమైన

**(iv)** లీజ్ సమత మరియు చట్టపరమైన

**(v)** చాకిరి (సెర్విట్యూడ్) సమత మరియు చట్టపరమైన

## వివాహిత స్త్రీల ఆస్తి

చట్టపరమైన మార్పిడి లాంఛనాలు లేకుండా ఏవిధంగా సమత హక్కు ఏర్పడుతుందో ఈ ఉదాహరణ సూచిస్తుంది.

(1) సాధారణన్యాయంలో భర్త భార్య ఒకే పరిమాణంగా, భార్య హోదా - భర్తతో మిళితమైనట్లుగా ఉంటుంది. ఫలితంగా భర్త భార్య వ్యక్తిగత ఆస్తిరి కూడా పూర్తి వారసుడై ఆమె సంపదను నిర్వహించి నియంత్రిస్తాడు.

ఆమె మరణానంతరం అతడు ఆమె ఆస్తికి పూర్తి హక్కుదారుడు అవుతాడు. ఆమె జీవిత కాలంలో ఆమె ఆస్తి అమ్మకపోయినట్లైతే లేదా ఆమెకు సంతతి లేకపోతే సదరు ఆస్తి అతనికే చెందుతుంది.

(2) భర్త భార్యతో ఒప్పందానికి రావటం కానీ లేదా ప్రత్యక్షంగా కొంత భాగం ఇవ్వటానికికానీ అవకాశం లేదు. ఎందుకంటే భార్యాభర్తలు ఒక ఉనికి కలిగి ఉన్నారు కాబట్టి.

(3) సాధారణ న్యాయం ప్రకారం వివాహానంతరం భర్తకు భార్య సంపద బదలాయించబడుతుంది.

(4) "ఆమె ప్రత్యేక, పూర్తి ఉపయోగం కోసం" అని ప్రత్యక్షంగా లేదా పరోక్షంగా సూచించే విధంగా ఆస్తిని వివాహిత స్త్రీకి ఇచినట్లైతే సమత సదరు ఆస్తిపై భర్త నియంత్రణను తొలగిస్తుంది. సదరు సంపదను ఆమెకే పూర్తిగా బదలాయించటం జరుగుతుంది.

అయితే సమత దీనికి మించి ముందు వెళుతుంది. భర్త భార్యను ప్రోత్సహించి ఆమె ప్రత్యే ఆస్తిని తన పేరిట మార్పిడి చేయిస్తాడన్న భావనతో "సదరు చర్యను నిరోధించటానికి" అనే వాక్యాన్ని వివాహానికి సంబంధించిన ఖరారు నామాల్లో చేర్చడం జరిగింది. అటువంటి పరిమితి ఫలితంగా స్త్రీ తనకు దఖలు పరిచిన సంపదను అనుభవించటానికి పూర్తి అవకాశం కలిగి ఉంటుంది కానీ దాని అన్యాక్రాంతం చేయటానికి ఆమెకు అధికారం లేదు. ఆమె దానిని ఉపయోగించుకోవచ్చు కా అమ్మటానికీ, తాకట్టు పెట్టటానికీ వీలులేదు. ఇది సాధారణ న్యాయానికి పూర్తిగా వ్యతిరేక ఎందుకంటే సాధారణ న్యాయం ప్రకారం వివాహానంతరం భార్య తాలూకు ఆస్తిపై భర్తకు పూ అధికారాలు సంక్రమిస్తాయి. భార్యతో కానీ లేదా మరో వ్యక్తితో కానీ చేసుకొన్న ఏ ఒప్పందం అత సదరు ఆస్తిపై ఉన్న అధికారాన్ని అన్యాక్రాంతం చేయలేదు. పై ఉదాహరణ సమత హక్కు చట్టబద్ధ హక్కుకంటే భిన్నంగా ఏవిధంగా ఏర్పడుతుందో తెలియజేస్తుంది.

(3) ఈ క్రింది విధంగా చట్టపరమైన హక్కుకూ సమత హక్కుకు మధ్య ఉన్న వ్యత్యాసాన్ని వివరించవచ్చు.

1. ఒక సొంతదారునికి లభించిన చట్టబద్ధమైన హక్కు, పాక్షికంగా కానీ పూర్తిగా కానీ ఇంతకు ముందు ఉన్న హక్కుదారుని హక్కును రద్దుచేస్తుంది. ఇది పాక్షికం లేదా పూర్తిగా కావచ్చు. లీజ్‌కు సంబంధించినది అయితే సదరు హక్కు పాక్షికంగా నశిస్తుంది. అమ్మకానికి సంబంధించినదైతే అది పూర్తిగా ముందు వ్యక్తి హక్కును రద్దు చేస్తుంది. అది పూర్తి లేదా

పాక్షిక రద్దు అయినా హక్కును నశింపజేస్తుంది. అందుకే ఒకరికి స్వత్వాన్నిచ్చే అంశం మరొకరి స్వత్వాన్ని తొలగించే అంశం కూడా అవుతుందని అంటారు.

2. అయితే చట్టబద్ధ హక్కుకూ సమతా హక్కుకూ మధ్య పోటీ ఉన్నప్పుడు ఇది జరగదు. సమతా హక్కు చట్టబద్ధమైన హక్కుదారుని హక్కును అమలులోకి రాకుండా నిరోధించగలదే కానీ సదరు హక్కును మాత్రం రద్దుచేయలేదు. ఒక చట్టబద్ధమైన హక్కు మరో చట్టబద్ధమైన హక్కును నాశనం చేసినట్లు సమతా హక్కు చట్టబద్ధమైన హక్కును నాశనం చేయలేదు.

3. ఇట్లా ఎందుకు ఉంది? దీనిని తెలుసుకోవాలంటే ఛాన్సరీ ప్రారంభంలో సమతా హక్కు ఏవిధంగా గుర్తింపు పొందిందో తెలుసుకోవటం అవసరం. దీని చరిత్ర నేపథ్యం ఈ క్రింది విధంగా క్లుప్తంగా చెప్పవచ్చు:-

(i) నార్మన్ దండయాత్రకు ముందు ఇంగ్లండ్‌లో ఒక వ్యక్తి మరో వ్యక్తి తరపున ఏదైనా చర్య తీసుకోవటం సాధారణమైనదే. ఉదాహరణకు యోధుడు యుద్ధాలకు వెళ్ళినప్పుడు షరీఫ్ భూములను స్వాధీనం చేసుకునే వాటిని ఆ యోధుని భార్య, పిల్లల తరపున తన అధీనంలో ఉంచుకోమనేవాడు. క్రమంగా అధీనం స్థానంలో వినియోగం అనే వాడుక ప్రవేశించి సదరు బదలాయించిన భూమిని "వినియోగంలోకి తెచ్చిన భూమి" అని వ్యవహరించేవారు.

(ii) కొన్ని పరిస్థితుల్లో కొంత మంది వ్యక్తులు మరొకరి తరపున వ్యవహరించడం జరిగితే ఒక వ్యక్తి మరొకరి పక్షాన భూములను ఎందుకు ఉపయోగించుకోరాదన్న ప్రశ్న సహజంగానే ఉత్పన్నమవుతుంది. నిజానికి ఇదే కాలక్రమంలో జరుగుతూ వచ్చింది. ''ఏ'' అనే కౌలుదారుడు ''బి'' అనే వ్యక్తికి సాధారణ న్యాయం ప్రకారం తన భూమిని బదలీ చేస్తాడు. 'ఏ' తన పేరిట ఉన్న భూమిని బదలీ చేసినట్లు భావించడం జరిగింది. 'బి' సదరు భూమిని స్వాధీనం చేసుకొని 'ఏ' తరపున వినియోగించడం జరుగుతుంది.

అటువంటి సందర్భాల్లో బికి కొన్ని షరతులతో భూమిని దాఖలు పరిచినట్లుగా భావించి ''ఏ'' తరపున 'బి' సదరు భూమిని ఉపయోగించుకొంటున్నట్లుగా అనుకోవడం జరుగుతుంది.

(iii) ఇటువంటి ఆచారం అమలులోకి రావటానికి అనేక కారణాలున్నాయి. ఇటువంటి పద్ధతిని అనుసరించటానికి ఆరు కారణాలు కనిపిస్తాయి. వాటిలో రెండు చాలా ముఖ్యమైనవి:-

1) సాధారణ న్యాయం కింద భూమి బదలాయింపుపై ఉండే అనవసర భారాలు తప్పించే వీలవుతుంది. కౌలుదారుడిపై కామన్ లా ఈ కింది భారాలను మోపుతుంది.

(i) ఉపశాంతి: పాత కౌలుదారుడు మరణించినపుడు కొత్త కౌలుదారుడు చెల్లించే మొత్తం.

(ii) సహాయం: మూడు సందర్భాల్లో చెల్లించవలసి ఉంటుంది-

(అ) జైలుశిక్ష విధించినపుడు ప్రభువుకు చెల్లించవలసిన మొత్తము.
(ఆ) ప్రభువు తన పౌరుడిని యోధునిగా చెయ్యాలని కోరుకున్నప్పుడు.
(ఇ) వరకట్నంతో సహా తన పెద్ద కుమార్తెను ప్రభువుకు ఇవ్వవలసిన అవసరం ఏర్పడినప్పుడు.

(iii) ప్రభుత్వపరం కావడం: కౌలుదారుడు చేసిన నేరం దొంగసొత్తును దాచినంత తీవ్రమైనప్పుడు ఆ భూమి ప్రభుత్వపరమవుతుంది..

(iv) సంరక్షకుడు: ఒక కౌలుదారుడు మరణించినప్పుడు అతని వారసుడైన కుమారుడు 21 సంవత్సరాలలోపు వయస్సులో ఉన్నప్పుడు, అతని కుమార్తె 14 సంవత్సరములోపు ఉన్నప్పుడు ఆ వారసుని తరపున ప్రభువు సదరు వారసుని భూమికి సంరక్షకుడు అవుతాడు. అటువంటి సందర్భంలో ఎటువంటి పరిమితులు లేకుండా సదరు ప్రభువు సదరు భూములను యథేచ్ఛగా లెక్కలు చూపనవసరం లేకుండా వారసుడి మైనారిటీ తీరేంతవరకూ అనుభవించవచ్చు.

(V) వివాహం: శిశువుకు సరైన సంబంధం ఖాయం చేయటం ప్రభువు కర్తవ్యం. శిశువు సదరు వివాహాన్ని వ్యతిరేకిస్తే ప్రభువుకు పరిహారం చెల్లించవలసి ఉంటుంది. కౌలుదారుడు తన భూమిని ఉపయోగించటం ద్వారా స్వేచ్ఛను పొందుతాడు. సదరు భూమిని పొందిన వ్యక్తిపై బాధ్యత పడుతుంది.

(2) రెండవ ప్రయోజనం ఏమిటంటే భూమిని కోల్పోయే ప్రమాదం, ప్రభుత్వపరమయ్యే ప్రమాదం ఉండదు.

సాధారణ న్యాయం క్రింద ఒక కౌలుదారుడు దేశద్రోహం నేరానికి పాల్పడినా అతనికి శిక్ష పడినా లేదా బానిస అయినా అతని భూమి ప్రభుత్వపరం అవుతుంది. అయితే అటువంటి కౌలుదారుడు నేరం చేయటానికి ముందు తన భూములను తనకు నమ్మకమైన వ్యక్తులకు అప్పగించటం ద్వారా సదరు నష్టాన్ని తొలగించుకోగలుగుతాడు. అతడు శిక్షను అనుభవించినప్పటికీ కనీసం అతని కుటుంబ సభ్యులు అనాధలు కాకుండా ఉంటారు.

## భూములను ఉపయోగంలోకి తీసుకురావటం వల్ల కలిగే చట్టపరమైన పరిణామాలు:-

(i) భూములను ఉపయోగంలోకి తీసుకురావటం ద్వారా ఏర్పడే చట్టపరమైన పరిణామాలను గమనించటం అవసరం. సాధారణ న్యాయం క్రింద సదరు భూమి ఉపయోగానికి సంబంధించిన వ్యవహారాలన్నీ తొలగించడం జరుగుతుంది. తన భూమిని ఇతరులకు బదిలీ చేయటం వల్ల ఒక వ్యక్తి సాధారణ న్యాయం కల్పించే హక్కులను- ఆ భూమిపై- కోల్పోతాడు. భూమిపోతే అతడు చట్టం దృష్టిలో ఏమీకాడు; భూమిని పొందిన వ్యక్తి/ వ్యక్తులు గుర్తింపు పొందుతారు. చట్టంపై ఆధారపడకుండా తన సన్నిహితుల విశ్వాసంపై (వారికి భూమిని దఖలు పరచడం వల్ల) ఆధారపడతాడు.

(ii) భూమిని పొందిన వ్యక్తి తన బాధ్యతలను విస్మరించినట్లైతే లేదా తన ప్రయోజనం కోసం సదరు భూమిని అన్యాక్రాంతం చేసినట్లైతే అతనిపై సాధారణ న్యాయం క్రింద ఎటువంటి చర్య తీసుకోవటం సాధ్యం కాదు.

(iii) కౌలుదారుడు తన భూమిని కొన్ని ఉపయోగాలకు మాత్రమే మరొకరికి దఖలు పరిచినప్పుడు సదరు వ్యక్తి తన బాధ్యతలను నిర్వహించటంలో విఫలం అయిన దశలో అతనిపై కౌలుదారుడు చర్యలు తీసుకొనవచ్చు. లేదా తమ భూమిని ఎప్పుడైనా ఒప్పందాన్ని రద్దుచేసి తిరిగి స్వాధీనం చేసుకోవచ్చు.

(5) ఛాన్సరీ కోర్ట్ హక్కుదారుడి అధికారాలను కాపాడటానికి కల్పించిన పద్ధతుల స్వభావాన్ని అర్థం చేసుకోవలసి ఉంటుంది.

(i) సాధారణ న్యాయం విచారణ అధికార పరిధిలోకి ఛాన్సలర్ జోక్యం చేసుకోలేడు. భూమికి సంబంధించిన పట్టాదారుడి పట్టా పక్కాగా ఉన్నందువల్ల భూమి వ్యవహారంలో ఛాన్సలర్

ప్రత్యక్షంగా వ్యవహరించలేడు. సాధారణ న్యాయం క్రింద పట్టాదారుడు భూమి యజమాని అన్న విషయాన్ని భూమిని మరొకరికి సదరు పట్టాదారుడు పక్కాగా బదీలి చేసినందువల్ల అతని ఆ భూమిపై అతడు తన యాజమాన్యాన్ని కోల్పోడనే విషయాన్ని ఛాన్సలర్ విస్మరించలేడు.

(ii) హక్కుదారుడి నుండి హక్కు స్వీకర్తకు భూమిపై ఉన్న చట్టబద్ధమైన హక్కును ఛాన్సలర్ గుర్తిస్తాడు అయితే ఈ సందర్భంలో సదరు హక్కు స్వీకర్తతో ఆయన ఈ విధంగా అంటాడు:-

''నీకు చట్టబద్ధమైన హక్కు ఉంది. నీ హక్కును నేను హరించను. కాని హక్కుదారుడు ఈ హక్కును నీకు బదలాయించడానికి చేసుకున్న అవగాహనకు భంగకరంగా నీ హక్కును వాడేందుకు నేను అనుమతించను.

(iii) సాధారణ చట్టం చట్టబద్ధమైన యజమానిగా గుర్తించిన హక్కును ఛాన్సలర్ అది వదిలిపెట్టిన అంశాన్ని పరిగణనలోకి తీసుకోగలదేకానీ సదరు హక్కు భంగం కలిగించలేదు. భూమిపై ప్రత్యక్ష నియంత్రణ చేయలేదు. కేవలం సదరు హక్కును హక్కుదారుడు కొన్ని పరిమితులకు లోబడి వినియోగించుకొనేటట్లు క్రమబద్ధం మాత్రమే చేయగలదు. భూమి చట్టబద్ధ యజమాని సదరు భూమిని ఉపయోగించుకోటానికే దాని విక్రయానికే పూర్తి హక్కును కలిగి ఉంటాడు. అయితే భూమిని ఉపయోగించుకోటానికి తీసుకున్న వ్యక్తి పట్ల కొన్ని షరతులను అనుసరించేట్లు భూమి యజమానిని ఛాన్సలర్ ఆదేశించవచ్చు.

(6) ఈ విధంగా చట్టబద్ధమైన హక్కుకు సమత హక్కుకు మధ్య వ్యత్యాసాన్ని మనం గుర్తించాలి. ఒక చట్టబద్ధమైన హక్కు మరొక చట్టబద్ధమైన హక్కును నాశనం చేస్తే సమత హక్కు చట్టబద్ధమైన హక్కును పూర్తిగా కానీ పాక్షికంగా కానీ పరిహరింపలేదు.

7. ఆర్టికల్ 11లో స్టొహన్ ఇచ్చిన వివరణ కూడా దీనిని సమర్థిస్తున్నది. ఆస్తి నుంచే చట్టబద్ధమైన హక్కు ప్రయోజనం ఏర్పడుతుంది; సమత హక్కు లేదా ప్రయోజనం చట్టబద్ధమైన ప్రయోజనం నుంచే ఏర్పడుతుందే కానీ ఆస్తి నుంచి కాదు.

ఛాన్సలర్ సమతా యజమాని ఆస్తి స్వాధీనం హక్కును గుర్తించకపోవడం వల్ల ఈ పరిస్థితి ఉంది. సదరు హక్కు చట్టబద్ధమైన యజమానికే ఉంది. అయితే సమతా హక్కుదారునికి చట్టబద్ధమైన

హక్కుదారునిపై కొన్ని షరతులను విధించటానికి అవకాశం ఉంది కానీ అతనికి ఆస్తినే పొందగోరే హక్కును మాత్రం కల్పించలేదు.

ఉదాహరణ (1918) 2 కె.బి. (జూనియర్) 353 గ్రాహం Vs మెకాల్‌వైయిన్

దీని నుంచి ఏర్పడే పర్యవసానాలు ఈ విధంగా ఉంటాయనవచ్చు:-

(i) ఎందుకంటే సమత హక్కు చట్టబద్ధమైన హక్కు నుంచే ఏర్పడుతుంది. కానీ ఆస్తి నుంచి కాదు.

(ii) అది చట్టబద్ధ ఆస్తికి సంబంధించి ఏర్పడుతుందే కానీ దానికి మించి ప్రబలంగా ఉండదు.

ఉదాహరణ: భూమిని రాముకు, సోము వాడుక కోసం, సోము వారసుల కోసం ఇచ్చారు. రాము చట్టపరమైన యజమాని అవుతాడు. సోము సమత యజమాని అవుతాడు. కానీ భూమిని రాముకు ఇచ్చారు కానీ సోముకు, సోము వారసులకు కాదు. అందువల్ల రాము మరణానంతరం రాము చట్టబద్ధమైన హక్కు అదృశ్యమవుతుంది. రాము చట్టబద్ధమైన హక్కు లాగే సోము సమత హక్కు కూడా అదృశ్యమవుతుంది. చట్ట సంబంధ ప్రయోజనం నుంచి ఏర్పడే సమత హక్కు చట్టబద్ధ ప్రయోజనం గతిస్తే గతిస్తుంది. (1914) సిహెచ్. 300.

(ii) చట్టబద్ధమైన హక్కు పరిమితులకు సమత హక్కు కూడా లోబడి ఉంటుంది. (ఎ) వీలునామా వ్రాయకుండా మరణిస్తాడు. (బి), (సి) అతని కుమారులు (బి) పెద్ద కొడుకు. (బి) దూరంగా ఉండడం వల్ల (సి) ఆస్తిని స్వాధీనం చేసుకుని (డి)కి, అతని భార్య (ఇ) ఉపయోగం కోసం సదరు ఆస్తిని బదలాయిస్తాడు.

(బి) తిరిగి వచ్చాక తన ఆస్తిని అడుగుతాడు. (డి) చట్టబద్ధ హక్కు రద్దవుతుంది. ఎందుకంటే (సి) హక్కులో లోపం ఉండటం వల్ల.

(ఇ) అంటే 'డి' భార్య సమత హక్కు కూడా రద్దవుతుంది.

III చట్టబద్ధమైన హక్కుకూ సమతా హక్కుకూ మధ్య మూడో వ్యత్యాసం ఏమిటంటే చట్టబద్ధమైన హక్కు వ్యక్తిగతమైనది లేదా ప్రజాపరమైనది కావచ్చు. అయితే సమతా హక్కు ఎప్పుడూ వ్యక్తిపరమైనదే. సమతా యజమానిని ఎవరు ఖచ్చితంగా గౌరవించాలి? దీనిని చట్టబద్ధమైన హక్కుదారుడే కాపాడాలి కాని ఇతర ప్రజలెవరూ కాదు.

మొదట చట్టపరమయిన యజమానికి వ్యతిరేకంగా సమతా హక్కు ఏర్పడకపోయినా, ఆ హక్కు బదిలీ అయిన ప్రతి చట్టపరమైన యజమాని సమతా హక్కుకు కట్టుబడి ఉండాలి. సమతా హక్కు వ్యక్తిగతమయింది. కేవలం చట్టపరమయిన యజమానిని మాత్రమే అందుకు బద్ధుడిని చేస్తుంది.

వివరణ:- ''సమతా హక్కులు ప్రజాపరమయిన చట్టబద్ధమైన హక్కులను పోలి వుంటాయి.''

**(i)** చట్టబద్ధమైన ప్రజాపరమయిన హక్కులు సమతా హక్కులను పోలి వుండడం నిజమే.

**(ii)** అయితే ఈ పోలిక ఎలా ఏర్పడుతుంది.

**(i)** సమతా హక్కు చట్టబద్ధమైన హక్కుదారునికి వ్యతిరేకంగా మాత్రమే అమలు అవటమే కాకుండా ఈ క్రింద పేర్కొన్న వ్యక్తులకు వ్యతిరేకంగా కూడా అమలు అవుతుంది.
**(a)** అతని ప్రతినిధులు, అతని ద్వారా హక్కులను కొందరు స్వచ్ఛందంగా కోరినపుడు.
**(b)** చట్టబద్ధమైన హక్కులను సంపాదించిన వ్యక్తులు.

1. చట్టబద్ధ హక్కు పరిజ్ఞానంతో

2. సదరు పరిజ్ఞానం కలిగివున్న వారికి వ్యతిరేకంగా

3. ఛాన్సరీ న్యాయస్థానం సూచించిన పరిజ్ఞానం స్థాయి ఎంత ఎక్కువగా ఉందంటే ఏ వ్యక్తి కూడా తప్పించుకోలేడు. ప్రతి కొనుగోలుదారుడు బద్ధుడు అవ్వవలసిందే.

## సమతా ప్రాథమ్యాలు

1. సమతా హక్కు వ్యక్తిపరమయిన హక్కు. అది చట్టబద్ధమైన హక్కు నుంచి ఉద్భవించి సదరు హక్కుదారునికి వ్యతిరేకంగా అమలులోకి వస్తుంది.

2. ఒకే చట్టబద్ధమైన హక్కు నుంచి రెండు సమతా హక్కులు ఉద్భవించవచ్చు. రెండు హక్కులు చట్టబద్ధ హక్కుదారునికి వ్యతిరేకంగా పనిచేస్తూ సదరు హక్కు నుంచి ఏర్పడినటువంటివే.

3. **సమతా హక్కు వ్యక్తిపరంగా చట్టబద్ధమైన హక్కు నుంచి ఏర్పడుతుంది. చట్టపరమయిన హక్కుకు ఆస్తి ఆధారం. అయితే సమతా హక్కు ఆస్తికి సంబంధించినదిగా నిలబడలేదు.**

ఎందుకంటే చట్టబద్ధమైన హక్కులు మరొక హక్కుదారునకు బదిలీ చేయటంతో సమతా హక్కు దానికి వ్యతిరేకంగా నిలబడలేదు. లేదా పై బదిలీ ద్వారా మరొక సమతా హక్కు ఉద్భవించినప్పుడు అది ఇంతకుముందున్న సమతా హక్కును పడగొట్టవచ్చు.

4. ఇక్కడ పరిశీలించవలసిన ప్రశ్న ఏమిటంటే ఏ సందర్భంలో అటువంటి బదిలీ ఒక సమతా హక్కును ఓడిస్తుంది?

5. సమాతా ప్రాథమ్యాలు అనే శీర్షిక కింద సాధారణంగా ఈ అంశాన్ని చర్చించడం జరుగుతుంది. దీనిని ఈ విధంగా ఎందుకు రూపొందించారంటే ఇక్కడ సమయానికి ప్రాధాన్యత ఇవ్వటం ద్వారా సమస్యను నిర్ధారణ చేయటం జరుగుతుంది కాబట్టి. కాని అసలు విషయం ఏమిటంటే ఇటువంటి వివాదాలలో ఒక చట్టబద్ధమైన హక్కును బదిలీ చేయటం ద్వారా లేదా మరొక సమతా హక్కును సృష్టించటం ద్వారా సమతా హక్కు అమలులోకి రాకుండా వుంటుందో పరిశీలించటం.

6. పరిశీలించవలసిన వివాదాలను రెండు విధాలుగా వర్గీకరించవచ్చు.

   1. చట్టబద్ధమైన హక్కుకూ సమతా హక్కుకూ ఘర్షణ వున్న వివాదాలు.

   2. రెండు సమతా హక్కుల మధ్య ఘర్షణ ఏర్పడే వివాదాలు.

7. మొదటి వర్గానికి చెందిన వివాదాలలో ఉద్భవించే రెండు పరిస్థితుల వ్యత్యాసాలను తప్పనిసరిగా గుర్తించాలి.

   1. చట్టబద్ధమైన హక్కుకు ముందే సమతా హక్కు అమలులో వచ్చే సందర్భం.

   2. చట్టబద్ధమైన హక్కు ఏర్పడిన అనంతరం సమతా హక్కు ఉద్భవించే సందర్భం.

శ్రీమతి తారండికే లబ్ధికోసం ఏర్పడిన ట్రస్ట్ నిధికి 'సి' అనే వ్యక్తి ధర్మకర్త. ఆమె వేసిన వ్యాజ్యంలో న్యాయస్థానం తారండికే నిధికి చెందవలసిన మొత్తాన్ని న్యాయస్థానానికి బదిలీ చెయ్యాలని ఆ నిధిని న్యాయస్థానం పాలకుడు నిర్వహిస్తారని న్యాయస్థానం సదరు ధర్మకర్తను ఆదేశించింది. ఏ ధర్మకర్తలకు వ్యతిరేకంగా ఉత్తర్వులు జారీ అయ్యాయో వారు వ్యక్తిగతమైన పరిమితి లేకుండా తమ కర్తవ్యాలను అక్రమంగా నిర్వహిస్తున్నట్లు సదరు నిధిని న్యాయస్థానానికి దఖలు పరచడంలో తమ బాధ్యతను నిర్వహించినట్లు మూడో పక్షంగా వున్న వ్యక్తులను

నష్టపరిచినట్లు కనిపించింది. నష్టపడినటువంటి మూడో పక్షం తారండికే పేరు మీద వున్న నిధిని తమకు బదిలీ చెయ్యాలని అభ్యర్థించింది. వాదం - చట్టబద్ధమైన పట్టా శ్రీమతి తారండికి లేదు. కాబట్టి ఆమె హక్కు అమలు కాదు. ఈ వాదాన్ని అనుమతించలేదు. చట్టబద్ధమైన పట్టాను వ్యక్తిగతంగా ఆమెకు ఉండవలసిన అవసరం లేదని తీర్పు చెప్పారు. వారికి నోటీసు కూడా అవసరం లేదన్నారు.

8. మొత్తం మీద మూడు ప్రశ్నలను మనం పరిశీలించవలసి వుంటుంది.

 1. చట్టబద్ధమైన హక్కు సంపాదించిన వ్యక్తి అంతకుముందు వున్న సమతా హక్కుకు బద్ధుడవుతాడా?

 2. చట్టబద్ధమైన హక్కును సంపాదించుకున్న వ్యక్తి తదనంతరం ఏర్పడినటువంటి సమతా హక్కుకు లోబడి ఉంటాడా?

 3. ఎక్కడ ఏ పక్షానికి చట్టబద్ధమైన హక్కు లేకుండా కేవలం సమతా హక్కులే ఉన్నట్లయితే దేనికి ప్రాధాన్యత ఇవ్వవలసి వుంటుంది?

 (i) చట్టబద్ధమైన హక్కును సంపాదించుకున్న వ్యక్తి అంతకు ముందున్న సమత హక్కుకు బద్ధుడు అవుతాడా?

1. దీనికి సమాధానం ఈ విధంగా ఉంటుంది:- ఒక వ్యక్తి సరైన ప్రతిఫలం ఇచ్చి చట్టపరమైన ఆస్తిహక్కును కొనుగోలు చేసినపుడు అతడి పూర్వపు సమత హక్కు గురించి తెలియనప్పుడు సదరు వ్యక్తి, అటువంటి సమతా హక్కుకు బద్ధుడు కాడు.

## 2. ఈ ప్రాతిపదికలో మూడు ప్రధాన అంశాలున్నాయి:

(1) కొనుగోలుదారుడు చట్టబద్ధమైన ఆస్తిని సంపాదించుకుని ఉండాలి. దీనిని గురించి ఎక్కువగా చెప్పటానికి ఏమీలేదు. అయితే ఈ క్రింది అంశాలను గుర్తించాలి:-

(అ) వ్యక్తిగతంగానే అతడు చట్టబద్ధమైన ఆస్తిని సంపాదించుకోనవసరం లేదు. అతని తరఫున మరొకరు సంపాదిస్తే సరిపోతుంది. తొరండెక్ Vs హంట్ (1859) 3 De.G.I 563 = 44 ER 1386.

(ఆ) కొనుగోలుదారుని పట్టా పక్కా పట్టాగా ఉండనవసరం లేదు.

ఉదాహరణ:- ట్రస్టీ పట్టాలో లోపం ఉన్నప్పటికీ కొనుగోలుదారుకు కొన్ని ప్రయోజనాలను బదలాయించవచ్చు. మునుపే సమతా హక్కు కలిగిన లబ్ధిదారునికి వ్యతిరేకంగా కొనుగోలుదారుడు ఆ ప్రయోజనాన్ని పొందవచ్చు.

## కేసు వివరాలు:

1. జాన్ జోన్స్- యజమాని. తన ఇంటిని హాల్ బ్రూక్‌కు తాకట్టు పెట్టాడు. తర్వాత ఇంటిని విడిపించుకోవడానికి అప్పుతీర్చి రసీదు పొందాడు. కాని మళ్ళీ ఇంటి పత్రాలను తాను తీసుకోలేదు. హాల్ బ్రూక్ అధీనంలోనే ఇల్లు ఉండిపోయింది.

2. జోన్స్ నష్టపోయిన తర్వాత అతని షాపు అసిస్టెంట్ మెరిడిత్, జోన్స్ సంతకం ఫోర్జరీ చేసి దొంగ విల్లు తయారుచేశాడు. ఆ విల్లు ఆధారంగా ఇల్లు కబ్జా పొందాడు.

3. మెరిడిత్ ఒక తాకట్టు పత్రం ద్వారా ఇంటిని హాల్‌కు తాకట్టు పెట్టాడు.

4. మెరిడిత్ విల్లు రాసి చనిపోయాడు. తాకట్టు విడిపించుకునే సమతా హక్కును భార్యకు, ఆ తర్వాత జేమ్స్ జోన్సుకు ఇస్తూ విల్లు రాశాడు.

5. జేమ్స్ జోన్స్ దాన్ని వాట్కిన్స్‌కు బదిలీ చేశాడు.

6. జేమ్స్ జోన్స్, వాట్కిన్స్ ఆ తర్వాత భాగస్వాములుగా మారి, ఇద్దరూ కలిసి ఇంటిని పోవెల్స్‌కు తాకట్టు పెట్టారు. అతనికి ఇంటి కబ్జా కూడా ఇచ్చారు.

7. పోవెల్స్ మరణించాడు. అతని భార్య 'సారా' ఉంది.

8. సారా పోవెల్స్ ఆ ఆస్తిని సంపాదించి పూర్తి యజమాని అయింది.

9. సారా పోవెల్స్‌పై సారా జోన్స్ కేసు వేసింది. విల్లు ఫోర్జరీ చేసిన విషయం సారా పోవెల్స్‌కు తెలుసనీ, కనుక ఇల్లు విడిపించుకునే హక్కు తనకే ఉందని, సారా పోవెల్స్‌కు లేదని వాదించింది.

(సి) కొనుగోలుదారుడు చట్టపరమయిన హక్కు సంపాదించాలి- ఎప్పుడంటే

**(i) ఆస్తి కొనేటప్పుడు గానీ,**

(ii) ఆ తర్వాత గానీ...

(iii) కొనుగోలుదారుడు ఆ హక్కుకు సరైన ప్రతిఫలం చెల్లించి ఉండాలి.

స్వచ్ఛంద వ్యక్తి ఎప్పటికీ సమతా హక్కు కలిగి ఉంటాడు. ముందు సమతా హక్కు ప్రతిఫలం చెల్లించకుండా ఏర్పడినదైనపుడు అతను ఆ హక్కుకు బద్ధుడు కానవసరం లేదు.

చెల్లించవలసిన రుణం ఎప్పుడూ తగిన ప్రతిఫలంగానే భావిస్తారు. ఉదా. తారండికె Vs హంట్. టి- ప్రతిఫలం చెల్లించలేదు. ట్రస్టీకి వ్యతిరేకంగా అతని పేర ఉన్న అప్పు ఆ హక్కును కలిగిస్తుంది.

(iv) ముందున్న సమతా హక్కు గురించి తెలియకుండా కొనుగోలుదారుడు హక్కును సంపాదించి ఉండవచ్చు.

ఇది చాలా ప్రధానమయిన★ ప్రాతిపదిక. దీన్నిబట్టి తలెత్తే సమస్య ఏమంటే...

## నోటీస్ అంటే ఏమిటి?

1. నోటీసు నేరుగా కానీ పరోక్షంగా కానీ ఉండవచ్చు. కొనుగోలుదారుడికి నేరుగా చెప్పిన అంశాలు ప్రత్యక్ష నోటీసు. అతడి ఏజెంట్‌కు తెలియజేస్తే పరోక్ష నోటీస్ అన్నమాట.

(తర్వాతి భాగాలు కనిపించలేదు- సం.)

2. ప్రత్యక్ష నోటీసు నిజమైనది లేదా సంభావ్యమయినది కావచ్చు.

(i) కొనుగోలుదారుడికి లేదా అతనికి ఏజెంట్ ఎరుకలో ఉన్నట్టయితే అది నిజమయిన నోటీసు.

2. సంభావ్యమయిన నోటీసు అంటే- కొనుగోలుదారుడికిగానీ, అతని ఏజెంట్‌కిగానీ సరైన వాకబు చేస్తే తెలియగల అంశాలు అని అర్థం.

## నిజమైన నోటీసు

1. చట్టపరమైన హక్కును కాదనడానికి నిజమైన నోటీసుపై ఆధారపడాలంటే ఈ కింది అంశాలు రుజువు కావాలి.

---

★ తర్వాత చేర్చినది - సం.

(i) ఆస్తిలో ఆసక్తి వున్న ఒక వ్యక్తి ఆ సమాచారం ఇచ్చి ఉండాలి.

(ii) సంప్రదింపులలో ఆ సమాచారం అంది ఉండాలి.

(iii) అది స్పష్టంగా, విడిగా తెలియగలిగేది కావాలి.

## సంభావ్యమయిన నోటీసు

ఒక సమతా హక్కు ఉందనే విషయం తెలియజెప్పే అంశాలు దృష్టికి వచ్చినపుడు సంభావ్యమయిననోటీసు ఉందనవచ్చు. నిజానికి అది నోటీసు కాదు. నోటీసు ఉందనడానికి సాక్ష్యం.

## 2. సంభావ్యమయిన నోటీసులు మూడు రకాలు.

(i) ఆస్తిపై మరో హక్కు మరొకరికి ఉందనే విషయాన్ని తెలియజేసే అంశం నిజంగా తెలిసినపుడు. బిస్కో Vs ఎర్ల్ ఆఫ్ బాన్‌బరీ (1676) (6) I.Ch.Ca. 287 కొనుగోలుదారుడికి తాను కొనబోయే ఆస్తి తాకట్టు పెట్టబడినట్టు తెలిసినా, అతను వాస్తవంగా తాకట్టు పత్రం చూడలేదు. చూసి ఉంటే ఏ సాధారణ వ్యక్తి అయినా తెలుసుకొనగలిగినట్టే తాకట్టు వివరాలు తెలుసుకొని ఉండేవాడు కనుక అతను ఆ తాకట్టుకు కట్టుబడి ఉండాలని తీర్పు చెప్పారు. Davis Vs Hutching 1907 1.ch. 356

ఒక ట్రస్టీ న్యాయ సలహాదారు మాట నమ్మి లబ్దిదారు వాటాను అతనికి బదిలీ చేశాడు. అంతకుముందు ఆ వాటా బదిలీ అయిందని సొలిసిటర్‌చెప్పాడు. కాని వారు అంతకుముందు బదిలీ వివరాలు అడిగి తెలుసుకోలేదు. అది అంతకుముందే ఒకరికి బదిలీ అయిందని తెలిసింది. ఈ 'ఛార్జ్'కు సంబందించిన విషయం వారికి తెలుసని- సంభావ్య నోటీసు ఉందని తీర్పు చెప్పారు.

## కౌలుదారుని స్వాధీనం - సంభావ్య నోటీసు

అమ్మే వ్యక్తికి కాకుండా వేరెవరి ఆధీనంలోనైనా భూమి ఉన్నట్టయితే కొనుగోలుదారునికి భూమి కబ్జాలోని వ్యక్తికి ఉండే ఏ హక్కయినా తెలిసే ఉంటుందని భావించవలసి వస్తుంది.

అది మూడవ వ్యక్తి హక్కుకు సంబంధించిన నోటీస్ కాదు- 9 Moo, P.C.18.

ఇప్పుడు మనం నోటీసు తాలూకు మౌఖిక సాక్ష్యానికి వద్దాము. దీనికి సంబంధించి కొనుగోలుదారుడు అమ్మకపుదారుడిపై వచ్చే అస్పష్టమయిన పుకార్లను పట్టించుకోనవసరం లేదు. అపరిచితులు చెప్పే వాటిని పరిగణనలోకి తీసుకోనవసరం లేదు. కానీ కొనుగోలు చేసే ఆస్తి విషయంలో కొనుగోలుదారుడినే బద్ధుడిని చేసేందుకు, ఆ ఆస్తిలో ఆసక్తి ఉన్న వ్యక్తి నుంచి నోటీస్ రావలసి ఉంటుంది.

**R.3 Ch.App. 488 Llyod Vs Banks Carries J- 1868.**

ట్రస్టీకి ఆస్తిపై తాకట్టు తదితర భారాలు మోపినపుడు ఆ విషయం ప్రస్ఫుటమైన నోటీసు ద్వారా కాక మరే మార్గం ద్వారా గానీ, పిచ్చాపాటీ మాటల ద్వారా కానీ తెలిస్తే ట్రస్టీ అంత లాభదాయకమైన స్థితిలో ఉండడు. అయినా ఖచ్చితమయిన నోటీసు లేనంత మాత్రాన ట్రస్టీ ఆస్తిపై తనఖా తదితర భారాలు కల్పించిన విషయం తెలియదంటూ ఆ భారాల నుంచి తప్పించుకునే అవకాశం ఉందని అంటే అది కోర్టు సాధారణంగా అనుసరించే న్యాయ సూత్రాలకు, అభిజ్ఞ నిర్ణయాలకు వ్యతిరేకమే అవుతుంది.

ఉదాహరణ: **9 Moo, P.C.18 Baruhari Vs Greensheolds.**

సంబంధిత వ్యక్తులు కానివారు చేసే అస్పష్టమయిన అంశాలు తెలిస్తే కొనుగోలుదారునికి హక్కులను అవి పరిమితం చేయవు అని నిర్ణయించడం జరిగింది.

(తనఖాదారుడు అంటే **Incumbrancer**. స్థిరాస్తి తనఖా పెట్టిన లేదా దానిపై ఛార్జ్‌ని కానీ ఇతర భారాన్ని కాని మోపితే **Incumbrance** అంటారు. ఆ భారాన్ని మోపేవాడు **Incumbrancer.** తనఖాదారు అంటే ఆ అర్థం వర్తిస్తుంది.)

తనఖాదారుడే నోటీసు ఇవ్వాలా?

ఎటువంటి సమాచారాన్నైనా కొనుగోలుదారుడు నిర్లక్ష్యం చేయలేదు. వార్తాపత్రిక ద్వారా వచ్చిన సమాచారంపైనయినా వ్యాపారదక్షుడు తగిన చర్య తీసుకొంటాడు. **S.R.3 Ch.App. 488 1868.**

## రిజిస్ట్రేషన్

ఏదైనా పత్రాన్ని రిజిస్టర్ చేయటం అంటేనే దానికి సంబంధించిన నోటీసు జారీ చేసినట్టు భావించడం జరుగుతుంది. అయితే సదరు నోటీసులో దానిలోని అన్ని వివరాలను ప్రస్తావించనవసరం లేదు.

**(ii)** తనకు తెలిసే నోటీసును తప్పించుకోవడానికి మామూలుగా వాకబు కూడా చేయకుండా తప్పించినపుడు.

1. కొంత ఆస్తిని కొనుగోలు చేయటానికి జాన్ వాసే 1776లో ఒప్పందం కుదుర్చుకున్నాడు.
2. డా. పి. అనే వ్యక్తి, నుంచి కొనుగోలు మొత్తాన్ని అప్పుగా తీసుకుని సదరు మొత్తం చెల్లింపుకు హామీగా ఆ కొనుగోలు పత్రాన్ని అతడి దగ్గర ఉంచాడు.
3. 1790లో 'టి' ఎల్లామ్స్‌కు పెద్ద మొత్తంలో బాకీ పడి తన ఆస్తిని అతనికి తాకట్టు పెట్టి ఒక తాకట్టు పత్రం వ్రాసి ఇచ్చాడు.
4. ఎల్లామ్స్‌కు డా. పి. సదరు ఆస్తిపై తన క్లైమ్ గురించి ఎటువంటి సమాచారం ఇవ్వలేదు.
5. తనఖా పత్రాన్ని తీసుకునే ముందు ఆస్తి తాలూకు పట్టా పత్రాలను గురించి తాను ఎటువంటి భోగట్టాను సేకరించలేదని ఎల్లామ్స్ అన్నాడు. సదరు పత్రాన్ని వ్రాసిన అనంతరమే ఆ ఆస్తిపై డా. పి కి ఇచ్చిన కొంత హక్కు ఉందని తెలిసిందనీ పట్టాను భద్రంగా ఉంచడం కోసమే పట్టాలను అతని దగ్గర ఉంచాడని తాను భావించానని అన్నాడు.
6. తన బావమరిది 'జె' ద్వారా అతనికి ఈ విషయం తెలిసింది. ఆ బావమరిదే తనఖా పత్రాన్ని తయారుచేసి అతని తరపున ఏజెంట్‌గా వ్యవహరించాడు.
7. ఎల్లామ్స్ కన్నా ముందే ఆస్తిపై తనకు హక్కు ఉందని డాక్టర్ పి కోరాడు. ఎల్లామ్స్‌కు డా. పి హక్కు గురించి ముందే తెలుసునని భావించి డాక్టర్ పి. వాదాన్ని న్యాయస్థానం సమర్థించింది.

**(ii)** తాను కొనుగోలు చేయబోయే ఆస్తిపైన అంతకు ముందే ఏవయినా తనఖాలు ఉన్నాయో లేదో మామూలుగానైనా ప్రత్యేకంగానైనా తెలుసుకునే ప్రయత్నం చేయకుండా తీవ్ర నిర్లక్ష్యం చేసినపుడు-

1899 2 Ch. 264

1921 1 Ch. 98

## ఆరోపిత నోటీసు

1. ఏజెన్సీ అంటే ఒక వ్యక్తి తాను చేయదలుచుకున్నది మరో వ్యక్తి - ఏజెంట్ - ద్వారా చేయవచ్చు. అలాగే ఏజెంట్ చేసింది తాను చేసిందే అవుతుంది. ఇలా అనుకున్నపుడు ఏజెంట్‌కు తెలిసిన సమాచారం అతనికి కూడా తెలిసినట్లే అని వాదించవచ్చు.

ఈ సిద్ధాంతంపైనే ఆరోపిత సూచన సూత్రం ఆధారపడింది. ఆరోపిత సూచన - అత్యవసర అంశాలు:

1. ఆ విషయంలో అతనికి ఏజెంట్ హోదాలో తెలియాల్సిందే కాని మరే ఇతర హోదాలో కాదు. అంటే ఏజెన్సీ ఉందని ఖచ్చితంగా రుజువు కావాలి.

   డైల్లీ Vs. పోలెన్ - 32 L.J.Ch. 782 (W.S)

2. గుమాస్తా పనికోసం నియమితుడైన ఉద్యోగికి ఏజెంట్‌కు ముఖ్య తేడా ఉంది. ఉదాహరణ: ఒక పత్రం రూపొందించడానికి నియుక్తుడైన వ్యక్తి ఏజెంట్.

   అటువంటి వ్యక్తికి అందిన సమాచారం ఆరోపిత నోటీసుకు ఆధారం కాదు.

3. ఇద్దరు ప్రిన్స్‌పల్స్‌కు సేవలు చేస్తున్న ఏజెంట్ స్థితి (ఆఫ్)*ని ఈ సందర్భంగా పరిశీలించాలి. ఉదాహరణకు 'ఎ', 'బి' అనే రెండు కంపెనీలు ఉన్నాయి. ఆ రెండు కంపెనీలకు 'సి' అధికారి. 'డి' అనే వ్యక్తికి చెందిన సమతా హక్కుకు లోబడి 'ఎ' కంపెనీ తను చట్టపరమయిన హక్కులను 'బి' కంపెనీకి ఇచ్చివేసింది. ఈ విషయం 'సి'కి తెలుసు.

   'ఎ' కంపెనీ ఏజెంట్ హోదాలో 'డి' హక్కు విషయం 'సి'కి ముందే తెలుసు కనుక-

'బి' కంపెనీకి కూడా ఈ విషయం తెలుసునని భావించవచ్చు.

'ఎ' కంపెనీ ఏజెంట్‌గా అతనికి తెలియవచ్చిన అంశాన్ని 'బి' కంపెనీకి కూడా తెలుసునన్నట్లుగా ఆరోపించడానికి వీలులేదు. 'ఎ' కంపెనీ అధికారిగా ఆ సమాచారాన్ని పంపే బాధ్యత, 'బి' కంపెనీ అధికారిగా ఆ సమాచారం (నోటీసు) స్వీకరించే బాధ్యత ఉంటే ఆరోపిత నోటీసు లభించినట్టే.

(1896)2 Ch. 743 - In Re Hampshire Land Company.

## కేసు వివరాలు:

1. కంపెనీల చట్టం 1870 కింద హాంప్‌షైర్ లాండ్ కంపెనీ రిజిస్టర్ అయింది.
2. పోర్ట్‌సీ ఐలాండ్ బిల్డింగ్ సొసైటీతో ఈ కంపెనీకి సన్నిహిత సంబంధాలున్నాయి. నలుగురు డైరెక్టర్లు, విలియమ్ అనే కార్యదర్శి ఈ రెండు కంపెనీలలోనూ ఉన్నారు.

* తర్వాత చేర్చినది - సం.

3. 1881 ఫిబ్రవరి 19న కంపెనీ సాధారణ సమావేశం జరిగి 30 వేల పౌండ్లు అప్పు పొందేందుకు తీర్మానించారు.

4. పోర్ట్‌సీ సొసైటీ నుంచి డైరెక్టర్లు ఈ సొమ్ము అప్పుగా తీసుకున్నారు.

5. 1892లో సొసైటీ రద్దయి పోయింది. కంపెనీకి ఇచ్చిన 30 వేల పౌండ్ల అప్పును తిరిగి వసూలు చేసే క్లెయిమ్‌ను లిక్విడేటర్ దాఖలు చేశారు.

6. అప్పు తీసుకోవడాన్ని సమర్థించిన కంపెనీ తీర్మానం చెల్లదని, రెంటికీ ఒకే అధికారి అయిన విలియమ్‌కు ముందే తెలుసుకనుక సొసైటీకి కూడా నోటీసు ఉన్నట్టేనని, కనుక సొసైటీకి అప్పు తిరిగి వసూలు చేసే అధికారం లేదని వాదించారు.

7. 749వ పేజీలో ఇచ్చిన ఈ వివరాల ఆధారంగా సొసైటీకి అప్పు తిరిగి వసూలు చేసే అధికారం ఉందని తీర్పు చెప్పారు.

II. ఒకే కార్యక్రమంలో ఏజెంట్‌కు నోటీసు లభించాలి. మరో లేదా ఇంతకు ముందు కార్యక్రమంలో నోటీసు లభిస్తే కుదరదు.

మరో షరతు కూడా ఉంది. ఒకే కార్యక్రమంలో నోటీసు అందినా, అది యజమానికి ఏజెంట్ వెంటనే తెలుపవలసినంత ప్రధానమయిన సమాచారమయితే తప్ప 'నోటీసు'గా పరిగణించడానికి వీలులేదు.

(1886) - 31 Ch.D.671 - In Re Cousins

## కేసు వివరాలు:

1. 1871లో విలియమ్స్ సోదరులు (కజిన్స్) తమ ఆస్తిని వీలునామా ద్వారా ట్రస్టీల చేతిలో ట్రస్టుగా ఉంచారు.

2. ట్రస్టీకి విలియమ్ బాంక్స్ అనే వ్యక్తి సొలిసిటర్ (న్యాయసలహాదారు)గా ఉన్నారు.

3. వీలునామా ప్రకారం విలియమ్స్ సోదరులు (కజిన్స్) వదిలిన వ్యక్తిగత ఆస్తిలో మాధ్యూ అనే కజిన్‌కు ఒక భాగం ఉంది.

4. 35 పౌండ్ల అప్పు తీసుకుని అందుకు హామీగా విలియమ్ బ్యాంక్స్‌కు మాధ్యూ తన వాటాను తనఖా పెట్టాడు.

5. 1873లో మాధ్యూ తన వాటాను విలియమ్ రిచర్డ్సన్‌కు బ్యాంక్స్ ద్వారా తనఖా పెట్టాడు. బ్యాంక్స్ బాకీ చెల్లించాడు.

6. 1874 రిచర్డ్సు తన తనఖాను విలియమ్ డ్రేక్‌కు బదిలీ చేశాడు. ట్రస్టీలకు నోటీసు ఇవ్వలేదు.

7. 1875లో 500 పౌండ్లు కట్టటానికి మాధ్యూ తన వాటాను టెన్నిస్ పెప్పర్‌కు తాకట్టు పెట్టాడు. ఈ తాకట్టులో అంతకు ముందు విలియమ్ డ్రేక్‌కు పెట్టిన తాకట్టు గురించి ప్రస్తావించలేదు. తర్వాత ఈ తాకట్టు వ్యవహారానికి సంబంధించిన నోటీస్ ధర్మకర్తకు జారీ చేయడమైంది.

8. పెప్పర్‌కు చెల్లించటానికి ముందుగా తన మొత్తాన్ని చెల్లించాలని డ్రేక్ మాధ్యూపై కోర్ట్ సమ్మన్స్ జారీ చేయించాడు.

1884 26 Ch.D 482

9. తనకు డ్రేక్ నుంచి ఎటువంటి నోటీస్ రాదని వాదించాడు - మాధ్యూ తాకట్టు పత్రంలో దానిని గురించి ప్రస్తావించలేదు కాబట్టి.

10. బ్యాంక్, అతని తరపున న్యాయవాదికి తెలుసు కాబట్టి పెప్పర్‌కు నోటీసు అందినట్లే అని డ్రేక్ సమాధానం ఇచ్చాడు. అందువల్ల మాధ్యూ డ్రేక్ చేసిన తాకట్టు విషయం పెప్పర్‌కు తెలిసిందే అన్నాడు.

11. బ్యాంక్‌కు నోటీస్ వచ్చిందన్న దానికి వాదన లేదు. బ్యాంక్ పెప్పర్ ఏజెంటన్నదీ కాదనలేదు. అయితే ఇక్కడ ప్రశ్న ఏమిటంటే బ్యాంక్‌కు ఇచ్చిన నోటీస్‌ను పెప్పర్‌కు ఇచ్చినట్లు పరిగణించవచ్చా?

12. Held No. - P. 677

13. కారణాలు: 1875 పెప్పర్‌తో జరిపిన వ్యవహారంలో బ్యాంక్స్‌కు తెలుసున్న విషయం బయటికి రాలేదు. పెప్పర్‌కు ఎటువంటి నోటీస్ ఉందన్నట్లు చెప్పలేము.

13. అందువల్ల పెప్పర్ వాదాన్ని అంగీకరించటం జరిగింది.

III. ఏజెంట్‌కు ఇచ్చిన నోటీస్‌ను కొనుగోలుదారునికి ఇచ్చినట్లుగా భావించలేము. ముఖ్యంగా

ఏజెంట్ మోసం చేయాలని భావించి సదరు సమాచారాన్ని తొక్కిపెట్టి దానిని కొనుగోలుదారునికి లభ్యం చేయనప్పుడు.
(1880) 15 Ch. D. 639 Cane Vs. Cave
(1428 ACI - Houghton & Co. Vs. Nothard)

11. చట్టబద్ధమైన హక్కును సంపాదించుకొన్న తర్వాత సమతా హక్కు ఏర్పడిన సందర్భంలో.

1. ఈ సందర్భంలో Northern Counties of England Fire Insurance Co. Vs. Whipp వివాదాన్ని ముఖ్యమైన ఉదాహరణగా పేర్కొనవచ్చు.
1884 26 Ch. D. 482

## వాస్తవాలు

'సి' అనే మేనేజర్ తన సంస్థలో ఒక తనఖా వ్యవహారాన్ని నిర్వహించి సదరు పత్రాన్ని దానికి అందజేసాడు. దానిని కంపెనీ ఇనప పెట్టెలో ఉంచి, దాని తాళాన్ని 'సి' తనవద్దనే ఉంచుకున్నాడు. కొంతకాలం తర్వాత 'సి' ఆ పత్రాన్ని తీసుకుని శ్రీమతి విప్ప్ పేరిట మరొక తనఖా పత్రాన్ని వ్రాసాడు. శ్రీమతి విప్ప్ మొదట తనఖా గురించి ఏమీ తెలియదు. అందువల్ల కంపెనీకి ఎటువంటి ప్రాధాన్యత లేదని కోర్టు నిశ్చయించింది.

2. ఈ వివాదంలో ఈ క్రింది ప్రమేయాన్ని రూపొందించారు-

   ఒక వ్యక్తి తనకు చట్టబద్ధంగా ఉన్న ఆస్తిని మోసం చేయటానికి ప్రయత్నించినప్పుడు రెండవ హక్కుదారుడికి దానికి సంబంధించిన నోటీస్ లేనప్పుడు న్యాయస్థానం దానిని మొదట హక్కుదారుని కాదని రెండవ హక్కుదారుని ప్రాధాన్యతనే గుర్తిస్తుంది.

3. మోసం చేసినట్లు లేదా మోసానికి సహాయం చేసినట్లు చూపే సాక్ష్యాధారాలు ఏమిటి?

   (i) పట్టా పత్రాలను గురించిన సమాచారం సేకరించేటప్పుడు సాధారణ జాగ్రత్తలు చూపకపోవడం.

   (ii) పట్టా పత్రాలను తీసుకోవటంలో విఫలం అయినప్పుడు కూడా అది మోసం చేయటానికి చేసిన ప్రయత్నంగా భావించటం జరుగుతుంది. ఎందుకంటే ఇతర కారణం ద్వారా దీనిని వివరించలేము.

4. ఇదే న్యాయస్థానం మరో వివాదంలో కూడా రెండవ హక్కుదారునికి ఆస్తిని సంక్రమింపజేసింది.

తనఖా పెట్టిన వ్యక్తి, అంటే సంపద హక్కుదారుడు అవసరమైన ధనాన్ని సంపాదించటానికి ఏజెంట్‌ను నియమించినప్పుడు ఆ ఏజెంట్ మోసం చేసినప్పుడు సదరు సంపదను మొదట ఆస్తిగా గుర్తించటం జరుగుతుంది.

5. ఈ నియమాన్ని అమలుపరిచేటప్పుడు కేవలం అజాగ్రత్త లేదా సరైన పరిజ్ఞానం కలిగి ఉండకపోవటం తగిన కారణం కాజాలదు. మోసగించడం లేదా మోసం చేయటంలో సహాయపడటం తప్పనిసరిగా ఉండాలి. ఒక్క మోసమే రెండవ హక్కుదారునికి ఆస్తిని బదలీ చేయగలదు.

(1913) 2. Ch. 18

**(iii)** రెండు సమత హక్కుల మధ్య పోటీ ఏర్పడినప్పుడు.

**1.** ఇదివరకటి రెండు కేసులలో చట్టపరమయిన హక్కుకీ సమతా హక్కుకీ మధ్య పోటీ ఉండింది. మూడో కేసులో రెండు సమతా హక్కుల మధ్య పోటీ ఉంది.

**Cave Vs. Cave (1880) 15 Ch. D. 639**

## కేసు వివరాలు:

'ఎ' ట్రస్టీ; 'బి' ట్రస్టీ లబ్ధిదారుడు.

ట్రస్టు డబ్బుతో అక్రమంగా అనధికారికంగా 'ఎ' భూమి కొని దానిని 'సి' కి తనఖా పెట్టారు. 'సి' కి ట్రస్టు గురించి నోటీసు లేదు.

'సి', తర్వాత సమతా తనఖా (Equitable Mortgage) ద్వారా ముగ్గురికి బదిలీ చేశాడు. ఇక్కడ 'సి' చట్టపరమైన తనఖాదారు.

'బి'కి 'ఎ' ద్వారా సమతా హక్కు లభిస్తుంది.

'ఎ' హక్కు ద్వారా 'డి'కి కూడా సమతా హక్కు లభిస్తుంది. పార్టీల పరిస్థితి ఏమిటి?

1. 'సి', 'బి'ల మధ్య: 'బి'కి 'సి' కన్న ముందే సమతా హక్కు లభించింది. కాని చట్టపరమయిన హక్కుదారు అయిన 'సి'కి నోటీసు లేదు. కనుక 'సి'కే ప్రాధాన్యత లభిస్తుంది.

2. 'సి', 'డి' మధ్య కూడా 'సి'కే ప్రాధాన్యత లభిస్తుంది. ఎందుకంటే 'డి' పౌరహక్కులను మోసపూరితంగా సృష్టించే ప్రయత్నం 'సి'కి తెలియదుకనుక.

3. బి-డి మధ్య ఈ ఇద్దరికి సమతా హక్కులున్నాయి. ఎవరి హక్కు 'ముందు' లభిస్తుంది? 'బి' హక్కు. రెండు సమతా హక్కులు పోటీపడినచోట ముందు సంక్రమించిన సమతా హక్కుకే ప్రాధాన్యత లభిస్తుందని నియమం ఉంది.

4. ఈ నియమం రెండు సమతా హక్కులు సమాన స్థాయిలో ఉన్నపుడే వర్తిస్తుంది. రెంటిలో ఉత్తమమయిన హక్కు ముందు లభిస్తుంది.

   రైస్ Vs. రైస్. 2. డ్రెప్రీ 73 (76-78)

   'ఎ' తన భూమిని 'బి'కి అమ్మినాడు. ఆ డబ్బు తీసుకోకముందే (1) భూమిని 'బి'కి బదలాయించారు. (2) డబ్బుకు రసీదుపై సంతకం చేశారు. (3) 'బి'కి ఆస్తి పత్రాలు ఇచ్చారు. తర్వాత 'బి'ని సి వద్ద తనఖా పెట్టారు. 'ఎ' హక్కు గురించి 'సి'కి తెలియదు. ఎ-సి మధ్య హక్కులు సమానమయినవి. 'సి' కన్న 'ఎ' హక్కు ముందే లభించినా ఇద్దరి సమతా హక్కులూ సమానమయినవే. 'ఎ' నిర్లక్ష్యానికి బాధ్యుడు. కనుక 'సి' సమతా హక్కు తర్వాతదే అయినా ఉత్తమమయింది కనుక దానికే ప్రాధాన్యత లభిస్తుంది.

5. రెండు సమతా హక్కుల మధ్య సమయానికి సంబంధించిన సంఘర్షణ కొన్నిట్లో ఉంటుంది. మరికొన్ని సందర్భాల్లో వ్రాతపూర్వక నోటీసును బట్టి ఉంటుంది. (ఉంటే చర్యా హక్కు **(Chose in action)** చెందిన వ్యక్తికి వ్రాతపూర్వక నోటీసు ఇచ్చిన తేదీని బట్టి)

సారాంశం: (ఈక్విటీ) సమతా సూత్రాలు

1. సమతా హక్కులు సమానమైనపుడు, చట్టం ప్రధానం.
2. సమతా హక్కులు సమానమైనపుడు - మొదటి హక్కు ప్రధానం.
3. సమతా హక్కులు సమానమైనపుడు - మంచి హక్కు ప్రధానం.

## వివరణ

1. మొదటి సూత్రం సమతా హక్కు, చట్టహక్కుల మధ్య సంఘర్షణలకు వర్తిస్తుంది. లీగల్ హక్కు కన్నా ఈక్విటబుల్ హక్కు ముందే చేకూరినా, తర్వాత చేకూరినా వర్తిస్తుంది.

2. చట్టం ప్రధానం అంటే లీగల్‌హక్కుకు ఈక్విటబుల్‌హక్కుపైన ప్రాధాన్యం ఏర్పడుతుంది. నోటీసు మోసం అంశాల ప్రమేయం లేనపుడు.

3. రెండు సమతా హక్కుల మధ్య ఘర్షణ ఏర్పడినపుడు 2వ, 3వ సూత్రాలు వర్తిస్తాయి.

# ఈక్విటబుల్ అసైన్‌మెంట్ (సమతా బదిలీ)

## 1. జనరల్

1. ఈక్విటబుల్‌అసైన్‌మెంట్ ఒక సంక్షిప్తీకరణ. Chose in actionలో అంశాన్ని Equitable Assignment అంటారు.

2. మూడు ప్రాథమికాంశాలను గురించి ముందు వివరించాల్సి ఉంటుంది.

(i) అసైన్‌మెంట్ (బదిలీ) అంటే ఏమిటి?

(ii) Chose in action (చర్యా హక్కు) అంటే ఏమిటి?

(iii) ఈ విషయం అధ్యయనం చేసే అవసరం.

### (1) ఆస్తి హక్కును బదిలీ చేయటం అంటే ఏమిటి?

1. ఆస్తికి సంబంధించిన ఇంగ్లీష్‌చట్టం ఆస్తిని 'రియల్టీ', 'పర్సనాలిటీ' అని రెండు రకాలుగా వర్గీకరించింది.

2. 'రియల్టీ'కి సంబంధించిన ఆస్తి బదలాయింపు హక్కుల విషయంలో 'మార్గం' (Conveyance) అనే పదాన్ని ఉపయోగించటం జరిగింది. పెర్సనాలిటికి సంబంధించినహక్కుల బదలీ విషయంలో 'బదలీ' (Transfer) అనే పదాన్ని ఉపయోగించటం జరిగింది.

3. అందువల్ల 'అసైన్‌మెంట్' అంటే ఒక వ్యక్తి తన వ్యక్తిగత ఆస్తిని ఒక ప్రత్యేక రూపంలో ఇంకొకరికి బదలీ చేయటం.

### (2) చర్యా హక్కు అంటే ఏమిటి?

1. ఇంగ్లీషు భాషలో 'పర్సనాలిటీ'ని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు.

(i) చర వస్తువులను ఒకరు భౌతికంగా స్వాధీనం చేసుకోవచ్చు.

(ii) వ్యక్తిగత ఆస్తి హక్కులు చర్య ద్వారా అమల్లోకి వస్తాయేకానీ స్వాధీనం చేసుకోవటం ద్వారా కాదు.

2. మొదటి తరహా వాటిని ఈ క్రింది విధంగా వర్ణిస్తారు.

(i) స్వాధీన చర్య = వస్తువులు స్వాధీనం చేసుకోవడం.

(ii) చర్యా హక్కు = చట్టపరమయిన చర్య ద్వారా హక్కులు స్వాధీనం చేసుకోవడం.

(3) చర్యా హక్కుకు సంబంధించిన నిర్వచనం

(1902) 2 K.B. 427 (430) - Channel J)

నిజానికి ఇది అప్పు గురించి చెబుతున్నది.

(4) 'అసైన్‌మెంట్' పదాన్ని చర్యా హక్కు సందర్భంలో ఉపయోగించటం జరిగింది. బదలీ చేయాలనుకొంటే సంతకం చేయటం నీవు చేయగలవు. ఆస్తిని భౌతికంగా అందివ్వలేవు.

## (3) సమత అసైన్‌మెంట్ అధ్యయనం చేయవలసిన అవసరం:

1. హక్కుదారుడు తన హక్కును బదలీ చేయడమే అసైన్‌మెంట్ అంటే. ఒక వ్యక్తికి వ్యతిరేకంగా మూడవ వ్యక్తికి బదలీ చేయటం.

ఉదాహరణ: 'ఎ' రుణదాత. 'బి' రుణగ్రస్థుడు. 'బి'కి ఇచ్చిన అప్పు మొత్తాన్ని 'ఎ', 'సి'కి బదలీ చేస్తాడు. అందువల్ల 'బి', 'సి'కి బద్ధుడు అవుతాడు. 'బి' నుంచి వసూలు చేసుకోటానికి 'సి'కి హక్కు లభిస్తుంది.

2. అసైన్‌మెంట్‌లో ముగ్గురు వ్యక్తులు ఉంటారు.

(i) అసలు యజమాని

(ii) అసలు యజమానికి బద్ధుడైన వ్యక్తి

(iii) తన హక్కును అసలు యజమాని బదిలీ చేసిన మరో వ్యక్తి.

(3) చర్యను సూచించే హక్కు చట్టబద్ధమైనది లేదా సమతాపరమైందిగా అంటే వారసత్వపరంగా నిధి ద్వారా సంక్రమించినది.

(4) సమత న్యాయం, సామాన్య న్యాయం Chose in action (చర్యా హక్కు)ను వేరువేరుగా చూస్తాయి.

## చర్యా హక్కు సామాన్య న్యాయం

1. చర్య తీసుకోతగిన అధికారానికి సంబంధించిన విషయంలో సామాన్య న్యాయంలో ఎసైన్‌మెంట్(బదలాయింపు) ఏమీలేదు. చట్టపరమైన చర్యా హక్కును కూడా బదలాయించే వీల్లేదు.

2. దీనికి కారణం ఏమిటంటే వివాదాలు అధికమౌతాయన్న భయమే.

3. స్టాట్యుట్ చట్టం, స్పెషల్ చట్టం చర్యా హక్కును ఈ క్రింది విధంగా చెబుతున్నది:-

   (i) నెగోషియబుల్ ఇన్‌స్ట్రుమెంట్ (వ్యాజ్య సాధనం)లను చట్టపరంగా వ్యాపారస్థుడు ఉపయోగించవచ్చు.

   (ii) జీవిత, నౌకా భీమా పాలసీలను స్టాట్యుట్ ప్రకారం బదలాయించవచ్చు.

   (iii) జూడికేచర్ చట్టంలోని విభాగం 25(6) ప్రకారం అన్ని చట్టపరమైన చర్యా హక్కులను వినియోగించవచ్చు.

## సమత మరియు చర్యా హక్కు

1. సమత ప్రకారం చర్యా హక్కు ఉపయోగించవచ్చు. సమత చర్య కాకుండా చట్టబద్ధమైన చర్య కూడా సమత క్రింద తీసుకోవచ్చు.

(2) సమత క్రింద చర్య తీసుకున్నట్లైతే తన పేరుమీద వసూలు చేసుకోటానికి కక్షిదారుడు న్యాయస్థానం ద్వారా చర్యకు ఉపక్రమించవచ్చు.

3. చట్టపరంగానైతే ఎవరికి బదలీ చేశారో వారిపేరిట న్యాయస్థానంలో చర్యకు ఉపక్రమించాలి. తన పేరును ఉపయోగించుకోకుండా అతడిని నిరోధించటానికి, ఖర్చుల నుంచి మినహాయింపు కల్పించటానికి అసలు హక్కుదారుడు చర్య తీసుకోవచ్చు.

4. కొన్ని చర్యా హక్కుల బదలాయింపులు ప్రజాశ్రేయస్సుకు విరుద్ధంగా ఉంటే సమతా న్యాయం కూడా వాటిని అంగీకరించదు.

(i) జాతీయ ప్రజానిధి నుంచి ప్రభుత్వ అధికారులకు ఇచ్చే వేతనాన్ని, లేదా అందులో సగాన్ని బదిలీ చేయడానికి వీల్లేదు.

(ii) భార్యకు ఇచ్చే సహాయ నిధిని బదిలీ చేయరాదు.

(iii) ఆస్తి నిర్వహణ ద్వారా బదిలీని అంగీకరించరు.

## ముగింపు

1. కనుక, బదిలీ చేసే పద్ధతులు రెండు.

(i) చట్టపరమయిన, (ii) సమతా పరమయిన

2. జూడికేచర్ చట్టం చట్టపరమయిన చర్యా హక్కును చట్టపరంగా బదిలీచేసే రూపురేఖా విధానాలను వివరించినప్పటికీ, చర్యా హక్కును సమతా పరంగా బదిలీచేసే పద్ధతులకు సంబంధించిన ఛాన్సరీ నియమాలను తొలగించలేదు. కనుక ఏ లోపంచేతనైనా చర్యా హక్కు చట్టపరమయిన బదిలీలో ఇబ్బంది వస్తే సమతా నియమాల ప్రకారం బదిలీని చెల్లుబాటు చేయవచ్చు. సమతా పరమయిన చర్యా హక్కు బదిలీకి సంబంధించి జూడికేచర్ చట్టం పట్టించుకోలేదన్నది గమనించాల్సిన రెండో విషయం.

## పరిశీలించతగిన కేసుల తరగతులు

చర్యా హక్కుల బదిలీకి సంబంధించి మూడురకాల కేసులను పరిశీలించాలి.

(i) లీగల్ చర్యా హక్కును లీగల్‌గా బదిలీ చేయడం

(ii) లీగల్ చర్యా హక్కును సమతాపరంగా బదిలీ చేయడం

(iii) సమతాపరమయిన చర్యా హక్కును సమతాపరంగా బదిలీ చేయడం.

లీగల్ చర్యా హక్కును లీగల్ బదిలీ చేసేందుకు అవసరమైనవి.

1. బదిలీ సంపూర్తిగా ఉండాలి. అంటే బదిలీ చేసే వ్యక్తి తన పూర్తి హక్కును ఇవ్వాలి. అప్పు అయితే నిర్దిష్టంగా మొత్తం సొమ్మును బదిలీచేయాలి.

2. బదిలీ వ్రాసి సంతకం చేయాలి.

ధ్రువపత్రం అవసరంలేదు

విలువ సూచించనక్కరలేదు

3. అప్పు తీసుకున్న వ్యక్తులకు స్పష్టమయిన నోటీసు ఇవ్వాలి.

ఈ సెక్షన్లో ఇవి లేవు

(i) నోటీసు ఎవరు ఇవ్వాలి? బదిలీ చేసే వ్యక్తి? లేదా గ్రహీతనా?

(ii) ఏ సమయంలో ఇవ్వాలి. బదిలీచేసిన వ్యక్తి మరణిస్తే ఆ తర్వాత ఇవ్వవచ్చా?

నోటీసు లేకపోతే...

1. నోటీసు లేనంత మాత్రాన బదిలీ గ్రహీతను దావా వేయకుండా ఆపలేరు. అందువల్ల కొన్ని అనర్థతలు, కొన్ని నష్టాలు వస్తాయి.

(i) అసలు రుణదాతను పార్టీ చేయకుండా బదిలీ గ్రహీత తనపేర దావా వేయడానికి వీలులేదు.

(ii) అసలు రుణదాతకు గ్రహీతకు మధ్య సమతా హక్కులు ఏవయినా వచ్చి ఉంటే వానికి బదిలీ గ్రహీత బద్ధుడై ఉండాలి. బదిలీకి ముందు వచ్చిన ఆ హక్కుల వల్ల బదిలీ గ్రహీత హక్కు పూర్తిగా పోయినా పోవచ్చు. నోటీసు ఇచ్చి ఉన్నట్లయితే, ఆ తర్వాత రుణగ్రహీత తన అప్పు తీర్చినప్పటికీ బదిలీ గ్రహీతకు డబ్బు చెల్లించవలసి ఉంటుంది.

(iii) నోటీసు ఇవ్వని బదిలీ గ్రహీత హక్కుపైన ఆ తర్వాత నోటీసు ఇచ్చిన మరో బదిలీ గ్రహీత హక్కుకు ప్రాధాన్యత ఏర్పడుతుంది.

## లీగల్ చర్యా హక్కు సమతా బదిలీ అవసరాలు

చట్టపరమయిన విధానాలను పూర్తిచేయని 'బదిలీ' చెల్లకుండాపోదు. అది సమతాపరమయిన బదిలీ అవుతుంది. అందుకు రెండు అంశాలు అవసరం.

(i) గ్రహీత కొంత విలువ చెల్లించి ఉండాలి.

(ii) రుణగ్రహీతకు దాతకు మధ్య ఒప్పందం ద్వారా కొంత నిర్దిష్టమయిన సొమ్ముపైన 'ఛార్జ్' కల్పిస్తే ఆది 'బదిలీ' అవుతుంది.

**1839 Buru Vs. Carvallo**

**4 Hylve & Craig's Reports 690**

## కేసు వివరాలు

'ఎఫ్' కొన్ని వస్తువులను 'ఆర్'కు రవాణా చేస్తూ ఉంటాడు. 'ఆర్' వేరే ఊళ్లో వ్యాపారం చేస్తూ బిల్స్ ఆఫ్ ఎక్స్ఛేంజ్(మారక పత్రాలు) స్వీకరిస్తుంటాడు. 'ఆర్' పేర స్వీకరించిన మారక పత్రాలను ధ్రువీకరించి బేరం చేయాలని బి అండ్ కోతో 'ఎఫ్' ఒప్పందం కుదుర్చుకున్నాడు. వస్తువుల రవాణాకు సంబంధించిన బిల్లులను బి అండ్ కో ముందుగా చెల్లించి ఆ తర్వాత 'ఆర్' నుంచి వసూలు చేసుకోవాలని ఒప్పందం. బి అండ్ కో నుంచి 'ఎఫ్' కొంత సొమ్ము తీసుకున్నాడు. 'ఆర్' ఆ బిల్లులను చెల్లించలేదు.

బాకీదారుడుగా బి అండ్ కోకు ఒక ఉత్తరం వ్రాస్తూ ఆ కంపెనీ ఏజెంట్ అయిన 'వి' ని సరుకులను చేరవేయమని నిర్దేశించాడు.

పట్టణంలోని బి అండ్ కో ఏజెంట్‌లకు సరకులను బదిలీ చేయమని 'ఎఫ్', 'ఆర్'ను లిఖితపూర్వకంగా కోరాడు. జూన్ 30, 1829న 'ఆర్', 'వి'కు సరకులను సరఫరా చేశాడు.

మే 23, 1829న ఒక వ్యవహారం నిర్వహణ ఫలితంగా జూన్ 23, 1829 నాడు దివాలా తీసినట్లు కోర్టు నిర్ణయించింది. దివాలాతీసిన అతని ధర్మకర్త బి అండ్ కో నుంచి సొమ్మును రాబట్టుకోటానికి దావా వేశాడు. 'ఎఫ్'కు చెందిన వస్తువులు దావా విలువకు సమాన మొత్తం తమ వద్ద ఉందని కంపెనీ అన్నది. సమత పరంగా బాకీదారుడు దావా సరైనదే అని న్యాయస్థానం నిర్ధారించింది.

**Rodick Vs. Gandell**

**(1851 - 2) Degex 763 E.R. 749**

గాండెల్ అనే ఇంజనీర్ ఒక బ్యాంక్‌కు పెద్ద మొత్తంలో బాకీపడ్డాడు. ఆ బ్యాంక్ అతడిని సొమ్ము చెల్లించమని వత్తిడి చేస్తున్నది.

ఒకరైల్వే కంపెనీకి గాండెల్ అప్పిచ్చాడు. తను బాకీ వున్న బ్యాంక్‌కు, ఇతర బాకీలను చెల్లించటానికి తన న్యాయవాదిని రైల్వే కంపెనీ నుంచి మొతాన్ని వసూలుచేసి తాను బాకీ ఉన్నవారికి సదరు మొత్తం నుంచి చెల్లించవలసిందని ఆదేశాలను ఇచ్చాడు. న్యాయవాదికి 'జి' ఆథరైజేషన్ ఉత్తరం ఇచ్చి రైల్వే కంపెనీ నుంచి మొత్తాన్ని వసూలుచేసి బ్యాంక్‌కు చెల్లించమన్నాడు. వసూలు అయినాక చెల్లించగలనని న్యాయవాది బ్యాంక్‌కు లిఖితపూర్వకంగా చెప్పాడు.

ఎందుకు - రుణదాతకు బాకీదారుడికి మధ్య ఎటువంటి ఒప్పందం లేదు. న్యాయవాది రైల్వే కంపెనీ నుంచి మొత్తాన్ని వసూలుచేసి బ్యాంక్‌కు చెల్లించకుండా గాండెల్‌కు సదరు మొత్తాన్ని ఇచ్చాడు. గాండెల్ దివాలా తీశాడు. అతని ఆస్తులను అధికారులు రుణదాత తరపున వశం చేసుకున్నారు. గాండిల్ తనకు చెల్లించవలసిన మొత్తం రైల్వే కంపెనీ నుంచి వసూలుచేసి దానిని తనకు ఇవ్వాలని, సదరు మొత్తం న్యాయవాది వసూలుచేశాడు కాబట్టి అది తనకు రావాలని బ్యాంక్ దావా వేసింది. ఇది సరైంది కాదని కోర్టు నిర్ధారించింది. బాకీదారుడు రుణదాతకు సదరు మొత్తం వసూలు అయినాక చెల్లించాలని ఉత్తర్వు రూపంలో అనలేదు కాబట్టి అది అమల్లోకి రాదు.

వసూలు చేయమని చెప్పేవారికి వసూలు చేసిన వ్యక్తికీ మధ్య ఒప్పందం ఉండాలి. వసూలు చేసిన వ్యక్తి సదరు మొత్తాన్ని మూడవ పక్షానికి చెల్లించవలసిందిగా మొదటి వ్యక్తి స్పష్టంగా ఆదేశం ఇవ్వాలి. అటువంటి ఆదేశం లేనప్పుడు సదరు వ్యక్తి వసూలుచేసిన మొత్తాన్ని మొదటి వ్యక్తికి చెల్లించవచ్చు.

అదేవిధంగా వ్యవహరించటానికి అధికారిక బదలాయింపు - పవర్ ఆఫ్ అటార్నీ - లేదా గుర్తింపు లభించినప్పుడు వసూలుచేసిన మొత్తాన్ని మూడవ పార్టీకి చెల్లించమని ఆదేశించినప్పుడు అది సమతకు సంబంధించిన ఆదేశం కాదు. చెక్కు సమతకు సంబంధించిన పత్రం కాదు, ఎందుకంటే బ్యాంక్ నుంచి ఆ మొత్తాన్ని తీసుకోవాలి కాబట్టి.

**Hopkinson Vs. Forster (1874) L.R. 19 Eq. 74**

ప్రత్యేకమైన మొత్తం నుంచి నిర్దిష్టమైన మొత్తాన్ని ఫలానా వ్యక్తికి చెల్లించాలని స్పష్టంగా చెప్పినప్పుడు అది సార్థకమైన ఆదేశం కాగలదు.

**Percival VS. Dunn (1885) 29 Ch. D 128**

## సమత ఒప్పందం విషయంలో నోటీస్ అవసరమా?

1. రుణగ్రస్థుడికి నోటీస్ ఇవ్వకపోయినప్పటికీ సమతా ఒప్పందం చేసుకున్నప్పుడు అది పూర్తిగా వర్తించేదే.

2. అయితే రెండు కారణాలవల్ల రుణగ్రస్థుడికి నోటీస్ ఇవ్వవలసి ఉంటుంది:-

(i) నోటీస్ కనక లేకపోయినట్లైతే రుణగ్రస్థుడు సదరు బాకీని మొదటి రుణదాతకు యథేచ్ఛగా చెల్లించవచ్చు అందుకు అతడిని తప్పుపట్టలేము. అలా కాకుండా నోటీసును లెక్కచేయకుండా

మొత్తాన్ని ఎసైనర్‌కు చెల్లించినట్లైతే, అతడు సదరు మొత్తాన్ని ఎసైనీకి తిరిగి చెల్లించవలసి ఉంటుంది.

**Stocks Vs. Dobson (1853) 4 De. G.M. 4 G.11**

(ii) నోటీస్ కనక లేకపోయినట్లైతే ఎసైనీకి ఎటువంటి ప్రాధాన్యత ఉండదు. అతని తర్వాత ఎసైనీలుగా ఉన్నవారికి అదే ఎసైనర్ ఇవ్వవచ్చు.

**Deary Vs. Hall (1823) RSESS 1 = SF**

**C.P. 57** వివాదంలో ఈ నియమం వర్తింపజేసారు

## వాస్తవాలు

పీటర్ బ్రౌన్ తన వీలునామా రాసి మరణించాడు. అందులో తన వ్యక్తిగత ఆస్తిని అమ్మి దానిని ఒక ధర్మనిధిగా ఏర్పాటుచేసి ఆ మొత్తంపై వచ్చే వడ్డీని జీవితాంతం వరకు తన కుమారుడైన జకారియా బ్రౌన్‌కు చెల్లించవలసినదిగా విల్లు అమలుదారులను ఆదేశించాడు. సదరు ఆదాయం సంవత్సరానికి 93 పౌండ్లు వరకు ఉంది.

డిసెంబర్ 19, 1808న విలియమ్ డియర్లీకు బాకీపడ్డ 204 పౌండ్లు చెల్లింపులో భాగంగా తన వార్షిక ఆదాయంలో 37 పౌండ్లు అతనికి చెల్లించటానికి ఏర్పాటు చేశాడు. అలాగే సెప్టెంబర్ 26, 1809న షెరింగ్‌కు తను బాకీపడ్డ 150 పౌండ్లకుగాను; తనకు వచ్చే ఆదాయంలో 27 పౌండ్లు, డియర్లీకి చెల్లించిన అనంతరం, చెల్లించటానికి అంగీకరించాడు.

అయితే డియర్లీకానీ, షెరింగ్‌కానీ అమలుపరిచేవారికి ఎటువంటి నోటీస్ ఇవ్వలేదు.

1872లో నిధి మొత్తాల్లో అమ్మకంద్వారా వచ్చిన ఆదాయం. అది ఎవరికి చెల్లించవలసింది కాదని తన జీవిత వార్షిక ఆదాయం 93 పౌండ్లను ప్రకటించాడు.

జోసెఫ్ హాల్ దీనిని కొనటానికి నిర్ణయించుకొని బ్రౌన్ పట్టా గురించి వాకబు చేయమని తన న్యాయవాదిని ఆదేశించాడు. అతడు నిధి అమలుదారులను కూడా విచారించాడు. వారికి బ్రౌన్‌కు వడ్డీ రూపేణా చెల్లించే వార్షిక మొత్తంపై ఉన్న అప్పు తాలూకు విషయాలు ఏవీ తెలియవు. దానితో 711-3-6 పౌండ్లకు హాక్ బ్రౌన్ వడ్డీని మాని తనకు దానిని దఖలు చేయించుకున్నాడు.

అక్టోబర్ 27, 1812 నాడు డియర్లీ, షెరింగ్ తమకు ఇచ్చిన రుణపత్రాల గురించి నిధి అమలుదారులకు నోటీస్ ఇచ్చారు.

వారి హక్కులను నిర్ణయించేంతవరకూ ఎవరికీ చెల్లించటానికి అమలుదారులు తిరస్కరించారు. జోసెఫ్ హాల్‌కు వ్యతిరేకంగా డియర్లీ, షెరింగ్‌లు ముందుగా 93 పౌండ్లలో తమకు చెల్లించవలసింది చెల్లించక హాల్ ప్రాధాన్యతను గుర్తించాలని న్యాయస్థానాన్ని అభ్యర్థించారు. మొదట వచ్చిన వ్యక్తి చట్టప్రకారం మొదటివాడు అనే న్యాయసూత్రాన్ని వర్తింపజేసి తాను ముందుగా వచ్చాడు కాబట్టి హాల్ కంటే తనకే ప్రాధాన్యత ఇవ్వాలని డియర్లీ వాదించాడు.

అయితే హాల్‌కే ప్రాధాన్యత ఇవ్వాలని కోర్ట్ నిర్ణయించింది.

**Judgement of Plumer M.R.S. 4 c P.55** ఒక వ్యక్తి హక్కును గుర్తించే విషయంలో ఈ నియమం అజాగ్రత్తగా రూపొందించారు. అయితే ఈ నియమం ఇప్పుడు స్థిరంగా వ్యవహారానికి అతీతంగా ఉంది. ఇతర హక్కుదారులు అజాగ్రత్తగా వ్యవహరించినా లేకపోయినా ఎవరు ముందుగా తన హక్కు అమలుకు సక్రమమైన నోటీస్ ఇస్తారో వారికే ముందుగా చెల్లించవలసి ఉంటుంది.

**Re Dallas (1904) 2 Ch. 385**

**Dearly Vs. Hall** వివాదంలో చేసిన నిర్ణయం అన్ని హక్కుదారులకు ఎల్లప్పుడూ వర్తిస్తుంది.

**Dearly Vs. Hall** పరంగా ఎవరికి నోటీస్ ఇవ్వాలి?

1. రుణగ్రస్థుడికి, ధర్మకర్తకు లేదా చెల్లింపుదారుడికి అతడు ఎవరికి చెల్లించవలసిన బాధ్యత ఉంటుందో వారికి నోటీస్ ఇవ్వాలి.
   **Stephens Vs. Green, (1895) 2 Ch. 148**

2. న్యాయవాదికి ఇచ్చిన నోటీస్ అతడు దానిని స్వీకరించటానికి అధికారికంగా ధ్రువీకరించబడినప్పుడే సార్థకమవుతుంది.
   **(1880) 14 Ch. D. 406**

3. అనేక రుణగ్రస్థులు లేదా ధర్మకర్తలు ఉన్నప్పుడు ఒకళ్ళకు ఇచ్చిన నోటీస్ అందరికీ ఇచ్చినట్లే.

4. పాత ధర్మకర్తలకు నోటీస్ జారీచేసినప్పుడు నూతన ధర్మకర్తలకు తాజా నోటీస్ అవసరంలేదు.

## నోటీస్ ఏరూపంలో ఉండాలి

1. ఇంతకు ముందు నోటీస్ లిఖితపూర్వకంగా కాకుండా మౌఖికంగా ఉన్నా సరిపొయ్యేది.

2. అయితే 1925 నుంచి అది లిఖిత రూపంలో ఉండటమైంది.

## అసైనీ ఎటువంటి పట్టాను పొందుతాడు?

1. అసైనర్‌కు ఉన్న హక్కు కంటే అసైనీకి శ్రేష్ఠమైన హక్కు ఉండదు అనేది సమత సాధారణ నియమం.

2. మరో మాటలో చెప్పాలంటే అసైనీ హక్కు అసైనర్ ఇతరులకు దాఖలు చేసిన మాట ద్వారా పరిమితం అవుతుంది.

Raxburghe Vs Cox, (1881) Mch.D 520

అందువల్ల-

(1) అసైనర్ అసైనీల మధ్య ఒప్పందం సార్థకమైనదైతే రుణగ్రస్తుడు సార్థకమైన ఒప్పందాన్ని అసైనీకి వ్యతిరేకంగా ఏర్పాటు చేయవచ్చు, అసైన్‌మెంట్ ఎంత విలువ అయినది అయినప్పటికీ.

(2) రుణగ్రస్తునికి అసైనర్‌కు వ్యతిరేకంగా వ్యవహరించటానికి హక్కుంటే, అసైనీకి వ్యతిరేకంగా కూడా అది అతనికి లభ్యం కాదా.

(3) అయితే నోటీస్ జారీ చేసిన తరువాత దాని పరిణామం నుంచి అసైనీ స్వతంత్రంగా వ్యవహరించవచ్చు.

నోటీస్ ఇచ్చిన నాటి నుంచి రుణగ్రస్తుడు అసైనీ హక్కులను ఏమాత్రం తగ్గించలేడు, ఎటువంటి చర్య నోటీస్ అనంతరం వర్తించదు.

## భవిష్యత్తులో ఏర్పడే అసైన్‌మెంట్ (బదిలీ) హక్కులు

1. ఇంతవరకూ అసైన్‌మెంట్ జరిగిన తర్వాత ఏర్పడే హక్కుల గురించి చెప్పాము.

2. ఇప్పుడు అసైన్‌మెంట్ ద్వారా ఏర్పడే హక్కులను పరిశీలిద్దాము.

3. అటువంటి హక్కులకు ఉదాహరణలు.

(i) ఆస్తికి చట్టపరంగా వారసుడు అత్యున్నత వ్యక్తి ఎదురుచూసేది.

(ii) అతడికి వారసుడయ్యే వ్యక్తి ఎదురుచేసేది.

(iii) ఇంకా సంపాదించనటువంటి ''ఫ్రేట్''.

(iv) భవిష్యత్ ''బుక్-డెట్స్''

4. సాధారణ చట్టం ప్రకారం ఇవన్నీ సార్థకాలే. తనకు రానటువంటిది ఒకడు మరొకడికి దఖలు చేయలేడు. కొంత మొత్తానికి, సమతాపరంగా అటువంటిది చేయవచ్చు.

5. ఈక్విటీ ప్రకారం అవి ఒప్పందాలే కానీ అసైన్‌మెంట్‌లు కావు. అసైనీ వాటిని పొందినప్పుడు ఒప్పందం షరతులను అతడు అమలుపరచవలసి ఉంటుంది.

6. అసైనర్ హక్కును సంపాదించుకున్నప్పుడు దాని తాలూకు లాభదాయక అంశం తక్షణమే అసైనీకి చేరుతుంది. అందువల్ల, అసైనర్ అటు తర్వాత మరొకరికి కొంత మొత్తానికి దానిని బదిలీ చేసినట్లైతే, ఇంతకుముందటి వ్యవహారం గురించి అతడికి నోటీస్ లేకపోయినట్లైతే, తరువాత అసైనీ పట్టా హక్కు చెల్లుతుంది.

## మార్పిడి (Conversion)

### 1. మార్పిడి సిద్ధాంతం ఆవశ్యకత

1. వీలునామా వ్రాయకుండా చనిపోతే ఇంగ్లీషు చట్టం వ్యక్తిగతానికి మార్పిత్వానికి మధ్య వ్యత్యాస పద్ధతిని సూచించింది. వాస్తవంలో ఉన్నది అతని వారసుడికి చెందుతుంది. వ్యక్తిగతమైనది అతడి సమీప బంధువుకు చెందుతుంది.

2. అలా ఉండటం వల్ల వారసత్వం ప్రారంభం అయిన తేదీనాడు ఉన్న ఆస్తి స్థితి వారసుడికి లేదా సమీప బంధువుకు చెందాలన్నది నిర్ణయిస్తుంది.

3. సాధారణంగా ఎటువంటి ఇబ్బందీ ఉండదు. నిర్ధారించిన నాడు ఆస్తి వాస్తవ స్థితి అది ఎవరికి చెందాలో నిర్ణయించటానికి ఉపకరిస్తుంది. అయితే కొన్ని ప్రత్యేక సందర్భాల్లో, అంటే ఆస్తి స్వాధీనతనాడు, అందులో కొంత అమ్మాలని ఇంతకుముందే నిర్ణయించుకుని, అమ్మకం జరగనప్పుడు, లేదా భూమిని కొనాలని నిర్ణయించుకుని, డబ్బును ఇంకా చెల్లించనప్పుడు లేదా కొంత మొత్తాన్ని ఎందులోనో పెట్టుబడిగా పెట్టాలనుకుని, ఇంకా అది చేయనప్పుడు, ఆస్తి పంపకం ఏవిధంగా నిర్ణయం అవుతుంది? భూమిని వాస్తవంలో భూమిగా భావించి, దానిని కనక అమ్మినట్లైతే, సదరు మొత్తం వారసుడికే చెందుతుంది. అలాకాకుండా దానిని ధనంగా భావించినట్లైతే, ఎందుకంటే డబ్బు కోసమే అమ్మాలనుకుంటే, అది భూమి రూపంలోనే ఉన్నప్పటికీ, సమీప వారసుడికి అది చెందుతుంది. మరో మాటలో చెప్పాలంటే ఆస్తి వాస్తవంలో ఏ రూపంలో ఉంది, లేదా ఏవిధంగా దాని మార్పిడి జరగాలని

నిర్ణయించటమైంది అనేది పంపకంలో ముఖ్యమైన ప్రశ్న. సమతా పరంగా చూస్తే ఆస్తి ఏ రూపంలో ఉందనేది కాదు. అది ఎలా ఉండాలని నిర్ణయించారో అదే ముఖ్యం. ఇక్కడ ఆస్తి రూపం మార్పిడి ముఖ్యాంశం.

4. దీనినే మార్పిడి సూత్రం అంటారు. వాస్తవ, వ్యక్తిగత ఆస్తి మధ్య వ్యత్యాసాన్ని సూచించే నియమం లేకపోతే మార్పిడి సూత్రం ఆవశ్యకత ఏర్పడేది కాదు. విభాగాలు 33, 45 ఈ వ్యత్యాసాన్ని రద్దు చేశాయి. అందువల్ల మార్పిడి ప్రాముఖ్యాన్ని కోల్పోయింది.

5. వ్యక్తిగత, వారసత్వ ఆస్తుల మధ్య వ్యత్యాసం ఇండియాలో లేదు.

## II. మార్పిడిని నాలుగు అంశాలు అవసరం చేస్తున్నాయి.

(1) చట్టం అమలు

(2) న్యాయస్థానం ఉత్తరువు అమలు

(3) ఒప్పందం అమలు

(4) వీలునామాలోని లేదా ఒక ఒప్పందంలోని నిర్దేశం అమలు.

## (1) చట్టం అమలు ద్వారా మార్పిడి

1. ఒక్క కేసు సందర్భంలోనే చట్టం అమలు ద్వారా ఆస్తి మార్పిడి చెందుతుంది. ఆ వివాదం భాగస్థులకు సంబంధించినది. 1890 భాగస్థుల చట్టంలోని 39వ విభాగం అన్ని రుణాలు, బాధ్యతలు పూర్తి చేసిన తర్వాత ఆస్తి అమ్మకం తాలూకు మొత్తం భాగస్థులు వారి వాటాల ప్రకారం పంచుకోటానికి అవకాశం కల్పించింది. ఫలితంగా భూమిని భాగస్తుల ఆస్తిగా, వ్యక్తిగత ఆస్తిగా వాస్తవంగా కాకుండా చూడటం జరిగింది.

2. వ్యక్తిత్వ ఆస్తిగా పరిగణించినప్పుడు అది భాగస్తుల/ వారి మరణానంతరం వారి ప్రతినిధుల ఆస్తిగా, వారికి పంచే విధంగా చూడటమే కాకుండా మరణించిన భాగస్తుని వారసులకు మధ్య పంపకానికి కూడా ఆస్తికి వ్యక్తిగత రూపం ఇవ్వటమైంది.

3. భాగస్వాముల ఆస్తిగా మారినప్పటి నుంచి వాస్తవ ఆస్తి వ్యక్తిగత రూపం ధరిస్తుంది. దీనికి భాగస్వామ్యం రద్దుతో లేదా ఒక భాగస్వామి మరణంతో సంబంధం లేదు.

4. వేరే ఉద్దేశం కనపడకపోయినట్లైతే భాగస్వామ్య ఆస్తికి మార్పిడి సూత్రం వర్తిస్తుంది. భాగస్థుల ఆస్తిని మార్పిడి చేయడానికి కారణం ఏమిటంటే భాగస్వామి తన వాటాను రద్దు చేసుకున్నప్పుడు ఆస్తి ఏ ప్రత్యేక రూపంలో పంచుకోవాలన్నా ముందుగా నిర్ధారించకపోవటమే. అయితే అటువంటిది ఒప్పందంలో ఉంటే ఆస్తి మార్పిడి వర్తించదు ఎందుకంటే అది ప్రకటితమైన ఉద్దేశానికి విరుద్ధం కాబట్టి.

## (2) న్యాయస్థానం ఉత్తరువు ద్వారా మార్పిడి

1. ఆస్తి అమ్మకానికి న్యాయస్థానం ఉత్తరువు జారీ చేసినపుడు వారసుడికి ఆస్తి వారసత్వంలో అది ఏ రూపంలో ఉంటే అప్పుడది అతడికి ఆ విధంగా చెందుతుంది.

<u>ఉదాహరణ:</u>

ఒక వాస్తవ ఆస్తిలో **A,B,C**లకు సమాన వాటాలు ఉన్నాయి. ఆస్తిని మార్పిడి చేయటానికి ఉత్తర్వులు జారీచేసినప్పుడు దానికి వారసులు వారి సమీప బంధువే కానీ చట్టబద్ధ వారసులు కారు.

2. ఈ సందర్భంలో ఈ క్రింది అంశాలను గుర్తించాలి:

**(i)** అమ్మకానికి ఇచ్చే ఉత్తరువు న్యాయస్థానం పరిధిలో ఉండాలి.

**(ii)** అమ్మకం ద్వారా వచ్చే మొత్తం అమ్మకం ఉద్దేశం కంటే ఎక్కువా తక్కువా అనేదానికి సంబంధం లేదు. వ్యయాన్ని భరించటానికి అమ్మకం జరిగి ఉండవచ్చు. అయినప్పటికీ న్యాయస్థానం పరిధిలోనే ఉత్తరువు ఉంటే, ఆస్తి మార్పిడి జరుగుతుంది.

**(iii)** అమ్మకం నిజంగా జరిగిందా లేదా అమ్మకానికి నిర్ణయించటమైందా అనే విషయంతో సంబంధం లేదు. అమ్మకానికి జరిగిన ఉత్తరువు మార్పిడికి సరిపోతుంది.

**(iv)** మార్పిడి ఉత్తరువు జారీ అయినప్పటి నుంచి అమ్మకం జరిగిన నాడు కాకుండా- అమల్లోకి వస్తుంది.

(3) వారసత్వానికి సంబంధించినంత వరకూ రెండు సందర్భాల్లో మార్పిడికి కోర్టు ఇచ్చిన ఉత్తరువు వర్తించదు: అవి-

(i) అమ్మకం నుంచి వచ్చే సొమ్ము సమీప బంధువుకు కాకుండా వారసుడికి ఎప్పుడు చెందుతుందంటే ఆస్తి విషయాల్లో అటువంటి మార్పు ఉండదని ఉత్తరువు జారీచేసినప్పుడు

(ii) మార్పిడిని నిషేధిస్తూ ఏదైనా షరతు ఒప్పందంలో ఉన్నప్పుడు ఉదాహరణకు 1890 లానాసీ చట్టంలోని 123వ విభాగం ప్రకారం మతిస్థిమితం లేని వ్యక్తి ఆస్తిని అమ్మినప్పుడు ఆ సొమ్ము ఆ ఆస్తిని అమ్మినట్టుగానే భావించి అతని వారసులకు చెందుతుంది.

## (3) ఒప్పందం అమలు ద్వారా మార్పిడి

1. ఆస్తిని అమ్మటానికి ఒప్పందం ఉన్నట్లైతే దానిని వ్యక్తిత్వ సంపదగానే గుర్తిస్తారు. కొనుగోలుదారుని ఆసక్తిని వాస్తవంగా పరిగణిస్తారు, వ్యవహారం పూర్తికాకుండానే అతడు మరణించినప్పటికీ.

2. అయితే ఇది ఒక పరిమితికి లోబడి ఉంటుంది. అదేమిటంటే న్యాయస్థానం ఉత్తరువు ప్రకారం ఒప్పందం ఒక ప్రత్యేక చర్యకు సంబంధించినది అయివుండాలి- 34 Ch.D. 166 కేవలం నోటీస్ మార్పిడి నియమం అమలుకు సరిపోదు. ఒప్పందం అర్థాంతరంగా భగ్నమైనా, అమలు జరపడం సాధ్యం కాకపోయినా మార్పిడి జరగదు.

(4) కొనుగోలు చేయాలన్న ఉద్దేశంతో కౌలుకు తీసుకున్నప్పుడు సదరు ఒప్పందం కింద మార్పిడి.

A. ఏడు సంవత్సరాలకుగాను Bకి కొంత ఆస్తిని, అతడు ఒప్పందం కాలం పూర్తయ్యే లోపల కొనుగోలు చేయటానికి అవకాశం కల్పిస్తూ, కౌలుకు ఇచ్చాడు.

B. కొనుగోలు చేయటాన్ని ఉపయోగించుకున్నాడు.

ఇందులో మూడు ప్రశ్నలు తలెత్తుతాయి.

(i) కొనుగోలు చేసే అవకాశం మార్పిడిని సూచిస్తుందా?

(ii) కౌలుకు ఇచ్చిన వ్యక్తి మరణించిన అనంతరం కొనుగోలు చేస్తే చెల్లుతుందా?

(iii) ఏ తేదీ నుంచి సదరు మార్పిడి అమల్లోకి వస్తుంది?

(i) కొనుగోలు చేసే అవకాశం మార్పిడిని అమలుపరుస్తుందా?

చట్టం ప్రకారం ఆస్తి అమ్మకం కోసం అవకాశం కౌలుదారునికి ఉంది. కొనుగోలు చేయటానికి అంగీకారం కొనుగోలు చేయటానికి అంగీకరించినట్లే అని సూచిస్తుంది. ఒప్పందంలో భాగంగా కొనుగోలు చేయటం ద్వారా మార్పిడి సంభవిస్తుంది. అందువల్ల మొదటి ప్రశ్నకు సమాధానం ''అవును'' అని చెప్పవలసి ఉంటుంది.

**(ii)** కౌలుదారుని మరణానికి ముందు, కౌలుకు ఇచ్చిన వ్యక్తి మరణానంతరం కొనుగోలు చేయటానికి అవకాశాన్ని ఉపయోగించినప్పుడు

(1) కౌలుదారుడు కౌలుకు ఇచ్చిన వ్యక్తి మరణానికి ముందే తన అవకాశాన్ని ఉపయోగించుకున్నప్పుడు అంటే అతడు జీవించి ఉండగానే కొనుగోలు చేసినప్పుడు అది చట్టరీత్యా చెల్లుతుంది.

(2) అయితే కౌలుకు ఇచ్చిన వ్యక్తి మరణానంతరం కౌలుదారుడు కొనుగోలు చేసినప్పుడు అది మార్పిడి చెందదు. ఎందుకంటే ఒప్పందం రద్దవుతుంది కాబట్టి. అమ్మకానికి చూపిన వ్యక్తి మరణించినప్పుడు సదరు అమ్మజూపటం అంగీకరించబడదు.

అయితే **Lawes Vs. Benett (1785) 1 Cax 167** వివాదంలో కౌలుకు ఇచ్చిన వ్యక్తి మరణించినట్టయితే సదరు కొనుగోలు, తత్ఫలితంగా జరిగిన మార్పిడి చెల్లుతుందని తీర్పునివ్వటం జరిగింది.

(3) **Lawes Vs Benett** వివాదంలో ఏర్పడిన నియమం సాధారణ పరిస్థితి కంటే భిన్నమైంది. అది దాని అమలువరకే పరిమితం అయింది. కౌలుకు ఇచ్చిన వ్యక్తిపరంగా హక్కుకు పోటీపడుతున్న వ్యక్తులకే అది వర్తిస్తుంది. అది కౌలుదారునికీ కౌలుకు ఇచ్చిన వ్యక్తికీ మధ్య వర్తించదు.

<u>ఉదాహరణ</u>: A కొంత ఆస్తిని కొనుగోలు చేసుకోటానికి అవకాశం ఇస్తూ Bకి కౌలుకు ఇచ్చాడు. దాని నివాస స్థలం భీమా చేయబడింది. B కొనుగోలు చేయాలన్న అవకాశాన్ని వినియోగించుకునే లోపలే ఆ ప్రదేశం అగ్నికి ఆహుతి అయి నాశనమైంది. B సదరు ఆస్తిని కొనుగోలు చేస్తూ భీమా మొత్తాన్ని కావాలని అడగలేదు. ఎందుకంటే కొనుగోలు ఒప్పందం A Bల మధ్యనే జరిగింది కాబట్టి (1878) **7Ch D858 10 Ch.D. App. 386.**

**(iii) ఏ దశ నుంచి ఒప్పందం ద్వారా మార్పిడి అమల్లోకి వస్తుంది?**

1. ఒప్పందం చేసుకున్న క్షణం నుంచి మార్పిడి అమల్లోకి వస్తుంది.

2. కొనుగోలుకు సంబంధించిన ప్రాధాన్యత కాలు ప్రారంభం అయినప్పటినుంచి అమల్లో ఉంటుంది.

3. లాభాలకు సంబంధించినంత వరకూ కొనుగోలు జరిగేంత వరకు ఆస్తి వ్యాపార భూమిగా పరిగణించబడుతుంది. అందువల్ల అద్దెలు లాభాలు సదరు ఆస్తికి చట్టబద్ధమైన వారసుడు తీసుకుంటాడు.

4. పంపకం విషయంలో అది వ్యక్తిత్వమైనదే.

## యజమాని నిర్దేశం ప్రకారం మార్పిడి

1. ఒప్పందం లేదా వీలునామా ద్వారా మార్పిడికి రెండు అవసరం అవుతాయి.

   (i) ఆస్తిని కొనుగోలు చేయటానికి/ అమ్మటానికి నిర్దేశనం ఉండాలి.

   (ii) సదరు నిర్దేశనం అమలు జరగాలని పట్టుపట్టటానికి ఒక వ్యక్తి ఉండాలి. ఎవరో ఒకరి ప్రయోజనం కోసం మార్పిడి జరుగుతుంది. సదరు లాభం నాకు చెందాలని అడిగే వ్యక్తి లేనప్పుడు మార్పిడి అవసరం ఉండదు.

2. మార్పిడి అమలుకు నిర్దేశనం ఖచ్చితంగా అమలు జరిగేలా ఉండాలి. అలా కాకుండా కేవలం అమలుకు మాత్రమే నిర్దేశనం ఉంటే ఆస్తి నిజమైందిగా, వ్యక్తిగతమైందిగా పరిగణించడం జరుగుతుంది.

గమనిక: నిర్దేశనం నిజంగా ప్రాధాన్యత కలిగి ఉందా లేదా ప్రాధాన్యత కలిగి వున్నట్లు కనిపిస్తుందా తెలుసుకోవటానికి Earlam Vs Saunders- (1754) Ambler's reports 241 చూడండి. నిర్దేశనం ప్రాధాన్యతతో లేకపోయినప్పుడు, ఖచ్చితంగా ఉండాలి.

(3) అమ్మకానికీ కొనుగోలుకు మధ్య వ్యత్యాసాన్ని నిర్దేశనం చూపించాలి. అలాగే కొనుగోలు/ అమ్మకం చేసే సమయాన్ని కూడా చెప్పాలి:-

   (i) నిర్దేశనం ఖచ్చితంగా ఉంటేఅది విచక్షణతో కూడుకున్నదైనప్పటికీ మార్పిడి ప్రభావాన్ని అపలేదు.

   (ii) నిర్దేశనం ఖచ్చితగా ఉంటే, అది ఎవరికి ఉద్దేశించటమైందో వారు దానిని అనుసరించటంలో విఫలం అయినప్పటికీ మార్పిడి ప్రభావం తగ్గదు.

(4) మామూలు అమ్మకం/కొనుగోలుకు సంబంధించిన నిర్దేశనం, ఒక వ్యక్తి అంగీకారం లేదా అభ్యర్థనపై ఆధారపడి అమలుజరిగే నిర్దేశనం మధ్య వ్యత్యాసాన్ని గమనించాలి. అటువంటప్పుడు, మార్పిడి ఉన్నా లేకపోయినా పత్రం నిర్మాణం ఈ క్రింది అంశాలపై ఆధారపడి ఉంటుంది:-

(i) నిబంధన ఉద్దేశం ప్రత్యేకంగా పేర్కొన్న వ్యక్తి బాధ్యతగా అమలు జరపవలసిన మార్పిడి వల్ల మార్పిడి జరుగుతుంది.

(ii) నిబంధన ఉద్దేశం నిర్దేశనం అమలును నియంత్రించదలచుకుంటే సదరు అభ్యర్థన జరిగేంతవరకు మార్పిడి ఉండదు.

(5) మార్పిడిని చేసే అధికారము, మార్పిడిని కోరే నిర్దేశనం మధ్య వ్యత్యాసాన్ని గమనించాలి:-
**(1892 1 Ch. 279**
**(1910) 1 ch. 750.**
మార్పిడిని చేసే అధికారం మార్పిడి చెయ్యమని నిర్దేశించడం కాదు. కేవలం సదరు అధికారం మార్పిడిని చేయలేదు.

ఉదాహరణ:

A తాకట్టు పెట్టి B వద్ద 300 పౌండ్లను అప్పుచేశాడు. అంతేకాకుండా తాకట్టుపెట్టినది అమ్మి అప్పుపోగా మిగిలిన సొమ్ము తను చెల్లించేలా Bకి అధికారం ఇచ్చాడు.

A వీలునామా రాయకుండా మరణించాడు. అతని మరణానంతరం B ఆస్తిని అమ్మాడు. అప్పు పోగా అదనపు సొమ్ము లభ్యమైంది.

ఈ అదనపు సొమ్మును ఎవరికి చెల్లించాలి?

A మరణించినప్పుడు కేవలం ఆస్తి అమ్మకానికి నిర్దేశనము ఉంది కాబట్టి ఆస్తి యథాతథంగా ఉంది. అతని మరణానంతరం అది అతని వారసునికి చెందుతుంది. A జీవించిన కాలంలో అమ్మకం జరిగినట్లైతే, అతని మరణానంతరం వ్యక్తిగతమైన ఆస్తిగా అతని సమీప బంధువుకు సంక్రమిస్తుంది.

## II. ఏ సమయంలో నిర్దేశనం ప్రకారం మార్పిడి జరుగుతుంది?

1. వీలునామాలో లేదా ఒప్పందంలో పేర్కొన్న నిర్దేశనం ప్రకారం ఇది మారుతుంది.

2. వీలునామాలో కనక నిర్దేశనం ఉంటే వీలునామా కర్త మరణానంతరం అది అమల్లోకి వస్తుంది.

3. నిర్దేశనం ఒప్పందంలో ఉంటే ఒప్పందం అమలు జరగిన నాటి నుంచి అమల్లో కొస్తుంది. మరణానంతరమే అమ్మకం/కొనుగోలు చేసినప్పటికీ.

**I. వీలునామాలో ఒప్పందంలో సూచించినమా మార్పిడి సాధించటంలో విఫలం అయితే ంభవించే పరిణామాలు.**

1. రెండు కేసులను స్పష్టం చెయ్యాలి.

(i) పూర్తి వైఫల్యం ఉన్నవి.

(ii) పాక్షిక వైఫల్యం కలవి.

## i) పూర్తి వైఫల్యం ఉన్నవి

వీలునామా లేదా ఒప్పందం అమలుకావటానికి ముందు లేదా తరువాత సమయంలో లక్ష్యాల మల్లో పూర్తి వైఫల్యం ఉంటే లేదా ముందు సమయంలోనే మార్పిడి చేయవలసి ఉంది. ఎటువంటి ార్పిడి లేకుండా ఆస్తి యథాతథంగా ఉంటుంది. దీనికి కారణం ఏమంటే ఆస్తి రూపాన్ని మార్చాలని ట్టుపట్టే వాళ్ళు ఎవ్వరూ లేరు కాబట్టి.

2. వైఫల్యం ముందుగా జరిగిందే కానీ తరువాత జరిగిన వైఫల్యం కాదు.

(3) మార్పు చేయటానికీ మార్పిడికి నిర్దేశనం ఇవ్వటానికి మధ్య వ్యత్యాసాన్ని గమనించాలి.

**892 1 Ch. 279**

**(1910) 1 ch. 750.**

మార్పిడి చేయటానికి ఉన్న అధికారం మార్పిడికి ఇచ్చే నిర్దేశనం కాజాలదు. అందువల్ల అధికారం న్నంత మాత్రాన మార్పిడి జరగదు.

ఉదా: "A' "B' వద్ద 300 పౌండ్లు తనఖా పెట్టి అప్పు తీసుకున్నాడు. తనఖా పెట్టిన ఆస్తి అమ్మకం ంచి వచ్చిన అదనపు మొత్తాన్ని A తన వారసులకు చెల్లించమని Bకి అధికారం ఇచ్చాడు.

అయితే ఎటువంటి వీలునామా వ్రాయకుండానే మరణించాడు. B, A ఆస్తిని అమ్మాడు. ప్పుడు అప్పు పోను అదనపు మొత్తాన్ని ఎవరికి చెల్లించాలి?

అమ్మకానికి నిర్దేశనం ఇది కాకపోవటం వల్ల A మరణించినప్పుడు ఉన్న ఆస్తి అప్పటి స్థితిలో లేదు. అది వాస్తవమైన ఆస్తి అవటం వల్ల అది A వారసునికి చెందాలి. A జీవించి ఉన్న కాలంలో ఆస్తిని కనక అమ్మటం జరిగినట్లైతే A మరణానంతరం సదరు మొత్తం అతని సమీప వారసునికి లభించేది.

## II. నిర్దేశనం ద్వారా మార్పిడి ఎప్పటినుంచి ప్రారంభమవుతుంది?

1. పత్రంలో కానీ, వీలునామాలో కానీ సూచించిన మేరకు ఇది మారుతుంది.
2. నిర్దేశనం వీలునామాలో ఉంటే మార్పిడి వీలునామాదారుడు మరణించినప్పటి నుంచి అమల్లోకి వస్తుంది.
3. నిర్దేశనం ఖరారు పత్రంలో ఉంటే సదరు పత్రం అమలు జరిగిన నాటి నుంచి మార్పిడి అమల్లోకి వస్తుంది.

## III. పత్రంలో కానీ వీలునామాలో కానీ పేర్కొన్నది అమల్లోకి రావటంలో విఫలం అయితే సంభవించే పరిణామాలు

1. ఇక్కడ రెండు కేసులను పరిశీలించాలి.
   (1) పూర్తిగా విఫలమైనవి.
   (2) పాక్షికంగా విఫలమైనవి.

## (1) పూర్తిగా విఫలమైన కేసులు

1. వీలునామా లేదా ఖరారు పత్రం అమల్లోకి వచ్చినప్పుడు అందులోని అంశాలను అమలుపరచటంలో పూర్తి వైఫల్యం జరిగితే ఎటువంటి మార్పిడీ జరగదు. ఆస్తి యథాతథంగా ఉండిపోతుంది. ఎందుకంటే ఎవ్వరూ షరతులను అమలుపరచాలని అడిగేవారు ఉండరు కాబట్టి.
2. వైఫల్యం అమలుకు ముందుకానీ అమలు అయిన తర్వాత కాదు.
3. పూర్తి వైఫల్యం ఉన్నచోట మార్పిడికి సంబంధించిన నియమం అన్ని సందర్భాల్లో ఒకే విధంగా ఉంటుంది. అందువల్ల వీలునామా కానీ ఖరారునామా కానీ పరిణామాలు మార్పిడికి సంబంధించినంత వరకూ ఒకే విధంగా ఉంటాయి.

## (ii) పాక్షిక వైఫల్యం

1. పాక్షిక వైఫల్యాలు ఉన్న సందర్భంలో వైఫల్యాలకు సంబంధం లేని విషయాలు ఉన్నప్పుడు

మార్పిడి చేయవలసి ఉంటుంది. అందువల్ల ఆస్తికి సంబంధించిన ప్రతినిధి ఆస్తి మార్పిడి వ్యవహారాలను నిర్దేశనం ప్రకారం లేదా వీలునామా ప్రకారం అమలు చేయవచ్చు.

2. అవసరమైన చోట దానిని అమలుచేయటం జరుగుతుంది.

ఉదా: 'బి' 'సి' ల మధ్య తన ఆస్తిని అమ్మిన తర్వాత ఆ మొత్తాన్ని పంచమని 'ఎ' ఒకరికి బాధ్యతను అప్పగిస్తాడు. 'బి' మరణిస్తాడు. 'ఎ', 'సి' లు బ్రతికే వుంటారు. ఇప్పుడు ఆ ఆస్తిని అమ్మి 'సి' కి 'ఎ' ఇవ్వాలనుకున్న మొత్తాన్ని అతనికి చెల్లించడం జరుగుతుంది.

మరి 'బి' వాటాకు ఏమి జరుగుతుంది? అది అతని సమీప వారసునికి ఇవ్వవలసి ఉంటుంది. ఎటువంటి మార్పిడీ లేకుండా ఆ మొత్తాన్ని 'బి' వారసుడు తీసుకుంటాడు.

<u>ఉదాహరణ:</u>

'బి' 'సి'ల కోసం 'ఎ' కొంత మొత్తాన్ని ఒకరికి ఇచ్చి దానితో కొంత భూమిని కొనుగోలు చేయమంటాడు. 'బి' మరణిస్తాడు. 'సి' బ్రతికే ఉంటాడు. ఇక్కడ భూమిని కొనడం అవసరం. ఎందువల్లనంటే 'సి' కి 'ఎ' అనుకున్నట్టు భాగాన్ని పంచి ఇవ్వాలి కాబట్టి.

అయితే 'బి' వాటా సంగతి ఏమిటి? అతనికి చెందవలసిన భాగం అతని వారసునికి ఇవ్వడం జరుగుతుంది. ఇక్కడ మార్పిడి అనవసరం.

## పునర్మార్పిడి (Reconversion)

1. పునర్మార్పిడి అంటే ఇంతకుముందు అనుకున్న మార్పిడిని తిరిగి మార్చటం. దానిని రద్దు చేసి మరొకటి చేయటం.

2. పునర్మార్పిడి రెండు సందర్భాల్లో జరుగుతుంది.

(1) కక్షిదారుల చర్యల వల్ల

(2) చట్టాన్ని అమలు చేయటం ద్వారా

### (1) కక్షిదారుల చర్యలు

1) ఒక వ్యక్తి మార్పిడి ద్వారా లేదా ప్రారంభ స్థితిలో ఉన్న ఆస్తిని పొందాలనుకున్నప్పుడు ఇది జరుగుతుంది.

2) వ్యక్తులు మార్పిడి చేసుకోటానికి హక్కును కలిగి వుంటే సదరు మార్పిడి చేయవచ్చు.

(1) ఆస్తికి అతడు సంపూర్ణ యజమాని అయివుండాలి.

(2) అవిభక్త వాటాకు యజమాని- ధనాన్ని భూమి రూపం మార్చవలసి ఉంటే సహ యజమాని సమ్మతి అవసరం కాకుండా, ఎందుకంటే ధనాన్ని పంచవచ్చు కానీ భూమి పంపకంలో సమస్యలు ఏర్పడవచ్చు.

ఉదాహరణలు:

(1) 'ఎ' 'బి'లు సమష్టి యజమానులుగా భూమిని కొనుగోలు చేసి వుండింటే, ఇక్కడ 'ఎ' 'బి' అనుమతితో అవసరం లేకుండా భూమిని తిరిగి ధనం క్రింద మార్చుకోవచ్చు.

(2) మిగిలిన వ్యక్తి పునర్మార్పిడిని చేయవచ్చా? ఈ విషయం సరిగ్గా ధ్రువపడలేదు.

(3) పునర్మార్పిడి యజమానికి అలా చేయటానికి అవకాశం ఉంటే సాధ్యమవుతుంది. అయితే చట్టపరంగా అతనికి ఎటువంటి ఇబ్బంది లేనప్పుడే ఇది సాధ్యమవుతుంది.

శిశువులు, మతిభ్రమణం ఉన్నవారు పునర్మార్పిడిని చేయలేరు. అయితే వారికి లాభదాయకం అని భావిస్తే న్యాయస్థానం సదరు పునర్మార్పిడికి అనుమతి ఇవ్వవచ్చు.

వివాహిత స్త్రీకి సొంతానికి ఆస్తి ఉన్నట్లైతే ఆమె కూడా పునర్మార్పిడిని చేయవచ్చు. అది ఆమె సొంత ఆస్తి కాకపోయినట్లైతే భర్త అనుమతితో చేయవచ్చు.

## పునర్మార్పిడికి సాక్ష్యం

(1) పునర్మార్పిడి కోసం స్పష్టమైన ప్రకటన.

(2) అటువంటి ఎంపికను సూచించే చర్యలు.

## (2) చట్టం ప్రకారం పునర్మార్పిడి

ఒక వ్యక్తికి తన ఆస్తిపై పూర్తి హక్కు ఉంటే. అతడు దానిని ఏ రూపంలోనైనా మార్చవచ్చు.

'ఎ' 'బి'తో తన వివాహం అయిన తర్వాత మూడు సంవత్సరాల్లో 1,000 పౌండ్లను పెట్టి భూమిని కొంటాడు. దానిని తన భార్య పేరిట ఉంచుతాడు. అయితే 'బి' వివాహం అయి సంవత్సరం తిరక్కుండానే మరణిస్తుంది. భూమిని కొని దానిని భార్య పేరిట ఖరారు చేసే బాధ్యత 'ఎ'కు ఉండటం వల్ల 'బి' అతని భార్య మరణించగానే సదరు బాధ్యత తాలూకు బద్ధత పూర్తి అయినట్టే ఇప్పుడు సదరు ఆస్తిని తిరిగి మరో రూపంలోకి అతడు మార్చుకోవచ్చు. అతని తదనంతరం అది అతని వారసుడికి చెందుతుంది.

## ఎంపిక

### 1. సమత, చట్టంపరంగా ఎంపికలో వ్యత్యాసం

(i) తన బాధ్యతను విస్మరించటానికి, అది చట్టం గుర్తించని విధంగా జరిగి ఉన్నట్లైతే తన చర్యను చట్టపరంగా ఆమోదింపజేసుకుని సమర్థించుకోవచ్చు.

(ii) సమత పరంగా చూసినట్లైతే ఒక బహుమానం ఎవరైనా ఇస్తే దానిని గ్రహించవచ్చు లేదా తిరస్కరించవచ్చు.

### II సమతాపరంగా ఎంపిక ఆవశ్యకత

(1) సమత పరిష్కరించే సమస్య ఏమిటి?

సమస్య స్వభావం

'ఎ' వీలునామా ద్వారా 'బి'కి కొంత ఆస్తిని ఇస్తాడు. అదే సమయంలో 'బి'కి చెందిన కొంత ఆస్తిని 'సి'కి ఇస్తాడు.

అటువంటప్పుడు 'బి' ఏం చేస్తాడు?

ఇక్కడ రెండు బహుమతులున్నాయి.

(i) 'ఎ' ద్వారా 'ఎ' ఆస్తి 'బి'కి ఇవ్వడం.

(ii) 'బి' ఆస్తిని 'ఎ' 'సి'కి ఇవ్వటం.

'ఎ' 'బి'కి ఇచ్చిన బహుమానం సార్థకమైంది. ఎందుకంటే అది 'ఎ'ది కాబట్టి, 'ఎ' 'సి'కి ఇచ్చిన 'బి' ఆస్తిని 'బి' తిరస్కరించవచ్చు.

ii. అయితే ఎంపిక సిద్ధాంతం ప్రకారం 'ఎ' 'సి'కు 'బి' ఆస్తిని ఇవ్వటం 'బి' అంగీకరిస్తేనే 'బి'కి ఎ' ఇచ్చిన బహుమానం చెల్లుతుంది.

III సమత సూత్రం ప్రకారం ఒక వ్యక్తి మరొకరి నుంచి ఒక బహుమతిని అంగీకరిస్తే దాని తాలూకు షరతులన్నిటినీ అతడు పూర్తిగా పాటించాలి. బహుమతి తీసుకుని షరతులను తిరస్కరించరాదు.

(iii) ఎంపిక చేసుకునే వ్యక్తి ముందున్న మార్గాలు

(a) ఎంపిక చేసుకొనవలసిన వ్యక్తికి లభించే పద్ధతులు

<u>ఉదాహరణ</u>

20,000 పౌండ్ల విలువ ఉన్న 'సి'కి చెందిన కుటుంబ భూమిని 'ఎ' 'బి'కి ఇస్తాడు. అదే వీలునామాలో 'సి'కి 30,000 పౌండ్ల తన స్వంత ఆస్తిని 'ఎ' 'సి'కి వ్రాస్తాడు. 'సి' ఇప్పుడు రెండు మార్గాల్లో ఏదో ఒకటి అవలంబించవచ్చు.

(1) 'బి'ని కుటుంబ ఆస్తిని తీసుకోనివ్వటం.

(2) కుటుంబ ఆస్తిని అట్టేపెట్టుకుని 'బి'కి 20,000 పౌండ్లను ఇవ్వటం.

'బి' మొదటి చర్య చట్ట ప్రకారం వ్యవహరించటం అవుతుంది. రెండవ చర్య చట్టానికి అతీతమైంది. ఈ సందర్భంలో ఈ క్రింది అంశాలను గుర్తుంచుకోవలసి వుంటుంది.

(1) సమత పరంగా ఎంపికను ఎప్పుడు అంగీకరించడం జరుగుతుందంటే బహుమతి గ్రహీత దానికి సంబంధించిన షరతును అంగీకరించినప్పుడే. దాని ప్రకారం తన ఆస్తిలో కొంత భాగాన్ని అతడు వదులుకోవలసి ఉంటుంది. ఖరారునామాకు వ్యతిరేకంగా స్వంత నిర్ణయం తీసుకోటాన్ని అంగీకరించదు. గ్రహీత ఏమీ ఇవ్వకపోతే అతడు ఏమీ తీసుకోలేడు.

(2) ఖరారుపత్రం ప్రకారం వ్యవహరిస్తున్నప్పుడు పరిహారం సమస్య ఉత్పన్నం కాదు.

(3) ఖరారు పత్రానికి అతీతంగా నిర్ణయించినప్పుడు సంపదలో కొంత భాగం పోతుంది. కాబట్టి దానికి సరైన పరిహారం పొందవచ్చు.

## IV సూత్రాన్ని అన్వయించటానికి అవసరమైన పరిస్థితులు

(1) దాత, గ్రహీత ఆస్తిని మూడవ వ్యక్తికి దఖలు పరచాలి.

(2) అదే ఖరారు పత్రం ద్వారా గ్రహీతకు దాత కొంత ఆస్తిని ఇవ్వాలి.

(3) గ్రహీతకు ఇచ్చిన ఆస్తిని మూడవ వ్యక్తికి పరిహారంగా ఇవ్వటానికి వీలుగా ఉండాలి.

(4) గ్రహీత ఆస్తి బదిలీ చేయటానికి వీలుగా ఉండాలి.

<u>గమనిక</u>: దాత ఆస్తిని ఇతరులకు దఖలు చేస్తున్నట్టు భావించడం జరుగుతుంది.

## V ఎంపిక నుంచి వేరుగా ఉన్న మరికొన్ని కేసులు

(1) ఒక వ్యక్తికి రెండు బహుమతులు- ఇటువంటి సందర్భాల్లో ఎంపిక సూత్రం వర్తించదు. అవి ఒక వ్యక్తి సొంత ఆస్తికి సంబంధించినవి.

ఇక్కడ గ్రహీత తనకు లాభదాయకమైంది అంగీకరించి, నష్టకరమైనదానిని తిరస్కరించవచ్చు. దాత రెండిటినీ అంగీకరించాలని స్పష్టంచేస్తే తప్ప గ్రహీత తన ప్రయోజనాలకు అనుగుణంగా వ్యవహరించవచ్చు.

2. ఒక బహుమతిలో రెండు ఆస్తులు- ఒకటి తీసుకుని మరొకటి వదులుకోమని దాత ఉద్దేశం అయితే తప్ప లబ్ధిదారుడు రెండూ తీసుకోవచ్చు లేదా ఒకటి వదులుకోవచ్చు.

**VI ముగింపు**

(1) సమతను మార్పిడి, ఎంపిక సూచిస్తాయి. సమత ఉద్దేశాన్ని కూడా గుర్తిస్తుంది.

(2) గ్రహీతకు ఎంపిక అవకాశం ఇవ్వటం దాత ఉద్దేశం కాకపోతే ఎంపికకు అవకాశం లేదు.

**I పనితీరు**

1. సమస్య :

ఒక చర్యను తీసుకోమని 'ఎ' 'బి'తో ఒప్పందం చేస్తాడు. 'ఎ' తీసుకున్న చర్య అదే ప్రయోజనాన్ని మొత్తంగా లేదా కొంతగా ప్రభావితం చేస్తుంది. ఉదా. ఒప్పందం ప్రకారం బాధ్యతను నిర్వహించాలి. అయితే సదరు చర్య దానికి సంబంధించి ఉండదు. అప్పుడు సదరు చర్యను ఏవిధంగా పరిగణించాలి? ఒప్పందానికి సంబంధం లేకుండా తీసుకొనే స్వతంత్రమైన చర్య ఒప్పందం ప్రకారం 'ఏ' తీసుకోవలసిన చర్యగా భావించడం జరుగుతుంది. సమత ప్రకారం తీసుకున్న చర్య ఒప్పందం బాధ్యలను నిర్వహించటానికి తీసుకొన్నదిగా భావించడం జరుగుతుంది.

2. నియమం

ప్రతి వ్యక్తీ తాను నిర్వహించవలసిన బాధ్యతను అమలుపరచటానికి అతడు చర్యలు తీసుకొంటాడని సమతా నియమం భావిస్తుంది. అతడి చర్యలు అతడి బాధ్యతల నిర్వహణకు వ్యతిరేకంగా ఉంటే అప్పుడు సమత అతని ఉద్దేశాన్ని ప్రశ్నిస్తుంది.

3. ఈ సూత్రాన్ని గుర్తించకపోతే వచ్చే ఇబ్బందులు

ఉదాహరణకు

తన వివాహమప్పుడు 'ఎ' సంవత్సరానికి 200 పౌండ్ల విలువగల భూములను ప్రతి సంవత్సరం కొని అవి అతని భార్య మరియు ప్రథమ సంతతికి సంయుక్తంగా లభించేలాగా మిగతా సంతతికీ ఒకవేళ వివాహం విఫలం అయితే సంక్రమించేలా ఒప్పందం చేశాడు.

'ఎ' అనుకొన్నట్లుగా భూములను కొన్నారు కానీ వాటిని ఎవరికీ కేటాయించలేదు. అందువల్ల అతని మరణానంతరం ఆ ఆస్తి అతని పెద్ద కుమారుడికి లభించింది. తనయుడు తండ్రి మరణానంతరం తండ్రి వ్యక్తిగత ఆస్తిలోంచి 200 పౌండ్ల విలువలో ప్రతి సంవత్సరం భూమిని కొని వాటిని వివాహం-వస్తువులుగా ఉపయోగించాడు. చర్య తీరు సూత్రం లేకుంటే అతడు పైరెండింటినీ పొంది ఉండేవాడు.

## II చర్యకు సంబంధించిన ప్రశ్నను ఈ క్రింది విధంగా వర్గీకరించవచ్చు:-

(i) కొనుగోలుకు, దాఖలు చేయటానికీ ఒప్పందం ఉండి ఆ ప్రకారం కొనుగోలు చేసినప్పుడు

(ii) వ్యక్తిగత ఆస్తిని ఒక వ్యక్తికి దాఖలు పరిచేలా ఒప్పందం ఉండి, ఆ వ్యక్తి ఎటువంటి వీలునామా వ్రాయకుండానే మరణించినప్పుడు సదరు ఆస్తి వాస్తవంలో లబ్ధిదారునికి లభ్యమవుతుంది.

## III మొదటి వర్గీకరణ క్రిందకు వచ్చే కేసులు

(1) ఉదాహరణ ఇంతకుముందే ఇవ్వడం జరిగింది.

<u>గమనించవలసిన అంశాలు</u>

(i) ఒప్పందం ప్రకారం కొనుగోలు చేయవలసిన భూముల విలువకంటే వాస్తవంలో కొన్న వాటి విలువ తక్కువగా ఉంటే, అది ఒప్పందం అమలుకు పాక్షికంగా చేసిన ప్రయత్నంగా భావించాలి.

(ii) ఒప్పందంలో భవిష్యత్‌లో భూముల కొనుగోలు గురించి చెప్పినప్పుడు వాటిని ఒప్పందం చేసిన వ్యక్తి అప్పట్లో వదులుకున్నట్లైతే అది ఒప్పందంలో కొంత భాగం అమలు చేసినట్లు భావించరాదు.

(iii) ఒప్పందం దారుడు కావాలనుకున్న ఆస్తికి భిన్నమైన స్వభావం కలిగిన ఆస్తి ఒప్పందం అమలులో భాగం కాదు.

## IV రెండవ వర్గంలోకి వచ్చే కేసులు

(i) ఒప్పందం కొంత మొత్తాన్ని (ధనాన్ని) వదిలిపెడితే

ఒక వ్యక్తి వివాహానికి ముందు తన భార్యకు 620 పౌండ్లు ఇవ్వాలనుకున్నాడు. అతడు వివాహం చేసుకున్నాడు. కానీ వీలునామా వ్రాయకుండానే మరణించాడు. అతని భార్య వాటా 650 పౌండ్ల కంటే తక్కువగా వుంది. భార్య ఒప్పందం అమలుకు దావా వేసింది. అయితే ఆమెకు 620 పౌండ్లు లభించడం

వల్ల అది ఒప్పందం భాగం కాదా అనే ప్రశ్న ఏర్పడింది. దానిని ఒప్పందం అమల్లో భాగంగా భావించి మిగిలిన మొత్తం బాకీగా రాబట్టుకోవడం సాధ్యం కాదని తీర్పు ఇవ్వటమైంది.

(2) ఈ వివాదంలో ఒప్పందాన్ని పూర్తిగా అమలుపరచడం జరిగింది. అందిన మొత్తం అందవలసిన దానికంటే తక్కువగా ఉన్నప్పటికీ ఒప్పందం అమలు జరిగినట్లే.

(3) రెండు అంశాలను గుర్తుంచుకోవాలి.

(i) ఒప్పందం చేసిన వ్యక్తి తన బాధ్యత నిర్వహించటానికి ముందు మరణిస్తే అక్కడ చర్య అవసరమవుతుంది.

(ii) చర్య తీసుకున్న అనంతరం అంటే బాధ్యతను పూర్తి చేసిన తర్వాత అతడు మరణిస్తే చర్య అవసరం ఉండదు.

## సంతృప్తి

### I సమస్య

ఎ, బికి ఏదో ఇవ్వవలసిన బాధ్యత ఉంది. దానికిగాను ఎ, బికి ఒక బహుమతిని ఏర్పాటు చేస్తాడు. ఇక్కడ ప్రశ్న ఏమిటంటే ఎ,బికి ఇచ్చేది బహుమతిగా భావించాలా లేక అది ఎ, బికి ఇవ్వవలసిన బాధ్యతగా తీసుకోవాలా? అది పని సంతృప్తి పరుస్తుందని అనుకోవాలా?

### II సంతృప్తి, చర్యల మధ్య సారూప్యత ఉంది. అయితే వాటి మధ్య మౌలిక భేదాలు కూడా ఉన్నాయి.

(1) చర్యలో బాధ్యతను నిర్వహించడం కనిపిస్తుంది. అయితే ప్రత్యేకంగా లబ్దిదారునికి సంబంధించినదై ఉండదు. సంతృప్తిలో చర్యదారుని బాధ్యత కనిపిస్తుంది. కానీ అది నిర్వర్తించినట్టు ఉండకపోవచ్చు.

(2) చర్యలో ఒప్పందదారుడి ఉద్దేశం నెరవేరిందా అనే దానికంటే చర్య ఒప్పందంలో అనుకొన్న ప్రకారం ఉందా లేదా అనేది ముఖ్యం. అయితే ఒక బహుమతి బాధ్యతను నెరవేరుస్తుందా అనేది బహుమతి దాత ఉద్దేశంపై ఆధారపడి ఉంటుంది.

(3) షరతుల ప్రకారం బాధ్యతను నెరవేర్చినట్లైతే అప్పుడు బాధ్యత తీరినట్లే. బహుమతి దాత బహుమతిని వీలునామాలో సూచించినప్పుడు, అది అతని బాధ్యతను నెరవేర్చే మేరకు ఉందా అనేది గ్రహీత దానిని తీసుకోవటం లేదా తిరస్కరించటంపై ఆధారపడి ఉంటుంది.

దానిని అతడు అంగీకరిస్తే బాధ్యత తాలూకు చర్య ముగిసినట్లే. తిరస్కరించినట్లైతే బాధ్యతను అమలు చేయమని అడిగే హక్కు అతడికి వుంటుంది.

**II ఉద్దేశం ఏమిటంటే అంతకుముందున్న బాధ్యతను నిర్వహించి సంతృప్తిపరచేందుకు ఇచ్చే బహుమతి.**

III సంతృప్తికి సంబంధించిన కేసులు రెండు విధాలుగా ఉంటాయి.

(i) సంపదను సృష్టించే చర్య నుంచి ముందుగా బాధ్యత ఏర్పడే కేసులు

(ii) బాకీకి సంబంధించిన ముందస్తు బాధ్యత.

## IV సంపద నుంచి ఏర్పడే కేసులు

ఇది మళ్ళీ రెండు రకాలు అవి:-

(i) వారసులకు లభ్యం అయిన వాటాల ద్వారా సంతృప్తి.

(ii) వారసత్వం ద్వారా వచ్చిన భాగం పట్ల సంతృప్తి.

(A) వారసులకు లభ్యం అయిన వాటాల నుంచి వచ్చే సంతృప్తి.

<u>వాటా:-</u> ఒక వ్యక్తికి మరొకరి సంపద నుంచి వచ్చే వాటా ( భాగము)

<u>ఉదాహరణ</u>

1. బి,సి,డి అని ఎ. కు ముగ్గురు కుమారులున్నారు. ముగ్గురు కొడుకులకు వాటాలను పంచిస్తూ ఎ ఒక వీలునామా వ్రాస్తాడు. వీలునామా వ్రాసిన తర్వాత కొంత మొత్తాన్ని వాళ్ళకు ఆయన బయానాగా ఇస్తాడు.

2. ఇక్కడ వారసత్వం, వాటా రెండూ ఉన్నాయి. అవి రెండూ సంచితమైనవా లేక ప్రత్యమ్నాయాలా? భాగం తీసుకొన్న వ్యక్తికి భాగం తీసుకోటానికి హక్కు ఉందా? లేక వారసుడికి తండ్రి ఇచ్చిన భాగం వల్ల ఆ భాగంపై హక్కు ఏర్పడుతుందా?

3. సమతా సూత్రం ప్రకారం వారసుడు వారసత్వం వాటా మరొక వాటా రెండూ పొందలేడు. భాగాన్ని పొందడం ద్వారా వారసత్వానికి హక్కును అంగీకరించినట్లే. దానిని ద్వంద్వ భాగాలకు వ్యతిరేకమైన నిబంధన అంటారు.

## II భాగాల ద్వారా వారసుల సంతృప్తి

1) ఇది మొదటిదానికి వ్యతిరేకంగా ఉంటుంది. మొదటి వాటిలో మొదట వారసత్వం,

తర్వాత వాటాలు ఉంటాయి. రెండవ దాంట్లో మొదట వాటాలు, తర్వాత వారసత్వం ఉంటాయి.

2) మొదటి దాంట్లో వారసత్వం వీలునామా ద్వారా సంక్రమించిన భాగం వల్ల పూర్తి అవుతుంది. ఇక్కడ ఉత్పన్నమయ్యే ప్రశ్న ఏమిటంటే భాగం ఇవ్వవలసిన బాధ్యత తరువాత వచ్చే వారసత్వ హక్కు ద్వారా పూర్తి అవుతుందా అనేది.

(3) ఇక్కడ సమాధానం మొదటి దాంట్లో లాగే ఉంటుంది. భాగం వారసత్వం ద్వారా పూర్తి అవుతుంది.

4. వాటాల పంపకానికి ముందే వీలునామా ఉంటే అది ''నేను ఇది ఇవ్వాలనుకొన్నాను. దానికి బదులుగా అది ఇవ్వను'' అనే వీలునామాదారుని ఉద్దేశం తెలుపుతుంది.

అయితే పంపకాలు వీలునామా వ్రాయటానికి ముందే జరిగితే ''నేను ఇవ్వవలసిన దానికి ముందుగా ఇచ్చేశాను. అందువల్ల దానిని వారు అంగీకరించాలి'' అన్నట్లు అర్థం చేసుకోవలసి ఉంటుంది.

5) ఒక భాగం పొందిన తర్వాత మరో భాగం ఏర్పడినప్పుడు కూడా ఇదే నిబంధన వర్తిస్తుంది.

## III ద్వంద్వ భాగం పరిమితులు

ఈ క్రింది సందర్భాల్లో పై నిబంధన వర్తించదు.

(1) వారసత్వం, భాగం రెండూ ఉన్నప్పుడు ఒక ప్రత్యేక ప్రయోజనం రూపంలో వారసత్వాన్ని వ్యక్తం చేసి దానికి సంబంధించిన భాగాన్ని తర్వాత పంచి ఇచ్చినప్పుడు పై నియమం వర్తించదు.

(2) భాగం, మరొక భాగంలో వలె వారసత్వం, భాగం ఉన్న సందర్భంలో ముందుగా ఆస్తిని ఒక వ్యక్తికి బదిలీ చేసి అటు తర్వాత దానిని వారసత్వంగా లేదా భాగంగా నిర్ణయించినప్పుడు.

(3) భాగాన్ని ఇచ్చే వ్యక్తి తండ్రి అయినప్పుడు లేదా ఒక వ్యక్తి అపరిచితునికి వాటాను కల్పించినప్పుడు అపరిచితుడు భాగాన్ని వారసత్వాన్ని రెండింటినీ పొందవచ్చు. ఈ సందర్భంలో ద్వంద్వ భాగం నిబంధన వర్తించదు.

**(i)** అక్రమ సంతతి అపరిచితులు.

**(ii)** మనవడు కూడా అపరిచితుడే.

(iii) శిశువు వాటాను అపరిచితుడు పొందలేడు.

## IV ఒకే వీలునామా ద్వారా రెండు వారసత్వాలున్న కేసులు

1. రెండవ వారసత్వంమొదటిదానికి మరికొంత చేర్చటానికా లేక దానినే పునశ్చరణ చేయటానికా అనేది పరిశీలించవలసిన ప్రశ్న.

2. దీనికి సంబంధించిన వివాదం Hooby Vs Hatton, 1 Bro C.C. 390 N

3. ఈ రెండు వివాదాలనూ విడివిడిగా పరిశీలించాలి.

   (i) వారసత్వం వివాదాస్పదం అయిన వ్యాజ్యం.

   (ii) వారసత్వంలో ధనానికి సంబంధించిన వివాదం.

4. రెండు పర్యాయాలు వారసత్వం ప్రస్తావన వచ్చినపుడు అది పునశ్చరణ అవుతుంది.

5. ధనపరమైన వారసత్వం

(1) ఇక్కడ నియమం బహుమతులు ఒక వీలునామా లేదా వివిధ వీలునామాల్లో ప్రస్తావించటం బట్టే మారుతుంది.

(2) ఒక వీలునామాలో రెండు ధన లాభ వారసత్వాలు.

## నియమం

(i) సమానంగా ఉంటే అది పునశ్చరణ

(ii) అసమానంగా ఉంటే అది సంచితము.

(3) రెండు విభిన్న పత్రాల ద్వారా రెండు ధన పర లాభాలు

నియమం అది సంచితమై ఉండాలి.

## మినహాయింపు

ఒక ఉద్దేశంతో ఒక మొత్తం రెండు చోట్ల ఉంటే అది పునశ్చరణ అవుతుంది.

B ముందస్తుగా చూసిన బాధ్యత బాకీ రూపంలో ఉన్న వివాదాలు

1. వీటిని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు.

(i) రుణం వారసత్వంగా ఉండేది.

(ii) రుణాన్ని భాగంగా నిర్దేశించేది.

**(i) వారసత్వంగా రుణం**

(1) ఒక బాకీదారుడు తన బాకీని పరిగణనలోకి తీసుకోకుండా దాతకు కొంత మొత్తాన్ని వీలునామాలో కేటాయించటం. ఇక్కడ ప్రశ్న ఏమిటంటే సదరు మొత్తం రుణాన్ని తీర్చటానికి ఉద్దేశించబడిందా లేదా ఋణంతో సంబంధం లేకుండా దానిని రుణదాతకు ఇవ్వటం జరిగిందా?

(2) నియమం ఏమిటంటే దానిని బాకీ తీర్చటానికి ఉద్దేశించ బడిందని భావించడం.

(3) దానికి పరిమితులు

(i) బాకీ మొత్తం కంటే తక్కువ ధనాన్ని కేటాయించినప్పుడు.

(ii) తాత్కాలికంగా కొంత మొత్తాన్ని వారసత్వం క్రింద కేటాయించినప్పుడు

(iii) వారసత్వం పరంగా అనిశ్చిత మొత్తం కేటాయించబడినప్పుడు

(iv) వారసత్వంగా చెల్లించవలసిన మొత్తానికి కేటాయించిన సమయం, బాకీ చెల్లించవలసిన సమయానికంటే భిన్నంగా ఉన్నప్పుడు

(v) బాకీకి భిన్నంగా వారసత్వం ఇచ్చేది ఉంటే, ఉదా: భూమి.

**(ii) భాగాన్ని కేటాయించటం ద్వారా బాకీని చెల్లించటం.**

(1) తండ్రి తన కుమారునికి బాకీ ఉండి అతని జీవిత కాలములోనే కుమారునికి కొంత మొత్తాన్ని బయానాగా ఏర్పాటుచేసినప్పుడు తనయుడు తన బాకీని, వారసత్వం వాటానూ-రెండింటినీ పొందగలడా? లేదా వారసత్వం భాగం బాకీని చెల్లింపు చేయటానికి ఉద్దేశించటం జరిగిందా?

(2) నియమం భాగాన్ని కేటాయించటం ద్వారా బాకీని చెల్లించటమైంది.

(3) పై పరిమితులు ఈ నియమానికి కూడా వర్తిస్తాయి.

**V. చర్యకు, సంతృప్తికి మధ్య వ్యత్యాసం.**

(మిగతా వివరాలు లభ్యం కాలేదు. సం.)

# 2. సామంత రాజ్యాల హోదా

I బ్రిటిష్ కామన్‌వెల్త్ ఆఫ్ నేషన్స్ అనబడే ఈ ప్రాంతాలకు బ్రిటిష్ సామ్రాజ్యంలో కలిగిన రాజ్యాంగపర సంబంధాలను వెస్ట్ మిన్‌స్టర్ చట్టం నిర్ణయిస్తున్నది.

2. సామంత రాజ్యాలకు వెస్ట్ మిన్‌స్టర్ చట్టం వర్తిస్తుంది. అది వాటికి సామంత హోదాను కల్పిస్తున్నది. సామంత హోదా అర్థం తెలుసుకోవటానికి మన ప్రయత్నంలో భాగంగా మొదట ఈ క్రింది ప్రశ్నలను అడగవలసి ఉంటుంది.

1. డొమినియన్ అంటే ఏమిటి? వెస్ట్ మిన్‌స్టర్ చట్టం డొమినియన్‌గా ప్రకటించిన ఒక వలస ప్రాంతమే డొమినియన్.

2. వలస అంటే ఏమిటి?
యునైటెడ్ కింగ్‌డమ్, ఇండియా కాకుండా ఇతరత్రా బ్రిటిష్ అధీనంలో ఉన్న ప్రాంతవే వలస ప్రాంతం.

3. బ్రిటిష్ భూభాగం అంటే ఏమిటి? యునైటెడ్ కింగ్‌డమ్ వెలుపల బ్రిటిష్ చక్రవ( సార్వభౌమాధికారం చెలాయించే భూభాగమే బ్రిటిష్ అధీన ప్రాంతం.

4. ఏది బ్రిటిష్ సామ్రాజ్యం?
బ్రిటిష్‌చక్రవర్తి సార్వభౌమాధికారం చెలాయించే మొత్తం భూభాగం బ్రిటిష్‌సామ్రాజ్య అనబడుతుంది. ఇందులో డొమినియన్లు, రక్షిత ప్రాంతాలు, అన్నీ ఉంటాయి. వీటిలో అధీన ప్రాంతాలు కూడా చేర్చబడ్డాయి.

## II డొమినియన్ హోదా అంటే ఏమిటి?

1. వెస్ట్ మినిస్టర్ చట్టం ప్రారంభించిన ప్రభుత్వ వ్యవస్థతో అంతకు ముందున్న ప్రభు( వ్యవస్థను తులనాత్మకంగా పరిశీలిస్తే ఈ విషయం మనకు బాగా అర్థమవుతుంది.

2. అమల్లో వున్న వ్యవస్థను బాధ్యతాయుత ప్రభుత్వం అంటారు. మొదటగా మన బాధ్యతాయుత ప్రభుత్వం లక్షణాలను తెలుసుకోవాలి.

3. కొన్ని వలసల్లో బాధ్యతాయుత ప్రభుత్వం మరికొన్ని వలసల్లో అది లేకపోవటం ఎందువల్ల?

4. వలస ప్రాంతం స్వభావాన్ని బట్టి వలస ప్రభుత్వంలో వ్యత్యాసం ఉంటుంది.

5. వలసలు రెండు రకాలు:-

**(i)** సెటిల్‌మెంట్ వలసలు

**(ii)** యుద్ధంలో విజయం ద్వారా వలసలు.

## (1) సెటిల్‌మెంట్ వలసలు

సెటిలమెంట్ వలసల్లో బాధ్యతారహిత కార్యనిర్వహణ శాఖకూ ప్రాతినిధ్య శాసనసభకు మధ్య సంఘర్షణ తప్పనిసరి అవుతుంది.

(2) దానిని నివారించటానికి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయవలసి వుంటుంది.

## (3) బాధ్యతాయుత ప్రభుత్వం స్వభావం

జయించిన వలసలతో ఉన్నట్లు సెటిల్‌మెంట్ వలసలతో చక్రవర్తి సంబంధాలు ఉండవు. అవి భిన్నంగా ఉంటాయి.

యునైటెడ్ కింగ్‌డమ్‌తో చక్రవర్తి ఏవిధంగా వ్యవహరిస్తాడో అదేవిధంగా సెటిల్‌మెంట్ వలసలతో కూడా వ్యవహరించవలసి ఉంటుంది. ఆయనకు కార్యనిర్వహణాధికారం ఉంటుందే కానీ శాసన నిర్మాణాధికారం ఉండదు. **(3 Moo P.C. 115, 1865: 1 Moo P I.C.C. 411, 1863)** చట్టాలను ఆమోదించవలసి ఉంటే

(1) యు.కె.లో వలె ప్రతినిధ్య సభ రూపొందించాలి.

(2) ఇది ఎక్కడ సాధ్యపడకపోతే పార్లమెంట్ ఆమోదంతో అక్కడ వేరే తరహా రాజ్యాంగాన్ని ఏర్పాటు చెయ్యాలి.

## (2) జయించిన వలసలు

వలసలపై ప్రభువు సంపూర్ణాధికారం కలిగి ఉంటాడు. ఆయనకు తోచిన కార్యనిర్వాహక, శాసన

నిర్మాణ, న్యాయ నిర్ణయ ఏర్పాట్లు చేయవచ్చు). (బ్రిటిష్ పార్లమెంట్ చట్టాన్ని అతిక్రమించకుండా చక్రవర్తి ఎటువంటి ఏర్పాట్లనైనా చేయవచ్చు).

కొద్దిగానో లేదా పూర్తిగానో అట్టిపెట్టుకుంటే తప్ప ఈ అధికారం ఒక ప్రాతినిధ్య శాసనసభను ఏర్పటు చేయటంతో కోల్పోవటం జరుగుతుంది. పార్లమెంట్ చట్టం ద్వారానే ( అట్టేపెట్టుకోకపోతే) తిరిగి పొందటం సాధ్యము. **1835 2 Kupp 130 (152) Jchson Vs Pura; 1932 A.C. 260**

1. వెస్ట్ మినిస్టర్ చట్టం ఈ క్రింది వాటికి వర్తిస్తుంది.
   (1) డొమినియన్ ఆఫ్ కెనడా
   (2) కామన్ వెల్త్ ఆఫ్ ఆస్ట్రేలియా
   (3) డొమినియన్ ఆఫ్ న్యూజిలాండ్
   (4) యూనియన్ ఆఫ్ సౌత్ ఆఫ్రికా
   (5) ఐరిష్ ఫ్రీ స్టేట్
   (6) న్యూఫౌండ్ లాండ్

(2) ఈ చట్టం వలసలను డొమినియన్లని వర్ణించి వాటికి డొమినియన్ ప్రతిపత్తిని కల్పించింది.

(3) వెస్ట్ మినిస్టర్ చట్టం అమలుకాక మునుపే ఈ వలసలకు బాధ్యతాయుత ప్రభుత్వాలున్నాయి.

బాధ్యతాయుత ప్రభుత్వానికీ డొమినియన్ హోదాకు మధ్య వ్యత్యాసం ఏమిటి?

## బాధ్యతాయుత ప్రభుత్వం యంత్రాంగం

(1) వాటికి సంబంధించిన విషయాల్లో స్వయం పాలక హక్కును వలసలు కోరుకోవటం.

(2) ఇంపీరియల్ పార్లమెంట్ అపరిమిత సార్వభౌమాధికారం కోరుకోవటం.

పై రెండు హక్కులూ పరస్పర విరుద్ధమైనవి. స్వయంపాలన కలిగిన వలస అన్నది పరస్పర విరుద్ధమైన భావన.

దీనికి పరిష్కారం కోసం రెండు ప్రశ్నలు ఉదయిస్తాయి. అవి:-

(1) సామ్రాజ్య ప్రభుత్వానికీ వలస ప్రభుత్వానికీ మధ్య అధికారం ఏవిధంగా విభజితమవుతుంది?

(2) పై రెండు ప్రభుత్వాలూ తమ అధికారాలను ఏవిధంగా చెలాయిస్తాయి?

అధికారాల విభజన సామ్రాజ్య, వలస శాసనసభల పద్ధతిలో జరగటం లేదు.

వలస చట్టాలు ఇచ్చిన మినహాయింపులు వదిలివేస్తే అన్ని చట్టాల నిర్మాణం వలస శాసనసభ పరిధిలో ఉండాలి. సామ్రాజ్య ప్రయోజనాన్ని భంగపరిచే వలస శాసనసభ చేసిన చట్టాలను త్రోసిపుచ్చే అధికారం సామ్రాజ్య పార్లమెంట్‌కు ఎలాగూ వుంటుంది.

సామ్రాజ్య ప్రయోజనాలను లిఖిత రూపంలో జాబితాగా చేయలేము. ఏ విషయం అయినా సామ్రాజ్య ప్రయోజనానికి సంబంధించినదని సామ్రాజ్య ప్రభుత్వం యథేచ్ఛగా నిర్ణయించగలదు.

ఈ క్రింద పేర్కొన్న అంశాలు వలస రాజ్యాంగాల్లో వుంటాయి:-

(1) సామ్రాజ్య మంత్రివర్గం సలహాపై గవర్నర్లు, గవర్నర్ జనరల్ నియామకాలు.

(2) మంత్రుల సలహాకు భిన్నంగా వ్యవహరించటానికి గవర్నర్ జనరల్‌కు ఉన్న హక్కు.

(3) సామ్రాజ్య ప్రభుత్వం సలహాపైగవర్నర్ఒక బిల్లును ప్రభుత్వ అభిప్రాయం కోసం పంపవచ్చు.

(4) సామ్రాజ్య ప్రభుత్వం సలహాపై ప్రభువు ఒక బిల్లును అమలుకాకుండా త్రోసిపుచ్చవచ్చు.

## వెస్ట్ మినిస్టర్ చట్టంలోని అంశాలు

(1) బ్రిటిష్ పార్లమెంట్ రూపొందించిన చట్టాల ప్రభావం నుంచి డొమినియన్ శాసనసభను విముక్తి చేస్తుంది.

(i) కలోనియల్ లూస్ వాలిడిటీ చట్టాన్ని అది రద్దు చేస్తుంది.

(ii) డొమినియన్‌కు సంబంధించినంత వరకూ ఏ యు.కె. చట్టాన్నైనా డొమినియన్ శాసనసభ రద్దు చేయవచ్చు.

II బ్రిటిష్ పార్లమెంట్ చట్ట నిర్మాణ సార్వభౌమత్వంపై పరిమితులను విధిస్తుంది.

(1) డిసెంబర్ 11, 1931 తర్వాత పార్లమెంట్ ఆమోదించిన ఏ చట్టమూ డొమినియన్‌కు వర్తిస్తుందని డొమినియన్‌ను అభ్యర్థించి డొమినియన్ అనుమతి పొందితే తప్ప అది డొమినియన్‌కు వర్తించదు.

(2) రాజ వారసత్వం, బిరుదము, రాజరికం వ్యవహారసరళికి సంబంధించిన చట్టాలు బ్రిటిష్ పార్లమెంట్‌తో పాటు డొమినియన్ పార్లమెంటు ఆమోదం కూడా పొందాలి.

III మిగతా అంశాలను ఈ చట్టం మార్చటం లేదు.

(1) గవర్నర్-జనరల్ నియామకం

(2) బిల్లులను రిజర్వ్ చేయడం

(3) బిల్లులను అమలుకాకుండా నిరోధించడం

అయితే ఈ అధికారాలను చెలాయించటంలో అనేక మార్పులు వచ్చాయి.

ప్రభువుకు సలహా ఇచ్చే హక్కు.

★ ★ ★

డొమినియన్ హోదా అంటే సార్వభౌమాధికారం కాదు.

★ ★ ★

2. యునైటెడ్ కింగ్‌డమ్ రాజ్యాంగం గురించి ఇంతకుముందే ప్రస్తావించాము.

3. ఇండియా గురించి ఇక్కడ ప్రస్తావించడం లేదు.

4. వలస ప్రాంతం రాజ్యాంగాలను గురించి మాత్రమే ప్రస్తావించటం జరిగింది.

5. వలసను సంపాదించుకున్న పద్ధతిని బట్టి వలసల రాజ్యాంగాల్లో వ్యత్యాసాలున్నాయి.

6. రెండు పద్ధతులు:-

(1) సెటిల్‌మెంట్

(2) జయించటం ద్వారా

★ ★ ★




## డొమినియన్లు

1. 1925లో డొమినియన్ల వ్యవహారాలను చక్క బెట్టడానికి డొమినియన్ కార్యాలయాన్ని ఏర్పాటు చేశారు.

2. డొమినియన్లకు వలసలకు కార్యదర్శిగా ఒకే మంత్రి ప్రారంభంలో వ్యవహరించేవారు. అయితే 1930 నుంచి వీటికి వేరు వేరు కార్యదర్శులను నియమించడం ప్రారంభమైంది.

3. దక్షిణ రొడీషియా, దక్షిణాఫ్రికా హై కమిషన్ (బసుటోలాండ్, స్వాజీలాండ్ రక్షిత ప్రాంతం, సముద్రాంతర సెటిల్‌మెంట్) మొదలైన వాటికి ప్రత్యేక కార్యాలయాలు ఏర్పాటైనాయి.

   Old Halsbury, I. P.303.

662. రాజమకుటం డొమినియన్లలో ఈ క్రిందివి కూడా ఉన్నాయి:-

**(a)** యు.కె, వలసలు, తోటలు, ద్వీపాలు, యు.కె.లో లేని రాజమకుటం అధీనం క్రింద ఉన్న ప్రాంతాలు.

**(Nationalisation Act, 1870, 33 No. C 14 S. 171)**

**(b)** రాజవంశీయుడి అధీనం క్రింద ఉన్న రాజమకుటం ఆధిపత్యం క్రిందకు వచ్చే ప్రాంతాలు.

**(Crown and Ramsay (1670) Vaugh 281)**

(c) బ్రిటిష్ యుద్ధ మరియు ఇతర నౌకలు.

(Parliament Vs Belge (1880) S.P.D. 197)

(d) సముద్రంపై ప్రయాణం చేసే బ్రిటిష్ నావికా వర్తకులు (1870 S.R. 6 Q, B 31. Marshall Vs Murga troyd) Compare R vs Carr and Wilson (1882) 10 Q B D 76)

Halsbury X P. 50 Para 856

1. యు.కె. ని మినహాయించి రాజమకుటం క్రిందకు వచ్చే ఏ ఇతర ప్రాంతమైనా బ్రిటిష్ అధీన ప్రాంతమే. అవి కేంద్ర, స్థానిక శాసనసభల క్రింద ఉండే డొమినియన్లు కూడా కావచ్చు (Intapretation Act 1889 (52 & 53 Vict C.63) S. 18 (2))

2. బ్రిటిష్ ఇండియా, బ్రిటిష్ ద్వీపాలు మినహాయించి రాజమకుటం అధీనంలో ఏ ప్రాంతమైనా వలస ప్రాంతమే. అవి డొమినియన్లు కావు. (Ibid S. 18 (3))

3. బ్రిటిష్ సెటిల్‌మెంట్ అంటే యుద్ధం ద్వారా సంపాదించుకున్న ప్రాంతం. (British Settlement Act, 1887 (50-51) Vic. C.54) 56)

4. ఆక్రమించుకున్నవి కాకుండా, విదేశీ భూభాగాలు; వాటిని బ్రిటిష్‌పాలన క్రింద కొంతకాలం ఉంచి విదేశాల సంబంధాలను నిర్వహించడం. వీటిలో చాలా మటుకు ''రక్షిత ప్రాంతాలు'' ఎక్కువగా ఉన్నాయి. అవి సాధారణంగా ఒడంబడిక ద్వారా బ్రిటిష్ రక్షణ క్రింద ఉంచబడ్డ ప్రదేశాలు. సైప్రస్, వెల్ హైనీ ప్రాంతాలు ప్రత్యేక ఒప్పందం క్రింద బ్రిటిష్ పాలన క్రింద ఉంచబడ్డ ప్రాంతాలు.

   (Foreign Jurisdiction Act, 1890 53-54 Vic, C 3 D) ఇండియాలో బ్రిటిష్ ప్రత్యక్ష పాలిత ప్రాంతాలు, స్వదేశీ సంస్థానాలూ బ్రిటిష్ సామ్రాజ్యంలో భూభాగాలే.

5. రాజమకుటం ప్రాంతాల్లో రాజమకుటం వాటి పాలనపై పూర్తి నియంత్రణ కలిగి వుంటుంది. వాటి పాలనకు అవసరమైన చట్ట నిర్మాణ, పాలనాధికారాలు ఒక అధికారికి నియోగించడం జరుగుతుంది. (S.S. Gibraltar, Ashanti, Virgin Islands, St. Helena, and Basutoland) లేదా అవి రాజు నియమించిన లేదా పాక్షికంగా ఎన్నికైన శాసనసభ పరిధి కింద ఉంటాయి.

రక్షిత ప్రాంతాలు: ప్రభువు డొమినియన్లలో భాగం కాకపోయినప్పటికీ రాజమకుటం వలసల వలె వాటి పాలన కూడా ఉండేది.

డొమినియన్లు: శాసనసభలు కలిగి ఉన్న వలసలు శాసనసభకు కార్యనిర్వాహక వర్గం యు.కె.లో వలె బాధ్యత వహించేది. ఒక్కటేడా ఏమిటంటే గవర్నర్ లేదా గవర్నర్ జనరల్‌ను రాజు నియమించేవాడు.

Halsbury X, P.521

885. ''రక్షిత ప్రాంతాని''కి చట్టబద్ధమైన, అధికారికమైన నిర్వచనం లేకపోయినప్పటికీ రెండు చట్టాల్లో దాని ప్రస్తావన కనిపిస్తుంది. ఖచ్చితమైన అర్థంలో చెప్పాలంటే రక్షిత ప్రాంతాలు బ్రిటిష్ భూభాగాలు కావు. అయితే ఏ నాగరిక అధికారం వాటి వ్యవహారాల్లో జోక్యం చేసుకోదని అర్థం చేసుకోవటం జరుగుతున్నది. Foreign Jurisdiction Act, 1890 వీలు కల్పించిన అధికారం ప్రకారం వాటిని పరిపాలించటం జరుగుతున్నది.

Halsbury XIV, P.420

''డొమినియన్''కు తాజాగా ఇచ్చిన అర్థం కోసం R V/S Crewe 1910 S.K.B. 576, 607, 622 చూడండి.

Halsbury IX, P.16

రాజు అధికారం ప్రజలందరిపై, వారు బ్రిటిష్ సామ్రాజ్య భూభాగంలో ఎక్కడ నివసించినప్పటికీ విస్తరిస్తుంది. అయితే ఇంగ్లీష్ న్యాయస్థానం పరిధి మాత్రం పరిమితమైంది. మొదటగా స్కాట్‌లాండ్, ఐర్లండ్‌లను యునైటెడ్ కింగ్‌డమ్‌లో కలిపి చేసిన చట్టం ఒక పరిమితికి రెండవ పరిమితికి ఛార్టర్ ఆఫ్ జస్టిస్. మూడు, తన ఉత్తర్వులను అమలుపరిచే అధికారం లేని ఏ ఇంగ్లీష్ న్యాయస్థానం తన పరిధిలో లేని వివాదాలను చేపట్టలేదు.

ప్రతి న్యాయస్థానానికీ రాజు నియోజించిన అధికార పరిధి ఉంటుంది. ఈ నియోజితం సంపూర్ణం. ఎందుకంటే రాజు తన న్యాయ నిర్ణయాధికారాన్ని వివిధ న్యాయస్థానాలకు పంపిణీ చేశాడు.

★ ★ ★

## డొమినియన్ హోదా అభివృద్ధి

1. మొట్టమొదట బ్రిటిష్ పార్లమెంటుకు అపరిమితమైన సార్వభౌమాధికారం లార్డ్ జాన్ రసెల్ చెప్పినట్లు ఉండేవి.

2. రెండవదేమిటంటే వలస ప్రాంతాలకు పాలనా స్వేచ్ఛ కావాలని తీవ్రమైన డిమాండ్ ఉన్నది. వాటికి సంబంధించిన వ్యవహారాలను అవే చక్కదిద్దుకోవాలన్న ఆసక్తి వాటికి చాలా ఉన్నది.

3. మూడవది పై రెండింటి మధ్య వున్న పరస్పర విరుద్ధత. స్వయం పాలిత ఆధారిత ప్రదేశం తార్కికంగా పరస్పర విరుద్ధమైన భావన.

## పరిష్కారం

ఒకవైపు పార్లమెంటు వలస ప్రాంతానికి శాసనసభ, కార్యనిర్వాహక వర్గం, న్యాయశాఖలకు అధికారాలను ఇచ్చింది. ఈ పరిధిలో వలస రాజ్యం సార్వభౌమత్వం కలిగి వుంది. మరోవైపు అవసరమనుకొన్నప్పుడు సదరు అధికారాలను పరిమితం చేయటానికి లేదా వెనక్కి తీసుకోవటానికి లేదా కొన్ని నిర్దిష్టమైన పరిమితులలో వలస తన అధికారాలను చెలాయించేటట్లు చూడటానికి పార్లమెంటుకు చట్టపరంగా అధికారం ఉంది. దీనికిగాను వలసకు సంబంధించిన చట్టాన్ని పూర్తిగా తొలగించటానికి లేదా సవరించటానికి పార్లమెంటుకు అధికారం ఉంది.

## రెండు ప్రశ్నలు

1. సామ్రాజ్య ప్రభుత్వానికి వలసకు మధ్య అధికారాలు ఏవిధంగా విభజింపబడతాయి?

2. ఈ రెండింటికీ ఇచ్చిన అధికారాలను అవి ఏ పద్ధతిలో చెలాయిస్తాయి?

1. ప్రతిపాదించిన విభజన సామ్రాజ్య, వలస శాసనం సమర్థనీయ పద్ధతిలో లేదు.

మొత్తం శాసన నిర్మాణానికి గాను వలస ప్రభుత్వానికి అధికారం ఉన్నప్పటికీ దానిపై పరిమితి సామ్రాజ్య ప్రభుత్వం వీటో అధికారం కాదు. తన పరిధిని వలస ప్రభుత్వం అధిగమించిందన్న కారణంతో కాకుండా సామ్రాజ్య ప్రయోజనాలు దెబ్బతింటాయన్న దృక్పథంతో కొన్ని వలస చట్టాలను సామ్రాజ్య ప్రభుత్వం తిరస్కరించవచ్చు.

2. సామ్రాజ్య ప్రయోజనాలకు సంబంధించిన అంశాలన్నిటిని లిఖిత రూపంలో తయారు చేయాలని కొంతమంది వాదిస్తారు. అయితే బ్రిటిష్ ప్రభుత్వం దీన్ని తిరస్కరించింది. (ఆస్ట్రేలియా ముసాయిదా చట్టాల విషయంలో కొన్నిటిని అంగీకరించలేదు)

3. వలస సామ్రాజ్య ప్రభుత్వాల కార్యకలాపాలను ఏవిధంగా సమన్వయం చేసి తికమకను తొలగించటం సాధ్యం. ఒకరు అధికార పరిధిలోకి ఇంకొకరు ప్రవేశించకుండా చూడటం ఎలా సాధ్యమౌతుంది. ఈ క్రింది మార్గాలలో దీనిని పరిష్కరించవచ్చు.

1. కొన్ని బిల్లులను రిజర్వు చేసే అధికారాలు.

2. అమలు జరుగకుండా నిలిపే అధికారాలు.

3. గవర్నర్ జనరల్ నియామకం.

4. వలస ప్రాంతాలలోని బాధ్యతాయుత ప్రభుత్వ స్వభావం.

5. బ్రిటిష్ చక్రవర్తికి సలహా ఇచ్చే మంత్రి మండలి అధికారం

6. 1865 వలస చట్టాల సార్థకత చట్టం.

4. వలస ప్రాంతాలలో బాధ్యతాయుత ప్రభుత్వం స్వభావం. కార్యనిర్వాహణాధికారం మొత్తం గవర్నర్‌కి ఉంటుంది. సమర్థులైన వ్యక్తులను గవర్నర్ తన కార్యనిర్వాహక మండలికి సభ్యులుగా నియమించుకుంటాడు. చట్టపరంగా సభ్యులైన వారే కాకుండా ఇతరులను కూడా అవసరం అనుకుంటే ఆయన నియమించవచ్చు. కౌన్సిల్ సభ్యులు లేదా మంత్రులు ఒక నిర్ణీత కాలం లోపల శాసనసభ సభ్యత్వం పొందాలన్న నిబంధన ఒకటి రెండు సందర్భాలలో చట్టం విధించింది. అయితే ఏ సందర్భంలోనూ కేవలం మంత్రులతోనూ కార్యనిర్వాహక మండలి ఏర్పడాలని చెప్పటం జరగలేదు.

కార్యనిర్వాహక మండలిలో మంత్రులు వుంటారు. అయితే మంత్రులొక్కరే కార్యనిర్వాహక మండలి సభ్యులు కారు. కొన్ని సందర్భాలలో నిర్వాహక మండలి సభ్యులు శాసనసభ్యులుగా శాసనసభ్యులు కావలసిన అవసరం కూడా లేదు.

వలస శాసనసభకు వలస ప్రాంతానికి శాంతి భద్రతలు మంచి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయటానికి కావలసిన చట్టాలను రూపొందించటానికి అధికారం ఉంది. అంతవరకే వలస ప్రభుత్వ నిర్మాణ చట్టం చెబుతున్నది.

గవర్నర్‌కు ఇచ్చిన నిర్దేశాలు కార్యనిర్వాహక మండలి సలహాతో పరిపాలన చేయమని చెబుతూ అవసరమైనప్పుడు అతడు సొంత విచక్షణపై మండలి సలహాను కూడా పాటించకుండా వ్యవహరించవచ్చని చెబుతున్నాయి.

బాధ్యతాయుత ప్రభుత్వం రాజమకుటం విశ్వాసంపై ఆధారపడి వుంటుంది కాని చట్టాలపై కాదు.

## అంతర్ సామ్రాజ్య సంబంధాల స్వభావం

కామన్‌వెల్త్ మర్చంట్ షిప్పింగ్ ఒప్పందం ప్రకారం చూసినట్లైతే డొమినియన్లు సమాన ప్రాతిపదికపై ఒప్పందం చేసుకొన్న భాగస్వాములుగా కనిపిస్తాయి. ఇంపీరియల్ సమావేశంలో (1930) లో ప్రస్తావించిన అంతర్-సామ్రాజ్య ట్రిబ్యునల్, అనుకొన్నట్లుగా అమల్లోకి వస్తే బాగుంటుంది. (Cumd. 3994, Part VIII)

అయితే వీటి మధ్య సంబంధాలు అంతర్జాతీయ న్యాయం ప్రకారం ఉండవు. ఈ అంశం 1924లో ఐరిష్ స్వేచ్ఛా రాజ్యం నానాజాతి సమితిలో చేరినప్పుడే స్పష్టం చేయడం జరిగింది. 1921, డిసెంబర్‌లో జరిగిన ఒప్పందం ప్రకారం బ్రిటిష్ ప్రభుత్వం ఐర్లాండ్ కామన్‌వెల్త్‌లో భాగంగానే ఉంటుందని స్పష్టం చేసింది.

(Keeth R.G. II 884, 885)

1925 ఆరమ్స్ ట్రాఫిక్ కాన్ఫరెన్స్ న్యాయసంఘం పైవిధంగా నిర్ణయించిందని 1926లో జరిగిన ఇంపీరియల్ కాన్ఫరెన్స్ అభిప్రాయపడింది. (Cumd. 2768 P.23)

ఐర్లండ్, యునైటెడ్ కింగ్‌డమ్‌లను మినహాయించి, డొమినియన్ల మధ్య ఉత్పన్నమయ్యే వివాదాలను అంతర్జాతీయ న్యాయస్థానానికి నివేదించరాదు.

అంతర్-సామ్రాజ్య ప్రాధాన్యతలు ఆంతరంగికమైనవి. అందువల్ల వాటి అధిక ఆదరణ చూపించే రాజ్యాంగ ఒప్పందాలు వర్తించవు.

## విధేయత

సమాన విధేయత, బ్రిటిష్ ప్రజలు అనే భావం వెస్ట్ మిన్‌స్టర్ చట్టం ప్రవేశికలో రాజమకుటం బ్రిటిష్ కామన్‌వెల్త్ జాతులకు ప్రతీక అని చెప్పడం ద్వారా బ్రిటిష్ ప్రాంతాలన్నీ సమైక్యంగా ఉన్నాయి.

రాజరికం వారసత్వం, ప్రత్యేక హక్కులు, మొలైన వాటికి సంబంధించిన చట్టాలను బ్రిటీష్ పార్లమెంట్‌తోపాటు డొమినియన్ పార్లమెంట్‌లు కూడా ఆమోదించవలసి ఉంటుంది.

ప్రవేశిక స్పష్టం చేయకపోయినప్పటికీ ఏ బిల్లు అయినా డొమినియన్ల సమానత్వానికి భంగం కలిగించేవిధంగా ఉంటే దానికి రాజుకానీ ఆయన ప్రతినిధి కానీ అంగీకరించటం కష్టము. ఎందుకంటే అది బ్రిటిష్ కామన్‌వెల్త్ జాతుల సమానత్వం ప్రాతిపదికకు భంగం కలిగిస్తుంది.

గమనిక:-

1929 కాన్ఫరెన్స్ నివేదికను ఆమోదిస్తూ ప్రతిపాదించిన పీఠిక ''బ్రిటిష్ కామన్‌వెల్త్ జాతులు సదరు సంస్థ సభ్యత్వంనుంచి విడిపోయే హక్కు ఎవరికీ లేదని'' యూనియన్‌పార్లమెంట్ ప్రకటించింది.

**JOURNAL OF PARLIAMENT OF EMPIRE XI 797 800**

అయితే ఈ అభిప్రాయాన్ని లాంఛనంగా ఇంపీరియల్ కాన్ఫరెన్స్ ఆమోదించలేదు.

అంతర్ - సామ్రాజ్య వివాదాలను పరిష్కరించే పద్ధతిని డొమినియన్లు, యు.కె. సమానత్వం హోదా పరిశీలించవలసిన అవసరాన్ని కలగజేసింది. (CMd 3479 P.41) దీనికోసం, 1930 ఇంపీరియల్ సమావేశం, అటువంటి వివాదాలను తాత్కాలిక మధ్యవర్తిత్వం ద్వారా స్వచ్ఛంధంగా పరిష్కరించాలని నిర్ణయించింది. పద్ధతి ప్రక్రియలు ప్రభుత్వాల మధ్య వ్యత్యాసాలకు మాత్రమే పరిమితం అవుతూ ప్రతి వివాదాన్ని పరిష్కరించటానికి ఒక తాత్కాలిక ట్రిబ్యునల్‌ను ఏర్పాటు చెయ్యాలి. బ్రిటీష్ కామన్‌వెల్త్ ఆఫ్ నేషన్స్ బయట నుంచీ కాకుండా ఐదుగురు సభ్యుల ట్రిబ్యునల్‌లో ఉంటారు.

వివాదానికి కక్షిదారులు కాని సభ్య దేశాల నుంచి కక్షిదారులు ఒక్కొక్కరిని ఎంపికచెయ్యాలి. వీరు న్యాయమూర్తులుగా, లేదా న్యాయశాస్త్రవేత్తలుగా ప్రసిద్ధి చెందినవారై ఉండాలి. కక్షిదారులు ఖర్చు భరిస్తామంటే వారిలో ఒకరిని వీరు ఛైర్మన్‌గా ఎంపిక చేసుకొంటారు. వారు వాద వివాదాలను వింటారు.

## డొమినియన్ల విదేశీ సార్వభౌమత్వం

వాటికా పాలనా స్వేచ్ఛ ఉంటుంది. ఐతే హోదా ఉండదు. వాటికి ఆలంకారిక హోదాయేకానీ చట్టపరమైన హోదా ఉండదు. అది వాస్తవమైన హోదాయేకానీ చట్టపరమైంది కాదు.

యునైటెడ్ కింగ్‌డమ్ నుంచి స్వతంత్రంగా వ్యవహరించటానికి అనేక సందర్భాలలో వాటికి అంతర్జాతీయ మూర్తిత్వం ఉన్నది. అయితే సమాన విధేయత, రాజమకుటం, వాటికి ప్రత్యేక

సార్వభౌమ రాజ్య హోదాను కల్పించకుండా జోక్యం చేసుకొంటాయి.

యుద్ధ సమయంలో తటస్థం వహించటం గురించి చర్చించటమైంది. అయితే ఒక్క దక్షిణ ఆఫ్రికా జాతీయ ప్రభుత్వం మాత్రమే ఆవిధంగా ప్రకటించింది. (Kerith DG II 867 71, 72. Sovereignety 463-471)

డొమినియన్లను దింపకుండా రాజు యుద్ధ ప్రకటన చేస్తారనుకోవటం ఒక తీవ్రమైన సందేహమే.

## డొమినియన్ హోదా పరిణామాలు

1. సార్వభౌమత్వం హోదాను సూచిస్తుందా? వాటికి సార్వభౌమత్వం కర్తవ్యాలున్నాయి కానీ సార్వభౌమత్వ రాజ్య హోదా లేదు.

2. విడిపోయే హక్కు సూచిస్తుందా?

* * *

**Law Quarterly Review Vol. VI**

బ్రిటిష్ భూభాగంలోకి ప్రవేశించటానికి విదేశీయులకు హక్కు P. 27

పాలితుడు భూభాగాన్ని విడిచిపెట్టివెళ్ళే నిర్బంధం P. 388

పౌరసత్వం - విధేయత

Vol. XVII P. 270

Vol. XVIII P. 49

Law of Cilizinship in the united states

by

Prenviss Webster

Albany : 1891

Webster

''పౌరులు, అంటే రాజకీయ సార్వభౌమత్వంలో సభ్యులు పాలితులు సార్వభౌమత్వం అధీనంలో ఉన్నవారు, వారి మధ్య వ్యత్యాసాన్ని పబ్లిక లా పై సర్వశ్రేష్ఠ ఆధిపత్యం ఉన్నవారు గుర్తించారు'' ఇది నిజమైన వ్యత్యాసం. అయితే ఎవరు పౌరులు, ఎవరు పౌరులు కారు అనే ముందు ముందు అడగబోయే ప్రశ్నలు అనేక ఇబ్బందులు ఉన్నాయి. పౌరసత్వం అంటే దేశం లోపల సమాన హక్కులు, విశేషాధికారాలు,

విదేశాల్లో సమాన రక్షణ అని నిర్వచనం ఇస్తే, అదే పద్ధతిలో పౌరులందరినీ చూడాలన్నప్పుడు, సమస్య ఏర్పడుతుంది. ఎందుకంటే అమెరికాలో మన పౌరుల మధ్య వ్యత్యాసాన్ని పాటించే చట్టం ఏదీ లేదు. విదేశాల్లో ఉన్నప్పుడు స్వదేశంలోలాగే సమాన హక్కులు పౌరులకు ఉన్నట్లు ఉండాలన్నప్పుడు వివిధ దేశాల్లో పౌరసత్వం సమకూర్చే చట్టాలు జాతుల చట్టాలకు లోబడి నిర్ణయిస్తాయని తెలుసుకుంటాము. అందువల్ల పౌరసత్వం ప్రాధాన్యతను మనం తక్కువగా చూడలేము.

## వెబ్‌స్టర్ రోమన్ న్యాయ దృక్పథం

1. మానవుడు తోటివారితో కలసి రాజకీయ సమాజాన్ని రూపొందించాడు. తన సహజ హక్కులను ఉపయోగించి ఇతరులతో కలసి రాజకీయ సమాజంలో సభ్యుడైనాడు.
2. మానవుడు తోటి మానవుడితో కలసి ఏర్పాటు చేసుకున్న సంస్థలో అతడు విడిపోలేనంతగా కలసిపొయ్యాడు.
3. ప్రారంభంలో రోమ్‌లో జన్మించినవారే స్వేచ్ఛా పౌరులుగా పరిగణించబడినప్పటికీ కాలక్రమేణా విదేశీయులకు కూడా పౌరసత్వం ఇవ్వటం జరిగింది. తర్వాత కాలంలో రోమ్ ఇతర ప్రాంతాలను జయించినప్పుడు అక్కడి ప్రజలకు వారి పూర్వ పౌరసత్వాన్ని రద్దుచేసి రోమన్ పౌరసత్వం చట్టపరంగా వారికి విస్తరించడం జరిగింది.
4. ''ప్రతి వ్యక్తీ సమాజంలో సభ్యత్వాన్ని నిలుపుకోటానికే హక్కు కలిగి ఉండాలి'' అని సిసిరో నిర్దేశించాడు. అంతే కాకుండా ''ఈ నిర్ణయాధికారమే స్వేచ్ఛకు పునాది'' అని నొక్కి వక్కాణించాడు. అందువల్ల రోమ్‌కు అందరినీ ఆహ్వానించారు; ఎవరినీ తిరస్కరించలేదు.
5. ఈ రోమన్ న్యాయ భావన సహజ న్యాయంపై ఆధారపడింది.

### ఆక్రమణ ప్రభావం

6. రోమ్ పతనం తర్వాత ఈ సహజ న్యాయసూత్రం అంతరించి ఆక్రమణదారులు ప్రవేశపెట్టిన ఫ్యూడలిజం సూత్రాలు అమలులోకి వచ్చాయి.
7. ప్రజలను, వారి భూభాగాలను జయించిన ఆక్రమణదారులు వారి ప్రభుత్వాలను నిర్మించుకున్నారు. పౌరులందరిపైన ప్రభువులుగా రూపొందారు. మనిషికి మనిషికీ మధ్య అతనికి ప్రభుత్వానికి మధ్య సంబంధాలు స్వచ్ఛందంగా కాక నిర్బంధమైనవిగా ఉండేవి. మనిషిలో ఉండే సహజమయిన హక్కులను బహిరంగంగా తిరస్కరించారు.

# 3. నిర్దిష్ట ఉపశాంతి చట్టం

## (The Law of Specific Relief)

అంగీకరించిన అంశాన్ని నిర్దిష్టంగా అమలు చేసేందుకు ఈ చట్టం అనుమతి ఇస్తుంది.

**(ii)** ఎక్కడ వాదికి అనుకూలంగా నిర్దిష్ట ఉపశాంతి అవసరమనుకుంటే అక్కడ మంజూరు చేస్తుంది.

**(iii)** ప్రతివాదికి వ్యతిరేకంగా అవసరమనుకొన్నప్పుడు నిర్దిష్ట పరిహారాన్ని నిర్దేశించవచ్చు.

ప్రశ్న ఏమిటంటే న్యాయస్థానం తప్పనిసరిగా నిర్దిష్ట ఉపశాంతిని అటువంటి కేసుల్లో ఇవ్వాలా?

దీనికి సమాధానం విభాగం 22లో ఉంది.

**(A)** సెక్షన్ 22 సాధారణ నియమాలను చెబుతున్నది - (1) నిర్దిష్ట ఉపశాంతిని విచక్షణను ఉపయోగించి కల్పించవచ్చు అని చెబుతున్నది. న్యాయస్థానం ఇవ్వవచ్చు, నిరాకరించవచ్చు. ఇది చట్టపరమైనంత మాత్రాన న్యాయస్థానం ఇచ్చితీరాలని లేదు.

(2) న్యాయస్థానం విచక్షణ నిర్హేతుకమైంది కాదు. అది సహేతుకమైనది; న్యాయసూత్రాల ద్వారా రూపొందినది.

**(B)** ఏ ఏ ప్రత్యేక కేసుల్లో న్యాయస్థానం ప్రత్యేక ఉపశాంతిని మంజూరు చేయకూడదో కూడా విభాగం 22 పేర్కొంది. ఏయే సందర్భాల్లో మంజూరు చేయవచ్చో కూడా ప్రత్యేకంగా పేర్కొంది.

### నిర్దిష్ట ఉపశాంతిని నిరాకరించే సందర్భాలు

**(i)** నిర్దిష్ట ఉపశాంతి ఉత్తర్వు ప్రతివాదిపైన వాదికి అన్యాయమయిన లాభాన్ని కలిగించే సందర్భంలో.

**(ii)** నిర్దిష్ట ఉపశాంతి జరగాలని ఆదేశిస్తే ప్రతివాదికి ఊహించడానికి వీలుకాని కష్టం కలిగించే సందర్భాలు, నిర్దిష్ట ఉపశాంతి నిరాకరించినా వాదికి కష్టం కలగని సందర్భాల్లో నిర్దిష్ట ఉపశాంతిని నిరాకరించవచ్చు.

## నిర్దిష్ట ఉపశాంతిని ఇచ్చే సందర్భాలు

కంట్రాక్టును అనుసరించి తనవంతు బాధ్యతలను నిర్వహించినపుడు, కంట్రాక్టు వల్లగణనీయంగా నష్టపోయినపుడు నిర్దిష్ట ఉపశాంతి అంటే అంగీకరించిన షరతులు అమలు చేయాలని నిర్దేశించవచ్చు.

## నష్టపరిహారం - ప్రత్యేక చర్యలు 19, 20, 29 విభాగాలు

భగ్నతకు రెండు పరిహారాలున్నాయి. ఈ పరిహారాల్లో ఒకటి ఉంటే మరొకటి ఉండదా? ఇవి పరస్పరం అనుకూలమైనవా? ఒక్కటి మరో దానిని నిరోధిస్తుందా?

ఈ ప్రశ్నలను 19, 20, 29 విభాగాలు పరిగణనలోకి తీసుకున్నాయి. వాటిని ఈ క్రింది విధంగా క్లుప్తీకరించవచ్చు:-

19. (i) ఒక వివాదంలో వాది రెండిటినీ లేదా ఒక దానికి బదులు మరో దానిని అభ్యర్థించవచ్చు.

(ii) ప్రత్యేక ఉపశాంతిని మంజూరు చేయటానికి నిరాకరించినప్పుడు వాదికి చట్టబద్ధంగా లభ్యం అయ్యే పరిహారాన్ని న్యాయస్థానం మంజూరు చేయవచ్చు.

(iii) ఒక వివాదంలో న్యాయస్థానం ప్రత్యేక ఉపశాంతి సరిపోదనుకొన్నప్పుడు దానితోపాటు పరిహారాన్ని కూడా, అవసరమనుకొన్నప్పుడు మంజూరు చేయవచ్చు.

20. (iv) ''ముందే నిర్దేశించిన నష్టపరిహారం సొమ్మును ఇచ్చేందుకు'' అంగీకరించినంత మాత్రాన ప్రత్యేక ఉపశాంతిని మంజూరు చేయటానికి అవరోధం లేదు.

* * *

భాగం - 1

# ఉపోద్ఘాతం

## 1. నిర్దిష్ట ఉపశాంతిని సూచించిన చట్టం

1. నిర్దిష్ట ఉపశాంతి చట్టం, 1877

2. ఈ చట్టాన్ని ఆమోదించటానికి ముందు 1859 సివిల్ ప్రోసీజర్ కోడ్‌లోని 15, 192 విభాగాలు నిర్దిష్ట ఉపశాంతికి అవకాశం కల్పించాయి.

3. ఈ చట్టం పాక్షికంగా ఉంది. విభాగం 15 డిక్లెయేటరీ డిక్రీలను గురించి చెబితే 192 విభాగం ఒప్పందంకు సంబంధించిన నిర్దిష్ట చర్యలను ప్రస్తావించింది.

4. సివిల్‌న్యాయస్థానంనుంచి నిర్దిష్ట ఉపశాంతిని పొందటానికి సంబంధించిన చట్టాన్ని నిర్వచించి మార్చటానికి ఉద్దేశించబడింది.

## II. నిరిర్దిష్ట ఉపశాంతి చట్టం స్వభావం

1. చట్టాలు మూడు రకాలుగా ఉంటాయి:-

(i) హక్కులను నిర్వచించే చట్టాలు

(ii) పరిహారంను నిర్వచించే చట్టాలు

(iii) ప్రక్రియను నిర్వచించే చట్టాలు

2. ఉదాహరణలు

(ఖాళీగా వదలి వేయటం జరిగింది - సం.)

3. నిర్దిష్ట ఉపశాంతినిచ్చే చట్టం రెండవ రకానికి చెందుతుంది.

4. ఉపశాంతి అనే పదం న్యాయస్థానం కక్షిదారులకు చట్టప్రకారం మంజూరు చేసే పరిహారానికి పర్యాయపదం.

## III. ప్రత్యేక నిర్దిష్ట ఉపశాంతి అంటే ఏమిటి?

1. చట్టం గుర్తించిన ఒకరకమైన పరిహారమే ప్రత్యేక ఉపశాంతి. ఒక వ్యక్తి హక్కుకు భంగం కలిగినప్పుడు చట్టం అతనికి కల్పించే రకరకాల పరిహారాలను పరిశీలిస్తే దీని స్వభావాన్ని బాగా అర్థం చేసుకోవచ్చు.

2. హక్కు వాస్తవం కావాలంటే దానికి పరిహారం ఉండాలి. హక్కు అమలుకు అవకాశం లేకపోతే అది హక్కు కాజాలదు. అందువల్ల హక్కు అమలుకు భంగం కలిగినప్పుడు చట్టం దానికి తగిన పరిహారం సమకూరుస్తుంది.

3. ఒక హక్కుకు భంగం కలిగినప్పుడు సాధారణంగా చట్టం కల్పించే పరిహారం ధనరూపేణా ఉంటుంది.

4. అయితే ఇటువంటి ధనపరమైన పరిహారం అన్ని సందర్భాలలో సరిపోదు. కొన్ని విషయాలలో నష్టాన్ని ద్రవ్య పరిహారం ద్వారా భర్తీ చేయవచ్చు. మరికొన్ని నష్టాలను డబ్బు ద్వారా పూరించలేము. అటువంటి సందర్భాలలో వ్యక్తి కోల్పోయిన వస్తువును అతనికి తిరిగి అప్పగించటం ద్వారానే జరిగిన నష్టాన్ని పూరించవచ్చు. అదేవిధంగా ఒక బాధ్యతను నిర్వహించటానికి తిరస్కరించినప్పుడు తద్వారా ఏర్పడిన నష్టాన్ని కూడా ధనరూపేణా పరిహరించవచ్చు. మిగతా సందర్భాలలో బాధ్యతను నిర్బంధంగా అమలుపరచడం ద్వారా సరైన (నిర్దిష్టమయిన) పరిహారం కల్పించటం సాధ్యమవుతుంది.

5. అందువల్ల చట్టం రెండురకాల పరిహారాలను కల్పించింది.

A. తన ప్రతివాదికి వ్యతిరేకంగా వాది సంపాదించుకున్న హక్కు ప్రకారం అతనికి లభించవలసినవి మంజూరు చేయటం.

B. వాదికి చెందవలసినది అతనికి మంజూరు చేయకుండా దానికి బదులు ధనరూపేణా పరిహారాన్ని ఇప్పించటం.

6. నిర్దిష్ట ఉపశాంతి మొదటిరకమైన పరిహారం.

7. దీన్ని నిర్దిష్ట ఉపశాంతి అనటంలో ఉద్దేశం ఏమిటంటే వాది ప్రత్యేకంగా దేనిని పొందటానికి హక్కు కలిగి వుంటాడో అదే అతనికి లభ్యమయ్యేటట్లు చేయటం.

## IV. నిర్దిష్ట ఉపశాంతి చట్టం కల్పించిన ప్రత్యేక ఉపశాంతులు.

1. ఈ చట్టం కల్పించిన ప్రత్యేక ఉపశాంతులను నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు.

   1. ఆస్తిని స్వాధీనం చేసుకుని దానిని అది చెందవలసిన వ్యక్తికి స్వాధీనం చేయటం.

   2. ఒప్పందం యథాతథ అమలుకు ఆదేశించటం.

   3. చట్టబద్ధమైన విధిని నిర్వహించటానికి ఆదేశించటం.

   4. ఒక తప్పిదాన్ని చేయకుండా నిరోధించటం.

2. నాలుగవ వర్గీకరణను ఈ క్రింది విధంగా తిరిగి వర్గీకరించవచ్చు.

   1. ఒక ఒప్పందాన్ని సరిదిద్దటం.

   2. ఒప్పందాన్ని తొలగించటం.

   3. ఆ ఒప్పంద పత్రాన్ని రద్దుచేయటం.

   4. హోదాను ప్రకటించటం.

   5. ఆస్తిని స్వాధీనం చేసుకునే వారిని నియమించటం.

   6. ఉత్తర్వులను జారీ చేయటం.

## V. నిర్దిష్ట ఉపశాంతులను కల్పించే ఇతర చట్టాలు.

1. ఇండియాలో ప్రత్యేక పరిహారాలను న్యాయస్థానాలు ప్రైవేటు ద్వారానే కల్పించటం లేదు.

భారతదేశంలోని న్యాయస్థానాలు ఇతర ప్రత్యేక సదుపాయ పరిహారాలను కూడా అనుమతిస్తున్నాయి. వాటిని భారత చట్టం గుర్తించింది.

**2. ప్రత్యేక ఉపశాంతి చట్టం వెలుపల లభ్యమయ్యే ఇతర ప్రత్యేక పరిహారాలు.**

**1. మరణించిన వ్యక్తి ఆస్తిని లెక్కగట్టి దానిని నిర్వహించటం.**

**2. ఒక ధర్మ నిధి లెక్కలను పరిశీలించి ఆ నిధి తాలుకు ఆస్తులను నిర్వహించటం.**

3. కోల్పోయిన హక్కును పునరుద్ధరించటం. లేదా తనఖా పెట్టిన ఆస్తులను విక్రయించటం.

4. తనఖా పెట్టిన ఆస్తిని విడిపించటం. దానిని ఆ వ్యక్తికి అప్పగించటం.

5. భాగస్వామ్యాన్ని రద్దుచేయటం. భాగస్వామ్య లెక్కలను పరిగణనలోకి తీసుకుని ఆస్తులను కాపాడటం. భాగస్వాముల అప్పులను తీర్చటం.

## విభాగం - II

చట్టం గుర్తించిన వివిధ ప్రత్యేక ఉపశాంతులను పరిశీలన.

మొదటి భాగం

ఆస్తిని స్వాధీనం చేసుకోవటం.

8, 9, 10, 11 సెక్షన్లు

1. స్థిరాస్తిని స్వాధీనం చేసుకోవటం - 8, 9 సెక్షన్లు

2. చరాస్తిని స్వాధీనం చేసుకోవటం - 10, 11 సెక్షన్లు

## స్థిరాస్తిని స్వాధీనం చేసుకోవటం

1. ప్రశ్న ఏమిటంటే - ఒక వ్యక్తి తన స్థిరాస్తిని కోల్పోయినాక దాని స్వాధీనత కోసం న్యాయస్థానాన్ని అభ్యర్థించినప్పుడు అతనికి ఇతరత్రా పరిహారం కల్పించటంగాకుండా కోల్పోయిన ఆస్తిని ఇప్పించటం.

2. ఇక్కడ ఉపశాంతి స్వభావం ప్రాముఖ్యం పొందుతుంది. అయితే కోల్పోయినటువంటి ఆస్తిని తిరిగి స్వాధీనపరచటం. సాధారణ చట్టం కింద ఇతరత్రా నష్టపరిహారం చెల్లించటం జరుగుతుంది. అయితే నష్టపడిన వ్యక్తి తాను కోల్పోయిన ఆస్తినే కావాలని కోరినప్పుడు ఈ ప్రశ్న తలెత్తుతుంది.

3. స్థిరాస్తిని కోల్పోయిన వివాదాలు రెండు రకాలుగా ఉంటాయి. అందులో ఒకటి, హక్కు కలిగి వుండి దాని స్వాధీనాన్ని కోల్పోయిన వ్యక్తి. రెండు, ఒక వ్యక్తి ఆస్తిని కలిగివుండి దానిని కోల్పోయినప్పుడు.

4. కలిగి వుండడానికి హక్కు ఉండటం. కలిగి వుండటం ఈ రెంటిలో వ్యత్యాసం ఉంది.

5. 8, 9 సెక్షన్లు ఈ రెండు అంశాల గురించి చెబుతున్నాయి. ఈ రెండు సందర్భాలలోనూ ఆస్తిని

స్వాధీనం చేయటం ద్వారా ప్రత్యేక ఉపశాంతి వాది పొందటానికి ఈ రెండు విభాగాలు అవకాశం కల్పిస్తున్నాయి.

6. సెక్షన్ 8 సూచించిన షరతులు.

1. నీకు హక్కు ఉన్నదని రుజువు చెయ్యాలి. అంతే గాకుండా ప్రత్యేక ఉపశాంతి ద్వారా ఆస్తిని పొందగలుగుతామని కూడా రుజువు చెయ్యాలి.

7. సెక్షన్ 9 షరతులు.

1. వాదం ప్రారంభం అవటానికి ఆరుమాసాల ముందు నుంచి ఆస్తిని స్వాధీనంలో ఉందని రుజువు చెయ్యాలి.

2. చట్ట ప్రకారం కాకుండా ఇతర విధంగా ఆస్తిని నీ అనుమతి లేకుండా మరొకరు స్వాధీనం చేసుకున్నారని రుజువు చెయ్యాలి.

A. స్వాధీనంలో ఉన్నది B. స్వాధీనంలోకి తీసుకున్నాడు.

1. Aకు ఖరారు పత్రం ఉంది Bకు లేదు

2. ఖరారు పత్రంతో B తీసుకున్నాడు

3. B ఖరారు పత్రం లేకుండా స్వాధీనం చేసుకున్నాడు.

1. పై మూడు కేసుల్లో కూడా A, 9 సెక్షన్ కింద ఆరు మాసాల్లోపల కేసు చేసినట్లైతే ఖరారు పత్రంతో సంబంధం లేకుండా ఆస్తిని స్వాధీనం చేసుకోగలడు.

2. ఆరు మాసాల తర్వాత కేసు వేసినట్లైతే ఖరారు పత్రంపై అతడు ఆధారపడి తన ఆస్తిని స్వాధీనం చేసుకోగలడు.

(i) …… అతనికి ఖరారు పత్రం ఉంది కాబట్టి

(ii) …… అతనికి స్వాధీన పట్టా ఉంది కాబట్టి

అయితే (ii) Bకి ఖరారు పట్టా ఉంది. Aకు లేదు కాబట్టి A స్వాధీనం చేసుకోలేడు.

## విభాగం 10 క్రింద ఎవరు కేసును గెలవగలరు

1. విభాగం 10 ప్రకారం ఎవరికి ఖరారు పట్టా ఉందో వారే ఆస్తిని స్వాధీనం చేసుకొనే వాజ్యాన్ని వేయగలరు.

2. ''స్వాధీనతకు హక్కు'' అర్థము.

3. స్వాధీనతకు పట్టా ఏర్పడే సందర్భం.

(i) యాజమాన్యం వల్ల; లేదా

(ii) యాజమాన్యంతో సంబంధం లేకుండా, తాత్కాలికంగా లేదా ప్రస్తుత స్వాధీనతగా నిర్దిష్టమైన హక్కువల్ల

4) యాజమాన్యం వల్ల స్వాధీనతకు పట్టా.

(i) యాజమాన్యం కేవలం చట్టబద్ధమైనది లేదా చట్టబద్ధమైన యాజమాన్యంతో పాటు లాభదాయకమైన ఆసక్తి.

(ii) సెక్షన్ 10 క్రింద వాజ్యం వేయటానికి చట్టబద్ధమైన యజమానికి ఆస్తిపై లాభదాయకమైన ఆసక్తి ఉండనవసరంలేదు.

(iii) 1వ భాగంలో దానిని సుస్పష్టంగా వివరించటం జరిగింది. ధర్మకర్త ధర్మనిధి ఆస్తిని స్వాధీనం కోసం, అతనికి వ్యక్తిగతమైన లాభం లేకపోయినప్పటికీ, వ్యాజ్యం వేయవచ్చు.

5. యాజమాన్యంతో సంబంధం లేకుండా స్వాధీనతకు పట్టా.

1. యాజమాన్యంతో సంబంధం లేకుండా స్వాధీనతకు పట్టా అవసరం రెండు సందర్భాల్లో ఏర్పడుతుంది -

(i) యజమాని చర్య వల్ల

(ii) యజమాని కాకుండా ఇతరుల చర్యల వల్ల

(i) యజమాని చర్య ద్వారా స్వాధీనతకు పట్టా

(i) యజమానిగా తనకు చెందిన దీనిపై మరొకరికి హక్కును యజమాని తన చర్య ద్వారా కల్పించవచ్చు.

(ii) బైయిల్‌మెంట్ మరియు లీన్‌లో ఇటువంటి ఉదాహరణలు కనిపిస్తాయి.

(1) సాధారణ బైయిల్‌మెంట్ క్రింద ఈ క్రింది కేసులు వస్తాయి.

(i) రుణము

(ii) స్వాధీనత

(iii) కారేజి

(iv) ఏజెన్సీ

(2) ఇతర బైయిల్ మెంట్లు

(1) తాకట్టు

(2) అద్దెకు తీసుకోవటం

(2) సాధారణ బైయిల్‌మెంట్ మరియు తాకట్టు, అద్దెకు తీసుకోవటం మొదలైన ఇతర బైయిల్‌మెంట్ల మధ్య వ్యత్యాసం.

(i) సాధారణ బైయిల్‌మెంట్‌లో యజమానికి స్వాధీనత హక్కు ఉంటుంది. బైయిలీకి చట్టబద్ధమైన స్వాధీనత ఉంటుంది. బైయిలీకి స్వాధీనత హక్కు ఉంది. కాబట్టి ఆస్తిని స్వాధీనం చేసుకోటానికి దావా వేయవచ్చు. బైలర్‌కు కూడా స్వాధీనతకు హక్కు ఉంటుంది. కాబట్టి బైలీని మినహాయించి వేరెవరిపైన అయినా అతడు దావా వేయవచ్చు.

(ii) తాకట్టు, అద్దె మొదలైన బైయిల్ మెంట్ల విషయంలో… బైలర్‌కు స్వాధీనతకు హక్కు లేదు. తాకట్టుదారుడు లేదా కిరాయిదారుడుకే సదరు హక్కు ఉంటుంది. బైలర్‌కు తాకట్టు/ అద్దె కొనసాగినంతకాలమే హక్కు ఉంటుంది. అందువల్ల బైలీ (తాకట్టుదారుడు) మాత్రమే దావా వేయగలడు.

3. 'లీన్' (Lien) యజమాని చర్య వల్ల స్వాధీనతకు హక్కును ఉదహరిస్తుంది.

(i) యజమాని చేసిన అప్పు వల్ల స్వాధీనతకు హక్కు లీన్ కల్పిస్తుంది.

(ii) యజమానికి ఉన్న స్వాధీనత హక్కు తాత్కాలికంగా మరొకరు కలిగి ఉంటారు.

4. ప్రస్తుత స్వాధీనతకు హక్కు కలిగి ఉండటం దావా వేయటానికి అవసరం.

(i) యాజమాన్యం వల్ల లేదా లేకపోయినా ప్రస్తుత స్వాధీనతకు హక్కు.

(ii) ప్రస్తుత స్వాధీనతకు హక్కు తాత్కాలికం లేదా ప్రత్యేకం కావచ్చు.

(ii) యజమాని చర్య లేదా ఇతరత్రా స్వాధీనతకు హక్కు.

(1) పోయిన వస్తువులను కనుగొన్న వ్యక్తికి వాటి స్వాధీనతపై హక్కు ఉంటుంది.

(2) యజమాని చర్యవల్ల అది ఏర్పడదు.

(3) నిజమైన యజమానికి తప్ప మొత్తం ప్రపంచానికి అది వ్యతిరేకమైనదే.

**II. ఎవరికి వ్యతిరేకంగా ఆ దావా చెల్లుతుంది?**

1. విభాగం 10 క్రింద దావాను ఎవరికి వ్యతిరేకంగానైనా, నిజమైన యజమానికి వ్యతిరేకంగా కూడా వేయవచ్చు.

2. వాదికి దానిపై హక్కుండడం అన్నిటికంటే ముఖ్యమైంది.

## సెక్షన్ 11 - చరాస్తి

1. ప్రశ్న 1: సెక్షన్ 11 క్రింద ఎవరు దావా వేయవచ్చు?
సమాధానం: తక్షణ స్వాధీనతకు పట్టా ఉన్న వ్యక్తి.

2. ప్రశ్న 2: ఎవరికి వ్యతిరేకంగా సదరు దావా వేయవచ్చు?
సమాధానం: యజమానికాని ఏ వ్యక్తికి వ్యతిరేకంగానైనా.

ప్రతివాది యజమాని కాకూడదు. అతడు యజమాని అయితే, విభాగం 10 వర్తిస్తుంది.

3. ప్రశ్న 3: ఆస్తిని స్వాధీనం చేసుకోవడం ద్వారా ఏ దావా ప్రకారం ప్రత్యేక ఉపశాంతిని పొందవచ్చు?

సమాధానం: (i) హక్కుదారు తరపున ఎవరు ఏజెంట్‌గా లేదా ధర్మకర్తగా వ్యవహరిస్తాడో అతని స్వాధీనంలో ఆస్తి ఉండాలి.

(ii) నష్టానికి ధన పరిహారం సరైంది కానప్పుడు.

(iii) నష్టం ఏమేరకు జరిగిందో సరిగ్గా అంచనా వేయటం సాధ్యం కానప్పుడు.

(iv) హక్కుదారు నుంచి మరో వ్యక్తికి తప్పిదంగా ఆస్తి బదిలీ అయినప్పుడు.

## ఆస్తి స్వాధీనతకు సంబంధించిన ప్రత్యేక ఉపశాంతి

సెక్షన్లు 8-11లు దీనిని గురించి చెబుతున్నాయి.

సెక్షన్-8 స్థిరాస్తిని పొందటానికి హక్కు కలిగిన వ్యక్తిని స్వాధీనతను కోరవచ్చు.

సెక్షన్-9 చరాస్తి స్వాధీనతకు హక్కు కలిగిన వ్యక్తి దీనిని కోల్పోయినప్పుడు స్వాధీనతను చేసుకోవచ్చు.

సెక్షన్-10 నిర్దిష్టస్థిరాస్తికి హక్కుదారుడు దానిని తిరిగి పొందటానికి హక్కును కలిగి ఉంటాడు.

(1) యాజమాన్యం వల్ల

(2) తాత్కాలిక లేదా ప్రత్యేక హక్కులు ( ధర్మకర్త) వల్ల

సెక్షన్-11 ఎవరికైతే దాని తక్షణ స్వాధీనతకు హక్కు ఉంటుందో అతడు సదరు నిర్దిష్ట ఆస్తి స్వాధీనతను కోరవచ్చు.

యజమాని కాని, ఆస్తి స్వాధీనంలో ఉన్న వ్యక్తికి ఇది వర్తిస్తుంది.

## చట్టం దృష్టిలో స్వాధీనత అంటే ఏమిటి?

చట్టం దృష్టిలో స్వాధీనత అనే భావంలో రెండు అంశాలున్నాయి. అవి: కార్పస్ (Corpus) మరియు ఏనిమస్ డొమిని (animus domini)

**గమనిక**

(i) చట్టబద్ధ స్వాధీనతలో హక్కు లేదా పట్టా అంశం ఉండదు. అది పూర్తిగా వీటికి సంబంధం లేకుండా ఉంటుంది. చట్టబద్ధ స్వాధీనత చట్టపరంగా లేదా చట్ట విరుద్ధంగా ఉండవచ్చు.

(ii) తప్పిద చర్యలకు వ్యతిరేకంగా రక్షణ కల్పించటానికి చట్టబద్ధ స్వాధీనత హక్కు కల్పిస్తుంది. అది స్వాధీనతకు పాక్షికమైన షరతులతో కూడిన హక్కును కల్పిస్తుంది. ఆస్తిపరంగా దాని స్వాధీనతకు హక్కును, ఎవరికి వ్యతిరేకంగానైనా, ఎవరు దానిపై ఇంతకు ముందే తనకు హక్కు ఉందని, శ్రేష్టమైన పట్టాను చూపించలేరో వారికి వ్యతిరేకంగా రక్షణనిస్తుంది.

## చట్టపరమైన స్వాధీనతలో రెండు అంశాలున్నాయి

(i) కార్పస్. అంటే భౌతిక సంబంధం.

(ii) ఏనిమస్. అంటే మానసిక సంబంధం.

కార్పస్: భౌతిక సంబంధం అంటే శారీరక సంపర్కం అని అర్థం కాదు అందులో శారీరక సంపర్కం కూడా ఉంటుంది. దానిని ఇష్టప్రకారం కొనసాగించవచ్చు. కార్పస్ సారాంశం ఏమిటంటే ఇతరులు ఒక వస్తువును ఉపయోగించకుండా నిరోధించే అధికారం అని అర్థం. స్వాధీనతలో ఉన్న వస్తువు స్వభావాన్నిబట్టి దానిని నియంత్రించే, అధీనంలో ఉంచుకొనే అధికారం.

ఏనిమస్: అంటే సదరు అధికారాన్ని ఉపయోగించడం. ఇతరులను దానిని పొందకుండా నిరోధించటం.

ఏనిమస్ మూడు రూపాల్లో ఉంటుంది

వాస్తవంగా అధీనంలో ఉంచుకొన్న వ్యక్తి మానసిక స్థితి మూడు విధాలుగా ఉండవచ్చు-

(1) అతని ఆసక్తి కేవలం ఆస్తిని కాపాడటమే కావచ్చు. అందులో హక్కును నిర్ధారించుకోనున్న ఆసక్తి ఉండదు. సేవకుడు యజమాని వస్తువులను కాపాడతాడు.

(2) కొన్ని పరిమిత ప్రయోజనాల కోసం నియంత్రణ చేయాలనుకోవచ్చు. ఉదా: అద్దెదారుడు యజమానిని తప్ప ఇతరులను నిరోధిస్తాడు.

(3) ప్రతి వ్యక్తికీ హక్కును నిరాకరించటం ఉద్దేశం కావచ్చు. ఇది నిజమైన మానసిక సంబంధం.

## స్వాధీనత అక్రమ ప్రవేశానికి మధ్య వ్యత్యాసం

1) ఈ సందర్భంలో వాది వివాదగ్రస్తమైన ఆస్తి స్వాధీనతలో ఉందని రుజువు చెయ్యాలి. కేవలం చాటుమాటుగా ఆస్తిని స్వాధీనంలోకి తెచ్చుకున్నట్లుకాదు అతడు రుజువు చెయ్యాల్సింది-

(i) తన స్వాధీనంలో ఉన్నట్లు అతని చర్యలు చూపించగలగాలి.

(ii) వాది ఆస్తిని స్వాధీనం చేసుకోవటం శాంతియుతంగా జరిగితే, దీర్ఘకాలం అది అతని అధీనంలో ఉంటే, వాది అధీనంలో ఆస్తి ఉందని భావించవచ్చు.

## సెక్షన్లు 8, 9 లక్ష్యాలు

(i) సి.పి.సి. రూపొందించిన ప్రక్రియ ప్రకారం స్థిరాస్తిని హక్కు కలిగిన వ్యక్తికి దాని స్వాధీనతకు విభాగం 8 అవకాశం కల్పిస్తుంది. పట్టా ఆధారంగా అతడు దావా వేయవచ్చు.

(ii) తన సమ్మతి లేకుండా చట్టానికి వెలుపల ఒక వ్యక్తి ఆస్తిని కోల్పోయినప్పుడు దాని స్వాధీనతకు విభాగం 9 పద్ధతిని సూచిస్తుంది.

## సెక్షను 9

ఈ విభాగం చట్టవిరుద్ధంగా ఆస్తిని కోల్పోవటం గురించి వ్యవహరిస్తుంది. అటువంటి వ్యక్తికి రెండు ప్రత్యామ్నాయ పరిహారాలను కల్పిస్తుంది-

(i) కోల్పోయిన ఆరు మాసాల్లోపల అతడు తాను ఆస్తిని ఏవిధంగా చట్టవిరుద్ధంగా కోల్పోయాడో రుజువు చెయ్యాలి. అటు తరువాత స్వాధీనత కోసం కోరాలి. ఆస్తికి అతని హక్కు అప్రస్తుతం.

(ii) ఆస్తి స్వాధీనతకు తన పట్టా ఆధారంగా దావా వేయవచ్చు. పట్టాను రుజువు చేయడంపై అతని విజయం ఆధారపడి ఉంటుంది. సెక్షన్ 9లో చెప్పినట్లు మొదటిది ఆస్తి స్వాధీనతకు సంబంధించినది. రెండవది సెక్షన్ 8 క్రింద ఆస్తి హక్కు పట్టాను రుజువు చేయటం.

## సెక్షన్ 9 స్వభావం, లక్ష్యం

(i) వారి హక్కులు, పట్టాలు ఎంత ప్రశస్తమైనప్పటికీ చట్టాన్ని చేతుల్లోకి తీసుకోకుండా నిరోధించటం.

(ii) ఆస్తిని కోల్పోవటం వల్ల రుజువు చేయవలసిన బాధ్యతను బదలీ చేయటం - స్వాధీనత ప్రాథమిక సాక్ష్యం కాబట్టే పట్టాను రుజువు చెయ్యాలి.

కోల్పోవటం, కోల్పోయిన వ్యక్తి మధ్య స్వాధీనత ఆస్తి హక్కు పట్టాను రుజువు చెయ్యాలి. ఆరు మాసాల్లోపల విభాగం-9 ప్రకారం దావా వెయ్యాలి.

ప్రశ్న: ముందుగా స్వాధీనత కలిగి ఉండటం వల్ల, ఆరు మాసాల తర్వాత స్వాధీనతను కోల్పోయినప్పుడు సంభవించే పరిణామాలు ఏమిటి? సెక్షన్ 9 కింద దావాను వేయటం నిరోధించటమవుతుంది?

ఈ క్రింది ప్రమేయాలు న్యాయబద్ధంగా రూపొందించటం జరిగింది:-

**(i)** ఆరు మాసాలు, అంతకంటే ఎక్కువ కాలానికి స్వాధీనతను కలిగి ఉండటం హక్కు అమలుకు సరిపోతుంది. దీనిని ఎవరూ సవాలు చేయలేరు.

**(ii)** 12 సంవత్సరాల ఆక్రమణ చట్టబద్ధమైన హక్కుదారునికి వ్యతిరేకంగా చెల్లుబాటు అవుతుంది.

పర్యవసానంగా, స్వాధీనతకు దావా వేసినప్పుడు, నిర్ణీత సమయం పరిమితిని ప్రతివాది ప్రశ్నించినప్పుడు హక్కుదారుని పట్టాను రుజువు చేసుకోవాలి. అక్రమ స్వాధీనతకు ముందు సదరు ఆస్తికి తన హక్కును రుజువు చేసుకోవాలి.

**(iii)** స్వాధీనతకు ముందు, ఎంత తక్కువ కాలానికి అయినప్పటికీ, తన పట్టాను రుజువు చేసుకొని తమ ఆస్తిని కోల్పోవటం వల్ల, దానిని తిరిగి స్వాధీనం చేసుకోటానికి సరైన వాదన ఉంటుంది.

(1) ఆక్రమించుకున్న వ్యక్తి ఎటువంటి హక్కును రుజువు చేయలేనప్పుడు;

(2) ఏ పక్షమూ రుజువు చేయలేనప్పుడు

## పరిస్థితి వ్యక్తీకరణ



I. ఆరు మాసాల్లోపల -- పట్టాతో ప్రమేయం లేకుండా

(a) మరియు (a) -- సెక్షన్ 9 కింద ఆస్తిని స్వాధీనం

(b) మరియు (a) -- చేసుకోవచ్చు.

II. ఆరు మాసాల తర్వాత దావా వేస్తే

(a) మరియు (a) "A'కు పట్టా ఉంది కనుక స్వాధీనం చేసుకోవచ్చు

(b) మరియు (b) "B'కు పట్టా ఉంది కనుక 'ఎ'కు స్వాధీనం లభించదు.

(b) మరియు (a) "A'కు ఇదివరకు కబ్జా ఉంది కనుక 'ఎ'కు స్వాధీనం ఉంటుంది.

## స్వాధీనతా హక్కు:

స్వాధీనతకు హక్కు ఈ క్రింది సందర్భాల్లో ఉంటుంది-

(i) యాజమాన్యంలో భాగంగా

(ii) యాజమాన్యంతో సంబంధం లేకుండా

తాత్కాలికంగా లేదా ప్రత్యేక హక్కుగా-

ఈ ప్రత్యేక హక్కులు ఈ క్రింది సందర్భాల్లో ఏర్పడుతాయి-

(i) యజమాని చర్య వల్ల

(ii) యజమాని కాకుండా ఇతరుల చర్యల వల్ల

## I. యజమాని చర్య వల్ల

(1) బైయిల్‌మెంట్ (2) లీన్

బైయిల్‌మెంట్ (1) సాధారణమైంది (2) ప్రత్యేక తాకట్టు లేదా అద్దెకు తీసుకోవటం వల్ల

(i) సాధారణ బెయిల్‌మెంట్, ఉదాహరణకు అప్పు, స్వాధీనత, కారేజ్, ఏజెన్సీ

సాధారణ బెయిల్‌మెంట్ సందర్భంలో బైయిల్‌మెంట్‌కు స్వాధీనతకు హక్కు ఉంది. బెయిలీకి చట్టబద్ధ స్వాధీనతకు హక్కుంది.

A బైలర్; B బైయిలీ. ఇద్దరూ C కి వ్యతిరేకంగా స్వాధీనతకు ప్రయత్నించవచ్చు. B కి వ్యతిరేకంగా A స్వాధీనతకు ప్రయత్నించవచ్చు.

**(ii)** ప్రత్యేక బైయిల్‌మెంట్- తాకట్టు మరియు అద్దెకు బైయిల్‌మెంట్ కొనసాగుతున్నంతకాలం బైలర్‌కు స్వాధీనత గురించి హక్కు లేదు. స్వాధీనతను పొందటానికి మాత్రమే అవకాశం ఉంది.

లీన్: బాకీ ద్వారా ఏర్పడుతుంది - రుణదాతకు అమ్మకందారుడు పైకాన్ని చెల్లించేంతవరకూ వస్తువుపై హక్కుంటుంది.

## I. యజమాని చర్య కాకుండా ఇతరత్రా స్వాధీనతకు హక్కు

పోయిన వస్తువులను కనుగొన్న వ్యక్తికి ఒక్క వాటి యజమాని విషయంలో తప్ప ఇతరులకు వ్యతిరేకంగా సదరు వస్తువులపై అధికారం ఉంటుంది.

## Part II

### విభాగం - II

# ఒప్పందం నిర్దిష్ట అమలు

''నియమ నిబంధనల ప్రకారం ఒప్పందం నిర్దిష్ట అమలు, వాటిని అమలుపరచక పోవడం వల్ల ర్పడే నష్టాలు, వాటికి పరిహారం'' ఒప్పందానికి సంబంధించిన ''నిర్దిష్ట అమలు'' సూచిస్తాయి.

ఒప్పందం క్రిందకక్షిదారుడు నిర్వహించవలసిన బాధ్యతను అతడు నిర్వహించేటట్లు ఆదేశించటమే నిర్దిష్ట ఉపశాంతి'' లక్ష్యం.

## ప్పందం నిర్దిష్ట అమలు

సెక్షన్లు 12, 21 ఒప్పదం తాలుకూ నిర్దిష్ట అమలును ప్రస్తావిస్తాయి.

సెక్షన్ 21: నిర్దిష్టంగా అమలుపరచలేని ఒప్పందాలను నిర్వచించింది.

సెక్షన్ 12: నిర్దిష్టంగా అమలుపరచగల ఒప్పందాలను నిర్వచించింది.

సెక్షన్ 21: నిర్దిష్టంగా అమలుపరచలేని ఒప్పందాలు 8 రకాలుగా ఉన్నాయి:-

**(i)** ఒప్పందం అమలుకానప్పుడు వాటికి ధనపరిహారం చెల్లిస్తే సరిపోయే సందర్భంలో

**(ii)** ఒప్పందాలు:

(i) అనేక వివరాలతో ఉన్నపుడు-

(i) వ్యక్తిగత అర్హతలు, సామర్థ్యం లేదా వ్యక్తుల ఇష్టాయిష్టాలపై ఆధారపడినప్పుడు-

(iii) ఒప్పందంలోని మౌలిక అంశాలను న్యాయస్థానం అమలు జరపజాలనప్పుడు.

(iii) ఒప్పందాలు వాటి షరతులను న్యాయస్థానం హేతుబద్ధమైన స్థిరత్వంతో కనుక్కోలేనపుడు- (ఉదాహరణ: అవసరమయిన సాధనాలు)

(iv) ఒప్పందాలు రద్దుచేసుకోగల స్వభావం కలిగినవైనపుడు- (ఉదాహరణ: కాలపరిమితిలేని భాగస్వామ్యం.

(v) ఒప్పందాలు ధర్మకర్తలు అధికారాన్ని అతిక్రమించి వ్యవహరించినప్పుడు, విశ్వాసానికి విరుద్ధంగా వ్యవహరించిననప్పుడు.

(vi) ఒప్పందాలు సంస్థ అధికారాలను అతిక్రమించి వ్యవహరించేటప్పుడు.

(vii) ఒప్పందాలు అమలు అయిన రోజు నుంచి మూడు సంవత్సరాలు ఎటువంటి అంతరాయం లేకుండా విధులను నిర్వహించినప్పుడు.

(viii) ఒప్పందాలు షరతులు వాస్తవంలో ఉండవలసినవి అమల్లో లేనప్పుడు.

(ix) ఒప్పందాలు మధ్యవర్తిత్వానికి తీసుకొచ్చే వివాదాలు:

<u>గమనిక:</u>

దావాకు ఎటువంటి హక్కు ఇవ్వనందున వాస్తవంలో నిర్దిష్ట అమలును నిర్ధారించడం కష్టం.

## ఒప్పందాల నిర్దిష్ట అమలు

<u>సెక్షన్ 12</u>

1. నాలుగు వివాదాల్లో నిర్దిష్టంగా అంశాలను అమలుపరచవచ్చు.

(i) అమలు చేయాలనుకొన్న చర్య ఒక ట్రస్టుకు సంబంధించినదైతే.

(ii) వాస్తవ నష్టాన్ని అంచనా వేయటానికి ప్రామాణిక పద్ధతి లభ్యం కానప్పుడు.

(iii) నష్టాలకు తగిన పరిహారం లభ్యం కానప్పుడు.

(iv) చర్య తీసుకోకపోవటం వల్ల పరిహారం సాధ్యం కానపుడు.

## ఒప్పందం

మొదటి ప్రశ్నను న్యాయస్థానం ఒప్పందం తాలుకు నిర్దిష్ట అమలు నుంచి ఏర్పడిన దావాను వివాద పరిశీలనకు తీసుకొన్న ఒప్పందం ఒడంబడిక అయినా కాకపోయినా పరిశీలించవలసి ఉంటుంది. సెక్షన్ 4(a) ప్రకారం ఒప్పందం ఒడంబడిక అయితే ఉపశాంతిని కోరటానికి హక్కుంటుంది.

ఈ క్రింది ఒప్పందాలు ఒడంబడికలు కావు. ఎందుకంటే వాటిని అమలుపరచలేము-

(i) అసంపూర్తి ఒప్పందాలు - సంప్రదింపుల దశను దాటి కక్షిదారుల ముందుకు వెళ్ళలేదు.

(ii) చెల్లని ఒప్పందాలు

(iii) తాత్కాలిక ఒప్పందాలు

చెల్లుబాటు అయ్యే ఒప్పందాలను మినహాయించలేదు.

అమలుజ షని ఒప్పందమే న్యాయస్థానం పరిశీలిస్తుంది.

పరస్పరత నిర్దిష్ట అమలు ద్వారా పరిహారం పరస్పరంగా ఉంటుంది. ఉదా: అమ్మకందారుడు కొనుగోలుదారుడు ఖచ్చితంగా చర్య తీసుకోగలిగిన వివాదాలన్నింటినీ తీసుకువస్తాడు.

స్థిర, చరాస్తుల విషయంలో పరస్పరతా సూత్రం వర్తిస్తుంది.

## పరస్పరతా సూత్రం
## (DOCTRINE OF MUTUALITY)

దీని అర్థం ఏమిటంటే ఒప్పందం చేసుకొనే సమయంలో ఇరుపక్షాలూ పరస్పరం అమలు పరచటానికి అంగీకరించిన వాగ్దానాలు ఉంటాయి. అందువల్ల ఉదారంగా చెప్పింది అమలుపరచటానికి లేదా ఆ వాగ్దానం ఆధారంగా ఒక శిశువు పరిహారాన్ని కోరటం సాధ్యం కాదు. అతనికి వ్యతిరేకంగా అతని వాగ్దానాన్ని అమలుపరచడం సాధ్యంకాదు. పరస్పర పరిహారానికి అవకాశం ఉన్నప్పుడు న్యాయస్థానం సమతా దృష్టితో జోక్యం చేసుకోవటం ఒక సాధారణ నియమం.

## సెక్షన్-13

ఒప్పందం నిర్దిష్ట అమలు చర్యకు అమలు చేయటం అసాధ్యం.

## ఒప్పందం చట్టంలోని 56వ సెక్షన్

సెక్షన్ 56, క్లాజ్ 2 ఒక సాధారణ నియమాన్ని రూపొంచింది ఒప్పందం ఏ సందర్భంలో చెల్లుబాటుకాదో చెబుతుంది.

ఈ విషయం అసాధ్యమయ్యే ప్రతి కారణాన్ని నివారిస్తుంది. ప్రతి ఒప్పందంలో దాని అమలు సాధ్యం అనేది అంతర్లీనమై ఉందన్న ప్రమేయం ఈ నియమంలో కనిపిస్తుంది.

అసాధ్యత ఒప్పందానికి సంబంధించినంతవరకూ అసాధ్యత

(1) ఆ సమయంలో లేదా (2) తర్వాత

| | | |
|---|---|---|
| శారీరకంగా | లేదా | ఒప్పందం |
| లేదా | | విషయాలు |
| చట్టపరంగా - | | ఉనికిలో |
| అసాధ్యం - | | లేవు |

## తర్వాత అసాధ్యత

తెలుసుకొన్న తర్వాత కక్షిదారుడిని వదలివేయడం తర్వాత సంభవించే అసాధ్యతపై ఆధారపడి ఉంటుంది. అందుకుగాను-

(i) ఒడంబడిక షరతులతో కూడి ఉందా బేషరతుగా రూపొందిందా.

(1) బేషరతుగా ఉంటే - చర్య తప్పనిసరి.

(2) షరతులతో కూడి ఉంటే - మూడు పరిస్థితులు

(i) చట్టబద్ధత కొనసాగింపు

(ii) స్పష్టంగా వ్యక్తం చేసిన షరతులు

**(iii)** నిగూఢార్థం ద్వారా షరతులతో కూడిన ఒప్పందం చట్టం విభాగం 56, ప్రకారం, అంశాలు కాలపరంగా కొనసాగుతుంటే - భవిష్యత్‌లో ఒప్పందం సార్ధకం కాదు. రెండు కారణాల వల్ల-

(1) అంగీకరించింది శారీరకంగా లేదా చట్టపరంగా అసాధ్యమైతే

(2) ఒప్పందంలోని విషయాలు అమల్లో లేకపోతే

తర్వాత ఏర్పడే అసాధ్యత-

**(i)** ప్రారంభంలో లేదా తర్వాత కాలంలో అసాధ్యమైతే ఒప్పందం చెల్లదు. అప్పుడు ప్రత్యేక చర్యల అవసరం ఏర్పడదు. చట్టంలోని 13వ విభాగం విభాగం 56కు ఒక మినహాయింపు నిచ్చింది. అది ఒప్పందంలోని అంశాలు అమల్లో లేవు కాబట్టి అనే కారణం వల్ల ఏర్పడే అసాధ్యతను మినహాయిస్తుంది.

ఒప్పందానికి సంబంధించిన ప్రత్యేక అంశాన్ని, ఒప్పందంలోని అంశాలు కొన్ని కనిపించకుండా పోయినా, పాడైపోయినా అమలుపరచవలసిందే అని విభాగం 13 చెబుతున్నది.

ఇల్లు అమ్మకం తుపాను వల్ల వినాశనం - కొనుగోలుదారుడు తప్పనిసరిగా చర్య తీసుకోవలసిందే.

సెక్షన్ 13 ఒక మినహాయింపును ఇస్తుంది.

ఇది ఒక కేసును గురించి ప్రస్తావిస్తుంది. అందులో కొంత భాగం అమల్లో ఉండదు.

నియమం ఏమి చెబుతుందంటే-

A ప్రత్యేక అనివార్య కారణాల వల్ల తన బాధ్యతను నిర్వహించలేకపోతాడు, అందువల్ల B తన బాధ్యతను నిర్వహించకపోవటానికి ఎటువంటి కారణం ఉండదు, ప్రత్యేకంగా తాను చర్య తీసుకోవటం వల్ల B తన ఆసక్తిని కాపాడుకోగలుతాడు. Aను తాను తీసుకోవలసిన చర్య షరతుపైనే B చర్య తీసుకుంటాడు. A సమర్ధనీయంకాని వాగ్దానం చేయడం వల్ల అతడు దానిని నిలుపుకోవలసిందే.

## ఒప్పందంలోని ఒక భాగాన్ని నిర్దిష్టంగా అమలు జరపడం

ఒప్పందంలోని ఒక భాగాన్ని అమలుపరచమని న్యాయస్థానం ఆదేశించగలదా?

<u>సెక్షన్ 14-17</u> ప్రశ్నకు సంబంధించిన అంశాలను వివరిస్తున్నాయి.

<u>సెక్షన్ 17</u> ఈవిధంగా ఒక సాధారణ నియమాన్ని రూపొందించింది. మొత్తం ఒప్పందాన్ని అమలుపరచగలిగితేనే న్యాయస్థానం, ఒక సాధారణ నియమంగా, ఒప్పందంలోని ఒక భాగాన్ని అమలుపరచమని ఆదేశించదు. ప్రత్యేక చర్య మొత్తం ఒప్పందానికి సంబంధించిందే అయి ఉండాలి.

<u>సెక్షన్లు 14, 15, 16 పై</u> నియమానికి మినహాయింపులు

<u>మినహాయింపులు:-</u> అమలుపరచటానికి ఉద్దేశించిన వాగ్దానాలు విభజింపతగినవి కావచ్చు లేదా అవిభాజ్యమైనవి కావచ్చు.

<u>1. విభజింపదగిన వాగ్దానాలు:</u> వాగ్దానాలు - ఒక భాగం రెండవ భాగంతో సంబంధంలేకుండా ఉండవచ్చు. మొదటిది అమలుపరచగలిగితే అమలుపరచవచ్చు. రెండవది అమలుచేయలేనప్పుడు దానితో సంబంధంలేకుండా మొదటిది అమల్లోకి రావచ్చు - విభాగం 16

**II.** అవిభాజ్య వాగ్దానాలు అమలు చేయలేని భాగం -

(i) నష్టపరిహారం ధనరూపేణ అంగీకరించడం లేదా

(ii) అంగీకరించకపోవటం

(A) పరిహారాన్ని అంగికరించటం - ండు కేసులు.

(i) ఒకదాంట్లో కొంత భాగాన్నే తీసుకోవటం.

(ii) ఒక మొత్తంలో అధిక భాగాన్ని తీసుకోవటం.

అయితే- (i) అది పరిహార రూపంలో కొంత భాగమే అయినప్పుడు మిగతా దానికోసం కక్షిదారుడు దావా వేయవచ్చు - విభాగం 14.

(ii) అధిక భాగం పరిహారం రూపంలో పొందినప్పుడు మిగతాదానికోసం దావా వేయవచ్చు. అది ఎప్పుడంటే అతడు మొత్తం హక్కును వదులుకోటానికి సిద్ధపడినప్పుడు.

(B) ఒక భాగాన్ని అమలుపరచలేనప్పుడు పరిహారాన్ని అంగీకరించటం సాధ్యంకాదు. అప్పుడు వాగ్దానం పొందిన వ్యక్తి దాని ప్రత్యేక అమలు కోసం దావా వేయవచ్చు.

అప్పుడు వాగ్దానం పొందిన వ్యక్తి మిగిలిన హక్కులకు, నష్టపరిహారానికీ ఉన్న అన్ని హక్కుళనూ వదులుకొని పక్షంలో, ప్రత్యేక చర్య కోసం దావా వేయవచ్చు - సెక్షన్ 15.

ఉదాహరణ

A ఒక ఇల్లు, తోటతో ఉన్న ఆస్తిని లక్షరూపాయలకు అమ్ముతానని Bతో ఒప్పందం చేసుకొంటాడు. ఇల్లును అనుభవించటానికి తోట ఒక ముఖ్యాంశం. అయితే A తోటను ఇవ్వలేని పరిస్థితి ఏర్పడుతుంది.

B ఒప్పందంలోని అంశాన్ని అమలుచేయటం కోసం దావా వేయవచ్చా? - అవును. B ఒప్పందం ప్రకారం మొత్తం పైకాన్ని చెల్లించటానికి ఇష్టపడి, తోట కాకుండా ఇల్లు తీసుకోటానికి సిద్ధపడినప్పుడు, ఇతర హక్కులను వదులుకోటానికి ఇష్టపడినప్పుడు ఇది సాధ్యమవుతుంది. దీనివల్ల అతడు A కల్పించిన నష్టాన్ని భరించటానికి సిద్ధపడాలి.

ఇక్కడ ఈ నియమానికి నాలుగు మినహాయింపులు ఉన్నాయి.

1. భాగాలు విభజించటానికి వీలుంటే - ప్రత్యేక చర్య ఒక భాగం అమలుకు సాధ్యమవుతుంది.

2. ఎక్కడ భాగాలను విడదీయటానికి సాధ్యమవుతుందో అక్కడ అమలుకాని భాగానికి పరిహారం కోరవచ్చు. దానికిగాను దావా వేయవచ్చు - విభాగం 14

3. ఎక్కడ భాగాలను విడదీయడం సాధ్యంకాదో ఏ భాగం అమల్లోకి రాదో దాని ప్రభావం ఇతర భాగాలపై ఎక్కువగా ఉంటే అందుకోసం పరిహారం కోరవచ్చు. దానికోసం వాగ్దానం పొందిన వ్యక్తి మిగతా చర్యలకు, హక్కులకు తన హక్కును వదులుకొంటే, దావా వేయవచ్చు - విభాగం 15.

4. ఎక్కడ భాగాలను విడదీయడం సాధ్యంకాదో, అమల్లోకి రాలేని భాగం కోసం పరిహారాన్ని కోరటం సాధ్యం కాదో దాని అమలుకోసం విభాగం 15 సూచించిన పద్ధతిలో దావా ద్వారా కోరవచ్చు.

## ఒప్పందం నిర్దిష్ట అమలు

అమ్మందారుడు లేదా లీజ్‌కు తీసుకొన్న వ్యక్తికి ఉన్న పట్టా సక్రమంగా లేనప్పుడు

## అసంపూర్ణ పట్టా

1. దానికి సంబంధించిన నియమం విభాగం 18లో ఉంది. ఈ విభాగం నాలుగు క్లాజ్‌లను పేర్కొంది.

(i) ఒప్పందం అనంతరం అమ్మకందారుడు సరైన పట్టాను పొందినప్పుడు.

(ii) ఎక్కడ రెండో వ్యక్తి సమ్మతి పొందవలసిన అవసరం ఉంటే

(iii) ఎక్కడ చిక్కుకుపోయిన ఆస్తిని అది ఎటువంటి చిక్కులు లేనటువంటిదిగా అమ్మినప్పుడు

(iv) ఎక్కడ ధరావతు చెల్లింపు జరిగి దాని అమలుకోసం వేసిన దావాను తిరస్కరించినప్పుడు,

## క్లాజ్ (ఎ)

ఈ క్లాజ్ ప్రకారం ఒక వ్యక్తి తాను అమలుచేయలేని అంశంపై ఒప్పందం కుదుర్చుకుని, తర్వాత కాలంలో దాని అమలుకు అధికారాన్ని సంపాదించుకొన్నప్పుడు, అతడు దానిని తప్పకుండా అమలు చెయ్యాలి.

### ఉదాహరణ

వారసత్వంపొందబోతున్న వ్యక్తి తనకుచెందబోయే ఆస్తి అమ్మకానికి ఒప్పందం కుదుర్చుకొంటాడు. అతను సదరు ఆస్తిని పొందిన అనంతరం ఒప్పందం ప్రకారం దానికి అమ్మవలసి ఉంటుంది. అమ్మకందారుడు తర్వాత కాలంలో ఎటువంటి ప్రయోజనం ఆస్తి నుంచి పొందగలిగినప్పటికీ అతడు దానిని తప్పనిసరిగా ఒప్పందం ప్రకారం అమ్మవలసి ఉంటుంది.

## క్లాజ్ (బి)

ఎక్కడ ఒక ఒప్పందం అమలుకు కొత్త వ్యక్తి సమ్మతి అవసరం ఉంటుందో ఎక్కడ అతడి సమ్మతిని అమ్మకందారుడు తప్పనిసరిగా పొందవలసి ఉంటుంది.

## క్లాజ్ (సి)

ఎక్కడ అమ్మిన ఆస్తి పరిమితులతో కూడి ఉంటుందో, దానిని ఎటువంటి పరిమితి లేనిది అని అమ్మినప్పుడు అమ్మిన వ్యక్తి సదరు ఆస్తిపై ఉన్న పరిమితులన్నింటినీ తొలగించటానికి చర్యలు తీసుకోవాలి. తనఖా మొదలైన వాటి నుంచి దానిని విముక్తి చెయ్యాలి.

## క్లాజ్ (డి)

కొనుగోలుదారుడు వాదిగా ఉన్న దావాలను ఎ, బి, సి క్లాజుల్లో చెప్పటం జరిగింది. అతడు తన పట్టాను సక్రమం చేసుకోటానికి చర్యకు పూనుకొంటాడు.

అటువంటి సందర్భాల్లో దావాను న్యాయస్థానం ఖర్చులతో సహా కొట్టివేయలేకపోగా కొనుగోలుదారుడికి ఉపశాంతినిస్తుంది. అతని ధరావతును వడ్డీతో సహా అతడికి చెల్లించే ఏర్పాటు చేస్తుంది. ఆస్తి కొనుగోలుపై అతడు చేసిన వ్యయాన్ని కూడా అతడికి ఇప్పిస్తుంది.

## ధరావతుకు సంబంధించిన సాధారణ నియమం

ఒప్పందం అమలుకు హామీగా ధరావతును చెల్లిస్తారు. కొనుగోలుదారుని తప్పువల్ల ఒప్పందం అమల్లోకి రాకపోతే ధరావతు మొత్తం అమ్మకందారుడు తీసుకొంటాడు.

## నిర్దిష్ట అమలుకే ఒప్పందం కక్షిదారులకు దావా వేసే హక్కులు

నాలుగు రకాల దావాలను పరిశీలించాలి:-

**(i)** ఎవరికోసం ఒప్పందాలను ప్రత్యేకంగా అమలుపరచవలసి ఉంటుందో

**(ii)** ఎవరికోసం ఒప్పందాలను ప్రత్యేకంగా అమలుపరచటం సాధ్యంకాదో

**(iii)** ఎవరికి వ్యతిరేకంగా ఒప్పందాలను ప్రత్యేకంగా అమలుపరచాలో

**(iv)** ఎవరికి వ్యతిరేకంగా ఒప్పందాలను ప్రత్యేకంగా అమలుపరచటం సాధ్యంకాదో

## I. ఎవరికోసం ఒప్పందాలను ప్రత్యేకంగా అమలుపరచాలో

సెక్షన్ 23 ఎవరు ఒప్పందం అమలుకోసం ఉత్తరవు సంపాదిస్తారో విభాగం పేర్కొంది.

క్లాజ్ **(a)** ఏ పక్షమైనా

క్లాజ్ **(b) (i)** వాగ్దానం అమలుపరచవలసిన ఒక వ్యక్తి

**(ii)** వాగ్దానం చేసిన వ్యక్తి మరణానంతరం అతని చట్టపరమైన ప్రతినిధి.

**(iii)** వాగ్దానం చేసిన వ్యక్తి తరపున పైన ప్రస్తావించిన ప్రతి వ్యక్తి ఒప్పందం అమలుకు దావా వేయవచ్చు. అయితే సదరు ఒప్పందంలో వ్యక్తిగత ఆసక్తి ఉండరాదు. అలాగే వాగ్దానం తీసుకున్న వ్యక్తి ఆసక్తిని పరిమితం చేయరాదు.

**(c)** వివాహం ఒడంబడిక ద్వారా లాభం పొందే వ్యక్తులు లేదా ఒక కుటుంబ సభ్యుల మధ్య అనుమానాస్పదమైన పట్టాల విషయంలో రాజీ.

(d) కౌలుదారుడు జీవితకాలానికి చేసిన ఒప్పందంలో మిగిలిన వ్యక్తి

(e) స్వాధీనత పొందిన వ్యక్తి మార్పిడి

(f) మిగిలిన వ్యక్తి మార్పిడి

(g) మిశ్రమం ఫలితంగా ఉద్భవించిన నూతన సంస్థ

(h) ప్రాయోజకులు ఒప్పందం ద్వారా ఏర్పాటుచేసిన సంస్థ

## మార్పుచేయటం ద్వారానే ఒప్పందాలను అమలుపరచే సందర్భాలు – సెక్షన్ 76

(1) తప్పిదం లేదా మోసం ద్వారా ఒడంబడికలో మార్పులు ఏర్పడినప్పుడు వాది తాను ప్రారంభంలో ఉన్నానని భావించిన పద్ధతిలో ఒప్పందంలో ఏర్పడిన మార్పులు.

(2) వాది ప్రతివాదుల మధ్య అమలు అవుతుందో లేదో అనే అనుమానంతో కుదుర్చుకొన్న ఒప్పందం.

(3) వాది తప్పుడు పని చేస్తాడన్న అనుమానంతో అతనికీ ప్రతివాదికీ మధ్య అనుమానంతో ఏర్పాటు చేసుకొనే ఒప్పందం

(4) ఫలితాన్ని చూపించవలసిన లక్ష్యంతో ఎటూ ఫలితము లేని ఒప్పందం ఏర్పాటు.

(5) కక్షిదారులు ఒప్పందంలో మార్పు తేవటానికి అంగీకరించినప్పుడు.

### వ్యాఖ్యానం

### సాక్ష్య చట్టంలోని 91, 92 సెక్షన్లు :

మార్పును సూచించే మౌఖిక సాక్ష్యం వాది ఇవ్వలేదు. అయితే మోసం వల్ల తప్పుడుగా చెప్పటం వల్ల ఒప్పందంలో అన్ని విషయాలను ప్రస్తావించరాదని వాదించటాన్ని అది నిరోధించలేదు. విభాగం 92, ఒకటవ నిబంధన క్రింద ఒప్పందంలో మార్పులు వచ్చాయని వాది సాక్ష్యం ఇవ్వవచ్చు.

అటువంటి సందర్భంలో మార్పును చూపితే సాక్ష్యం ఇవ్వకుండా వాది డిక్రీని పొందలేడు. అప్పుడు వాదికి రెండు ప్రత్యామ్నాయాలు ఉంటాయి. (i) ప్రత్యేక చర్యను రద్దుచేయమని కోరవచ్చు లేదా (ii) మార్పును చేసే చర్యను కోరవచ్చు. అతడు మార్పును కోరనట్లైతే నష్టాన్ని భర్తీచేసుకొనే హక్కును కోల్పోడు.

## II. ఏ వ్యక్తులకు అనుకూలంగా ఒప్పందం అమలు చేయటం సాధ్యంకాదో సెక్షన్లు 24, 25 ప్రస్తావించాయి.

### సెక్షన్ 24

(i) ఒప్పందం భగ్నతకు ఎవరైతే పరిహారాన్ని పొందలేరో

(ii) ఒప్పందంలోని ముఖ్యాంశాలను అమలుచేయటంలో విఫలం అయితే, అది భగ్నమైతే ఎవరు సరిచేయలేరో

(iii) ఆరోపించిన భగ్నతకు ప్రత్యామ్నాయంగా పరిహారం పొందిన వ్యక్తులు

(iv) ఎవరైతే, ఒప్పందం ప్రకారం సెటిల్‌మెంట్ జరిగిందనీ అది అమల్లో ఉందనీ ముందుగానే నోటీస్ లభ్యమవుతుందో.

ఈ సెక్షన్‌కూ 23వ సెక్షన్‌కూ వ్యత్యాసం ఎందుకు ఉందంటే అది ఒప్పందం చెప్పలేదని సమర్థించుకోవటంలో కాకుండా వాది చర్యలు, నడతపై ఆధారపడి ఉండటం వల్ల.

24 సెక్షన్ ఒక సాధారణ విభాగం. 25వ విభాగం ప్రత్యేకంగా ఒక అంశానికి సంబంధించినది. అది రెండు రకాల ఒప్పందాల అమలుకు సంబంధించినది. అవి-

(1) అమ్మకానికి జరిగే ఒప్పందం

(2) స్థిర, చరాస్తులను అద్దెకు ఇచ్చే ఒప్పందం

ఈ క్రింద ప్రస్తావించినకేసులో అటువంటి ఒప్పందం ప్రత్యేకంగా అమ్మకందారునికి అనుకూలంగా అమలుపరచలేమని విభాగం 25 ప్రస్తావిస్తున్నది:-

(i) ఆస్తికి ఎటువంటి పట్టాలేదని తెలిపేదానిని అమ్మటానికో లేదా అద్దెకు ఇవ్వటానికో ఒప్పందం చేసుకొన్నప్పుడు;

(ii) న్యాయస్థానం లేదా పార్టీలు ఒక తేదీని నిర్ణయించినప్పుడు ఆస్తికి ఎటువంటి అవరోధాలు లేవని పట్టా ఇవ్వలేనప్పుడు;

(iii) ఒప్పందం చేసుకోటానికి ముందు, ఎవరైతే ఒప్పందంలోని అంశాల విషయంలో సెటిల్‌మెంట్ చేసుకొంటే.

సెటిల్‌మెంట్ అంటే విభాగం 3 ప్రకారం ఒక పత్రం ద్వారా ఆస్తి పంపిణీని నిర్ణయించుకోవటం. స్థిర, చరాస్తుల విషయంలో వాటిని పంచటమో, విక్రయించటమో వరుసగా ఆస్తుల ప్రకారం జరిగినప్పుడు.

**III కొందరి వ్యక్తులకు వ్యతిరేకంగా ఒప్పందాన్ని అమలు చేసినప్పుడు-**

సెక్షన్-27

(i) ఏ పక్షమైనా

(ii) ఏ వ్యక్తి/పక్షమైన ఒప్పందం జరిగిన తర్వాత ఆస్తిని పట్టా/హక్కు ఉన్నట్లు అభ్యర్థిస్తే (బదిలీదారుడు ఎటువంటి నోటీస్ లేకుండా కోరిన సందర్భం మినహాయిస్తే)

(iii) ఏ వ్యక్తి అయినా ఒప్పందం చెల్లకపోవటానికి ముందు తనకు హక్కుందని వాదించినప్పుడు, అతడు వాదికి తెలిసిన వ్యక్తి అయి ఉన్నప్పుడు అతడిని వాది తొలగించినప్పుడు;

(iv) సమ్మేళనం ద్వారా ఒక నూతన సంస్థ ఏర్పడినప్పుడు;

(v) ప్రయోజితదారులు ఒప్పందం సంస్థాపరంగా చేసుకొన్నప్పుడు;

**IV ఎవరికి వ్యతిరేకంగా ఒప్పందం అమలు జరగటం అసాధ్యం-**

**సెక్షన్-28**

(i) మోసాన్ని రుజువు చేయటానికి సాక్ష్యం అసమగ్రంగా ఉంటే,

(ii) తప్పుడు సమాచారం ఇచ్చి అనుమతిని పొందిన సందర్భాల్లో, అక్రమ పద్ధతి లేదా ఇతర వాగ్దానం అమలు జరగనప్పుడు;

(iii) తప్పుడు సమాచారం వల్ల అనుమతిని ఇవ్వడం వల్ల లేదా సందేహం.

## నిర్దిష్ట అమలు – న్యాయస్థానం విచక్షణ నిర్ణయం

నిర్దిష్ట పరిహారం మంజూరు చేసేటప్పుడు గమనించవలసిన ముఖ్యాంశం ఏమిటంటే- ఏ సందర్భంలో నిర్దిష్ట పరిహారం కల్పించవలసి ఉంటుంది? ఏ సందర్భాల్లో నిర్దిష్ట పరిహారం లేదా ఉపశాంతిని న్యాయస్థానం ఇవ్వరాదని చట్టం చెబుతుందో అవి మూడు రకాలు.

(i) చట్టం నిర్దిష్టంగా అమలు చేయడానికి వీల్లేని స్వభావం ఒప్పందంలో ఉంటే.

(ii) ఎక్కడ వాదికి అనుకూలంగా ఒప్పందాన్ని అమలుపరచడం సాధ్యంకాదో.

(iii) ఎక్కడ ప్రతివాదికి వ్యతిరేకంగా ఒప్పందాన్ని అమలు చేయటం కుదరదో.

ఇహ ఒప్పందం అమలుపరచటానికి మూడు సందర్భాలు మిగిలి ఉన్నాయి:-

(i) ఎక్కడ ఒప్పందం అటువంటిదో (మిగతా పుటలు లభ్యం కాలేదు. సం.)

**పార్టీల బాధ్యతలు**

| అమ్మకపుదారుడు | | కొనుగోలుదారుడు | |
|---|---|---|---|
| అమ్మకానికి ముందు | అమ్మకం తర్వాత | కొనుగోలు ముందు | కొనుగోలు తర్వాత |
| 1. సెక్షన్ 55 (1)(a) తీవ్ర లోపాలను తెలియపరచాలి. | 1. సెక్షన్ 55 (1)(b) ఆస్తి అధీనం చెయ్యాలి. | 1. సెక్షన్ 55 (5)(a) ఆస్తి విలువను పెంచే అంశాలను తెలియ పరచాలి. | 1. సెక్షన్ 55 (5)(c) ఆస్తికి జరిగే నష్టాన్ని భరించాలి. |
| 2. సెక్షన్ 55 (1)(b) పట్టాలను చూపాలి. | 2. సెక్షన్ 55 (2) పట్టా ఇచ్చేందుకు ఒప్పందం ఉన్నట్టే. | 2. సెక్షన్ 55 (5)(b) ధరను చెల్లించాలి. | 2. సెక్షన్ 55 (5)(d) ఇతర చెల్లింపులను భరించాలి. |
| 3. సెక్షన్ 55 (1)(c) పట్టాకు సంబంధించిన సందేహాలకు సమాధానం చెప్పాలి. | 3. సెక్షన్ 55 (3) సొమ్మును తీసుకున్న అనంతరం ఆస్తి పట్టాను అందజెయ్యాలి. | | |
| 4. సెక్షన్ 55 (1)(d) బదిలీని అమలుజరపాలి. | | | |
| 5. సెక్షన్ 55 (1)(e) ఆస్తిని భద్రపరచాలి. | | | |
| 6. సెక్షన్ 55 (1)(f) వ్యవహార ఖర్చులు భరించాలి. | | | |

**పార్టీల హక్కులు**

| అమ్మకందారుని | | కొనుగోలుదారుని | |
|---|---|---|---|
| అమ్మకానికి ముందు | అమ్మకం తర్వాత | కొనటానికి ముందు | కొన్న తర్వాత |
| సెక్షన్ 55(4) (a) లాభాలను, అద్దెలను వసూలు చేసుకోవటం | సెక్షన్ 55(4) (b) అమ్మకం ధర చెల్లించక పోతే ఛార్జ్ కలిగి ఉండడం | సెక్షన్ 55(4) (b) ఇదివరకే చెల్లించిన ధర మేరకు ఛార్జ్ కలిగి ఉండడం | సెక్షన్ 55(4) (a) ఆస్తిలో విలువ పెరిగితే ఆ లాభాలను అనుభవించడం |

Uberrina fides = (అమిత విశ్వాసం)

ఒక ప్రత్యేక సంబంధంగా ఒప్పందం చేసుకునే కక్షిదారులు ఒకరిపై మరొకరికి అత్యంత విశ్వాసం కలిగి వుండాలి. ఈ విధంగా

(i) సంరక్షకుడు - శిశువు

(ii) వకీలు - కక్షిదారుడు

(iii) వైద్యుడు - రోగి

(iv) తప్పు ఒప్పుకున్న వ్యక్తి - వాటిని తెలుసుకున్న వ్యక్తి

పూర్తిగా తెలియపరచటం అవసరం.

## పార్టీల బాధ్యతలు

## A. అమ్మకందారుని బాధ్యతలు

### 1. అమ్మకానికి ముందు

(1) సెక్షన్ 55 (1) (A) - భౌతిక లోపాను తెలియపరచటం.

(1) భూమి అమ్మకానికి సంబంధించిన ఒప్పందం విశ్వాసపూరితమైంది కాదు. దానికి సంబంధించిన వివరాలు తెలియజేయటం తప్పనిసరి కాదు. అయితే దానికి సంబంధించిన కనిపించే అన్ని లోపాలనూ తెలియపరచటం బాధ్యత.

(2) కనిపించే లోపం ఎటువంటిదంటే దానిని కొనుగోలుదారుడు తన అజాగ్రతతవల్ల స్వయంగా తెలుసుకోలేడు. కొనుగోలుదారుడు వాస్తవంగా తెలుసుకోవలసిన లోపాలను అతనికి తెలియపరచవలసిన బాధ్యత లేదు.

(3) అయితే అసలైన లోపాలు కొనుగోలుదారుడికి తెలియనప్పుడు వాటిని తెలియపరచాలి. (Cavevat emptor) కానీ ఇద్దరు ఒక ఆవశ్యకమైన వాస్తవం విషయంలో పొరపాటు పడితే సదరు ఒప్పందం చెల్లదు.

(4) కనిపించే లోపం ఆస్తికి లేదా పట్టాకు సంబంధించినది తీవ్రమైనది అయి ఉండాలి. తీవ్రమయిన లోపం అంటే, దానిని గురించి కొనుగోలుదారుడికి ముందుగా తెలిసి ఉన్నట్లైతే అతడు సదరు ఆస్తిని కొనుగోలు చేయటానికి ఒప్పందం చేసుకోడు. ఎందుకంటే అతను కొనుగోలు చేయబోయే దానికంటే వేరేది అతడికి లభిస్తుంది కాబట్టి.

(5) ఒక లోపం తీవ్రమైందా కాదా అనేది ఆయా లావాదేవీ పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. నిర్మాణం కోసం భూమి అమ్మకం జరిగినప్పుడు భూగర్భ కాలువ ఉంటే తీవ్రమయిన లోపంగా పరిగణిస్తారు; అలాకాకుండా ఇంటి కోసం లేదా నివాసం కోసం భూమిని అమ్మితే పై వాస్తవం లోపంగా భావించబడదు.

**(6) లోపాలు ఆస్తిలో లేదా పట్టాలో ఉండవచ్చు.**

## 2. సెక్షన్ 55 (1) (బి) - పట్టాను చూపించడం

(1) పరిశీలనకు (ఇవ్వటానికి కాదు) పట్టాను చూపించాలి.

(2) పరిశీలనకు చూపించ వలసినవి అమ్మకందారుని అధీనంలో ఉన్నవే కాకుండా అతని అధీనంలో లేని పత్రాలు కూడా పరిగణనలోకి వస్తాయి.

(3) కొనుగోలుదారుడు అభ్యర్థిస్తే తప్ప పట్టా పత్రాలను చూపించనవసరం లేదు.

(4) కొనుగోలుదారుడు వాటిని పరిశీలించకుండా ఉండరాదు. ఎందుకంటే పట్టాను అతడు పరిశీలించినట్లే పరిగణించబడుతుంది.

## 3. సెక్షన్ 55 (1) - అమ్మకందారుడు అన్ని ప్రశ్నలకు సమాధానం చెప్పాలి.

(1) అమ్మకందారుడు సమర్పించిన పట్టా పత్రాలను కొనుగోలుదారుడు పరిశీలిస్తాడు. అతడు సంతృప్తి చెందకపోతే ఈ క్రింది ప్రశ్నలు వేస్తాడు-

(i) పట్టాకు సంబంధించిన వివరాలు

(ii) ఆస్తి బదిలీకి సంబంధించినవి

(iii) ఇతర వివరాలు

(2) పత్రాలు అంగీకరించిన పట్టాను చూపించనప్పుడు పట్టాకు సంబంధించిన అభ్యంతరాలు- అంటే పట్టా సక్రమంగా లేదని చెప్పేవి.

(3) ఆస్తి బదలాయింపుకు సంబంధించిన వివరాలు దాని సహ యజమానులు అంగీకారం, మొదలైనవి.

(4) కొనుగోలుదారుని భద్రతకు సంబంధించిన ఆచూకీలు, అమ్మకందారుడు చెప్పకుండా దాచిపెట్టేవి, భీమా, తదితర వివరాలు.

(5) పట్టాకు సంబంధించిన, ఇతర ప్రత్యేక వివరాలను అమ్మకందారుడు తప్పనిసరిగా అడిగినప్పుడు ఇవ్వాలి.

(6) అడిగిన వివరాలను ఇవ్వటం, తెలియపరచవలసిన లోపాల కంటే భిన్నమైంది. సెక్షన్ 55 (1) (a) ప్రకారం అడగనంత మాత్రాన లోపం చెప్పకపోవటం అమ్మకందారుడు తన బాధ్యతను విస్మరించినట్లే.

(7) కొనుగోలుదారుడు కొన్ని వివరాలను పట్టించుకోకపోవచ్చు అవి తెలిసికొన్నట్లుగానే భావించవచ్చు.

(8) ప్రవర్తన ద్వారా త్రోసిపుచ్చటం సూచితమవుతుంది.

(i) తాను అడిగిన వివరం గురించి కొనుగోలుదారుడు ఒత్తిడి చేయనప్పుడు

(ii) ధర చెల్లించటానికి కొనుగోలుదారుడు కొంత గడువును కోరినప్పుడు

(iii) కొనుగోలుదారుడు ఆస్తిని స్వాధీనం చేసుకున్నప్పుడు

(iv) కొనుగోలుదారుడు మొత్తం పైకాన్ని లేదా ధరలో కొంత భాగాన్ని చెల్లించినప్పుడు.

## 4. సెక్షన్ 55 (1) (D) - ఆస్తి బదిలీ అమలు

(1) అమలు చేయటం కొనుగోలుదారునికి లేదా అతడు సూచించిన వ్యక్తులపరంగా ఉండవచ్చు. పర్యవసానంగా, కొనుగోలుదారుడు అమలుకుముందే తిరిగి దానిని అమ్మినప్పుడు అమలు ఉప కొనుగోలుదారునికి ప్రత్యక్షంగా చేయవచ్చు. ధరలో వ్యత్యాసం ఉంటే (ఇతరత్రా కాకుండా) బదలాయింపు అమ్మకందారుడు మొదటి కొనుగోలుదారుని పార్టీగా కోరవచ్చు.

(2) అమ్మకందారునికి కొనుగోలుదారుడు సరైన పత్రాన్ని ఇవ్వటం అతని బాధ్యత- **31 Cal. L.J. 87**

(3) ఒప్పందానికి వ్యతిరేకంగా ఉంటే ఇది కొనుగోలుదారుని బాధ్యత.

(4) బదలాయింపు ధరచెల్లింపు పరస్పరం ఏకకాలంలో జరగాలి. అవి సమానాంతర ఏకకాలంలో అమలుకావలసిన వాగ్దానాలు. వీరిలో ఎవరైనా చర్య కోసం దావావేస్తే కక్షిదారుడు తాను తీసుకోవలసిన చర్యకు సిద్ధంగా ఉండాలి.

5. అమలుకు సరైన సమయం.

(i) సెక్షన్ సమయం గురించి చెప్పటం లేదు.

(ii) అమ్మకం ఒప్పందం సాధారణంగా సమయాన్ని నిర్ణయిస్తుంది.

(iii) సమయాన్ని నిర్ణయించినప్పుడు, నిర్హేతుకమైన కాలయాపన జరిగినప్పుడు, సరైన చర్య ఏమిటంటే సదరు అమలుకు నోటీసును ఇవ్వటం ( అది ఒప్పందంలో ముఖ్యాంశం కాబట్టి)

(iv) సమయాన్ని ప్రస్తావించినప్పుడు, అమ్మకందారుడు తన పట్టాను చూపించిన తేదీయే సరైన సమయం.

(6) అమలుకు సరైన్క స్థలం

(i) దీని విషయం గురించి ఈ భాగం ఏమీ చెప్పటం లేదు.

(ii) కొనుగోలుదారుడు అమ్మకందారునికి పత్రం ఇవ్వవలసి ఉంటుంది కాబట్టి, అమ్మకందారుని ఇల్లే ఒడంబడికను అమలు చేయటానికి అనువైన ప్రదేశం. లేదా అతని న్యాయవాది కార్యాలయం.

(7) బదిలీ వ్యయం

(i) దీని గురించి ఈ విభాగం ఏమీ చెప్పటం లేదు.

(ii) దీనిని సాధారణంగా ఒప్పందం షరతులను బట్టి నిర్ణయించటం జరుగుతుంది.

(iii) ఎటువంటి నిర్దిష్ట మార్గదర్శకత్వం లేకపోవటం వల్ల, కొనుగోలుదారు స్టాంప్ ఖర్చును భరించాలి - సెక్షన్ 29 (c), ఇండియన్ స్టాంప్ ఆక్ట్.

## 5. సెక్షన్ 55 (1) (E) - ఆస్తి సంరక్షత

(1) అమ్మకం ఒప్పందం కొనుగోలుదరునికి ఆస్తిపై ఎటువంటి ఆసక్తినీ కల్పించదు. అయితే అమ్మకందారునికి ఆస్తిని భద్రతపరచవలసిన బాధ్యతను కల్పిస్తుంది.

(2) అమ్మకందారుడు టైటిల్ పట్టాను కూడా భద్రపరచాలి. పట్టాపోయినట్లైతే ఆస్తి విలువను తరిగిస్తుంది; దానివల్ల ఆస్తికి నష్టం ఏర్పడుతుంది.

(3) జాగ్రత్త తీసుకోవటం అంటే విజ్ఞత గల యజమాని తీసుకోవలసిన జాగ్రత్తలన్నింటినీ తీసుకోవటం ఆస్తిని భద్రపరచటం, చొరబాటుదారుల నుంచి సంరక్షించటం, అవసరమైన మరమ్మత్తులను చేయటం.

(4) ఆస్తి భద్రత ఒప్పందంలో ఒక భాగం. అది దాని అమలుతో కలిసిపోయి ఉండదు. అమ్మకం పూర్తి అయిన తర్వాత కూడా ఈ బాధ్యత కొనసాగుతుంది. అమ్మకందారుడికి కలిగిన ఆస్తి నష్టానికి కొనుగోలుదారుడు బాధ్యత వహించడు. అమ్మకందారుడు తన కర్తవ్య నిర్వహణలో విఫలం అయితే కొనుగోలుదారుడు పరిహారాన్ని కోరవచ్చు. దానిని అతడు చెల్లించవలసిన మొత్తం నుంచి మినహాయిస్తాడు.

## 6. సెక్షన్ 55 (1) (G) - వ్యవహారాల ఖర్చు.

(1) వ్యవహారాల నిర్వహణకు ఇంగ్లీష్ చట్టం ప్రకారం కొనుగోలుదారుడే, అయ్యే ఖర్చును, భరించాలి ఇండియాలో అవి:-

(i) పబ్లిక్ ఖర్చులు

(ii) అద్దె

(iii) వడ్డీ

(iv) రుణాలకు సంబంధించిన ధ్రువీకరణ (Incumberances)

(i) పబ్లిక్ ఛార్జెస్

(i) ప్రభుత్వ ఆదాయం

(ii) మునిసిపల్ పన్నులు

(iii) చట్టం విధించిన భూమి పన్ను, దానిని నిర్బంధంగా వసూలు చేయడం లేదా ఇతర ప్రక్రియ.

(a) అమ్మే ఆస్తిని అద్దెకు ఇంతకుముందే ఇచ్చి ఉన్నట్లైతే 'అద్దె' వసూలు ప్రశ్న ఉదయిస్తుంది. అమ్మకం నాటి వరకు అమ్మకందారుడు అద్దె మొత్తాన్ని చెల్లించవలసి ఉంటుంది.

(iii) వడ్డీ

## (5) రుణాలకు సంబంధించిన ధ్రువీకరణ-

(i) ఆస్తికి జతపడిన అప్పు, లేదా హక్కును ఎన్‌కంబరెన్స్ అంటారు.

(ii) అమ్మకందారుడు ఆస్తికి సంబంధించిన అన్ని రుణాలను చెల్లించాలి; ఇతరహక్కులన్నింటినీ తొలగించాలి. ఇది అతని బాధ్యత. ఇవి అన్నీ కొనుగోలుదారునికి తెలుసో తెలియదో అనేది అనవసరం.

(iii) కొనుగోలు చేసే ఆస్తితో పాటు ఇతర ఆస్తులకు కూడా రుణాలు సమానంగా ఉంటే అమ్మకందారుడు అమ్మే ఆస్తి తాలూకా అప్పులను మిగతా ఆస్తుల నుంచి విడగొట్టి వాటిని తీర్చాలని కొనుగోలుదారుడు పట్టుపట్టవచ్చు.

(6) ఈ బాధ్యత అమ్మకందారునికి ఒప్పందం వల్ల ఏర్పడుతుంది. ఆస్తి అమ్మకం అనంతరం కూడా సదరు బాధ్యత కొనసాగుతుంది.

## అమ్మకందారుని అప్పులు- పరిమితులు

### II అమ్మకం జరిగిన తర్వాత

1. అమ్మకం జరిగిన తర్వాత అమ్మకందారుడు ఆస్తిని కొనుగోలుదారుని స్వాధీనం చెయ్యాలి. ఇది అతని బాధ్యత. కొనుగోలుదారుడే స్వాధీనపరచుకొంటాడని అతనికి వదిలివేయరాదు.

2. ఈ బాధ్యతను దావా ద్వారా అమలుపరచవచ్చు.

3. స్వాధీనం చేయటానికి సమయం-

(i) ఎప్పుడు అమ్మకందారుడు స్వాధీనం చెయ్యాలో ఈ సెక్షన్ చెప్పటం లేదు.

(ii) సెక్షన్ 55 (4) (a) దీనిని గురించి ప్రస్తావించింది. దీని ప్రకారం అమ్మకపు పత్రం ఖరారు అయిన వెంటనే అమ్మకందారుడు కొనుగోలుదారునికి స్వాధీనం చెయ్యాలని చెబుతున్నది - 6 Lah. 308

(iii) దానికి నిర్దిష్టంగా ఉంటే తప్ప అంటే కొనుగోలుదారుడు పూర్తి ధరను చెల్లించలేదన్న కారణంతో అమ్మకందారుడు ఆస్తి స్వాధీనతను నిరాకరించకూడదు.

(iv) అమ్మకందారునికి చెల్లించవలసిన మిగతా మొత్తం కొనుగోలుదారునికి ఆస్తి స్వాధీనత- ఈ రెండూ ఒకదాని ద్వారా అమలుపరచవచ్చు.

4) స్వాధీనత స్వభావం-

(i) స్వాధీనత అంటే వాస్తవ ఆక్రమణ కాదు.

(ii) కనిపించే ఆస్తిని భౌతికంగా స్వాధీనం చేసుకోవటం కనిపించని ఆస్తిని ప్రతీకగా స్వాధీనం చేసుకోవటం సరిపోతుంది.

(iii) అద్దెదారులున్నప్పుడు, లేదా ఆస్తి తాకట్టులో ఉంటే ప్రత్యేక స్వాధీనత సరిపోతుంది.

## 2. సెక్షన్ 55 (2) - ఆసక్తి కొనసాగుతుందని హామీ ఇవ్వటం

1. అమ్మకందారుని బాధ్యత స్వాధీనం చేసిన తర్వాతనా దానికి ముందా అనే విషయం గురించి రెండు అభిప్రాయాలున్నాయి.

(i) కలకత్తా అభిప్రాయం - ఇంగ్లీష్ పద్ధతి ప్రకారం ఈ నిబంధన ఒప్పందం పూర్తిగా అమలు జరిగేంతవరకూ వర్తిస్తుంది.

(ii) మద్రాస్ అభిప్రాయం - ఒప్పందం దశను దాటి ముందుకు పోని వివాదాలను ఈ క్లాజ్ పరిగణనలోకి తీసుకుంది.

(iii) లాహోర్ అభిప్రాయం - మద్రాస్ అభిప్రాయాన్ని అనుసరించింది.

(iv) బొంబాయి అభిప్రాయం - స్వాధీనం అనంతరం బాధ్యతను ఈ క్లాజ్ సూచిస్తున్నది.

**(a)** 55 సెక్షన్ (1) ప్రకారం కొనుగోలుదారుడు కొనుగోలు పూర్తి కావటానికి ముందు ఆస్తికి సంబంధించిన అన్ని వివరాలు తెలుసుకుని సదరు ఆస్తి ఎటువంటి పరిమితులు (అప్పులు) లేకుండా ఉందో లేదో తెలుసుకోవాలి. ఒకసారి కొన్న తర్వాత, అతడు మోసం కారణంగా మినహాయిస్తే ఒప్పందాన్ని తిరగ్గొట్టుకోడు.

(b) ఆస్తి బదిలీ అయిన తర్వాత ఏదైనా లోపం ఉన్నట్లైతే కొనుగోలుదారుడు పరిహారం పొందటానికి సెక్షన్ 55 (2) అవకాశం కల్పిస్తున్నది.

(v) మరొక అభిప్రాయం బహుశా సరైనది.

(a) పట్టా విషయంలో అమ్మకందారుని బాధ్యత రెండు రకాలు -

(i) ఎటువంటి అనుమానాలు లేకుండా ఉన్న పట్టాను అమ్మకందారుడు కొనుగోలుదారునికి ఇవ్వాలి.

(ii) ఏది పట్టా అని చెబుతాడో దానినే అతడు కొనుగోలుదారునికి అందజెయ్యాలి. అది సక్రమంగా ఉండేటట్లు చూడాలి.

మొదటి దాని క్రింద గుర్తింపు పొందిన పద్ధతి ప్రకారం తాను పట్టాను పొందినట్లు అతడు రుజువు చెయ్యాలి- వారసత్వం, కొనుగోలు, వగైరా.

రెండవ దాని క్రింద అతడు పూర్తి యాజమాన్య ప్రయోజనాన్ని, బదిలీ చెయ్యాలనుకున్నప్పుడు, అది పూర్తి యాజమాన్య ఆస్తి బదిలీగా ఉండాలే కానీ కేవలం ఆక్రమణ ఆసక్తిగా ఉండరాదు: తాకట్టు క్రింద ఉన్న భూమిని తాకట్టు నుంచి విడిపించిన భూమిగా బదిలీ చేయరాని భూమిని బదిలీ చేసినట్లు, మొదలైనవి.

(b) సెక్షన్ 55 (1) హేతుబద్ధమైన సందేహాల నుంచి స్వేచ్ఛగా ఉన్న ఆస్తికి సంబంధించిన తాకట్టు/ పరిమితులకు సంబంధించినది. సెక్షన్ 55 (2) అమలు చెయ్యాలనుకున్న అప్పుతో కూడిన పట్టాను గురించి ప్రస్తావిస్తుంది.

సెక్షన్55 (2) పట్టాకు సంబంధించి కొన్ని విషయాలను త్రొక్కిపట్టి మరికొన్నింటిని తప్పుడుగా చెప్పడం, మొదలైన వాటికి సంబంధించినది. పట్టాకు సంబంధించిన తప్పుడు సమాచారం, ఆస్తికి సంబంధించిన తప్పుడు సమాచారం మధ్య వ్యత్యాసాన్ని గమనించాలి.

(i) పట్టాకు సంబంధించిన తప్పుడు సమాచారం ఒడంబడికను భగ్నం చేసినట్లు అవుతుంది. దీనికిగాను నష్టపరిహారం కోరటానికి 55 సెక్షన (2) అవకాశం కల్పిస్తుంది.

(ii) పట్టాకు సంబంధించిన ఒడంబడిక ఆస్తికి సంబంధించిన తప్పుడు సమాచారానికి వర్తించదు. అంటే ఎంత భూమి అమ్మకం జరిగింది అనే విషయంలో.

(iii) పట్టాకు సంబంధించిన ఒప్పందం భూమికి సంబంధించినది కాదు. అంటె ఎంత భూమిని అమ్మకపు పత్రంలో అమ్మజూపుతున్నట్లుగా చెప్పటం జరిగింది. అది కేవలం అమ్మకపుదారుని పట్టా సక్రమమైందైతేనే పరిశీలించటానికి పరిమితమైన ఒడంబడిక. అందువల్ల కొనుగోలుదారుడు కొన్నదాంట్లో లోపం ఉంటే పట్టా గురించి కాకుండా కొనుగోలు చేసిన దానిని గురించి దావా వెయ్యాలి.

(3) పట్టాకు సంబంధించిన ఒడంబడిక. ప్రతి అమ్మకపుదారుడు పట్టాను కలిగి ఉంటాడని భావించడం జరుగుతుంది. అయితే కొనుగోలుదారుడు పట్టా గురించి ఒక స్పష్టమైన ఒడంబడిక చేసుకోవాలి. ఈ సందర్భంలో ఈ క్రింది అంశాలను గుర్తుంచుకోవాలి:

(a) ఒడంబడికల్లో నిగూఢమైన అన్నింటినీ అధిగమించి ఉంటే

(b) స్పష్టమైన ఒప్పందం ఒక్కటే కక్షిదారులకు హక్కులు ఇచ్చినప్పటికీ నిగూఢమైన ఒడంబడిక నుంచి స్పష్టమైన సంగతమైన షరతుల ద్వారానే తప్పించుకోవడం సాధ్యమవుతుంది.

4. ఒడంబడిక నుంచి ఎవరు లాభం పొందగలరు?

పట్టా ఒడంబడిక నుంచి ఒక్క కొనుగోలుదారుడు అతని ప్రతినిధులే కాకుండా అతని నుంచి తర్వాత కొనుగోలుచేసిన వారు కూడా ప్రయోజనం పొందుతారు. ఎందుకంటే వారు కూడా సదరు పట్టాను అమ్మకందారునికి వ్యతిరేకంగా ఉపయోగించగలరు.

(5) ఈ క్లాజ్ క్రింద అమ్మకందారుడు అమ్మబోయే ఆస్తి తాలూకు పట్టాకు పూర్తి హామీ ఇచ్చినట్లు భావించటం జరుగుతుంది. ఒకవేళ అతడు ఒప్పందం నుంచి విరమించుకోదలిస్తే అవసరమైన నిగూఢ భావన ద్వారా అలా చేయవచ్చు.

(6) నిగూఢ ఒడంబడికకు కొనుగోలుదారుడు పట్టాకు సంబంధించిన లోపాలను తెలుసుకొన్నాడా లేదా అనే ప్రశ్నలతో సంబంధం లేదు. కొనుగోలుదారుడు లోపాలను తెలుసుకొన్నంత మాత్రాన వాటికి విరుద్ధంగా దావావేసే హక్కును కోల్పోడు. పట్టాలో లోపం ఉండటం వల్ల అతడు కొన్న ఆస్తిని పోగొట్టుకొన్నట్లైతే దాని కోసం అతడు దావా వేయవచ్చు. నష్టపరిహారం కోరవచ్చు.

7. పట్టాకు సంబంధించిన ఒప్పందం అందులో ఏది ఉంటుంది.

బ్రిటిష్ వ్యవహారం ప్రకారం పట్టాకు సంబంధించిన ఒడంబడకలో ఈ క్రిందివి ఉంటాయి.

(i) బదిలీ చేయటానికి హక్కు

(ii) అనుభవించటానికి హక్కు

(iii) తాకట్టు తదితర బందీల నుంచి విముక్తి చేయటానికి హక్కు

(iv) ఇంకా హామీలు ఇవ్వటానికి హక్కు

ఒప్పందం అమలు కింద అమ్మకందారుడు పట్టా సక్రమతకు అవసరమైన చర్యలు తీసుకోవలసి ఉంటుంది. కొనుగోలుదారునికి ఎటువంటి సందేహాలు లేకుండా చెయ్యాలి. అమ్మకందారుడు అమ్మకం పూర్తి అయిన తర్వాత పట్టాను పరిపూర్ణం చేయటానికి కొత్త ప్రయోజనాన్ని సంక్రమించుకొంటే ఒప్పందం ప్రకారం దానిని కొనుగోలుదారునికి అందజెయ్యాలి.

(2) ఇంగ్లీష్ ఒడంబడికలు చాలా విస్తృతంగా ఉంటాయి. ఆస్తి సక్రమతకు అవసరమైన చర్యలు-తాకట్టు నుంచి విడిపించటం, హామీలనివ్వటం, దాని స్వేచ్ఛ వినిమయతకు చర్యలు తీసుకోవటం మొదలైన వాటిని ప్రస్తావిస్తాయి. ఇండియన్ చట్టం వాటిని చేర్చలేదు.

(8) పట్టాకు సంబంధించిన ఒడంబడిక హేతుబద్ధమైన సందేహాలకు అతీతంగా ఉండాలి. కొనుగోలుదారుడు సంపూర్ణ పట్టాను కోరతాడని ప్రివీ కౌన్సిల్ తీర్పిచ్చింది. (9 IA 700 (713))

9. ధర్మకర్త విషయంలో నిగూఢ ఒడంబడిక వర్తించదు.

(i) అతడు ఆస్తిని తాకట్టు పెట్టటానికి, లేదా బదిలీ చేయలేని ఎటువంటి చర్య తీసుకోలేదని ఒడంబడిక ధర్మకర్త చేసినట్లే భావించటం జరుగుతుంది.

(ii) ధర్మకర్త తాను ''లాభదాయక యజమాని''గా ఒప్పందం చేసుకోవాలి. ఎందుకంటే అందువల్ల అతని చర్యలు పట్టాకు సంబంధించినవిగా పరిగణనలోకి తీసుకోబడతాయి.

10. పట్టా కొరకు నిగూఢ ఒడంబడిక ఒక మైనర్ పక్షాన ఆస్తిని విక్రయించే సంరక్షకుడికి వర్తించదు.

★ ★ ★

# 4. ధర్మనిధి చట్టము

# THE LAW OF TRUST

## ప్రధానాంశాలు

**భాగం–I**

ధర్మనిధి (Trust) అంటే ఏమిటి? దానికి ఏ చట్టం వర్తిస్తుంది?

**భాగం–II**

విస్పష్ట లేదా ప్రకటిత ధర్మనిధులు

(i) ఏర్పాటు చేసినవి

(ii) అంతరించినవి

**భాగం–III**

ధర్మనిధి పాలన

**భాగం–IV**

నిర్మాణాత్మక ధర్మ నిధులు

**భాగం–V**

నిర్మాణాత్మక ధర్మనిధి పాలన

# ధర్మనిధి చట్టము

## భాగం-I

### ధర్మనిధి అంటే ఏమిటి? దానికి ఏ చట్టం వర్తిస్తుంది?

**II చట్టం ఎటువంటి ధర్మ నిధులకు వర్తిస్తుంది?**

1. సెక్షన్ 1 ప్రకారం ఈ క్రింది వాటికి చట్టం వర్తించదు. అవి:

   **(i)** మహమ్మదీయుడు ఏర్పాటుచేసిన వక్ఫ్ సంస్థలు.

   **(ii)** సాంప్రదాయక, వ్యక్తిగత న్యాయం నిర్దేశించే అవిభక్త కుటుంబ సభ్యుల పరస్పర సంబంధాలు.

   **(iii)** యుద్ధంలో సంపాదించిన సొత్తును పంచుకోవటానికి విజేతలు ఏర్పాటు చేసుకున్న ధర్మ సంస్థలు.

   **(iv)** ప్రజా లేదా వ్యక్తిగత మత, ధార్మిక సేవా సంస్థలు.

2. వివరణలు

**(I)** వక్ఫ్:- ఇస్లాం మతాన్ని అనుసరించే వ్యక్తి మతం గుర్తించిన ధార్మిక కార్యకలాపాల నిర్వహణకు ఏర్పాటుచేసిన సంస్థ.

వక్ఫ్ రెండు రకాలు:-

**(i)** ప్రయోజనం ఏర్పాటు చేసిన వ్యక్తి, అతని కుటుంబీకులకే పరిమితం చేసేది-1913 చట్టంలోని భాగం VI ప్రకారం.

**(ii)** ఎటువంటి ప్రయోజనాన్ని కేటాయించనిది- 1923 చట్టం (42) ప్రకారం.

**II అవిభక్త కుటుంబం సభ్యుల పరస్పర సంబంధాలు**

ఉదా;

1 అవిభక్త హిందూ కుటుంబ యజమాని, కుటుంబ సభ్యులు.

2. హిందూ వితంతువు లేదా కన్య.

ధర్మనిధి చట్టం వారి సంబంధాలకు వర్తించదు. వ్యక్తిగత న్యాయం, సంప్రదాయాలు వారి సంబంధాలను క్రమబద్ధం చేస్తాయి.

## III యుద్ధ బహుమానాల పంపిణీ

### 1. బహుమానం

సముద్రంపై కానీ, నౌకాశ్రయంలో కానీ ఒక ఓడను పట్టుకున్నప్పుడు అందులోని సరుకులకు ''బహుమానం'' పదం వర్తిస్తుంది.

2. యుద్ధంలో సంపాదించిన బహుమానాలన్నీ సార్వభౌమునికే చెందుతాయి. వాటిని పట్టుకొన్న వారికి అది పంపిణీ చేయటానికి ఒక నిర్ణీత పద్ధతిలో ధర్మనిధిని ఏర్పాటు చేయటం జరుగుతుంది.

3. బహుమతులను పంపిణీ చేయటానికి ఏర్పాటుచేసిన ధర్మనిధికి పై చట్టం వర్తించదు.

## IV పబ్లిక్, ప్రైవేట్ ధర్మనిధులు, మత, ధార్మిక సేవా ధర్మనిధులు

ధర్మనిధులు పబ్లిక్, ప్రైవేట్ నిధులుగా ఉంటాయి.

### I పబ్లిక్ ధర్మనిధులు

సమస్త ప్రజాప్రయోజనాల కోసం లేదా ఒక విభాగం ప్రయోజనం కోసం ఏర్పాటైతే ధర్మనిధిని పబ్లిక్ లేదా ప్రజా ధర్మనిధి అని చెప్పటం జరిగింది. ఇది ఎంతమంది ప్రయోజనం కోసం ఏర్పడింది అనేది ముఖ్యం కాదు. ప్రయోజకుల సంఖ్యను గుర్తించటం సాధ్యం అయినప్పటికీ.

### II ప్రైవేట్ ధర్మనిధి

కొద్దిమంది వ్యక్తుల ప్రయోజనం కోసం ఏర్పాటు చేసింది ప్రైవేట్ ధర్మనిధి. ఒక కాల పరిమితి లోపల వారి సంఖ్యను నిర్ధారించటం అవసరం.

### III పబ్లిక్ ధర్మనిధి లక్ష్యాలు

అవి మూడు రకాలు:-

(i) ప్రజా ప్రయోజనాలు (ii) ధార్మిక ప్రయోజనాలు (iii) మత ప్రయోజనాలు

(1) ''ప్రజా ప్రయోజనం'' అనే పదాలు రెండు భావాల్లో ఉపయోగిస్తారు:-

**(a)** మామూలు అర్థంలో- అది ఈ ప్రయోజనాలకు వర్తిస్తుంది. రోడ్లను మరమ్మతు చేయటం, ఆశ్రమాల్లో నివసించే వారికి నీటి సరఫరా, వంతెనల నిర్మాణం, మరమ్మతు మొదలైనవి.

(2) ''ధార్మిక ప్రయోజనాలు'' అంటే ఆహారం పంచి పెట్టడం, ఉచిత ఆహార వసతి గృహాల నిర్మాణం, వైద్యశాలల ఏర్పాటు మొదలైనవి.

(3) ''మత ప్రయోజనం'' అంటే మత కార్యకలాపాలు- మత బోధన, పూజా వ్యవహారాలు- మత సాహిత్యం పంపిణీ; దేవాలయాలు, మసీదులు, చర్చ్‌లు నిర్మించటం, నిర్వహణ మొదలైనవి.

పబ్లిక్ ధర్మనిధికి ధర్మనిధి చట్టం వర్తించదు. ప్రైవేట్ ధర్మనిధికి ధర్మనిధి చట్టం వర్తిస్తుందా?

ఒక ప్రైవేట్ ధర్మనిధి ధార్మిక లేదా మతపరమైన ధర్మనిధి కానప్పుడు దానికి ధర్మనిధి చట్టం వర్తిస్తుంది.

ధార్మిక లేదా మతపరమైన పబ్లిక్ లేదా ప్రైవేట్ ధర్మనిధికి వర్తించేది ఏ చట్టము?

అనేక చట్టాలు ఉన్నాయి.

(1) సి.పి.సి. 92వ విభాగం.

2. 1863 రిలిజియస్ ఎండోమెంట్ ఆక్ట్.

3. 1889 (I) రిలిజియస్ సొసైటీస్ ఆక్ట్.

4. 1890 (IV) ఛారిటబుల్ ఎన్‌డోమెంట్ ఆక్ట్.

5. 1920 (XIV) ఛారిటబుల్ అండ్ రిలిజియస్ (ట్రస్ట్స్) ఆక్ట్.

## వివిధ ధర్మనిధులు

1. ధర్మనిధులు వివిధ వర్గాలుగా ఉన్నాయి. వాటిని చూసే దృక్పథాన్ని అనుసరించి అవి ఆయా వర్గీకరణ క్రిందకు వస్తాయి.

**2. ఈ క్రింది మూడు దృక్పథాల్లో ఒక ధర్మనిధిని చూడవచ్చు.**

(i) ధర్మనిధి ఏర్పాటైన పద్ధతి దృక్పథం నుంచి

(ii) ధర్మనిధి రాజ్యాంగం దృక్పథం నుంచి

(iii) ధర్మకర్త, కర్తవ్యం, స్వభావం, దృక్పథం నుంచి

**3.** **ధర్మ నిధి ఏర్పాటు పద్ధతిని అనుసరించి ధర్మనిధులు రెండు రకాలు:**

(i) విస్పష్టమైన (Express)

(ii) సంభావ్యమైన (Constructive)

**4.** **నిధి నిర్మాణ పరంగా ధర్మనిధులు**

(i) పూర్తిగా ఏర్పాటైనవి

(ii) పూర్తిగా ఏర్పాటుకానివిగా రెండు రకాలుగా ఉంటాయి.

**5.** **కర్తవ్యపరంగా ధర్మనిధులు**

(i) సాధారణ

(ii) ప్రత్యేక ధర్మ నిధులుగా ఉంటాయి.

**1.** **విస్పష్ట మరియు సంభావ్య ధర్మనిధులు**

ధర్మనిధి రెండు మార్గాల్లో ఏర్పడుతుంది.

(i) ఒక వ్యక్తి స్వచ్ఛంద ప్రకటన ఫలితంగా

(ii) చట్టం ప్రకారం

2. ధర్మనిధి ఇచ్చిన ప్రకటన ఫలితంగా ఏర్పడితే దానిని ప్రకటిత లేదా విస్పష్ట ధర్మనిధి అంటారు. ధర్మనిధి చట్టం ద్వారా ఏర్పడితే దానిని సంభావ్య ధర్మనిధి అంటారు.

3. ''సంభావ్య ధర్మనిధి'' అనే పదాలను మరో భావంలో కూడా ఉపయోగిస్తారు. ఒక నిర్మాణం కోసం ఏర్పాటైన ధర్మనిధి అవి కూడా భావించవచ్చు. ధర్మనిధి ఒక ఉద్దేశాన్ని సూచిస్తుంది. ఉద్దేశం ప్రకటితం కావచ్చు లేదా ధర్మనిధి సంభావ్య కార్యకలాపాల వల్ల న్యాయస్థానం నిర్ధారించవచ్చు. రెండవ సందర్భంలో ధర్మనిధిని సంభావ్య ధర్మనిధి అంటారు.

4. ఈ భావంలో సంభావ్య ధర్మనిధులను ఉపయోగించినప్పుడు రెండు అంశాలను గుర్తుంచుకోవాలి.

(i) కొన్ని సమయాల్లో అటువంటి సంభావ్య ధర్మనిధిని విస్పష్ట ధర్మనిధి నుంచి భిన్నంగా చూడటం జరుగుతుంది. వాస్తవంలో అటువంటి సంభావ్య ధర్మనిధి విస్పష్ట ధర్మనిధి. అందువల్ల దానినిరెండవ దానినుంచి వేరుగా చూడలేము. ఏర్పాటు చేసిన వ్యక్తి ఉపయోగించిన భాష అసందిగ్ధంగా, అస్పష్టంగా ఉందన్న కారణం ఉన్నప్పటికీ అది విస్పష్ట ధర్మనిధి అవుతుంది. ఒక వేళ న్యాయస్థానం భాషను సక్రమంగా అన్వయించి దాత ఉద్దేశ్యాన్ని ప్రకటిస్తే కూడా అది విస్పష్ట ధర్మనిధే అవుతుంది.

(ii) చట్టం ప్రకారం ఆవిర్భవించినసంభావ్య ధర్మనిధితో, పత్రాన్ని పరిశీలించి న్యాయస్థానం ఒక ధర్మనిధిని సంభావ్య ధర్మనిధిగా ప్రకటించినప్పుడు దానితో మొదటి దానిని కలిపి తికమక పరిస్థితిని సృష్టించరాదు. మొదటి దాంట్లో ఒక ఉద్దేశ్యం ధర్మనిధిని ఏర్పాటు చేస్తుంది. అది ఒక వ్యక్తి స్వచ్ఛంద చర్య ద్వారా ఏర్పడుతుంది. రెండవ దాంట్లో స్పష్టమైన ఉద్దేశ్యం కనపడదు. అది వ్యక్తిపరంగా కాకుండా చట్టపరంగా ఏర్పడుతుంది.

**సంభావ్య ధర్మనిధులు రెండు రకాలుగా ఉంటాయి:-**

(i) ఫలితం వచ్చే ధర్మనిధులు

(ii) ఫలితరహిత ధర్మనిధులు

సంభావ్య ధర్మనిధులను పరిశీలించేటప్పుడు పై వాటి మధ్య వ్యత్యాసాలను చూద్దాము. వాటి మధ్య ఒక సమభావం ఉంది- అవి రెండూ ఒక వ్యక్తి చర్యల వల్ల కాక చట్టపరంగా ఏర్పాటవుతాయి.

**II పూర్తిగా రూపొందిన, అసంపూర్తిగా ఏర్పాటైన ధర్మనిధులు.**

1. లబ్ధిదారుల ప్రయోజనం కోసం నిధి ఆస్తితో, ధర్మకర్తలతో ఏర్పడేది పూర్తిగా ఏర్పడిన ధర్మనిధి. కేవలం లక్ష్యాన్ని ప్రకటించి, దానికి అవసరమైన ఆస్తి ధర్మకర్తల వశం చేయనప్పుడు అది అసంపూర్ణ ధర్మనిధి అవుతుంది.

2. ధర్మనిధి ఏర్పాటులో ముఖ్యమైన ఆలోచన లేనప్పుడు ధర్మనిధి పూర్తిగా ఏర్పడిందా అసంపూర్తిగా ఏర్పడిందా అన్న ప్రశ్న చాలా ముఖ్యమైంది.

3. దానికి విలువనిచ్చినట్లైతే అది సంపూర్ణమైందా అసంపూర్ణమైందా అనుకొన్న ప్రకారం ఏర్పడిందా లేదా అనేది న్యాయస్థానం నిర్ణయిస్తుంది.

4. ఎటువంటి విలువ ఇవ్వకుండా, అందులో సమతాభావం లోపించినప్పుడు సదరు ధర్మనిధి అమలుకు ఒక వ్యక్తి వేసిన దావాను న్యాయస్థానం పరిగణనలోకి తీసుకోదు. ఎటువంటి చర్యను మంజూరు చేయరు.

5. పూర్తిగా ఆస్తి బదలాయింపు జరిగితే అది స్వచ్ఛందమైన చర్య అయినప్పటికీ సమర్థవంతంగా ధర్మనిధి జరిగితే సదరు నిధిని న్యాయస్థానం అమలుపరుస్తుంది.

6. రెండు విధాలుగా ధర్మనిధిని పూర్తిగా ఏర్పాటు చేయవచ్చు:-

(i) ఏర్పాటుచేసే వ్యక్తి ఆస్తిని ధర్మకర్తలకు దఖలు చేయవచ్చు.

(ii) ఏర్పాటుచేసే వ్యక్తే తనను తాను ఒక ధర్మకర్తగా ప్రకటించుకోవచ్చు.

7. సంపూర్ణ, అసంపూర్ణ ధర్మనిధుల మధ్య తేడా:

(i) ధర్మకర్తలకు ధర్మనిధి ఆస్తిని పూర్తిగా దఖలు పరిచినదే సంపూర్ణంగా ఏర్పాటైన ధర్మనిధి.

(ii) ధర్మకర్తలకు పూర్తిగా ఆస్తిని దఖలు పరచనప్పుడు అది అసంపూర్ణ ధర్మనిధి.

**గమనిక**

అమలు జరిగినవైనా అమలు జరగవలసినవైనా వీలునామాపరంగా ఏర్పాటయ్యే ధర్మనిధులన్నీ ఏర్పడినవే-

(iii) ఏర్పాటుచేసే వ్యక్తి ధర్మకర్తలకు ఆస్తిని బదలాయించటానికి అవసరమైన చర్యలన్నింటినీ తీసుకోవాలి. ధర్మనిధి ఏర్పాటుపత్రం, ఏర్పాటుచేసే వ్యక్తి వైఫల్యాన్ని తప్పించు కోవాలంటే, నిధి ప్రకటన కూడా చెయ్యాలి.

(8) తేడా వల్ల ఏర్పడే పరిణామాలు

(i) ఒక విలువైన ప్రయోజనం కోసం ఏర్పాటైతే అది అసంపూర్ణమైనది అయినప్పటికీ సదరు ధర్మనిధిని అమలుపరచటం జరుగుతుంది. అయితే అది స్వచ్ఛందమైనది అయితే దానిని అమలుపరచడం జరగదు.

(ii) విలువైన ప్రయోజనం అంటే నిధిపరంగా చట్టపరంగా ధనరూపేణా దానిని అంచనా వేయడం జరుగుతుంది. వివాహం, సంతానం మొదలైన వాటి ద్వారా దావా వేయటం కూడా పరిగణనలోకి తీసుకుంటారు.

(iii) విలువైన ప్రయోజనం, సత్ప్రయోజనం మధ్య వ్యత్యాసాన్ని పరిగణించాలి. సహజమైన ప్రేమ, అనురాగం, సత్ప్రయోజనంగా పరిగణించాలి. అయితే అటువంటి ప్రయోజనం ఎంత మంచిది అయినప్పటికీ, విలువైనది కాదు.

(iv) ఒక స్వచ్ఛంద కార్యకర్త కోరినంత మాత్రాన అసంపూర్ణమైన ధర్మనిధిని సత్ ప్రయోజనం అమలుపరచలేదు. ఏర్పడబోయే ధర్మనిధిని అది సవాలు చేయవచ్చు.

## (V) వివాహం ఏ మేరకు పరిగణనలోకి వస్తుంది?

(i) ముందుగా ఒక ఏర్పాటు చేసుకుని వివాహ ప్రయోజనం కోసం అది జరిగితే అప్పుడు అది విలువైన పరిగణన అవుతుంది. వివాహం అనంతరం కూడా అది విలువైనదే అయితే వివాహానికి ముందునాటి ఒప్పందాన్ని అమలుపరచటం జరిగినప్పుడు.

(ii) కానీ ఒక ఏర్పాటు వివాహానంతరం జరిగితే అది వివాహానికి. పూర్వపు స్థితికి అన్వయించనప్పుడు, సదరు ఒప్పందం స్వచ్ఛందమైనదే అవుతుంది.

## (VI) వివాహం పరిగణన క్రిందకు వచ్చే వారు ఎవరు?

(i) వివాహం పరిగణన కిందకు వచ్చేవారు వాస్తవంలో వివాహం చేసుకొనే వ్యక్తులు- భార్య, భర్త, కలుగబోయే సంతతి.

(ii) మిగతా వారంతా స్వచ్ఛంద వ్యక్తులు. ఆస్తి బదలాయింపు అసంపూర్ణతకు వ్యతిరేకంగా వారు నిధిని ఏర్పాటు చేసిన వ్యక్తికి వ్యతిరేకంగా నిధి అమలును నిర్బంధించేవారు ఉదా. తర్వాతి కాలంలో సంక్రమించిన ఆస్తి పంపిణీకి సంబంధించిన ఒప్పందం.

9. ఇండియన్ ధర్మనిధి చట్టం సంపూర్ణ, అసంపూర్ణ ధర్మనిధులకు మధ్య వ్యత్యాసాన్ని గుర్తిస్తుందా?

# సాధారణ, ప్రత్యేక ధర్మనిధులు

1. సాధారణ ధర్మనిధి అంటే ఆస్తి సంరక్షణదారుడు నామకార్థంగా వుండి క్రియాత్మకంగా వ్యవహరించకపోతే అది సామాన్య ధర్మనిధి అవుతుంది.

(2) ప్రత్యేక ధర్మనిధి అంటే ఒక ప్రత్యేక పథకాన్ని అమలుజరపటానికి ధర్మకర్తను నియమించి నిధిని ఏర్పాటు చేసిన వ్యక్తిని ధర్మకర్త నిధి అమలుకు క్రియాత్మకంగా ప్రయత్నించమని కోరటం. పర్యవసానంగా నిధిని ఏర్పాటు చేసిన వ్యక్తి లక్ష్యం నెరవేరుతుంది.

(3) సాధారణమైన ధర్మనిధి అంటే నిష్క్రియా ధర్మనిధి. ప్రత్యేక ధర్మనిధి అంటే క్రియాత్మకమైన సంస్థ.

(4) సామాన్య ధర్మనిధిలో లబ్దిదారుడు ప్రయోజనం పొందటానికి సంపూర్ణ హక్కుంది. ఆస్తిని స్వాధీనం చేసుకోటానికి, అనుభవించటానికి , ధర్మకర్తలకు తన సూచనల ప్రకారం ఒత్తిడి తీసుకురావటానికి అధికారం ఉంది.

(5) ప్రత్యేక ధర్మనిధులు రెండు రకాలు:-

(i) మినిస్టీరియల్

(ii) విచక్షణాపరమైన

6. రెండు వర్గాల్లోనూ ధర్మకర్తలు సంవర్ధక నిధులు కలిగి ఉంటారు.

7. అయితే వ్యత్యాసం ఎక్కడ ఉంటుందంటే మినిస్టీరియల్ ధర్మనిధిలో కర్తవ్యాలు ఏవిధంగా ఉంటాయంటే ధర్మకర్త తన విచక్షణను ఉపయోగించలేడు. విచక్షణ నిధి విషయంలో ధర్మకర్త తన విచక్షణను ఉపయోగించి చర్య తీసుకోగలడు.

★ ★ ★

# భాగం II

# విస్పష్ట లేదా ప్రకటిత ధర్మనిధి

**ప్రకరణం-I**

**(i)** అమలుపరిచిన

**(ii)** అమలుచేయవలసిన

**ప్రకరణం-II** విస్పష్ట ధర్మనిధి ఏర్పాటు

**ప్రకరణం-III** విస్పష్ట లేదా ప్రకటిత ధర్మనిధి రద్దు

**ప్రకరణం-IV** ప్రకటిత ధర్మనిధి అంతరించడం

# ప్రకరణం I

# రెండు రకాల ప్రకటిత ధర్మనిధులు అమలుపరిచిన – అమలుపరచవలసిన

ప్రకటిత ధర్మనిధి అమలుపరిచిన నిధి కావచ్చు లేదా అమలుపరచవలసింది కావచ్చు.

## 1. అమలుపరిచిన, అమలుపరచవలసిన ధర్మనిధులు

1. అమలుపరిచిన, అమలుపరచవలసిన అనే పదాలు ఒప్పందం విషయంలో ఉపయోగించినట్లుగా అదే అర్థంలో ధర్మనిధుల విషయంలో ఉండవు.

2. ఒప్పందం విషయంలో ఉపయోగించినప్పుడు అది ఒప్పందం అమలును ప్రస్తావిస్తుంది. ధర్మనిధుల విషయంలో వాటిని ప్రస్తావించినప్పుడు అవి ధర్మనిధుల ఏర్పాటును వాటి అమలునుంచి వ్యత్యాసంగా చూపిస్తాయి.

3. ఈ భావంలో చూసినప్పుడు ఇవి ఒప్పందం విషయంలో ప్రతి ధర్మనిధీ దాని వ్యయం పూర్తి అయ్యేంతవరకూ అమలుకావలసిందే అనే అర్థం స్ఫురిస్తుంది. అయితే నిధి విషయంలో అది అదే అర్థాన్ని ఇవ్వదు. ఎందుకంటే ఆ అర్థంలో దానిని ఉపయోగించలేదు కాబట్టి.

4. ధర్మనిధి పరంగా అమలుపరిచిన, అమలుపరచవలసిన అనే పదాలను ఉపయోగించినప్పుడు వాటికి వేరు అర్థం ఉంటుంది.

   (i) ఒక ధర్మనిధి అమలు జరిగిన నిధి ఎప్పుడు అవుతుందంటే దానిని ఏర్పాటు చేసిన వ్యక్తి లబ్ధిదారులకు నిధి ద్వారా ఏర్పాటు చేయటమే కాకుండా వారు నిధి ఆస్తిని ఏవిధంగా సంరక్షించాలో కూడా నిర్ణయించినప్పుడు.

   (ii) అమలుకావలసిన ధర్మనిధి అంటే నిధిని ఏర్పాటుచేసిన వ్యక్తి లబ్ధిదారులకు మాత్రమే ఏర్పాటుచేసి వారు నిధి ఆస్తులను ఎట్లా కాపాడాలో సూచించకుండా మరోపత్రం ద్వారా దానాని మరొక వ్యక్తికి వదిలివేసినప్పుడు

   ఉదా: A,B లకు వివాహం జరిగినప్పుడు వారికి, వారి సంతతికి ఏర్పాటు చేయటం.

గమనిక

ఇక్కడ తల్లిదండ్రులు- లబ్ధిపొందే వారు ఎవరో నిర్వచనం ఇవ్వటం జరిగింది వారు A మరియు B, వారి సంతతి-

(1) అయితే ఎటువంటి లాభాన్ని A,B వారి సంతతి పొందుతారో చెప్పలేదు.

(2) అందువల్ల అది అమలుకాని ధర్మనిధి.

(3) అమలు అయిన, అమలుకాని ధర్మనిధి మధ్య వ్యత్యాసం సంపూర్ణ, అసంపూర్ణ ధర్మనిధుల మధ్య వ్యత్యాసం కంటే భిన్నమైంది.

(4) సంపూర్ణ, అసంపూర్ణ ధర్మనిధుల మధ్య వ్యత్యాసం ఏమిటంటే మొదటిదాంట్లో ఆస్తి ధర్మకర్తల అధీనంలో ఉంటే రెండవదాంట్లో ఆవిధంగా లేదు.

(5) అమలు అయిన, అమలుకాని ధర్మనిధుల మధ్య వ్యత్యాసం ఏమిటంటే మొదటి దాంట్లో లబ్ధిదారుల ప్రయోజనం స్పష్టంగా చెప్పబడి ఉంటే రెండవ దాంట్లో అలా లేదు.

(6) అలా ఉండడం వల్ల అమలు జరిగే ధర్మనిధి పూర్తిగా ఏర్పాటైన ధర్మనిధి.

## I ధర్మనిధికి సంబంధించిన పార్టీలు (కక్షిదారులు)

1. ఒక నిధి తాలూకు వ్యవహారాలను నిర్వహించటానికి ముగ్గురు కక్షిదారులు అవసరం.

   (i) నిధిని ఏర్పాటుచేసేవారు

   (ii) దానిని అంగీకరించేవారు

   (iii) ఎవరి ప్రయోజనం కోసం నిధిని ఏర్పాటు చేయటం జరిగిందో వారు

2. ధర్మనిధిని ఏర్పాటుచేసే వ్యక్తిని ''నిధి కర్త'' అంటారు. దానిని అంగీకరించిన వ్యక్తి ధర్మకర్త. దానినుంచి ప్రయోజనం పొందే వ్యక్తిని లబ్ధిదారుడు అని పిలుస్తారు.

3. ఈ మూడు పక్షాలు వేరువేరుగా ప్రత్యేకంగా ఉండటం అవసరమా? వీరిలో ఒకరు ఏ రెండు పాత్రలనూ తనే నిర్వహించలేడా? ఈ ప్రశ్నకు సమాధానం ఏమిటంటే కొన్ని సందర్భాల్లో రెండు పాత్రలను ఒకరే నిర్వహించవచ్చు.

(i) ధర్మనిధి కర్త, నిధి లబ్ధిదారుడు తప్పనిసరిగా విడివిడిగా ప్రత్యేకంగా ఉండాలి.

(ii) ధర్మకర్త, లబ్ధిదారుడు విడివిడిగా ప్రత్యేకంగా ఉండాలి.

(iii) ధర్మనిధి కర్త, ధర్మకర్త- ఇద్దరూ- ప్రత్యేకంగా విడివిడిగా ఉండనవసరం లేదు.

4. కొన్ని సందర్భాలలో రెండు పాత్రలను ఒకే పక్షం నిర్వహించటం, మరికొన్ని సందర్భాలలో అలా సాధ్యంకాకపోవటానికి కారణాలు ముఖ్యం కాదు.

(i) ధర్మనిధి ఏర్పాటు రెండు రకాలైన ఆస్తులను సృష్టిస్తుంది- (i) చట్టబద్ధమైనది (ii) సమతాపరమైంది. ఈ రెండూ విడివిడిగా ఉన్నంతకాలం ధర్మనిధి కొనసాగుతుంది.

(ii) ఈ రెండూ ఒక వ్యక్తి కలిగి ఉంటే సమత, చట్టబద్ధతతో కలిసిపోయి నశిస్తుంది. మరో మాటలో చెప్పాలంటే సమత, చట్టపరమైన ఆసక్తులు ఒక వ్యక్తిలో నిక్షిప్తమైతే సమత చట్టబద్ధమైన హక్కుల్లో మిళితమై ధర్మనిధి అంతరిస్తుంది.

**రెండు నియమాలను దృష్టిలో ఉంచుకోవాలి:-**

(i) ప్రత్యేక సమతా ప్రయోజనాన్ని సృష్టించకుండా ఎటువంటి ధర్మనిధీ ఉండదు.

(ii) సమత, చట్టబద్ధ ప్రయోజనాన్ని మిళితమైన ధర్మనిధి ఉండదు.

(5) ఈ రెండు నియమాలను అనుసరించి మనం ఈ క్రింది నిర్ధారణలకు వస్తాము.

(i) ధర్మనిధి కర్త, ధర్మకర్త ఇద్దరూ ఒక్కరే యినప్పుడు అక్కడ కలిసిపోవటం ఉండదు. అందువల్ల, వారు ప్రత్యేకంగా విడిగా ఉండనవసరం లేదు.

(ii) ధర్మనిధి కర్త, లబ్ధిదారుడూ ఒక్కరే అయినప్పుడు ప్రత్యేక సమత ఆస్తి ఏర్పాటు అవసరం లేదు. అందువల్ల వారు విడివిడిగా ఉండాలి.

(iii) ధర్మకర్త, లబ్ధిదారుడూ ఇద్దరూ ఒక్కరే అయినప్పుడు అక్కడ కలిసిపోవటం జరుగుతుంది అందువల్ల వారు విడివిడిగా ఉండాలి.

సంక్షిప్తంగా చెప్పాలంటే ధర్మనిధి కర్త, ధర్మకర్త ఒక్కరే కావచ్చు. కానీ లబ్ధిదారుడు మాత్రం నిధి కర్త, ధర్మకర్తల నుంచి భిన్నంగా ఉండాలి.

6. ఇంతవరకూ మనం విడివిడి హక్కుల పైన కక్షిదారుల ఉదాహరణలతో సాధారణమైనవి పరిశీలించాము. అనేకమంది కక్షిదారులున్నప్పుడు, అందులో కొందరు ద్వంద్వ పాత్రలను నిర్వహిస్తున్నప్పుడు ఏం జరుగుతుంది?

**ఉదాహరణ**

(i) A,Bలు ఒక ధర్మనిధి లబ్దిదారులు. వారిలో A ధర్మకర్త కూడా. అటువంటి నిధి చట్టపరంగా చెల్లుబాటు అవుతుందా?

(ii) A,Bలు ధర్మనిధి లబ్దిదారులు. వారిలో A ధర్మనిధి కర్త. అప్పుడు సదరు నిధి చట్టరీత్యా సార్థకమేనా?

7) మొదటి ప్రశ్నకు సమాధానం ఖచ్చితంగా ''ఔను''. ధర్మనిధిని నిర్వచించిన విభాగం 6లో ఇదికనిపిస్తుంది. ఆ నిర్వచనంలో రెండవ ప్రశ్నకు సమాధానం కనపడటం లేదు. అయినప్పటికీ సదరు ధర్మనిధి చట్టబద్ధం కాదు.



# ప్రకరణం II

## (i) ప్రకటిత ధర్మనిధి ఏర్పాటు

### 1. సార్థకమైన ధర్మనిధి ఏర్పాటుకు షరతులు

ఒక ప్రకటిత ధర్మనిధి సార్థకతకు చట్టం ఈ క్రింది షరతులను పూర్తి చెయ్యాలని చెబుతున్నది.

(i) సెక్షన్-6

(1) ధర్మనిధికి అవసరమైన కక్షిదారులు ఉండాలి.

(2) నిధి ఏర్పాటుదారుడు ఉపయోగించే భాష స్పష్టంగా, న్యాయస్థానం దాని నుంచి వాస్తవాన్ని గ్రహించేలా ఉండాలి.

(a) ధర్మనిధిని ఏర్పాటు చేయటంలో ఉద్దేశం.

(b) అంచనా వేయడానికి వీలయిన ఆస్తి

(c) స్పష్టమైన లబ్ధిదారులు

(d) అంచనా వేయడానికి వీలయిన ప్రయోజనం.

**(ii) సెక్షన్ 7 – 8**

ధర్మనిధి ఆస్తి ఏవిధంగా ఉండాలంటే దానిని బదిలీ చేయడానికీ, నిధిగా అట్టేపెట్టటానికీ అనువుగా ఉండాలి.

**(iii) ధర్మనిధి లక్ష్యం చట్టబద్ధమైందిగా ఉండాలి.**

(2) ధర్మనిధి ఏర్పాటులో ఇంగ్లీష్ చట్టం ఇండియన్ చట్టం కంటే భిన్నంగా ఉంది. స్నెల్ అభిప్రాయంలో ధర్మనిధి ఏర్పాటుకు మూడు నిశ్చయతలు అవసరం:-

(i) ఉద్దేశపరంగా నిశ్చయత.

(ii) నిధి ఆస్తిపరంగా నిశ్చయత.

(iii) నిశ్చయమయిన లబ్ధిదారులు. స్నెల్ చెప్పినవే కాకుండా అండర్‌హిల్ మరో నిశ్చయతను ధర్మనిధిని ఏర్పాటుకు అవసరం అని భావించాడు.

(iv) ధర్మనిధి ప్రయోజనం

ధర్మనిధి ఆస్తి ధర్మకర్తకు బదలాయించనవసరం ఇంగ్లీష్‌చట్ట ప్రకారం లేదు. అయితే ఇండియన్ చట్టం ప్రకారం అది అవసరం.

(ii) నిశ్చయమయిన ఉద్దేశం

(i) చర్యల ద్వారా లేదా పదాల ద్వారా ధర్మనిధి ఏర్పాటు ఉద్దేశం నిశ్చయంగా ఉండాలి.

(ii) ధర్మనిధిని నిధి కర్త ఏవిధంగా ఏర్పాటుచేయగలడో చెప్పటానికి ఇవి ఉదాహరణలు.

ఉదా.

(i) తండ్రి తన కొడుకు పేరిట ఒక పుస్తకంగా ఖాతాను ప్రారంభించి అందులో ధనాన్ని జమచేస్తాడు. 9 బొంబాయి 125

(ii) ఒక వాటాను కొనటం

5 బొంబాయి 268 17 Col. 620 (628)

3. పదాల ద్వారా ధర్మనిధిని ఏర్పాటు చేయటానికి సంబంధించిన ఉదాహరణలు అనవసరం. ఇక్కడ ప్రశ్న ఏమిటంటే ఎటువంటి భాషను ఉపయోగించటం అవసరం. ఎందుకంటే సదరు భాష ధర్మనిధి ఏర్పాటు లక్ష్యాన్ని స్పష్టం చెయ్యాలి:-

(i) ఎటువంటి సాంకేతిక పదజాలం ధర్మనిధి ఏర్పాటుకు అవసరం లేదు. అందువల్ల ఇక్కడ ఏర్పడే ప్రశ్న ఏమిటంటే ఒక వీలునామా ద్వారా లేదా చర్య ద్వారా ఒక వ్యక్తి పూర్తిగా ధర్మనిధిని ఏర్పాటుచేసి, దానికి ధర్మకర్తగా, లబ్ధిదారుడుగా ఎవరు ఉండాలని నిధి ఏర్పాటుదారుడు తన ఉద్దేశాన్ని వ్యక్తం చేసి, దానితోపాటు లబ్ధిదారుడికి మేలు చేసే తన ఆశయాన్ని ప్రకటించాలి. అయితే సదరు లక్ష్యం అతనిపై ఎటువంటి బాధ్యతనూ విధించరాదు. ప్రశ్న ఏమిటంటే ధర్మనిధి ఏర్పాటుచేసే వ్యక్తి కేవలం ధర్మకర్త ఏమి చెయ్యాలో వ్యక్తం చేస్తాడా లేక అతడు ధర్మకర్తపై ఒక పని చెయ్యాలని బాధ్యతను విధిస్తాడా. బాధ్యను నిర్వహించాలనేది ఉద్దేశమైతే అప్పుడు అతనికి ధర్మనిధి ఏర్పాటు చేయటానికి ఒక ఉద్దేశం ఉందని చెప్పవచ్చు.

**(iii) ఉపయోగించిన భాష సూచితంగా లేదా ఖచ్చితంగా ఉండవచ్చు:-**

(i) అర్థింపు, సిఫారస్, ఆశాభావం మొదలైన పదాలు సూచితలు.

(ii) అటువంటి పదాలు ధర్మనిధి ఏర్పాటు ఉద్దేశాన్ని సూచించవు. ఎందుకంటే అది ధర్మకర్తపై ఎటువంటి బాధ్యతను విధించేవిగా ఉండవు.

(iii) ఇంగ్లీష్ చట్టం ప్రకారం అటువంటి సూచిత పదాలు ధర్మనిధి ఏర్పాటుకు సరిపోతాయి. సదరు ధర్మనిధిని సూచిత నిధి అంటారు. అయితే ఆధునిక ధోరణి దీనికి విరుద్ధంగా ఉంది.

## (iii) నిశ్చితమైన లబ్ధిదారులు

1. లబ్ధిదారులను స్పష్టంగా, ప్రత్యేకంగా గుర్తించటానికి వీలుగా పేర్కొనాలి.

**2. అనిశ్చితకు ఉదాహరణ**

(i) Aకు ఆస్తిని ఇచ్చి అది కుటుంబంలో కొనసాగుతుందని నిర్దేశించటం- కుటుంబం అనిశ్చితం.

(ii) ఏర్పాటుచేసిన వ్యక్తి సంబంధాలు- సంబంధాలు అనిశ్చితం.

**3. చాలినంత వర్ణనకు ఉదాహరణలు**

(i) వారసులు సరిగ్గా సరిపోయేంత వర్ణన ఉంది. కాబట్టి ఇది ఖచ్చితమైనదే.

## 3. ప్రయోజనం ఖచ్చితం

1. ఆస్తిని ఏవిధంగా ఉపయోగించాలో స్పష్టం చెయ్యాలి.

**2. ప్రయోజనం అస్పష్టతకు ఉదాహరణలు**

(i) కొంతమంది వ్యక్తుల పరిగణన.

(ii) వారి పట్ల దయ చూపించటం.

(iii) వారికి సరిపోయే ఏర్పాటు చేయటం.

(iv) వారిని గుర్తుంచుకోవటం

(v) వారికి న్యాయం చేకూర్చటం

(vi) భవిష్యత్‌లో మంచి అనుకొని మేనల్లుడి పట్ల జాగ్రత్త వహించటం.

(vii) తనకు, తన సంతతికి ఆస్తిని ఉపయోగించటం, భగవంతుడిని, భక్తినీ, పేదవారిని జ్ఞాపకం ఉంచుకోవటం.

3. ధర్మనిధి ప్రయోజనం అంటే లబ్దిదారులకు ఉపయోగపడే విధంగా ఆస్తిని వినియోగించటం.

## 4. ధర్మనిధి ఆస్తి విషయంలో నిశ్చితత

1. పూర్తి ఖచ్చితత్వంతో ధర్మనిధి ఆస్తిని ఏర్పాటు చెయ్యాలి. గుర్తించటానికి వీలుగా దానిని ప్రస్తావించాలి లేదా వర్ణించాలి.

### ఉదాహరణలు

(i) A,Bకి కొంత ఆస్తిని ఇస్తాడు. దానిని విభజించి అందులో అధిక భాగం C సంతతికి ఇవ్వాలని Bని నిర్దేశిస్తాడు. ఇక్కడ ధర్మనిధి ఏర్పాటుకాలేదు. ఎందుకంటే హేతుబద్ధమైన ఖచ్చితత్వంతో ఆస్తిని చూపించలేదు కాబట్టి.

(ii) A ఆస్తిని తన భార్యకు ధర్మనిధిగా ఇచ్చి ఆమెకు అవసరం లేని వాటా, ఆమె మరణానంతరం అతని సంతతికి లభ్యం చెయ్యాలని నిర్దేశిస్తాడు.

(iii) A ఆస్తిని తన సేవకులకు ఇచ్చి, వారి కోర్కెల ప్రకారం అందులో భాగాన్ని తాను ఏవిధంగా అమ్మకుండా వదిలివేశాడో పంచమంటాడు.

### ముగింపు

1. ఒక నిర్దిష్టమైన ధర్మనిధిని నిర్దిష్టమైన ఆస్తిలో నిర్దిష్టమైన వ్యక్తుల కోసం ఏర్పాటు చేయటం జరుగుతుంది. నిర్దిష్టమైన లక్ష్యంతో నిర్దిష్టమైన సమతా బాధ్యతతో నిర్దిష్టమైన లబ్దిదారులకు నిర్దిష్టమైన మత హక్కులు లేకుండా ఏ ధర్మనిధి ఏర్పాటు సాధ్యం కాదు.

2. ఐతే ఒక నిర్దిష్టమైన వ్యక్తిని ధర్మకర్తగా నియమించకపోవటం వల్ల ధర్మనిధి నిరర్థకమవుతుందని భావించేవాడు. ఎక్కడ ధర్మనిధి స్థాపన స్పష్టంగా ఉంటే కేవలం ధర్మకర్త నియామకరం ఒదిలి వేయటం వల్ల సదరు నిధి నిరర్థకం కాదు. ఎందుకంటే ధర్మకర్త లేనంత మాత్రాన

సమతా ధర్మనిధిని విఫలం చేయదు. ఒకవేళ ధర్మకర్త పదవి ఖాళీ అయితే- రాజీనామా, మరణం- ధర్మనిధి విఫలం కాదు. అంతరాత్మ భావంతో మరొకరు ఎవరైనా తాత్కాలికంగా నిధి ధర్మకర్తగా నిష్క్రియాత్మకంగా వ్యవహరిస్తూ నూతన ధర్మకర్త నియామకం వరకు ధర్మనిధిని కొనసాగిస్తాడు.

3. ఆస్తికి సంబంధించిన అనిశ్చితత, లేదా లబ్ధిదారుని విషయంలో లేదా నిధి ప్రయోజనం సందర్భంలో అనిశ్చితత ప్రభావం వేరుగా ఉంటుంది.

   (i) ఆస్తిపరంగా ధర్మనిధి అనిశ్చితత వల్ల ప్రధానమైతే ధర్మనిధి వ్యర్థమవుతుంది. గుర్తించదగిన ఆస్తి లేకపోవటం వల్ల.వ్యాజ్యాన్ని నిర్వహించటానికి ఏమీ ఉండదు.

   (ii) లబ్ధిదారుని లేదా ప్రయోజనపరంగా ధర్మనిధి అనిశ్చితంగా ఉంటే సదరు నిధి చెల్లదు. లబ్ధిదారునిగా ఎవరి పేరు సూచించనందున ఎవరూ దానిని అమలుపరచటానికి ముందుకు రారు.

   (iii) ఎక్కడ ఆస్తిని అవసరమైనంత నిర్దిష్టంగా వర్ణించటం జరిగిందో, దాత పూర్తిగా నిర్దిష్టంగా చెప్పకపోయినప్పటికీ, ఉపయోగించిన పదాలు, పరిస్థితులు దానిని స్పష్టం చేస్తాయి. సంపద లక్ష్యం, లేదా దాత దానిని ఏవిధంగా ఉపయోగించాలో చెప్పినట్లుగా వ్యవహరించినపుడు అదే సమయంలో అతడు ధర్మకర్త లాభదాయకమైన ఆసక్తిని చూపించాలని అనుకోకపోయినప్పటికీ చట్ట ప్రకారం అది దాతకు లేదా అతని ప్రతినిధికి అనుకూలంగా ఉండాలి.

## II ధర్మనిధి ఆస్తి బదిలీకి అనుకూలంగా ఉండాలి

### 1. ఎటువంటి ఆస్తిని బదిలీ చేయటం సాధ్యం?

2. ఆస్తి బదలాయింపు చట్టంలోని విభాగం 6లో ఈ ప్రశ్నకు సమాధానం లభిస్తుంది.

3. బదిలీ చేయగలిగిన ఆస్తి ధర్మనిధి విషయం అవుతుంది.

4. ఆధారపడే ధర్మనిధి క్రింద లాభదాయక ఆసక్తి ఉన్న ధర్మనిధి ఉండదు. లబ్ధిదారుడు తన ఆసక్తితో మరోనిధిని ఏర్పాటు చేయలేడు. అతని ఆసక్తిని బదిలీ చేయవచ్చు కానీ అతడు మరో ధర్మనిధని ఏర్పాటు చేయలేడు.

5. ఇది ఇంగ్లీష్, భారత ధర్మనిధి చట్టాల మధ్య ఒక ముఖ్యమైన వ్యత్యాసం.

6. తనకు లభించే ఆస్తితో ఇంగ్లీష్‌చట్టం ప్రకారం లబ్ధిదారుడు ఒక నిధిని ఏర్పాటు చేయవచ్చు.

7. కారణం ఏమిటంటే భారత చట్టం ఆ నిధి విషయంలో చట్టపరమైన, సమత పరమైన ఆస్తుల మధ్య వ్యత్యాసాన్ని గుర్తించదు.

## విభాగం II- సక్రమంగా ఏర్పాటయి అమలు అవని ధర్మనిధి

I ఒక ధర్మనిధి సక్రమంగా ఏర్పడవచ్చు కానీ అమలు కాదు. అమలుపరచటానికి ఒక ధర్మనిధి రెండు షరతులను పూర్తి చెయ్యాలి.

(i) ధర్మనిధి లక్ష్యం చట్ట వ్యతిరేకమైంది కారాదు.

(ii) ధర్మనిధి ఏర్పాటుకు అవసరమైన అన్ని లాంఛనాలనూ పూర్తి చెయ్యాలి.

# ధర్మనిధి లక్ష్యాలు

## సెక్షన్ - 4

1. ధర్మనిధి లక్ష్యం చట్టబద్ధమై ఉండాలి.

**2. ఏవి చట్టబద్ధమైన లక్ష్యాలు?**

(1) ప్రయోజనం చట్టం నిషేధించింది కారాదు.

(2) అనుమతి ఇచ్చినట్లైతే ప్రయోజనం చట్టాన్ని వమ్ము చేసేది అయి ఉండరాదు.

**ఏవి చట్ట విరుద్ధమైన లక్ష్యాలు?**

(1) మోసంతో కూడిన ప్రయోజనం

(2) ఎదుటి వ్యక్తికి లేదా ఆస్తికి నష్టం కలిగించేది

(3) ప్రభుత్వ విధానానికీ లేదా నీతికి వ్యతిరేకమైన ప్రయోజనం

ఉదాహరణలు

(1) వేశ్యలుగా శిక్షణ పొందే స్త్రీల సంరక్షణకు ధర్మనిధి.

(2) లాభాపేక్షతో దొంగ వ్యాపారాన్ని నిర్వహించటానికి ఏర్పాటైన ధర్మనిధి.

(3) దివాలా తీసిన పరిస్థితుల్లో ఉన్న వ్యక్తి ఏర్పాటుచేసిన ధర్మనిధి- రుణ దాతలకు ఎగవేయటం.

(4) అక్రమ సంతతికి ధర్మనిధి.

(5) నిరవధిక కాలానికి ఏర్పాటైన నిధి.

(6) భవిష్యత్‌లో విడిపోయే భార్యాభర్త కోసం ఏర్పడిన ధర్మనిధి.

(3) స్థిరాస్తి ఉన్న ప్రదేశాన్ని బట్టి చట్టపరంగా ధర్మనిధి చట్టబద్ధమైందో కాదో నిర్ణయించటం సదరు చట్టం ప్రకారం జరుగుతుంది.

(4) చట్ట వ్యతిరేకమైన ధర్మనిధి చెల్లదు.

(5) రెండు ప్రయోజనాలు ధర్మనిధికి ఉన్నప్పుడు, వాటిలో ఒకటి చట్టబద్ధము, మరొకటి చట్ట విరుద్ధము అయినప్పుడు ఈ రెండు ప్రయోజనాలనూ విడదీయటంపై ధర్మనిధి చట్టబద్ధత ఆధారపడి ఉంటుంది. వాటిని విడదీయలేకపోతే నిధి చెల్లదు.

(6) చట్ట విరుద్ధమైన ధర్మనిధిని ఏర్పాటుచేసినప్పుడు ఏర్పడే పరిణామాలు

(i) ప్రయోజనం పొందగోరే లబ్దిదారునికి అనుకూలంగా న్యాయస్థానం చర్య తీసుకోదు.

(ii) ఏర్పాటుచేసిన వ్యక్తి సదరు ఆస్తిని తిరిగి పొందటానికి న్యాయస్థానం సహాయపడదు.

# సార్థక ధర్మనిధి ఏర్పాటుకు అవసరమైన లాంఛనాలు

## సెక్షన్ – 5

1. ధర్మనిధి స్థిరాస్తి లేదా చరాస్తులతో ఏర్పడవచ్చు. ఆస్తి స్థిరమైందా, చరమైందా అనే దానిపై ధర్మనిధి ఏర్పాటుకు సంబంధించిన లాంఛనాల్లో వ్యత్యాసం ఉంటుంది.

## 2. స్థిరాస్తి విషయంలో అనుసరించవలసిన లాంఛనాలు.

అవి రెండు రకాలు:-

(i) విలువయేతర పత్రంపై ధర్మనిధిని ఏర్పాటుచేసిన వ్యక్తి లేదా ధర్మకర్త సంతకం చెయ్యా[illegible]

(ii) ధర్మనిధిని ఏర్పాటుచేసిన వ్యక్తి వీలునామాను వ్రాయాలి.

## (3) చరాస్తితో ఏర్పడే ధర్మనిధికి కావలసిన లాంఛనాలు

అవి మూడు రకాలు:-

(i) వీలునామాయేతర పత్రాన్ని నిధిని ఏర్పాటుచేసే వ్యక్తి లేదా ధర్మకర్త సంతకం చేయటం.

(ii) ఏర్పాటుచేసే వ్యక్తి లేదా ధర్మకర్త వీలునామాపై సంతకం చేయటం

(iii) ధర్మకర్తకు ఆస్తి యాజమాన్యం బదిలీచేయటం ద్వారా

## (4) ప్రకటించటం మరియు నిధిని ఏర్పాటు చేయడంలో వ్యత్యాసం

(వ్రాత ప్రతిలో ఎటువంటి వివరణ లేదు - సం.)

## 5. ధర్మనిధి ఆస్తి బదిలీ

1. ధర్మనిధిని ఏర్పాటుచేసిన వ్యక్తి నిధికి అవసరమైన ఆస్తిని తన నుంచి వేరుచేసి నిధికి బదలాయించకపోతే ధర్మనిధి ఏర్పడదు.

(2) అయితే నిధి ఏర్పాటుచేసే వ్యక్తే ధర్మకర్త అయినప్పుడు పై అంశం వర్తించదు. అతడు చూపవలసిందేమిటంటే తాను ఏవిధంగా వ్యవహరించదలచుకుంది. (ఆస్తి విషయంలో)

(3) వీలునామా ద్వారా ఏర్పడిన ధర్మనిధికి ఇది వర్తించదు. వీలునామా అతని మరణానంతరం అమల్లోకి వస్తుంది. నిధిని ధర్మకర్తలు నిర్వహిస్తారు

## భాగం II

# ధర్మనిధి సార్థకమైంది కావచ్చు. దానిని రద్దు చేయలేకపోవచ్చు.

**1.** ఒక సార్థకమైన ధర్మనిధిని ఈ క్రింది కారణాల వల్ల రద్దు చేయవచ్చు:-

(a) ఏర్పాటు చేసిన వ్యక్తి లేదా అతని వారసులు ఈ క్రింది కారణాల వల్ల-

(i) కక్షిదారుల అసహాయత

(ii) ఏర్పాటుచేసిన వ్యక్తి తప్పిదం లేదా మోసం చేయటం వల్ల

(b) ఏర్పాటుచేసిన వ్యక్తి రుణదాతల బాకీలను తీర్చటంలో కాలయాపన చేయటానికి లేదా వాటిని ఎగ్గొట్టడానికి లేదా అది దీనిలో చట్టానికి వ్యతిరేకంగా ఉండటం వల్ల

(c) ధర్మనిధి ఆస్తి భూమి రూపంలో ఉంటే దానిని ఏర్పాటుచేసిన వ్యక్తి నుంచి ఎటువంటి నోటీస్ ఇవ్వకుండా కొనుగోలు చేయబోయే భవిష్యత్ కొనుగోలుదారులు; నిధిని ఏర్పాటుచేసిన వ్యక్తి కొనుగోలు దారు ప్రయోజనాన్ని దెబ్బతీయటం లక్ష్యంగా భావించినప్పటికీ.

## 1. ధర్మనిధి కక్షిదారుల అసహాయత ధర్మనిధి ఏర్పాటుచేసిన వ్యక్తి సమర్థత

(1) ధర్మనిధి ఏర్పాటుచేసిన వ్యక్తి ఒప్పందం చేసే సామర్థ్యం కలిగి ఉండాలి;-

(i) అతడు మేజర్ అయి ఉండాలి.

(ii) మతి స్థిమితం కలిగి ఉండాలి.

(2) ఇవి మైనర్‌ను నిధి ఏర్పాటు నుంచి నిరోధించినప్పటికీ, చట్టం సూచించిన షరతులను పూర్తి చేసినట్లైతే మైనర్ కూడా ధర్మనిధిని ఏర్పాటు చేయవచ్చు. ప్రారంభ విచారణాధికారం ఉన్న ప్రధాన సివిల్ న్యాయస్థానం అనుమతితో ఏర్పాటుచేయవచ్చు.

ప్రారంభ విచారణాధికారానికి ప్రధాన సివిల్ న్యాయస్థానం జిల్లా కోర్ట్ సివిల్ ప్రొసీజర్ కోడ్ ప్రకారం ఉంటుంది.

(3) ధర్మనిధి ఏర్పాటుచేసే వ్యక్తి సామర్థ్యం రెండు రకాలుగా పరిమితం అవుతుంది.

(i) ధర్మనిధికి ఇవ్వదలచుకున్న ఆస్తిని బదిలీ చేసేటట్లు ఉండాలి.

(ii) అమల్లో ఉన్న చట్టం అనుమతించిన మేరకే అతడు ఆస్తిని బదిలీచెయ్యగలడు. ఆస్తిని అమ్మలేని వ్యక్తి ఏర్పాటుచేసిన ధర్మనిధి చట్టపరంగా చెల్లదు.

(4) టి.పి చట్టంలోని విభాగంలో ఏ ఆస్తిని బదిలీ చేయవచ్చు, దేనిని బదిలీ చేయరాదో నిర్వచనం ఇచ్చింది.

(5) ఆస్తిని అమ్మటం, దానికి ఏమేరకు అటువంటి అధికారం ఉంటుంది అనేవి చట్టంపై ఆధారపడి ఉంటాయి.

## ఉదాహరణలు

(i) హిందూ కుటుంబ యజమాని వంశపారంపర్య ఆస్తిని అమ్మలేడు. అందువల్ల అతడు ధర్మనిధిని ఏర్పాటు చేయలేడు.

(ii) భర్త నుంచి సంక్రమించిన ఆస్తిని హిందూ వితంతువు అమ్మలేదు. జీవితకాలం వరకూ ఆమెకు ఆస్తిపై హక్కుంటుంది కాబట్టి, దానిని అమ్మి ఆమె నిధిని ఏర్పాటు చేయలేదు.

(iii) అప్పులు తీర్చి, ఖననం ఖర్చులు భరించిన తరువాత ముస్లిం మతస్తుడు మొత్తం ఆస్తిలో 1/3 వంతు కంటే విక్రయించలేడు. అందువల్ల ధర్మనిధికి అతడు 1/3 కంటే ఎక్కువ బదిలీ చేయలేడు.

# ధర్మకర్తగా ఉండటానికి సామర్థ్యం - అర్హత

## సెక్షన్ - 10

1. ఆస్తిని కలిగి ఉండటానికి అర్హత ఉన్న ప్రతి వ్యక్తి ధర్మకర్తగా వ్యవహరించవచ్చు.

2. ఆస్తిని ఎవరు కలిగి ఉండే సామర్థ్యం ఉన్న వారు?

జీవించే ప్రతివ్యక్తి ఆస్తిని కలిగి ఉండటానికీ, పొందటానికి అర్హుడే. అందువల్ల జీవించే ప్రతివ్యక్తీ - మైనర్ లేదా మతిస్థిమితంలేనివాడు కానీ - ధర్మకర్తగా వ్యవహరించవచ్చు.

(3) ఒడంబడికను చేసే సామర్థ్యం, ఆస్తిని కలిగి, దానిని సంపాదించే సామర్థ్యం మధ్య వ్యత్యాసం ఉంది. ప్రతి జీవికీ ఒప్పందం చేసుకొనే సామర్థ్యం ఉండదు కానీ ప్రతి వ్యక్తికీ ఆస్తిని కలిగి ఉండటం, దానిని సంపాదించుకోవటానికి సామర్థ్యం ఉంది.

(4) ఈ తేడా చాలా ముఖ్యమైంది. ఎందుకంటే ఒక వ్యక్తికి ఒప్పందం చేసుకునే అర్హత లేకపోవచ్చు. కానీ అతడు బ్రతికి ఉన్నంత కాలం ఆస్తిని కలిగి ఉండటానికీ, ఆస్తిని పొందటానికీ అర్హత కలిగి ఉంటాడు. భౌతికంగా మరణించకపోతే చట్టపరంగా మరణించకుండా ఉండాలి.
(1) ద్వీపాంతరం శిక్షకు గురైన వ్యక్తి చట్టపరంగా మరణించలేదు.

(7) మరొక వ్యత్యాసాన్ని గమనించవలసి ఉంది. సాధారణంగా ధర్మకర్తగా వ్యవహరించగల వ్యక్తి నిధి కార్యకలాపాలను కూడా నిర్వహించగలడు. అయితే విచక్షణను ఉపయోగించవలసిన ధర్మనిధి విషయంలో ధర్మకర్తగా వ్యవహరించగల వ్యక్తి ధర్మనిధి నిర్వహణకు సామర్థ్యం కలవాడు కానవసరంలేదు.

(8) విచక్షణను ఉపయోగించనవసరంలేని ధర్మనిధి విషయంలో ధర్మకర్తగా వ్యవహరించి అర్హత కలిగిన వ్యక్తి - ఆస్తిని పొంది, పొందటానికి అర్హత ఉన్నవాడు - నిధిని కూడా నిర్వహించవచ్చు.

(9) ఎక్కడ ధర్మనిధి నిర్వహణకు విచక్షణ అవసరం లేదో సదరు ధర్మకర్త ఒప్పందం కూడా చేసుకోవచ్చు.

# లబ్ధిదారునిగా ఉండటానికి అర్హత

## సెక్షన్ - 9

1. ఆస్తిని కలిగి ఉండటానికి అర్హత ఉన్న ప్రతి వ్యక్తీ లబ్ధిదారుడు కావచ్చు.
2. ధర్మకర్తకు అవసరమైన అర్హతే లబ్ధిదారునికి కూడా వర్తిస్తుంది.
3. అంటే జీవించే ప్రతివ్యక్తి లబ్ధిదారుడు కావచ్చు. అంటే జీవించే ప్రతివ్యక్తి ప్రయోజనం కోసం ధర్మనిధిని ఏర్పాటు చేయవచ్చు. లబ్ధిదారుడు ఒప్పందం చేసుకోగల సామర్థ్యం ఉన్న వ్యక్తి అయి ఉండనవసరంలేదు. ఈ సందర్భంలో అతడి హోదాను ధర్మకర్త విషయంలో వలె చట్టం క్రమబద్ధీకరిస్తుంది.

# ప్రకరణం III

# ప్రకటిత/ విస్పష్ట ధర్మనిధి రద్దు

**సెక్షన్ – 78**

(1) ధర్మనిధి ఏర్పాటు ఏవిధంగా జరిగింది అనే అంశంపై సదరు నిధి రద్దు ఆధారపడి ఉంటుంది.

**(i)** వీలునామా ప్రకారం ధర్మనిధి ఏర్పడి ఉంటె వీలునామాదారుడు తన ఇష్టానుసారం దానిని రద్దుచేయవచ్చు. ఎందుకంటే వీలునామా అతని మరణం వరకూ అమల్లోకి రాదు కాబట్టి. అది అమల్లోకి రావటానికి ముందే దానిని రద్దుచేయవచ్చు.

(2) వీలునామా ద్వారా కాకుండా ఇతరత్రా ధర్మనిధిని ఏర్పాటు చేసినట్లైతే దానిని ఈ క్రింది పరిస్థితుల్లోనే రద్దుచేయవచ్చు:-

**(i)** నిధిని ఏర్పాటుచేసిన వ్యక్తికీ దానిని రద్దుచేసే అధికారం స్పష్టంగా కేటాయించినప్పుడు.

(2) ఒప్పందం చేసుకొనే సామర్థ్యం ఉన్న లబ్ధిదారులందరూ అంగీకరిస్తే.

# ప్రకరణం IV

# ప్రకటిత ధర్మనిధి అంతరించటం

**సెక్షన్ – 77**

1. ఈ క్రింది సందర్భాల్లో ఒక ధర్మనిధి అంతరిస్తుంది.

**(i)** ప్రయోజనం పూర్తిగా నెరవేరినప్పుడు

**(ii)** ప్రయోజనం చట్టవిరుద్ధమైనప్పుడు

**(iii)** ప్రయోజనం నెరవేరటం అసాధ్యమైనప్పుడు

(iv) రద్దు అయ్యే నిధిని స్పష్టంగా రద్దుచేసినప్పుడు

(v) ఒక్క లబ్ధిదారుడే ఉండి లేదా అనేక లబ్ధిదారులున్నప్పుడు వారందరూ మైనర్లు కానప్పుడ వారి సమ్మతితో ఏర్పాటుచేసిన వ్యక్తి ఆశయంతో సంబంధం లేకుండా సదరు ధర్మనిధిని రద్దుచేయవచ్చు

## (2) ఒప్పందం రద్దుకు వర్తించే అంశాలే ధర్మనిధి రద్దుకు కూడా వర్తిస్తాయి.

(1) అయితే రెండు ప్రశ్నలను పరిశీలించవలసి ఉంటుంది.

(i) ఎప్పుడు ధర్మనిధి పాలనకు తయారవుతుంది?

(ii) ధర్మకర్త, లబ్ధిదారుడు ధర్మనిధిలో ఎటువంటి ఆస్తిని కలిగి ఉంటారు?

2. ధర్మనిధి పాలనకు ముందు ఈ ప్రశ్నలు సాధారణమైనవి.

1. ధర్మనిధి పనిచేయటం ఎప్పటినుంచి ప్రారంభమవుతుంది?

ధర్మకర్త, లబ్ధిదారుడు దానిని అంగీకరించిన వెంటనే నిధి పనిచేయటం ప్రారంభమవుతుంది

## I. హక్కును వదులుకోవటం మరియు నిధిని అంగీకరించటం

అంగీకారం నిబంధన 34 = విభాగం 10

1. ధర్మనిధి ఏర్పాటుదారుడు ఒక వ్యక్తిని ధర్మకర్తగా నియమించినప్పటికీ, సదరు వ్యక్తి ఆ నియామకాన్ని అంగీకరించనవసరంలేదు.

2. నియమించబడిన వ్యక్తి పదవిని అంగీకరించవచ్చు లేదా తిరస్కరించవచ్చు.

## ఉదాహరణలు

Dకు ధర్మకర్తలుగా B, Cలకు A కొంత ఆస్తిని ఇస్తాడు. B, Cలు A వీలునామాను రుజువు చేస్తారు B, Cలు ధర్మకర్తలు ఉండటానికి అంగీకరించారా అనే వివాదంలో వారు వీలునామాను రుజువు చేయటమే. సదరు చర్య ద్వారా ధర్మకర్తలుగా వ్యవహరించటానికి అంగీకారం తెలిపినట్లే అని నిర్ణయించటం జరిగింది.

## 4. ప్రవర్తన ద్వారా అంగీకరించటం అనే అంశానికి ఇతర ఉదాహరణలు

(i) అనుమతించటం ద్వారా అంగీకారం - నిధి ఆస్తిని తన పేరిట తీసుకురావడం

(ii) ఆస్తిని నిర్వహించటం ద్వారా - అమ్మకానికి ప్రకటన, లేదా కొనటానికి ప్రకటన - అంగీకరించటం.

(iii) ఆస్తి వ్యవహారాలను నిర్వహించటం ద్వారా అంగీకరించటం.

(iv) నియామకం నోటీస్ అందినప్పటి నుంచీ మౌనంగా ఉండటం ద్వారా అంగీకరించటం.

(v) ధర్మనిధిలో ఒక భాగాన్ని అంగీకరిస్తే మొత్తం అంగీకరించినట్లే - అందులో కొంతను తిరస్కరిస్తున్నట్లు ప్రకటించినప్పటికీ,

(5) పదవిని అంగీకరించటానికి ఇష్టం లేని వ్యక్తి ఏవిధంగా తన అనంగీకారాన్ని ప్రకటిస్తాడో చట్టం చెప్పటం లేదు. సహేతుకమైన సమయం లోపల ఆ పని చెయ్యాలని మాత్రమే చట్టం అంటున్నది.

6. చట్టం ఈ విషయంలో మౌనంగా ఉన్నప్పటికీ న్యాయనిర్ణయాలు తిరస్కరించటం విషయాన్ని ఈ విధంగా నిర్ధార పరిచాయి:-

(i) అంగీకరించటానికి ముందు తిరస్కరించటం జరగాలి. ఒకసారి ధర్మకర్త అంగీకరించిన తర్వాత విభాగం 46 సూచించిన సందర్భాల్లోనే తిరస్కరించాలి.

(ii) ఏర్పాటుచేసిన వ్యక్తి జీవితకాలంలో నిధి నిర్వహణకు అంగీకరించిన వ్యక్తి ధర్మకర్తృత్వం నుంచి తప్పుకోవచ్చు.

(iii) ధర్మనిధిలో కొంత భాగంగా ధర్మకర్త పదవిని తిరస్కరించి, మిగతా దానిని అంగీకరించటం సాధ్యంకాదు.

(iv) చర్య/ ప్రవర్తన ద్వారా లేదా లిఖితపూర్వకంగా వదులుకోవచ్చు.

## వదులుకోవటం వల్ల ఏర్పడే పరిణామాలు

(i) ఒకే ఒక ధర్మకర్త ఉంటే పదవిని వదులుకొనే వ్యక్తి నిధి ఆస్తి అతనికి దఖలు కాకుండా నిరోధించవచ్చు.

(ii) మరో ఇద్దరు ధర్మకర్తలుంటే, వారిలో ఒకరు పదవిని వదలుకొంటే మిగతా వారికి సదరు ఆస్తిని నిర్వహించే అధికారం లభిస్తుంది.

## (8) ఒకే ధర్మకర్త ఉండి అతడు పదవిని వదలుకుంటే ఏమవుతుంది?

రెండు సంభవించవచ్చు.

(i) సెక్షన్ 73 క్రింద కొత్త ధర్మకర్తను నియమించవచ్చు.

(a) ధర్మనిధితో పేర్కొన్న వ్యక్తిద్వారా

(b) అలా ఎవరూ లేకపోతే జీవించి ఉన్న ధర్మనిధి ఏర్పాటుదారుడు మరియు ఒప్పందం చేయగల సామర్థ్యం ఉన్నవాడు.

(ii) రాజీనామా చేసిన ఏకైక ధర్మకర్త స్థానంలో మరొకరు నియమించబడనప్పుడు ధర్మనిధి ఆస్తిదానిని ఏర్పాటు చేసిన వ్యక్తి లేదా అతని ప్రతినిధికి తిరిగి చెందుతుంది.

9. ఆస్తి ఏమవుతుంది? అది ధర్మనిధి నుంచి విముక్తి అవుతుందా? అది ధర్మనిధి పాలన క్రింద ఉంటుందా?

సమాధానం ఏమిటంటే ధర్మనిధిని అంతరింపచేయలేము. దానిని ఏర్పాటు చేసిన వ్యక్తి లేదా అతడు మరణిస్తే అతని ప్రతినిధి లబ్దిదారుని ప్రయోజనం కోసం నిధిని నిర్వహించాలి. మరో మాటలో చెప్పాలంటే ధర్మకర్త రాజీనామాతో దాత లేదా అతని ప్రతినిధి ధర్మకర్త అవుతాడు.

ధర్మకర్త లేనంత మాత్రాన్న ధర్మనిధి అంతరించదని చట్టం చెపుతున్నది. ధర్మకర్త కాకుండా ధర్మనిధి ఎక్కడ ఉన్నా సదరు నిధిని దాని దాత ధర్మకర్తగా నిర్వహిస్తారు. నియమం లబ్దిదారుని ఆసక్తిని కాపాడుంది. Mallot Vs. Wilson (1903) 2 Ch. 494

## II. లబ్దిదారుడు అంగీకరించటం లేదా తిరస్కరించటం
## సెక్షన్ - 9

1. లబ్దిదారుడు ధర్మనిధిని అంగీకరించవలసిన అవసరం లేదు. అతడు అంగీకరించవచ్చు లేదా నిరాకరించవచ్చు.

2. ధర్మనిధికి కింద తన ఆసక్తిని వదులుకొనేటట్లు అతని తిరస్కారణ సూచిస్తుంది.

3. వదులుకోవాలనుకొంటే అతడు రెండు పద్ధతులను అనుసరించవచ్చు:-

(i) ధర్మకర్తకు తన తిరస్కారణను తెలియజేయడం.

(ii) ధర్మనిధికి తెలిసినట్లుగానే అమలుకాలేని లేదా అసంగత హక్కును కోరటం.

(4) అసంగత హక్కు అంటే ధర్మనిధి ఆస్తికి హక్కును కోరటం.

(4) లబ్ధిదారుడు వదులుకొంటే ధర్మనిధి ఏమవుతుంది?

III ధర్మనిధి క్రింద ధర్మకర్త ఆస్తి (పుట ఖాళీగా ఉంది)

IV ధర్మనిధి క్రింద లబ్ధిదారుని ఆస్తి (పుట ఖాళీగా ఉంది)

## భాగం - III

# ధర్మనిధి నిర్వహణ

ధర్మనిధి నిర్వహణ విషయంలో ధర్మకర్తకు కొన్ని-

(i) విధులు - సెక్షన్లు 12-20

(ii) బాధ్యతలు - సెక్షన్లు 23-30

(iii) హక్కులు - సెక్షన్లు 31-36

(iv) అధికారాలు - సెక్షన్లు 37-45

(v) పరిమితులు - సెక్షన్లు 46-54

అదేవిధంగా లబ్ధిదారునికి కూడా కొన్ని-

(i) హక్కులు - సెక్షన్లు 55-67

(ii) పరిమితులు - సెక్షన్ 68

# 1. ధర్మకర్త విధులు

## సెక్షన్లు 12-20

V (2) ధర్మనిధిలో ఉన్న నిర్దేశాలను విధిగా అనుసరించటం

IV (3) లబ్ధిదారుల విషయంలో నిష్పాక్షికంగా వ్యవహరించటం

IV (4) వృధా ఆస్తిని విక్రయించటం

V (5) ఆదాయ వ్యవహారాల నిర్వహణకు వ్యయం చేయటం

IV (6) అవసరమైన జాగ్రత్తను తీసుకోవటం

(IV) (7) ధర్మనిధి నిధులను మదుపుచేయటం

(V) (8) సరైన వ్యక్తులకు ధర్మనిధి పైకాన్ని చెల్లించటం

(* ప్రతి పుటలో శీర్షిక మాత్రమే ఉంది కానీ వివరాలు లేవు సం.)

IV (9) అధికారాలను - విధులను నియోజించటం

IV (10) ఒకటికంటే ఎక్కువ ధర్మకర్తలు ఉన్నప్పుడు సంయుక్తంగా వ్యవహరించటం

* VI (11) జస్ టెర్షి (Jus Tertii)ని ఏర్పాటు చేయటం

* IV (12) ప్రతిఫలం ఆశించకుండా వ్యవహరించటం

* IV (13) ధర్మనిధి ఆస్తి విషయంలో అక్రమంగా వ్యవహరించకుండా ఉండటం

* IV (14) అన్ని లెక్కలనూ సిద్ధంగా ఉంచటం

## V ధర్మకర్తల అధికారాలు

## సెక్షన్లు 37-45

V. ధర్మకర్త అధికారాలు

* V (1) ధర్మకర్త సాధారణాధికారాలు

* V (2) ధర్మనిధి ఆస్తిని విక్రయించటానికి లేదా తనఖా పెట్టటానికి అధికారం

* V (3) విక్రయానికి సంబంధించిన అధికారం

* V (4) రసీదులను ఇచ్చే అధికారం

* V (5) వివాదాలను పరిష్కరించే అధికారం

* V (6) శిశువులకు సంరక్షణ ఖర్చును మంజూరు చేయటం

* V (7) లబ్ధిదారుని ఖర్చును చెల్లించడం

* V (8) పాలనా చర్య ద్వారా ధర్మకర్త అధికారాన్ని తాత్కాలికంగా రద్దుచేయటం

VI లబ్ధిదారుల అధికారాలు

* VI (1) ఏకైక లబ్ధిదారుని అధికారం

* VI (2) అనేక లబ్ధిదారుల్లో ఒక్కని అధికారం

## 25. తనకు ముందున్న ధర్మకర్త ధర్మనిధికి సంబంధించి అక్రమాలు చేస్తే దానికి నూతన ధర్మకర్త బాధ్యత వహించాలా?

* శీర్షిక తప్ప వివరాలు లేవు - సం.

## 26. సహ ధర్మకర్త అక్రమాలు చేసే దానికి ధర్మకర్త బాధ్యుడా?

ఈ క్రింది సందర్భాల్లో తప్ప అతనికి బాధ్యతలేదు.

(i) సరిగా అమలు జరుగుతుందా ఆలోచన చేయకుండా ధర్మకర్త ధర్మనిధి ఆస్తిని సహకర్తకు లభ్యం చేసినప్పుడు

(ii) ఎక్కడ ధర్మకర్త సహధర్మకర్తను ధర్మనిధి ఆస్తిని వశం చేసుకోటానికి అంగీకరించి, అది అతడు ఏవిధంగా ఉపయోగిస్తున్నాడో కనుక్కోకుండా, దానిని అతడు అవసరమైన సమయానికంటే ఎక్కువకాలం తన అధీనంలో అట్టేపెట్టుకొన్నప్పుడు.

(iii) ఎప్పుడు అతడు సహ ధర్మకర్త అక్రమాలకు పాల్పడ్డాడని తెలిసి, దానిని దాచి సదరు ఆస్తి రక్షణకు ఎటువంటి చర్య తీసుకోనప్పుడు.

## 27. సహధర్మకర్తలు అక్రమాలను కలిసి చేసినప్పుడు

ప్రతి అక్రమానికి బాధ్యత ఏమిటి? మొత్తానికి బాధ్యత వహించవమా?

ప్రతివారూ లబ్ధిదారునికి మొత్తానికి అందరూ బాధ్యత వహించాలి. మిగతావాళ్ళు కూడా తమవంతు బాధ్యత వహిస్తారు.

**28. లబ్ధిదారుడు కాకుండా లబ్ధిదారునికి ఆసక్తి లేని మరొకరికి సొమ్ము చెల్లించినప్పుడు ధర్మకర్త చర్యకు బాధ్యత.**

ధర్మకర్త ఈ క్రింది సందర్భాల్లో బాధ్యత వహించాలి

**(i)** మరొకరిలో ప్రయోజనం నిక్షిప్తం అయిందని ధర్మకర్తకు వర్తమానం లేనప్పుడు.

**(ii)** సొమ్మును పొందిన వ్యక్తి సదరు సొమ్మును పొందటానికి హక్కును కలిగి ఉన్నప్పుడు.

## XIII ధర్మకర్తలకు రక్షణ

* (1) సాధారణ రక్షణ

* **XIII** (2) చట్టపరిమితి

* **XIII** (3) సమ్మతి, లేదా మినహాయింపు లేదా లబ్ధిదారుడు విడుదల చేయింటం

* **XIII** (4) సహ ధర్మకర్తల చర్యల నుంచి రక్షణ

* **XIII** (5) సహ దర్మకర్తల మధ్య హక్కులు, బాధ్యతలు

* **XIV** మూడవ కక్షిదారులు, లబ్ధిదారుల బాధ్యతలు

* **XIV** (1) అక్రమాలకు బాధ్యులైన మూడవ పక్షంవారు, లబ్ధిదారులు

* **XIV** (2) మూడవ పక్షం వారికి అందే ధర్మనిధి ఆస్తి

* ఈ పుటలో శీర్షికలేకానీ వివరాలు లేవు. సం.

## భాగం - IV

# సంభావ్య ధర్మనిధులు

1. ధర్మనిధి చట్టంలో 14 సంభావ్య ధర్మనిధులను పేర్కొనటం జరిగింది.

2. అవి కారకాలుగా ఉన్నాయి:-

(1) బదలీల ద్వారా ఏర్పడే సంభావ్య ధర్మనిధులు - విభాగాలు 81, 82, 84, 85

(2) ఇతరులపై ఒక వ్యక్తి అక్రమంగా ప్రయోజనాన్ని పొందితే ఏర్పడే సంభావ్య ధర్మనిధులు - సెక్షన్లు 85, 88, 89, 90, 93

(3) ఒప్పందం వల్ల ఏర్పడే సంభావ్య ధర్మనిధులు - సెక్షన్లు 86, 91, 92

(4) రెండు వ్యక్తిత్వాలు ఒక వ్యక్తిలో మిళితం అవటం వల్ల ఏర్పడే సంభావ్య ధర్మనిధులు - సెక్షన్ 87

(5) గతంలోని ధర్మనిధి వల్ల ఏర్పడే ధర్మనిధి - సెక్షన్ 83

## (1) బదలీ లేదా బహుమతిగా సంక్రమించిన ఆస్తి

### (i) సెక్షన్ 81

1. కొన్ని సందర్భాల్లో బదలీ లేదా బహుమతి ద్వారా సంక్రమించిన ఆస్తి సదరు లబ్ధిదారునిపై కొన్ని బాధ్యతలను విధిస్తుంది. అది నిధి ఏర్పాటు దాత లేదా అతని ప్రతినిధికి అనుకూలంగా పరము చెయ్యాలని కోరవచ్చు. సాధారణంగా ఆస్తి బదలీ అయిన ఎటువంటి షరతులు లేకుండా ఆస్తిని సంపూర్ణంగా స్వాధీనం చేసుకొంటాడు.

2. బాధ్యతతో ఆస్తిని స్వీకరించాలని ఎప్పుడు చెప్పటం జరుగుతుంది? బదలీ చేయబడిన వ్యక్తికి బదలీ చేసిన వ్యక్తి ఎటువంటి లాభాపేక్షను కల్పించటానికి ఉద్దేశించనప్పుడు సదరు బాధ్యత బదలీ చేయబడిన వ్యక్తిపై ఉంటుంది.

3. ఉద్దేశాన్ని ఏవిధంగా నిర్ధారించటం జరుగుతుంది? యజమాని ఉద్దేశాన్ని గ్రహించాలంటే దానికి సంబంధించిన పరిస్థితులను పరిశీలించాలి.

### (iii) సెక్షన్ 82

1. రెండవ సందర్భంలో బదలీ చేయబడిన వ్యక్తిని ఒక ధర్మనిధి ఏర్పాటు చేయటం బాధ్యత అవుతుంది. బదలీ ఒకరికి జరిగి దాని మూల్యం మరొకరికి చెల్లించినప్పుడు బదలీ చేయబడిన వ్యక్తి సొమ్ము చెల్లించిన వ్యక్తి తరఫున ఆస్తిని భద్రపరచాలి.

### (ii) సెక్షన్ 82

1 రెండవ సందర్భంలో ఆస్తి బదిలీ చేయబడిన వ్యక్తిపై ఒక బాధ్యత మోపుతుంది. అది

ధర్మనిధి రూపంలో ఉంటుంది. ఎందుకంటే ఆస్తి ఒకరికి బదలీ అయితే దాని సొమ్ము మరొకరు చెల్లించరు కాబట్టి. ఇక్కడ డబ్బు చెల్లించిన వ్యక్తి తరపున ఆస్తి బదలీ అయిన వ్యక్తి ధర్మకర్తగా వ్యవహరిస్తాడు.

సాధారణంగా చట్టం దృష్టిలో బదలీ అయిన వ్యక్తి ఆస్తికి యజమాని. ఎందుకంటే అతని పేరిట ఆస్తి బదలీ అయింది కాబట్టి.

2. ఒక సందర్భంలో మినహాయించి ఒకరు డబ్బు చెల్లిస్తే మరొకరి పేరిట ఆస్తి బదలీ అయ్యే నియమం సాధారణంగా వర్తిస్తుంది.

## 3. మినహాయింపు

బదలీ చేయబడిన వ్యక్తికి లాభం చేకూర్చాలన్న ఉద్దేశం ఆస్తి కొనుగోలుదారునికి ఉంటే ఈ నియమం వర్తించదు.

## 4. ఉద్దేశానికి రుజువు

(iii) చట్టవిరుద్ధ ప్రయోజనానికి బదలీ.

## సెక్షన్ 84

1. సాధారణంగా బదలీ చట్టవిరుద్ధ ప్రయోజనం కోసం అయితే న్యాయస్థానం బదలీ చేయబడిన వ్యక్తికి సహాయపడదు. అలాగే బదలీ చేసిన వ్యక్తికి సదరు ఆస్తిని తిరిగి సహాయపడటానికి అంగీకరించదు.
2. అయితే ఈ నియమం అన్ని సందర్భాల్లోనూ వర్తించదు. కొన్ని పరిస్థితుల్లో ఈ నియమం వర్తించదు.
3. ఈ నియమం వర్తించనటువంటి పరిస్థితులు ఏవి?

ఈ నియమం అనువర్తించని పరిస్థితులు:-

(i) ప్రయోజనం అమలుపరచనప్పుడు

(ii) బదలీ చేసిన వ్యక్తి బదలీ చేయబడిన వ్యక్తి అంత తప్పు చేయకపోతే

(iii) చట్టం నిబంధనలను దెబ్బతీసే విధంగా బదలీ చేయబడిన వ్యక్తి ఆస్తిని తన స్వాధీనతలో అట్టేపెట్టుకొంటే.

4. ఈ సందర్భాల్లో న్యాయస్థానం బదలీ చేయబడిన వ్యక్తి బదలీ చేసిన వ్యక్తి ఆస్తిని అతని ప్రయోజనం కోసం నిర్వహించమని ఆదేశిస్తుంది.

(iv) చట్ట విరుద్ధ ప్రయోజనం కోసం ఆస్తిని ధర్మనిధికి కల్పించటం

## సెక్షన్ 85

1. చట్ట వ్యతిరేక ప్రయోజనం కోసం ధర్మనిధిని ఏర్పాటు చేసినప్పుడు వర్తించేది అక్రమ ప్రయోజనాల కోసం చేసే బదలీలకు కూడా వర్తిస్తుంది.

2. అంటే న్యాయస్థానం ధర్మనిధిని లబ్ధిదారుల ప్రయోజనం కోసం అమలుపరచదు. నిధిని ఏర్పాటు చేసిన వ్యక్తికి సదరు సొమ్మును రాబట్టుకోటానికి సహాయపడదు.

9 బొంబాయి S.R. 542

3. ప్రయోజనం చట్టవిరుద్ధమైనప్పటికీ సెక్షన్ 85 ధర్మనిధిని గుర్తిస్తుంది. ధర్మనిధి చట్టం విభాగంలో చెప్పిన సాధారణ నియమానికి ఇది భిన్నంగా ఉంది. అందువల్ల కొంత వివరణ అవసరం.

4. చట్ట విరుద్ధ ధర్మనిధికి వర్తించే సాధారణ నియమాలు, దాని కక్షిదారుల హక్కులు వాటికి సంబంధించిన కొన్ని మినహాయింపులు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

I. ఎక్కడ ధర్మనిధి చట్ట వ్యతిరేక, మోసపూరిత ప్రయోజనానికి ఏర్పడుతుందో న్యాయస్థానం దాని లబ్ధిదారుల ప్రయోజనాలకు సదరు నిధిని అమలుపరచదు. అలాగే నిధిని ఏర్పాటు చేసిన వ్యక్తికి సదరు సొమ్మును తిరిగి పొందటానికి సహాయపడదు. (ఒక్క విషయంలో మినహాయించి)

ప్రశ్న:- లబ్ధిదారునికి అమలుపరచటానికి ఎందుకు అనుమతి లేదు?

సమాధానం: ఎందుకంటే అది చట్టవిరుద్ధ ప్రయోజనానికి దారితీస్తుంది కాబట్టి.

ప్రశ్న:- నిధిని ఏర్పాటుచేసిన వ్యక్తికి సదరు సొమ్మును తిరిగి పొందటానికి ఎందుకు వీలుకల్పించటం లేదు?

సమాధానం: ఎందుకంటే తాను చేసిన మోసం నుంచి అతడు ప్రయోజనం పొందకూడదు కాబట్టి.

II. నిధిని ఏర్పాటు చేయటం అక్రమ ప్రయోజనం కోసమే అయినప్పటికీ సదరు ప్రయోజనం సాఫల్యం చెందలేదు కాబట్టి అటువంటి సందర్భంలో నిధిని ఏర్పాటు చేసిన వ్యక్తికి సదరు మొత్తాన్ని తిరిగి పొందటానికి అనుమతి లభిస్తుంది.

ప్రశ్న :- ఈ మినహాయింపు ఎందువల్ల?

**సమాధానం** : దానికి రెండు కారణాలున్నాయి;-

(i) ప్రయోజనం చట్ట వ్యతిరేకమైంది కాబట్టి ధర్మనిధి ఏర్పాటు కాదు - అది చెల్లదు.

(ii) ధర్మకర్త ఎటువంటి మొత్తం చెల్లించలేదు కాబట్టి నిధిని అతడు అట్టిపెట్టుకోటానికి హక్కులేదు. అతడు నిధి ఆస్తిపై ఎటువంటి లాభదాయక హక్కును కలిగి ఉండడు. అందువల్ల అది దానిని ఏర్పాటు చేసిన వ్యక్తికి అది చెందుతుంది.

III. నిధి ఏర్పాటుదారుడికి వర్తించే పరిమితులు అతని ప్రతినిధికి వర్తించవు.

ప్రశ్న :- ఎందుకు?

**సమాధానం**: ఎందుకంటే అతడు ఒప్పందానికి పక్షం కాడు.

5. ఎందుకు సెక్షన్ 85 ఒక నిధిని చట్టపరమైన ప్రతినిధులకు అనుకూలంగా గుర్తిస్తుందంటే వారు అమాయకులు కాబట్టి వారికి చట్టవిరుద్ధ ధర్మనిధి ఏర్పాటు గురించి తెలియదు కాబట్టి.

## (2) అక్రమ అవకాశం ద్వారా ఏర్పడే ధర్మనిధులు

### సెక్షన్ 85

1. ఒక వ్యక్తి తన జీవితకాలంలో వీలునామా ద్వారా ఏర్పాటుచేసిన ధర్మనిధిని అతడు రద్దుచెయ్యాలనుకొన్నప్పుడు అతడిని నిర్బంధం ద్వారా సదరు రద్దును నిరోధించటం వల్ల మొదటి వివాదం ఈ విభాగం క్రింద ఉత్పన్నమవుతుంది.

2. అటువంటి పరిస్థితుల్లో ఏర్పాటుదారుడు స్వప్రయోజనం కోసం కాకుండా చట్టపరమైన ప్రతినిధుల ప్రయోజనం కోసం నిధికి ధర్మకర్తగా ఉంటాడు.

3. కారణం ఏమిటంటే అక్రమ పద్ధతుల ద్వారా అక్రమ అవకాశాన్ని విధికర్త తీసుకొన్నాడు. అందువల్ల అటువంటి ప్రయోజనాన్ని పొందటానికి అతడికి అనుమతి లభించదు.

## II సెక్షన్ 88

1. మరో వ్యక్తితో ఉన్న సంబంధం వల్ల ఏ వ్యక్తికైనా అతడి ప్రయోజనాన్ని కాపాడవలసిన బాధ్యత అతడికి ఉంటుంది. దీనినుంచి రెండవ వివాదం ఉత్పన్నమవుతుంది.

2. దీనిక్రింద వచ్చే వ్యక్తులు:-

(i) ఏజెంట్, అతడి యజమాని

(ii) సంస్థలో భాగస్వాములు

(iii) సంరక్షకుడు, మైనర్

(iv) ధర్మకర్త - లబ్ధిదారుడు

(v) అమలుపరిచే వ్యక్తి - కర్త

3. ఈ సెక్షన్ ఈవిధంగా చెబుతున్నది:-

(i) దాత ద్వారా ధనపరమైన ప్రయోజనాన్ని పొందే ఏ వ్యక్తి అయినా

(ii) అటువంటి పరిస్థితుల్లో ఒక వ్యక్తి తనకు నష్టం కలిగినప్పటికీ తాను ఒప్పందం చేసుకున్న వ్యక్తి ఆసక్తులను అతడు కాపాడాలి కాబట్టి. అప్పుడు తనకోసం లాభం అతడు పొందవచ్చు.

**అప్పుడు**

అతడు ఎవరి ప్రయోజనాన్ని కాపాడవలసి ఉంటుందో అతడికోసం లాభదాయకమైన ప్రయోజనాన్ని కలిగి ఉండాలి.

**4. ఉదాహరణలు**

(i) తన సంస్థకు చెందిన నిధులతో ఒక భాగస్వామి తన పేరుమీద భూమిని కొంటాడు. సదరు భూమిని భాగస్వాముల ప్రయోజనం కోసం ఉంచాలి.

(ii) సహధర్మకర్త ఇచ్చిన లంచం స్వీకరించి ఒక ధర్మకర్త ధర్మనిధి నుంచి విరమించుకొంటాడు. ధర్మకర్త సదరు మొత్తాన్ని ధర్మకర్త ప్రయోజనం కోసం ఉంచాలి.

(iii) A, B నుంచి కొంత ఆస్తిని లీజుకు తీసుకోమని ఒక ఏజెంట్‌ను నియమిస్తాడు. ఏజెంట్ సదరు లీజును తనకోసం తీసుకొంటాడు. దానిని అతడు B ప్రయోజనం కోసం ఉంచుకోవాలి.

(iv) ఒక మైనర్ ఆస్తి తాలుకు అప్పులను సంరక్షకుడు చాలా తక్కువ నిలువచేసి కొంటాడు. అతడు మైనర్ నుంచి తాను కొన్న మొత్తాన్ని మాత్రమే తీసుకోవాలి.

## III సెక్షన్ 89

1. అవాంఛనీయ ప్రభావాన్ని చూపించి ఒక వ్యక్తి మరొకరిపై ప్రయోజనాన్ని పొందే సందర్భంలో మూడవ వివాదం తలెత్తుతుంది.

2. దీనిని గురించి సెక్షన్ 89 చెబుతున్నది. ఎవరైతే అవాంఛనీయ ప్రభావం వల్ల నష్టపోతాడో అతడి ప్రయోజనం కోసం ఉంచవలసిన అవసరాన్ని ఈ సెక్షన్ వివరిస్తున్నది.

3. ఇది రెండు పరిమితులకు లోబడి ఉంటుంది:-

   (i) ఎటువంటి మొత్తం చెల్లించకుండా ప్రయోజనాన్ని పొంది ఉండాలి.

   (ii) అవాంఛనీయ ప్రభావం వల్ల ప్రయోజనం పొందినట్లు వ్యక్తికి నోటీస్ జారీఅయి ఉండాలి.

## IV. సెక్షన్ 90

1. ఆస్తిలో ఆసక్తి ఉన్న ఇతర వ్యక్తుల ప్రయోజనాలకు భిన్నంగా ఒక అర్హుడైన వ్యక్తి తన ప్రయోజనానికి అవసరాన్ని వినియోగించు కొన్నప్పుడు నాలుగో వివాదం తలెత్తుతుంది.

2. దీనిని గురించి సెక్షన్ 90 చెబుతున్నది. అటువంటి ప్రయోజనం పొందిన వ్యక్తి తనకోసం మాత్రమే కాకుండా ఇతరుల లాభం కోసం కూడా ఆస్తిని వినియోగించాలని ఈ సెక్షన్ పేర్కొంది.

3. దీనికి రెండు పరిమితులున్నాయి:-

   (i) అటువంటి ప్రయోజనాన్ని పొందటంలో అయిన ఖర్చును మిగతావారు కూడా భరించాలి.

(ii) అటువంటి ప్రయోజనాన్ని పొందనున్న ఇతర వ్యక్తులు దానికి సంబంధించిన అప్పులను కూడా లాభాల్లోవలె అనుపాతంగా భరించాలి.

4. సహ అద్దెదారులు, అవిభక్త కుటుంబ సభ్యులు, తాకట్టుదారులు మొదలైన వారి వివాదాలను వివరించడమయింది.

. సెక్షన్ 93

1. రహస్యంగా ఒక రుణదాత సంపాదించిన ప్రయోజనానికి సంబంధించినది ఐదవ వివాదం.

2. రుణదాతకు బాకీదారుడు పూర్తి మొత్తాన్ని చెల్లించలేకపోయినప్పుడు, అందులో కొంత భాగమే చెల్లించినప్పుడు సాధారణంగా ఇటువంటి వివాదం ఉత్పన్నమవుతుంది.

3. రుణదాతల్లో ఒకరు ఇతరులకు తెలియకుండా బాకీదారునితో శ్రేష్టమైన షరతులతో ప్రయోజనాన్ని పొందినప్పుడు సదరు ప్రయోజనం ఇతర రుణదాతలకు నష్టం కలిగే విధంగా అతడు పొందటానికి హక్కు లేదు.

4. పొందిన ప్రయోజనం విషయంలో అతడిని ఇతర రుణదాతల విషయంలో ధర్మకర్తగా చట్టం భావిస్తుంది.

## 3) ఒప్పందం ద్వారా ఏర్పడే సంభావ్య ధర్మనిధులు

### సెక్షన్ 86

1. ఆస్తి బదలాయింపునకు జరిగిన ఒప్పందం ఈ సెక్షన్ క్రింద వచ్చిన మొదటి వివాదం.

2. ఇది సెక్షన్ 86 క్రిందకు వస్తుంది. ఆస్తి బదలాయింపుకు సంబంధించిన ఒప్పందం గురించి ఈ విభాగం చెబుతుంది. ఒప్పందం స్వభావం ఎటువంటిదంటే అది-

(i) దానిని తగ్గించవచ్చు; లేదా

(ii) మోసం లేదా దగా ద్వారా ప్రభావితం చేయవచ్చు.

(3) అటువంటి ఒప్పందం క్రింద బదలీ చేయబడిన వ్యక్తి బదలీ చేసిన వ్యక్తి లాభం కోసం ఆస్తిని నిర్వహిస్తాడు.

4. ఇటువంటి బాధ్యత కొన్ని పరిస్థితుల్లోనే ఉత్పన్నమవుతుందే కానీ నిరపేక్షమైంది కాదు:-

(i) బాధ్యత ఎప్పుడు ఏర్పడుతుందంటే అతనికి బదలీదారుని వద్ద నుంచి, సదరు ఒప్పందం మోసపూరితమైనది లేదా దగా లేదా పొరపాటు వల్ల దానిని పరిమితం చేయటమవుతుంది అని నోటీస్ వచ్చినప్పుడు.

(ii) వాస్తవంలో బదలీదారుడు చెల్లించిన మొత్తం బదలీ చేసిన వ్యక్తి అతనికి తిరిగి చెల్లించినప్పుడు సదరు బాధ్యతను అమలు చేయటం జరుగుతుంది.

## II. సెక్షన్ 91

1. మరొక వ్యక్తితో ఒప్పందం ద్వారానే ఆస్తిని సంపాదించటానికి నోటీసు వచ్చినప్పుడే సదరు ఒప్పందం అమల్లోకి వస్తుంది.

2. ఒప్పందం వల్ల హక్కులున్న వ్యక్తి కోసం ఆస్తిని అటువంటి పరిస్థితుల్లో దానిని సంపాదించాల్సిన వ్యక్తి నిర్వహించాలి.

3. ఈ బాధ్యత పరిధి పరిమితమైంది. ఒప్పందం అమలుకు అవసరమైనమేరకే అమలుపరచటం జరుగుతుంది.

4. ఒప్పందానికి బద్ధమైన ప్రతి ఆస్తి విషయంలోనూ సదరు బాధ్యత ఉత్పన్నంకాదు. ప్రత్యేకంగా అమలుపరచగలిగిన ఒప్పందం విషయంలోనే ఇది వర్తిస్తుంది.

## III సెక్షన్ 92

1. కొందరి వ్యక్తుల కోసం ధర్మనిధిగా అట్టిపెట్టటానికి కొన్న ఆస్తి.

2. A, B నుంచి ఆస్తిని కొని దానిని C కోసం B దగ్గరే నిధిగా ఉంచుతాడు. Aను నమ్మి B దానిని అతడికి అమ్ముతాడు.

3. A, C ప్రయోజనం కోసం ఆస్తిని అట్టిపెట్టుకోవాలి.

4. ఇది కూడా పరిమితమైన బాధ్యతే - ఒప్పందాన్ని అమలుపరచటం మేరకే దీనిని నిర్వహించటం జరుగుతుంది.

5. ఆస్తిలో కొంత భాగం C కోసం అట్టేపెట్టటానికి ఒప్పందం జరిగి ఉండవచ్చు. అప్పుడు ఆ ఆస్తి మేరకే బాధ్యతను అమలుచేయటం జరుగుతుంది.

## (4) ఒక వ్యక్తిలో రెండు మూర్తిత్వాలు మిళితం అవటం వల్ల ఏర్పడే సంభావ్య ధర్మనిధులు

### 1. సెక్షన్ 87

1. ద్వంద్వ మూర్తిత్వం ఉన్న వివాదాన్ని ఈ సెక్షన్ ప్రస్తావిస్తుంది - ఒక మనిషి, ఇద్దరు వ్యక్తులు.

2. ప్రతి ఒప్పందం, రుణం, బాధ్యత, నిర్వహణకు ఇద్దరు వ్యక్తులు అవసరం.

3. అయితే ఈ ఇద్దరు వ్యక్తులూ ఒకే మనిషి కావచ్చు.

4. అటువంటి అన్ని వివాదాల్లో ద్వంద్వ మూర్తిత్వం గుర్తింపువల్ల బాధ్యత, లేదా పరిమితులు, మూర్తిత్వం మిళితం వల్ల నాశనం అయిపోవా?

5. ఏ వ్యక్తీ తనకు తాను బాధ్యుడు కాడు కాబట్టే లేదా తన ఆస్తిపై తానుగా ఎటువంటి పరిమితిని విధించుకోడు కాబట్టి.

6. కానీ ద్వంద్వ మూర్తిత్వాన్ని గుర్తించటం వల్ల ఇది సాధ్యమవుతుంది.

7. వాస్తవంలో ఇది అవసరం.

8. ఉదాహరణలు

   బాకీదారుడే అమలుపరిచే వ్యక్తి అయినప్పుడు

   చట్టం దృష్టిలో అమలుపరిచేవాడే యజమాని మిళితం. ఋణం అంతరించటం.

9. సెక్షన్ ఏమీ చెప్పటంలేదు.

* * *

# భాగం V

# సంభావ్య ధర్మనిధి పాలన

## భారత ధర్మనిధి చట్టము

1. ధర్మనిధికి సంబంధించిన చట్టం, II 1882 ఆక్ట్‌లో ఉంది. **(ACT II OF 1882)**

2. ఈ చట్టం నిర్వచనం ఇస్తుంది, మార్పులు చేస్తుంది - అంటే అది నూతన నియమం.

3. ఈ ఆక్ట్ చట్టాన్ని సంఘటితం చేయటంలేదు - అందువల్ల ఇది సంగ్రహమైన సంహితం కాదు.

4. ధర్మనిధులకు సంబంధించిన అన్ని నిబంధనలనూ ఒక చట్టం క్రింద ఉంచాలన్నది ఈ చట్టం లక్ష్యం. 1882 చట్టానికి ముందు ధర్మనిధికి సంబంధించిన స్టాట్యూటరీ చట్టంలో వివరాలు (**29 Car. II C.31** విభాగాలు 7-11) ఉండేవి.

   **Act XXVII Of 1866**

   **Act XXVIII of 1866**

   పీనల్‌కోడ్‌లో కొన్ని నిబంధనలు అక్కడక్కడ చెదురుమదురుగా ఉన్నాయి. స్పెసిఫిక్ రిలీఫ్, **C.P. Code Stamp ACt**, పరిమితి, ప్రభుత్వ సెక్యూరిటీల చట్టం, ప్రెసిడెన్సీ బ్యాంక్‌ల చట్టం, కంపెనీల చట్టం మొదలైన వాటిలో కనిపిస్తాయి.

5. ప్రారంభంలో ఈ చట్టం మొత్తం బ్రిటిష్ ఇండియాకు వర్తించలేదు. ఉదాహరణకు, ఇది బొంబాయికి వర్తించలేదు. అయితే స్థానిక ప్రభుత్వం ఒక ఉత్తరువు ద్వారా ఈ చట్టాన్ని అక్కడ వర్తింపజేయటం జరిగింది.

6. ధర్మనిధి చట్టంలో నిర్వచించినట్లు ధర్మనిధులను హిందూ, ముస్లిం చట్టాలు గుర్తించాయా లేదా అనే అంశాన్ని చర్చించటం ఇక్కడ అనవసరం. వాటిని ఇతరత్రా పరిశీలించవచ్చు.

## ర్మనిధి స్వభావం

1. సెక్షన్ 3లో ధర్మనిధిని నిర్వచించటం జరిగింది. ధర్మనిధిలో మూడు అంశాలుంటాయి:-

    (i) కొంత ఆస్తికి యజమాని అయిన ఒక వ్యక్తి .

    (ii) ఒక బాధ్యతతో కూడిన యాజమాన్యత్వం.

    (iii) మరొక వ్యక్తి కోసం లేదా తన, మరొక వ్యక్తి ప్రయోజనం కోసం ఆస్తిని ఉపయోగించవలసిన బాధ్యత.

2. లాభదాయకంగా అనుభవించకుండా ఉండే యాజమాన్యం అది. అది యాజమాన్యాన్నీ అనుభవించటాన్నీ వేర్పరుస్తుంది.

3. యజమానిలో ఉంచిన విశ్వాసం, దానిని అతడు అంగీకరించినప్పుడు ధర్మనిధి అవతరిస్తుంది.

4. చట్టం దృష్టిలో యజమాని ధర్మకర్త, ధర్మనిధిని ఏర్పాటు చేయటంతో సదరు ఆస్తి యజమాని ఆస్తి యజమాన్యత్వాన్ని కోల్పోతాడు.

## ధర్మనిధి అంటే ఏమిటి?

1. భారత శాసనసభ రూపొందించిన అనేక చట్టాలు ధర్మనిధి, ధర్మకర్తను నిర్వచించాయి.

(i) 1877 స్పెసిఫిక్ రిలీఫ్ ఆక్ట్ Iలో విభాగం 3 నిర్వచనం ఇచ్చింది.

(1) చట్టం అమలుపరిచే ప్రతినిధి బాధ్యతలో ఇమిడి ఉంటాయి.

(2) విస్పష్ట, సూచిత, సంభావ్య తదితర అన్నిరకాల యాజమాన్యం ధర్మనిధిలో ఉంటాయి.

(3) ధర్మకర్త భావనలో విస్పష్ట, సూచిత, సంభావ్య యాజమాన్యం ఉంటుంది.

**i) భారత ధర్మనిధి చట్టం (XXVII, 1866), సెక్షన్-2లో ఇచ్చిన నిర్వచనం:-**

''ధర్మనిధి అంటే తాకట్టు ద్వారా వచ్చిన ఆస్తి నిర్వహణకు సంబంధించిన విధులు కాదు, ర్మనిధి, ధర్మకర్త, పదాలు సూచిత, నిర్మాణాత్మక నిధులను కలుపుకొని ఉంటాయి. ఇందులో

ధర్మకర్తకు లాభదాయకమైన ఆసక్తి ఉన్న ఆస్తి కూడా ఉంటుంది. మరణించిన వ్యక్తి ఆస్తి నిర్వహణకు సంబంధించిన విషయాలన్నీ ఇందులో ఉంటాయి.''

**(iii) పరిమితి చట్టం IX (1908), సెక్షన్ 2(ii)లో ఇచ్చిన నిర్వచనం:-**

ధర్మకర్త అంటే తన పేరిట మరొకరి ఆస్తిని నిర్వహించేవాడు (Benamidar) తాకట్టు పెట్టుకొన్న వ్యక్తి, పట్టాలేకుండా తప్పుడుగా వ్యవహరించే వ్యక్తి కాదు.

**(iv) 1872 ఇండియన్ ధర్మనిధుల చట్టం, II (1872)**

(1) సెక్షన్ 3 - ''ఆస్తి యాజమానికి జతపరిచిన బాధ్యతే ధర్మనిధి.....''

(2) ధర్మనిధి లక్షణాలు

(i) ధర్మనిధి ఒక బాధ్యత

(ii) ఆస్తి యాజమాన్యానికి బాధ్యతను జతపర్చాల.

(iii) యాజమాన్యంలో విశ్వాసం ఉండి, అతడు దానిని అంగీకరించినప్పుడు ధర్మనిధి ఏర్పడుతుంది.

(iv) యాజమాన్యం మరొకరి ప్రయోజనం కోసం ఉండాలి. అంటే యజమాని కాకుండా మరొక వ్యక్తి.

**పదాల వివరణ**

I. బాధ్యత తప్పనిసరిగా ఉండాలి.

II. భాధ్యతను యాజమాన్యంతో తప్పనిసరిగా జతపరచాలి.

1. ఒక వ్యక్తికి, ఎటువంటి ఆస్తితో సంబంధం లేకుండా, బాధ్యత ఉండవచ్చు.

**ఉథాహరణకు తప్పుడు చర్యలు-**

2. ఎటువంటి బాధ్యతను జోడించకుండా ఆస్తి ఉండవచ్చు.

ఉదాహరణకు, పూర్తిగా నిరపేక్ష యాజమాన్యం - ఆస్తిని విక్రయించటం

## II. ఆస్తి యాజమాన్యం పూర్తి విశ్వాసంపై లేదా అటువంటిది లేకుండా ఉండవచ్చు

### ఉదాహరణలు

ఒక వ్యక్తి మరొకరికి అతడు దానిని పూర్తిగా అనుభవించేలా ఆస్తి యాజమాన్యాన్ని బదలీ చేయవచ్చు.

అతనికి దానిని అనుభవించే ఉద్దేశం లేకుండా ఒక వ్యక్తి మరొకనికి ఆస్తి యాజమాన్యాన్ని బదలీ చేయవచ్చు.

యాజమాన్యం విశ్వాసంపై ఆధారపడిన, యాజమాన్యం విశ్వాసంపై ఆధారపడని - ఈ రెండిటి మధ్య వ్యత్యాసం ఈ క్రింది విధంగా ఉంటుంది:-

**(i)** రెండవదాంట్లో ఆస్తిపై పూర్తి యాజమాన్యం లేదా దానిపై సమగ్ర హక్కు ఉండవచ్చు.

**(ii)** మొదటి దాంట్లో అది లేదు.

ఉదా. బెయిల్‌మెంట్ **(Bailment)**

3. ధర్మనిధిని పోలిన ఇతర లావాదేవీల నుంచి ప్రత్యేకంగా పరిశీలిస్తే ధర్మనిధి స్వభావం బాగా అర్థం చేసుకోవచ్చు.

### ఏజెన్సీ నుంచి ధర్మనిధిని వేరు చేయటం

1. ధర్మనిధి ఉన్నచోట ధర్మనిధి ఆస్తి ధర్మకర్త యాజమాన్యం క్రింద ఉంటుంది. ధర్మనిధికి సంబంధించినంతవరకూ ఏర్పాటు చేసుకొన్న అన్ని ఒప్పందాలకూ ధర్మకర్త బాధ్యుడు; అతడి ధర్మనిధి నిధుల విషయంలో, లబ్ధిదారుని ప్రయోజనం విషయంలో ఇతరత్రా (వ్యతిరేకంగా) వ్యవహరించటానికి హక్కు ఉన్నప్పటికీ.
2. చట్టం ప్రకారం ఏజెంట్‌కు అతని వశం చేసిన వాటిపై అతనికి యాజమాన్యం ఉండదు. ఏజెంట్, ఏజెంట్‌గా ఒక ఒప్పందం చేసుకొన్నప్పుడు అతడు వ్యక్తిగతంగా దానికి బాధ్యుడు కాడు. ఒప్పందం యజమానితో జరుగుతుంది.

### షరతు నుంచి ధర్మనిధిని వేరు చేయాలి

1. షరతుకు సంబంధించిన వివాదాలు ధర్మనిధికి సంబంధించిన వివాదాల నుంచి రెండు అంశాల్లో విభేదిస్తాయి:-

(i) యజమానిపరంగా తప్ప ఇతరత్రా ధర్మనిధి ఆస్తిని ఏర్పాటుచేయటం సాధ్యంకాదు. అయితే A, Bకు తన ఆస్తిని అతడు, తాను ప్రత్యేకంగా తాను కోరినట్లు అతడు తన సొంత ఆస్తిని అమ్మే షరతుపై అమ్మవచ్చు.

(ii) బాధ్యత విధించిబడిన వ్యక్తి బాధ్యత అతడు స్వీకరించిన ఆస్తి విలువపై ఆధారపడదు. ఉదాహరణకు, A, Bకి తన అప్పులు అతడు తీర్చే షరతుపై, అతడికి తన ఆస్తిని వ్రాసిఇస్తే B సదరు ఆస్తిని బహుమతిగా స్వీకరిస్తే అతడు సదరు అప్పులను తప్పనిసరిగా తీర్చాలి, ఆస్తి విలువ అప్పుల మొత్తంకంటే తక్కువగా ఉన్నపుటికీ.

2. అయితే ''షరతుపై'' అనే పదాలు ఒక వాస్తవమైన ధర్మనిధిని ఏర్పాటు చేయవచ్చు. Aకు లభించిన బహుమతి సదరు ఆస్తి తాలూకు అద్దెలు, లాభాలు Bకి చెల్లించాలన్న షరతు ఉంటే సదరు బహుమతి ధర్మనిధి అవుతుంది. ఎందుకంటే లాభదాయకమైన ఆసక్తి Aకు ఉన్నట్లు స్పష్టమయింది కాబట్టి.

A తన ఆస్తిని Bకు, సూచితంగా లేదా స్పష్టమైన ఆదేశపరంగా, అతడు తన ఆస్తిని Cకి అమ్మాలన్న షరతుతో అమ్మవచ్చు. ఇక్కడ Cకి అనుకూలంగా ఒక షరతు ఉంది.

## ఇది ధర్మనిధి అవుతుందా?
## బెయిల్‌మెంట్ నుంచి ధర్మనిధిని వేరు చేయాలి

1. బెయిల్‌మెంట్ ధరావతు వంటిది. ఒకవిధంగా అది కూడా ధర్మనిధి వంటిదే అనిచెప్పవచ్చు. అయితే బెయిల్‌మెంట్‌కూ ధర్మనిధికి మధ్య అతి ముఖ్యమైన వ్యత్యాసం ఒకటి వుంది. అదేమిటంటే ధర్మనిధి సాధారణ ఆస్తి అంతా ధర్మకర్త అధీనంలో ఉంటే బెయిల్‌మెంట్ క్రింద విడిపించిన ప్రత్యేక ఆస్తి మాత్రమే బెయిలర్ వద్ద ఉంటుంది.

2. పై వ్యత్యాసం ఫలితంగా ఒక ధర్మకర్త సరైన అధికారం లేకుండా ధర్మనిధి ఆస్తిని అమ్మినప్పుడు కొనుగోలుదారుడు ఎటువంటి హెచ్చరిక ధర్మనిధికి ఇవ్వకుండా సదరు ఆ నిధిపై చట్టబద్ధ ఆసక్తిని కలిగి ఉంటాడు. అయితే బెయిల్‌మెంట్ విషయానికి వస్తే బెయిలీ అటువంటి విక్రయం చేసినప్పుడు బెయిలర్‌కు వ్యతిరేకంగా పట్టాను పొందలేడు.

(3) బెయిల్‌మెంట్ ఫలితంగా బెయిలీ ఆస్తికి యజమాని కాలేడు. చట్టప్రకారం ఒక ధర్మకర్త ఆస్తి యజమాని అవుతాడు. అతనికి ధర్మనిధి ఆస్తి వ్యవహారాల్లో బాధ్యత ఉన్నప్పటికీ

చట్టం దృష్టిలో అతడు ఆస్తికి యజమానే.

## బహుమతికి ధర్మనిధికి మధ్య తేడా

సాధారణ ఒప్పందం ధర్మనిధి కంటే భిన్నంగా ఉంటుంది. మూడవ పక్షానికి లాభాన్ని చేకూర్చే ఒప్పందం ధర్మనిధిని పోలి ఉన్నట్లు కనిపిస్తుంది.

1. బహుమతి, ధర్మనిధి రెండూ కూడా యాజమాన్యాన్ని బదలీ చేస్తాయి కాబట్టి అవి ఈ సందర్భంలో ఒకే విధంగా ఉంటాయి. ధర్మకర్తా, బహుమతిని స్వీకరించిన వ్యక్తీ ఆస్తికి యజమానులు అవుతారు.

2. కానీ ఈ రెండిటి మధ్య ఒక వ్యత్యాసం ఉంది. బహుమతి విషయంలో దానిని స్వీకరించిన వ్యక్తి సదరు ఆస్తిని తన ఇష్టం వచ్చినట్లు ఉపయోగించుకోవచ్చు. అయితే ధర్మనిధి విషయంలో ధర్మకర్త ఆస్తిని వినియోగించటంలో అతడికి బాధ్యత ఉంటుంది. దానిని సూచించిన పద్ధతిలో, ఆ దేశ ప్రయోజనం మేరకు వినియోగించాలి.

## ధర్మనిధి - ఒప్పందం కంటే భిన్నమైంది

1 ఒప్పందం, ధర్మనిధుల చట్ట పరిణామాల నుంచి అవి రెండు వేరువేరని మాత్రం గ్రహించవచ్చు.

   (i) ఒక ధర్మనిధి అమల్లోకి వస్తే, లబ్ధిదారుడు, సదరు నిధికి పార్టీ కానప్పటిక నిధి అమలుకు చర్య తీసుకోవచ్చు. ఒప్పందం విషయంలో వాస్తవ కక్షిదారులు మాత్రమే చర్య తీసుకోగలరు.

   (iii) ఏర్పాటైన స్వచ్ఛంద ధర్మనిధిని పూర్తిగా అమలుపరచవచ్చు. ఎటువంటి లాబ ప్రయోజనం లేని ఒప్పందం అమల్లోకి రాదు.

2. అయితే, లభ్యం అయిన యదార్థాలనుబట్టి అవి ఒప్పందాన్ని లేదా ధర్మనిధి ఏర్పాటుకు దోహదం చేస్తాయా నిర్ణయించటం అంత సులభం కాదు. ఇక్కడ దీనిని పరీక్షించాలి.

Kectan - PP 5-6(1919) A.C.801 (1926) A.C.108

38 Bombay S.R. 610

## ఇది ఉద్దేశానికి సంబంధించిన ప్రశ్న
## ధర్మనిధికి, అధికారం (Power)కి మధ్య తేడా

1. ''అధికారం'' అనే పదం చాలా విస్తృతమైంది. అది ఒక వ్యక్తికి (అధికారాన్ని స్వీకరించిన వ్యక్తి) మరొకరి పక్షాన్న వ్యవహరించటానికి అతనికి హక్కులు కల్పిస్తుంది.

2. అనేకరకాలు అధికారాలుంటాయి.

**ఉదాహరణకు**

(i) ఒక వ్యక్తి పక్షాన్న ఏజెంట్ వ్యవహరించటం ''పవర్ ఆఫ్ అటార్నీ'' అంటారు.

(ii) తాకట్టు పెట్టిన వస్తువును విక్రయించే అధికారం

(iii) ధర్మకర్తలు, అమలుదార్లు విధించే అనేక సూచిత, విస్పష్ట అధికారాలు

(iv) సమత ప్రయోజనాలను ఏర్పాటు చేయటానికి ధర్మనిధులను స్థాపించే అధికారం.

(3) నియమించే అధికారం ధర్మనిధిని పోలి ఉంటుంది. దీనిని ధర్మనిధి నుంచి వ్యత్యాసీకరించాలి.

'నియామకం' అనే పదం ప్రత్యేక ఆస్తి ఎలా ఉండాలనేది నిర్ధారిస్తుంది. దానిని నిర్ణయించటంలో ఉపయోగించే అధికారం నియామకం ప్రయోజనాన్ని సూచిస్తుంది.

'నియామకానికి అధికారాలు' భవిష్యత్‌లో ప్రయోజనాలను ఏర్పాటు చేయటానికి ఉద్దేశాన్ని సూచిస్తుంది. అయితే దాని ప్రకటన వాయిదా పడుతుంది.

ఈవిధం వివాహం సందర్భంలో భార్య భర్తలకు ఆస్తిని కల్పించి, అది వారి జీవిత కాలంలో అనుభవించటానికి, మరణానంతరం దానిని (i) వివాహపరంగా జనించిన సంతతిలో కొంతమందిని (ii) లేదా అందరినీ సదరు ఆస్తిలో వాటాదారులుగా నియమించవచ్చు. అటువంటి నియామకం జరిగినప్పుడు ప్రారంభపత్రంలో నిపరిమితివంటిదే ఇప్పుడు నియమించబడిన వ్యక్తిని కూడా పరిమితు సదరు నియామకం చేస్తుంది.

ఇటువంటి అధికారం, పరిమితులను విధించినప్పుడు - ఎవరికి అనుకూలంగా సదరు అధికారాన్ని వినియోగించటమైందో - దానిని నియామకానికి సంబంధించిన ప్రత్యేక అధికారం అంటారు.

ఎటువంటి పరిమితులు విధించకుండా చేసే నియామకాన్ని సాధారణ అధికారం అంటారు. ఆస్తిని స్వీకరించే వ్యక్తే సదరు నియామకం చేయవచ్చు. ఇటువంటి వివాదాల్లో దాతవలె, స్వీకర్త కూడా ఆస్తికి యజమానిగా గుర్తింపు పొందుతాడు:-

(i) అధికారం కేవలం విచక్షణను మాత్రమె ఇవ్వచ్చు. అందువల్ల దానిని ధర్మనిధి నుంచి వేరుగా చూడవలసి ఉంటుంది. ఎందుకంటే ధర్మనిధి బాధ్యతను కల్పిస్తుంది.

(ii) సదరు విచక్షణను ఉపయోగించే బాధ్యతను అధికారం విధించవచ్చు.

మొదట సందర్భంలో ధర్మనిధి ఏర్పాటులేదు. రెండో దాంట్లో అధికారం ధర్మనిధి స్వభావాన్ని కలిగి ఉంది. లేదా అధికారం ధర్మనిధితో జోడించబడింది.

(iii) ధర్మనిధిని అధికారంతో జతపరిచిన వివాదాలు, మూడవశ్రేణి క్రిందకు వస్తాయి.

కొన్ని సందర్భాలలో ధర్మకర్తలు ఆస్తిని లబ్ధిదారుల కోసం లేదా కొన్ని నిర్దిష్ట ప్రయోజనాల కోసం వినియోగించవలసిన బాధ్యత ఉన్నప్పటికీ, వారి సొంత విచక్షణను వినియోగించి ప్రత్యేక చర్యలు తీసుకోవచ్చు; తీసుకోకపోవచ్చు. అటువంటి సందర్భాల్లో న్యాయస్థానం సదరు వ్యక్తులు విచక్షణా రహితంగా అధికారాలను చెలాయించటాన్ని నిరోధించవచ్చు. కానీ వారి అధికారాలను విచక్షణను పరిమితం చేయటానికి న్యాయస్థానం ప్రయత్నించదు.

1. అధికారం (Power) ధర్మనిధిని పోలి ఉంటుంది. కానీ దాని నుంచి భిన్నంగా ఉంటుంది.

(i) అది ధర్మనిధిని పోలి ఉంటుంది. ఎందుకంటే ఆస్తిని విక్రయించటంలో అధికారం ఉంది కాబట్టి. కానీ ఆస్తిని అనుభవించటానికి మాత్రం అధికారం ఉండదు.

(ii) అది ధర్మనిధికి భిన్నంగా ఉంటుంది. ఎందుకంటే అధికారం విచక్షణతో కూడుకొండి కాబట్టి ధర్మనిధి విస్పష్ట పూరితమైంది. నిధి ఏర్పాటుదారుడు ఇచ్చిన నిర్దేశనం ప్రకారం ధర్మకర్త వ్యవహరించాలి.

* VII నూతన ధర్మనిధులు

(1) మరణానంతరం ధర్మకర్త, పదవిహ ఆస్తి జీవించిన వ్యక్తికి చెందుతుంది.

* జీవించిన వ్యక్తి మరణానంతరం పదవి, ఆస్తి మరొకరికి మార్పిడి

* (3) ధర్మకర్త పదవీ విరమణ పదవి, పదవి నుంచి తొలగింపు

* (4) నూతన ధర్మకర్తల నియామకం

* VIII న్యాయ ధర్మకర్త, నియామకం

* IX పబ్లిక్ ధర్మకర్త

(1) సేవాభావం మరియు విధులు

* (2) సాధారణ ధర్మకర్త వలె పబ్లిక్ ధర్మకర్త నియామకం.

* (3) పబ్లిక్ ధర్మకర్తల నియామకం - తొలగింపు

* (4) సంరక్షక ధర్మకర్త, నిర్వాహక ధర్మకర్తల విధులు, హక్కులు, బాధ్యతలు

* (5) పబ్లిక్ ధర్మకర్తల వర్తించే ప్రత్యేక నిబంధనలు

* X (1) ధర్మకర్తల హక్కులు

* (2) ధర్మకర్తృత్వం అయిపోయిన తర్వాత విరమించుకొనే హక్కు

* (3) న్యాయస్థానానికి ధర్మనిధి, నిధులను చెల్లించే హక్కు

* XI పబ్లిక్ ధర్మకర్త, లేదా న్యాయస్థానం సహాయాన్ని అర్థించే ధర్మకర్తల, లబ్ధిదారుల హక్కు

* (1) అధికారిక లెక్కల పరిశీలనకు హక్కు

* (2) న్యాయస్థానం నిర్దేశనం పొందే హక్కు

* (3) న్యాయస్థానం ద్వారా ధర్మనిధిని నిర్వహించబడే హక్కు

* (4) న్యాయస్థానం నుంచి నిర్దేశనం పొందే హక్కు

* (5) న్యాయస్థానం ద్వారా ధర్మనిధిని నిర్వహింపచేసే హక్కు.

* శీర్షికలు మినహాయించి వివరాలు పుటల్లో లేవు - సం.

## XII ధర్మనిధి భంగం (Breach of Trust) - పరిణామాలు

1. విశ్వాసాన్ని వమ్ముచేయటం ( ధర్మనిధి భంగం) సంబంధించిన నిర్వచనాలు:-

   సెక్షన్-3లో విశ్వాసం వమ్ముచేయటాన్ని నిర్వచించారు. దాని ప్రకారం ధర్మకర్త తనపై విధించిన బాధ్యత, లేదా అమల్లో ఉన్న చట్టం నిర్దేశించినది భగ్నం చేయటం విశ్వాసాన్ని వమ్ముచేయటం.

2. ఇంగ్లీష్‌చట్టం ప్రకారం:- చట్టం, ధర్మనిధి ఒప్పందం కల్పించని ఏ చర్య చేసినా లేదా ధర్మకర్త నిర్లక్ష్యం చేసినా విశ్వాసాన్ని వమ్ముచేయటం ( ధర్మనిధి భంగం) క్రిందకు వస్తుంది.

3. కర్తవ్యాన్ని విస్మరించటం:- ధర్మకర్తకు విధులు, హక్కులు, బాధ్యతలు ఉంటాయి. విధి నిర్వహణను విస్మరించినప్పుడు మాత్రమే విశ్వాసాన్ని వమ్ముచేయటం, ధర్మనిధి భంగం అవుతుంది.

(1) ధర్మనిధికి కల్పించిన నష్టం మేరకు విశ్వాసఘాతుకతను నిర్ణయించటం జరుగుతుంది.

(2) అతడు వడ్డీని చెల్లించవలసి ఉంటుందా? ఈ క్రింది సందర్భాల్లో మాత్రమే చెల్లించాలి.

   (i) అతడు వాస్తవంలో వడ్డీని పొందినట్లైతే,

   (ii) లబ్ధిదారునికి నిధి సొమ్మును చెల్లించటంలో విపరీతమైన కాలయాపన జరిగినప్పుడు

   (iii) ధర్మకర్త వడ్డీని పొంది ఉండాల్సినప్పుడు దానిని అతడు పొందటానికి ప్రయత్నించినప్పుడు

   (iv) అతడు వడ్డీని పొందాడని భావించినప్పుడు

   (v) ధర్మనిధి నిధులను సరిగ్గా మదుపుపెట్టడంలో వైఫల్యం, వడ్డీని ప్రోదిచేయటంలో లాభాలను సాధించడంలో వైఫల్యం ధర్మనిధి భంగం విశ్వాసాన్ని వమ్ముచేయటం క్రిందకు వస్తాయి.

   (vi) వ్యాపారంలో ధర్మనిధి నిధులను మదుపుచేయటం కూడా విశ్వాసాన్ని వమ్ముచేయటమే.

(3) విశ్వాసాన్ని వమ్ముచేయటాన్ని మరోరకంగా ధర్మనిధికి లాభం చేకూర్చటం ద్వారా అతడు సరిచేయవచ్చా?

   అలా అతడు చేయలేడు

* * *

# 5. కాల పరిమితి చట్టం
# (THE LAW OF LIMITATION)

**కాలపరిమితి చట్టంపై ప్రసంగాలు**

<u>I ఉపోద్ఘాతం</u>

1. ★ కాల పరిమితి చట్టం స్వభావం.

2. ★ కాలపరిమితి, మాట కట్టుబాటు (Estoppel) అంగీకార ప్రకటనలు- మరియు లోపాలు (Laches) మధ్య వ్యత్యాసం.

3. ★ కాలపరిమితి చట్టం లక్ష్యం.

<u>II కాలపరిమితి చట్టం ఏర్పాటు</u>

(1) ★ ఇండియన్ స్టాట్యూట్ చట్టం ప్రకారం కాలదోషం పట్టడం.

(2) ★ చట్టం.ఏర్పాటు.

<u>III చట్టం అనువర్తింపు</u>

1. ★ ప్రదేశానికి సంబంధించి

2. ★ ప్రత్యేక చర్యలకు సంబంధించి

3. ★ క్రిమినల్ చర్యలకు సంబంధించి

4. ★ సివిల్ చర్యలకు సంబంధించి

5. ★ వ్యక్తులకు సంబంధించి, (సరిగ్గా కనపడటం లేదు) ప్రత్యేక చట్టానికి వ్యతిరేకంగా

IV మూడవ గడి <u>(Column)</u> కి విభాగానికి సంబంధించిన ప్రశ్నలు

**I ఎక్కడ సమయం లెక్కింపు ప్రారంభమవుతుంది.**

1. ★ సాధారణ నియమం- ఎక్కడ వ్యాజ్యం వేసే హక్కు ఏర్పడుతుందో

<u>మినహాయింపులు:-</u>

(1) ★ వ్యాజ్యం వేసే హక్కు ఏర్పడక ముందే కాలపరిమితి ప్రారంభం అయ్యే వివాదాలు.

(2) ★ హక్కు ఏర్పడ్డాక కూడా పరిమితి ప్రారంభం కాని వివాదాలు.

(3) ★ తాజాగా ప్రారంభం అయ్యే కాలపరిమితి ఉన్న వివాదాలు.

గమనిక ★ వ్రాత ప్రతిలో ఉన్నది ఉన్నట్లుగా తీసుకోవటం జరిగింది. (సం.)

2. ★ వరుసగా తప్పిదాలు చేసిన వివాదాల్లో ప్రారంభ సమయం.

(3) ★ తప్పులు కొనసాగిన వివాదాల్లో ప్రారంభ కాలం.

<u>II ఎప్పుడు సమయం వ్యతిరేకంగా ప్రారంభమవుతుంది?</u>

1. ★ ఎప్పుడు వాదికి వ్యతిరేకంగా

2. ★ ఎప్పుడు ప్రతివాదికి వ్యతిరేకంగా

<u>V సెక్షన్ 2 నుంచి ఉత్పన్నం అయ్యే ప్రశ్నలు</u>

I కాలాన్ని ఏవిధంగా గణించాలి.

1) కాలండర్

2) కాలాన్ని మినహాయించిన వివాదాలు.

3) కాల నష్టాన్ని తీసివేసిన వివాదాలు.

<u>II కాలాన్ని పొడిగించగలమా?</u>

<u>III కాలయాపన మన్నించవచ్చా?</u>

**IX కాలపరిమితి చట్టం అన్వయం**

(1) సాధారణ నియమాలు

(2) ప్రత్యేక మరియు అవశేష నిబంధనలు (**Articles**).

---

(★ వ్రాతప్రతి నుంచి యధాతధంగా తీసుకోవటమైంది సం.)

# భాగం IV ఒకటో గడి నుంచి ఉత్పన్నం అయ్యే ప్రశ్నలు

విభాగం I- వ్యాజ్యాలు (Suits)

<u>గణం-I</u> డబ్బు కోసం వ్యాజ్యాలు సెక్షన్లు 57-64-85

వివరణ - (1) చూపించిన లెక్కలు - 64

(2) స్వీకరించిన మొత్తాలు - 62

(3) పరస్పర, బహిరంగ, ప్రస్తుత ఖాతా - 85

(4) ధరావతు - 60

<u>గణం-II</u> వ్యాజ్య సాధానాలపై వ్యాజ్యాలు వ్యాజ్య సాధనాలు (Negotiable Instruments) - 69 - 80.

వివరణ - వాయిదాలలో చెల్లించే ధనం - 75

<u>గణం-</u>III మైనర్ మేజర్ అయినాక వేసే వ్యాజ్యం - 44

వివరణ

<u>గణం</u>-IV తనఖాలపై వ్యాజ్యాలు - 132, 134, 147, 148

<u>వివరణ</u>

<u>గణం-V</u> స్థిరాస్తిని తిరిగి పొందటానికి వ్యాజ్యాలు

<u>వివరణ</u>

(1) పట్టాపై ఆధారపడిన వ్యాజ్యాలు

(2) స్వాధీనతపై ఆధారపడిన వ్యాజ్యాలు

**(a)** వ్యతిరేక కబ్జా ద్వారా **(By adverse possession)**

**(b)** కబ్జా కోల్పోవటం ద్వారా **(By dispossession)**

(3) విభజనపై ఆధారపడవలసిన వ్యాజ్యాలు **(Suits based on Partition)**

గణం-VI డిక్రీలను లేదా మోసం ద్వారా పొందిన పత్రాలను తిరస్కరించటానికి వ్యాజ్యాలు - 91, 95.

వివరణ

గణం- VII డిక్రీలు మరియు న్యాయస్థానం, ప్రభుత్వాధికారుల ఉత్తర్వులకు వ్యతిరేకంగా వ్యాజ్యాలు - 11, 11A, 12, 13, 14.

గణం-VIII రిజిష్టర్డ్ పత్రంపై వ్యాజ్యాలు - 116.

గణాలు-IX కోటలపై వ్యాజ్యాలు.

వివరణ

ద్వేషపూరిత ఆరోపణ చర్యలు ఎప్పుడు వ్యాజ్యానికి హక్కు ప్రారంభమవుతుంది - 2, ---3.

గణం-X ఒప్పందాలపై వ్యాజ్యాలు

విభాగం II- అప్పీళ్ళు (పుట ఖాళీగా ఉన్నాయి)

విభాగం III అనువర్తితలు (పుట ఖాళీగా ఉంది)

VII లా ఆఫ్ ప్రిస్క్రిప్షన్ (పుట ఖాళీగా ఉంది)

# భారత కాల పరిమితి చట్టం

## I పరిచయం

**I కాల పరిమితి చట్టం స్వభావం ఏమిటి?**

1. వ్యాజ్యాల్లో అనేక మార్గాల్లో కాలపరిమితిని ప్రవేశపెడతారు.

(1) ఒక నిర్ణీత కాలంలో చర్య తీసుకోమని చట్టం చెప్పే అనేక వ్యాజ్యాలున్నాయి.

ఉదా: ఆర్డర్6, రూల్18: దావా (Plaint) సవరణ: మార్పు చేయటానికి అనుమతి పొందిన పార్టీ న్యాయస్థానం నిర్దేశించిన గడువు కోసం దావా పత్రం చెయ్యాలి. ఒకవేళ ఎటువంటి కాలపరిమితిని నిర్ణయించకపోయినట్లైతే 14 రోజుల్లోగా ఆ మార్పు చెయ్యాలి.

(2) ఒక నిర్ణీత కాలం పూర్తి అయ్యేంతవరకూ ఎటువంటి చర్య తీసుకోకూడదు అని న్యాయస్థానం నిర్ణయించే వివాదాలు.

ఉదా: C.P.C. లోని విభాగం 80- సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కు వ్యతిరేకంగా వ్యాజ్యం భారత సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కు వ్యతిరేకంగా ఏ వ్యాజ్యమూ లేదా ఏ ప్రజాధికారికీ వ్యతిరేకంగా అతని అధికార హోదాలో అతనికి నోటీస్ జారీ చేసిన రెండు నెలల అనంతరం వరకూ వ్యాజ్యం వేయరాదు.

(3) ఒక నిర్ణీత కాలం గడిచిన అనంతరం వ్యాజ్యం వేయరాదని న్యాయస్థానం నిర్ణయించిన వివాదాలు.

(2) మూడవ రకానికి చెందిన వివాదాల్లోనే కాలపరిమితి చట్టం వర్తిస్తుంది.

**2. కాలపరిమితి – మాట కట్టుబాటు – అంగీకారం లోపాలు మధ్య వ్యత్యాసం**

ఇవన్నీ కూడా నష్టపడిన వ్యక్తికి అతనికి జరిగిన నష్టానికి పరిహారం రాకుండా చేసేవిగా ఉంటాయి. అందువల్ల వాటికి కాలపరిమితికి మధ్య తేడాలను గమనించాలి.

### కాల పరిమితి – మాట కట్టుబాటు (Estoppel)

1. కాలపరిమితి ద్వారా ఒక వ్యక్తి కాల పరిమితికి అయిపోయిన వ్రాత చర్యను తీసుకోవటం వల్ల అతడు ఉప శాంతిని పొందకుండా నిరోధించబడతాడు.

2. మాట కట్టుబాటు ద్వారా ఒక వ్యక్తి ఉప శాంతిని పొందటానికి విఫలం అవుతాడు; ఎందుకంటే అతడు తన వాదాన్ని రుజువు చేసుకోటానికి అవసరమైన సాక్ష్యాన్ని తీసుకురాకుండా చట్టరీత్యా నిరోధించబడతాడు.

## ాలపరిమితి - అంగీకారం

1. సమయం గడిచిపోయింది కాబట్టి అతడు నష్టపడటానికి సిద్ధం అయ్యాడని భావిస్తారు. ానికి అంగీకరించాడు కాబట్టి అతడికి ఉప శాంతి లభ్యం కాకుండా కాలపరిమితి అడ్డుపడుతుంది.

2. అంగీకరించడం (Acquiescence) ద్వారా వాది చర్యను ఉపశాంతి పొందటాన్ని నిరోధిస్తుంది. ందుకంటే తప్పుడు చర్యను అతడు అంగీకరించాడు కాబట్టి.

## ల పరిమితి - ఆలస్యం, లోపాలు (Laches)

1. రెండింటికీ ఒక సమాన లక్షణం ఉంది- గడువు లోపల రాలేదు కాబట్టి ఉప శాంతినివ్వటానికి ి తిరస్కరిస్తాయి.

2. అయితే వీటి మధ్య వ్యత్యాసం - కాలపరిమితిలో ఒక నిర్ణీత కాలం లోపల చట్ట ప్రకారం చర్య సుకోకూడదని చెప్పటమవుతుంది. లాఛెస్‌తో పాటు ఎటువంటి కాలపరిమితిని నిర్ణయించటం గదు. అందువల్ల ఉప శాంతిని మంజూరు చేసేటప్పుడు అపరిమితమైన కాలయాపనను కూడా గణనలోకి న్యాయస్థానం తీసుకొంటుంది.

(3) భారతదేశంలో ఈ లోపాల (laches) నియమాకానికి ఎక్కువ అవకాశం లేదు. ఎందుకంటే ాపు అన్ని వివాదాల్లోనూ కాలపరిమితిని, పరిమితి చట్టం నిర్ణయించింది కాబట్టి. అందువల్ల చట్టం యించిన గడువు లోపల ఒక వ్యక్తి మొదటి రోజున లేదా ఆఖరి రోజున వ్యాజ్యం వేసాడా అనేది గణనలోకి రాదు.

(4) భారతదేశంలో Laches నియమం ఈ క్రింది వివాదాల్లోనే వర్తిస్తుంది:-

(i) న్యాయస్థానం మంజూరు చేసే ఉపశాంతి విచక్షణతో కూడుకొన్నట్లయితే అప్పుడు

(i) ప్రత్యేక ఉపశాంతి క్రింద వచ్చే వివాదాలు

(ii) తాత్కాలిక ఉపశాంతి వివాదాలు

(2) కాల పరిమితి చట్టం వర్తించని వివాదాలు ఉదా. వైవాహిక వ్యాజ్యాలు.

కాలయాపన అంటే నేరాన్ని క్షమించటమే అవుతుంది.

## రిమితి లక్ష్యం

1. ఒక క్రమబద్ధమైన సమాజంలో రెండు అంశాలు అవసరం.

i) తప్పులకు పరిష్కారం ఉండాలి.

ii) శాంతిని కొనసాగించాలి

2. ఒక సమాజంలో శాంతి నెలకొనాలంటే ఆస్తికి, హక్కులకు సంబంధించిన విషయాలు నిరంతరం అనిశ్చిత స్థితిలో ఉండరాదు. వాటి గురించి సందేహం, ఏం జరుగుతుందో అన్న ఉత్కంఠత ఉండరాదు.

3. అందువల్ల తమకు అన్యాయం జరిగిందని భావించిన వ్యక్తులు ఉపశాంతిని కోరుకోటానికి అనుమతినిచ్చినపుడు వారు ఒక నిర్ణీత గడువులోపల సదరు ఉప శాంతిని కోరుకునేటట్లు చెయ్యాలి. ఒక కాలపరిమితికి మించి తనకు జరిగిన అన్యాయాన్ని భరించిన వ్యక్తికి ఉపశాంతిని నిరాకరించడం అన్యాయం కాదు.

4. ఈ సూత్రంపైనే పరిమితి చట్టం ఆధారపడింది.

5. ఈ నియమం ఎల్ల పరిమితి చట్టం అమల్లో పూర్తిగా నిరపేక్షమైంది; అది కక్షిదారుల ఒప్పందాలకు, నడతకు లోబడదు. అంటే అది ఈ క్రింది వాటికి కూడా లోబడదు.

(i) వదులుకోవడం

(ii) సంప్రదాయం

(iii) మాట కట్టుబాటు **(Estoppel)**

(iv) కాలపరిమితిని తగ్గించటం లేదా పొడిగించటం అనేది కక్షిదారుల మధ్య ఒప్పందం ద్వారా కావచ్చు. అవి ఒప్పందం చట్టంలోని 28 మరియు 23 విభాగాల ననుసరించి ఉంటాయి.

(6) నెగోషియబుల్ ఇన్స్ట్రుమెంట్స్ (వ్యాజ్యసాధనాలు) చట్టం నుంచి పరిమితి చట్టం ఈ సందర్భంలో ప్రత్యేకంగా ఉంటుంది.

7. రుజువు చేయవలసిన బాధ్యతపై పరిమితి.

1) రుజువు చేయవలసిన బాధ్యత వారిదే. అతడు తన వ్యాజ్యం కాలపరిమితి లోపలే ఉందని రుజువు చెయ్యాలి.

**37 Bow. S.R. 471- A.I.R. 1935 September**

జులై 8, 1922 తారీకులో A Bకు కొన్ని భూములను రిజిష్టర్ చేసి వాటిని 25 సంవత్సరాలో అతనికి అద్దెకిచ్చాడు. తర్వాత A విపరీతమైన ఒత్తిడి ద్వారా సదరు లీజు ఇవ్వటం జరిగిందంటూ Bకు ఇచ్చిన భూములను స్వాధీనం చేసుకున్నాడు. B A చర్యలను నిరోధించటానికి న్యాయస్థానం జోక్యాన్ని అర్థించాడు A లీజు ఒప్పందాన్ని కొట్టి వేయాలన్న వాదనను పరిమితి చట్టం నిరోధిస్తుందని B

వాదించటం జరిగింది. మరో మాటలో చెప్పాలంటే ప్రతివాది చర్యను పరిమితి నిరోధిస్తుంది అని వాదించటం.

ప్రశ్న ఏమిటంటే ప్రతివాది పరిమితి చట్టానికి బద్ధుడా? సమాధానం ''కాదు''. విభాగం 3 వాదిని గురించి చెబుతున్నదే కానీ ప్రతివాదిని గురించి ప్రస్తావించలేదు.

8. పరిమితి అంశం - చర్యలో దశ

1. చర్యలు తీసుకున్న ఏ దశలోనైనా కాలపరిమితి అంశాన్ని లేవనెత్తవచ్చు. రెండవ అప్పీలు దశలో కూడా లేవదీయనచ్చు.

2. అప్పీలు ద్వారా మొదటిసారి దానిని ప్రస్తావించవచ్చు.

38 Mad 374

36 Cal. 920

38 Cal. 512

38 Bom. 709 (714)

3. ట్రయల్ కోర్టులో దీనిని వదిలి వేసిన తర్వాత కూడా అప్పీలు ద్వారా దానిని ప్రస్తావించవచ్చు.

3 All. 846 (848)

4. ప్రివీ కౌన్సిల్‌లో కూడా దీనిని ప్రస్తావించవచ్చు. (దానిని కోర్టులలో తిరస్కరించినప్పటికీ)

361 A. 210

5. అయితే దీనికి ఒక పరిమితి ఉంది. అదేమిటంటే అప్పీలు దశలో నిర్ణయించటానికి సరైన అంశాలు నమోదుకాని పక్షంలో వాస్తవం పరిశీలన ఇంకా అవసరం అని భావిస్తే న్యాయస్థానం అనుమతించకపోవచ్చు.

57 Cal. 114

# II. భారత కాలపరిమితి చట్టం

## ఏర్పాటు విధానం

## భారతీయ శాసనాల ప్రకారం కాలదోషం అమలు

1. నిర్ణీత కాలపరిమితి చెల్లిపోవడం వల్ల భారతీయ శాసనాల ప్రకారం నాలుగు ఫలితాలు కనిపిస్తాయి.

(i) పరిహారం కోరే హక్కుకు సంబంధించిన వివాదాలు లెక్కకు మించిపోతాయి. సెక్షన్ 3, కాలపరిమితి చట్టం.

(2) అది అతడు పరిహారం కోరటాన్ని నిరోధించడమే కాకుండా అతని హక్కుకు కూడా హరిస్తుంది- సెక్షన్ 28, పరిమితి చట్టం.

(3) ఒక నిర్ణీత కాలం పాటు అనుభవించిన వ్యక్తికి వెలుగు, గాలి, మార్గము, నీటి వసతి, మొదలైన వాటిపై హక్కును కల్పిస్తుంది. సెక్షన్ 26, పరిమితి చట్టం.

(4) వసతులకు (Easements) హక్కును ఇది హరిస్తుంది- సెక్షన్ 47, Act V of 1882

(2), (3), (4) క్రింద నమోదు అయిన వివాదాలు లా ఆఫ్ ప్రిస్క్రిప్షన్ క్రిందకు వస్తాయి. (1) పరిమితి చట్టం పరిధి క్రిందకు మాత్రమే వస్తుంది. పరిమితి చట్టం అనేక చట్టాలకు సంబంధించి పరిమితి చట్టం వర్తిస్తుంది. అందువల్ల ఈ రెండింటిని వేర్పరచి అధ్యయనం చెయ్యాలి.

# III ఇండియన్ పరిమితి చట్టం

## అనువర్తింపు

## 1. ప్రదేశానికి సంబంధించి

1. మొత్తం బ్రిటిష్ ఇండియాకు ఈ చట్టం వర్తిస్తుంది- సెక్షన్ 1 (2)

2. బ్రిటిష్ ఇండియాలో పనిచేస్తున్న అన్ని న్యాయస్థానాల్లో వేసిన ప్రతి వ్యాజ్యమూ, అప్పీలు మరియు దరఖాస్తులకూ ఈ చట్టం వర్తిస్తుంది.

3. సదరు చర్యకు కారణం బ్రిటిష్ ఇండియాలోనా లేదా బ్రిటిష్ ఇండియా వెలుపలా అనే దానితో

సంబంధం లేదు. అలాగే వ్యవహారం ఎక్కడ జరిగింది- బ్రిటిష్ ఇండియాలోనా, వెలుపలా అనేది కూడా పరిగణనలోకి రాదు. వ్యాజ్యం లేదా అప్పీలు ఇండియన్ పరిమితి చట్టం కింద మాత్రమే వెయ్యాలి కానీ విదేశీ పరిమితి చట్టం క్రింద కాదు.

(4) సెక్షన్ 11 (2) ఒక మినహాయింపును చేసింది. దాని ప్రకారం ఒక విదేశీ పరిమితి చట్టం క్రింద ఆ దేశంలో ఒప్పందం చేసుకుని, అక్కడి నియమం సదరు ఒప్పందాన్ని హరింపజేస్తే, ఆ కక్షిదారులు ఆ దేశవాసులై ఉంటే సదరు చట్టాన్ని పరిగణనలోకి తీసుకోవటం జరుగుతుంది.

## 2. ప్రొసీడింగ్స్‌కు సంబంధించి

### 1. ప్రత్యేక ప్రొసీడింగ్స్

(1) మధ్యవర్తి పరిష్కార చర్యలు ఒకప్పుడు పరిమితికి చట్టం మధ్యవర్తి ముందు దావాలకు వర్తిస్తుందా అనే సందేహం ఉండేది. మధ్యవర్తి చర్యలు తీసుకోటానికి ముందు, వ్యాజ్యాలకూ, అప్పీళ్ళకూ న్యాయస్థానాలకు విజ్ఞప్తులకూ, న్యాయస్థానం మధ్యవర్తి కాదు అనే వాదంపై వర్తిస్తుందా అనే సందేహం ఉండేది. అయితే ఈ సందేహాన్ని ప్రివీ కౌన్సిల్ తొలగించింది. వ్యక్తులు మధ్యవర్తికి తమ వాదాలను వినిపించటానికి సిద్ధపడ్డప్పుడు, అమల్లో ఉన్న చట్ట ప్రకారం మధ్యవర్తి వివాదాన్ని పరిష్కరించాలని, పరిమితికి సంబంధించిన ప్రతి దానికీ మధ్యవర్తి ప్రాముఖ్యం ఇవ్వమని, సదరు వాదాన్ని ఒప్పందం ద్వారా తొలగించుకుంటే తప్ప, అని ప్రివీ కౌన్సిల్ నిర్ణయించింది.

**(1929) 56 I.A. 128**

ప్రశ్న: ప్రైవేట్ ఒప్పందం ద్వారా కక్షిదారులు పరిమితి చట్టాన్ని మార్చుకోవచ్చని ఈ నిర్ణయం చెబుతున్నది. ఈ నిర్ణయం సెక్షను 28, 29 ఒడంబడిక చట్టంలోని నిబంధనలను పరిగణనలోకి తీసుకోనట్లు కనిపిస్తున్నది.

### (2) కంపెనీల చట్టం క్రింద ప్రొసీడింగ్స్

ఒక వ్యాపార సంస్థ రద్దయినప్పుడు, దానికి ఒక రద్దుదారుడిని న్యాయస్థానం నియమించినప్పుడు- దాని వ్యవహారాలను కొనసాగించటానికి సెక్షన్ 186, కంపెనీ చట్టం క్రింద- న్యాయస్థానం సదరు రద్దుదారుడికి ఒక వ్యక్తి కంపెనీకి చెల్లించవలసిన ధనాన్ని, చెల్లించమని ఆదేశించవచ్చు. సాధారణంగా దీని కోసం వ్యాజ్యం చెయ్యాలి. అయితే అనేక వ్యాజ్యాలను తొలగించుకోటానికి చట్టం ఇటువంటి ప్రత్యేక చర్యకు అనుమతిస్తుంది.

ప్రశ్న ఏమిటంటే సదరు పరిమితి ఇటువంటి చర్యలకు వర్తిస్తుందా? సెక్షన్ 186 క్రింద ''రావలసిన పైకం'' అంటే చట్టం ప్రకారం కావలసినది, వసూలు చేయవలసిన పైకం అంటే డబ్బుకు కాలపరిమితి వర్తించదు. అంటే పరిమితి చట్టం సదరు చర్యలకు వర్తిస్తుంది. **6 OI.A. 13 (23**

## (3) ఆదాయం పన్ను క్రింద ప్రొసీడింగ్స్

ప్రభుత్వ ఆదాయానికి సంబంధించి ఇండియాలోని సివిల్ కోర్టులకు విచారణ పరిధిలేదు.

వాటికి ఒక ప్రత్యేక రెవిన్యూ చట్టం అధికారాన్ని ఇస్తేనే, విచారణాధికారం లభిస్తుంద. విభాగం66 (3), భారత ఆదాయం పన్ను చట్టం (1922) ఉదాహరణకు ఒక నిబంధన ఉంది. ఆదాయం పన్ను అధికారి ఇచ్చిన ఉత్తరువు వల్ల నష్టపడ్డ వ్యక్తి, దీని ప్రకారం, సదరు అధికారిని హైకోర్టు వ్యాజ్యం వేయమని కోరవచ్చు. అతడు దానిని నిరాకరించిన పక్షంలో సదరు అధికారిని హైకోర్టులో వ్యాజ్యం వేయమని నిర్బంధించవచ్చు.

అటువంటి విజ్ఞప్తికి కాలపరిమితి ఉంటుంది. అయితే పరిమితి చట్టం దీనికి వర్తించదు. కాల పరిమితిని ఆదాయం చట్టం నిర్ణయిస్తుంది కానీ పరిమితి చట్టం కాదు.

## (4) శ్రామికులకు పరిహారం నిర్ణయించే కమిషనర్ ముందు ప్రొసీడింగ్స్

శ్రామికుల పరిహారం చట్టం, 1923, పనిలో వున్న శ్రామికులకు శారీరక హాని, గాయాలు తగిలితే పరిహారం చెల్లించటానికి సదుపాయం కల్పించింది. ఈ వాదాలను కమిషనర్ వింటాడు.

కమిషనర్ స్పెషల్ ట్రిబ్యునల్కానీ న్యాయస్థానం కాదు. అందువల్ల అతని ముందు తీసుకొనే చర్యలకు పరిమితి చట్టం వర్తించదు.

అయితే అతని ముందు నష్టపరిహారం కోసం చర్యలు తీసుకోవటం ఎప్పుడైన సాధ్యం అని దీని అర్థం కాదు. చట్టం కాలపరిమితి నిర్ణయించకపోతే ఈ విధంగా ఉండేది. చట్టం ఆరు నెలలు గడువు ఇచ్చింది కాబట్టి సదరు గడువు లోపల వాజ్యాలు వేయవచ్చు.

## (5) రిజిస్ట్రేషన్ చట్టం క్రింద చర్యలు

(1) పత్రాలను సమర్పించటం - నాలుగు నెలలు.

(2) పత్రాలను ప్రవేశపెట్టటానికి కక్షిదారులు హాజరవటానికి - నాలుగు మాసాలు.

## (3) క్రిమినల్ చర్యలు

(1) సాధారణంగా క్రిమినల్ చర్యలు ప్రభువు పేరిట తీసుకోవటం జరుగుతుంది. ఎందుకంటే అవి రాజు శాంతిని భగ్నం చేసేవిగా ఉంటాయి కాబట్టి.

(2) పరిమితి తీరినందున రాజు హక్కు భంగపడదని రాజ్యాంగంలో ఒక మౌలిక సూత్రం.

(3) ఇది ఇలా ఉండడం వల్ల పరిమితి చట్టం క్రిమినల్ చర్యలకు వర్తించదు.

(4) ఈ సందర్భంలో రెండు విషయాలను గుర్తుంచుకోవాలి.

(i) పై చట్టాల క్రింద విచారణ ప్రారంభించటానికి గడువును సూచించే అనేక చట్టాలున్నాయి. ఉదాహరణకు

భారత ప్రభుత్వ చట్టం, సెక్షన్ 128, సాల్ట్ అండ్ ఎక్స్‌సైజ్ ల్యాక్స్, పోలీస్ ఆక్ట్.

(2) పరిమితి చట్టం, క్రిమినల్ చర్యలకు ఎటువంటి కాలపరిమితిని విధించనప్పటికీ, Cr. P.C. క్రింద అప్పీళ్ళకు గడువును ఇస్తున్నది.

## (6) సివిల్ చర్యలు

(i) వివిధ నిబంధనల్లో వివిధ వ్యాజ్యాలను ప్రస్తావించటం జరిగింది. ఒక సాధారణ అవశేష నిబంధన 120 ఉంది. షెడ్యూల్‌లో ఎక్కడ కాలపరిమితిని నిర్ణయించింది. లేకపోతే ఈ నిబంధన క్రింద వాజ్యం వేయవచ్చు. ఈ చట్టం, అందువల్ల, అన్ని వ్యాజ్యాలకూ వర్తిస్తుంది.

(ii) అప్పీళ్ళకు సంబంధించినంత వరకూ భారతదేశంలో (1) జిల్లా జడ్జ్ కోర్టు (2) హైకోర్టు ఉన్నాయి. పరిమితి చట్టం ఈ రెండు న్యాయస్థానాల్లో అప్పీళ్ళను వేయటానికి అనుమతిస్తుంది. అందువల్ల పరిమితి చట్టం అన్ని అప్పీళ్ళకూ వర్తిస్తుందని చెప్పవచ్చు.

(iii) షెడ్యూల్‌లోని వివిధ నిబంధనలు వివిధ విజ్ఞప్తులను ప్రస్తావించాయి. వాజ్యాలకు సంబంధించిన నిబంధనల వలె నిబంధన 181 కూడా విజ్ఞప్తులకు కాలపరిమితిని నిర్ణయించలేదు. సెక్షన్ 48, C.P.C.లో కూడా ప్రస్తావన లేదు. అయితే దాదాపు అన్ని హైకోర్టులూ ఈ చట్టం అమలుకు C.P.C. క్రింద విజ్ఞప్తులకూ వర్తించదని స్పష్టమవుతుంది.

ఉదాహరణకు ఈ చట్టం కింది వాటికి వర్తించదు:-

(i) ప్రొబేట్ ఉత్తరువులు, వారసత్వం ధృవీకరణ పత్రాలకు

(ii) హైకోర్టు నిబంధనల క్రింద విజ్ఞప్తులకు

32 Bom. 1

48 Cal. 817

46 Cal. 249

(iii) స్థానిక లేదా ప్రత్యేక చట్టం క్రింద విజ్ఞప్తులు (అటువంటి చట్టం కల్పించినట్లైతేనే) C.P. కోడ్ క్రిందకు ఈ అంశాలు రావు.

## వ్యక్తుల విషయంలో

1. వాదులందరికీ పరిమితి వాదం వర్తిస్తుంది. ఇది సాధారణ నియమం.

2. ప్రారంభంలో పరిమితి రాజమకుటానికి వర్తించలేదు. కాలదోషం రాజమకుటానికి వర్తించదన్న కారణంతో అలా వాదించటం జరిగింది. క్రిమినల్ చర్యలకు వర్తించే ఈ వాదన సివిల్ వివాదాల్లో త్రోసిపుచ్చటం జరిగింది. అందువల్ల నిబంధన 149, (పరిమితి చట్టం) ప్రభుత్వం వేసే అన్ని వాజ్యాలకూ వర్తిస్తుంది. 60 సంవత్సరాలను కాలపరిమితిగా నిర్ణయించటం జరిగింది. ఈ కాలపరిమితి లోపల ప్రభుత్వానికి వ్యతిరేకంగా వాజ్యాలు వెయ్యాలి.

15 Mad. 315

అదే విధంగా, ప్రైవేట్ వ్యక్తులు ప్రభుత్వపరంగా వేసే వ్యాజ్యాలకు కూడా సాధారణ కాలపరిమితి చట్టం సూచించిన ప్రకారం వర్తిస్తుంది. ఇది ఎప్పుడూ పాటించవలసిన నియమం. నిర్ణీత సమయం లోపల వాజ్యం తీసుకురావటం ప్రభుత్వానికి ఎప్పుడూ వర్తించదు. అయితే ఈ పరిస్థితిని మార్చటం జరిగింది. అందువల్ల ఒక నియమంగా పరిమితి చట్టం ఇప్పుడు అందరికీ వర్తిస్తుంది. ప్రభుత్వ, ప్రైవేట్ వ్యక్తులు, అధికారాలు, ప్రభుత్వ సంస్థలు అన్నిటికీ సదరు చట్టం వర్తిస్తుంది. ప్రతివాదికి కాలపరిమితిని ఆధారంగా వాదికి వ్యతిరేకంగా వాదించటానికి అవకాశం లభించింది.

3. ప్రతి ప్రతివాదికి పరిమితి చట్టం లభ్యమవుతుంది. అయితే దీనికి కొన్ని మినహాయింపులు ఉన్నాయి.

37 Bom. - S.R. 471

## సెక్షన్ - 10

I. ఒక వ్యక్తిలో ధర్మనిధి ఆస్తి హక్కుగా నిక్షిప్తమై ఉన్నపుడు అతనికి పరిమితి కింద సమర్థించుకోటానికి అవకాశం లభించదు. అలాగే అది అతని చట్టపరమైన ప్రతినిధులకు కూడా లభ్యంకాదు. ఆస్తిని స్వాధీనత కోసం వేసే వాజ్యానికి అతడికి అవకాశం లేదు. ఈ సెక్షన్ ప్రకటిత ధర్మనిధికి మాత్రమే వర్తిస్తుంది. సూచిత, నిర్మాణాత్మక నిధులకు ఇది వర్తించదు. కాలపరిమితిని సూచిత, సంభావ్య నిధి ధర్మకర్త ఉపయోగించుకోవచ్చు.

### ప్రకటిత, సూచిత, సంభావ్య ధర్మనిధుల మధ్య వ్యత్యాసం

ఒకరి తరపున వ్యవహరించే వ్యక్తులు ధర్మకర్తలు కారు. దీనిని సెక్షన్ 10 ప్రస్తావించింది. ఉదా. మానేజర్లు ఏజెంట్లు, బినామీదార్లు, బాకర్, పాలకుడు, మొదలైనవారు.

రెండు, సెక్షన్ 10 ఎవరికైతే ఆస్తిని ఇవ్వటం లేదా నిక్షేపితం *చేయడం జరుగుతుందో వారి విషయంలోనే వర్తిస్తుంది. వారికి ధర్మనిధి ఒక ప్రత్యేక ప్రయోజనం కల్పించింది.

44 Mad. 277 (281-2)

### ఏది ప్రత్యేక ప్రయోజనం?

ప్రత్యేక ప్రయోజనం అంటే పత్రంలో పేర్కొన్న ప్రయోజనం. దానికోసమే ధర్మనిధి ఏర్పాటు జరుగుతుంది.

49 I.A. 37(43)

58 I.A. 1

---

* నిక్షేపిత అంటే ఏమిటి? అందులో ఈ క్రిందివి ఉండవు:-

(1) అతడు దేనినైతే పొందుతాడో వాటికి అతడిని బద్ధుడుగా చేసేయటానికి వేసే వ్యాజ్యాలు.

(2) ధర్మనిధి ఆస్తులను నిర్వహించటానికి వారికి వ్యక్తిగత హక్కు కోసం చేసే వ్యాజ్యాలు.

(3) చట్టవిరుద్ధ ధర్మనిధి ఉంటే, సదరు నిధి ఆస్తిని ధర్మకర్తల నుండి పొందటానికి వేసే వ్యాజ్యాలు. ఆ ప్రక్రియలో మరో ధర్మనిధి అమలుకు చేసే ప్రయత్నం.

-20 Bom. 511

(4) విశ్వాసాన్ని వమ్ముచేసినప్పుడు పరిహారం కోసం వేసే వ్యాజ్యం.

-58 I.A. 279 (297)

అందువల్ల ధర్మకర్త కూడా ఈ సెక్షన్ పరిధి క్రిందకు వస్తాడు.

## ''ధర్మకర్త'' అర్థము

వివరణ హిందూ, ముస్లిం, క్రైస్తవ మరియు

ప్రజాహిత కార్యంకు చెందినవి ప్రకటిత ధర్మనిధులుగా వాటి నిర్వాహకులను ధర్మకర్తలుగా ప్రకటిస్తారు.

మూడు: సెక్షన్ 10 తప్పుచేసిన ధర్మకర్తకే కాకుండా అతని చట్టపరమైన ప్రతినిధికి కూడా వర్తిస్తుంది. అయితే ధర్మకర్త తప్పుడు వ్యవహారాల వల్ల ఆస్తిని కొనుగోలు చేసిన వ్యక్తులకు రక్షణ కల్పించటం జరుగుతుంది. వారు కాలపరిమితి క్రింద వాదించవచ్చు.

ధర్మకర్తనుంచి కొనుగోలుదారులు మాత్రమే కాకుండా ధర్మనిధికి ఎటువంటి నోటీస్ ఇవ్వకుండా ధర్మనిధి ఆస్తులను కొనుగోలు చేసే వారి గురించి ఈ సెక్షన్ మౌనంగా ఉంది. ఈ విషయంలో, న్యాయస్థానాల అభిప్రాయాలు పరస్పర వ్యతిరేకంగా ఉన్నాయి.

సెక్షన్ 29 (3) II (పరిమితి చట్టం), భారత వివాహాల చట్టం (**IV of 7869**) కింద వచ్చే వ్యాజ్యాలకు వర్తించదు.

(పుట ఖాళీగా ఉంది. సం.)

## ప్రత్యేక చట్టానికి వ్యతిరేకంగా

1. సాధారణ కాలపరిమితి చట్టంతోపాటు కొన్ని ప్రత్యేక, స్థానిక చట్టాలు వాజ్యాలకు కాలపరిమితిని నిర్ణయిస్తున్నాయి. అవి అప్పీళ్ళకు, విజ్ఞప్తులకు కూడా వర్తిస్తాయి.

సాధారణ చట్టం, ప్రత్యేక చట్టాలు నిర్దేశించిన కాలపరిమితి వ్యత్యాసం ఉంటే ఏ చట్టం వర్తిస్తుంది అన్న ప్రశ్న ఉదయిస్తుంది.

2. సెక్షన్ 29 ఈ ప్రశ్నకు సమాధానం ఇచ్చింది. సాధారణ చట్టంపై ప్రత్యేక చట్టం ఈ సందర్భంలో ఆధిక్యత కలిగి ఉంటుందని ఈ సెక్షన్ చెబుతున్నది.

(3) సాధారణ చట్టానికే ప్రత్యేక చట్టానికి మధ్య ఘర్షణ ఏర్పడితే మిగతా సెక్షన్లు వర్తిస్తాయా, వర్తించవా అనే అంశాన్ని కూడా సెక్షన్ 29 ప్రస్తావించింది.

(4) సంఘర్షణ ఏర్పడినప్పుడు, పరిమితి చట్టంలోని సెక్షన్లు 4, 9 నుంచి 22 వరకూ

అటువంటి వివాదాలకు వర్తిస్తాయి అని సెక్షన్ 29 చెబుతున్నది (ప్రత్యేకంగా వర్తించవు అని చెబితే తప్ప) మిగిలిన నిబంధనలు వర్తించవు. (అవి వర్తిస్తాయి అని ప్రత్యేక చట్టం చెబితే తప్ప)

## పరిమితి చట్టం – నిర్మాణం

1. ఇండియన్ పరిమితి చట్టంలో ఒక షెడ్యూల్, 29 సెక్షన్లు ఉన్నాయి.
2. షెడ్యూలు మూడు భాగాలుగా విభజితమైంది.

   మొదటి భాగం - వ్యాజ్యాలకు సంబంధించినది

   రెండవ భాగం - అప్పీళ్ళకు సంబంధించినది

   మూడవ భాగం - విజ్ఞప్తులకు సంబంధించినది

3. షెడ్యూల్‌లోని ప్రతి సెక్షన్ మళ్ళీ మూడు గడులు (Column) గా ఉంది.

గడి-I: హక్కు అమలు కోసం వేవ్యా వాజ్యం, అప్పీలు, విజ్ఞప్తి, మొదలైన వాటి స్వభావం గురించి ప్రస్తావిస్తుంది.

154 విభిన్న వ్యాజ్యాలను పేర్కొంది.

9 విభిన్న అప్పీళ్ళను పేర్కొంది.

26 విభిన్న విజ్ఞప్తులను ప్రస్తావించింది.

ఇవన్నీ వరుస క్రమంలో అంకెల్లో ఉన్నాయి. వాటిని నిబంధనలు అంటారు. షెడ్యూల్ మొత్తం 189 నిబంధనలున్నాయి. కొన్ని నిబంధనలకు ఒకే అంకెలుండటం వల్ల వాటిని ప్రత్యేకంగాగుర్తించటానికి వాటికి A అనే అక్షరం చేర్చటం జరిగింది.

<u>గడి-II:</u>

వ్యాజ్యం, అప్పీళ్ళు, విజ్ఞప్తులు దాఖలు చేయవలసిన ప్రత్యేక వాదాన్ని పేర్కొంది.

<u>గడి-III:</u>

ఈ విభాగాలన్నీ పరిమితి చట్టం గురించి ప్రస్తావించాయి. మూడు గడులలో ప్రస్తావించిన అంశాలకు సంబంధించిన అంశాలను వివరిస్తున్నాయి. అందువల్ల పరిమతి చట్టంలోని షెడ్యూల్ చాలా ముఖ్యమైంది.

# IV పరిమితి చట్టం

## 3వ కాలమ్ నుంచి ఉత్పన్నం అయ్యే ప్రశ్నలు

మూడవ కాలమ్‌లోని విషయాలు

1. పరిమితి ప్రారంభ స్థానం నుంచి సెక్షన్ 3 చెబుతున్నది. ఇందులో రెండు ప్రశ్నలున్నాయి: అవి:-

(i) సమయం ఎప్పుడు మించిపోవటం ప్రారంభమవుతుంది?

(ii) పరిమితికి ఒక్క ప్రారంభ స్థానమే ఉంటుందా?

I. ఎప్పుడు సమయం మించిపోవటం ప్రారంభమవుతుంది?

పరిమితి ఏది ప్రారంభ స్థానం?

1. దీనికి సమాధానం ఈ విధంగా ఉంటుంది. సెక్షన్ 3లో చెప్పినట్లు సంఘటన జరిగినప్పటికి మంచి సమయం వ్యాజ్యం వేయటానికి, అప్పీలుకు, అభ్యర్థనకు ప్రారంభమవుతుంది. సంఘటన జరగటం అన్ని వివాదాల్లో ముఖ్యము. అయితే కొన్నిట్లో సంఘటన జరిగినది వాదికి తెలియటం - 90-92 ముఖ్యం. సంఘటన జరగటం లేదా దాని గురించి వాదికి తెలియటం అనేది కాకుండా సెక్షన్ 3లో పేర్కొన్నట్లు సంఘటన జరగటం పరిమితికి ప్రారంభ స్థానం.

వ్యాజ్యం వేయటానికి హక్కు, చర్యకు పరిష్కారానికి సంబంధించి రెండు ప్రశ్నలు తలెత్తుతాయి.

(i) చర్యకు కారణం ఉన్నప్పుడు వాది తప్పనిసరిగా వ్యాజ్యం వెయ్యాలి?

2. వ్యాజ్యాల వరకు పరిమితం అవుతే వ్యాజ్యం వేయటానికి హక్కు ఏర్పడినప్పటి నుంచి సమయం ప్రారంభమవుతుందని చెప్పవచ్చు - నిబంధన 120. ఇది మొదటి ప్రాథమిక నియమం.

ఎప్పుడు వ్యాజ్యం వేయటానికి హక్కు ఏర్పడుతుంది? అది ఏర్పడేది-

(1) సంఘటన సెక్షన్ 3లో చెప్పినట్లు జరిగినప్పుడు పేర్కొన్న నిబంధనల క్రింద వ్యాజ్యం వచ్చినట్లైతే

(ii) వ్యాజ్యం ఏ ప్రత్యేక నిబంధన కిందకు రానట్లైతే 120 సాధారణ నియమం కింద అది వచ్చినట్లైతే అప్పుడు వ్యాజ్యానికి హక్కు- చర్యకు కారణం ఏర్పడినప్పుడు ప్రారంభమవుతుంది. లేదా కొన్ని సందర్భాల్లో వాది చర్యకు కారణం ఏర్పడింది అని తెలుసుకొన్నప్పుడు సమయం ప్రారంభమవుతుంది. చర్యకు కారణం తెలుసుకొన్నప్పటి నుంచి సమయం ప్రారంభమవుతుంది.

ఒక కక్షిదారునికి తప్పిదం జరిగినప్పుడు చర్యకు కారణం (Cause of action) ఏర్పడుతుంది. ప్రతి తప్పు చర్యకు కారణం అవదు. అప్పుడున్న పరిస్థితులో తప్పిదం వాస్తవమై చర్య అవసరం అవ్వాలి.

(iii) పరిమితి ప్రారంభ సమయంకంటె మరణం ప్రధానం.

1. వ్యాజ్యం వేయటానికి హక్కు- ఏర్పడటానికి ముందు ఒక వ్యక్తి మరణిస్తే కాలపరిమితి ఎప్పుడు ప్రారంభమవుతుంది?

2. మరొ వ్యక్తికి దావా వేయటానికి హక్కు- ఏర్పడటానికి ముందు వ్యక్తి మరణిస్తే కాలపరిమితి ఎప్పుడు ప్రారంభమవుతుంది?

I. ఒక వ్యక్తికి దావా వేసే హక్కు- లభ్యం కావటానికి ముందు అతడు మరణిస్తే అటువంటి దావా వేయటానికి అతని చట్టపరమైన ప్రతినిధికి అర్హత ఏర్పడినప్పుడు పరిమితి ప్రారంభ మవుతుంది.

II. ఒక వ్యక్తికి విరుద్ధంగా దావా వేయటానికి హక్కు- ఏర్పడటానికి ముందు అతడు మరణిస్తే కాలపరిమితిని అతడిచట్టబద్ధమైన ప్రతినిధి నిర్ధారణ అయినప్పటినుంచి అతనికి వ్యతిరేకంగా దావా వేయటానికి లెక్కించటం జరుగుతుంది.

## ప్రాథమిక నియమానికి మినహాయింపులు

**దావా వేయటానికి హక్కు- ఏర్పడినప్పటి నుంచి కాలపరిమితి ప్రారంభమవుతుంది.**

### I. దావా వేయుటానికి ముందే కాలపరిమితి ప్రారంభమయ్యే వివాదాలు

(i) డిమాండ్ చేసినప్పుడు చెల్లించవలసిన ధనం, బిల్లుపై లేదా ప్రోనోటుపై చెల్లించవలసిన మొత్తం.

ఈ వివాదాల్లో ధనంచెల్లించాలన్న డిమాండ్ ఉంటే, సదరు సొమ్మును చెల్లించటాన్ని తిరస్కరిస్తే దావావేసే హక్కు ఏర్పడుతుంది. అయితే దావా వేసే సమయం, డబ్బు చెల్లించటాన్ని తిరస్కరించినప్పటి నుంచి కాక అప్పు తీసుకున్న తేదీ నుంచి బిల్లు తాలూకూ తేదీ నుంచి ఏర్పడుతుంది. 57-58-59-67-73.

### (ii) తాకట్టును విడిపించుకోవటం - దావాలు

తాకట్టుదారుడు తన వస్తువును విడిపించుకోటానికి దావా వేసే సమయం అతడు సదరు తాకట్టుకు చెల్లించవలసిన మొత్తం చెల్లించిన నాటినుంచి ఏర్పడుతుంది. అయితే సమయం తాకట్టు సొమ్ము చెల్లించినప్పటి నుంచి కాకుండా తాకట్టు పెట్టిన నాటినుంచి ప్రారంభమవుతుంది. అంటే దావా వేసే హక్కు ముందే ఏర్పడుతుంది - 145

### దావావేసే హక్కు ఏర్పడ్డాక కూడా కాలపరిమితి ప్రారంభం కాని వివాదాలు సెక్షన్లు 6,7,8

(1) ఒక వ్యక్తికి దావా వేసే హక్కు లభించినప్పటికే అతడు అసహాయత వల్ల ఆ తేదీ నాడు దావా వేయలేని వివాదాలు కూడా ఉన్నాయి.

(2) అతడికి దావా వేసే హక్కు లభించినప్పటికీ అసహాయత వల్ల ఇబ్బంది పడుతున్నప్పుడు అతనికి కాలపరిమితి నుంచి మినహాయింపు లభిస్తుంది.

(3) ఇక్కడ మూడురకాల అసహాయతను మాత్రమే గుర్తించటం జరిగింది.

(i) మైనారిటీ

(ii) మతిభ్రమణం

(iii) తెలివితక్కువ స్థితి

(4) అసహాయతతో బాధపడుతున్న వ్యక్తికి సదరు అసహాయత నుంచి విముక్తుడైన నాటి నుంచి కాలపరిమితి ప్రారంభమవుతుంది.

(5) ఈ అసహాయతలన్నీ ఒకసారి ఏ కాలంలో ప్రారంభం అయితే లేదా ఒకదాని తర్వాత మరొకటి మొదలైతే మొత్తం అవన్నీ పోయిన నాటినుంచి కాలపరిమితి ప్రారంభమవుతుంది.

(6) అతడు మరణించేంతవరకూ అసహాయత కొనసాగితే, అతడి చట్టబద్ధ ప్రతినిధికి, సదరు వ్యక్తి మరణించిన నాటినుంచి కాలపరిమితి ప్రారంభమవుతుంది.

(7) చట్టబద్ధమైన ప్రతినిధి, సదరు వ్యక్తి మరణించిననాడు అసహాయత స్థితిలో ఉంటే అతడి సదరు స్థితి తొలగిన నాటినుంచి కాలపరిమితి ప్రారంభమవుతుంది.

(8) కాలపరిమితి ప్రారంభమైనప్పుడు దావా వేయవలసిన వ్యక్తులందరూ అసహాయస్థితిలో ఉంటే ఏమవుతుంది?

ఇక్కడ రెండు వివాదాలను వ్యత్యాసీకరించాలి:-

(i) వారిలో కొందరే అసహాయ స్థితిలో ఉన్నప్పుడు

(ii) వారందరూ అసహాయ స్థితిలో ఉంటే.

<u>I. వారిలో కొందరే అసహాయ స్థితిలో ఉన్న వివాదాలు</u>

(i) అసహాయతకింద ఉండని ప్రతివాదికి పూర్తి విడుదల ఇవ్వటం లేకుండా అసహాయత వల్ల బాధ పడుతున్న వ్యక్తి సమ్మతి అయిన సందర్భంలో వారందరి వ్యతిరేకంగా హక్కు ప్రారంభమైన నాటినుంచి కాలపరిమితి మొలవుతుంది.

(ii) ఎక్కడ సదరు విడుదల సాధ్యం కానప్పుడు అసహాయత పోయినప్పటి నుంచీ లేదా అసహాయత వల్ల బాధపడుతున్న వ్యక్తి ఆసక్తిని కోల్పోయినప్పటి నుంచే కాలపరిమితి ప్రారంభమవుతుంది.

<u>II. దావా వేయవలసిన వారందరూ అసహాయ స్థితిలో ఉన్న వివాదాలు</u>

(i) అందరూ అసహాయ స్థితిలో ఉంటే సెక్షన్ 6లో ఉన్న నియమాలు వారికి వర్తిస్తాయి.

(ii) వారిలో ఒకరు అసహాయ స్థితినుంచి బయటపడితే అప్పుడు సెక్షన్ 7 వర్తిస్తుంది. అయితే ఇక్కడ ప్రశ్న ఏమిటంటే అసహాయత నుంచి విముక్తి పొందిన వ్యక్తి అసహాయత వల్ల బాధపడుతున్న ఇతరుల సమ్మతి లేకుండా సార్థక విడుదల పొందగలడా? సమాధానం 'అవును' అయితే అందరికీ వ్యతిరేకంగా కాలపరిమితి ప్రారంభమవుతుంది. సమాధానం వ్యతిరేకంగా ఉంటేసమయం ఎవరికీ వ్యతిరేకంగా ప్రారంభం కాదు. వారందరూ అసహాయ స్థితినుంచి బయటపడేంతవరకూ కాలపరిమితి ప్రారంభం కాదు.

(9) అసహాయత పోయినప్పటి నుంచి అసహాయత నుంచి బాధపడుతున్న వ్యక్తికి దావా వేసే హక్కు లభ్యమైనప్పటి నుంచి ఎప్పుడు ధావా వేయవచ్చు?

1. ఈ ప్రశ్నకు మూడు సమాధానాలున్నాయి

**(i)** దావా వేసే హక్కు లభ్యం అయిననాటినుంచి నిర్ణీతమైన సమయ లెక్కింపు ప్రారంభమవుతుంది. అసహాయత పోయిన తర్వాత ఈ గడువు ఇంకా ఉంటే దాని గరిష్ఠ పరిమితి మూడు సంవత్సరాలు.

ఉదాహరణ

నిర్ణయించిన కాలం - 12 సంవత్సరాలు. 1920 నుంచి 1932.

అసహాయత కాలం - నాలుగు సంవత్సరాలు.

1924 - 1936

మిగిలిన సమయం 9 సంవత్సరాలు. అందువల్ల దావాను 1932 లోపల వెయ్యాలి. నిర్ణయించిన సమయం లోపల దావా వెయ్యాలి. అందువల్ల అతడికి ఎటువంటి లాభం ఉండదు. అతని కాలాన్ని కూడా దావా చేసే హక్కు ఏర్పడినప్పటి నుంచి [illegible] ప్రారంభమవుతుంది.

**(ii)** కాలపరిమితికి మూడు సంవత్సరాల కంటే తక్కువగా ఉంటే అసహాయత పోయిన కాలాన్ని నిర్ణీత కాలపరిమితి నుంచి లెక్కకట్టాలి.

అతడు అసహాయ స్థితి నుంచి లాభం పొందుతాడు. అతడి కాలం అసహాయ స్థితినుంచి విముక్తుడయినప్పటి నుంచి లెక్కలోకి వస్తుంది.

ఉదాహరణ

నిర్ణయించిన కాలం 1 సంవత్సరం

1920 నుంచి 1921 వరకూ.

అసహాయ స్థితి కాలం - 4 సంవత్సరాలు.

**S.P. 1924 Bar 1925**

దావాను 1925 లోపున చెయ్యాలి.

**(iii)** మూడు సంవత్సరాలు అసహాయ స్థితి నుంచి బయటపడే నాటికి ఉంటే మూడు సంవత్సరాల్లోగా దావా వెయ్యాలి. నిర్ణయించిన కాలం మూడు సంవత్సరాలకు పైగా ఉంటుంది.

నిర్ణయించిన కాలం ఆరు సంవత్సరాలు 1920 నుంచి 1926 వరకు.

అసహాయ స్థితి సంవత్సరాలు- 4 సంవత్సరాలు 1924 - Bar 1930. అసహాయ స్థితి నుంచి బయటపడ్డాక మిగిలిన సమయం - 2 సంవత్సరాలు.

అసహాయ స్థితి నుంచి బయటపడిన నాటినుంచి మూడు సంవత్సరాల్లోగా 1928 లోగా దావా వెయ్యాలి.

(10) అసహాయతకు సంబంధించి గుర్తుంచుకోవలసిన అంశాలు

(i) డిక్రీల అమలుకు సంబంధించిన వాజ్యాలకే కాదు సెక్షన్ వరిస్తుంది కానీ ఇతర విజ్ఞప్తులు, అప్పీళ్ళకు వర్తించదు.

(ii) దావా చేసే హక్కును పొంది అప్పటికే అసహాయత స్థితిలో ఉన్న వ్యక్తికే ఈ విభాగం వర్తిస్తుంది. తర్వాత అసహాయ స్థితి తొలగిపోతే సదరు విభాగం అతనికి వర్తించదు.

(iii) అసహాయత క్రింద దావా వేసే వ్యక్తికే వాదికే ఈ విభాగం వర్తిస్తుంది. ప్రతివాది అసహాయత - దావాకు గురయ్యే వ్యక్తి - పరిగణనలోకి రాదు.

ప్రతివాది అసహాయత నుంచి బాధపడుతున్నప్పటికీ వాదికి కాలపరిమితి సాగిపోతూంటుంది.

మొదటి ప్రాథమిక నియమం ఏమిటంటే సెక్షన్ 3లో ప్రస్తావించిన సంఘటన జరిగినప్పటి ంంచి అసహాయతతో బాధపడని వ్యక్తి కాలపరిమితి ప్రారంభమవుతుంది. ఎటువంటి సంఘటన ెక్షన్ 3 ప్రస్తావించకపోతే చర్యకు కారణం లభ్యమైనప్పటి నుంచి కాలపరిమితి ప్రారంభవుతుంది.

## ప్రాథమిక నియమం II

I. (1) ఒకసారి కాలపరిమితి ప్రారంభమైనదంటే ఆ తర్వాత ఏర్పడే అసహాయత దావాను పలేదు. గడువు గడిచిపోతూనే ఉంటుంది.

(2) అంటే ఒకసారి పరిమితి ప్రారంభమైందంటే దానిని ఆపలేము. ఒక వ్యక్తి తన హక్కు ారంభమైన తర్వాత మతి స్థిమితాన్ని కోల్పోయిన, మరణించినా గడువు అతనికి వ్యతిరేకంగా పుస్తూనే ఉంటుంది.

II. పరిమితి ప్రారంభం అవటానికి ఒక ప్రారంభ సమయం ఉంటుందా? లేదా మరో తాజా ప్రారంభ సమయం ఉంటుందా?

1. చర్యకు తాజా కారణం ఏర్పడటానికీ పరిమితికి తాజా ప్రారంభం ఏర్పడటానికీ మధ్య ఉన్న వ్యత్యాసాన్ని గమనించాలి. ఒక కారణం వల్ల ఏర్పడే చర్యకు సంబంధించిన తాజా పరిమితి ప్రారంభాన్ని మనం ఇక్కడ పరిశీలిస్తున్నాము.

(2) సాధారణ కాలపరిమితి చట్టం నియమం ఏమిటంటే కాలపరిమితి ప్రారంభం ఒక్క పర్యాయమే మొదలవుతుంది. ఆ ప్రారంభ కాలం దావా వేయటానికి హక్కు ఏర్పడినప్పటి నుండే.

(3) ఒక కారణం వల్ల చర్య అవసరమైనప్పుడు తాజా కాలపరిమితికి మూడు సందర్భాలున్నాయి. అవి:

(i) రుణాన్ని అంగీకరించినప్పుడు (Acknowledgement)

(ii) ఎక్కడ కొంత మొత్తం చెల్లించటం జరిగిందో

(iii) వరుసగా ఒప్పందాన్ని ఉల్లంఘించే వివాదంలో చర్య అవసరం అయ్యే సందర్భం లేదా ఒప్పందంతో సంబంధం లేకుండా వరుసగా తప్పిదం జరిగినప్పుడు.

## సెక్షన్ - 19 - రుణం అంగీకారం (గుర్తింపు)

## I. సాధారణంగా

1. కాలపరిమితి పూర్తి అవకముందే రుణగ్రస్తుడు ఆ విషయాన్ని అంగీకరించాలి. కాలపరిమితి పూర్తి అయిన తర్వాత గుర్తిస్తే మరో కాలపరిమితి సాధ్యం కాదు

(2) రుణ గుర్తింపు లిఖిత రూపంలో ఉండాలి.

(3) బాధ్యత ఉన్న వ్యక్తి గుర్తింపు పత్రంపై సంతకం చెయ్యాలి లేదా అతని ప్రతినిధి సంతకం చేయాలి.

(4) రుణదాత రసీదు ఇవ్వవలసిన అవసరం లేదు.

(5) కొనసాగుతున్న బాధ్యత/ అప్పును ఆ గుర్తింపు చూపించాలి. అది చెల్లించటానికి వాగ్దానం చేయవలసిన అవసరం లేదు. నిజానికి అందులో చెల్లింపుకు తిరస్కరణ కూడా ఉండవచ్చు.

II. సెక్షన్21(2) - సంయుక్తంగా బాకీ ఉన్న వ్యక్తులు ఇచ్చే గుర్తింపు ఒక హిందూ వితంతువు లేదా పరిమిత యజమాని ఇచ్చే రసీదు అందరినీ బాధ్యులను చేస్తుంది.

IV. సెక్షన్ 21(3) ఒక హిందూ నిర్వాహకుడు ఇచ్చే గుర్తింపు పత్రం

అవిభక్త హిందూ కుటుంబం యజమాని సంతకం చేసి/ వాది అతని ప్రతినిధి సంతకం చేసిన గుర్తింపు పత్రం మొత్తం కుటుంబాన్ని బాధ్యులను చేస్తుంది. కుటుంబానికి సంబంధించిన అన్ని రుణాలకు కుటుంబ సభ్యులందరూ బాధ్యులే.

వారసత్వం ద్వారా వచ్చిన బాకీపై చెల్లించే వడ్డీ - సెక్షన్ 20 - అసలు చెల్లింపు

(1) కాలపరిమితి పూర్తికాకముందే చెల్లింపు జరగాలి.

(2) రుణగ్రహీత లేదా అతని ప్రతినిధి చెల్లింపు పూర్తి చెయ్యాలి.

(3) చెల్లింపు స్వచ్ఛందంగా జరగాలి.

సెక్షన్ - 23 ఒప్పందాన్ని నిరంతరం ఉల్లంఘించటం ఒప్పందంతో సంబంధం లేకుండా తప్పిదం వరుసగా చేయటం

1. ఒడంబడికను నిరంతరం ఉల్లంఘించే వివాదంలో లేదా నిరంతరం తప్పిదం చేసే వివాదంలో ఉల్లంఘించినప్పుడల్లా లేదా తప్పు చేసినప్పుడల్లా తాజా కాలపరిమితి ప్రారంభమవుతుంది.

ప్రశ్న:-

నిరంతరం ఉల్లంఘించటం నిరంతరం తప్పు చేయటం అంటే ఏమిటి?

ఒప్పందం నిరంతర ఉల్లంఘన

(1) అద్దెకు ఇచ్చిన చోట మరమ్మతు చేయాలని ఒప్పుకొని సదరు మరమ్మతు చేయకపోవటం.

(2) లీజు ఒప్పందం వ్యతిరేకంగా నివాస స్థలాన్ని వినియోగించటం

తప్పిదం (Tort) టార్ట్ విషయంలో వరుసగా చేయటం

1. ట్రేడ్ మార్క్‌ను అతిక్రమించటం

2. భార్యా భర్త వద్దకు పోవటానికి నిరాకరించటం

3. నిరంతరం తప్పుచేయటం, నిరంతరం రాకుండా అప్పుడప్పుడు తప్పు చేయటానికి మధ్య వ్యత్యాసాన్ని గుర్తించటం చాలా కష్టము. ఒక తప్పిదం కొనసాగుతుంది. దాని ప్రభావం నిరంతరం కనపడకున్నట్లైతే ఒక తప్పిదం ఒక్కసారే చేసినప్పటికీ దాని ప్రభావం నిరంతరం కొనసాగటం లేదా అదే తప్పుడు చర్యకు తిరిగి తిరిగి పూనుకొన్నపుడు.

నిరంతరం కొనసాగే తప్పిదం వివాదం ఏది అంటే తప్పిదం తిరిగి తిరిగి జరిగినప్పుడే కానీ దాని ప్రభావం నిరంతరం కొనసాగనప్పుడు.

* * *

# 6. బ్రిటిష్ ఇండియాలో నేర ప్రక్రియ చట్టం

## (THE LAW OF CRI INAL PROCEDURE IN BRITISH INDIA)

# బ్రిటిష్ ఇండియాలో నేర ప్రక్రియ చట్టం

## ప్రాథమికాంశం

### తప్పిదాన్ని సరిదిద్దుకోవడం

**1.** అమెరికా రాజ్యాంగంలోని ఒక నిబంధన ఈ విధంగా చెబుతున్నది.

''తగిన న్యాయ ప్రక్రియ లేకుండా ఏ పౌరుని ప్రాణం, స్వేచ్ఛ, ఆస్తులను, పరిహరించరాదు.''

ఇతర రాజ్యాల రాజ్యాంగంలో సదరు నిబంధన మనకు కనబడదు. అయినప్పటికీ ప్రతీ నాగరిక రాజ్యమూ పౌరునికి అతని ప్రాణం, స్వేచ్ఛ ఆస్తులపై జరిగే అక్రమ దాడుల నుంచి రక్షించడానికి ప్రయత్నిస్తుంది.

అటువంటి రక్షణ హామీయే రాజ్యానికి పునాది వంటిది. ఇటువంటి లక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకుని, ప్రతి రాజ్యాంగం తప్పిదాలకు సంబంధించిన చట్టాలను రూపొందించుకుంది. భారతదేశంలో నేరసంహితం టార్ట్‌కు (Torts)కు సంబంధించిన చట్టాలు ఉన్నాయి.

**2)** తప్పిదాలు పౌర (సివిల్) లేదా నేర (క్రిమినల్) పరంగా ఉంటాయి. కొన్ని తప్పిదాలు పౌర, నేర సంబంధిత పరంగా ఉంటాయి. ఉదాహరణకు దాడి చేయడం లేదా పరువు నష్టం కలిగించడం. ఇవి పౌర మరియు నేరపరంగా చేసే సివిల్, క్రిమినల్ తప్పిదాలు. బాధిత వ్యక్తి సివిల్ న్యాయస్థానానికి మరియు నేర (క్రిమినల్) న్యాయస్థానానికి కూడా వెళ్ళవచ్చు.

**3)** పరిహార పద్ధతి: తప్పిదాలను సరైన పరిహార పద్ధతులను సూచించకుండా, కేవలం వాటికి సంబంధించిన చట్టాలను రూపొందిస్తే ఎటువంటి ఉపయోగం ఉండదు. జరిగిన తప్పిదానికి సరైన పరిహారం లేకపోతే ప్రయోజనం ఉండదు. చట్టం పరిహారం కల్పించ గలిగినపుడే దాన్ని తప్పిదంగా గుర్తించినట్లవుతుంది. అలాకాకపోతే, తప్పిదం జరిగినపుడు అందుకు పరిహారాన్ని కూడా సూచించలేకపోతే వ్యర్థ ప్రియమవుతుంది.

---

X పేరాగ్రాఫ్ నంబర్లు మూలంలో ఉన్నట్లు తీసుకోవటం జరిగింది.

## వ్యక్తిగత స్వేచ్ఛ - హెబియస్ కార్పస్ రిట్

4) నేర ప్రక్రియ సంహిత పరిష్కారాలను చేసే చట్టం. నేరస్థులను శిక్షించడానికి నష్టపడిన వ్యక్తిని సంరక్షించడానికి అతనికి జరిగిన అన్యాయాన్ని సరిదిద్దడానికి చట్టం పరిహార మార్గాన్ని కల్పిస్తుంది. ఒక నిర్దోషిని శిక్షించడం కన్నా పది మంది నేరస్థులను వదిలి వేయటాన్నే చట్టం అనుమతిస్తుందనే భావన ప్రచారంలో ఉన్నది. అయితే పూర్తిగా ఇది తప్పుడు భావన. చట్టం ఏమి చెబుతుందంటే ఏ వ్యక్తినైనా చట్టం సూచించిన పద్ధతిలో మినహా విచారణ జరపరాదు.

5) నేర ప్రక్రియ ఈ క్రింది విధంగా ఉన్నది.

1. నేర విచారణ న్యాయస్థానాలను ఏర్పాటు చేయడం.
2. నిందితుడిని ఏవిధంగా న్యాయస్థానంలో హాజరుపరచాలో దానికి తగిన పద్ధతులను సూచించడం.
3. నిందితుడి విచారణకు సంబంధించిన నియమాలు.
4. శిక్షకు సంబంధించిన నియమాలు.
5. నిందితుడి విచారణలో నేర నిర్ధారణ విషయంలో కాని, శిక్షకు సంబంధించికాని తప్పు జరిగినట్లయితే దానిని సరిదిద్దడానికి సంబంధించిన నియమాలు.

* * *

## 1. నేర విచారణ న్యాయస్థానాలు

7. ఈ అంశాన్ని సరిగ్గా అర్థంచేసుకోవాలంటే ప్రెసిడెన్సీ పట్టణాల్లో వ్యవస్థ మరియు ప్రావిన్షియల్ వ్యవస్థకు మధ్య తేడాలను తెలుసుకోవాలి.

భారతదేశంలో ఇతర చట్టాలకు సంబంధించి కూడా సదరు తేడాలను పరిశీలించడం కూడా జరుగుతున్నది. ఉదాహరణకు దివాళా తీయడం.

1. ప్రెసిడెన్సీ టౌన్స్ దివాళా నిర్ధారణ చట్టం.

   స్వల్ప (ధన) వివాదాలు

1. ప్రెసిడెన్సీ టౌన్స్ స్వల్పవివాదాల న్యాయస్థానాల చట్టం.
2. ప్రావిన్షియల్ స్వల్ప వివిదాల న్యాయస్థానాల చట్టం.

# ప్రావిన్షియల్ వ్యవస్థ

## 1. సెషన్స్ కోర్టు

సెక్షన్ 7(1)

8.1. ప్రతి ప్రావిన్స్‌లో ఒకటి లేదా ఎక్కువ సెషన్సు కోర్టులు ఉంటాయి. ప్రతి సెషన్ విభాగము ఒక జిల్లా లేదా అంతకంటే ఎక్కువ జిల్లాలతో సమంగా ఉంటుంది. 9(3)

3. ప్రతి సెషన్స్ విభాగానికి ముగ్గురు అదనపు న్యాయమూర్తులు మరియు అసిస్టెంట్ న్యాయమూర్తులు ఉంటారు. వీరి అధికారపరిధి ఒకటీ లేదా అంతకంటేఎక్కువ సెషన్సు న్యాయస్థానాలకు విస్తరించి ఉంటుంది.

సెక్షన్ 9(2)

4. స్థానిక ప్రభుత్వం నిర్ధారించిన ప్రకారము సెషన్సు కోర్టు ఒక ప్రదేశము లేదా అనేక ప్రదేశాలలో విచారణ జరుపుతుంది. సెక్షన్ 9(4)

5. ఒక డివిజన్‌కు చెందిన సెషన్సు న్యాయమూర్తి మరియొక డివిజన్‌కు కూడా అడిషనల్ సెషన్సు న్యాయమూర్తిగా నియమించబడవచ్చు. అటువంటి సందర్భంలో వివాదాలను విచారించడానికి ఏదో ఒక డివిజన్‌లో ఆయన పనిచేయవచ్చు.

## 2. మెజిస్ట్రేట్స్ న్యాయస్థానాలు

## 9(1) జిల్లా మెజిస్ట్రేట్‌లు

సెక్షన్ (10)

1. ప్రతి జిల్లాలోను ఒకటవ తరగతి మెజిస్ట్రేట్ ఉంటారు. వీరిని జిల్లా మెజిస్ట్రేట్ అని పిలుస్తారు.

2. ఒకటవ తరగతికి చెందిన ఏ మెజిస్ట్రేట్‌ను అయినా అదనపు జిల్లా మెజిస్ట్రేట్‌గా వ్యవహరించమనవచ్చు.

సెక్షన్ 8(1)

10. ఒక జిల్లాను సబ్ డివిజన్లుగా విభజించవచ్చు. సెక్షన్ 13(1) మరియు (2)

ఒకటవ తరగతికి లేదా రెండవ తరగతికి చెందిన మెజిస్ట్రేట్‌కు ఒక సబ్ డివిజన్‌ను అంగీకరించవచ్చు. ఆయనను సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్ అంటారు.

## (9) సబ్ ఆర్డినేట్ మెజిస్ట్రేట్స్

<u>సెక్షన్ 12(1)</u>

11. జిల్లా మెజిస్ట్రేట్‌తో పాటు ప్రతీ జిల్లాలోను అవసరమైన మొదటి తరగతి రెండవ తరగతికి చెందిన మెజిస్ట్రేట్‌లను నియమించవచ్చు.

వీరు ప్రతీ వివాదంలోను ఆయా స్థానిక ప్రాంతాలలో నిర్వచించిన మేరకు విచారణ జరిపే అధికారాన్ని కలిగి ఉంటారు.

<u>సెక్షన్ 12(2)</u>

ఎటువంటి నిర్దేశిత పరిధిని నిర్ణయించక పోయినట్లయితే వారి విచారణ అధికారం మొత్తం జిల్లాకు వర్తిస్తుంది.

## 3. జిల్లా మెజిస్ట్రేట్ - మొదటి తరగతి మెజిస్ట్రేట్

చట్టము ఏ న్యాయస్థానాన్ని జిల్లా మెజిస్ట్రేట్‌గా గుర్తించకుండా ఒకటవ తరగతి, రెండవ తరగతి మరియు మూడవ తరగతి మెజిస్ట్రేట్ న్యాయస్థానాలు గానే సూచించింది.

ఏదైనా ఒక విచారణను జిల్లా మెజిస్ట్రేట్‌గా వ్యవహరిస్తున్న న్యాయమూర్తి ప్రారంభించిన తరువాత విచారణ పూర్తి అయ్యేలోపలే ఆయన తన ప్రారంభ పదవి అయిన ఒకటవ తరగతి న్యాయమూర్తి పదవిని తిరిగి పొందినట్లయితే ఆ న్యాయమూర్తి సదరు విచారణను పూర్తిచేయడానికి అధికారం కలిగి ఉంటాడు. ఉదాహరణకు ఎంపరర్ వర్సెస్ సయ్యద్ సజ్జిత్ హుస్సెన్ వివాదము (3 ఎ. యల్.జీ. 825)

11. నేరాల విచారణ అధికారం (ఒరిజినల్ జురిస్‌డిక్షన్) నికి సంబంధించి డివిజనల్ వెలుపల జరిగిన నేరాల విషయమై జిల్లా మెజిస్ట్రేట్‌కు ఉన్న విచారణ అధికారంలకు, సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్‌తో స్థానిక విచారణ పరిధిలో వినియోగించవచ్చు. (4.ఎ.366)

## 4. స్పెషల్ మెజిస్ట్రేట్

సెక్షన్ 14(1)

12(1) ఏ స్థానిక ప్రాంతంలోనైనా ఒకటవ తరగతి, రెండవ తరగతి లేదా మూడవ తరగతి మెజిస్ట్రేట్‌లుకొన్ని ప్రత్యేక వివాదాలకు సంబంధించిన విచారణాధికారంతో పాటు సాధారణ వివాదాలను కూడా విచారించే అధికారిని ఇతర వ్యక్తుల కూడా కలిగి ఉండవచ్చు.

(2) వారిని స్పెషల్ మెజిస్ట్రేట్‌గా పిలువబడటానికి ఆ హోదాలో కొంతకాలం పనిచేయడానికి.

(3) అటువంటి వ్యక్తి ఆ వ్యవస్థ నియంత్రణ క్రింద పనిచేసే అధికారి.

(4) ఆ వ్యక్తి ఒక పోలీసు అధికారి అయినట్లయితే ఆయన హోదా అసిస్టెంట్ డిస్ట్రిక్ సూపరింటెండెంట్ పదవికంటే తక్కువ స్థాయిలో ఉండరాదు.

ఈ క్రింది సూచించిన అంశాలను మించిన ఏ అధికారాలు ఆయనకు ఉండకూడదు.

1. శాంతిని కాపాడటం.
2. నేరాలను నిరోధించటం.
3. నేరస్థులను కనుగొని, పట్టుకొని, నిర్బంధంలోకి తీసుకొని వారిని ఒక మెజిస్ట్రేట్ ముందు హాజరు పరచడం.
4. అప్పుడు అమలులో ఉన్న ఏ చట్టం ఆదేశించే ఇతర విధులను నిర్వహించడం.

## 5. బెంచ్ మెజిస్ట్రేట్‌లు

సెక్షన్ 15(1)

13. ఏ ఇద్దరూ లేదా అంతకంటే ఎక్కువ మెజిస్ట్రేట్లు కలిసి బెంచ్‌గా ఏర్పడి నిర్దేశిక స్థానిక పరిధిల్లో వివాదాలను విచారణ చేయవచ్చు.

## 6. ప్రావిన్షియల్ వ్యవస్థలో వివిధ న్యాయస్థానాల మధ్య సంబంధాలు

సెక్షన్ 17(2)

ఒకటవ సబ్ డివిజన్‌లోని ప్రతి బెంచ్, ప్రతి మెజిస్ట్రేట్ సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్ అధికార పరిధికి

లోబడి పనిచేస్తారు. ఒక సబ్ డివిజన్ లోపల జిల్లా మెజిస్ట్రేట్ మరియు సబ్ డివిజన్ మెజిస్ట్రేట్ సమన్వయంలో పనిచేస్తారు.

(4 All. 366)

ఎస్. డి. ఎమ్. అధీనులలో పనిచేసే మెజిస్ట్రేట్ జిల్లా మెజిస్ట్రేట్ అధీనంలో కూడా ఉంటాడు. అని బెంచ్‌లు, మెజిస్ట్రేట్లు, సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్‌తో సహా జిల్లా మెజిస్ట్రేట్ అధీనంలో పనిచేస్తారు.

<u>సెక్షన్ 10(3)</u>

ఈ క్రింది సూచించిన ప్రయోజనం లోపల అదనపు జిల్లా మెజిస్ట్రేట్‌లు, జిల్లా మెజిస్ట్రేట్ అధీనంలో పనిచేస్తారు:-

(i) సెక్షన్ 192(1)

(ii) సెక్షన్ 407(2)

(iii) సెక్షన్ 528(2) మరియు (3)

<u>సెక్షన్ 17(3)</u>

అసిస్టెంట్ సెషన్సు న్యాయమూర్తులందరూ సెషన్సు న్యాయమూర్తి అధీనంలో తమ విచారణ అధికారాన్ని నిర్వహిస్తారు.

15. అధీన - (1) హోదాలో తక్కువ స్థాయి
9 బొంబాయి 100
8 మద్రాస 18 (ఎఫ్. బి)

(2) న్యాయ నిర్వహణ, కార్యనిర్వహణ అధికార విషయాల్లో అధీనత.

2. All. 205 (ఎఫ్. బి)

## 9. బొంబాయి 100

పదవీ హోదాలో తక్కువ శ్రేణి అధీనత లేకుండా ఉండవచ్చు. అయితే తక్కువ హోదా లేకుండా అధీనత సాధ్యంకాదు. ఎందుకంటే అధీనత అంటే హోదాలో తక్కువ స్థాయి.

సెక్షన్ 17(5)

సంహితం ప్రత్యేకంగా సూచించిన సందర్భాల్లో తప్ప జిల్లా మెజిస్ట్రేట్ కాని, మెజిస్ట్రేట్ కాని బెంచ్‌లు గాని సెషన్స్ న్యాయమూర్తికి అధీనంగా ఉండరు.

సెక్షన్: 123, 193, 195, 408, 431, 436, 437 సూచించిన ప్రయోజనాలకు మాత్రమే సెషన్సు న్యాయమూర్తి అధీనంలో వీరు పనిచేస్తారు. దళారులకు న్యాయస్థానాలలోకి అనుమతి ఇవ్వకూడదని సెషన్సు న్యాయమూర్తి ఆదేశించినట్లయితే సదరు ఆదేశం మెజిస్ట్రేట్‌కు వర్తించదు.

అధీనత అంటే కేవలం కర్తవ్యానికి సంబంధించిన క్రమబద్ధీకరణకే కాదు. అధీనత అంటే న్యాయస్థానపరంగా తక్కువ హోదాను సూచించడం.

ఉదాహరణకు విభాగం 435 క్రింద ఒక న్యాయస్థానానికి ఆదేశించే అధికారం.

(ఉత్తరువులను జారీచేయడం, రికార్డులను రప్పించడం)

(9 బొంబాయి 100)

## బి. ప్రెసిడెన్సీ పట్టణ వ్యవస్థ

### 1. మెజిస్ట్రేట్ కార్యాలయం

సెక్షన్ 18(1)

**16.** ప్రతి ప్రెసిడెన్సీ పట్టణంలో చాలినంత మంది ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్‌లను నియమిస్తారు. వీరిలో ఒకరు ముఖ్య ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్‌గా నియమితులై వ్యవహరిస్తారు. అదనపు ముఖ్య మెజిస్ట్రేట్‌గా వ్యవహరించడానికి ఎవరినైనా నియమించవచ్చు.

సెక్షన్ 19

**17.** ఏ ఇద్దరు లేదా ముగ్గురు మెజిస్ట్రేట్స్ ఒక బెంచ్‌గా కూర్చొని విచారణ చేయవచ్చు.

### 2. ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్స్ – ముఖ్య ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ల మధ్య సంబంధాలు

సెక్షను 21

**18.** తన క్రింద పనిచేసే మెజిస్ట్రేట్లును జిల్లా మెజిస్ట్రేట్లవలె ఆయన నియంత్రణ చేస్తారు.

ఏమేరకు అధీనత ఉండదో స్థానిక ప్రభుత్వం నిర్ణయించాలి.

నియంత్రణ క్రింద:-

1. న్యాయస్థానాలలో వ్యవహార సరళి, కార్యకలాపాల బేధాలు, నిర్వహణ.

2. బెంచ్‌లను ఏర్పాటు చేయడం.

3. బెంచ్‌లు ఎక్కడ ఏ సమయంలో సమావేశం జరపాలో నిర్ణయించటం.

4. అభిప్రాయ బేధాలను పరిష్కరించటం.

18. ముఖ్య ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్‌కు ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్‌కు ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ అధీనుడుగా ఉంటాడని బొంబాయి ప్రభుత్వం నిర్ణయించింది.

(బొంబాయి ఎల్.ఆర్.437)

## హైకోర్టు

19. నేర విచారణ న్యాయస్థానాలుతో పాటు మనకు ఒక హైకోర్టు కూడా ఉంది.

పార్లమెంటు 1861లో ఆమోదించిన చార్టర్ చట్టం అనుసరించి ఈ హైకోర్టులు ఏర్పడ్డాయి. కలకత్తాలో బెంగాల్‌కు, బొంబాయిలో బొంబాయికి మద్రాస్‌లో మద్రాస్‌కు హైకోర్టును లెటర్స్ పేటెంట్ సెక్షన్ 1 ప్రకారం ఏర్పాటు చేయటానికి ప్రభుత్వానికి అధికారం కల్పించటం జరిగింది.

సెక్షన్ 9

క్రిమినల్ ప్రొసీజర్ కోడ్, సెక్షన్ 106 క్రింద ఏర్పాటయ్యే ప్రతీ హైకోర్టుకు సివిల్, క్రిమినల్ నేర సంబంధిత, ఎడ్మిరాల్టీ, వైస్-ఎడ్మిరాల్టీ, టెస్టమెంటరీ, ఇంటెస్టేట్ వైవాహిక, తదితర అన్ని వివాదాల పరిష్కారానికి అధికారం ఉంటుంది. ఒరిజినల్ అప్పీళ్ళ అధికార పరిధి వీటికి ఉంటుంది. కోర్టు ప్రెసిడెన్సీలో న్యాయపాలనకు సంబంధించి ఉన్న అన్ని అధికారాలను ప్రభుత్వం హైకోర్టుకు ఇవ్వవచ్చు.

హైకోర్టు పర్యవేక్షణ అధికారం **(3 Pat.** ఎల్.జె. 581. 7 బి) శివనందన్ **Vs.** ఎంపరర్.

1. 1861 (సెక్షన్ 107 భారత ప్రభుత్వ చట్టం) చట్టంలోని 15వ సెక్షన్ క్రింది కోర్టులపై హైకోర్టు పర్యవేక్షణాధికారాన్ని పరిమితం చేస్తుంది. ఈ పరిమితి అప్పీళ్ళ విచారణాధికారానికి లోబడి ఉంటుంది.

2. అయితే క్రింది కోర్టుపై హైకోర్టుకి మారిన రూపంలోనైనా ఎక్కడ అప్పీళ్ళ విచారణ అధికారం ఆ క్రింది కోర్టులపై పర్యవేక్షణ అధీనం వుంటే ఆ క్రింది కోర్టులపై పర్యవేక్షణ అధికారం కలిగి వుంటుంది. అప్పీళ్ళతో సంబంధం లేకుండా ఈ పర్యవేక్షణ అధికారం చెలాయించవచ్చు.

3. ఇక్కడ మూడురకాల వివాదాలను గమనించవలసి ఉంటుంది. అవి:-

(i) కొన్ని ప్రత్యేక వివాదాల్లో ఎక్కడయితే క్రింది న్యాయస్థానం హైకోర్టు అప్పీళ్ళ విచారణాధికార పరిధి క్రింద ఉంటుందో, అక్కడే హైకోర్టుకు పర్యవేక్షణ అధికారం చెలాయించే అధికారం వుంటుంది. హైకోర్టుకు అప్పీళ్ళకు వెళ్ళగలిగే కేసులకు పర్యవేక్షణ అధికారం పరిమితం కాదు. అప్పీళ్ళు రివిజన్ వంటి ఇతర విధానాల ద్వారా తగిన పరిష్కారం లభించే సందర్భాల్లో ఈ ప్రత్యేక పర్యవేక్షణ అధికారాన్ని ఒక రూల్‌గా చలాయించడానికి అవకాశం లేదు.

(ii) హైకోర్టుకి క్రింది కోర్టులపై రివిజన్ అధికారం గాని లేదా రిఫరెన్స్ అధికారం గానీ, ఉంటే అప్పీళ్ళు విచారణాధికారం కూడా మారిన రూపంలో ఉంటుంది.

(iv) హైకోర్టు పర్యవేక్షణా అధికారానికి లోబడకుండానే ఒక కోర్టును ఏర్పాటు చేయవచ్చు.

## ఇతర క్రిమినల్ న్యాయస్థానాలతో హైకోర్టు సంబంధాలు

<u>సెక్షన్. 15, 107</u>

ప్రతీ హైకోర్టు తన విచారణాధికారానికి లోబడి పర్యవేక్షణ అధికారం కలిగి ఉంటుంది. కేసులను త్రిప్పి పంపాలని, తదితర అధికారాన్ని కలిగి ఉంటుంది. ఏఏ న్యాయస్థానాలు హైకోర్టు పరిధి కింద వస్తాయి?

### లెటర్స్ పేటెంట్

ప్రెసిడెన్సీలో హైకోర్టుకు క్రిమినల్ న్యాయస్థానాలను తీర్పులపై అప్పీళ్ళ విచారణ అధికారం ఉంటుంది.

3) Pato ఎల్.జె. 5817.బి - శివనందన్ Vs. ఎంపరర్ -

రెండు ప్రశ్నలు

1) అప్పీళ్ళ విచారణ అధికారం లేకుండా కేవలం రివిజన్, రిఫరెన్సు అధికారం మాత్రమే ఉన్నపుడు హైకోర్టుకు పర్యవేక్షణ అధికారం ఉంటుంది.

2) హైకోర్టు పర్యవేక్షణకతీతంగా ప్రెసిడెన్సీలో క్రిమినల్ న్యాయస్థానం ఒకటి ఉండటం జరుగుతుందా?

**ఈ పరిధికి ఉన్న స్థానిక పరిమితులు**

10. (1) జిల్లా మెజిస్ట్రేట్ కోర్టుకు జిల్లా పరిమితి.

11. (2) సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్ కోర్టుకు సబ్ డివిజనల్ పరిమితి.

12. (3) స్థానిక ప్రభుత్వం సూచించిన ప్రాంతాలలో ఏర్పాటయిన సబార్డినేట్ మెజిస్ట్రేట్-ఆ సూచన ద్వారా నిర్దేసించిన పరిమితి.

14 (4) స్థానిక ప్రభుత్వం సూచించిన మేరకు ఏర్పాటైన ప్రత్యేక మెజిస్ట్రేట్‌కు, ఆ సూచన మేరకు నిర్దేశించిన పరిమితి.

20 (5) ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ పరిమితి.

ప్రతి ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ ప్రెసిడెన్సీ పట్టణంలోని మొత్తం పరిధిలో తన అధికారాన్ని చలాయిస్తాడు. ఆ పట్టణానికి సంబంధించిన రేవు, ప్రయాణం చేయగలిగిన నది, కాలువ, మొదలైనవి చట్టంలో నిర్వచించిన ప్రకారం ఆ న్యాయస్థానాలకు పరిధిలుగా వుంటాయి.

6) సెషన్స్ న్యాయమూర్తికి - సెషన్స్ డివిజన్ పరిధి.

7) హైకోర్టు.

8) లెటర్సు పేటెంట్ ప్రకారం విచారణాధికారం ఈ క్రింది విధంగా వుంటుంది.



II. పరిమితి ప్రారంభం అవటానికి ఒక ప్రారంభ సమయం ఉంటుందా? లేదా మరో తాజా ప్రారంభ సమయం ఉంటుందా?

1. చర్యకు తాజా కారణం ఏర్పడటానికీ పరిమితికి తాజా ప్రారంభం ఏర్పడటానికీ మధ్య ఉన్న వ్యత్యాసాన్ని గమనించాలి. ఒక కారణం వల్ల ఏర్పడే చర్యకు సంబంధించిన తాజా పరిమితి ప్రారంభాన్ని మనం ఇక్కడ పరిశీలిస్తున్నాము.

(2) సాధారణ కాలపరిమితి చట్టం నియమం ఏమిటంటే కాలపరిమితి ప్రారంభం ఒక్క పర్యాయమే మొదలవుతుంది. ఆ ప్రారంభ కాలం దావా వేయటానికి హక్కు ఏర్పడినప్పటి నుండే.

(3) ఒక కారణం వల్ల చర్య అవసరమైనప్పుడు తాజా కాలపరిమితికి మూడు సందర్భాలున్నాయి. అవి:

(i) రుణాన్ని అంగీకరించినప్పుడు (Acknowledgement)

(ii) ఎక్కడ కొంత మొత్తం చెల్లించటం జరిగిందో

(iii) వరుసగా ఒప్పందాన్ని ఉల్లంఘించే వివాదంలో చర్య అవసరం అయ్యే సందర్భం లేదా ఒప్పందంతో సంబంధం లేకుండా వరుసగా తప్పిదం జరిగినప్పుడు.

## సెక్షన్ - 19 - రుణం అంగీకారం (గుర్తింపు)

## I. సాధారణంగా

1. కాలపరిమితి పూర్తి అవకముందే రుణగ్రస్తుడు ఆ విషయాన్ని అంగీకరించాలి. కాలపరిమితి పూర్తి అయిన తర్వాత గుర్తిస్తే మరో కాలపరిమితి సాధ్యం కాదు

(2) రుణ గుర్తింపు లిఖిత రూపంలో ఉండాలి.

(3) బాధ్యత ఉన్న వ్యక్తి గుర్తింపు పత్రంపై సంతకం చెయ్యాలి లేదా అతని ప్రతినిధి సంతకం చేయాలి.

(4) రుణదాత రసీదు ఇవ్వవలసిన అవసరం లేదు.

(5) కొనసాగుతున్న బాధ్యత/ అప్పును ఆ గుర్తింపు చూపించాలి. అది చెల్లించటానికి వాగ్దానం చేయవలసిన అవసరం లేదు. నిజానికి అందులో చెల్లింపుకు తిరస్కరణ కూడా ఉండవచ్చు.

2) ఏకాంత కారాగారం లేని జైలుశిక్షకన్నా ఏకాంత కారాగారంతో కూడిన జైలుశిక్షను తీవ్రంగా పరిగణిస్తారు.

3) సాధారణ నిర్బంధం కంటే కఠిన కారాగార శిక్ష.

## 397. శిక్ష అనుభవిస్తున్న వ్యక్తిపై మరో శిక్ష

ఒక నేరస్తుడు ఏకాంత ఖైదు లేదా ఇతర ప్రాంతాలలో నిర్బంధం (బహిష్కరణ) మొదలైన శిక్షను అనుభవిస్తున్నపుడు అతనికి అటువంటిదే మరో శిక్షను విధించినపుడు మొదటి శిక్ష పూర్తయిన అనంతరం రెండవ శిక్ష ప్రారంభమవుతుంది. కోర్టు సదరు రెండు శిక్షలు ఏకకాలంలో అమలు జరపాలని నిర్ణయించిన సందర్భంలోనే పైవిధంగా జరుగుతుంది.

కారాగార శిక్ష అనుభవిస్తున్న వ్యక్తికి బహిష్కార శిక్ష విధిస్తే తరువాత శిక్ష వెంటనే అమలులోకి రావాలని కోర్టు తన విచక్షణ అధికారంతో ఆదేశించవచ్చు. అయితే ఒక నేరస్తుడు శిక్షను అనుభవిస్తున్న కాలంలోనే అవసరమైన సెక్యూరిటీని చూపడంలో విఫలమైనపుడు సెక్షన్ 233 దీనికి సంబంధించిన నేరానికి మరొకసారి శిక్షార్హుడైతే సదరు శిక్ష మొదటి శిక్షాకాలం పూర్తయిన తరువాత వెనువెంటనే అమలులోకి వస్తుంది.

సెక్షన్ 398(1). 396 లేదా 397 సెక్షన్లలో ప్రస్తావించిన ఏ అంశం క్రింద ఒక వ్యక్తికి మొదటి శిక్షలోను, రెండో శిక్షలోనూ తగ్గింపు ఇవ్వడానికి వీలులేదు.

399. బాలనేరస్తుల సంస్కరణ కారాగారాలు (వ్రాత ప్రతిలో ఈ పుట ఖాళీగా ఉన్నది. సం.)

## శిక్షను రద్దుచేయడం, తగ్గించడం, లేదా మార్చడం

(వ్రాత ప్రతిలో ఈ పుట ఖాళీగా ఉన్నది. సం.)

గవర్నర్ జనరల్ ఇన్-కౌన్సిల్ ఒక నేరస్తునికి విధించిన శిక్షను కొన్ని షరతులతో తగ్గించవచ్చు లేదా ఎటువంటి శిక్షనైనా బేషరతుగా తగ్గించవచ్చు.

(వ్రాత ప్రతిలో ఈ పుట ఖాళీగా ఉన్నది. సం.)

402. ఇతర కారణాల వల్ల శిక్షలను తగ్గించే అధికారం

(వ్రాత ప్రతిలో ఈ పుట ఖాళీగా ఉన్నది. సం.)

(4) అధికారాలను ఇవ్వటం, కొనసాగించటం లేదా రద్దుచేయటం.

## సెక్షన్ 39

1. కొందరు అధికారులకు ప్రత్యేకంగాను, లేదా కొందరికి అధికార పదవి హోదాలకు సంబంధించి గాని, సాధారణంగా గాని, స్థానిక ప్రభుత్వం ఈ చట్టం క్రింద అధికారాలను కట్టబెట్టవచ్చు.

2. అటువంటి ప్రతీ ఉత్తర్వు ప్రకటించిన తేదీ నుంచి అమలులోకి వస్తుంది.

## సెక్షన్ 40

ఏ ప్రభుత్వ అధికారినైనా అతనికి కొన్ని అధికారాలను కల్పిస్తూ ఏ స్థానిక ప్రాంతంలోనైనా సమాన లేదా ఉన్నత పదవిలో నియమించినప్పుడు అటువంటి పదవి హోదా స్థానిక ప్రభుత్వంలో కూడా ఉన్నట్లయితే స్థానిక ప్రభుత్వం వేరే నిర్దేశిస్తే మినహాయిస్తే తప్ప ఏ ప్రాంతానికైతే నియమితుడవుతాడో సదరు అధికారాలను అక్కడ పూర్తిగా చలాయిస్తాడు.

## సెక్షన్ 41

1. స్థానిక ప్రభుత్వం ఈ చట్టం కింద కల్పించినటువంటి కొన్ని లేదా మొత్తం అధికారాలను చట్టం ద్వారా గాని చట్టం క్రింద అధికారి ద్వారా గాని ఉపసంహరించుకోవచ్చు.

2. జిల్లా మెజిస్ట్రేట్ కల్పించినటువంటి ఏ అధికారాలనైనా అతడు తిరిగి వెనుకకు తీసుకోవచ్చు.

సాక్షి తన వ్యాజ్యంలో తన సాక్ష్యాన్ని ఇస్తున్నప్పుడు అది ఫిర్యాదు కాదు.

(వ్రాత ప్రతిలో ఈ పుట ఖాళీగా వుంది. సం.)

# రెండవ భాగం

# నేరస్తుని విచారణ

## 1. ఒక నేరాన్ని పరిగణనలోకి తీసుకోవటం

ఒక నేరం జరిగినపుడు మెజిస్ట్రేట్ మూడురకాలుగా దానిని పరిగణనలోకి తీసుకుంటాడు.

### సెక్షన్ 190

1. నేర వివరాలతో కూడిన ఫిర్యాదును అందుకున్నపుడు.

2. నేర వివరాలతో ఒక పోలీసు అధికారి లిఖిత రూపంలో ఒక నివేదికను సమర్పించినపుడు.

3. పోలీసు అధికారి కాకుండా వేరే వ్యక్తి నుంచి సమాచారం లభించినపుడు లేదా స్వయంగా ఒక నేరం జరిగిందని తెలిసినపుడు లేదా అనుమానం కలిగినపుడు.

ఎ. మెజిస్ట్రేట్‌లకు చేసే ఫిర్యాదులు

1) ఫిర్యాదుదారులను నిర్వచించడం. ఫిర్యాదుదారుడు అనగా లిఖితపూర్వకంగాగాని లేదా నోటి మాట ద్వారాగాని తనకు తెలిసినపుడు వ్యక్తిగాని అపరిచితుడుగాని నేరం చేసాడని అనుకొని మెజిస్ట్రేట్‌కు ఫిర్యాదు చేసిన వ్యక్తి. పోలీసు అధికారి నివేదిక ఫిర్యాదుగా పరిగణించబోరు.

ఫిర్యాదులో ఒక నేరం జరిగిందన్న ఆరోపణ ఉండాలి.

సెక్షన్ 107 క్రింద చర్య తీసుకోవాలని కోరుతూ దాఖలైన దరఖాస్తును ఫిర్యాదులుగా పరిగణించరాదు.

ఫిర్యాదు ఎప్పుడు మెజిస్ట్రేట్‌కే చేయాలి. మెజిస్ట్రేట్ తప్పనిసరిగా చర్య తీసుకోవాలనే దృక్పథంతో ఫిర్యాదు ఉండాలి. చర్య తీసుకోమని కోరకుండా మెజిస్ట్రేట్‌కు సమాచారాన్ని ఇచ్చినట్లయితే అది ఫిర్యాదు కాదు. ఉదాహరణకు ఒక అసిస్టెంట్ కలెక్టర్ ఏ వ్యక్తికి వ్యతిరేకంగానైనా జిల్లా మెజిస్ట్రేట్‌కు ఉత్తర్వు కోసం వ్రాసినట్లయితే అది ఫిర్యాదు కాదు. (15, Cr. L.F. 657)

## II. ఎవరు ఫిర్యాదు చేయవచ్చు

సాధారణంగా ఎవరికైతే నష్టం కలుగుతుందో అతనినే ఫిర్యాదుదారునిగా గుర్తిస్తారు. అయితే నేర విచారణను ప్రారంభించటంలో ఫిర్యాదుదారులు ముఖ్యమైన కక్షిదారుడు కానవసరంలేదు.

తనకు లభించిన సమాచారం మేరకు తాను స్వయంగా తెలుసుకున్నపుడు మెజిస్ట్రేట్ చర్యను తీసుకోవచ్చు. అతను ఆవిధంగా వ్యవహరించినట్లయితే సెక్షన్ 491 నిబంధనలను అయన అనుసరించవలసి వస్తుంది.

అయితే ఈ సాధారణ నియమానికి కొన్ని మినహాయింపులు ఉన్నాయి. అవి 195 నుంచి 199-ఎ సెక్షన్లు సూచిస్తున్నాయి. 195 సెక్షన్ ప్రకారం:

1. ఒక ప్రభుత్వ ఉద్యోగుల కర్తవ్య నిర్వహణకు భంగం కలిగినపుడు చేపట్టే ప్రాసిక్యూషన్

2. ప్రజానియమానికి విరుద్ధమైన చర్యలపై జరిపే ప్రాసిక్యూషన్.

3. సాక్షులుగా సమర్పించిన పత్రాలకు సంబంధించిన నేరాలపై ప్రాసిక్యూషన్.

పైన పేర్కొన్న మొదటి (1) సందర్భంలో ప్రభుత్వ అధికారి గాని, అతని క్రింద అధికారి గాని లిఖిత పూర్వకంగా ఫిర్యాదు చేస్తే తప్ప ఏ కోర్టు ఆ నేరాన్ని గుర్తించడానికి వీలులేదు. రెండో సందర్భంలో క్రింది కోర్టు రాతపూర్వకంగా ఫిర్యాదుచేస్తే తప్ప కోర్టు ఆ నేరాన్ని గుర్తించడానికి వీలులేదు.

మూడో సందర్భంలో కూడా క్రింది కోర్టు నుంచి రాతపూర్వకమైన ఫిర్యాదు లేకపోతే కోర్టు ఆ నేరాన్ని గుర్తించడానికి వీలులేదు.

3. సాక్ష్యాలుగా అందజేసిన కొన్ని పత్రాలకి సంబంధించిన నేరాలపై ప్రాసిక్యూషన్ పైన పేర్కొన్న మొదటి సందర్భంలో ఒక ప్రభుత్వాధికారి పై న్యాయస్థానానికైనా అతని చర్యలకు వ్యతిరేకంగా లిఖితపూర్వకంగా ఫిర్యాదు చేసినపుడు మాత్రమే చర్య తీసుకుంటుంది. లేదా తన అధీనంలో ఉన్న పై అధికారిపైనైనా అప్పుడే చర్య తీసుకోవడం జరుగుతుంది.

అలాగే రెండవ తరగతిలో ప్రస్తావించిన అంశం విషయంలో పై న్యాయస్థానాలకు లిఖితపూర్వక ఫిర్యాదు వచ్చినపుడే చర్యకు ఉపక్రమిస్తుంది.

మూడవ తరహాలో ప్రస్తావించిన విషయాలలో కూడా న్యాయస్థానం లేదా తన అధీనంలో ఉన్న ఉపన్యాయస్థానం నుంచి వచ్చిన ఫిర్యాదునే పరిగణనలోకి తీసుకోవడం జరుగుతుంది.

## సెక్షన్ 196

## రాజ్యానికి వ్యతిరేకంగా చేసిన నేరాలను విచారణ చేయడం

గవర్నర్ జనరల్, స్థానిక ప్రభుత్వం లేదా గవర్నర్ జనరల్ కౌన్సిల్ తరపున అధికారి జారీచేసిన ఉత్తరువును అనుసరించి/ ఫిర్యాదును స్వీకరించి కోర్టు ఆ నేరాన్ని గుర్తిస్తుంది.

సెక్షన్ 196-A ఇండియన్ పీనల్ కోడ్ సెక్షన్ 120-B క్రింద వచ్చే కుట్ర కేసుల ప్రాసిక్యూషన్.

అవి సబ్ సెక్షన్ (1) క్రిందకు వచ్చినట్లయితే అప్పుడు ఫిర్యాదు గవర్నర్ జనరల్ కౌన్సిల్ తరపునగానీ స్థానిక ప్రభుత్వం నుంచి గాని, లేదా వీరిచ్చిన అధికారంలో ఇంకే అధికారి ద్వారాగానీ రావాలి.

ఫిర్యాదులు సబ్ సెక్షన్ (2) క్రింద ఉన్నట్లయితే అప్పుడు వాటిని ముఖ్య ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ లేదా జిల్లా మెజిస్ట్రేట్ విచారణ జరపడానికి లిఖితపూర్వకంగా అనుమతిని ఇవ్వాలి.

## సెక్షన్ 197

తన కర్తవ్య నిర్వహణలో నేరానికి పాల్పడేట్లు జడ్జీలు, మెజిస్ట్రేట్‌లు, ప్రభుత్వ అధికారులు తమ విధి నిర్వహణలో నేరాలు చేసినట్లయితే వారిని ప్రాసిక్యూట్ చేయవచ్చు. స్థానిక ప్రభుత్వం ఇస్తే తప్ప వారి నేరాలను గుర్తించడానికి వీలులేదు.

2) స్థానిక ప్రభుత్వం ఏ వ్యక్తిద్వారా ఏ పద్ధతిలో ఆ రకం నేరాలను చేసినటువంటి న్యాయమూర్తి మొదలైన అధికారులను ప్రాసిక్యూషన్ చేయాలో స్పష్టంగా నిర్దేశించవలసి ఉంటుంది.

## సెక్షన్ 198

ఒప్పందం ఉల్లంఘన, లేదా పరువు నష్టం వివాహ సంబంధిత నేరాలు అటువంటి వివాదాల్లో నష్టపడిన వ్యక్తి ఫిర్యాదు ఆధారంగానే ఆ నేరాలను పరిగణనలోకి తీసుకోవడం జరుగుతుంది. అయితే న్యాయస్థానం అనుమతితో ఇంకెవరైనా నష్టపడిన వ్యక్తి తరపున ఫిర్యాదు చేయవచ్చు.

## సెక్షన్ 199

అక్రమ సంబంధం లేదా వివాహిత స్త్రీని లోబరచుకోవడానికి సంబంధించిన నేరాలు: ఆమె భర్త లేదా కోర్టు అనుమతితో అతని బాగోగులు చూసే ఇంకే వ్యక్తి అయినా సదరు నేరం గురించి ఫిర్యాదు చేస్తేనే న్యాయస్థానం పరిగణనలోకి తీసుకొంటుంది.

# పోలీస్ రిపోర్ట్

## 1. అది ఏవిధంగా ప్రారంభమవుతుంది?

సాధారణంగా నష్టపడిన వ్యక్తి ఇచ్చే ప్రాథమిక సమాచారం అధికంగా పోలీస్ రిపోర్టు దాఖలు చేయడం ప్రారంభమవుతుంది. అయితే తనకు తెలిసిన సమాచారం ఆధారంగా ఒక పోలీస్ అధికారి కూడా రిపోర్టు రూపొందించవచ్చు. కొన్ని సందర్భాలలో నేర సమాచారం తప్పనిసరిగా ఇవ్వాలని చట్టం నిర్దేశిస్తుంది.

## సెక్షన్ 44

కొన్ని నేరాలకు సంబంధించిన ప్రతివ్యక్తి మెజిస్ట్రేట్‌కు గానీ పోలీసు అధికారికి గాని సమాచారం ఇవ్వాలి.

## సెక్షన్ 45

పోలీసు అధికారిని గుర్తించిన ( ) లేదా సమాచారం గాని ఇవ్వవచ్చు. గుర్తించలేని (గుర్తింపులేని) నేరానికి సంబంధించిన వారెంట్ (కోర్టు ఉత్తర్వు) లేకుండా అనుమానితుడిని పోలీసు నిర్బంధం కలిగే నేరాన్నిగుర్తించి దగిన (Cognizable offence) నేరం అంటారు. వారెంట్ లేకుండా అరెస్టు చేయడానికి వీల్లేని నేరాలను గుర్తించ తగని (Non-cognizable) నేరాలు అంటారు.

గుర్తించిన నేరానికి సంబంధించిన సమాచారం: దీనికి సంబంధించిన సమాచారం ఎవరైనా నోటిమాట ద్వారా అందజేసినా పోలీసు అధికారి దీనిని లిఖిత రూపంలో నమోదుచేసి దానిని అందజేసిన వ్యక్తికి చదివి వినిపించి ఆ కాగితంపై అతని సంతకం తీసుకొని స్థానిక ప్రభుత్వం నిర్దేశించిన పద్ధతి మేరకు అందుకోసం కేటాయించిన పుస్తకంలో నమోదు చేయాలి.

గుర్తించ తగని నేరానికి సంబంధించిన సమాచారం: దీనికి సంబంధించిన సమాచారాన్ని పొందిన తరువాత దీని సారాంశాన్ని పుస్తకంలో వ్రాసి సమాచారాన్ని అందించిన వ్యక్తిని మెజిస్ట్రేట్ వద్దకు పంపించాలి.

## సెక్షన్ 155

ఏ పోలీసు అధికారి ఒకటవ తరగతి లేదా రెండవ తరగతి మెజిస్ట్రేట్ పూర్వ అనుమతి లేకుండా గుర్తించని నేరాన్ని పరిశోధించరాదు. అనుమతినిచ్చే మెజిస్ట్రేట్‌కు సదరు నేరాన్ని వివరణ చేసి లేదా దానిని ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్‌కు పంపే అధికారం ఉంటుంది.

## సెక్షన్ 156

పోలీసు స్టేషన్ ఇన్‌ఛార్జి అయిన ఏ పోలీసు అధికారి అయినా మెజిస్ట్రేట్ పూర్వానుమతి లేకుండానే గుర్తించదగిన నేరాన్ని పరిష్కరించే అధికారం కలిగి ఉంటాడు. తన పోలీసు స్టేషన్ పరిధిలోని స్థానిక కోర్టుకి ఆ కేసు విచారణాధికారం ఉంటుంది. గుర్తించదగిన నేరానికి సంబంధించిన సమాచారం ఆధారంగా పోలీసు రిపోర్టు తయారవుతే ఆ రిపోర్టు ఆధారంగా మెజిస్ట్రేట్ చర్య తీసుకుంటారు.

## సెక్షన్ 157

సెక్షన్ 154 కింద సమాచారం అందిన అనంతరం, గుర్తించతగిన నేరం జరిగినట్లు.

పోలీసు అధికారి భావించినట్లైతే, అప్పుడు

(1) సదరు నివేదికను తగిన చర్య తీసుకోటానికి అధికారం ఉన్న మేజిస్ట్రేట్‌కు పంపాలి.

(2) నేరం జరిగిన ప్రదేశానికి వెళ్ళి వాస్తవాలను, నేరం జరిగిన పరిస్థితులను పరిశోధించాలి.

(3) నేరం చేసిన వ్యక్తిని నిర్బంధించడానికి అవసరమైన చర్యలు తీసుకోవాలి.

అయితే

(1) సమాచారం ఇచ్చిన వ్యక్తి నేరస్తుని పేరు తెలియపరిస్తే నేరం అంత తీవ్రమైనది కానప్పుడు తక్షణమే నేరం జరిగిన ప్రదేశానికి వెళ్ళి విచారణ చేయనవసరంలేదు.

(2) విచారణ జరపటానికి తగిన ఆధారాలు లేవని భావించినప్పుడు అధికారి విచారణ చేయవలసిన అవసరం లేదు.

దానికి తగిన కారణాలు తన నివేదికలో అధికారి పేర్కొనాలి. ఎందుకు ఈ సెక్షన్‌లో నిర్దేశించిన మేరకు తాను చర్య తీసుకోలేదో తన నివేదికలో వివరించాలి.

సమాచారం ఇచ్చిన వ్యక్తికి పోలీసు అధికారి ఆ కేసును దర్యాప్తు చేస్తే ఆ విషయాన్ని, చేయకపోతే అందుకు కారణాన్ని తెలపాలి. పోలీసు దర్యాప్తు చేయనంత మాత్రాన నేరస్తుని ప్రాసిక్యూషన్ ఆగిపోదు. అందుకు మరో రెండు మార్గాలున్నాయి.

## సెక్షన్ 159

1. సదరు నివేదికను అందుకొన్న తర్వాత మేజిస్ట్రేట్ తను స్వయంగా కానీ లేదా తన క్రింది మేజిస్ట్రేట్‌ను కానీ వెంటనే ప్రాథమిక దర్యాప్తు జరిపి అవసరమైన చర్య తీసుకోమని ఆదేశించవచ్చు, లేదా నిర్దేశిత విధానాల మేరకు కేసును తేల్చాలని కోరవచ్చు. ఇది పూర్తి పరిశోధనకు ముందు జరిపే ప్రాథమిక దర్యాప్తు. 159 సెక్షన్ క్రింద మేజిస్ట్రేట్ తగిన చర్యలు తీసుకోవచ్చు. అయితే దర్యాప్తు పరిశోధన అనంతరం నివేదికను సమర్పించినట్లైతే ఈ సెక్షన్ క్రింద మేజిస్ట్రేట్‌కు చర్య తీసుకోటానికి అధికారం లేదు.

II. నష్టపడిన వ్యక్తి పోలీస్‌ను అర్థించవచ్చు. పోలీస్ శాఖ చర్య తీసుకోకుండా ఈ క్రింది అధికారాలు వినియోగించవచ్చు.

## సెక్షన్ 160

(1) సాక్షులు హాజరు కావాలని లిఖితపూర్వకంగా ఆదేశించడం.

ఈ సెక్షన్ ప్రకారం సాక్షులు నిజాన్ని చెప్పనవసరంలేదు. వార తప్పుడు సాక్ష్యం ఇచ్చినా వారిపై ప్రాసిక్యూషన్ ఉండదు.

వారు తమ సాక్ష్యం ఇచ్చిన పత్రంపై సంతకం చేయనవసరంలేదు. ఈ సాక్ష్యం వారు పోలీసు సమక్షంలో ఇచ్చేది.

## సెక్షన్ 161

వాస్తవాలను తెలిసిన సాక్షులను పోలీసు ప్రశ్నిస్తారు.

(i) తమను ఇరికించే ప్రశ్నలకు తప్ప సాక్షులు అన్ని ప్రశ్నలకు సమాధానం చెప్పితీరాలి.

పోలీసు సాక్షుల వద్ద నుంచి లిఖితపూర్వకంగా సమాచారాన్ని తీసుకోగలిగినప్పటికీ

## సెక్షన్ 162

(i) వాటిపై సాక్షుల చేత సంతకం చేయించరాదు.

(2) వాటిని నేర విచారణ సందర్భంలో లేదా దర్యాప్తు చేస్తున్నపుడు ఉపయోగించరాదు.

అయితే నిందితుడు కోరినప్పుడు అతనికి సాక్షులు ఇచ్చిన సమాచారపత్రం నకలును, నిందితుడు ఆ అంశాలను ఖండించడానికి వీలుగా ఇవ్వాలి. న్యాయస్థానం నేరానికి సంబంధంలేని అంశాలను సాక్ష్య సమాచారం నుంచి తొలగించవచ్చు. అలాగే ప్రజా ప్రయోజనం దృష్ట్యా అవసరంలేని అంశాలను న్యాయమైన తీర్పుకు ఉపకరించని అంశాలను సదరు పత్రం నుంచి తొలగించవచ్చు.

క్లుప్తంగా చెప్పాలంటే న్యాయస్థానం పరిగణనలోకి తీసుకునే సాక్ష్యంగా ఇది ఉపయోగపడదు.

ఒకవేళ సదరు సమాచార పత్రాన్ని సాక్ష్యంగా పరిగణనలోకి తీసుకోవాలంటే సదరు సాక్ష్యాన్ని పోలీసు అధికారి కాకుండా మేజిస్ట్రేట్ ముందు నమోదు చెయ్యాలి. దీనికి సంబంధించిన నిబంధనను ఆ తర్వాత క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లో చేర్చారు.

## సెక్షన్ 164

పోలీసు అధికారి కాకుండా ఏ ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్, లేదా ఒకటవ తరగతి/ రెండవ తరగతి మేజిస్ట్రేట్‌కు ప్రత్యేకంగా అధికారం ఉన్నటువంటి వ్యక్తికి నేరాన్ని అంగీకరించినట్లు దాఖలు చేసిన పత్రాన్ని లేదా సమాచారాన్ని నమోదు చేయవచ్చు.

సాక్ష్యాన్ని నమోదు చేసే పద్ధతిలో ఈ నేరాంగీకార ప్రకటనను దాఖలు చెయ్యాలి.

364వ సెక్షన్ సూచించిన పద్ధతిలో నేరాంగీకారపత్రాన్ని నమోదు చెయ్యాలి. అయితే మేజిస్ట్రేట్ ఆ నిందితుడికి నేరాన్ని అంగీకరించే అవసరం లేదనీ, ఆ విధంగా అంగీకరిస్తే అతనికి వ్యతిరేక సాక్ష్యంగా ఉపయోగిస్తారని ముందుగానే వివరించాలి.

నిందితుడు స్వచ్ఛందంగానే నేరాన్ని అంగీకరిస్తున్నాడని మెజిస్ట్రేట్ భావించినపుడే ఆ నేరాంగీకార ప్రకటనను నమోదు చేయాలి.

ఆ ప్రకటనను నమోదు చేసిన తర్వాత అందుకు సంబంధించిన పద్ధతులను, షరతులను పాటించామని మెజిస్ట్రేట్ ధ్రువీకరించాలి.

# అన్వేషణ

## సెక్షన్ 165

(1) దర్యాప్తు చేస్తున్నపుడు ఏ ప్రదేశంలోనైనా అవసరమైనప్పుడు పోలీసు అధికారి గాలించవచ్చు. గాలించటానికి తగిన కారణాలను లిఖితపూర్వకంగా పేర్కొని, కేసు దర్యాప్తుకు అది ఎంత అవసరమో, ఏ ప్రదేశంలో దేనికోసం గాలించారో, సదరు ప్రదేశం తన స్టేషన్ పరిధి క్రిందకు వస్తుందో, రాదో మొదలైనవి నమోదు చేయాలి.

(2) సాధ్యమైనంత వరకూ పోలీసు అధికారి స్వయంగా గాలింపు చర్యలు చేపట్టాలి.

(3) తగిన కారణాలను లిఖిత పూర్వకంగా పేర్కొని అన్వేషణ సాగించాలని కింది అధికారికి సూచించవచ్చు.

(4) సెక్షన్ 102, సెక్షన్ 103లో అన్వేషణకు అవసరమైన వారంట్ జారీకి సంబంధించిన నిబంధనలను వివరిస్తున్నాయి.

(5) అన్వేషణలో లభ్యమైన అంశాలను, నమోదు చేసిన పత్రం నకలును సమీప మెజిస్ట్రేట్‌కు అందజేయ్యాలి. లేదా ఆ గృహ యజమానికి ఒక నకలు ప్రతిని తగిన ఫీజు వసూలుచేసి ఇవ్వాలి.

## సెక్షన్ 166

ఇతర పోలీసు స్టేషన్ పరిధిలోని ప్రాంతంలో కూడా పోలీసు అధికారి గాలించవచ్చు.

## సెక్షన్ 167

సెక్షన్61 నిర్దేశించినట్లు దర్యాప్తు 24 గంటల్లో పూర్తికాకపోయినట్లైతే, అందిన సమాచారం లేదా నిందారోపణ సరైందే అని భావించినప్పుడు దానికి సంబంధించిన మొత్తం సమాచారం తన డైరీలో నమోదు చేసిన ప్రకారం సమీప మెజిస్ట్రేట్‌కు అందజేసి నేరస్తునికి అనమానిస్తున్న వ్యక్తిని ఆ మెజిస్ట్రేట్ ముందు హాజరుపర్చాలి.

(2) 15 రోజులకు మించకుండా నిందితుడిని నిర్బంధంలో కొనసాగించడానికి అవసరమైన మెజిస్ట్రేట్ ఎప్పటికప్పుడు ఉత్తర్వులు జారీ చేయవచ్చు.

(3) పోలీసు కస్టడీలో నేరస్తుడి నిర్భంధాన్ని కొనసాగించదలచుకుంటే మెజిస్ట్రేట్ అందుకు తగిన కారణాలను రాయాలి.

## సెక్షన్ 169

సరైన ఆధారాలు లేని కారణం వల్ల నిందితుడిని నిర్భంధంలోకి తీసుకోనవసరంలేదని భావించినప్పుడు మెజిస్ట్రేట్ ముందు హాజరుపరచేందుకు తగిన కారణం లేదని భావించినపుడు నిందితుడిని జామీనుపై లేదా జామీను లేకుండా అవసరమైనప్పుడు హాజరు కావాలనే షరతుపై అతనిని పోలీసు అధికారి విడుదల చేయవచ్చు.

## సెక్షన్ 170

(1) సరైన సాక్ష్యం తగిన ఆధారం ఉందని భావించనప్పుడు తన కస్టడీలో ఉన్న నిందితుడిని పోలీసు అధికారి మెజిస్ట్రేట్ ముందు హాజరుపరచవచ్చు.

(2) దీనితోపాటు సాక్ష్యాధారాలను మెజిస్ట్రేట్‌కు పంపుతూ నిందితుడినీ, సాక్ష్యులను, ఫిర్యాదుదారుడిని కోర్టుకు హాజరవుతామనే హామీ పత్రాలపై సంతకం చెయ్యాలని కోరవచ్చు.

## సెక్షన్ 173

కక్షిదారుల పేర్లను, సమాచారాన్ని నమోదుచేసి సదరు ప్రతిని పోలీసు అధికారి (మెజిస్ట్రేట్‌కు) పంపాలి.

నిందితుడికి సదరు పత్రం నకలును పొందే హక్కు ఉంది.

## హాజరీ నుంచి నిందితుడికి మినహాయింపు

**సెక్షన్ 205**; 366; 424; **(6 All 59)** (21 కలకత్తా 588)

**సెక్షన్ 205**: మెజిస్ట్రేట్ హాజరీ ఉత్తరువును జారీచేసిన తర్వాత నిందితుడి హాజరీ అవసరంలేదని ఆయన భావించినట్లైతే, ఆ వ్యక్తిని కోర్టు హాజరీ నుంచి మినహాయించవచ్చు.

**సెక్షన్ 366**: తీర్పు ప్రకటించే సమయం

తీర్పును నిందితుడి సమక్షంలో ప్రకటించాలి. అయితే కేవలం జరిమానా విధించే శిక్ష అయితే తీర్పు ప్రకటన సమయంలో నిందితుడు ఉండనవసరంలేదు.

## సెక్షన్ 424 అప్పిలేట్ న్యాయస్థానం ఇచ్చే తీర్పు

అప్పిలేట్ న్యాయస్థానం తీర్పును ప్రకటిస్తున్నప్పుడు నిందితుడు హాజరుకానవసరంలేదు.

## II. ఒక విచారణలో ఎన్ని నేరాలను న్యాయస్థానం పరిగణనలోకి తీసుకోవచ్చు

## నేరాల సమష్టి విచారణ

## 233, 234, 235 సెక్షన్లు

### సెక్షన్ 233

1. ప్రతి ఆరోపణను వేరువేరుగా విచారణ చెయ్యాలి. ఒక నిందితుడు దొంగతనం కేసులో విచారణలో నేరానికి మరో సందర్భంలో తీవ్ర గాయం చేసిన నేరానికి పాల్పడితే రెండు కేసులను విడివిడిగా విచారణ చెయ్యాలి. ఒక కేసులో అతడిపై రెండు నేరాలు విచారణ చేయరాదు. అయితే ఈ సాధారణ నియమానికి కొన్ని మినహాయింపులు ఉన్నాయి.

### సెక్షన్ 234

ఒక సంవత్సరం కాలంలో ఒక నిందితుడు ఒకేరకమైన మూడు నేరాలు చేసినట్లైతే, అతడు ఒక వ్యక్తికి లేదా ఎందరో వ్యక్తులకు వ్యతిరేకంగా ఆ నేరాలు చేసినా అతడిపై అన్ని నేరాలకూ ఏకకాలంలో విచారణ సాగించవచ్చు.

ఒకేరకమైన నేరాలు: భారత శిక్షాస్మృతి లేక ఏదైనా ప్రత్యేక చట్టం ప్రకారం ఒకే సెక్షన్ కింద శిక్షలు పడే నేరాలు ఒకే కోవకు చెందినవి.

2. మూడిటికి మించరాదు: సెక్షన్ 411 క్రింద మూడు నేరాలను మరో సెక్షన్ 414 కింద మరో మూడు నేరాల ఆరోపణలను సమష్టిగా విచారించడం తప్పు. ఫోర్జరీ (దొంగసంతకం) కి సంబంధించిన మూడు ఆరోపణలు, విశ్వాస ఘాతుకానికి సంబంధించిన మూడు ఆరోపణలు వేరయినవి. వాటిని కలిపి విచారించకూడదు.

| 1. ఒకేరకమైనవి | అక్రమ సంబంధం,<br>పునర్వివాహం హత్య,<br>శారీరక గాయాలు<br>ఫోర్జరీ, దొంగ సాక్ష్యం | ఇవన్నీ ఒకే రకమైన<br>నేరాలు కావు. |
|---|---|---|

ఈ నియమానికి రెండు మినహాయింపులు ఉన్నాయి.

(1) సెక్షన్ 379 క్రింద నేరాలు (దొంగతనం) సెక్షన్ 380 (నివాస గృహంలో దొంగతనం) ఈ రెండూ ఒకరకమైన నేరాలుగా పరిగణిస్తారు. అది ఒక సెక్షన్ క్రిందకు రాకపోయినా, ఒకే శిక్షను నిర్దేశించకపోయినా అవి ఒకేరకం నేరాలుగానే భావిస్తారు.

(2) నేరం చేయడం, లేదా ఆ నేరం చేయడానికి ప్రయత్నించడం (సెక్షన్ 511) ఐ.పి.సి.లో వేర్వేరు నేరాలే. ఇది ఒకే సెక్షన్ కింద లేకపోయినా, వీటికి ఒకే శిక్ష నిర్దేశించకపోయినా వీటిని ఒకేరకం నేరాలుగా పరిగణిస్తారు.

సెక్షన్235(2) ఒక వ్యక్తి ఒక చర్యకు పాల్పడితే, ఆ చర్యను చట్టంలోని వేర్వేరు సెక్షన్ల కింద రెండు లేదా అంతకు మించి నేరాలుగా పరిగణిస్తే, ఆ నేరాలన్నింటికీగానూ ఒకే కేసులో సమష్టిగా విచారించవచ్చు.

## సెక్షన్ 235(3)

ఒక చర్యకు పాల్పడితే, అది ఆ చర్యవరకే ఒక నేరమవుతుంది. మరోసారి ఇతర చర్యలతో చేర్చితే మరో నేరంగా పరిగణింపబడుతుంది. అపుడు ఆ నిందితుడిపై సమష్టి విచారణ జరపాలి.

అయితే నిందితుడి చర్య అనేక నేరాలుగా కనిపించిన సందర్భాల్లో ఆ నిందితుడిని సమష్టిగా విచారించవచ్చా? లేక విడివిడి కేసుల్లో విచారణ చేయాలా?

దీనికి సంబంధించిన నియమాలు సెక్షన్ 235(1)లో కనిపిస్తాయి.

నిందితుడు పాల్పడిన వివిధ చర్యలు వెనుక ఒకే వ్యవహారంలో భాగమవుతే, వాటిని విడివిడి నేరాలుగా పరిగణించే వీలున్నా అన్ని నేరాలకు కలిపి ఒకే విచారణ జరిపించవచ్చు.

## 1. ఒకే వ్యవహారం:

నేరాలుగా పరిగణించే విడివిడి చర్యలు ఒకే వ్యవహారంలో భాగమా కాదా అని నిర్ణయించేందుకు రెండు చర్యల మధ్య వ్యవధిని, సామీప్యతను కాకుండా, ఆ పనులన్నింటి లక్ష్యం, ఉద్దేశం ఒకటేనా అని చూడాలి. రెండు చర్యల మధ్య వ్యవధి ఉన్నంత మాత్రాన ఆ రెంటి మధ్య సారూప్య సంబంధం లేదనడానికి వీలులేదు. (రెండు చర్యల మధ్య వ్యవధి ఉండడం పరిశీలించతగిన ప్రధాన అంశమే అయినా.)

2. ఏకకాలంలో విచారణ జరపవలసిన నేరాల సంఖ్యపై పరిమితి లేదు.

## III. ఒకే కేసులో ఎంతమంది నిందితులను కోర్టు విచారించవచ్చు?

# నిందితుల సమష్టి విచారణ

### సెక్షన్ 239

ఈ క్రింది వ్యక్తులపై నేరారోపణలను సమష్టిగా విచారించవచ్చు.

(ఎ) ఒకే వ్యవహార క్రమంలో ఒకే నేరం చేసిన నిందితులు.

(బి) నేరం చేసిన ఆరోపణ, నేరాన్ని ప్రోత్సహించిన ఆరోపణ, ఆ నేరం చేసే ప్రయత్నం జరిపిన ఆరోపణను గురించిన నిందితులు.

(సి) సెక్షన్ 234 ప్రకారం 12 నెలల కాలంలో సంయుక్తంగా ఒకటికి మించి ఒకేరకం నేరాలు చేసిన ఆరోపణకు గురయిన నిందితులు.

(డి) ఒకే వ్యవహార క్రమంలో విభిన్న నేరాలు చేసిన నిందితులు.

(ఇ) దొంగతనం, బెదిరించి లాక్కోవడం, నేరపూరిత దుర్వినియోగం వంటి నేరాలకు పాల్పడ్డ నిందితులు.

ఇంకా

(ఎఫ్) పైన పేర్కొన్న నిందితులు నేరాల ద్వారా సేకరించిన సంపదను స్వీకరించిన, వుంచుకున్న, లేదా వాటిని అమ్మకానికి లేదా దాచడానికి సహకరించిన నిందితులు

(లేదా)

చివర పేర్కొన్న నేరాలను ప్రోత్సహించి, ప్రయత్నించిన నిందితులు

(జి) ఐ.పి.సి. 411 మరియు 414 సెక్షన్ల కింద లేదా ఆ రెంటిలో ఒక సెక్షన్ కింద దొంగిలించిన సంపదను సంబంధించిన నేరాలు, లేక ఆ సంపద బదలీ చేసిన నేరాల ఆరోపణలకు గురించిన నిందితులు.

గమనిక: ఒకే లక్ష్యాన్ని సాధించేందుకు నేరం మొదటి నుంచి చివరి దాకా వివిధ వ్యక్తులు కలిసి పనిచేయడమే వారి సమష్టి విచారణ ప్రక్రియను నిర్దేశించడానికి ప్రాతిపదిక.

పలువురు నిందితులు విడివిడిగా ఒక పథకం ప్రకారం కొంత వ్యవధితో కొన్ని చర్యలకు పాల్పడినంత మాత్రాన, ఒక వ్యవహారంలో భాగమయిన ఆ వివిధ చర్యలు 'సమష్టి పథకం' కాకుండా పోవు. మొదటి నుంచి చివరిదాకా ఒకే లక్ష్యంతో విభిన్న చర్యలకు పాల్పడ్డారు. కనుక ఆ నిందితులను సమష్టిగా విచారించవచ్చు. **20 Cal 358, 5 Mad, 199**

## IV. నిందితులు, సాక్షులను హాజరుపరచడం:

కోర్టు జరిగిన నేరాన్ని గుర్తించినప్పటికీ, నిందితుడు, సాక్షులు కోర్టులో హాజరైనప్పటి నుంచి మాత్రమే వాస్తవానికి నేర విచారణా ప్రక్రియ ప్రారంభమవుతుంది. నిందితుడు ఆరోపణకు జవాబు ఇవ్వడానికి, సాక్షి సాక్ష్యం చెప్పడానికి రావలసి ఉంటుంది.

వారిని కోర్టుకు ఎట్లా తీసుకువస్తారు?

## సెక్షన్ 104:

I. సెక్షన్ 173 కింద జరిపిన పరిశోధన ఆధారంగా నేరాన్ని గుర్తించినపుడు నిందితుడు, సాక్షులు కోర్టు ముందుంటారు.

II. సెక్షన్ 173 కింద పోలీసు రిపోర్టు ఆధారంగా కాక మరే కారణంగానైనా నేరాన్ని గుర్తించినపుడు, నిందితులు, సాక్షులు కోర్టులో ఉండరు. వారిని తీసుకురావలసి ఉంటుంది.

వారిని కోర్టుకు తీసుకువచ్చే విధానం ఏమిటి?

నేర విచారణ ప్రక్రియ చట్టం రెండు విధానాలను నిర్దేశిస్తున్నది.

## I. హాజరీ కోరే సమన్లు  II. అరెస్టు వారంట్లు

## సెక్షన్ 68 హాజరీకోరే సమన్

1) నేర విచారణా ప్రక్రియ చట్టం కింద కోర్టు జారీచేసే సమన్లు రెండు ప్రతులు ఉండాలి. కోర్టు అధికారి గానీ లేదా హైకోర్టు ఎప్పటికప్పుడు నిర్దేశించే ఏ ఇతర అధికారం గానీ సంతకం చేసి సీలువేసి సమన్లు జారీచేయాలి.

2) సమన్లను పోలీసు అధికారి గానీ, లేదా ఇందుకోసం స్థానిక ప్రభుత్వం నిర్దేశించిన ప్రకారం ఏ ఇతర కోర్టు అధికారి కానీ, ఇతర ప్రభుత్వ అధికారి కానీ అందించవచ్చు.

**సెక్షన్ 69**: స్వయంగా అందించడం

1) సమన్ల రెండు ప్రతులలో ఒకదాన్ని హాజరు కావలసిన వ్యక్తినే సాధ్యమయినంతవరకు స్వయంగా అందించడం మంచిది.

2) సమన్లు స్వీకరించిన వ్యక్తి, అందించిన అధికారి కోరితే, సమన్లు అందినట్లు సమను ప్రతి వెనుక సంతకం చేయాలి.

3) సంస్థలకు సమన్లు:

సంస్థలకు ఇవ్వవలసిన సమన్లను ఆ సంస్థ కార్యదర్శికి గానీ, స్థానిక మేనేజర్‌కు గానీ, బ్రిటీష్ ఇండియా సంస్థ ప్రిన్స్‌పల్ అధికారికిగానీ ఇవ్వాలి. మామూలు తపాలాలో సమన్లు వచ్చినా సమన్లు అందినట్టే భావిస్తారు.

**సెక్షన్ 70**:

సమన్లు స్వీకరించవలసిన వ్యక్తి లేకపోతే, ఆయన కుటుంబంలో పురుష సభ్యుడినీ, ప్రెసిడెన్సీ పట్టణాల్లో అయితే అతనితో నివసించే నౌకరుకి ఇవ్వాలి.

ఆ విధంగా తీసుకున్న వ్యక్తి సమను ప్రతి వెనుక సంతకం చేయాలి.

నిందితుడికి స్వయంగా సమన్లు అందించడానికి తగిన చర్యలు తీసుకోకుండా సమన్లు ఇచ్చేందుకు ఇతర పద్ధతులను అనుసరించడానికి వీలులేదు.

69 జె.సి. 627

**సెక్షన్ 71**:

ఇది కూడా సాధ్యం కానప్పుడు సమన్లు పత్రం నకలును హాజరవవలసిన వ్యక్తి నివసించే ఇంటి గుమ్మానికి లేదా స్పష్టంగా కనిపించే మరోచోట గానీ అతికించాలి.

**సెక్షన్ 72**:

ప్రభుత్వోద్యోగికి లేదా రైల్వే అధికారికి అందజేయవలసిన పద్ధతి:

ప్రభుత్వోద్యోగి/ రైల్వే అధికారికి సమన్లను జారీచేయవలసి ఉంటే అతడు పనిచేసే కార్యాలయం

ప్రధానాధికారికి సదరు ప్రతి నకలును అందజెయ్యాలి, అతడు సదరు ఉద్యోగికి 69వ సెక్ష సూచించిన పద్ధతిలో అందజేస్తాడు. అతడి సంతకం చేసుకుని ఆ వివరం రాసి ఆ అధికారి ఆ ప్రతి న్యాయస్థానానికి పంపిస్తాడు.

(2) అటువంటి సంతకం అతనికి సమన్లు సక్రమంగా జారీఅయినట్లు సాక్ష్యం.

**సెక్షన్ 73**

**స్థానిక పరిధిని దాటి పంపవలసిన ఉత్తరువులు:**

న్యాయస్థానం సమన్లను తన స్థానిక పరిధిని దాటి ఇతర ప్రాంతానికి పంపవలసి వస్తే దాని అందుకోవలసిన వ్యక్తి ఏ ప్రాంతంలో ఉంటాడో ఆ ప్రాంతం మెజిస్ట్రేట్‌కు సదరు సమన్లు రెండ ప్రతులను పంపాలి. ఆ మెజిస్ట్రేట్ సదరు వ్యక్తికి సమన్లు పంపిస్తారు.

**సెక్షన్ 74**

**సమన్లను అందజేసే వ్యక్తి లభ్యం కానప్పుడు అందించినట్లు రుజువు:**

(1) సెక్షన్ 69/ సెక్షన్ 70 సూచించిన పద్ధతిలో సమన్లను జారీచేసిన వ్యక్తి తాను వాటిని పంపించినట్లు మెజిస్ట్రేట్ ముందు ఒక ప్రమాణ పత్రం ద్వారా ధ్రువీకరించి, సదరు సమన్ల నకలు ప్రతిని రుజువుగా ప్రవేశపెట్టాలి. అతడు అందజేసిన సమాచారం సరైంది కాదు అని రుజువైతే తప్ప సరైందనే భావించాలి.

(2) అధికార ప్రమాణ పత్రంతో పాటు సమన్ల నకలు ప్రతిని జతచేసి న్యాయస్థానానికి పంపాలి.

(1) సమన్లను న్యాయవాదికి పంపినంతమాత్రాన సరిపోదు.

**6 COWN 929**

(2) సమన్ల ప్రతిని వ్యక్తికి అందచేయాలి. కేవలం అతనికి చూపిస్తే సరిపోదు. **5 B II C.R.20**

(3) ఒకవేళ సమన్లను తీసుకోవటానికి నిరాకరించినట్లయితే సమన్లు ఇవ్వజూపడం కూడా ఇచ్చినట్లే అవుతుంది. **28 M L F 505**

(4) సమన్లను తీసుకోవటానికి నిరాకరించటం నేరం కాదు.

## II. అరెస్ట్ వారంట్

### సెక్షన్ 75

1. అరెస్ట్ వారంట్‌ను అధ్యక్ష అధికారిగానీ, పలువురి ధర్మాసనం అయితే ఎవరో ఒకరుగానీ సంతకం చేసి న్యాయస్థానం సీలువేసి వ్రాతపూర్వకంగా జారీచేయాలి. జారీచేసిన న్యాయస్థానం దాన్ని రద్దుచేసేంతవరకు లేదా మరో వారంట్‌ను జారీచేసేవరకు అది అమలులో ఉంటుంది.

## 2. సమన్లకు వారంట్‌కు మధ్య వ్యత్యాసం.

వారంట్ అంటే నిర్బంధితుడు కావలసిన వ్యక్తికి 'కోర్టు ఆదేశం' కాదు. కనుక 'వారంట్' పట్ల అవిధేయత చూపితే శిక్షించడానికి వీల్లేదు. కాని సమన్లు హాజరుకమ్మని వ్యక్తికి కోర్టు ఆదేశించడమే కనుక సమన్ల పట్ల అవిధేయత శిక్షార్హమైంది. **5 W.R.ed. 72**

### సెక్షన్ 76

జమానత్ (పూచీఖత్) తీసుకోవాలని కోర్టు ఆదేశించవచ్చు.

1. వారంట్ జారీచేసిన కోర్టు, వారంట్‌పై నిర్దేశించిన మేరకు ఆ వ్యక్తి సరైనటువంటి జమానత్‌ను చూపించి కోర్టు నిర్దేశించిన సమయంలో హాజరవుతానని హామీ ఇవ్వగలిగితే వారంట్ అమలుపరచే అధికారి ఆవిధంగా సరైన జమానత్‌లు తీసుకొని నిర్బంధం నుంచి నిందితుడిని విడుదల చేయవచ్చు.

2. వారంట్‌లో ఈ క్రింది అంశాలు నిర్దేశితమై ఉండాలి.

ఎ) జమానత్‌ల సంఖ్య.

బి) నిర్బంధంలోకి తీసుకోవలసిన వ్యక్తి, ధరావతుదారులు బద్ధుడు కావడానికి గాను ధరావతుదారులు చెల్లించవలసిన సొమ్ము.

సి) ఎప్పుడైనా ఈ విభాగం కింద జామీను తీసుకున్నప్పుడు వారంట్‌ను అమలుచేసే అధికారం ఆ జామీనును న్యాయస్థానానికి పంపించాలి.

### సెక్షన్ 77

1. వారంట్‌ను ఎవరికి నిర్దేశించాలి.

సాధారణంగా వారంట్‌ను ఒకరు లేదా అంతకంటె ఎక్కువ పోలీసు అధికారులకు నిర్దేశించడ జరుగుతుంది. దానిని ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ జారీచేస్తారు. ఒకవేళ ఏ ఇతర న్యాయస్థానమైనా అటువంట వారంట్‌ను జారీచేసి దానిని తక్షణమే అమలు పరచటానికి పోలీసు అధికారి లభ్యంకాకపోయినట్లయితే వేరే వ్యక్తి లేదా వ్యక్తులు సదుర వారంట్‌ను అమలు పరచాలని ఆదేశించవచ్చు.

2. వారంట్‌ను ఒకరికంటే ఎక్కువ వ్యక్తులకు నిర్దేశించినట్లయితే వారిలో ఏ ఒక్కరుగానీ అంతకన్నా ఎక్కువమంది గానీ లేదా అందరూగానీ దానిని అమలుచేయవచ్చు.

సెక్షన్ **78**:

1. వారంట్‌ను వ్యవసాయదారునికి లేదా పట్టాదారునికి లేదా వ్యవసాయ నిర్వాహకునికి చేతికి ఇచ్చి అమలుజరపమని ఆదేశించవచ్చు.

1. శిక్షకు గురైన వ్యక్తి తప్పించుకున్నట్లయితే.
2. దోషి ప్రకటితుడైన వ్యక్తిని పట్టుకోవడానికి లేదా నాన్ బెయిలబుల్ నేరారోపణకు గురయిన నిందితుడు దొరకకుండా పోతే నిర్బంధంలోకి తీసుకోవడానికి వారంట్‌ను పైవిధంగా జారీచేయటం జరుగుతుంది. తమ అధీనంలో వున్న ప్రదేశంలో నిర్బంధంలోకి తీసుకోవల్సిన వ్యక్తి ఉన్నట్లయితే వారంట్‌పై వారు సంతకం పెట్టి దానిని అమలుపరుస్తారు.
3. నిర్బంధంలోకి తీసుకున్న వ్యక్తిని సమీప పోలీస్ స్టేషనుకు తరలించాలి.

సెక్షన్ **79**

వారంట్‌ను స్వీకరించిన పోలీసు అధికారి దానిమీద మరొక పోలీసు అధికారిని అమలు చేయమని వ్రాతపూర్వకంగా కోరవచ్చు.

సెక్షన్ **80**

నిర్బంధించే వ్యక్తికి నిర్బంధంలోకి తీసుకునే వారు వారంట్ సారాంశాన్ని వివరించాలి.

సెక్షన్ **81**

సెక్షన్ 76లో ఉన్న నిబంధనలకు లోబడి జమానత్ తీసుకొని నిర్బంధంలోకి తీసుకొనేవారు

ఎటువంటి అనవసరమైన ఆలస్యం చేయకుండా నిర్బంధించిన వ్యక్తిని ఏకోర్టులో అయితే అతడు హాజరుకావల్సి ఉంటుందో ఆ కోర్టుకు అతనిని తీసుకురావాలి.

## సెక్షన్ 82

అరెస్టు వారంట్‌ను బ్రిటిష్ ఇండియాలో ఏ ప్రదేశంలోనైనా అమలుపరచవచ్చు.

## సెక్షన్ 83

వారంట్‌ను అమలుపరుస్తున్నప్పుడు దానిని జారీచేసిన న్యాయస్థానం స్థానిక పరిమితుల వెలుపల జరిగినప్పుడు సదరు న్యాయస్థానం పోలీసు అధికారికి ఆ వారంట్‌ను జారీచేయటం కంటే ఎక్కడైతే దానిని అమలుపరచవలసి వుంటుందో ఆ ప్రాంతపు మెజిస్ట్రేట్‌కు లేదా డిస్ట్రిక్ట్ సూపరింటెండెంట్ పోలీసుకు లేదా ప్రెసిడెన్సి టౌన్ కమిషనర్ ఆఫ్ పోలీసుకు సదరు వారంట్‌ను తపాలా ద్వారా పంపించవచ్చు.

2. మెజిస్ట్రేట్ లేదా డి.ఎస్.పి. లేదా కమిషనర్, ఎవరికైతే వారంట్‌ను పంపించడం జరుగుతుందో అతడు దానిమీద వ్రాసి సంతకంచేసి సాధ్యమైతే, తన పరిధిలో ఉన్నట్లయితే దానిని అమలుపరచాలి.

## సెక్షన్ 84

తన పరిధికి ఆవల వారంట్‌ను అమలుజరపవలసిన పోలీస్ అధికారి సాధారణంగా అక్కడి మెజిస్ట్రేట్ దగ్గర లేదా ఏ పోలీస్ స్టేషన్ పరిధిలో వారంట్‌ను అమలుపరచడం జరుగుతుందో ఆ స్టేషన్ ఇంఛార్జి ఆఫీసర్ సంతకాన్ని ఎండార్స్‌మెంట్ వాక్యాన్ని తీసుకోవాలి.

2. ఆ మెజిస్ట్రేట్ లేదా పోలీస్ అధికారి తన పేరు వ్రాసి సంతకంచేస్తే ఆ వారంట్‌ను అమలుపరచడానికి తగిన అధికారం ఉంటుంది.

3. సదరు అధికారి సంతకం, వ్రాతపూర్వక ఆదేశం తీసుకోవటంలో జాప్యం అయ్యేటట్లు ఉంటే అది లేకుండానే దానిని అమలు పరచవచ్చు.

## సెక్షన్ 85

(స్థానిక పరిధి) వెలుపల అరెస్ట్ చేయటం జరిగిత నిర్బంధితుడిని మెజిస్ట్రేట్ డి.ఎస్.పి. లేదా పోలీస్ కమిషనర్ వద్దకు పంపాలి.

## సెక్షన్ 86

వారు అప్పుడు అరెస్టు అయిన వ్యక్తిని వారంట్ జారీచేసిన కోర్టులో హాజరుపరచమని నిర్దేశిస్తారు.

అరెస్టు వారంట్‌ను అమలుపరచకపోతే ఏర్పడే పరిణామాలు

## సెక్షన్ 87

నిందితుడు పరారీలో ఉంటే, న్యాయస్థానం అతడిని నిందితుడుగా ప్రకటించి, ఆవిధంగా ప్రకించిన ముప్పై రోజుల లోపల నిర్దేశిత స్థలంలో లొంగిపోవాలని బహిరంగ ప్రకటన ద్వారా ఆదేశించవచ్చు.

2. నిందితుడుగా ప్రకటనను ఏరకంగా ప్రచురించాలి.

1. ఆ వ్యక్తి సాధారణంగా ఎక్కడైతే నివసిస్తాడో ఆ ప్రదేశంలో దానిని చదివేటట్లు ఉండాలి.

2. అతడు నివసించే గృహంలో ఏదైనా ఒక ముఖ్య భాగంలో సదరు ప్రకటనను అతికించాలి.

3. ఆ ప్రకటన ప్రతిని న్యాయస్థానంలో అతికించాలి.

## సెక్షన్ 88

సెక్షన్ 87 కింద ప్రకటనను జారీచేసే కోర్టు ఏ సమయంలోనైనా సదరు ప్రకటిన నిందితుని స్థిరచరాస్తులను జప్తు చేసుకోవచ్చు.

2. అటువంటి ఉత్తర్వు ఈ జిల్లాలో అయితే నిందితుని ఆస్తిపాస్తులు ఉంటాయో ఆ జిల్లా అధికారిని వాటిని జప్తు చేసుకోమని కోరవచ్చు.

## సెక్షన్ 89

జప్తు చేసుకున్న ఆస్తిని తిరిగి ఇచ్చివేయటం. న్యాయస్థానం ఆస్తిని జప్తు చేసుకున్న తేదీ నుంచి రెండు సంవత్సరాల లోపల సదరు వ్యక్తి లొంగిపోయినట్లయితే, అతడు పారిపోలేదని లేదా ఎక్కడా దాక్కోలేదని, తనకు ప్రకటన గురించి తెలియదని అందువల్ల నిర్దేశించిన సమయం లోపల లొంగిపోలేకపొయ్యానని న్యాయస్థానాన్ని నమ్మించగలిగితే అప్పుడు సదరు కోర్టు జప్తు చేసుకున్న ఆస్తిని సదరు కోర్టు ఇచ్చివేయవచ్చు.

### సెక్షన్ 90

ఎవరికి వ్యతిరేకంగా వారంట్‌ను జారీచేయవచ్చు? సాధారణంగా నిందితునికి వ్యతిరేకంగా మాత్రమే వారంట్‌ను జారీచేస్తారని మనం ఊహిస్తాం, కాని అలా జరగదు. న్యాయవేత్త అస్సెసార్‌లను మినహాయించి సమన్లు ఎవరికి జారీచేస్తారో వారికి వారంట్ కూడా జారీచేయవచ్చు.

అంటే సాక్షికి వ్యతిరేకంగా కూడా వారంట్‌ను జారీచేయవచ్చు.

ఎప్పుడైతే - 1. అతడు హాజరు కావాల్సిన సమయానికి ముందే పరారీలో వున్నాడని కోర్టు భావించినప్పుడు సమన్లను ధిక్కరిస్తాడని అనుకొన్నప్పుడు లేదా 2. నిర్దేశించిన సమయంలో అతడు హాజరుకానప్పుడు సమన్లను అందుకొని కోర్టులో అతడు హాజరవటంలో విఫలమైనపుడు.

## కక్షిదారులు నిర్ణీత ప్రక్రియ ప్రకారం కోర్టులో క్రమం తప్పకుండా హాజరవటానికి అవసరమైన చర్యలు

### సెక్షన్ 91

హాజరీ సమన్లు, అరెస్టు వారంట్ అందుకోవలసిన వ్యక్తి కోర్టులోనే ఉన్నపుడు అతని హాజరీకోసం ధరావతులతోగానీ, లేకుండాగానీ జమానత్‌ను ఆ అధికారి తీసుకోవచ్చు.

### సెక్షన్ 92

జమానత్‌పై సంతకం చేసిన వ్యక్తి హాజరుకాకపోయినట్లయితే అధికారి అతని నిర్బంధానికి వారంట్‌ను జారీచేసి దానిని అమలుపరచటానికి ఎవరినైనా నిర్దేశించవచ్చు. అంతే కాకుండా కోర్టు ముందు ఫిర్యాదుదారుడు నిందితుడు సాక్షులను హాజరు పరచాల్సిన బాధ్యత అతనిపై వుంది. అయితే నిందారోపణను రుజువు చేయగలిగిన సాక్ష్యాధారాలను అవసరమైన పత్రాలను న్యాయస్థానం ముందు దాఖలు చేయవలసిన అవసరం కూడా ఉంది.

### కల్పిత పత్రం – బంధితుడు

అందువల్ల మనం ఇప్పుడు ఈ క్రింది వాటికి సంబంధించిన నిబంధనలను పరిశీలించాలి.

### (1) కల్పిత పత్రం లేదా వస్తువు:

పరిశీలనలో ఉన్న వివాదానికి సంబంధించిన పత్రం లేదా వస్తువును దర్యాప్తుకు అవసరం అని న్యాయస్థానం భావిస్తే సదరు పత్రం లేదా వస్తువును న్యాయస్థానంలో దఖలుపరచాలని దానికి సంబంధించిన

వ్యక్తిని న్యాయస్థానం ఆదేశించవచ్చు. అందుకుగాను తేదీ, సమయాన్ని నిర్దేశిస్తు కోర్టు సమన్లను జారీచేస్తుంది.

(2) కేవలం వస్తువును/ పత్రాన్ని దాఖలుచేయాలని నిర్దేశిస్తే సదరు వ్యక్తి న్యాయస్థానానికి హాజరుకానవసరంలేదు. ఆ వస్తువును/ పత్రాన్ని పంపితే చాలు.

(దీని ముందు భాగం లభ్యం కాలేదు. -సం.)

వివాదాన్ని విచారణ చేస్తున్న మెజిస్ట్రేట్/ అధికారి లేదా సెషన్స్ జడ్జి సంతకం చేయాలి.

మెజిస్ట్రేట్ లేదా సెషన్స్ జడ్జి సాక్షులను విచారణ చేస్తున్నప్పుడు వారి వాంఙ్మూలాన్ని లిఖితరూపంలో నమోదు చేయనప్పుడు, వారి మౌఖిక సాక్ష్యాన్ని అనంతరం లిఖితరూపంలో రూపొందించి సదరు న్యాయమూర్తి, దానిపై సంతకం చెయ్యాలి. తర్వాత కోర్టు రికార్డులో చేర్చాలి.

## సెక్షన్ 363

సెషన్స్ జడ్జి మెజిస్ట్రేట్ పరిశీలనలో ఉన్న సాక్ష్యుల నడవడికపై కూడా తన వ్యాఖ్యలను లిఖిత రూపంలో నమోదు చెయ్యాలి.

## సెక్షన్ 360

సాక్షి చెప్పిన సాక్ష్యాన్ని నమోదు చేసిన అనంతరం ఆ సాక్షికి వారిచ్చిన సాక్ష్యాన్ని నిందితుడి సమక్షంలో, లేదా అతడి న్యాయవాది సమక్షంలో చదివి వినిపించాలి. అవసరమైతే తప్పులను సాక్షి సరిచేయవచ్చు.

మొత్తం సాక్షాన్నే సరిగాలేదని సాక్షి భావిస్తే, తిరస్కరిస్తే ఆ తప్పులను సరిదిద్దే బదులు, యథాతథంగా అభ్యంతరాలను నమోదు చేయాలి.

సాక్ష్యాన్ని వినిపిస్తున్నప్పుడు అందులో ఏ భాగాన్నైనా వదలిపెట్టటం చట్టవ్యతిరేకం

## II. ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ల సమక్షంలో

## సెక్షన్ 362

**అప్పీలు చేయగల మరియు అప్పీలు చేయలేని వివాదాలు**

### అప్పీలు చేయగల వివాదాలు

మెజిస్ట్రేట్‌లు సాక్షుల సాక్ష్యాన్ని స్వయంగా నమోదు చేస్తారు. లేదా బహిరంగ న్యాయస్థానంలో తాను స్వయంగా వినిపిస్తూ నమోదు చేయిస్తారు.

ఈవిధంగా తీసుకొన్న సాక్ష్య సేకరణ పత్రంపై మెజిస్ట్రేట్ సంతకం చేస్తారు. దానిని న్యాయస్థానం రికార్డ్‌గా పరిగణిస్తారు.

నిందితుడిని ప్రశ్నించిన అనంతరం అతని వాంజ్మూలంలో సారాంశాన్ని మెజిస్ట్రేట్ నమోదు చేస్తారు. దానిపై ఆయన సంతకంచేసి రికార్డ్‌లో భాగంగా స్వీకరిస్తారు.

### అప్పీలు చేయలేని వివాదాలు

ఆరోపణల పత్రం లేదా సాక్ష్యాన్ని రికార్డ్ చేయవలసిన అవసరం ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్‌కు లేదు.

సెక్షన్ 359, 362(2)

### సాక్ష్యాన్ని నమోదుచేసే పద్ధతి

సాధారణంగా సాక్ష్యాన్ని వివరణ పద్ధతిలోనే నమోదు చేస్తారు. అవసరమైతే మెజిస్ట్రేట్ మధ్యలో ప్రశ్నలు వేసి కొన్ని ప్రత్యేక అంశాలపై సమాధానాన్ని రాబట్టి నమోదు చేయవచ్చు.

మినహాయింపు: నిందితుడిని పరీక్షించడం

### సెక్షన్ 364

మొత్తం పరీక్షను అన్ని ప్రశ్నలను, వాటికి ఇచ్చిన సమాధానాలను పూర్తిగా నమోదు చెయ్యాలి.

అయితే హైకోర్ట్‌లో నిందితుని పరీక్షకు ఇది వర్తించదు.

## II. సత్వర విచారణలో నమోదు

### సెక్షన్ 260

1. జిల్లా మెజిస్ట్రేట్
2. స్థానిక ప్రభుత్వం ప్రత్యేకంగా నియోగించిన మొదటి తరగతి మెజిస్ట్రేట్

3. స్థానిక ప్రభుత్వం నియోగించిన మొదటి తరగతి హోదా ఉన్న ఏ మెజిస్ట్రేట్ అయినా ఈ క్రింది నేరాలపై సత్వర విచారణ జరిపించవచ్చు:-

1. ఆరు మాసాలకు మించిన కారాగారశిక్ష, ఇతర ప్రాంతాలకు బహిష్కరణ, ఉరిశిక్ష విధించతగిన నేరాలను, అలాగే ఈ సెక్షన్‌లో పేర్కొన్న ఇతర నేరాలకు సంబంధించని నేరాలను సత్వర విచారణ చేయవచ్చు.

సత్వర విచారణలో అప్పీలు చేసేవి, అప్పీలు చేయరాని వివాదాలుండవచ్చు.

## సెక్షన్ 263

అయితే స్థానిక ప్రభుత్వం నిర్ణయించిన రీతిలో ఒక ఫారంలో ఈ క్రింది సమాచారాన్ని నమోదు చెయ్యాలి.

1. క్రమ సంఖ్య
2. నేరం జరిగిన తేది
3. ఫిర్యాదు లేదా పోలీసు రిపోర్ట్ ఇచ్చిన తేది
4. ఫిర్యాదుదారుని పేరు (ఉన్నట్లైతే)
5. నిందితుని పేరు, అతని తల్లిదండ్రుల పేర్లు, నివాస స్థలం
6. నేరం వివరం, ఆ నేరానికి సంబంధించిన ఆస్తి విలువ
7. నిందితుని వాదం, దానికి సంబంధించిన అతని వాంఙ్మూలం వివరాలు (ఉంటే)
8. విచారణ, శిక్ష విధించటానికి కారణాలు తీర్పుగానీ, శిక్షపడితే అందుకు కారణాలు క్లుప్తంగా
9. శిక్ష లేదా తుది తీర్పు
10. విచారణ పూర్తిఅయిన తేది

## అప్పీలు చేయతగిన వివాదాలు

సెక్షన్ 264: సాక్ష్యం సారాంశం పేర్కొంటూ తీర్పు ఇవ్వడమేగాక, కోర్టు శిక్ష విధించేముందు అప్పీలు చేయతగిన కేసుల్లో ఇతర అవసర వివరాలను కూడా ఇవ్వాలి.

అప్పీలు చేయతగిన కేసుల్లో అటువంటి తీర్పు ఒక్కటే రికార్డు ఉంటుంది.

## తీర్పు

### సెక్షన్ 366

ఈ క్రింది విధంగా క్రిమినల్ న్యాయస్థానం తీర్పును ప్రకటిస్తుంది లేదా తీర్పు సారాంశాన్ని వివరిస్తుంది.

1. బహిరంగ న్యాయస్థానంలో తీర్పును వెనువెంటనే గాని ఏదైనా నిర్ణీత తేదీన గానీ ప్రకటించాలి. పార్టీలు కోరితే మొత్తం తీర్పును చదవాలి.

2. కస్టడీలో ఉన్న నిందితుడిని తీర్పు ఇచ్చేరోజు న్యాయస్థానానికి తీసుకురావటం, అతడు కస్టడీలో లేకపోతే తీర్పు వినటానికి పిలిపించటం అవసరం. అయితే అతని వ్యక్తిగత హాజరీ అవసరం లేనప్పుడు, అతడిని విడుదల చేస్తూ ఇప్పుడు లేదా జరిమానా విధించేటప్పుడు నిందితుడు హాజరుకానవసరంలేదు.

షరా:- (3) నిందితుడు హాజరుకానిపక్షంలో తీర్పును చదవనవసరంలేదు.

### సెక్షన్ 367

ఇతరత్రా సూచిస్తేనే తప్ప ప్రతి తీర్పును న్యాయమూర్తి చదవాలి. అందులో ఈ క్రింది అంశాలు ఉండాలి:-

(1) న్యాయం నిర్ణయించవలసిన అంశం లేదా అంశాలు

(2) న్యాయనిర్ణయం

(3) ఆ నిర్ణయానికి కారణాలు.

(4) బహిరంగంగా కోర్టులో ప్రిసైడింగ్ అధికారి తీర్పు చెప్పే సమయంలో తీర్పుపై సంతకం చేసి తేదీ వేయాలి. ప్రిసైడింగ్ అధికారి సొంతంగా తీర్పు రాయని పక్షంలో తీర్పు ప్రతిపేజీపై సంతకంచేసి తేదీ వేయాలి.

(5) అతను చేసిన నేరం, ఐ.పి.సి.లో ఆ నేరానికి శిక్ష నిర్దేశించిన సెక్షన్ను, లేదా ఏ ఇతర చట్టం కిందనైనా శిక్ష విధిస్తే ఆ విషయాన్ని శిక్ష వివరాన్ని పేర్కొనాలి.

(6) ఐ.పి.సి.లోని సెక్షన్లో ఏవిభాగం కిందకు నేరం వస్తుందో చెప్పలేనపుడు, తీర్పులో ఆ సందేహం గురించి పేర్కొని ప్రత్యామ్నాయ తీర్పును వివరించాలి.

(7) నిందితుడిని విడిచిపెట్టే తీర్పు అయితే ఏ నేరంమీద నిందితుడిని విచారించారో తెలిపి, అతడిని వదిలేయాలని ఆదేశించాలి.

(8) నిందితుడు చేసిన నేరం మరణశిక్షను విధించతగినదైనా, ఆ శిక్షకాక మరేశిక్షయినా విధించితే అందుకు కారణాలు తెలపాలి.

న్యాయమూర్తి కాకుండా జ్యూరీ సభ్యులు కేసు విచారణ జరిపితే తీర్పురాయనవసరంలేదు. సెషన్స్ కోర్టు నేరాల విశేషాలు రాస్తే చాలు.

## సెక్షన్ 368

మరణ శిక్ష విధిస్తే - నిందితుడు చనిపోయేవరకు మెడకు ఉరివేయాలని ఆదేశించాలి.

## సెక్షన్ 369

తీర్పులో మార్పులు

తన తీర్పుపై సంతకం చేసిన న్యాయస్థానం గుమాస్తాచేసిన తప్పిదాన్ని సరిదిద్దడానికి తప్ప ఆ తీర్పును మార్చడానికి కాని పునఃసమీక్షించడానికి గాను వీలులేదు - ఈ కోడ్‌లోగానీ, ఇతరచట్టంగానీ, హైకోర్టుగానీ మార్పులకు అధికారం ఇస్తే తప్ప.

(హైకోర్టుకు కూడా తన తీర్పును మార్చే అధికారం లేదు)

## సెక్షన్ 370

ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ తీర్పు

తీర్పును నమోదుచేసే బదులు, ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ ఈ క్రింది వివరాలను ఇవ్వాలి.

a) క్రమ సంఖ్య

b) నేరాలు జరిగిన తేదీలు

c) ఫిర్యాది పేరు (ఉంటే)

d) నిందితుడి పేరు (యూరోపియన్ బ్రిటీష్ పౌరుడైతే తప్ప) అతని తలిదండ్రుల వివరాలు, నివాసం

e) ఆరోపిత నేరం, రుజువైన నేరం

f) నిందితుడి వాదం, ఇతర వివరాలు (ఉంటే)

g) తుది నిర్ణయం

h) ఆ నిర్ణయం తేది

i) ఖైదు, 200 రూపాయలకు మించి జరిమానా, లేదా రెండు విధించే శిక్షకన్నా అధిక విధిస్తే, అందుకు క్లుప్తంగా వివరాలు ఇవ్వాలి.

## సెక్షన్ 371

తీర్పు ప్రతిని ఎటువంటి ఆలస్యం లేకుండా నిందితునికి ఇవ్వాలి

సమన్లకు సంబంధించని ఇతర వివాదాల్లో ఉచితంగా ( తీర్పు ప్రతిని) లభ్యం చెయ్యాలి.

జూరీలతో కూడిన విచారణ అయితే జూరీల నేరారోపణలను నిందితునికి లభ్యం చేయటం.

మరణ శిక్షను విధించినప్పుడు, అప్పీలు చేసుకోటానికి కాలపరిమితిని నిందితు తెలియచెయ్యాలి.

## సెక్షన్ 373

శిక్షను విధించిన ఉత్తరువు ప్రతిని సెషన్స్ కోర్టు జిల్లా మెజిస్ట్రేట్‌కు పంపాలి.

నిందితుని విచారణ కాకుండా ఇతర క్రిమినల్ విచారణ

1. శాంతి భద్రతలకు సంబంధించినది.

2. కొన్ని విధాయక నిధుల అమలుకు సంబంధించినవి. కుటుంబ కర్తవ్యాలు లేదా ప్రజల ఇబ్బంది పెట్టే చర్యలు (న్యూసెన్స్)

3. ప్రజా శాంతి పరిరక్షణకు సంబంధించినవి

## I. బహిరంగ సమావేశాలు - శాంతి భద్రతలకు సంబంధించినవి

నేరం జరిగిన తర్వాత దానిని విచారించి శిక్షించటం కంటే నేరం జరగకుండా నిరోధించట శ్రేయస్కరం. అయితే నేరాన్ని నిరోధించే ప్రయత్నాలు వ్యక్తుల స్వేచ్ఛను పరిమితం చేయవచ్చు.

ఒక వ్యక్తి నడవడిక నేరానికి దారితీస్తే జోక్యం చేసుకోవాలని ఆంగ్ల న్యాయసిద్ధాంతం అంటుం ఉదాహరణ: రాజద్రోహం, కుట్ర సమావేశానికి సంబంధించిన ఆంగ్ల చట్టం.

అలా కాకుండా భారతీయ న్యాయం వేరుగా ఉంది. ఉదాహరణ: పత్రికల చట్టం, ప్రజా సమావేశాల చట్టం.

ఇలా ఉండడటం వల్ల క్రిమినల్ న్యాయస్థానాలకు నేరాలు జరగకుండా నిరోధించటానికి సి. ఆర్. పి. సి. లోని కొన్ని సెక్షన్లు అధికారాన్నిస్తున్నాయి.

(పుట ఖాళీగా ఉంది. -సం.)

* * *

8వ అధ్యాయంలో సామాజిక శాంతి భగ్నం చేసే నేరాల గురించి వివరించారు.

(పుట ఖాళీగా ఉంది. -సం.)

* * *

నేర నిరోధకంగానూ, ఇతర ముందు జాగ్రత్త చర్యలకుగాను కోర్టు ఈ క్రింది సూచనలు చేస్తుంది.

1. ప్రపంచంలోని ప్రతిదేశంలో పరస్పర వ్యతిరేక వర్గాలు ఉంటాయి. ఈ వ్యతిరేకతలు హింసకు, తీవ్రమయిన నేరాలకు దారితీయవచ్చు.

2. కొన్ని ప్రచారాలను కొనసాగనిస్తే అమాయకులు కూడా ప్రమాదకరమయిన పనులు చేసే అవకాశం ఉంది. అబద్ధాలు, అంతకన్న హానికరమయిన అర్ధసత్యాలు అమాయకులను రెచ్చగొట్టే అవాస్తవాలను నమ్మేలా చేస్తాయి. ఎవరు ఏ కుట్రలూ చేయకపోయినా చేస్తున్నారేమోనన్న భ్రమలు కలిగిస్తాయి.

3. కొందరు సోమరిగా జీవనం సాగించదలచుకుంటారు. అడపాదడపా నేరాలు చేస్తూ నీతిగా బతుకుతున్నట్లు నటిస్తారు. తాము నేరాలు చేసి వచ్చే సంపాదనపై బతికేవారు కొందరయితే, ఇతరుల నేరాలలో వాటా సంపాదించేవారు మరికొందరు. అందుకుగాను నేరస్తులను పట్టుబడకుండా కాపాడి, నేర సంపాదిత వస్తువులను విక్రయించడంలో, లేదా దాచడంలో సాయపడి శిక్ష పడకుండా చూస్తారు.

4. అలవాటు ప డిన నేరస్తులు.

## సెక్షన్ 183

9) ప్రయాణం (లేదా సముద్రయానం) జరుపుతున్న సమయంలో ఎవరైనా నేరానికి పాల్పడితే, ఆ ప్రయాణం (లేదా సముద్రయానం)లో భాగంగా, నేరస్తుడుగానీ, నేరానికి గురయిన వ్యక్తిగానీ, వస్తువుగానీ ఏ ప్రాంతం నుంచి వెళ్తాడో ఆ ప్రాంత పరిధి కలిగిన కోర్టు ద్వారా విచారణ జరపవచ్చు.

## సెక్షన్ 184

రైల్వే, టెలిగ్రాఫ్, పోస్టాఫీసు, ఆయుధాలు మందుగుండు సామాగ్రికి సంబంధించి అమలులో ఉన్న చట్టాల ప్రకారం, జరిగిన నేరాలను ప్రెసిడెన్సీ పట్టణంలో విచారించాలి.

## సెక్షన్ 185

సందేహం వస్తే, ఏ సబార్డినేట్ కోర్టుకు విచారణాధికారం ఉందో హైకోర్టు నిర్ణయిస్తుంది.

ఒకే హైకోర్టు కింద రెండు సబార్డినేట్ కోర్టులు లేనపుడు ఏ హైకోర్టు అప్పిలేట్ అధికార పరిధిలోని కోర్టులో తొలి విచారణ ప్రారంభమైందో ఆ హైకోర్టు తగిన సూచనలను ఇస్తుంది.

స్థానిక ప్రభుత్వం నుంచి అధికారం పొందిన ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్, జిల్లా మెజిస్ట్రేట్, లేదా ఫస్ట్‌క్లాస్ మెజిస్ట్రేట్ తన విచారణా పరిధిలో ఉన్న ఒక వ్యక్తి ఆ పరిధిలో కాకుండా ( బ్రిటీష్ ఇండియాలోగానీ, బయటగాని) నేరాన్ని చేసినట్టు భావించినట్టయితే, ఆ విచారణా పరిధిలో ఆ నేరాన్ని విచారించలేకపోయినా, బ్రిటీష్ ఇండియాలో అమలులో ఉన్న ఏకైక చట్టం కింద ఆ స్థానిక పరిధిలోనే విచారించవచ్చు.

ఆ మెజిస్ట్రేట్‌నేర విచారణ జరిపి, అటువంటి వ్యక్తిని, విచారణాధికారం ఉన్న మెజిస్ట్రేట్ ముందు హాజరుకమ్మని పంపించవచ్చు.

## బ్రిటిష్ ఇండియా బయట జరిగిన నేరాలు

ఇంతవరకు బ్రిటిష్ ఇండియాలో జరిగిననేరాలగురించి తెలుసుకున్నాం. బ్రిటిష్ ఇండియాలోనే ఉన్న ఒక వ్యక్తి బ్రిటిష్ ఇండియా బయట నేరం చేస్తే ఏం చేయాలి?

రెండు పద్ధతులు అనుసరించాలి.

1. నేరం జరిగిన దేశానికి నేరస్తుడిని విచారణ కోసం పంపవచ్చు.

2. బ్రిటిష్ ఇండియాలోనే నేరస్తుడిని విచారించవచ్చు. మొదటిది నేరస్తుల పరస్పర మార్పిడికి సంబంధించినది (ఎక్స్‌ట్రాడిషన్) రెండోది ప్రాదేశిక పరిధికి అతీతమైన విచారణాధికారం.

1. నేరస్తుల మార్పిడి భారత్‌కు ఆవల-

a) స్వదేశీ సంస్థానం

b) విదేశం

c) చక్రవర్తి అధీన ప్రాంతం

**a) స్వదేశీ సంస్థానం**

సొంత రాష్ట్రానికి నేరస్తుల మార్పిడి ఇండియన్ ఎక్స్‌ట్రాడిషన్ చట్టం 1903 ప్రకారం సాగుతుంది.

* * *

పార్లమెంటు చట్టాలను, భారతీయ శాసనసభలు చేసిన శాసనాలు పరిశీలించిన మీదట సెక్యులర్ కోర్టుల పరిధిలో నేను ప్రపంచాన్ని ఈ క్రింది భౌగోళిక విభాగాలుగా విభజిస్తాను

1. భారత సామ్రాజ్య శాసన వ్యవస్థ రూపొందించిన చట్టాలు, సి. ఆర్. పి. సి. అనువర్తించే దేశం, భూమి ప్రాదేశిక విభాగాలు.

2. 41, 42 Vic. C73 చట్టాలు అనువర్తించే ప్రాదేశిక జలాలు.

3. 12 మరియు 13 Vic. C.2 వర్తించే సముద్రాలు (నౌకాదళ నేరాలు) పార్లమెంట్ ఆమోదించిన 23 మరియు 24 Vic. C88, 37 మరియు 38 చట్టాలు సముద్ర నేరాలకు వర్తిస్తాయి. అడ్మిరల్ విచారించే అన్ని నేరాలను విచారించే అధికారం సదరు చట్టాలు వలస దేశాల న్యాయస్థానాలకు ఇస్తున్నాయి. 23 మరియు 24 Vic. C88 సెక్షన్ I 12 మరియు 13 Vic. C96 ప్రకారం సదరు నేరాలకు భారత చట్టం ప్రకారం శిక్ష విధించవచ్చు.

19 బొంబాయి L.R.27

ఇండియా: జనరల్ క్లాజెస్ చట్టం X, 1897లోని సెక్షన్ 3(27) ప్రకారం ''ఇండియా అంటే బ్రిటీష్ ఇండియాతోపాటు రాజసంస్థానాలు చక్రవర్తి, గవర్నర్, గవర్నర్ జనరల్ ద్వారా అతని కింది అధికారుల ద్వారా పరిపాలితమయ్యే అధీన ప్రాంతాలు అన్నీ ఉంటాయి.''

బ్రిటీష్ ఇండియా: ''బ్రిటీష్ డొమినియన్ ప్రాంతాలతో సహా బ్రిటీష్ ఇండియా పరిధి క్రింద ఉంటాయి'' అని: సెక్షన్ 3(7) జనరల్ క్లాజెస్ చట్టం X, 1897 నిర్వచనం ఇచ్చింది.

బ్రిటీష్ ఇండియా = బ్రిటీష్ ఇండియా + మూడు మైళ్ళు

8 Bom. H.C.R. Cr.C.63

* * *

శిక్షాస్మృతి (I.P.C.) పరిధి క్రిందకు వచ్చే నేరస్తులు ఎవరు?

సెక్షన్ 3 ఐ.పి.సి.: భారత గవర్నర్ జనరల్ కౌన్సిల్ ఆమోదించిన చట్టం ప్రకారం భారతదేశంలో నేరం చేసిన ఏ వ్యక్తినైనా విచారించే అధికారం సదరు చట్టం అదే నేరం ఇతర ప్రాంతాల్లో (విదేశాల్లో) చేసినా ఈ హద్దులలోనే నేరం చేసినట్లుగా విచారణ జరిపే అధికారం ఇస్తున్నది.

సెక్షన్ 3 ఐ.పి.సి: ఈ కోడ్ నిబంధనలు నేరాలు చేసిన ఈ క్రింది వ్యక్తులకు కూడా వర్తిస్తాయి-

(1) బ్రిటీష్ ఇండియా లోపల, వెలుపల ఏ భారతీయ పౌరుడైనా,

(2) స్వదేశీ సంస్థానం, రాజు, లేదా ముఖ్యపాలకుడి అధీనంలో ఉండే ఇతర బ్రిటీష్ పౌరుడు

(3) బ్రిటిష్ పౌరుడు అయినా కాకపోయినా స్వదేశీ సంస్థానం, ముఖ్యాధికారి పాలనా ప్రాంతంలో ఉండే మహారాణి సేవకుడు.

వివరణ: బ్రిటిష్ ఇండియా పరిధిలో జరిగే చర్య ఈ కోడ్ కింద శిక్షార్హమైనపుడు, ఆ చర్య బ్రిటిష్ ఇండియా వెలుపల జరిగినా ఈ సెక్షన్‌లోని 'నేరం' అనే నిర్వచనం కిందికే వస్తుంది.

## సెక్షన్ 7(1)

సంస్థానంలో ఉండే రాజకీయ ప్రతినిధి జిల్లా మెజిస్ట్రేట్‌కు, లేదా ముఖ్య ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్‌కు వారంట్ పంపి నేరస్తుని లొంగిపొమ్మని ఆదేశించవచ్చు. అయితే నేరస్తుడు యూరోపియన్ బ్రిటిష్ సభ్యుడు కాకూడదు. నేరం కూడా ఇండియన్ ఎక్స్‌ట్రాడిషన్ చట్టం ఒకటో షెడ్యూల్‌లో వివరించినదై ఉండకూడదు.

## సెక్షన్ 10

సరైన సమాచారం ఫిర్యాదు ఉంటే బ్రిటిష్ ఇండియాలోని మెజిస్ట్రేట్లు అరెస్టు వారంట్లు జారీచేసి, నేరం జరిగిన పరిధిలోని ప్రభుత్వానికి నేరస్తుడిని అప్పగించవచ్చు.

గమనిక: ఎక్స్‌ట్రాడిషన్ గురించి ప్రత్యేక అంశాలు గానీ, ఇరుదేశాల మధ్య ప్రత్యేక హక్కుల విషయమై ఒప్పందాలుగానీ ఉంటే అందుకు ఈ చట్టం వర్తించదు.

## నేరస్తుల మార్పిడి చట్టం ప్రకారం మార్పిడి జరుగుతుంది

### బి) విదేశం - నేరం జరిగిన చోటు

ఇంగ్లీషు ఎక్స్‌ట్రాడిషన్ వర్తించే విదేశంలో నేరం జరిగితే ఆ విదేశంలో అభ్యర్థన మేరకు నేరస్తుడు లొంగిపోవచ్చు.

అయితే

(i) అది సక్రమమని భారత ప్రభుత్వం లేదా స్థానిక ప్రభుత్వం భావించాలి.

(ii) ఇండియన్ ఎక్స్‌ట్రాడిషన్ ఆక్ట్ తొలి షెడ్యూలులో పేర్కొన్న నేరం కావాలి.

(iii) నేరం రాజకీయపరమయింది కాకూడదు.

### సి) బ్రిటిష్ అధీన ప్రాంతాలు: నేరం జరిగిన చోటు

నేరస్తుల మార్పిడి వ్యవహారాలు పాక్షికంగా

(i) 1881లోని పారిపోయిన నేరస్తుల చట్టం (పార్లమెంటరీ చట్టం),

(ii) ఇండియన్ ఎక్స్‌ట్రాడిషన్ చట్టం కింద పరిశీలనకు వస్తాయి.

మొత్తం క్రిమినల్ విచారణా పరిధి స్థానికంగా ఉంటుంది. ఏ దేశంలో నేరం జరుగుతుందో ఆ దేశానికి నేర విచారణాధికారం ఉంటుంది.

**L.R.(1891) A.C.458**

నేరం-ఆయా ప్రాంత చట్టాలనుబట్టి స్థానికం అని నిర్ణయిస్తారు. నేరస్తుని జాతీయతనుబట్టి నిర్ణయించడానికి వీలులేదు.

**L.R.(1894) A.C.670**

బ్రిటిష్ హద్దులు బయటనే పూర్తిగా నేరాలకు పాల్పడిన విదేశీయుడిని విచారించే అధికారం బ్రిటిష్ ఇండియన్ కోర్టులకు లేదు. ఏ విదేశీ పౌరుడిని, బ్రిటిష్ ఇండియా బయట జరిగిన నేరాలకు బ్రిటిష్ ఇండియాలో విచారించడానికి వీలులేదు.

**28 All.372: 2 Bombay. L.R. 337:** స్వదేశీ సంస్థానంలో పౌరుడు అక్కడ దొంగతనం చేసి బ్రిటిష్ ఇండియాలో దొంగిలించిన సరుకుతో దొరికిపోతే, దొంగతనం విచారణ జరిపే అధికారం బ్రిటిష్ ఇండియా కోర్టుకు లేదు. దొంగిలించిన సరుకు తీసుకున్న నేరానికి విచారణ జరిపే అధికారం మాత్రం ఉంది. **10 Bombay, 186.**

దొరికిన = అంటే వ్యక్తిని కనుగొన్నచోట అని కాదు. అతను ఎక్కడ నిజంగా నివసిస్తున్నాడు? అతను స్వచ్ఛందంగా లొంగిపోయాడా, లేక అరెస్టుచేసి తీసుకువచ్చారా అని పరిశీలించాలి. **6 Bombay, 622.**

విదేశం నుంచి నిందితుడిని అక్రమంగా అరెస్టుచేసి బ్రిటిష్ ఇండియా తీసుకొచ్చారన్న నెపంపైన ఈ సెక్షన్ కింద విచారణ చెల్లకుండా పోదు. **13 Bombay L.R. 296**

## సెక్షన్ 106, 107

ప్రమాదకరమయిన కొట్లాటల గురించి సెక్షన్ 143, 149, 153-ఎ, 154 లేదా మానసిక దాడి, లేదా శాంతి భంగపరచే నేరాలు ఆ నేరాల ప్రోత్సాహం, లేదా నేరపూరిత బెదిరింపు తప్ప ఐ.పి.సి. ఎనిమిదో అధ్యాయం కింద శిక్షార్హమయిన నేరాలు చేసిన నిందితులకు శిక్షపడితే, వారు శాంతియుతంగా ఉంటామని బాండురాసి ఇవ్వాలని కోర్టు భావిస్తే, శిక్ష విధించే సమయంలో ఆ కోర్టు అతని ఆదాయాలకు అనుగుణంగా జమానత్‌తోగానీ, లేకుండా గానీ, మూడేళ్లకు మించకుండా శాంతియుతంగా వ్యవహరిస్తానని ఒక బాండ్ రాసి ఇవ్వాలని ఆదేశించవచ్చు.

2. విధించిన శిక్షను అప్పీలులో ఇతరత్రా త్రోసిపుచ్చినట్టయితే, జమానత్ చెల్లదు.

3. రివిజన్‌లో హైకోర్టు మళ్లీ జమానత్ కోరవచ్చు. నోట్స్: శాంతి భంగపరిచే నేరాల్లో...

రెండు అన్వయాలు:

1. శాంతిని భంగపరిచే లక్షణం అత్యవసరంగా ఉన్న నేరాలను మాత్రమే ఈ పదాలు సూచిస్తాయి. శాంతికి భంగకరం కాబోయే నేరాలు కావు.

**30 Cal. 366, 47 Mad 846 (848)**

2. శాంతికి భంగకరంగా పరిణమించబోయే నేరాలు కూడా ఈ పదాలలో ఇమిడి ఉన్నాయి.

ఇది బొంబాయి, అలహాబాద్ హైకోర్టుల అభిప్రాయం. ఐ.పి.సి. 504 సెక్షన్ కింద (శాంతి భగ్నం కలిగించాలన్న ఉద్దేశంతో అవమానించడం) సెక్షన్ 448 కింద (కీలకమయిన చిహ్నాన్ని తొలగించడం) నేరాల్లో కూడా జమానత్ బాండ్ తీసుకోవడం మంచిదే.

## సెక్షన్ 107

ఏ వ్యక్తి అయినా శాంతిని భంగపరచబోతున్నాడనీ, లేదా ప్రజల ప్రశాంతతను దెబ్బతీస్తున్నాడని,

లేదా అందుకు దారితీసే తప్పుడు పనులు చేయబోతున్నాడని క్రిమినల్ కోర్టుకు సమాచారం లభిస్తే మెజిస్ట్రేట్, అందుకు నమ్మదగిన కారణం ఉందని భావిస్తే, ఆ వ్యక్తి నుంచి ఏడాదిపాటు శాంతియుతంగా ఉంటానని బాండ్ రాసివ్వాలని ఎందుకు కోరకూడదో చెప్పాలని అడగవచ్చు.

నోట్:

1. సమాచారం లభిస్తే: అందిన సమాచారం నమ్మతగినదై ఉండాలి. ప్రయివేట్ వ్యక్తి ప్రమాణం లేకుండా ఇచ్చిన సమాచారం ఆధారంగా మాత్రమే మెజిస్ట్రేట్ ఈ సెక్షన్ కింద నమన్లు జారీచేయడానికి వీలులేదు. సమాచారం స్పష్టంగా, నిర్దిష్టంగా ఉండి ఆ వ్యక్తిని సూచించేదై ఉండాలి. వివరాలు కూడా కచ్చితంగా ఉంటే ఆ వ్యక్తికి వచ్చి కలవమని నోటీసు ఇవ్వాడానికి వీలవుతుంది.

6 All. 20

2. శాంతికి భంగం కలిగించే ఆ చర్య వెంటనే జరిగేట్లు ఉండాలి. ఎప్పుడో మునుముందు జరగబోయేదయితే కుదరదు. సమ్మాచారం ఇచ్చిన సమయానికి ఆ నేరం జరిపే ఆలోచన సాగుతుండాలి.

3. శాంతికి భగ్నం చేసే ఆ చర్యలు తప్పుడువై ఉండాలి.

చట్టపరమయిన హక్కుల కోసం సాగే చర్యలను ఈ సెక్షన్ కింద తప్పుడు చర్యలుగా భావించరాదు. కొందరు వ్యక్తులు వ్యతిరేకించడం వల్లనే చట్టపరమయిన చర్యలు చట్టవ్యతిరేక చర్యలు కాబోవు.

తప్పుడు చర్యలు అంటే క్రిమినల్ చట్టం ప్రకారం నిషేధించిన, శిక్షార్హమని, తప్పుడు చర్య అని ప్రకటించిన చర్యలు, కేవలం అనుచితమయిన చర్యలు అని కాదు.

ఉదాహరణ: గోవధ

బహిరంగంగా వీథుల్లో పెద్దగా పాటలు పాడడం మసీదులో ప్రార్థనలు జరుగుతుంటే ఆమీన్ అని అరవడం.

సెక్షన్ 108 - ప్రమాదకరమయిన ప్రచారాల గురించి ఏ వ్యక్తి అయినా, ఆ పరిధిలో గానీ బయటగానీ, మౌఖికంగా గానీ, వ్రాతపూర్వకంగా గానీ, ఏ ఇతర మార్గం ద్వారా గానీ, కావాలని ఈ క్రింది అంశాలు ప్రచారం చేయడం, అందుకు ప్రయత్నించడం, ఆ ప్రచారాన్ని ప్రోత్సహించడం.

a) 174-A-IPC కింద శిక్షార్హమయిన రాజద్రోహ సమాచారం.

b) సెక్షన్ 153-ఎ కింద శిక్షించతగిన సమాచార ప్రచురణ

c) ఐ.పి.సి. కింద పరువునష్టం, లేదా బెదిరింపుగా పరిగణించబడే విషయాన్ని ఒక జడ్జి గురించి ప్రచురించడం.

సరైన కారణం ఉందని భావిస్తే మెజిస్ట్రేట్, ఆ వ్యక్తి నుంచి ఏడాదికి మించకుండా శాంతి రక్షణకుగాను జమానత్‌తో కానీ, లేకుండా గానీ, పూచీకత్తు బాండ్ ఎందుకు రాసివ్వకూడదు అని అడగవచ్చు.

## నోట్:

1. ఏ ఇతర మార్గం ద్వారానైనా: ఉదా: గ్రాంఫోన్ రికార్డులు

2. ఉద్దేశపూర్వకంగా (కావాలని) అన్న పదాలు, అమాయకంగా తెలియకుండా ఒక పరికరంగా వ్యవహరించిన (ఉదా: వార్తా పత్రికలు పంచే పిల్లలు) వారిని మినహాయిస్తారు.

3. రాయడం కాదు ఆ సమాచారం వ్యాపింపచేయడం అవసరం. ఒక పత్రిక ద్వారా సమాచారాన్ని వ్యాపింపజేస్తే, ఎడిటర్, ప్రొప్రయిటర్, ప్రింటర్, పబ్లిషర్‌లపైన స్థానిక ప్రభుత్వ అనుమతి ఉంటే తప్ప చర్య తీసుకునే వీలులేదు.

సెక్షన్లు 109, 110 ప్రమాదకరమయిన వ్యక్తుల గురించి

సెక్షన్ 109 ఈ క్రింది వ్యక్తులకు వర్తిస్తుంది:

ఎ) ఒకే మేజిస్ట్రేట్ పరిధిలో తన ఉనికిని దాచుకోవడానికి ప్రయత్నించే వ్యక్తి, ఆ వ్యక్తి కేవలం ఒక నేరానికి పాల్పడేందుకు మాత్రమే అటువంటి జాగ్రత్తలు తీసుకుంటున్నాడని నమ్మే కారణం ఉంటే.

బి) చెప్పుకోదగ్గ ఆదాయ వనరులు లేని వ్యక్తి తగిన విధంగా వివరణ ఇవ్వలేకపోవడం. ఈ కింది కేసులలో ఏడాది కోసం బాండ్ కోరవచ్చు.

1. నేరం చేసేందుకు తనను దాచుకునే యత్నం చేయడం.

2. చెప్పుకోదగిన ఆదాయవనరులున్న వ్యక్తి చేతిలో పైసా లేకుండా ఉండడం, లేదా పని లేకుండా ఉండడం అంటే పైకి కనిపించే ఆదాయ వనరులు లేవని అర్థం కాదు.

53 Cal. 347 Victor Vs Emp.

సెక్షన్ 110 నిత్య నేరస్తులు (Habitual Offender) గురించి

1) దోపిడీ, ఇంటికి కన్నం వేయడం, దొంగతనం, ఫోర్జరీ అలవాటైన వ్యక్తులు.

2) తెలిసి తెలిసి దొంగిలించిన సరుకులు తీసుకోవడం అలవాటైన వ్యక్తులు.

3) దొంగలను కాపాడడం, పోషించడం, దొంగిలించిన సరుకులు దాచి పెట్టడం అలవాటయిన వ్యక్తులు.

4) .......

నిత్య నేరస్తుల నుంచి మూడేళ్ళ బాండ్ తీసుకోవచ్చు.

## సెక్షన్ 121

అటువంటి వ్యక్తులు శాంతిని రక్షించేందుకు, సత్ప్రవర్తన కలిగి వుండేందుకు వత్తిడి చేసే పద్ధతుల్లో కొంతకాలం వరకు శాంతి రక్షణ, సత్ప్రవర్తనకు జమానత్ స్వీకరించడం ఒకటి.

శాంతి భద్రత జమానత్‌కు, సత్ప్రవర్తన జమానత్‌కు తేడా

1. శాంతి రక్షణకు ఇచ్చిన జమానత్ నేరానికి పాల్పడగానే రద్దు కాదు. శాంతిని భగ్నం చేయగల పరిణామాలకు దారితీసే నేరాలకు పాల్పడితేనే ఆ జమానత్ రద్దవుతుంది.

2. కారాగారవాసం శిక్షించే ఏ నేరానికైనా పాల్పడితే సత్ప్రవర్తన జమానత్ రద్దవుతుంది.

జమానత్ ఉల్లంఘిస్తే ఏం జరుగుతుంది?

నేరం జరిపి జమానత్ రద్దయితే, ఆ జమానత్ సొమ్ము అతని నుంచి వసూలు చేయవచ్చు. కాని వెంటనే అతడిని జమానత్‌లో మిగిలిన కాలానికి నిర్బంధించడానికి వీలు లేదు. ఈ అధ్యాయం కింద మెజిస్ట్రేట్ తాజాగా చర్యలు తీసుకోవలసి ఉంది.

జమానత్ ఉల్లంఘించాడన్న ఆరోపణకు గురయిన వ్యక్తికి ఆ ఆరోపణపై సాక్షిని ఎదురు ప్రశ్నించే (క్రాస్ ఎగ్జామిన్) అవకాశం ఇవ్వకుండా జమానత్ రద్దు చేయడానికి వీలులేదు.

జమానత్ వ్యక్తిగత పూచీకత్తు-ధరావత్తుతోగానీ లేకుండాగానీ ఉండవచ్చు. పూచీకత్తుగా ఒక వర్గం వారిని వర్గీకరించే అధికారం మెజిస్ట్రేట్‌కు ఉంది.

ఉదాహరణ: భూస్వాములు వగైరా

## (1) విదేశము - నేరం జరిగిన ప్రదేశం

ఇంగ్లీష్ ఎక్స్ట్రడిషన్ వర్తించే ఏ దేశంలోనైనా నేరం జరిగినప్పుడు సదరు నేరస్తుడిని ఆ దేశంలో నిర్బంధించడానికి అభ్యర్థన చేయవచ్చు. అయితే-

(1) భారత ప్రభుత్వం లేదా స్థానిక ప్రభుత్వం ఆ చర్య సరైందని భావించినప్పుడు

(2) ఇండియన్ ఎక్స్ట్రడిషన్ చట్టం ఒకటవ షెడ్యూల్‌లో పేర్కొన్న నేరం అయితే.

## సెక్షన్ 122

మెజిస్ట్రేట్ ఇవ్వబోయే ధరావతును లేదా ఇంతకుముందు ఇచ్చిన ధరావతును తిరస్కరించవచ్చు. బాండ్‌ను గురించి ధరావతు ఇచ్చే వ్యక్తి దానికి తగిన వాడు కాదు అన్న కారణంతో మెజిస్ట్రేట్ తిరస్కరించవచ్చు.

తగిన అర్హత ఉందా లేదా నిర్ణయించటానికి ముందు ఆ వ్యక్తి గురించి దర్యాప్తు చెయ్యాలి.

అర్హత పరీక్ష ధరావతును ఇచ్చే వ్యక్తికి సదరు నేరస్తునిపై తగిన నియంత్రణ ఉందా. కేవలం ధనపరమైన అర్హత సరిపోదు. ధరావతును చెల్లించామనడంలో ఉద్దేశం ప్రభుత్వానికి సదరు బాండ్ ఉల్లంఘన జరగటం వల్ల ఆదాయం కోరటం కాదు; బాండ్‌కు బద్ధుడైన వ్యక్తి సత్ప్రవర్తనను అమలు చేయటం అసలు ఉద్దేశం.

ధరావతు ఇచ్చిన వ్యక్తి దూరప్రదేశంలో ఉంటే ధరావతు అనర్హం.

బొంబాయి హైకోర్టు ప్రకారం పూచీదారులు ఆర్థికంగా స్తోమత కలిగి గౌరవనీయ వ్యక్తులు అయి ఉంటే చాలు. నిందితుడిని అదుపు చేసే సామర్థ్యం కలిగి ఉండాలని కోరనవసరం లేదు.

22, Bombay L.R. 190

సెక్షన్ 126 బాండ్‌ను రద్దు చేయమని ధరావతు ఇచ్చిన వ్యక్తి ఎప్పుడైనా కోరవచ్చు.

## ధరావతుదారుని బాధ్యత

ధరావతు ఎవరి తరఫునైతే ఇస్తాడో ఆ వ్యక్తి శిక్షకు గురైనప్పుడు అతడు జమానత్‌ను ఉల్లంఘించినపుడు ధరావతుదారు బాధ్యత తలెత్తుంది.

సత్‌ప్రవర్తన, శాంతిని భగ్నం చేయటం అనేవి చాలా సాధారణ పదాలు అనేక నేరాలు వాటి పరిధి క్రిందకు వస్తాయి. అలా ఉండటం వల్ల వ్యక్తి చేసిన ప్రతి నేరానికి ధరావతుదారుడిని బాధ్యుని చేయటం న్యాయం కాదు.

పరిస్థితులు సూచించిన సత్‌ప్రవర్తనకే సదరు బాధ్యతను పరిమితం చేయడం మంచిది.

## పద్ధతి

### సెక్షన్ 112

ఏ వ్యక్తిని అయినా కారణం చూపించమని ఈ సెక్షన్ క్రింద ఆదేశించటానికి, మెజిస్ట్రేట్ లిఖితపూర్వకంగా, సమాచార సారాంశాన్ని ఆధారం చేసుకుని, ఉత్తరువు జారీ చేస్తారు బాండ్ క్రింద ఎంత మొత్తం చెల్లించాలి; ఎంత కాలానికి బాండ్ అమల్లో ఉంటుంది; ఎంతమంది వ్యక్తులు ఏ వర్గానికి చెందినవారు ధరావతు చెల్లించాలి అని నిర్దేశిస్తారు.

### సెక్షన్ 113

వ్యక్తి కోర్టులో హాజరై ఉంటే అతని సమక్షంలో చదివి వినిపిస్తారు. అతను కోరినట్లైతే సారాంశాన్ని అతనికి వివరిస్తారు.

### సెక్షన్ 114

అతడు హాజరుకాని పక్షంలో సమన్లను జారీ చేయటం జరుగుతుంది.

తక్షణమే శాంతికి భంగం కలుగుతుంది అనుకుంటే వారెంట్‌ను జారీ చేస్తారు.

### సెక్షన్ 115

ఉత్తరువు ప్రతిని సమన్లతో పాటు జారీచెయ్యాలి.

### సెక్షన్ 116

వ్యక్తిగత హాజరీని మినహాయించే అధికారం

### సెక్షన్ 117

సమాచారం సరైనదేనా అని దర్యాప్తు చేయటం. వ్యక్తి హాజరైనప్పుడు అతడు ఇచ్చిన సమాచారం సరైనదేనా విచారణ చెయ్యాలి. ఆ సమాచారం ఆధారంగానే మెజిస్ట్రేట్ చర్యలు తీసుకుంటారు కాబట్టి.

అటు తర్వాత సాక్ష్యాన్ని అవసరమైనప్పుడు తీసుకోటానికి తగిన చర్యలు తీసుకొంటారు.

సెక్షన్ 117 క్రింద చర్య తీసుకున్నట్లైతే సమన్ల కేసులో అనుసరించే పద్ధతినే అనుసరించటం జరుగుతుంది.

సెక్షన్లు 108, 109, 110 క్రింద చర్యలు తీసుకున్నట్లైతే, ఆరోపణలను పేర్కొనే అవసరం లేకుండానే వారెంట్‌ను జారీ చేయవచ్చు. దర్యాప్తును పక్కనపెట్టి అవసరమనుకున్నప్పుడు మెజిస్ట్రేట్ తక్షణ చర్యలను తీసుకోవచ్చు; అయితే దానికిగల కారణాలను పేర్కొనాలి. ఆ వ్యక్తిని సత్ప్రవర్తనకుగాను బాండ్‌పై సంతకం చేయమని ఆదేశించవచ్చు. ఇది విచారణ పూర్తి అయ్యేంతవరకు ఉంటుంది.

## సెక్షన్ 118

అటువంటి విచారణ అనంతరం బాండ్ అవసరం అని రుజువు అయితే ఆ మేరకు ఉత్తరువును మెజిస్ట్రేట్ జారీ చేస్తారు.

అయితే-

(1) సదరు ఉత్తరువు ఆ వ్యక్తికి జారీచేసిన దానికంటే భిన్నంగా ఉండకూడదు.

(2) ప్రతి బాండ్‌కు సంబంధించిన మొత్తం అధికంగా ఉండకూడదు.

(3) ఆ వ్యక్తి మైనర్ అయినట్లయితే బాండ్‌పై పూచీకత్తు ఇచ్చే వ్యక్తులు సంతకం చేయాలి.

## సెక్షన్ 119

శాంతియుత పరిస్థితులను కొనసాగించటానికి లేదా సత్ప్రవర్తనకు బాండ్ అవసరం లేదని రుజువైతే మెజిస్ట్రేట్ భావించినట్లైతే దానికి అనుగుణంగా తన వ్యాఖ్యను నమోదుచేసి అతడు నిర్బంధంలో ఉంటే విడుదల చేయవచ్చు. నిర్బంధంలో లేకపోతే వదిలివేయవచ్చు.

## చర్యలకు గురయిన వ్యక్తి నిందితుడేనా?

ఈ ప్రశ్నకు సంబంధించి భిన్నాభిప్రాయాలున్నాయి. కొన్ని వివాదాల్లో అతడే నిందితుడని భావించటం జరిగింది. మిగతా వివాదాల్లో అతడు నిందితుడు కాదని భావించడం జరిగింది. బొంబాయి ఎల్.ఆర్ 27

ఇందుకు సంబంధించిన సెక్షన్లు స్పష్టంగా ఉన్నాయి.

వ్యక్తి, అటువంటి వ్యక్తులు, మొదలైన పదాలను ఉద్దేశపూర్వకంగా ఉపయోగిస్తూ, నిందితుడు అన్న పదాన్ని చాలా జాగ్రత్తగా మినహాయించడం వల్ల ఫిర్యాదుకు గురైన వ్యక్తి, కారణం చూపమని అడగబడిన వ్యక్తి అని అర్థం.

అలా జరిగితే అతని చేత ప్రమాణం చేయించి అతడిని పరిశీలించటం, ఎదురు ప్రశ్నించటం జరుగుతుంది.

## సెక్షన్ 120

కారాగారశిక్షను అనుభవిస్తూంటే పూచీకత్తు కాలము అతడి శిక్ష పూర్తి అయిన తర్వాత నుంచి ప్రారంభమవుతుంది. మిగతా వివాదాల్లో తగిన కారణం వల్ల మెజిస్ట్రేట్ వేరే తేదీని నిర్ణయిస్తే తప్ప ఉత్తరువు జారీ చేసినప్పటి నుంచి అమల్లోకి వస్తుంది.

## సెక్షన్ 123

పూచీకత్తు ఇవ్వటంలో విఫలం అయితే, అప్పటికే అతడు జైల్లో ఉంటే, ఆ కాల పరిమితి అయిపోయేంత వరకూ లేదా పూచీకత్తు లభించేంతవరకూ అతడిని జైల్లోనే ఉంచటానికి మెజిస్ట్రేట్ ఉత్తరువు జారీ చేస్తారు.

(2) ఒక సంవత్సరానికి మించి పూచీకత్తు కాలం దాటిపోతే సదరు పూచీకత్తు లభ్యం కాకపోతే సెషన్స్ జడ్జి లేదా హైకోర్టుకి ఈ వివాదం వెడుతుంది కాబట్టి సదరు న్యాయస్థానం నిర్ణయం వెలువడేంతవరకూ మెజిస్ట్రేట్ ఆ వ్యక్తిని నిర్బంధంలో ఉంచాలని ఆదేశించవచ్చు.

మూడు సంవత్సరాలకు మించిన కారాగారశిక్ష విధించే ఉత్తర్వు మినహాయించి సెషన్స్ జడ్జ్/హైకోర్ట్ ఏ ఉత్తరువును అయినా జారీచేయవచ్చు.

(3) ఒక వ్యక్తికి సంబంధించినకేసు పరిశీలనలో ఉన్నపుడు, ఇద్దరు/ముగ్గురు ఉన్న ఈకేసులను కూడా సంయుక్తంగా విచారణ చేయవచ్చు. అయితే వారి కాలాన్ని హెచ్చించరాదు.

### కారాగారం

శాంతిని కాపాడటానికి పూచీకత్తు ఇవ్వటంలో విఫలం అయితే సాధారణ కారాగారశిక్ష

సెక్షన్లు 108 మరియు 109 క్రింద సత్ప్రవర్తన వైఫల్యానికి సాధారణశిక్ష. సెక్షన్ 110 క్రింద కఠినశిక్ష.

## సెక్షన్ 124

1. ఏ వ్యక్తి అయినా పూచీకత్తు ఇవ్వటంలో విఫలం అయితే తగిన కారణం ఉంటే ప్రజా శాంతికి భంగం కలిగించరాదని హెచ్చరిస్తూ డి.ఎం. లేదా చీఫ్ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ అతడిని విడుదల చేయవచ్చు.

2. పూచీకత్తు అవసరమైనప్పుడు పూచీకత్తు మొత్తాన్ని లేదా పూచీకత్తుల సంఖ్యను లేదా వాటి కాలాన్ని డి.ఎం. లేదా చీఫ్ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ తగ్గించవచ్చు.

3. షరతులతో లేదా బేషరతుగా వ్యక్తిని విడుదల చేయవచ్చు. కాలపరిమితి అయిన వెంటనే షరతులు కూడా రద్దవుతాయి.

షరతును పూర్తి చేయకపోతే విడుదల ఉత్తరువును రద్దు చేయవచ్చు.

షరతులతో కూడిన విడుదల ఉత్తరువును రద్దు చేసినపుడు ఏ పోలీసు అధికారి కానీ అతడిని వారెంట్ లేకుండా నిర్బంధంలోకి తీసుకుని డి.ఎం లేదా చీఫ్ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ ముందు హాజరుపరచవచ్చు.

ప్రారంభ ఉత్తరువు ప్రకారం పూచీకత్తు ఇవ్వకపోతే డి.ఎం/ చీఫ్ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ మిగిలిన కాలానికి అతడిని నిర్బంధంలో ఉంచవచ్చు.

అటు తర్వాత ప్రారంభ ఉత్తరువు షరతుల ప్రకారం అతడిని విడుదల చేయవచ్చు.

కొన్ని నియమాలను అమలుపరచటంలో అనుసరించే పద్ధతి క్రియలు (పుట ఖాళీ)

## ఫ్యూజిటివ్ అఫెండర్స్ చట్టం, 1881

## సెక్షన్ 9

ఒక డొమినియన్ నుంచి మరోచోటికి పారిపోయిన నేరస్తుడి నేరాలకు, లొంగుబాటుకు సంబంధించిన అంశాలను చెబుతున్నది

ఇండియన్ ఎక్స్‌ట్రాడిషన్ చట్టం - సెక్షన్ 19 (d)

ఈ సెక్షన్ కూడా డొమినియన్ నేరస్తుల లొంగుబాటును వివరిస్తున్నది.

ప్రాదేశిక పరిధికి సంబంధించిన '

అతడిని స్వదేశానికి తీసుకురాకుండా వెలుపల జరిగిన నేరానికి అతనిపై బ్రిటీష్ ఇండియాలో విచారణ జరపవచ్చా?

## సెక్షన్ 188

దీనికి సమాధానం 'అవును' అయితే-

1. అతను స్వదేశీ వ్యక్తి అయి వుండాలి.

2. బ్రిటిష్ పౌరుడై ఉండి స్వదేశీ సంస్థానాల్లో లేదా బ్రిటిష్ ఇండియాలో నేరం చేసినట్లైతే

3. అతడు బ్రిటిష్ ప్రభుత్వ ఉద్యోగి ( బ్రిటిష్‌పౌరుడు అయినా కాకపోయినా) బ్రిటిష్‌ఇండియా స్వదేశీ సంస్థాన ప్రాంతంలో నేరం చేసినట్లైతే

4. బ్రిటిష్ ఇండియా అటువంటి నేరస్తుడు దొరికితే

గమనిక: సెక్షన్ 188 విదేశాల్లో జరిగిన నేరాలకు విచారణ చేయటానికి అధికారం ఇస్తుంది. అయితే సముద్ర నౌకలు ఈ పరిధిలోకి 'రావు. 19 బొంబాయి ఎల్.ఆర్. 527



అయితే దేనిని పరిగణనలోకి తీసుకోవాలి?

న్యాయస్థానం నేరాన్ని మాత్రమే పరిగణనలోకి తీసుకొంటుంది కానీ ఒక వ్యక్తి నేరం చేశాడన్న ఆరోపణను కాదు.

**కారణాలు:**

(1) ఒక నేరస్తునికి సంబంధించిన విచారణ జరుగుతుండగా తనుకాక ఇతరులు సదరు నేరంలో పాల్గొన్నారు అని భావించినట్లైతే న్యాయస్థానం వారిని కూడా గుర్తించి, వారికి వ్యతిరేకంగా విచారణ ప్రక్రియను నూతనంగా ప్రారంభిస్తుంది.

(2) నేరస్తుడు పూర్తిగా అపరిచితుడు అయినప్పటికీ న్యాయస్థానం నేరాన్ని పరిగణనలోకి తీసుకుని దర్యాప్తు ప్రక్రియను ప్రారంభించి సరైన ఆధారాలు లభ్యం అయితే విచారణను మొదలుపెడుతుంది.

(3) తనంతట తాను గుర్తించని నేర విచారణ ఇతర న్యాయస్థానం నుంచి తనకు బదిలీ అయినట్లైతే సాక్ష్యానికి సంబంధించిన ఏ దశలోనైనా, వారందరికీ ఆయన నోటీసు జారీచేయవచ్చు.

## గుర్తింపులో పరిమితులు

I సెక్షన్ 337 - అప్రూవర్

III క్రిమినల్ న్యాయస్థానాల అధికారాలు.

వీటిని మూడు రకాలుగా పరిశీలించవచ్చు:-

1. ఒక నేరాన్ని గుర్తించటానికి అధికారం.

2. నేరానికి సంబంధించిన విషయంలో ఉత్తర్వును జారీచేసే అధికారం.

3. శిక్షించే అధికారం

(1) నేరాన్ని గుర్తించే అధికారం.

ఒక నేరాన్ని న్యాయస్థానం గుర్తిస్తుందా లేదా అని ఈ క్రింది అంశాలపై ఆధారపడి ఉంటుంది.

1. న్యాయస్థానం హోదా

2. నేరస్తుని జాతీయత

3. ఒక జడ్జ్/మెజిస్ట్రేట్ నుంచి నేరస్తునికి న్యాయం లభిస్తుందా అనే అంశంపై ఆధారప ఉంటుంది.

## (1) న్యాయస్థానం హోదా

### సెక్షన్ - 6

బ్రిటిష్ ఇండియాలో క్రిమినల్ కోడ్ ప్రక్రియ ప్రకారం ఐదు రకాల హోదాలతో కూడి న్యాయస్థానాలున్నాయి:-

1. సెషన్స్ కోర్ట్
2. ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్
3. మొదటి తరగతి మెజిస్ట్రేట్
4. రెండవ తరగతి మెజిస్ట్రేట్
5. మూడవ తరగతి మెజిస్ట్రేట్

వీటికి హైకోర్ట్‌ను కూడా కలపాలి.

(1) (ఐ.పి.సి.) పీనల్ కోడ్ క్రింద వచ్చే నేరాలు

**సెక్షన్ - 28**

1. ఇండియన్ పీనల్ కోడ్ క్రింద ఏ నేరాన్నైనా హైకోర్ట్ విచారించవచ్చు.

2. ఐ.పి.సి. క్రింద న్యాయస్థానం ఏ నేరాన్నైనా విచారించవచ్చు.

3. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని ఎనిమిదవ షెడ్యూల్‌లోని ఎనిమిదవ కాలంలో పేర్కొన్న నేరాలను మాత్రమే తమకున్న అధికార పరిధి లోపల ఇతర మెజిస్ట్రేట్స్ విచారణ చేయవచ్చు.

**సెక్షన్ - 29**

(ii) ఇతర చట్టాల కింద నేరాలకు సంబంధించి-

1. చట్టం ఒక న్యాయస్థానాన్ని పేర్కొన్నట్లైతే ఇతర న్యాయస్థానాలకు సదరు నేరాన్ని పరిగణనలోకి తీసుకునే అధికారం లేదు.

2. చట్టం ఒక న్యాయస్థానాన్ని పేర్కొన్నప్పుడు

(1) దానిని హైకోర్టు విచారణ చేయవచ్చు, లేదా

(2) ఐ.పి.సి రెండవ షెడ్యూల్‌లోని 8వ కాలంలో పేర్కొన్న న్యాయస్థానం ''ఇతర చట్టాల ఉల్లంఘన నేరాలు'' అనే శీర్షిక క్రింద విచారణ ప్రారంభించవచ్చు.

**సెక్షన్ - 29A**

(బి) నేరస్తుని జాతీయత

అతి చిన్న నేరానికి తప్పు అంటే రూ.50 జరిమానా విధించగల నేరాలను తప్ప రెండవ లేదా మూడవ తరగతి మెజిస్ట్రేట్ యూరోపియన్ బ్రిటీష్‌పౌరుడిని ఇతర నేరాలకు విచారణ చేసే అధికారం లేదు.

చేసిన నేరం కారాగారం ద్వారా శిక్షించడానికి తగినది కానప్పుడు లేదా జరిమానా విధించాల్సి వచ్చినప్పుడు సదరు జరిమానా రూ.50 మించినపుడు మాత్రమే సదరు నేరస్తుడిని 2వ లేదా మూడవ తరగతి మెజిస్ట్రేట్ విచారణ చేయవచ్చు.

అయితే నేరానికి కారాగారశిక్ష లేదా రూ.50కి మించి జరిమానా విధించవలసినది అయితే పై మెజిస్ట్రేట్ విచారణ జరిపే అవకాశం లేదు.

గమనిక: యూరోపియన్ జాతీయుడు తన విశేష అధికారాన్ని ఉపయోగించుకున్నట్లైతే ''చట్టబద్ధమైనది, చట్టవిరుద్ధమైనది'' అనే నియమాన్ని ఆధారంగా, సదరు విచారణను నిర్వహించటం సాధ్యంకాదు.

1923 ముందు నిర్వచనం ఈవిధంగా ఉన్నది:-

యూరోపియన్ బ్రిటీష్ ప్రజలు అంటే

(1) చక్రవర్తి సామ్రాజ్యంలో జన్మించిన వారు లేదా యు.కె.లో కానీ యూరప్‌లో కానీ స్థిర నివాసం ఏర్పరచుకున్నవారు. అలాగే అమెరికన్, ఆస్ట్రేలియన్, న్యూజిలాండ్, గుడ్‌హోప్ కాలనీ లేదా నాటాల్‌లో ఉంటున్నవారు.

(2) అటువంటి వ్యక్తి చట్టబద్ధ సంతతి లేదా మనవడు/ మనవరాలు

స్థిర నివాసం అంటే ఎక్కడ వ్యక్తికి గృహం ఉండి, అక్కడికి అతడు తిరిగి రావటం.

స్థిరనివాసం మూడు విధాలుగా ఉంటుంది:-

(1) జన్మ రీత్యా

(2) ఎంపిక ద్వారా

(3) చట్టపరంగా; ఉదా: భార్య తన భర్త ద్వారా స్థిరనివాసం సంపాదించటం.

## సెక్షన్ 195

న్యాయపాలనకు సంబంధించిన నేరాలకు ఈ సెక్షన్ వర్తిస్తుంది.

## సాధారణ నియమం

తన అధికారాన్ని న్యాయస్థానంలో మెజిస్ట్రేట్ కోర్టు ధిక్కారణ నేరం క్రింద ఒక వ్యక్తిని శిక్షించలేడు. దానికిగాను సదరు వివాదాన్ని మరో మెజిస్ట్రేట్ విచారణ చేయవలసి ఉంటుంది. ఏ న్యాయస్థానంలో నేరం జరిగిందో ఏ న్యాయస్థానం సెక్షన్ 476 కింద ప్రాథమిక విచారణ జరిపిందో ఆ న్యాయస్థానం సదరు కేసును విచారణ చేయరాదు.

## సెక్షన్ 480

న్యాయస్థానం ఉద్దేశంలో ఒక నేరం జరిగితే దానిని ఆ న్యాయస్థానం ఎప్పుడు విచారణ చేస్తుందంటే ఆ నేరం-

175 (ప్రభుత్వోద్యోగికి లభ్యం చేయవలసిన పత్రాన్ని దఖలు చేయటానికి ఒక వ్యక్తి నిరాకరించినప్పుడు)

178 (ప్రమాణం చేయటానికి లేదా రూఢీకరించడానికి నిరాకరించినప్పుడు)

179 (ప్రభుత్వోద్యోగి అధికారం కలిగి ప్రశ్నించినప్పుడు దానికి సమాధానం చెప్పటానికి నిరాకరించినప్పుడు)

180 (ఒక స్టేట్‌మెంట్‌పై సంతకం చేయటానికి నిరాకరించినప్పుడు)

228 (న్యాయవిచారణ సందర్భంలో ఉద్దేశపూర్వకంగా ఒక ప్రభుత్వోద్యోగిని అవమానపరచటం లేదా న్యాయస్థాన కార్యకలాపాలను అడ్డుకొన్నప్పుడు)

## సెక్షన్ 485

సాక్షి సమాధానం చెప్పటానికి లేక డాక్యుమెంటు సమర్పించడానికి నిరాకరించినప్పుడు అతనికి ఏడు రోజుల శిక్ష.

ఇంతకుముందు యూరోపియన్ బ్రిటీష్ ప్రజలు అనుభవించిన ప్రత్యేక హక్కు ఇప్పుడు వారికి లభ్యమైనవి గురించి సంక్షిప్తంగా తెలుసుకోవాలంటే ఉడ్‌రాఫ్ క్రిమినల్ ప్రొసీజర్ (1926) పుటలు 516-519 చూడండి.

సెక్షన్ 4 (1) యూరోపియన్ బ్రిటీష్ ప్రజలు అంటే

(1) చక్రవర్తి సామ్రాజ్యంలో ఏ వ్యక్తి అయినా యూరోపియన్ అనువంశిక క్రమంలో జన్మించినట్లైతే లేదా బ్రిటిష్ దీవుల్లో కానీ వలసల్లో కానీ స్థిరనివాసం ఏర్పరచుకున్న వ్యక్తి

(2) బ్రిటిష్ సామ్రాజ్య చక్రవర్తి భూభాగంలోని వ్యక్తి తాలూకు చట్టబద్ధమైన మనవడు/ మనవరాలు

**క్లాజ్ 1 ముఖ్యాంశాలు**

1. యూరోపియన్ అనువంశికత
2. పురుష అనువంశికత
3. జన్మ

సహజ స్థిర నివాసంలో జన్మించడం.

బ్రిటిష్ దీవుల్లో కానీ వలస ప్రాంతాల్లో కానీ జన్మించడం.

క్లాజ్ 2 ముఖ్యాంశాలు

ఒక వ్యక్తి తను జన్మతః సహజీకృతంగా లేదా స్థిరనివాస పరంగా ఉండకపోవచ్చు. అయితే అటువంటి ప్రత్యేక హక్కు - యూరోపియన్ బ్రిటీష్ - ఉన్న వ్యక్తి తనయుడు అతడు కావచ్చు. అయితే దీనిని క్లాజ్-2 క్రింద అతడు రుజువు చెయ్యాలి.

1. చట్టబద్ధమైన అనువంశీయుడు.
2. తండ్రి లేదా తాత జాతీయత.

6. ఎమ్. హెచ్. సి. ఆర్. 7

టర్నబుల్



(111) ఒక న్యాయమూర్తి/మెజిస్ట్రేట్ దగ్గర నిందితుడు న్యాయం పొందడంపై ఆధారపడి ఉంది. మెజిస్ట్రేట్/జడ్జ్ స్వయంగా ఫిర్యాదుదారుడైతే అతని దగ్గర న్యాయం లభించడానికి చాలా తక్కువ అవకాశాలుంటాయి. చట్టం సూత్రం ప్రకారం ఏ వివాదంలోనూ న్యాయమూర్తి, ఆరోపకుడు ఒక్కరే కారాదు. ఈ నియమం ఉన్నది---

**సెక్షన్ 487**

(1) సెక్షన్లు 480, 485లో సూచించిన విధంగా తప్ప క్రిమినల్ కోర్టు మెజిస్ట్రేట్ గానీ, జడ్జి గానీ,

హైకోర్టు జడ్జి కాకుండా, సెక్షన్ 195 కింద సూచించిన నేరాన్ని గానీ తన ముందు ఎవరైనా పాల్పడిన నేరాన్నిగానీ, తన అధికార లేదా కోర్టు ధిక్కార నేరాన్ని గానిజొ తన దృష్టికి తెచ్చిన నేరాన్ని గానీ, తన న్యాయ విధానంలో భాగంగా విచారణ జరపడానికి వీల్లేదు.

(2) సెషన్స్ కోర్టుకు గానీ, హైకోర్టుకి గాని తన కోర్టు నుంచి నేర విచారణకు గాను కేసులను పంపకుండా సెక్షన్ 476 లేదా 482 మెజిస్ట్రేట్‌ను నిరోధించ జాలవు.

## వివరణలు:

### సెక్షన్ 195

న్యాయపాలనకు సంబంధించిన నేరాలను గురించి చెబుతుంది.

అటువంటి నేరం ఒక న్యాయమూర్తి సమక్షంలో లేదా అతని అధికార ధిక్కారంగా జరిగినప్పుడు సదరు నేరం/నేరస్తుడిని ఆ న్యాయస్థానానికి తీసుకొచ్చినప్పుడు ఆ,న విచారణ చేయరాదని ఈ సెక్షన్ చెబుతున్నది. ఈ కేసు సెక్షను 480 మరియు 485 క్రిందకు వస్తే తప్ప.

చర్య ద్వారా, మాట ద్వారా, ముద్రణ ద్వారా ధిక్కారణకు పాల్పడవచ్చు. సదరు చర్య న్యాయమూర్తి అధికారాన్ని కించపరచడం, అతని కర్తవ్య నిర్వహణకు అవరోధాలు కల్పించడం మొదలైనవి ఈ కోవ క్రిందకు వస్తాయి.

(ననియన్ బేగ్ 10 బి.హెచ్.సి.ఆర్. 73)

**న్యాయమూర్తి:** ''న్యాయస్థానం'' బదులు ''న్యాయమూర్తి'' పదాన్ని చేర్చటం జరిగింది. 1872 కోడ్ ప్రకారం సదరు న్యాయమూర్తి విచారణ నిర్వహించటానికి వ్యక్తిగతంగా అనర్హుడు. అంటే అతని తర్వాత వచ్చిన న్యాయమూర్తి ఆ నేరాన్ని (అదే న్యాయస్థానంలో) విచారణ చేయవచ్చు.

మెజిస్ట్రేట్ అంటే ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్‌కు కూడా.

12 సి.డబ్ల్యు.ఎన్. 246

విచారణలో అప్పీళ్ళను వినడం కూడా చేరి ఉంటుంది.

అటువంటి న్యాయమూర్తి లేదా మెజిస్ట్రేట్:-

అంటే క్రిమినల్ కోర్టు న్యాయమూర్తి/మెజిస్ట్రేట్ హోదాలో విచారణ చేయరాదు. వేరే హోదాలో అదే వివాదం ఆయన ముందుకు వస్తే అప్పుడు విచారణ చేయవచ్చు.

అదే వ్యక్తి అనటంలో అదే హోదా అనటంలో వ్యత్యాసం ఉంది. ఈ విభాగం అదే హోదా అనే అంశంపై ఆధారపడి ఉంది.

16 కలకత్తా 776 బొంబాయి.

18 బొంబాయి 380 బొంబాయి.

కంట్రా - 1. మద్రాస్ 305. ''ఒకే వ్యక్తి'' అనే పదంపై ఆధారపడిన అన్వర్థత.

## సెక్షన్ 556

తాను కేసులో కక్షిదారుగా ఉన్నా లేదా తన వ్యక్తిగత ప్రయోజనాలు ఉన్నా ఆ కేసును విచారించే అధికారం, విచారణకు పంపే అధికారం జడ్జికి, మెజిస్ట్రేట్‌కు ఉండదు- తన కోర్టు నుండి అప్పీలుకు వెళ్ళగల కోర్టు అనుమతిస్తే తప్ప. తాను జారీచేసిన ఉత్తర్వు లేదా తీర్పుపై తానే అప్పీలు వినడానికి ఏ జడ్జికీ మెజిస్ట్రేట్‌కు అధికారం లేదు.

వివరణ - అయితే ఈ క్రింది సందర్భంలో న్యాయమూర్తి/మెజిస్ట్రేట్‌కు కక్షిదారునిగా, వ్యక్తిగతంగా ఆసక్తి ఉన్నట్లుగా ఈ సెక్షన్ క్రింద పరిగణించటం జరగదు-

(1) మునిసిపల్ కమిషనర్‌గా వ్యవహరించినప్పుడు

(2) ఉద్యోగపరంగా అతనికి సంబంధం ఉన్నప్పుడు

(3) నేరం జరిగిన ప్రదేశంలో తను ఉన్నప్పుడు

(4) లేదా ఏ ప్రదేశంలోనైనా నేరానికి సంబంధించిన వ్యవహారం జరిగిందని చెప్పబడినప్పుడు అక్కడ అతడు విచారణ జరిపినప్పుడు అతను ఈ వివాదంలో కక్షిదారుడు కాడు.

## కక్షిదారుడు

వ్యక్తిగతంగా ఆసక్తి ఉంది అంటే మేధాపరమైన ఆసక్తి అని కాదు. ఈ వివాదంలో ఆసక్తి చూపటం అంటే వ్యక్తిగతంగా లాభం పొందటం లేదా నష్టపోవటం అని అర్థము.

8 బొంబాయి ఎల్.ఆర్. 947

## (1) ఆర్థికపరమైన ఆసక్తి

మెజిస్ట్రేట్ ఒక వ్యాపార సంస్థలో వాటాదారుడైతే సదరు వివాదాన్ని విచారణ చేయటానికి అతడు అనర్హుడు.

20 బొంబాయి 502.

తనకు బాకీ ఉన్నవాళ్ళు ఫిర్యాదుతో సంబంధం కలిగి ఉంటే లేదా దోషితో వారికి సంబంధం ఉంటే సదరు వివాదాన్ని మెజిస్ట్రేట్ విచారణ చేయరాదు.

సంబంధం

ఫిర్యాదుదారుని సేవకుడు మెజిస్ట్రేట్ అయినట్లైతే విచారణ చేయటానికి అతడు అనర్హుడు.

7 కలకత్తా 322: 10 కలకత్తా 194

మెజిస్ట్రేట్ ఫిర్యాదుదారుని యజమాని అయినట్లైతే విచారణ చేయటానికి అనర్హుడు కాడు.

9 బొంబాయి 172

ఫిర్యాదు చేసిన వ్యక్తి భర్త మెజిస్ట్రేట్ అయినట్లైతే అతడు విచారణ చేయడానికి అనర్హుడు

14 బొంబాయి 572

## 487, 556 మధ్య తేడా

1. సెక్షన్ 556లో వలె సెక్షన్ 487 హైకోర్టు జడ్జీను అనర్హుని చేయదు.

2. సెక్షన్ 487 నేరాన్ని న్యాయస్థానాన్ని విచారించమనటాన్ని అన్వర్థం చేయటం లేదు. అయితే సెక్షన్ 556 అలా చేస్తున్నది.

556 మరియు 526 మధ్య తేడా (బదలీ) వివాదాల్లో చాలా తికమక ఉంది.

నేరాన్ని గుర్తిస్తుందే కానీ నేరస్తుడిని కాదు.



సెక్షన్ 129 చట్ట వ్యతిరేకమైన సమావేశాన్ని ప్రజాభద్రత కోసం చెదరకొట్టటానికి ఇతరత్రా సాధ్యం కానప్పుడు సెక్షన్ 129 మెజిస్ట్రేట్‌కు సైన్యాన్ని పిలిపించటానికి అధికారం ఇస్తున్నది.

**(II)** క్రిమినల్ విషయంలో మధ్యంతర ఉత్తరువును జారీ చేయటానికి అధికారాలు.

## సెక్షన్ 36

## 1. సాధారణ అధికారాలు

క్రిమినల్ ప్రొసీజర్ మూడవ షెడ్యూల్‌లో పేర్కొనటం జరిగింది. మెజిస్ట్రేట్ తరగతి హోదాను బట్టి అవి మారుతాయి.

2. అదనపు అధికారాలు - స్థానిక ప్రభుత్వం/ జిల్లా మెజిస్ట్రేట్ సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్‌కు కానీ ఒకటవ, రెండవ మూడవ తరగతికి చెందిన ఏ మెజిస్ట్రేట్‌ను కానీ కొన్ని అదనపు అధికారాలను కల్పించవచ్చు. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ నాలుగవ షెడ్యూల్‌లో వీటిని పేర్కొన్నారు. మెజిస్ట్రేట్ తరగతిని బట్టి అవి మారుతాయి.

అటువంటి అధికారాలను వినియోగించే పద్ధతి

## సెక్షన్ 107 (3)

ఒక వ్యక్తి చర్య శాంతిని భగ్నం చేస్తుంది లేదా అతడు చేయబోయే పని శాంతికి విఘాతం కలిగిస్తుంది అని భావించినప్పుడు సదరు శాంతి భగ్నతను ఇతరత్రా నిరోధించటం సాధ్యం కానప్పుడు మెజిస్ట్రేట్ ఆ వ్యక్తి నిర్బంధానికి వారెంట్ జారీ చేయవచ్చు. కారణాలను అతను తప్పనిసరిగా నమోదు చేయాలి.

చట్టం నిర్దేశించిన శిక్షలను న్యాయస్థానాలు విధించవచ్చు. దోషితనకు చట్టం అంగీకరించని శిక్షను విధించమని కోరితే సదరు శిక్ష సార్థకం కాదు.

3 బి.ఎల్.ఆర్. 50

### శిక్షను తగ్గించటం

సెక్షన్59 ఏ ఏ కేసులో కారాగారం బదులు దేశ బహిష్కరణ శిక్షను విధించవచ్చో తెలుపుతున్నది.

కారాగారం బదులు దేశ బహిష్కరణ విధించవచ్చునని గుర్తిస్తున్నది. తొమ్మిది సంవత్సరాల దేశ బహిష్కరణ, రూ. 300 జరిమాన, జరిమానాను చెల్లించకపోతే మరో మూడు సంవత్సరాల బహిష్కరణ. అయితే చివరి అంశాన్ని మరీ కఠినమైన శిక్షగా భావిస్తున్నారు.

-5 మద్రాస్ 28

## (111) శిక్షించటానికి అధికారాలు

సెక్షన్ 53, ఐ.పి.సి. సూచిస్తున్న శిక్షలు:-

### 1. మరణశిక్ష

1. సెక్షన్ 121, 132, 194 302, 305, 307, 396 ప్రకారం మరణశిక్షను విధించవచ్చు.

2. (హత్య చేసి జీవిత కారాగారం అనుభవిస్తున్న నేరస్తునికి) సెక్షన్ 303 క్రింద మరణశిక్ష తప్పనిసరిగా విధించాలి.

**II దేశ బహిష్కరణ**

**(i) జీవితాంతం**

(1) సెక్షన్ 75, 125, 128 క్రింద విధించవచ్చు.

(2) సెక్షన్ 226, 311 క్రింద తప్పనిసరిగా విధించాలి.

**(ii) ఒక నిర్దిష్ట కాలానికి-**

(1) సెక్షన్ 226, 311 క్రింద విధించవచ్చు.

(2) ఏడు సంవత్సరాలకు తగ్గకుండా సెక్షన్ 59 క్రింద కారాగారశిక్ష కాలాన్ని మించకుండా ఉండాలి.

**III దేశ బహిష్కరణ ఏకాంత శిక్ష**

ఒక యూరోపియన్ లేదా అమెరికన్ సెక్షన్ 59 క్రింద బహిష్కరణ శిక్ష విధించతగిన నేరానికి పాల్పడిన సభ్యుడు ఈ శిక్ష విధించవచ్చు.

**IV కారాగారశిక్ష**

(1) 14 సంవత్సరాలకు మించకుండా

(2) సాధారణ శిక్ష

(3) కఠిన శిక్ష

1921 చట్టం XVI 4వ సెక్షన్ ద్వారా తొలగించినవి

**V మొత్తం ఆస్తిని (I) స్వాధీనం చేసుకోవటం.**

I (i) సెక్షన్ 62 క్రింద స్వాధీనం చేసుకోవచ్చు.

(ii) సెక్షన్ 121, 122 క్రింద తప్పనిసరిగా స్వాధీనం చేసుకోవాలి.

II ప్రత్యేకంగా పేర్కొన్న ఆస్తి

(i) సెక్షన్లు 126, 127 క్రింద స్వాధీనం చేసుకోవచ్చు.

(ii) సెక్షన్లు 169 క్రింద తప్పనిసరిగా స్వాధీనం చేసుకోవాలి.

# (రివిజినల్) పునఃపరిశీలన అధికార పరిధి

సివిల్ ప్రొసీజర్ కోడ్

సెక్షన్ 115

క్రింది కోర్టు విచారణ చేసిన ఏ వివాదం అయినా. అప్పీలు లేనప్పుడు సదరు వివాదం రికార్డును హైకోర్టు పరిశీలనకు పంపాలని ఈ క్రింది సందర్భాల్లో ఆదేశించవచ్చు.

1. క్రింది న్యాయస్థానం తనకు చట్టం ఇవ్వని అధికారాన్ని వినియోగించినప్పుడు

2. తన అధికారాన్ని చెలాయించటంలో విఫలం అయినప్పుడు

3. చట్ట విరుద్ధంగా లేదా అక్రమంగా విచారణాధికారాన్ని వాడినపుడు. హైకోర్ట్ వివాదాన్ని బట్టి సముచిత ఉత్తర్వును జారీ చేస్తుంది.

క్రిమినల్ ప్రొసీజర్ కోడ్

సెక్షన్ 435

(1) హైకోర్టు లేదా సెషన్స్ జడ్జి/డివిజనల్ మెజిస్ట్రేట్/సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్ స్థానిక ప్రభుత్వం తరపున తన క్రింది న్యాయస్థానంలో ఉన్న ఏ రికార్డును తెప్పించు కుని విచారణలో ఉన్న వివాదం కానీ అది సరిగ్గా ఉందా లేదా, చట్టబద్ధంగా ఉందా లేదా, విధించిన శిక్ష సరైందా కాదా, క్రమబద్ధంగా ఉందా లేదా తెలుసుకోవటానికి అధికారం ఉంది. అటువంటి రికార్డును తెప్పించుకున్నప్పుడు శిక్ష అమలును ఆపివేయవచ్చు; నిందితుడు నిర్బంధంలో ఉంటే అతనిని వదిలిపెట్టవచ్చు లేదా విచారణ పూర్తి అయ్యే కాలానికి అతనిచే బాండ్‌ను వ్రాయించుకోవచ్చు.

**వివరణ**

435 సెక్షన్ ప్రకారం ప్రారంభ లేదా అప్పిలేట్ అధికార పరిధి ఉన్న మెజిస్ట్రేట్లందరూ సెషన్స్ జడ్జ్ పరిధికి లోబడి ఉన్న వారే.

2. ఏ సబ్-డివిజనల్ మెజిస్ట్రేట్ ఉప విభాగం (1) క్రింద వ్యవహరిస్తున్నప్పుడు సదరు క్రింది కోర్టు చర్య అక్రమం, చట్టవిరుద్ధం అని భావిస్తే ఆ మేరకు తన అభిప్రాయాలను తన వ్యాఖ్యలతో జిల్లా మెజిస్ట్రేట్‌కు పంపించాలి.

★ ★ ★

సివిల్ ప్రొసీజర్ కోడ్

4. ఈ విభాగం క్రింద జిల్లా మేజిస్ట్రేట్ లేదా సెషన్స్ జడ్జిలో ఒకరికి ధరఖాస్తు పెట్టినట్లైతే మరొకరు మరో ధరఖాస్తును, స్వీకరించరాదు.

## సెక్షన్ 436

సెక్షన్ 435 క్రింద లేదా ఇతరత్రా రివార్డ్సైనా పరిశీలించిన అనంతరం హైకోర్టు న్యాయమూర్తి లేదా సెషన్స్ జడ్జ్ జిల్లా మేజిస్ట్రేట్‌ను స్వయంగా కానీ తన క్రింది మేజిస్ట్రేట్ల ద్వారాకానీ ముందు విచారణకు ఏ ఫిర్యాదుకు సంబంధించినదైనా విభాగం 203 లేదా ఉప విభాగం (3) విభాగం 204 క్రింద కొట్టివేస్తే, లేదా ఒక నేరాకిని విచారించబడిన నిందితుడును వదలివేసినప్పుడు, విచారణ కొనసాగించుకుని ఉత్తర్వును జారీ చేయవచ్చు;

అయితే

ఏ న్యాయస్థానమూ ఈ విభాగం క్రింద దర్యాప్తు కొనసాగించమని విడుదలైన వ్యక్తిపై, అతడికి వ్యతిరేకంగా అటువంటి ఉత్తర్వును ఎందుకు జారీ చేయరాదు అని అడగకుండా, ఉత్తర్వును జారీ చేయరాదు.

## సెక్షన్ 437

435 సెక్షన్ లేదా ఇతరత్రా ఏ కేసు తాలూకు రికార్డ్సను పరిశీలించిన తర్వాత సెషన్స్ జడ్జ్/ జిల్లా మెజిస్ట్రేట్ అటువంటి కేసును సెషన్స్ న్యాయస్థానమే విచారణ చెయ్యాలి అని భావిస్తే

సివిల్ ప్రొసీజర్ కోడ్

నిందితుడిని క్రింది న్యాయస్థానం అక్రమంగా వదిలివేయటం జరిగితే అతనిని నిర్బంధించమని ఆదేశించి కొత్త దర్యాప్తును ప్రారంభించమని నిర్దేశించటానికి బదులు, నిలిపివేసిన విచారణను కొనసాగించాలని ఉత్తరువును జారీ చేయవచ్చు.

అయితే-

(1) నిందితునికి తన వాదాన్ని ఆ జడ్జికి లేదా మెజిస్ట్రేట్‌కు వినిపించుకోవటానికి అవకాశం కల్పించాలి.

(2) న్యాయమూర్తికి నిందితుడు మరో నేరాన్ని కూడా చేశాడని చెప్పటానికి సాక్ష్యం ఉన్నట్లైతే అతడు కింది కోర్టును సదరు నేర విచారణ జరపాలని ఉత్తరువును జారీ చేయవచ్చు.

## సెక్షన్ 438

(1) సెక్షన్ 435 క్రింద సెషన్స్ జడ్జి లేదా జిల్లా జడ్జి పరిశీలన అనంతరం, సరైనది అని భావించినట్లైతే, హైకోర్టుకు నివేదికను పంపవచ్చు. సదరు రిపోర్టు శిక్షను తగ్గించమని లేదా రద్దు చేయమని లేదా నిందితుడిని బెయిల్‌పై లేదా బాండ్‌పై విడుదల చెయ్యమని హైకోర్టును అర్థించవచ్చు.

(2) అదనపు సెషన్స్ జడ్జి,- సెషన్స్ జడ్జ్ అధికారాలను ఈ ప్రకరణం క్రింద చెలాయించవచ్చు- వివాదాలను సెషన్స్ జడ్జ్ ప్రత్యేక ఉత్తర్వుల ప్రకారం తనకు బదిలీ అయినప్పుడు వాని విచారణ చేయవలసిన సందర్భంలో ఆ అధికారాలను వినియోగించవచ్చు.

సివిల్ ప్రొసీజర్ కోడ్

సెక్షన్ 439

(1) విచారణలో ఉన్న కేసుకు సంబంధించి, రికార్డులను పరిశీలనకు తెప్పించుకొన్నప్పుడు లేదా ఉత్తర్వుల కోసం వచ్చినపుడు, హైకోర్టు తన విచక్షణాధికారాన్ని వినియోగించి సెక్షన్లు 423, 426, 427 మరియు 338 కల్పించిన అప్పిలేట్ పరిధి క్రింద శిక్షను పెంచవచ్చు; రివిజన్ న్యాయస్థానంలోని న్యాయమూర్తుల మధ్య అభిప్రాయం సమానంగా విభాజితం అయినప్పుడు సెక్షన్ 429 ప్రకారం వివాదాన్ని ముగించడం జరుగుతుంది.

(2) ఈ విభాగం క్రింద దోషికి వ్యతిరేకంగా ఏ ఉత్తరువునూ అతనికి వ్యక్తిగతంగా లేదా వకీలు ద్వారా సమాధానం చెప్పుకోటానికి అవకాశం ఇవ్వకుండా జారీ చేయరాదు.

(3) సెక్షన్ 34 క్రింద కాకుండా ఇతరత్రా శిక్షను మెజిస్ట్రేట్ విధిస్తే కోర్టు అంతకంటే ఎక్కువ శిక్షను విధించరాదు. ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్/ మొదటి తరగతి మెజిస్ట్రేట్ ఇచ్చిన శిక్ష కంటే అధిక శిక్షను విధించరాదు.

(4) సెక్షన్ 273 క్రింద నవెూదు చేసినప్పుడు, లేదా ఒక విడుదలను హైకోర్టు శిక్షకు సంబంధించినదిగా అధికారికంగా భావించి నప్పుడు, ఈ సెక్షన్‌లోని ఏ అంశమూ వర్తించదు.

(5) ఈ కోడ్ క్రింద అప్పీలు ఉన్నట్లైతే, సదరు అప్పీలు విచారణలోకి రాకపోయినట్లైతే

సివిల్ ప్రొసీజర్ కోడ్

ఎటువంటి అప్పీలు చేసుకోని పార్టీ రివిజన్ చేయాలన్న విజ్ఞప్తిని పరిగణలోకి తీసుకోవటం జరగదు.

(6) ఈ సెక్షన్‌లో ఏమి ఉన్నప్పటికీ, ఏ శిక్షపడిన వ్యక్తికి అయినా ఉప విభాగం (2) అతనికి శిక్షను ఎందుకు పెంచకూడదో కారణం తెలపమని అతడిని అడిగినప్పుడు, అతడు తనకు విధించిన శిక్షకు వ్యతిరేకంగా కారణం చూపించవచ్చు.

**సెక్షన్ 440**

ఏ న్యాయస్థానం అయినా 'రివిజన్' క్రింద తన అధికారాన్ని చెలాయిస్తున్నప్పుడు ఏ కక్షిదారుడినీ వ్యక్తిగతంగా కానీ, న్యాయవాది ద్వారా కానీ వాదించే హక్కు లేదు. అయితే న్యాయస్థానం సదరు అధికారాన్ని ఉపయోగిస్తున్నప్పుడు అవసరం అనుకుంటే కక్షిదారుడికి వ్యక్తిగతంగా కానీ న్యాయవాది ద్వారాగానీ వాదాన్ని వినిపించే అవకాశం ఇవ్వవచ్చు. అయితే ఈ సెక్షన్‌లోని ఏ అంశమూ సెక్షన్ 439, దాని ఉప విభాగం (2)కు వర్తించవు.

**రిఫరెన్స్ సివిల్ ప్రొసీజర్ కోడ్**
**క్రిమినల్ ప్రొసీజర్ కోడ్**
**సెక్షన్ 113**

నిర్దేశించిన షరతులు, పరిమితులకు లోబడి ఏ న్యాయస్థానం అయినా ఉన్నత న్యాయస్థానానికి దాని అభిప్రాయం కోసం వివాదాన్ని పంపవచ్చు.

**సెక్షన్ 432**

తను సరైనదని భావించినప్పుడు ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్, చట్టానికి సంబంధించినంతవరకూ ఏవైనా సందేహాలు వచ్చినపుడు, తన విచారణలో ఉన్న వివాదం సందర్భంలో లేదా తను తీర్పు ఇచ్చిన వివాదం సందర్భంలో హైకోర్టు అభిప్రాయానికి సదరు న్యాయస్థానానికి సదరు

దానిపై హైకోర్టు తరాను ఉచితమని భావించిన ఉత్తర్వు జారీ చేయవచ్చు.

వివాదాన్ని పంపవచ్చు. సదరు ఉన్నత న్యాయస్థానం నిర్ణయించేంతవరకూ నిందితుడిని నిర్బంధంలో ఉంచవచ్చు.

## సెక్షన్ 433

(1) అలా హైకోర్టుకు ఒక వివాదం వచ్చినప్పుడు సదరు న్యాయస్థానం తన నిర్ణయాన్ని ఉత్తర్వు ద్వారా ప్రకటించి, సదరు ఉత్తరువును, సదరు వివాదాన్ని తనకు పంపిన న్యాయమూర్తికి పంపాలి. అప్పుడు ఆ న్యాయమూర్తి సదరు వివాదాన్ని లాంఛనప్రాయంగా ఉన్నత న్యాయస్థానం నిర్ణయం ప్రకారం పరిష్కరిస్తారు.

(2) వివాదం ప్రస్తావనకు సంబంధించిన ఖర్చునం ఎవరు చెల్లించాలో హైకోర్టు నిర్దేశించవచ్చు.

## సమీక్ష (రివ్యూ)

## సివిల్ ప్రొసీజర్ కోడ్

## సెక్షన్ 114

పైన చెప్పిన అంశాలకు లోబడి నష్టపోయిన ఏ వ్యక్తి అయినా-

(1) డిక్రీ ద్వారా లేదా ఉత్తరువు ద్వారా, ఈ కోడ్ క్రింద అప్పీలుకు అనుమతి లభించి, అప్పీలును చేయనప్పుడు;

(2) డిక్రీ ద్వారా లేదా ఉత్తరువు ద్వారా ఈ

## క్రిమినల్ ప్రొసీజర్ కోడ్

సమీక్షకు అవకాశం కల్పించలేదు.

కోడ్ క్రింద అప్పీలను అనుమతించినప్పుడు, లేదా

(3) స్వల్ప వివాదాలపై కోర్టు నుంచి కేసుల ప్రస్తావన వచ్చినపుడు;

అదే న్యాయస్థానం ఇచ్చిన తీర్పును సమీక్షించాలని విజ్ఞప్తి చేయవచ్చు. న్యాయస్థానం తన ఆలోచన ప్రకారం అవసరమైన నిర్ణయాన్ని ప్రకటిస్తుంది.

## అప్పీళ్ళు

## సివిల్ ప్రొసీజర్ కోడ్

### సెక్షన్ 96

(1) ఈ కోడ్‌లో కానీ లేదా ఏ ఇతర చట్టముకానీ ఇతరత్రా కల్పిస్తేనే తప్ప ప్రారంభ అధికార పరిధిని చెలాయించే ఏ న్యాయస్థానం తీర్పు పైన అయినా అప్పీలు వినగల అధికారం కలిగిన కోర్టుకు అప్పీలు చేసుకోవచ్చు.

(2) కక్షిదారుడిగైరుహాజరిలో జారీ అయిన డిక్రీకి వ్యతిరేకంగా కూడా అప్పీలు చేయవచ్చు.

### విభాగం 100

(1) ఈ కోడ్‌తో ఎక్కడైనా లేదా ఏ చట్టం అయినా కల్పిస్తే తప్ప హైకోర్టుకు క్రింది న్యాయస్థానాల తీర్పులు/ఉత్తరువులు/డిక్రీలపై ఈ క్రింది కారణాలతో అప్పీలు చేసుకోవచ్చు;-

(i) చట్టానికి లేదా వాడుకకు వ్యతిరేకంగా తీర్పు ఉన్నట్లైతే.

## క్రిమినల్ ప్రొసీజర్ కోడ్

### సెక్షన్ 404

ఈ కోడ్ కల్పించిన ప్రకారం లేదా ఏ ఇతర చట్టం అయినా కల్పించిన ప్రకారం మినహాయించి ఒక క్రిమినల్ కోర్టు తీర్పుపై అప్పీలుకు అవకాశం లేదు.

### సెక్షన్ 407

(1) రెండవ తరగతి/మూడవ తరగతి మెజిస్ట్రేట్ విచారణలో శిక్ష పొందిన వ్యక్తి లేదా సెక్షన్ 349 క్రింద ఒక వ్యక్తికి సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్ శిక్ష విధిస్తే సదరు వ్యక్తి జిల్లా మెజిస్ట్రేట్‌కు అప్పీలు చేసుకోవచ్చు.

(2) జిల్లా మెజిస్ట్రేట్ అప్పీళ్ళను నివారణ చేయటానికి స్థానిక ప్రభుత్వం అధికారం కల్పించిన ఏ న్యాయస్థానానికైనా వివాదాన్ని ప్రస్తావించవచ్చు. అటు తర్వాత అటువంటి అప్పీలు/అప్పీళ్ళు

**(ii)** న్యాయపరమయిన ప్రశ్నకు లేదా చట్టం గుర్తించిన వాడుకలకు సంబంధించిన ప్రశ్నకు విరుద్ధంగా విచారించడంలో విఫలం అయినప్పుడు

**(iii)** ఈ కోడ్ సూచించిన ప్రక్రియ అమలులో తీవ్రమైన లోపం లేదా తప్పు ఉన్నట్లైతే లేదా ఏ ఇతర చట్టంలో కూడా సదరు లోపం ఉన్నట్లైతే అది ప్రస్తుత వివాదం అర్హతలపై ప్రభావం చూపించినట్లైతే (2) కక్షిదారుడి గైర్‌హాజరీలో జారీ చేసిన డిక్రీపై ఈ విభాగం క్రింద అప్పీలు చేసుకోవచ్చు.

సెక్షన్ 104

(1) ఈ క్రింది ఉత్తరువుల నుంచి అప్పీలు చేసుకోవచ్చు. (ఈ కోడ్‌లో లేదా అమల్లో ఉన్న ఏ చట్టంలో అయినా ఇతరత్రా కల్పిస్తే తప్ప, ఏ ఇతర ఉత్తరువుల నుంచి కాకుండా.)

(1) న్యాయస్థానం నిర్దేశించిన కాల పరిమితి పూర్తి కాకుండానే ఒక వివాదంలో మధ్యవర్తి నిర్ణయాన్ని అధిగమిస్తూ ఉత్తరువును జారీ చేసినప్పుడు;

(2) ఒక ప్రత్యేక కేసు రూపంలో ఒక మధ్యవర్తి అవార్డు మీద ఇచ్చి తీర్పు.

(3) ఒక మధ్యవర్తి అవార్డును మారుస్తూ లేదా సరిదిద్దుతూ ఇచ్చిన ఉత్తరువు;

(4) మధ్యవర్తిత్వానికి ఒక ఒడంబడికను ప్రస్తావించటానికి వీలుగా లేదా వ్యతిరేకిస్తున్న ఉత్తరువు.

అటువంటి సబార్డినేట్‌న్యాయస్థానం/మెజిస్ట్రేట్ తనకు బదిలీ చేసుకుని విచారణ చేయవచ్చు.

జిల్లా మెజిస్ట్రేట్ సదరు ప్రస్తావించిన బదిలీ చేసిన అప్పీలును లేదా అప్పీళ్ళను లేదా అప్పీళ్ళను ఉపసంహరించుకోవచ్చు.

## సెక్షన్ 408

అసిస్టెంట్ సెషన్స్ జడ్జి శిక్షించిన ఏ దోషి అయినా లేదా జిల్లా మెజిస్ట్రేట్/ ఒకటవ తరగతి మెజిస్ట్రేట్ సెక్షన్ 349 క్రింద శిక్షించినప్పుడు లేదా 380 విభాగం క్రింద మొదటి తరగతి మెజిస్ట్రేట్ శిక్షకు గురైన వ్యక్తి సెషన్స్ కోర్టుకు అప్పీలు చేసుకోవచ్చు.

అయితే ఈ క్రింది విధంగా...



(2) సెక్షన్ 30 క్రింద ప్రత్యేక అధికారం ఉన్న అసిస్టెంట్ సెషన్స్ జడ్జి లేదా మెజిస్ట్రేట్ నాలుగు సంవత్సరాలకు మించకుండా కారాగారశిక్షను విధించినప్పుడు లేదా దేశ బహిష్కరణ శిక్షను విధించినప్పుడు ఒక దోషి లేదా అందరు దోషుల అప్పీళ్లను హైకోర్టు విచారణకు స్వీకరించవచ్చు;

(3) సెక్షన్ 124A, ఐ.పి.సి. నేరం క్రింద ఒక వ్యక్తిని మెజిస్ట్రేట్ శిక్షించినప్పుడు; హైకోర్టుకు అప్పీలు చేయవచ్చు.

(5) మధ్యవర్తిత్వానికి ఒప్పందాన్ని ప్రస్తావించటాన్ని ఆపటం లేదా నిలుపుదలను నిరాకరించటం.

(6) న్యాయస్థానం జోక్యం లేకుండా మధ్యవర్తితత్వం నిర్ణయాన్ని అంగీకరిస్తూ లేదా వ్యతిరేకిస్తూ ఇచ్చిన ఉత్తరువు.

(7) సెక్షన్35A క్రింద జారీచేసిన ఉత్తరువు.

(8) విభాగం 95 క్రింద ఉత్తరువు.

(9) ఒక డిక్రీని అవములుపరచటంలో జారీచేసిన అరెస్టు ఉత్తర్వు తప్ప అమల్లో ఉన్న ఈ కోడ్ విధించే జరిమానా, ఒక వ్యక్తిని నిర్బంధంలోకి తీసుకోమని ఇచ్చే ఉత్తరువు.

(10) నియమాలు అప్పీలు చేసుకోవటానికి అనుమతి ఇచ్చే ఏ ఉత్తరువు పైనైనా.

(1) అయితే ఉత్తరువు తక్కువ జరిమానాను విధించి ఉండవలసింది అనేకారణం మినహాయించి క్లాస్ (7) లో సూచించిన ప్రకారం ఏ ఉత్తరువుకు వ్యతిరేకంగా అప్పీలు చేసుకోటానికి వీలులేదు.

(2) ఈ విభాగం క్రింద అప్పీలుపై జారీ చేసిన ఉత్తరువుపై అప్పీలు చేసుకోవటానికి వీలు లేదు.

## సెక్షన్ 105

(1) ఇతరత్రా కల్పిస్తే తప్ప ప్రారంభ అధికార పరిధి క్రింద లేదా అప్పిలేట్ అధికార పరిధి క్రింద

## సెక్షన్ 409

సెషన్స్ కోర్టు జడ్జి లేదా అదనపు సెషన్స్ జడ్జి అప్పీలును స్వీకరించవచ్చు. అయితే అదనపు సెషన్స్ జడ్జి స్థానిక ప్రభుత్వం ఒక సాధారణ ఉత్తరువు ద్వారా లేదా సెషన్స్ జడ్జి అతడిని సదరు అప్పీళ్ళను విచారణ చేయమని నిర్దేశించినప్పుడే అప్పీలు స్వీకరించవచ్చు.

## సెక్షన్ 410

సెషన్స్ జడ్జి లేదా అదనపు సెషన్స్ జడ్జి శిక్షించిన దోషి హైకోర్టుకు అప్పీలు చేసుకోవచ్చు.

## సెక్షన్ 411

ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ ఆరు మాసాలకు మించి శిక్ష విధించినప్పుడు లేదా రూ.200 మించి జరిమానా విధించినప్పుడు సదరు దోషి హైకోర్టుకు అప్పీలు చేసుకోవచ్చు.

## సెక్షన్ 411 A

(1) 449 విభాగానికి భంగం కలుగకుండా తన ప్రారంభ అధికార పరిధి క్రింద పై కోర్టు శిక్షించినప్పుడు, విభాగాలు 418 లేదా 423, ఉప విభాగం (2) లేదా లెటర్స్ పేటెంట్ ఆఫ్ ది హైకోర్ట్ ఏమి చెబుతున్నప్పటికీ, హైకోర్టుకు సదరు దోషి అప్పీలు చేసుకోవచ్చు:

(i) చట్టానికి సంబంధించిన అంశాలను మాత్రమే సవాలు చేస్తూ అప్పీలు చెయ్యాలి.

హైకోర్టు నిర్ణయం అప్పీలు చేయటానికి వీలులేదు. కానీ, ఒక డిక్రీపై అప్పీలు చేసినప్పుడు అందులో క్రమబద్ధతలో లోపం వల్ల, లేదా తప్పు వల్ల వివాదంపై దాని ప్రభావం ఉంటుందని భావించితే అప్పీలు చేసుకోవచ్చు.

(2) ఉప విభాగం (1)లో ఏమి ఉన్నప్పటికీ నష్టపోయిన వ్యక్తి నిర్బంధం ఉత్తరువుకు వ్యతిరేకంగా ఈ కోడ్ కింద అప్పీలు చేసుకోవటానికి అవకాశం ఉన్నప్పటికీ అప్పీలు చేసుకోని పక్షంలో అతడు తీర్పును సరైంది కాదని సవాలు చేయటానికి అవకాశం లేదు.

## సెక్షన్ 109

అప్పీళ్ళ విషయంలో చక్రవర్తి కౌన్సిల్ కాలానుగుణంగా చేసే నియమాలకు లోబడి, బ్రిటీష్ ఇండియా న్యాయస్థానం తీర్పుపై సదరు చక్రర్తి కౌన్సిల్‌కు అప్పీలు చేయవచ్చు- దానికి సంబంధించి

(i) హైకోర్టు లేదా ఏ ఇతర న్యాయస్థానం అప్పిలేట్ అధికార పరిధి క్రింద జారీ చేసిన డిక్రీ లేదా ప్రకటించిన అంతిమ తీర్పుపై

(ii) ప్రారంభ సివిల్ అధికార పరిధి క్రింద హైకోర్ట్ జారీచేసిన డిక్రీ లేదా తుది నిర్ణయంపై;

(iii) చక్రవర్తి కౌన్సిల్‌కు అప్పీలు చేయటానికి అర్హత కలిగి ఉంది అని ధృవీకరిస్తే ఏ న్యాయస్థాన నిర్ణయంనైనా చక్రవర్తి కౌన్సిల్‌కు అప్పీలు చేయవచ్చు.

(ii) అప్పిలేట్ కోర్టు అనుమతి తీసుకుని లేదా శిక్ష విధించిన న్యాయస్థానం అప్పీలు యోగ్యతాపత్రంతో వాస్తవాలకు సంబంధించి చిన్న వివాదంపైన అప్పీలు చేయవచ్చు; మరియు

(iii) చట్టం నిర్దేశించిన శిక్ష అయితే తప్ప అప్పిలేట్ కోర్టు అనుమతితో శిక్షకు వ్యతిరేకంగా అప్పీలు చేసుకోవచ్చు.

(2) సెక్షన్ 417లో ఏమి చెప్పినప్పటికీ, స్థానిక ప్రభుత్వం హైకోర్టు విడుదల చేసిన దోషి ఉత్తరువుకు వ్యతిరేకంగా అప్పీలు చేయమని పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ను ఆదేశించవచ్చు. సెక్షన్లు 418, 423, ఉప విభాగం (2)లో ఏమి ఉన్నప్పటికీ లేదా లెటర్ ఆఫ్ పేటెంట్ ఆఫ్ హైకోర్ట్ ఎలా ఉన్నా ఈ విభాగం క్లాజ్ (బి), క్లాజ్ (సి) విధించిన పరిమితులకు లోబడి చట్టపరమైన, వాస్తవాలకు సంబంధించిన వివాదాలపై అప్పీలు చేయవచ్చు.

(3) చట్టంలో కానీ, రెగ్యులేషన్‌లో గానీ ఏమి ఉన్నప్పటికీ ప్రారంభ విచారణ జరపని కనీసం ఇద్దరు న్యాయమూర్తులతో కూడిన హైకోర్టు డివిజన్ బెంచి అప్పీలును విచారణకు స్వీకరిస్తుంది; సదరు డివిజన్ బెంచ్‌ను ఏర్పాటు చేయటం సాధ్యం కాన ప్పుడు, ప్రావిన్షియల్ ప్రభుత్వానికి పరిస్థితులను హైకోర్టు వివరిస్తుంది. సెక్షన్ 527 క్రింద అప్పీలును బదిలీ చేయటానికి సదరు ప్రభుత్వం చర్య తీసుకుంటుంది.

## సెక్షన్ 110

సెక్షన్ 109 క్లాజ్ (ఎ), (బి) మరియు (బి)లో ప్రస్తావించిన ప్రతి వివాదంలోనూ ఆస్తి విలువ పదివేల రూపాయలకు మించి ఉంటే, ఆ వివాదం చక్రవర్తి కౌన్సిల్ ముందు ఉంటే సదరు ఆస్తి విలువ 10 వేలు అంతకు మించి ఉండాలి.

పైన ప్రస్తావించిన ఆస్తి విలువ తప్పనిసరిగా పదివేల రూపాయలకు మించి ఉండాలి. అప్పుడే సదరు తీర్పుపై/ డిక్రీపై అప్పీలు చేయవచ్చు.

క్రింది న్యాయస్థానం తీర్పును/ డిక్రీపై న్యాయస్థానం ధృవీకరించినప్పుడు సదరు తీర్పులో చట్టానికి సంబంధించిన వివాదం ఉంటే అప్పీలు చేయవచ్చు.

## సెక్షన్ 111

సెక్షన్ 109లో ఏమి ఉన్నప్పటికీ, చక్రవర్తి కౌన్సిల్‌కు అప్పీలు ఈ క్రింది వాటిపై చేయరాదు.

(i) చక్రవర్తి ఉత్తర్వుతో ఏర్పాటైన హైకోర్టు న్యాయమూరిత ఉత్తరువు/ డిక్రీ లేదా హైకోర్టు డివిజన్ ఒక న్యాయమూర్తి లేదా ఇద్దరు న్యాయమూర్తులు లేదా ఇద్దరు హైకోర్టు న్యాయమూర్తుల డివిజన్ భిన్నాభిప్రాయాలను వ్యక్తం చేస్తే, అప్పుడు మెజారిటీ నిర్ణయం రానప్పుడు;

(2) విభాగం 102 క్రింద రెండవ అప్పీలు లేనప్పుడు

(4) ప్రభుత్వం కాలానుగుణంగా చేసే నియమాలకు లోబడి, హైకోర్టు విధించే షరతులకు లోబడి, ఉప విభాగం (1) అనుసరించిన డివిజన్ కోర్ట్ (హైకోర్ట్ తాలూకు) నిర్ణయంపై హైకోర్టు అనుమతితో చక్రవర్తి కౌన్సిల్‌కు అప్పీలు చేయవచ్చు. అందుకు అర్హమైనదని హైకోర్టు ధృవీకరించవలసి ఉంటుంది.

## సెక్షన్ 412

ఇంతకుముందు ఏమి ఉన్నప్పటికీ దోషితన నేరాన్ని అంగీకరించినప్పుడు అతడిని హైకోర్టు శిక్షించినప్పుడు లేదా ప్రెసిడెన్సీ కోర్టు మొదటి తరగతి మెజిస్ట్రేట్ అటువంటి వివాదంలో శిక్షించినప్పుడు శిక్షకు సంబంధించిన చట్టబద్ధతను మినహాయించి ఇతరత్రా అప్పీలుకు అవకాశం లేదు.

## సెక్షన్ 413

దీనికి ముందు ఏమి ఉన్నప్పటికీ ఆరు మాసాల కారాగారశిక్షకు మించకుండా లేదా రెండు వందల రూపాయల జరిమినాకు మించకుండా శిక్షను హైకోర్టు విధించినప్పుడు సదరు శిక్షపై అప్పీలు చేయరాదు. సెషన్స్ కోర్టు ఒక మాసానికి మించకుండా శిక్ష విధించినప్పుడు x x x

లేదా జిల్లా న్యాయస్థానం సెషన్స్ కోర్టు లేదా మొదటి తరగతి మెజిస్ట్రేట్ రూ. ఏభైకి

## సెక్షన్ 111-A

భారత ప్రభుత్వ చట్టం 1935, సెక్షన్ 205 (1) క్రింద బదలీ యోగ్యతాపత్రం ఇచ్చినప్పుడు దీనికి ముందున్న మూడు విభాగాలు ఫెడర్ కోర్టుకు సంబంధించిన అప్పీళ్ళపై చక్రవర్తి కౌన్సిల్‌కు చేసే విజ్ఞప్తులకు వర్తిస్తాయి. వాటిని సదరు కౌన్సిల్ ఫెడరల్‌కోర్టుకు చేసే ప్రస్తావనలుగా ఉంటాయి.

దానికిగాను-

(i) చట్టం అధిక భాగం సరిగ్గా వ్యాఖ్యానించకపోవటం కానీ, కౌన్సిల్ ఇచ్చిన ఉత్తరువును తప్పుడుగా నిర్ణయించినట్లు భావించినప్పుడు కానీ మినహాయిస్తే పైన ప్రస్తావించిన విభాగాలు నిర్ణయించిన పరిధులు తీర్పును పరిమితం చేస్తున్న వివాదాలపై ఫెడరల్ కోర్టు అనుమతి లేకుండా అప్పీళ్ళను విచారించవచ్చు.

(ii) సెక్షన్ 109, క్లాజ్ (సి) క్రింద నిర్ణయించేటప్పుడు వివాదం అప్పీలుకు అర్హత కలిగి ఉందా మరియు సెక్షన్ 110 క్రింద చట్టం వ్యాఖ్యానానికి సంబంధించిన అంశాలున్నాయా, ఏ చట్టానికి సంబంధించిన వివాదాలున్నాయా లేదా కౌన్సిల్ నిర్ణయానికి సంబంధించిన అంశాలున్నాయా మొదలైన వాటిని పరిగణనలోకి తీసుకోకుండా వదిలి వేయటం జరుగుతుంది. మించకుండా జరిమానా విధించిన సందర్భంలో అప్పీలుకు అవకాశం లేదు.

★ ★ ★

# 7. ఆస్తి మార్పిడి చట్టం

## వాటా

1) ఇద్దరు వ్యక్తులు తమ రెండు ఆస్తులను తనఖా పెడితే, అప్పు తీర్చడానికి ఆ రెంటిలో ఒక్క ఆస్తిని అమ్మిన సొమ్ము కనుక సరిపోతే మిగిలిన తనఖా ఆస్తిని ఏ బకాయి లేకుండా సొంతదారులకు ఇచ్చివేయవలసి ఉంటుంది. ఇది తీవ్రమయిన అన్యాయం. ఈ అన్యాయాన్ని పరిష్కరించడానికి సెక్షన్ 82లో వాటా సూత్రాన్ని పొందుపరిచారు. ఈ వాటా సూత్రాన్ని ఈ సమతా (ఈక్విటీ) కోర్టులు రూపొందించాయి.

2) ఈ సెక్షన్ ప్రకారం తనఖా పెట్టి తీసుకున్న అప్పును ఇద్దరు సొంతదారులు తమ వాటా ప్రకారం తీర్చవలసి ఉంటుంది.

3) తనఖా సొమ్మును తీసేసిన తర్వాత తనఖా తేదీ నాటికి ఆస్తి విలువను వాటా విలువగా పరిగణించాలి.

1. మొత్తం తనఖా సొమ్ము (అప్పు) తీర్చిన తర్వాతనే వాటా కోరే హక్కు లభిస్తుంది. **26 All. 407 (426, 427) T.B.**
2. వాటా హక్కు మార్షలింగ్ నియామకానికి లోబడి ఉంటుంది. మార్షలింగ్ నియమం వాటా నియమంలో పోటీపడితే మార్షలింగ్ నియమమే గెలుస్తుంది. సెక్షన్ 82 చివరి పేరా అర్థం ఇదే.

## తనఖా కర్త హక్కుల అమలును ఎవరు కోరవచ్చు?

సెక్షన్ 91.

తనఖా స్వీకర్త హక్కుల అమలును ఎవరు కోరవచ్చు?

సెక్షన్ 92.

తనఖా స్వీకర్తకు ఇవ్వవలసిన డబ్బును ఇచ్చినవారు, తనఖాకర్త కాకుండా, వేరే ఎవరయినా తనఖా స్వీకర్త హక్కుల అమలును కోరవచ్చు.

ఆ వ్యక్తులు-

1. తదుపరి తనఖా స్వీకర్త
2. హామీదారు
3. ఆస్తిపై హక్కున్న ఏ ఇతర వ్యక్తి అయినా

3. సహ తనఖాకర్త

5. తనఖాకర్త రిజిస్టర్డ్ పత్రం ద్వారా అంగీకరించిన మేరకు ఎవరి సొమ్ముతో తనఖా అప్పు తీర్చారో, అటువంటి వ్యక్తి.

దీన్ని సబ్‌రోగేషన్ **(Subrogation)** నియమం అంటారు.

**II)** విక్రయ చట్టం బదిలీకి ఒక పద్ధతిని నిర్దేశించింది. ఆ పద్ధతి రిజిస్ట్రేషన్ లేదా, ఆస్తి స్వాధీనం (కబ్జా ఇవ్వడం)

2. ఈ రెండు పద్ధతులలో రిజిస్ట్రేషన్‌ను అనుసరించడమా లేక ఆస్తి స్వాధీనమా అన్న విషయం ఈ కింది అంశాలపై ఆధారపడి ఉంటుంది.

**(i)** స్థిరాస్తి ప్రత్యక్షమా (చూడతగినది) పరోక్షమా? (చూడతగనిది)

**(ii)** స్థిరాస్తి 100 రూపాయల విలువైందా లేక అంతకన్నా తక్కువదా?

3. స్థిరాస్తి పరోక్షమయినదయితే బదిలీ కేవలం రిజిస్ట్రేషన్ ద్వారా మాత్రమే జరగాలి- ఆ ఆస్తి విలువ ఎంతయినా సరే.

4. ప్రత్యక్షమయిన స్థిరాస్తి అయితే

**(i)** ఆ ఆస్తి విలువ రూ. 100 పైన అయితే కేవలం రిజిస్ట్రేషన్ ద్వారా మాత్రమే బదిలీ చేయాలి.

**(ii)** నూరు రూపాయల లోపు విలువగల ఆస్తి అయితే రిజిస్ట్రేషన్ ద్వారా లేక ఆస్తి స్వాధీనం ద్వారా బదిలీ చేయవచ్చు.

5. అంటే ఒక సందర్భంలో తప్ప రిజిస్ట్రేషన్ ఒక్కటే అమ్మకాన్ని సాగించే ప్రక్రియ అన్నమాట.

రూ.100 కన్నా తక్కువ విలువ ఉన్న ఆస్తి అమ్మకంలో మాత్రమే రిజిస్ట్రేషన్ ద్వారా లేక ఆస్తి స్వాధీనం ద్వారానైనా బదిలీ చేసే అవకాశం ఉంది.

6. రిజిస్ట్రేషన్, స్వాధీనం ప్రత్యామ్నాయ అనుబంధ పద్ధతులు- ఈ క్రింది అంశాలను గమనించాలి.

(i) రిజిస్ట్రేషన్ ఒక్కటే బదిలీ పద్ధతిగా కూర్చున్న అంశాలలో ఆస్తి స్వాధీనం మాత్రమే ఆస్తి బదిలీ ప్రక్రియను సంపూర్ణం చేయజాలదు.

(ii) ఆస్తి స్వాధీనం నిర్దేశించిన చోట, అమ్మకం ప్రక్రియను సంపూర్ణం చేయడానికి రిజిస్ట్రేషన్ అవసరం లేదు. కాని ఆస్తి స్వాధీనం లేకపోయినా అమ్మకాన్ని రిజిస్ట్రేషన్ ద్వారా పూర్తి చేయవచ్చు.

7. మరే బదిలీ పద్ధతి లేదు: ఆస్తి బదిలీకి సంబంధించి ఇవే మార్గాలు ఉంటాయి. అమ్మకానికి ఇతర మార్గం లేదు. అంగీకారం ద్వారాగానీ ఏదైనా పత్రంలో కూర్చొనడం ద్వారా గానీ, అధికారులకు ఇచ్చిన దరఖాస్తుల్లో గానీ, పట్టాదారు పుస్తకంలోగానీ అమ్మకం ప్రస్తావన ఉంటే సరిపోదు. భూమి అమ్మినట్టు అంగీకరించినంత మాత్రాన రిజిస్టర్ బదిలీగానీ, ఆస్తి స్వాధీనం గానీ అవసరం లేకుండా భూమి హక్కులను అప్పగించే విధంగా ఆ అంగీకారం పనిచేయరు.

**43 Cal. 790**

8. నిర్దేశిత ఆస్తి బదిలీ విధానాలేమిటో తెలుసుకోవడం అవసరం.

(i) నిర్దేశిత పద్ధతిలో తప్ప ఆస్తి బదిలీ ప్రక్రియ యాజమాన్యపు హక్కులను ఇవ్వరు.

(ii) రిజిస్టర్ చేయని పత్రం సరిపోరు-

(అ) రిజిస్ట్రేషన్ అవసరమన్నచోట,

(ఆ) ఆస్తి 100 రూపాయలకన్నా తక్కువ విలువైనదైనప్పుడు ఆ ఆస్తిని స్వాధీనం చేయనప్పుడు.

9. ప్రత్యక్ష, పరోక్ష స్థిరాస్తి అంటే ఏమిటి?

(i) స్థిరాస్తి ప్రత్యక్షంగానీ పరోక్షంగానీ కావచ్చు.

(ii) ఇంగ్లీష్‌చట్టంలో కార్పోరియల్‌హెరిడిటమెంట్‌కి ఇన్‌కార్పోరియల్‌హెరిడిటమెంట్‌కి మధ్య గుర్తించిన తేడా ప్రత్యక్ష, పరోక్ష ఆస్తుల మధ్య తేడా ఒకటే.

(iii) కార్పోరియల్ హెరిడిటమెంట్ అంటే భూమి కబ్జాపై హక్కు అంటే భూమిని స్వాధీనం చేసుకుని అనుభవించే ప్రస్తుత హక్కు. ఇన్‌కార్పోరియల్‌హెరిడిటమెంట్ అంటే ఇతరుల భూమిపై కబ్జా హక్కు. మున్ముందు స్వాధీనం చేసుకునే హక్కు కూడా కావచ్చు. ఇతరుల అధీనంలో వున్న భూమిని ఒక ప్రత్యేక అవసరం కోసం వాడుకునే హక్కు కావచ్చు. ఉదాహరణకు ఇతరుల భూమిలో నా అనే హక్కు.

(iv) ప్రత్యక్షమయిన పరోక్షమయిన వాటి మధ్య కాంట్రాక్ట్ అంటే భూమి కబ్జా కలిగిన ఒక వ్యక్తి ఆస్తిపై ప్రత్యక్ష హక్కుకు, ఆ భూమిపై కేవలం చూడడానికి వీలుకాని పరోక్ష హక్కు, (అంటే చూడతగిన కబ్జా వంటి హక్కులు లేకుండా) కు మధ్య కాంట్రాక్ట్.

(v) ప్రత్యక్షమయిన వస్తువు అంటే వాస్తవంగా మరొకరికి స్వాధీనం చేయగల వస్తువని అర్థం. (సులేమాన్ C.I. 50 All 986)

10. ఆస్తి స్వాధీనం అంటే అర్థం.

(i) అమ్మకందారుడు కొనుగోలుదారుని, లేదా అతని ఆదేశాలపైమరొకవ్యక్తిని, స్వాధీనంలో ఆస్తి కబ్జాను ఇవ్వడం.

(ii) కొనుగోలుదారుని అధీనంలో ఆస్తి (కబ్జా) ఇవ్వడమే స్వాధీనం అంటే.

(iii) కబ్జా అంటే ఏమిటి? ఈ ప్రశ్నకు జవాబు దొరకలేదు. ఇది వాస్తవంగా కబ్జా తీసుకోవడమా? లేక సంకేతప్రాయంగా కబ్జానా?

(iv) ప్రత్యక్ష ఆస్తి విషయంలోనే స్వాధీనం సాధనం కనుక శాసన వ్యవస్థ వాస్తవ కబ్జానే ఉద్దేశించిందని ఒక అభిప్రాయం.

(v) మరో అభిప్రాయమేమిటంటే 'స్వాధీనం'కు మరింత విస్తృతమయిన అర్థం ఉందని. ఎందుకంటేచాలా ఎక్కువసందర్భాల్లో భూమి కిరాయిదారుడిస్వాధీనంలో ఉంటుంది. లేదా కొనుగోలుదారుడే అంతకు ముందు నుంచే భూమి స్వాధీనంలో ఉంటాడు. అపుడు కబ్జా స్వాధీనం నామమాత్రంగా సాగుతుంది. ఎందుకంటే అటువంటి సందర్భాల్లో వాస్తవమయిన కబ్జా స్వాధీనం సాధ్యంకాదు.

(vi) రెండో అభిప్రాయమే పలు సందర్భాల్లో ఆమోదం పొందింది. భూమి సొంతదారు, భూమితో, లేదా భూమి కబ్జాకలిగిన వారితో తనకున్న సంబంధాలను కొనుగోలుదారుడికి ఏర్పాటు చేయడం కూడా వాస్తవ కబ్జా అని అనుకోవచ్చు.

11. యజమాన్యం ఎప్పుడు బదిలీ అవుతుంది.

i) స్వాధీనం లేదా రిజిస్ట్రేషన్ ద్వారా యాజమాన్యం మారుతుంది.

ii) రిజిస్ట్రేషన్‌కు సంబంధించి కింది అంశాలు గమనించాలి.

a) రిజిస్ట్రేషన్ జరగగానే, అంతకు ముందే అమ్మకం అమలయిన తేదీ నుంచి యాజమాన్యం హక్కులు అమలులోకి వస్తాయి.

b) రిజిస్టర్డ్ అమ్మకం పత్రం - మరో అమ్మకం పత్రం తర్వాత అమలయిన, అంతకు ముందు రిజిస్టర్డ్ అయినందున దెబ్బతినబోదు.

c) దావా వేయడానికి ముందే అమ్మకం జరిగినా దావా వేసిన తర్వాత రిజిస్టర్ అయినంత మాత్రాన ఆస్తి బదిలీ దావా తీర్పుకు లోబడి ఉండదు.

d) రిజిస్ట్రేషన్ జరిగేవరకు ఆస్తిపై వాస్తవ యాజమాన్యం హక్కులు బదిలీ కాకపోవడం నిజమే - అయినా రిజిస్ట్రేషన్ అయిన తర్వాతనే ఆస్తి మారుతుందనడానికి వీల్లేదు. ఎందుకంటే వ్యక్తుల ఉద్దేశం ప్రధానం కనుక.

3. సెక్షన్ 55(3) - యాజమాన్య పత్రాల స్వాధీనం:-

1. ఆస్తికి యాజమాన్యపత్రాలు అనుబంధాలు. ఆస్తి బదిలీతో (చెప్పకపోయినా) యాజమాన్య పత్రాలు కూడా మారుతాయి.

2. ఇందులో ఆస్తి బదిలీకి సంబంధించిన అన్ని పత్రాలు, కబ్జా, హక్కులకు సంబంధించిన పత్రాలు చేరి ఉంటాయి.

3. యాజమాన్య పత్రాలు ఇచ్చే బాధ్యత ఉన్నవారే వాటిని పొందేందుకు అయ్యే ఖర్చును కూడా భరించాలి.

4. లీజ్, కాబలయెత్ పత్రాలు ఆసికి సంబంధించిన అనుబంధ పత్రాల్లో భాగాలు అవుతాయి.

5. యాజమాన్య పత్రాలను ఇవ్వడమనేది ఆస్తి మార్పిడి పూర్తిచేయడంపై ఆధారపడి ఉండదు. ధర చెల్లించే వరకు యాజమాన్య పత్రాల బాధ్యత తలెత్తదు.

### మినహాయింపులు

(i) అమ్మకందారు తమ ఆస్తిలో కొన్ని భాగాలే అమ్మితే ఆస్తిపత్రాలను అతని దగ్గరే ఉంచుకొనవచ్చు. కాని ఆ పత్రాలను సురక్షితంగా దాచి అవసరమయినపుడు ఇచ్చే బాధ్యత, వాటి ప్రతులను ఇచ్చే బాధ్యత అతనిపై ఉంటుంది.

(ii) ఆస్తిని విభిన్న భాగాలలో విక్రయించినపుడు ఎక్కువ భాగాలు కొన్న వ్యక్తికి పత్రాలు పొందే హక్కు ఉంటుంది. పైన వివరించిన బాధ్యతలు కూడా ఉంటా.

స్పష్టమయిన ఒప్పందం ద్వారా, ఆస్తిలో ఎక్కువ భాగం కొన్న వ్యక్తికి పత్రాలు ఇవ్వవచ్చు.

6. విభిన్న సమయాల్లో ఆస్తిని విడివిడిగా అమ్మితే ఆ పత్రాలు ఎవరికి చెందుతాయనే విషయంపై సబ్ సెక్షన్‌లో లేదు.

## కొనుగోలుదారుల బాధ్యతలు

## 1. ఆస్తి మార్పిడికి ముందు

1. సెక్షన్ 55(5)(a) - ఆస్తికి సంబంధించిన విలువను పెంచడానికి అవసరమయిన అంశాలు, అమ్మకందారు హక్కులకు సంబంధించిన అంశాలు వెల్లడించాలి.

1. ప్రతి కొనుగోలుదారు కాంట్రాక్టుకు సంబంధించి ఏం చెప్పినా ఏం చేసినా సద్విశ్వాసాన్ని ప్రకటించాలి. నిజాలు దాచుతూ, అబద్ధాలు చెపుతూ మోసపూరితంగా వ్యవహరించకూడదు.

2. ఆస్తిలో స్పష్టమయిన లాభ లక్షణాలను వివరించవలసిన బాధ్యత కొనుగోలుదారుపై లేదు. స్పష్టమయిన లోపాలను చెప్పే బాధ్యత అమ్మకందారుపైన కూడా ఉండదు.

3. దీనికి యాజమాన్య పత్రాల అంశాలు - మినహాయింపు అమ్మకందారుడికి తన ఆస్తికి సంబంధించిన అంశాలన్నీ సాధారణంగా తెలిసి ఉండాలి. అయినా కొన్ని విషయాలు కొనుగోలుదారుడికి కూడా తెలియవచ్చు. వాటిని తన సొంత లాభం కోసం అన్యాయంగా వాడుకోరాదు.

ఉదాహరణ 1. సమ్మర్స్ వర్సెస్ గ్రిఫిత్స్

ఒక వృద్ధురాలు తనకు ఆస్తిపై సరైన హక్కు లేదన్న అభిప్రాయంతో తక్కువ ధరకు అమ్మింది. కాని ఆమెకు సరైన హక్కు ఉందని కొనుగోలుదారుకు తెలుసు. ఈ కారణంపైన అమ్మకం చెల్లదని తీర్పు చెప్పారు.

ఉదాహరణ 2. ఎల్లార్డ్ వర్సెస్ లాండాఫ్ (లార్డ్)

కిరాయిదారు లీజును కొనసాగించే హక్కు పొందాడు. అందుకు గాను పాత లీజు పత్రాన్ని ఇచ్చివేయవలసి వచ్చింది. పాత లీజ్ జారీచేసిన వ్యక్తి మరణశయ్య నుంచి ఆ లీజ్ జారీచేసిన విషయం దాచి ఉంచారు.

2. సెక్షన్ 55(5)(6) - ధర చెల్లించడం.

1. కొనుగోలుదారుడు తను కొనుక్కున్న హక్కులన్నీ పూర్తిగా తను మారేదాకా ధరను చెల్లించనవసరం లేదు.

2. ఆస్తిని ఏ బకాయిలు లేకుండా విక్రయించినపుడు కొన్ని బాకీలు తీరలేదని తెలిస్తే ఆ బాకీలు చెల్లించే బాధ్యత కొనుగోలుదారుపై ఉండదు.

3. బకాయిలు వదిలించుకోవడానికి లభించే పరిష్కారాలు.

(i) నిర్దిష్ట పరిహార చట్టం సెక్షన్ 18(సి) కింద అమ్మకందారుడే ఆ బాకీ చెల్లించాలని కోరవచ్చు.

(ii) తానే ఆ బాకీ చెల్లించి ఆ సొమ్మును ఆస్తి ధరలో మినహాయించవచ్చు.

(iii) అమ్మకందారుపై మరో దావా వేసి డబ్బు రాబట్టుకోవచ్చు.

4. సెక్షన్ 55(4)(బి) కింద ఆస్తిపైన బాధ్యత మాత్రమేగాక అమ్మకందారుడికి ఈ సబ్ సెక్షన్ కింద వ్యక్తిగత బాధ్యత కూడా ఉంటుంది. 52 All. 901

## కొనుగోలుదారుల బాధ్యతలు

## II. మార్పిడి తర్వాత

### 1. సెక్షన్ 55(5)(సి) నష్టాలు మొదలైనవి భరించడానికి

1. సబ్ సెక్షన్ 55(1)(సి) కింద కంట్రాక్టుకు కంట్రాక్టు అమలు (ఆస్తి మార్పిడి)కి మధ్య నష్టాన్ని అమ్మకందారు భరించాలి.

2. ఆస్తి మార్పిడి తర్వాత కొనుగోలుదారుడే ఆస్తికి యజమాని అవుతాడు. అతడే నష్టాలను భరించవలసి ఉంటుంది.

3. ఇది ఇంగ్లీషు చట్టం కన్నా భిన్నమయిన పరిస్థితి. ఇంగ్లీషు చట్టం కింద అమ్మకం అంగీకారం వల్ల నష్టాలు విధ్వంసాల బాధ్యతతోపాటు ఆస్తి 'సమతా' సూత్రం కింద బదిలీ అవుతుంది.

4. అమ్మకందారు వృధాకు బాధ్యత వహించవలసి ఉంటుంది. అమ్మకందారు ఆస్తి భీమా చేస్తే నష్టాన్ని భర్తీ చేసేందుకు భీమా సొమ్ము కోరాలని వత్తిడి చేయవచ్చు.

## 2. సెక్షన్ 55(5)(డి) - పాత బాకీల చెల్లింపు

1. ఆస్తి మార్పిడికి ముందు ఈ బాధ్యత అమ్మకందారుడిపై పడుతుంది. 55(1)(ఎ) కింద ప్రభుత్వ ఛార్జీలు, వడ్డీ, ఇతర బకాయలు చెల్లించే బాధ్యత కొనుగోలుదారుడిపై పడుతుంది.

2. ఈ బాధ్యత కేవలం ఒప్పందం వల్లనే కాదు చట్టపరమైనది కూడా. కనుక అమ్మకందారు మైనర్ అయినా బాధ్యత ఉంటుంది. **46 Mad. L.J. 464**

1. ఏ బకాయిలు లేకుండా ఆస్తి అమ్మితే, అమ్మకందారు పై బాకీలు తీర్చాలి. బకాయలతో సహా అమ్మితే పై బాకీలు, దానిపై వడ్డీ కూడా కొనుగోలుదారుడు చెల్లించవలసి వస్తుంది. **26 Bom. S.R. 942**

### అమ్మకందారు, కొనుగోలుదారుల హక్కులు

### అమ్మకందారు హక్కులు

**. ఆస్తి మార్పిడికి ముందు**

1. సెక్షన్ 55(4)(ఎ) అద్దె, లాభాలు తీసుకునే హక్కు

1. ఆస్తి మార్పిడి వరకు అమ్మకందారుడే యజమానిగా ఉంటాడు. కనుక అతనికే అద్దె, లాభాలు లభిస్తాయి.

**. ఆస్తి మార్పిడి తర్వాత**

1. సెక్షన్ 55(4)(బి) - చెల్లించని ధరకోసం ఆస్తిపై ఛార్జ్ కల్పించడం.

1. ఆస్తి మార్పు ద్వారా అమ్మకం పూర్తిఅయితే ఆ ఆస్తి ధర పూర్తిగా కానీ, కొంత కానీ చెల్లించకపోతే అమ్మకందారుడికి ఈ సబ్ సెక్షన్ కింద బాకీ ధర కింద ఆ ఆస్తిపైన చార్జ్ సృష్టించవచ్చు.

2. ఈ ఛార్జ్ వల్ల కబ్జా లభించదు. కబ్జాపై హక్కు లభించదు. యాజమాన్యం మారింది కనుక అమ్మకందారు ఆస్తి స్వాధీనం చేయబోననడానికి వీల్లేదు. 30 Mad. 524; 43 Mad. 712; 23 Ban 525; 34 Mad. 543.

3. ఛార్జ్ - ఆస్తిపైనే ఉంది కనుక, పలువురు కొనుగోలుదారులు తమలో తాము కొంత బకాయి చెల్లించేందుకు అంగీకరిస్తే తేడా ఉండదు.

4. చెల్లించని ధర కోసం 'ఛార్జ్' కనుక, ఆ ఛార్జ్ అసలు కొనుగోలుదారుడిపైనే కాక, అతని నుంచి ఆ ఆస్తిని ధర ఇచ్చి కొన్న వ్యక్తి గానీ, ఇంకా కొంత బాకీ ఉందని తెలిసి కూడా కొన్న వ్యక్తి గానీ ఆ ఛార్జ్‌కి బద్ధుడు కావలసి ఉంటుంది.

5. అమ్మకం సొమ్ము బకాయి కోసమే కాక దీనిపై వడ్డీ కోసం కూడా ఛార్జ్ ఉంటుంది.

6. కబ్జా స్వాధీనం చేసిన నాటినుంచి వడ్డీకోసం ఛార్జ్ చేసే హక్కు మొదలవుతుంది. ఛార్జ్ కోసం వడ్డీని కూడా కలిపేందుకు కబ్జా స్వాధీనం చేసేముందున్న పరిస్థితులను న్యాయాన్ని పరిశీలించాలి.

ఉదాహరణ: అమ్మకందారు చెల్లించని బకాయికు భద్రతగా కొంత అమ్మకం ధరను ఇవ్వకుండా కొనుగోలుదారు ఆపితే అందుకు వడ్డీ వసూలు చెయడానికి వీల్లేదు.

7. ఇంగ్లీషు, భారత చట్టాలు

**(i)** ఇంగ్లీషు చట్టం ప్రకారం కంట్రాక్ట్ (అంగీకారం) తేదీ నుంచి అమ్మకందారుడికి లీన్ ఉంటుంది.

**(ii)** ఆస్తి మార్పిడి తేదీ నుంచి భారత చట్టం ప్రకారం ఛార్జ్ మొదలవుతుంది.

**(iii)** ఈ తేడాకు కారణాలు:

- **(a)** ఇంగ్లీషు లాలో అంగీకారం ప్రకారం అమ్మకందారుడు ఆస్తిపై హక్కు కోల్పోతాడు.
- **(b)** ఇండియన్ లాలో ఆస్తి మార్పిడి ద్వారా అమ్మకందారుడు ఆస్తికి దూరమవుతాడు.
- **(c)** ఫలితం ఒక్కటే. రెండు చట్టాల్లోనూ ఆస్తిపై దావా వేయవచ్చు. ఇంగ్లీషు లాలో లీన్ ఉండడమే తేడా. ఈ లీన్ సమతాపరమైంది కనుక సమతనుబట్టి పరిస్థితులను బట్టి

లీన్‌ను మలచుకోవచ్చు. కాని భారత్‌లో చట్టం ప్రకారం కలిగిన ఛార్జ్ చట్ట నిబంధనలకు కచ్చితంగా లోబడి ఉంటుంది.

## కొనుగోలుదారుల హక్కులు

### 1. ఆస్తిమార్పిడికి ముందు

1. సెక్షన్ 55(6)(బి) - ఆస్తి మార్పిడికి ముందు చెల్లించిన అమ్మకం డబ్బు కోసం ఆస్తిపైన ఛార్జ్ కోరేందుకు.

1. ఈ పదాలకు అర్థంలేదు. ఇది రెండు భాగాల్లో ఉంది. ''అతడు అసమంజసంగా ఆస్తి స్వాధీనాన్ని తిరస్కరిస్తే తప్ప'' అనే క్లాజ్‌లో వ్యతిరేకాత్మకంగా గాక ''అతను సమంజసంగా తిరస్కరిస్తే'' అని అనుకూల క్లాజ్ అనుకుంటే రెంటికీ మధ్య తేడా ఉండదు.

2. నిరూపణ భారం ఆధారంగా రెండు భాగాల మధ్య తేడా ఉంటుంది. మొదటి భాగం కింద ''అతను అసమంజసంగా స్వాధీనాన్ని తిరస్కరిస్తే తప్ప'' కొనుగోలుదారుడు కొన్ని హక్కులను అమలు చేయవచ్చు. అంటే స్వాధీనాన్ని అసమంజసంగా తిరస్కరించారని అమ్మకందారుడు రుజువు చేస్తే హక్కులు కోల్పోతారు. రెండో భాగం కింద కొనుగోలుదారు తాను న్యాయంగా స్వాధీనాన్ని తిరస్కరించానని రుజువు చేయగలిగితే, తన నిరూపణ భారాన్ని భరిస్తే అదనపు హక్కులు కోరవచ్చు.

3. ఈ క్లాజు కింద అమ్మకందారుడు మూడు అంశాలలో ఛార్జ్ హక్కు కలుగుతుంది:

(i) సక్రమంగా చెల్లించిన కొనుగోలు సొమ్ముకోసం,

(ii) ఎర్నెస్టు ఏదైనా ఉంటే దానికోసం,

(iii) అతని పక్షాన అవార్డు చేసిన ఖర్చుల కోసం

### 4. చెల్లించిన కొనుగోలు సొమ్ము కోసం ఛార్జి

(1) కొనుగోలు సొమ్ములో కొంత భాగాన్ని చెల్లించిన మరుక్షణం నుంచి ఛార్జ్ అమలులోకి వస్తుంది.

(2) కొనుగోలుదారుడు అసమంజసంగా స్వాధీనాన్ని తిరస్కరించాడని అమ్మకందారు రుజువు

చేస్తే కొనుగోలు సొమ్ము కోసం ఏర్పడిన ఛార్జిని కోల్పోతాడు. అమ్మకందారుపైనే నిరూపణ భారం ఉంటుంది.

## 5) ఎర్నెస్టు మరియు ఖర్చులకోసం ఛార్జి

(1) ఈ రెండింటి కోసం ఛార్జిని కల్పించే అవకాశం ఉంది. కొనుగోలుదారు సమంజసంగానే స్వాధీనాన్ని తిరస్కరించాడని రుజువు చేస్తేనే ఈ అవకాశం ఉంది. నిరూపణ భారం కొనుగోలుదారుడిపై ఉంది.

## 6. ఎర్నెస్టు మరియు కొనుగోలు సొమ్ములో కొంత భాగం కోసం ఛార్జ్

(1) చెల్లించిన సొమ్ము ఎర్నెస్టుగా చెల్లించినప్పుడే ఎర్నెస్టు కోసం ఛార్జ్ వర్తిస్తుందని పైన పేర్కొనడం జరిగింది.

(2) ఆస్తి మార్పిడికి ముందు కొనుగోలుదారు చెల్లించిన సొమ్ము రెండు రకాలుగా ఉపయోగపడుతుంది. (1) కొనుగోలు సొమ్ము కోసం డిపాజిట్ చేసిన ఈ డబ్బు కొనుగోలు సొమ్ములో కొంత భాగానికి పోతుంది.

(2) ఒప్పందం అమలుకు హామీగా పనికివస్తుంది. రెండవ సందర్భంలో ఇది ఎర్నెస్టు కాగా మొదటి సందర్భంలో ఒక్క వాయిదా అవుతుంది.

(3) చెల్లింపు ఒక వాయిదానా లేక ఎర్నెస్టా అనే అంశంపైనే ఛార్జి లేదా వ్యక్తిగత బాధ్యత ఉంటుందా, లేక ఉండదా అనే అంశం ఆధారపడి ఉంటుంది గనుక ఈ తేడా ముఖ్యం.

(i) అది ఎర్నెస్టు అయితే ఛార్జ్ ఏర్పడదు. (కొనుగోలుదారు తాను సమంజసంగానే స్వాధీనాన్ని తిరస్కరించినట్లు రుజువు చేస్తే తప్ప) ఎర్నెస్టు మొత్తంగా పోతుంది. ఛార్జి లేకపోవడమేగాక వ్యక్తిగత బాధ్యత కూడా ఉండదు.

(ii) కొంతసొమ్ము చెల్లింపు ఐతే - కొనుగోలుదారు అసమంజసంగా స్వాధీనాన్ని తిరస్కరించినట్లు అమ్మకందారు రుజువు చేస్తే ఛార్జి ఉంటుంది. కొంత భాగం చెల్లింపు ఎప్పుడూ మొత్తంగా పోదు. ఛార్జి కల్పించలేకపోతే కనీసం అమ్మకందారుపైన వ్యక్తిగత బాధ్యతగానే మిగిలిపోతుంది.

(4) చెల్లింపు ''కొంత భాగమా'' లేక ఎర్నెస్టా అనే విషయం ఒప్పందాన్ని బట్టి ఉద్దేశాన్ని బట్టి ఉంటుంది.

7. కొనుగోలుదారుడి ఛార్జిని అమ్మకందారుడి పైనగాని అతని క్రింది వ్యక్తులపైన గాని ఉమలు చేయవచ్చు.

8. (1) కొనుగోలుదారు ఛార్జిని కోల్పోతాడు.

(i) తన సొంత తదుపరి తప్పిదం వల్ల

(ii) స్వాధీనాన్ని అసమంజసంగా తిరస్కరించడం వల్ల

(2) ఎర్నెస్టు డబ్బు - ఎర్నెస్టులో రెండు రకాల ప్రయోజనాలు ఉన్నాయి.

(i) కొనుగోలు సొమ్ములో కొంత భాగం చెల్లింపు కోసం పోతుంది.

(ii) ఒప్పందం అమలుకు హామీగా పోతుంది. ఒప్పందం నిలబడితే కొనుగోలు సొమ్ములో అది ఒక భాగం చెల్లింపు అవుతుంది. కొనుగోలుదారు వైఫల్యం వల్ల లేదా తప్పు వల్ల ఒప్పందం విఫలమైతే అది జప్తు అవుతుంది.

## II. మార్పిడి తరువాత

1. సెక్షను 55(6)(ఎ) - ఇంక్రిమెంటు కోరేందుకు.

1. ఆస్తి మార్పిడి తరువాత అతను యజమాని కనుక ఇది తప్పకుండా లభ్యం కావాలి.

(పేజీ ఖాళీగా ఉంది. సం.)

## బకాయిలు లేని అమ్మకాలు

1. సాధ్యమైనంత వరకు అమ్మకం బకాయిలు లేకుండా ఉండాలి. బకాయిలు లేని అమ్మకాల కోసం ఆస్తి మార్పిడి చట్టంలో రెండు సెక్షనులున్నాయి. సెక్షను 56, సెక్షను 57 ఉంది.

—

## సెక్షన్ 1

# తనఖా స్వరూపము

### 1. నిర్వచనం

1. సెక్షన్58 తనఖా ఏమిటో నిర్వచిస్తుంది. ఈ సెక్షన్ ప్రకారం తనఖాలో మూడు ముఖ్యాంశాలు.

1) హక్కు బదిలీ

2) నిర్దిష్టమయిన స్థిరాస్తిలో

3) అప్పుగా ఇచ్చిన డబ్బుకు హామీ ఇవ్వడం కోసం

**II. ముఖ్యాంశాల వివరణ:**

(i) నిజానికి స్థిరాస్తి ఉండి తీరాలని లేదు.

(i) ఇంగ్లీషు చట్టంలో అయితే వ్యక్తిగతమయిన, లేదా ఇతర రకాల ఏ ఆస్తినయినా తనఖా పెట్టవచ్చు. భూఆస్తి ఒక్కోసారి భౌతికం కావచ్చు, అభౌతికమూ కావచ్చు. నిజమయిన కబ్జా ఉండవచ్చు లేదా భావనాపరమయిన కబ్జా కావచ్చు. ఆస్తి శాశ్వతం కావచ్చు. లేదా జీవిత కాలానికి పరిమితం కావచ్చు. చట్టపరమయినది కావచ్చు లేదా సమతాపరమయింది కావచ్చు. ఏరకమయిన ఆస్తినయినా తనఖా చేయవచ్చు. అంతేకాదు ఆస్తిలో ఏరకమైన హక్కునైనా సరే తనఖా పెట్టవచ్చు ఆ హక్కు అప్పుడే ఉన్నా, మున్ముందు రానున్నా, లేదా సదయినా జరిగితే వచ్చేదయినా సరే తనఖాకు అర్హమయిందే.

(2) తనఖాకు సంబంధించినంతవరకు ఆస్తి మార్పిడి చట్టం స్థిరాస్తి గురించి మాత్రమే ప్రస్తావిస్తుంది. అంటే చరాస్తి తనఖాను ఈ చట్టం గుర్తించబోదనే అభిప్రాయం కలుగుతుంది. అట్లా అనుకుంటే పొరబాటు. ఆస్తి మార్పిడి చట్టం కేవలం ఆస్తికి సంబంధించిన శాసనాన్ని నిర్వచించి, సవరించింది. చట్టాని అది మరింత పటిష్టం చేయలేదు. కనుక తనఖాకు సంబంధించి ఈ చట్టం పూర్తి వివరాలను ఇవ్వజాలదు.

3) చరాస్తి తనఖాను ఈ దేశం గుర్తించింది.

**9C, W.N. 14 C 8 Bom. S.R. 344**

4) చరాస్తి తనఖా గురించి చట్టం.

ఆస్తి మార్పిడి చట్టంలో దీని గురించి లేదు. ఇండియన్ కాంట్రాక్ట్ ఆక్ట్ (భారత ఒప్పందాల చట్టం)లో లేదు. కనుక ఇంగ్లీష్ 'లా' నియమాలే వర్తిస్తాయి. **34 Cal. 223 (228); 27(Bom) S.R. 1449**

5) చరాస్తి తనఖా వ్రాతపూర్వక పత్రం లేకుండానే జరపవచ్చు.

6) ఆస్తి మార్పిడి చట్టం సెక్షన్ 130 ప్రకారం సాధించగల హక్కు (ఆక్షనబుల్‌క్లెయిమ్) చరాస్తి కింద లెక్క. అయినా ఈ హక్కును తనఖా పెట్టడానికి రాతపూర్వక పత్రం అవసరం. **37 Bom. 198(P.C.)** ఉదా. భీమా పాలసీ డిపిజిట్ చేయడం.

(ii) ఒక ప్రయోజనం (హక్కు) బదిలీ చేయడం.

1) ఆస్తికి సంబంధించి తనఖా కర్తకున్న ఒక హక్కు (ప్రయోజనం) అని కూడా అర్థం.

2) ఆస్తి యాజమాన్యం అనేది వివిధ హక్కుల సముదాయం. అంటే కబ్జా హక్కు, అమ్మే హక్కు, అనుభవించే హక్కు వగైరా.

3) వీటిలో ఒక హక్కును బదిలీచేస్తే చాలు. అట్లా బదిలీ చేయగల హక్కులు ఎన్నో-

(i) అది అమ్మేహక్కు కావచ్చు.

(ii) అనుభవించే హక్కు కావచ్చు.

(iii) యాజమాన్యం పొందే హక్కు కావచ్చు

4) ఏదో హక్కు బదిలీ చేసినంతసేపు ఆ హక్కు ఎటువంటిది? అనే ప్రశ్న తలెత్తదు.

### III. లక్ష్యం అప్పుడు హామీ ఇవ్వడం కావాలి.

1) హక్కు బదిలీ హామీ కోసమే ఉండాలి. హామీ లేదా భద్రతలో రెండు అంశాలున్నాయి. ఒకటి అప్పు లేదా ధనసంబంధమయిన బాధ్యత ఏదయినా. రెండు - ఆ బాధ్యత తీర్చేందుకు ఆస్తిని తాకట్టు పెట్టడం.

2) అప్పు తిరిగి చెల్లించడాన్ని హామీ ఇచ్చేందుకు బదిలీ. ఒక అప్పుకు హామీ ఇవ్వడం కోసం హక్కు బదిలీ చేయడం, తీసుకున్న అప్పు తీర్చడానికి హక్కు బదిలీ చేయడం లేదు అని గమనించాలి.

**25 All. 115 = 30 I.A. 54 11. Bom. 462**

3. బదిలీచేసిన హక్కు - అప్పు తీర్చగలదై ఉండాలి. ఈ బదిలీ అప్పును తుడిచివేయదు. ఒకవేళ అప్పును తుడిచివేయడమే బదిలీ లక్ష్యమయితే అది తాకట్టు కాజాలదు.

ఉదాహరణ: 11 Bom. 462 అబ్దుల్ భాయ్ Vs. కాశీ

రూ. 150 అప్పుకుగాను 1862లో రాము ఒక అప్పు పత్రాన్ని భీముకు ఇచ్చాడు. రాముకు చెందిన భూమిని 20 సంవత్సరాల పాటు భీము అనుభవించవచ్చునని, ఆ తర్వాత భీము ఆ భూమిని రాముకు ఏ బాకీ ( అప్పు, వడ్డీ) అడగకుండా ఇచ్చివేయాలని రుజువయింది.

ఇది తనఖా కాదని తీర్పు ఇచ్చారు.

## ఇతర బదిలీలతో తనఖా పోలిక

### తనఖా - అమ్మకం

1. సెక్షన్ 54లో అమ్మకాన్ని నిర్వచించారు. ఒకే 'ధర' యాజమాన్యాన్ని బదిలీ చేయడాన్ని 'అమ్మకం' అంటారు. ఆ 'ధర' అప్పు కాదు. బదిలీ ఒకానొక హక్కు బదిలీ కాదు. అది శాశ్వతమయిన యాజమాన్య బదిలీ.

2. తనఖాలో చెల్లించిన డబ్బు అప్పు. బదిలీ - ఒకే హక్కు బదిలీ మాత్రమే.

3. అమ్మకం ఒప్పందం ఉల్లంఘనలో కొనుగోలుదారుడి, అమ్మకందారుడి హక్కులు ఉంటాయి. తనఖా ఒప్పందంలో తనఖాకర్త, స్వీకర్త హక్కులు ఉంటాయి.

4. అమ్మకంలో ఆస్తి పూర్తిగా మార్పిడి చెందుతుంది. తనఖాలో కేవలం అప్పు తీర్చడానికి హామీ మాత్రమే.

## తనఖా ఇతర సెక్యూరిటీలు

సెక్యూరిటీలు నాలుగురకాలు. (1) తనఖా (2) తాకట్టు (3) లీన్ (4) గిరవీ పెట్టడం లేదా ఛార్జ్

తనఖా ఇతర సెక్యూరిటీలకు తేడా తెలుసుకోవడం ముఖ్యం.

### 1. తనఖా - తాకట్టు

1. భారత ఒప్పందాల చట్టం సెక్షన్ 172 ప్రకారం అప్పు తీర్చేందుకు, వాగ్దానం నెరవేర్చేందుకు హామీగా ఒక వస్తువును బెయిల్‌మెంట్ ఇవ్వడాన్ని తాకట్టు (ప్లెడ్జ్) అంటారు.

2. తనఖాలో తనఖా స్వీకర్తకు సాధారణ యాజమాన్య హక్కులు బదిలీ అవుతాయి. తనఖాకర్తకు ఆస్తిని విడిపించుకునే 'విముక్తి' హక్కు మాత్రం ఉంటుంది. తాకట్టులో గ్రహీతకు ఒక ప్రత్యేక ఆస్తి అందినా కర్త వద్దనే సాధారణ యాజమాన్యం హక్కులు ఉంటాయి.

3. తాకట్టులో గ్రహీతకు ఆస్తిని స్వాధీనం చేయడం అవసరం. తనఖాలో స్వాధీనం అత్యవసరం కాదు.

4. ఒకసారి తాకట్టు పెట్టిన ఆస్తిని మరోసారి తాకట్టు పెట్టరాదు. ఎందుకంటే రెండో గ్రహీతకు కబ్జా ఇచ్చే వీలుండదు. ఒకరికి తనఖా చేసిన ఆస్తిని తర్వాత మరికొందరికి కూడా తనఖా ఇవ్వవచ్చు.

5. వ్యక్తిగతమయిన ఆస్తిని మాత్రమే తాకట్టు పెట్టవచ్చు. వ్యక్తిగత ఆస్తిని, లేదా భూ ఆస్తిని కూడా తనఖా పెట్టవచ్చు.

## తనఖా- లీన్

1. ఒకే చట్టం క్రియవల్ల లీన్ అనే హామీ ఏర్పడుతుంది. లీన్ చట్టం ఇచ్చిన హక్కు. మరొకరికి చెందిన ఆస్తిపై కొన్ని డిమాండ్లు తీరేవరకు స్వాధీనం కలిగి ఉండే హక్కు ఒప్పందం వల్ల ఏర్పడదు.

2. లీన్‌కు సంబంధించిన అంశాలు అనేక చట్టాల్లో చెల్లాచెదురుగా ఉన్నాయి. కాంట్రాక్ట్ చట్టం 170 - జనరల్ - 171, బాంకర్స్ సొలిసిటర్స్, వగైరా, 221 - ఏజెంట్ల లీన్, వస్తు విక్రయం 47, చెల్లించని అమ్మకందారు లీన్. టి.పి. 554, 55(6) అమ్మకందారు మరియు కొనుగోలుదారు లీన్.

3. లీన్ సాధారణ యాజమాన్యం ఇవ్వదు. తనఖా ఇస్తుంది. తాకట్టులో వలె పరిమితమయిన కబ్జా హక్కు కూడా ఇవ్వదు.

4. తనఖా స్వీకర్త, తాకట్టు గ్రహీత అమ్ముకోగలడు. కాని లీన్ కలిగిన వ్యక్తి ఆ ఆస్తిన అమ్మలేడు.

## తనఖా - ఛార్జ్

1. సెక్షన్ 100లో ఛార్జ్‌ను నిర్వచించారు. ఛార్జ్‌లో రెండు ముఖ్యాంశాలు.

   1) ధన సంబంధమయిన బాధ్యత

   2) ఆ ధన బాధ్యత తీర్చేందుకు స్థిరాస్తి హామీగా చూపడం.

2. తనఖాలో మూడు ముఖ్యాంశాలు

   (i) ధన సంబంధమయిన బాధ్యత

   (ii) ఆ బాధ్యత తీర్చడానికి స్థిరాస్తి హామీ చూపడం,

   (iii) అప్పు ఇచ్చిన వ్యక్తి పేర ఆ ఆస్తిలో ఒకే హక్కును బదిలీ చేయడం.

3. ఛార్జ్‌లో హక్కు బదిలీ ఉండదు. భారం మాత్రమే ఉంటుంది.

**35 Cal. 837 (844); 13 Lah. 660 T.B; 35 Cal. 985**

తనఖాకు, ఛార్జ్‌కు మధ్య తేడా భౌతికమైంది.

1. తనఖా స్వీకర్త తనఖా ఆస్తిని మరెవరి చేతికయినా పంపవచ్చు. కాని ఛార్జ్ మాత్రం స్వీకర్త పైన నోటీసు ఇచ్చి అమలు చేయవచ్చు. **33 Cal. 985.**

## విభిన్న తరహాల తనఖాలు

1. సెక్షన్‌లో ఆరు రకాల తనఖాలున్నాయి.

(i) సాధారణ తనఖా

(ii) విక్రయ షరతుతో కూడిన తనఖా

(iii) ఉపయుక్త తనఖా

(iv) ఇంగ్లీషు తనఖా

(v) సమతా తనఖా

(vi) అనామక తనఖా

2. విభిన్న తనఖాల స్వరూపాలు:

(i) సాధారణ తనఖా

1. సాధారణ తనఖాలో రెండు ముఖ్యాంశాలు.

(i) అప్పు చెల్లించేందుకు ప్రకటిత, అప్రకటిత వ్యక్తిగత బాధ్యత

(ii) ఆస్తిని అమ్మగలిగే హక్కు బదిలీ.

## వ్యక్తిగత బాధ్యత

1. రుణం తీసుకున్నపుడే చెల్లించే వ్యక్తిగత బాధ్యత ఏర్పడుతుంది. ఒకానొక నిధి నుంచి చెల్లించాలని ఒప్పందం ఉంటే తప్ప.

**10 Cal. 740; 22 Cal. 434; 16 Cal 540; 13 Mad. 192; 15 Mad. 304; 27 Mad 526;**

1. అప్పు హామీతో కూడినది లేదా హామీలేనిదే కావచ్చు.

2. హామీలేని ప్రతి అప్పు వ్యక్తిగత బాధ్యతతో కూడుకుని ఉంటుంది. 44. I.A. 87

3. ఒక నిధి నుంచి చెల్లించే ఒప్పందం ఉంటేనే అప్పు చెల్లించేందుకు వ్యక్తిగత బాధ్యత లేదని చెప్పే వీలవుతుంది.

కేసులు: 10 Cal. 740; 22 Cal 434; 16 Cal. 540; 13 Mad. 192; 15 Mad. 304; 27 Mad. 526: 86

4. అప్పు, హామీ కలిగి ఉంటే, వ్యక్తిగత బాధ్యత ఉంటుందా లేదా అనేది అన్వయానికి సంబంధించిన ప్రశ్న.

ఇందులో రెండు న్యాయసూత్రాలున్నాయి.

(i) అప్పు వడ్డీతో సహా చెల్లించడానికి హామీ లభించినంత మాత్రాన వ్యక్తిగత బాధ్యత పోదు.

(ii) హామీలో రూపొందించిన షరతులను బట్టి రుణ స్వీకర్త వ్యక్తిగత బాధ్యత తొలగించవచ్చు.

5. సాధారణ తనఖాలో అప్పుకు హామీ ఉంటుంది. అప్పు హామీతో కూడిన అప్పు. తనఖా కర్త వ్యక్తిగత బాధ్యతను తొలగించే విధంగా హామీ షరతులు ఉండకూడదు. ప్రతి సాధారణ తనఖాలో చెల్లింపుకై వ్యక్తిగత బాధ్యత ఉండడమేకాదు, అది అత్యవసరం కూడా.

కేసులు: 22 All. 453 (461); 29 Mad. 491; 30 All. 388.

6. అటువంటి ఒప్పందం లేకపోతే ఆ హామీ కేవలం 'ఛార్జ్' అవుతుంది.

కేసులు: 42 All. 158 (164) = 461 A. 228; 52 All. 901

II. ఆస్తిని అమ్మించగల హక్కు

i) అమ్మించగల అనే పదాన్ని బట్టి కోర్టు జోక్యంతో అమలుచేయగల సర్వసాధారణ హక్కు.

2. ఈ హక్కు మార్పిడి ప్రకటితం కానీ అప్రకటితం కానీ కావచ్చు.

## షరతుతో కూడిన అమ్మకంతో తనఖా

**1. లక్షణాలు:**

1) అమ్మకంద్వారా బదిలీ అవుతుంది. అది యాజమాన్యం బదిలీ.

2) అమ్మకానికి - షరతుతో కూడిన అమ్మకంతో తనఖాకు మధ్య తేడా - అమ్మకంలో బదిలీ సంపూర్ణంగా ఉంటుంది. ఈ తనఖాలో సంపూర్ణం కాదు షరతుతో కూడినది.

3) ఆ షరతు మూడు రకాల్లో ఉండొచ్చు.

(i) ఒక నిర్ణీత తేదీన తనఖా సొమ్ము చెల్లించకపోతే అమ్మకం సంపూర్ణమవుతుంది.

(ii) ఆ సొమ్ము చెల్లిస్తే ఆ అమ్మకం చెల్లకుండా పోతుంది.

(iii) ఆ సొమ్ము చెల్లించిన మీదట, కొనుగోలుదారుడు ఆస్తిని అమ్మకందారుడుకి బదిలీ చేయవలసి ఉంటుంది.

(2) షరతులతో కూడిన అమ్మకంతో తనఖాకు, తిరిగి కొనే షరతుతో అమ్మకం ఒకేవిధంగా అనిపిస్తాయి. రెండింటిలో ఆస్తి తిరిగి బదిలీ అవుతుంది.

(1) తిరిగి బదిలీ చేసే హక్కు ఇవ్వడానికి విధించే షరతులలో తేడా ఉంది.

(2) తిరిగి కొనే షరతుతో అమ్మకం అయితే:

(i) హక్కు వ్యక్తిగతం, బదిలీ కారాదు.

(ii) తిరిగి కొనే షరతు ద్వారా అన్ని షరతులను ఖచ్చితంగా పాటిస్తే తప్ప హక్కు అమలు చేయడానికి వీల్లేదు.

కేసులు: **10 Cal. 30; 6 All. 37; 21 Bom. 528.**

(3) షరతుల్లో కూడిన విక్రయంలో తనఖా అయితే-

**(i)** పునఃమార్పిడి హక్కు వ్యక్తిగతం కాదు, కాని గ్రహీత దాన్ని అమలుచేయవచ్చు.

**(ii)** కాలం ఈ బదిలీల్లో ముఖ్యమైంది కాదు.

**3.** షరతుతో కూడిన అమ్మకంతో తనఖాకు, మళ్లీకొనే హక్కుతో అమ్మకం మధ్య తేడా ఏమిటి?

**(i)** షరతుతో కూడిన అమ్మకంతో తనఖాలో రూపు ఏదయినా అప్పు ఇవ్వడం, స్వీకరించడ ఉంటుంది. భూమి బదిలీ జరిగినా, అది హామీ రూపంలోనే ఉంటుంది.

(2) తిరిగికొనే షరతుతో అమ్మకంతో అప్పు ఇవ్వడం, తీసుకోవడం ఉండదు. ఇందులో ఒక హక్కు బదిలీ ఉండదు. అన్ని హక్కులూ బదిలీ అవుతాయి. ఈ బదిలీ హామీకోసం కాదు. ఇది సంపూర్ణమయిన బదిలీ కాని తిరిగి కొనే వ్యక్తిగత హక్కు ఉంటుంది.

బదిలీ ప్రక్రియ తనఖా అవునో కాదో తేల్చడానికి పరీక్ష ఏమిటి?

(1) తనఖా రూపొందడానికి ఆ విషయం మాటల్లో చెప్పనవసరంలేదు. అందుకు ప్రత్యేకమయిన ఫారం కూడా లేదు. కొన్ని స్వల్పమయిన మినహాయింపులు తప్ప సాధారణంగా ఆస్తి మార్పిడి - అప్పుల హామీ కోసం ఉద్దేశించినపుడు తనఖా అవుతుంది. ఆవిధంగా ఉద్దేశించకపోతే అది తనఖా కాదు.

(2) బదిలీ ప్రక్రియను వ్యక్తులు ఒప్పందంలో ఇచ్చిన పేర్లు నిర్ణయించవు. వ్యక్తులు తనఖా అని పేర్కొన్నంత మాత్రాన అది అమ్మకం కాదు. 2 Bom. 113

(3) ప్రక్రియ తనఖానా కాదా అనే విషయాన్ని న్యాయ సంబంధాలు నిర్ణయిస్తాయి. 2 Bom. 462

4. వ్యక్తుల ఉద్దేశాలను ఎట్లా కనుగొంటారు?

ఇచ్చిన డబ్బును ఏవిధంగా పరిగణించారు? అనే అంశంపై ఉద్దేశాన్ని నిర్ణయించవచ్చు. డబ్బును అప్పుగా పరిగణిస్తే అది తనఖా. కోర్టుల కొలమానాలు ఇవి

(i) రుణం ఉండడం,

(ii) తిరిగి చెల్లించే కాలం - స్వల్పకాలమయితే అమ్మకం, దీర్ఘమయిన గడువయితే తనఖా

(iii) తనఖా కర్త స్వాధీనంలో ఉండడం తనఖాకు గుర్తు.

(iv) అసలు విలువకన్నా తక్కువ ధర ఉంటే అది తనఖా.

ఈ పరీక్షలను చేయడంలో న్యాయస్థానాలు నిర్వహించే భారాన్ని వ్యక్తులమీద మోపుతాయి. పైకి విక్రయ పత్రం వలె కనిపించేది నిజానికి తనఖా అని ఆరోపించే వ్యక్తి ఆ విషయం నిరూపించాలి. అస్పష్టత ఉంటే తనఖాగానే పరిగణిస్తాయి.

5. ఉద్దేశం గురించి మౌఖిక సాక్ష్యం అనుమతిస్తారా?

1. భారత సాక్ష్య చట్టం రాకముందు ఇటువంటి ఉద్దేశాలు రుజువు చేయడానికి, మౌఖిక సాక్ష్యాలను, ఇతర సాధనాలను విరివిగా అనుమతించేవారు. ప్రివీకౌన్సిల్ ఈ పద్ధతిని వ్యతిరేకించింది.

2. భారత సాక్ష్య చట్టం వచ్చిన తర్వాత సెక్షన్ 92 ఈ అంశాన్ని నిర్దేశిస్తుంది.

3. వ్రాతపూర్వకమయిన ఒక పత్రాన్ని ఖండించడానికి మౌఖిక సాక్ష్యాన్ని అనుమతించరాదని సెక్షన్ 92 చెప్తున్నది. అయితే లింకన్ Vs. రైట్ (1859) 4 De G U.S.16 కేసులో సంపూర్ణ బదిలీగా కనిపించే ఒక విక్రయం నిజానికి తనఖా అని నిరూపించేందుకు వ్యక్తుల చర్యలు, ప్రవర్తన సంబంధించిన సాక్ష్యాలను అనుమతించింది.

4. బాలకిషన్ Vs. లెగ్గీ - 22 All. 149 = 271 I.A: 58 కేసులో 1899లో ప్రీవీకౌన్సిల్ లింకన్ కేసు తీర్పు భారత్‌కు వర్తించదని ఆదేశించింది.

5. ఫలితం ఏమిటంటే న్యాయస్థానాలు వ్యక్తుల ఉద్దేశాలు నిర్ధారించడానికి వారు రూపొందించిన వ్రాత పత్రాలపైనే ఆధారపడాలి. వ్యక్తులు ఏమనుకున్నారనేది ముఖ్యంకాదు. వారు రాసిన పదాల అర్థాలు ఏమిటన్నదే ప్రశ్న.

## ముఖ్యమయిన మినహాయింపు

1. షరతు అదే వ్రాతపత్రంలో ఉండాలి.

## గమనించతగిన అంశాలు

1. వేరే వ్రాతపత్రంలో షరతు ఉన్నట్టయితే కోర్టు ఉద్దేశాన్ని నిర్ధారించే ప్రశ్నను అసలు పరిశీలించడానికి వీలులేదు.

2. అదే వ్రాత పత్రంలో షరతు ఉన్నట్లయితే, అది 'షరతుతో కూడిన అమ్మకంతో తనఖా' కావలసిందే కాని తిరిగి కొనే షరతుతో అమ్మకం మాత్రం కాదు.

3. అన్వయించే ప్రశ్న ఉండే ఉంటుంది.

## III. ఉపయుక్త తనఖా

1. లక్షణాలు:

(i) కబ్జా ఇవ్వడం, లేదా ఇచ్చేందుకు అంగీకరించడం.

(ii) తనఖా సొమ్ము చెల్లించేవరకు ఆస్తి స్వాధీనంలో ఉంచుకునే అధికారం.

(iii) అద్దె, ఇతర లాభాలను తీసుకుని వడ్డీ కిందగానీ, తనఖా సొమ్ము కిందగాని వాడుకునే అధికారం.

గమనిక: చెల్లించేందుకు వ్యక్తిగతమైన బాధ్యత లేదు.

**IV. ఇంగ్లీషు తనఖా.**

1. లక్షణాలు:

(i) నిర్ణీత దినాన డబ్బు తిరిగి చెల్లించేందుకు తనఖాకర్త వ్యక్తిగత బాధ్యత కలిగి ఉండడం.

(ii) తనఖా స్వీకర్త బదిలీ సంపూర్ణంగా ఉండడం

(iii) తిరిగి చెల్లించిన తర్వాత తనఖా స్వీకర్త కబ్జా తిరిగి ఇచ్చివేయాలనే షరతుతో బదిలీ చేయడం.

II. ఇది షరతుతో కూడిన తనఖాను దగ్గరగా పోలి ఉంటుంది.

**భేదాలు**

ఇంగ్లీషు తనఖాలో అమ్మకం సంపూర్ణం, ''షరతుతో కూడిన అమ్మకంతో తనఖా'' లో ''అమ్మకం'' పైన కనిపించేది మాత్రమే.

ప్రశ్న: అమ్మకం 'సంపూర్ణం' అయితే అది తనఖా ఎట్లా అవుతుంది? 'ఒక హక్కు- బదిలీ - తనఖా' అనే నిర్వచనానికి ఇది భిన్నంగా కనిపిస్తున్నది.

ఆచరణలో తేడా ఏమిటంటే: ఇంగ్లీషు తనఖాలో తనఖా స్వీకర్త వెంటనే ఆస్తి కబ్జాకు అర్హులవుతాడు. కాని 'షరతుతో కూడిన విక్రయంలో తనఖా' లో తనఖా అంశాలను బట్టి 'కబ్జా' ఉంటుంది.

(2) ఇంగ్లీషు తనఖాలో, తిరిగి చెల్లించాలన్న వ్యక్తిగత బాధ్యత ఉంటుంది. షరతుతో కూడిన తనఖాలో అటువంటి హక్కు- ఉండదు.

## ఆస్తి పట్టా జమ ద్వారా తనఖా - అవసరాలు

1. అప్పు:

1. మున్ముందు చెల్లించవలసినదే అయినా ఇప్పుడు బాకీ ఉండి, చర్య ద్వారా రాబట్టుకోగల సొమ్మును అప్పు అని నిర్వహించారు. (1922) 2 K.B. 599 (617)

గమనిక: చట్టం ద్వారా బాకీ, లేదా ఒప్పందం ద్వారా బాకీకి మధ్య బేధం తెలియాలంటే - (192
2 K.B. 37. అప్పు చట్టపరమైనదయినపుడు బాకీ వసూలు చేసుకునే శక్తి తిరిగిచెల్లిస్తాననే 'వాగ్దానం' పై
ఆధారపడనవసరం లేదు.

2. అప్పు ఇవ్వడం అప్పు లేదా భవిష్య రుణం కావచ్చు. ఇవ్వడి అప్పు లేదా భవిష్య ఋణ
తీర్చేందుకు ఆస్తి పట్టాల జమ చేయవచ్చు. 50 IA 283; 17 All. 252; 17 All. 252; 25 Cal. 61

3. సాధారణ పట్టికలోని ఒక ఖాతాలో బకాయిపడిన సొమ్ము అప్పు కావచ్చు.

## II. ఆస్తి పట్టాల జమ

1. ఆస్తి పట్టాలు:

1. ఆస్తికి సంబంధించిన వ్రాతపత్రాలు సద్విశ్వాసంగా జమచేస్తే చాలునని ఇంగ్లాండ్‌
నిర్ణయించారు, లేదా పట్టాకు సంబంధించిన కీలకమయిన సాక్ష్యాలు. అంతేకాని అన్ని పట్టాలు జ
చేయవలసిన అవసరం లేదు (1872) 8 Ch. App. 155.

2. ఈ కేసులను భారత్‌లో అనుసరించారు. 59 Cal. 781.

3. కాని పేజి C.F. 11 Rang 239 F.B.

వ్రాత పత్రాలు పట్టాను చూపలేకపోతే తనఖా ఏర్పడదు. పన్ను రసీదు - ప్లాన్ - పట్టా పత్రా
కాజాలవు.

5. పట్టాలు కోల్పోతే, వాటి ప్రతులు జమ చేయవచ్చు.

II. తనఖా కోసం పట్టాలు ఇదివరకే జమచేస్తే మౌఖిక ఒప్పందం ద్వారా మున్ముందు రుణాలక
దాన్ని హామీ చేయవచ్చు. అవి వాపస్ ఇచ్చి మళ్లీ డిపాజిట్ చేయనవసరంలేదు. 17 All. 352; 25 Ca
611.

## II. ఉద్దేశం

1. తీసుకున్న రుణానికి హామీగా ఆస్తి పట్టాలుంటాయనే ఉద్దేశం ఈ ప్రక్రియలో ముఖ్యం.

2. ఆస్తిపట్టాల స్వాధీనం ఎట్లా వచ్చిందో తెలిసే సాక్ష్యం లేకపోతే ఒప్పందం ఉన్నట్లు భావించడ
కష్టం. కనుక కేవలం ఆస్తి పట్టాలు స్వాధీనంలో ఉన్నంత మాత్రాన సరిపోదు.

23 I.A. 106; 38 Bom. 376; I Rang 545.

3. చట్టపరమయిన తనఖా తయారు చేయడానికి కక్షిదారులు తలపెట్టి ఉంటే, అందుకోసమే ఆస్తి పట్టాలు జమచేసి ఉంటే ఆ 'జమ' సమతా తనఖాను సృష్టించబోదు.

4. చట్టపరమయిన తనఖా తయారు చేయాలని వారు తలపెట్టినా, వెనువెంటనే, అప్పుడు హామీ సృష్టించడం వారి లక్ష్యమయితే పట్టాల జమ సమతా తనఖాను సృష్టిస్తుంది.

5. అప్పుతో కూడిన పట్టాల స్వాధీనం ఉంటే తనఖా ఉన్నట్లు భావించి తీరాలి? రెండురకాల అభిప్రాయాలున్నాయి. అప్పు ఇచ్చిన వ్యక్తికి అప్పుతో కూడిన స్వాధీనం ఉన్నపుడు తనఖా భావించడమే మంచిది.

## IV. ప్రాదేశిక పరిమితులు

1. ఇటువంటి తనఖాలు కొన్ని పట్టణాల్లో మాత్రమే రూపొందుతాయి.

2. ఈ పరిమితులు దీనికి సంబంధించినవి అన్నది ప్రశ్న. పత్రాలు ఇవ్వవలసిన ప్రదేశానికి సంబంధించినవా? తనఖా పెట్టిన ఆస్తి ఉన్న ప్రదేశానికి సంబంధించినది కాదా? తనఖా పెట్టిన ఆస్తి ఉన్న ప్రదేశం కాదని, పరిమితి పత్రాలు ఇచ్చిన ప్రదేశానికి సంబంధించి ఉంటుందని తీర్పు చెప్పారు.

కేసులు: **14 All. 238; 23 I.A. 106**

పేర్కొన్న పట్టణాల్లో ఆస్తి ఉండనవసరంలేదు.

## VI. అనామక తనఖాలు

1. పైన పేర్కొన్న పద్ధతుల్లో కాక మరొక తనఖా అయితే దాన్ని అనామక తనఖా అంటారు. పైన పేర్కొన్న అయిదురకాల తనఖాలు కానివి అన్నమాట.

2. అనామక తనఖాలు వివిధ రూపాల్లో ఉంటాయి. ఆచారం వల్లగానీ, రుణదాత అభీష్టం వల్ల కానీ ఏర్పడుతాయి. కొన్ని రెండు మూడు సాధారణ రూపాల కలయిక వల్ల మరికొన్ని ఆయా జిల్లాల్లో ఉన్న ప్రత్యేక పరిస్థితుల వల్ల, స్థానిక వాడుకల్లో ప్రత్యేక అనుబంధాల వల్ల ఏర్పడుతాయి.

## విభిన్న తనఖాల మధ్య తేడా ఏమిటి?

తనఖా తనఖాకు మధ్య తేడా - బదిలీ అయిన హక్కు లక్షణమే.

1. సాధారణ తనఖాలో - అమ్మకం హక్కు బదిలీ అవుతుంది. యాజమాన్యపు సమగ్ర హక్కు కలిగించే హక్కుల్లో అమ్మకం హక్కు ముఖ్యమయింది.

2. ఉపయుక్త తనఖాలో బదిలీ అయింది ఆస్తి స్వాధీన ఫలాల అనుభవ హక్కులు.

3. షరతుతో కూడిన తనఖా, ఇంగ్లీషు తనఖాతో షరతుతో కూడిన యాజమాన్య హక్కు బదిలీ ఉంది.

4. సాధారణ తనఖా, ఇంగ్లీషు తనఖాలో అప్పు చెల్లించే వ్యక్తిగత బాధ్యత ఉంటుంది.

5. ఉపయుక్త తనఖాలో, షరతుతో కూడిన అమ్మకంతో తనఖాలో అప్పు చెల్లించే 'వ్యక్తిగత' బాధ్యత ఉండదు.

## అన్ని తనఖాల్లో కనిపించే సామ్యత ఏమిటి?

1. అప్పు తిరిగి చెల్లించేందుకు హామీగా నిర్దిష్టమయిన స్థిరాస్తిలో ఒక హక్కును బదిలీ చేయడం.

2. కనుక అప్పు ఉండడం అనేది అన్ని తనఖాల అత్యవసర లక్షణం.

3. షరతుతో తనఖా, ఉపయుక్త తనఖాలో చెల్లించే వ్యక్తిగత బాధ్యత లేదు కనుక ఈ విధంగా ఉండదని చెప్పబడింది.

4. దీనికి జవాబు ఏమిటంటే అప్పు - అప్పుగా ఉండకుండా పోదు. అప్పు వసూలు చర్యకు జవాబు మాత్రం ఉండదు. అప్పు కోసం ప్రక్రియగా ఆ ప్రక్రియ ఉండినపుడు అప్పు వసూలు చర్యకు అనేక పరిహారాలుంటాయి.

భూమిని సాధారణ తనఖా చేస్తే రెండు విభిన్న దృక్పథాల్లో చూడవచ్చు.

1) ఇది రుణగ్రహీత తిరిగి చెల్లిస్తానని వాగ్దానంగా పరిగణించవచ్చు. వ్యక్తిగత బాధ్యత సృష్టించే ఒప్పందం అన్నమాట.

2) తనఖా పెట్టిన ఆస్తిలో నిజమయిన ఒక హక్కును మార్చుతుంది కనుక ఇది ఆస్తి మార్పిడి కూడా.

ఈ ద్వంద్వ లక్షణాల వల్ల అనేక ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి.

ప్రశ్న-I: విదేశాల్లో ఉన్న భూమిని తనఖా పెడితే ఏ చట్టం వర్తిస్తుంది.

సిటస్ (Situs) చట్టం వర్తిస్తుందని తీర్మానించబడింది. నిజమయిన బదిలీకి, కేవలం నిర్వాహక ఒప్పందానికి మధ్య తేడాను గుర్తించలేదు.

ప్రశ్న-II: హామీతో కూడిన అప్పుకు 'సిటస్' ఏమిటి? రుణగ్రహీత నివసించే దేశంలో రుణం ఏర్పడినట్లు భావించాలా లేక హామీగా ఇచ్చిన భూమి ఎక్కడ ఉందో అదా?

ప్రీవీకౌన్సిల్ ఈవిధంగా చెప్పింది. ''ఋణగ్రహీత వ్యక్తిగత బాధ్యతతో కూడిన రుణం, హామీతో కూడిన రుణం ఒక స్థాయిలో ఉన్నాయని భావించడం మంచిది.

## III

## సక్రమ తనఖాకు కావలసినవి

ఈ కింది అంశాల పరిశీలన అవసరం

1. తనఖా సృష్టించడానికి కావలసిన లాంఛనాలు
2. తనఖా చేయతగిన ఆస్తి వివరాలు
3. తనఖా పెట్టడానికి, స్వీకరించడానికి సామర్థ్యం
4. తనఖా పత్రంలో అంశాలు

I. తనఖా రూపొందించే లాంఛనాలు

సెక్షన్ 59

1. ఆస్తి పట్టాలు జమ చేయడం ద్వారా తనఖా పెట్టే సందర్భంలో తప్ప రూ. 100 లేక ఎక్కువ అప్పు మొత్తానికి హామీగా తనఖాను బి.పి. ఆక్ట్ (ఆస్తి మార్పిడి చట్టం) కింద రిజిస్టర్డ్ డాక్యుమెంట్ ద్వారా అమలులోకి తేవాలి. ఈ పత్రంపై తనఖాకర్త, కనీసం ఇద్దరు సాక్షులు సంతకం చేయాలి.

2. అసలు బాకీ రూ. 100 కన్న తక్కువ అయినప్పుడు అటువంటి పత్రం ద్వారాగానీ, సాధారణ తనఖా అయితే తనఖా పెట్టే ఆస్తిని స్వాధీనం చేయడం ద్వారాగానీ తనఖా అమలు చేయవచ్చు.

3. అసలు బాకీ రూ. 100 అయితే, తనఖా రాతపూర్వకంగా ఉండాలి. అంటే ఒక పత్రం ద్వారా అన్నమాట. ఆ పత్రంపై

(1) తనఖాకర్త సంతకం చేయాలి

(2) ఇరువురు సాక్షులు సంతకం చేయాలి

(3) రిజిస్టర్ చేయాలి.

4. రూ. 100 కన్నా తక్కువ అయితే వ్రాతపత్రం అవసరం లేదు. ఈ కింది తనఖాల్లో మౌఖి ఒప్పందం చాలు

(1) సాధారణ తనఖా

(2) షరతులో తనఖా

(3) ఇంగ్లీషు తనఖా

(4) ఉపయుక్త తనఖా

5. నూరు రూపాయలపైన అసలు ఉన్నపుడు తనఖాలనే పరిశీలించవలసి ఉంది.

(1) సంతకం

జనరల్ క్లాజేస్ ఆక్ట్, 1897 సెక్షన్ 3(52) (సాధారణ అంశాల చట్టం)

1. టైప్‌ల ద్వారా గానీ, ఫాసీమైల్ ద్వారా గానీ సంతకం చేయవచ్చు. **25 Cal. 911** నౌకరు వా పేరు స్టాంపు (ముద్ర)ను ఆ వ్యక్తి కలిగి ఉండాలి.

2. నిరక్షరాస్యుని గుర్తు కూడా కావచ్చు.

**41 Bom. 384** కత్తి గుర్తు

3. అక్షరాస్యుడు గుర్తుద్వారా సంతకం చేసే వీలులేదు. నిందితుడు అక్షరాస్యుడు కనుక నే అంగీకార పత్రంపై సంతకం చేయనట్టే. **32 Cal. 550**

ఎవరయినా వ్యక్తి సంతకం చేయలేకపోతే గుర్తువేసినా సంతకం అవుతుంది.

## 2. సాక్షి సంతకం

1. సాక్షి సంతకం (అటెస్టేషన్) అంటే సాక్షిగా నిలబడడం, పత్రంలోది నిజం అని చెప్పడ ధ్రువీకరించడం. ఒక పత్రం రూపొందించి అన్ని పరిశీలించి ధ్రువీకరించడం. సాక్షుల సమక్షం

సంతకం చేయడం. తాను పరిశీలించినట్లు తెలిసేవిధంగా సంతకం చేసే వ్యక్తిని అటెస్టింగ్ సాక్షి అంటారు.

2. అట్లా అయితే పత్రం రూపొందే సమయంలో అటెస్టింగ్ సాక్షి అక్కడ ఉండాలా? తనఖాకర్త పత్రం అమలు చేశానని ఆ తర్వాత చెప్తే సాక్షి ఆ పత్రం మీద సంతకం చేస్తే 'అటెస్టేషన్' జరిగినట్టేనా?

3. పత్రం రూపొందినట్లు ఆ తర్వాత గుర్తిస్తే సరిపోదని, పత్రం రూపొందే సమయంలో అటెస్టింగ్ సాక్షి ఉండి తీరాలని ప్రివీ కౌన్సిల్ తీర్పు చెప్పింది.

39 IA 218; 35 Mad. 607లో అలహాబాదు బొంబాయి కోర్టులు ఇచ్చిన వ్యతిరేక తీర్పులను చెల్లవని తీర్మానించారు. **27 Bom 91**, మరియు **26 All 69.**

పరదా స్త్రీల అటెస్టేషన్

4. ఇదే నియమం వర్తిస్తుంది. సాక్షి ముందు పరదా స్త్రీ సంతకం చేయాలి లేకపోతే అతను అటెస్టింగ్ సాక్షి కాజాలడు.

## కేసులా: 45 I.A. 94

నూరు రూపాయలకు మించిన సొమ్ముకు తనఖా పత్రంపై మైనర్ తరపున పరదా స్త్రీ సంతకం చేశారు. ఇద్దరు సాక్షి సంతకం చేశారు. ఆమె సంతకం కోసం పత్రాన్ని ఆమె దగ్గరకు తీసుకు వెళ్ళినపుడు ఆమె పరదా వెనకనున్నట్టు సాక్ష్యం వచ్చింది. ఆమె సంతకాన్ని చేయడాన్ని సాక్షి చూడలేదు. ఆమె కొడుకు పరదా వెనుకనుంచి వచ్చి తన తల్లి సంతకం చేసిందని చెప్పాడు. ఆ తర్వాత వారు సంతకాలు చేశారు. సెక్షన్ 59 టి.పి. చట్టం ప్రకారం ''అటెస్టేషన్'' జరగలేదని తీర్పు చెప్పారు.

## 42 I.A. 163.

ఇరువురు పరదా స్త్రీలు తనఖా పత్రం అమలు చేశారు. ఆ స్త్రీల చేతులను సంతకం చేస్తుండగా చూసినట్టు అటెస్టేషన్ సాక్షులు సాక్ష్యం చెప్పారు. అప్పుడు వారి ముఖాలను వారు చూడలేదు. అయినా ఆ స్త్రీల మాటలు వినడం ద్వారా సంతకం చేసింది వారేనని ధృవపరుచుకున్నట్టు సాక్షులు చెప్పారు. టి.పి ఆక్ట్ ప్రకారం అటెస్టేషన్ జరిగిందని తీర్పు చెప్పారు.

5. ఇప్పుడు చట్టం మారింది పత్రం అమలు చేసిన వ్యక్తి సంతకం సక్రమమేనని గుర్తించే పధంగా అటెస్టేషన్ చేస్తే చాలు. 1926లో సవరించిన టిపి చట్టం సెక్షన్ 3 చూడండి.

## (3) రిజిస్టర్డ్

(పేజీ ఖాళీగా వదిలారు -సం)

(ఇంతకుముందు భాగం దొరకలేదు -సం) వెంటనే అమలు చేయడానికి, సాధారణంగా స్వాధీనం చేయడం గానీ, అమలు చేసిన వ్యక్తి స్వాధీనం నుంచి పత్రం బయటికి పోవడం గానీ అవసరం లేదు.

ఉదాహరణ: ఎక్స్‌టన్ Vs స్కాట్ (1833) 6 సైమన్స్ 31

ఇతర వ్యక్తికి చెందిన డబ్బు స్వీకరించిన మరొక వ్యక్తి అతని పేర తనఖా అమలు చేశాడు. తనఖాకర్త తన వద్దనే తనఖా పత్రం ఉంచుకుని కొన్నేళ్ళ తర్వాత మరణించాడు. తర్వాత అతని ఆస్తి పట్టాలతో పాటు తనఖా పత్రం కూడా దొరికింది. పత్రం ఇవ్వలేదు కనుక తనఖా వర్తించదని వాదించారు. పత్రం రూపొందిన మరుక్షణం నుంచి తనఖా అమలులోకి రాకుండా నిరోధించే ఉద్దేశం ఉన్నట్టు సాక్ష్యాలు లేవు.

6. మరో పార్టీకి తనఖా పత్రం ఇచ్చారంటే అది వెనువెంటనే అమలవుతుందని, అది మరింత ఆలస్యం కారాదని అర్థం. కాని తనఖా పత్రం స్వాధీనపరచిన లక్షణాన్ని వివరిం సాక్ష్యం అనుమతించవచ్చునని తీర్మానించారు.

7. ఒక పత్రం వెంటనే అమలు కాదని, బేషరతు పాటించిన తర్వాతనే అమలవుతుందని నిర్దేశిస్తే దాన్ని ఎస్‌క్రో (Escrow) అంటారు- అంటే ముందస్తు షరతు పాటిస్తేనే అమలయ్యే చిత్తుప్రతి అన్నమాట.

8. తనఖా పత్రం ఒక్కటి రూపొందిస్తే చాలదు. దానిని వెంటనే అమలు చేయాలన్న ఉద్దేశం ఉండాలి. స్వాధీనం చేయడం అంటే వెనువెంటనే అమలు చేయాలనే ఉద్దేశం ఉన్నట్టు స్వాధీనంతో సంబంధం లేకుండా ఉద్దేశం విడిగా ఉండవచ్చు.

9. ఒకరు లేదా కొందరి చేత తనఖా పత్రం అమలుచేయించదలచుకుంటే, ఇతరులు దాన్ని పూర్తి చేయటానికి నిరాకరించినప్పుడు, ఆ సంఘటన వివరాలు పరిశీలించి తనఖా పత్రం రూపొందించిన వారిపైన అది అమలు అవుతుందా లేదా ఆధారపడి ఉంటుంది.

## పత్రంలో కీలకమయిన మార్పులు- దాని ప్రభావం

1. తనఖాకర్త అనుమతి లేకుండా తనఖాపత్రంలో ఆ తనఖా పత్రంపై ఆధారపడిన వ్యక్తికి తెలిసి లేదా అతని సంబంధంతో కీలకమయిన మార్పులు సాగిస్తే పత్రం అమలు యోగ్యం కాకుండా పోతుంది.

2. పత్రంలో కొన్ని ఖాళీలు మామూలు విషయాలతో నింపవలసి ఉంటే తనఖా స్వీకర్త-హక్కులకు భంగం కలగకుండా వాటిని నింపవచ్చు.

3. ఏది కీలకమయిన మార్పు అనే ప్రశ్నపై భిన్నాభి ప్రాయాలు వ్యక్తమైనాయి.

**10 CWN 788** (ముఖర్జీ న్యాయమూర్తి)

తనఖా పత్రంలో సహజంగా చెప్పదలచుకున్న అంశాలకు భిన్నంగా, భన్నమయిన భాషలో చేప్పేవిధంగా మార్పులు జరిపితే, ఆ పత్రం చట్టపరమయిన లక్షణాలను గుర్తింపును సంతరించుకుంటే అది కీలకమైన మార్పు అవుతుంది. ఆ మార్పులకు అంగీకరించిన పార్టీల దృష్టిలో ఆ మార్పులు పత్రాన్ని నిరుపయోగం చేస్తాయి.

ఒప్పందంలో మరొక వ్యక్తిని పార్టీగా చేర్చడం కీలకమయిన మార్పు అవుతుంది.

## మూడు లాంఛనాల ప్రాధాన్యం:

1. ప్రక్రియ చట్ట బద్ధత - మూడింటిలో ఏ లాంఛనం పూర్తికాకపోయినా దెబ్బ తింటుంది. కేవలం అనే పదం ఉంది.

2. లాంఛనాలు ఉండడం మాత్రమే కాదు. చట్ట ప్రకారం ఆ లాంఛనాలు చెల్లుబాటు కావాలి.

3. సంతకం ఉంటే సరిపోదు. అది సక్రమమయిన సంతకం కాదు.

4. అటెస్టేషన్ ఉండడం ఒక్కటే కాదు. అది సక్రమంగా ఉండాలి. అటెస్టేషన్ చెల్లకపోతే పత్రం తనఖాగా ఉపయోగపడదు. తనఖా రూపొందించిన వ్యక్తి లేకుండా, ఆయన గుర్తింపు లేకుండా అటెస్టేషన్ చెల్లదు.

5. రిజిస్ట్రేషన్ ఉండడమే కాదు. ఆ రిజిస్ట్రేషన్ చెల్లుబాటు అయ్యేదిగా ఉండాలి. కనుక

**(i)** ఆస్తిని ఎంత తప్పుగా వివరించారంటే అసలు ఆస్తిని గుర్తించడం సాధ్యమే కాదు. -18 **Cal. 556/4. B.**

**(ii)** సర్కిల్ పరిధిలో ఆస్తి లేకపోయినా ఆ సర్కిల్‌లో రిజిస్ట్రేషన్ చేయించడం. **-29 Cal. 654.**

**(iii)** తనఖా పత్రాన్ని రిజిస్ట్రేషన్‌కు సక్రమమయిన వ్యక్తి ద్వారా సమర్పించకపోతే తనఖా చెల్లదు. **58 I.A. 58**

లాంఛనాలకు సంబంధించినంత వరకు మరో రెండు ప్రశ్నలు పరిశీలించవలసి ఉంది.

## 1. తనఖా అమలుకావడానికి పత్రం తయారీ చాలా?

1. తనఖా పత్రం వర్తించే ఒప్పందంగా అమలు కావాలని అనుకోకపోతే పత్రం తయారుచేయడం మాత్రమే సరిపోదని చెప్పనవసరం లేదు.

2. తనఖా పత్రం స్వాధీనం చేయాలి అనే సూత్రం ద్వారా ఈ విషయాన్ని ఇంగ్లీషు చట్టం వివరించింది.

3. 'స్వాధీనం చేయడం' అంటే ఏమిటో అర్థం కాకపోతే ఈ విషయం స్పష్టంగా ఉండదు. తనఖా పత్రం స్వాధీనంలో పెద్ద విశేషమేమీ లేదు- అదో సాంకేతిక అవసరం కూడా. వెనువెంటనే పత్రం అమలులోకి వచ్చిందనడానికి ఇదొక సూచన మాత్రమే.

4. మంచి పత్రం లక్షణం దాన్ని స్వాధీనం చేయడమే అని టచ్‌స్టోన్‌లో షెఫర్డ్ 'స్వాధీనం' గురించి వివరించారు. న్యాయ సలహాదారులకు ఇదొక పరిశీలనాంశం.

## న్యాయస్థానాల తీర్పులు

### 1. సెక్రెటరీ ఆఫ్ స్టేట్‌పై దావా.

(1906) 1. K.B. 613; 5 Luc. 157; 37 Mad. 55.

### II: చక్రవర్తి స్థితి:

**1920 AC 508, 1932 A.C 28; 1929 A.C. 285; 8 App. Cases 767; 8 M.I.A 500; 1903 App. Cases 501.**

### III. అత్యంత ప్రాధాన్యత:

**(1792) 2 Ves 60; 13 M.P.C. C.22; (1906) 1 KB 613**

బ్రిటిష్ ఇండియా: సెక్షన్ 3 (17) జనరల్ క్లాజెస్ చట్టం, 1897 బ్రిటిష్ ఇండియా మొత్తం అంటే షెడ్యూల్డు జిల్లాలు చేరి ఉంటాయి **52 Mad.1**

అదనంగా సేకరించిన భూభాగం బ్రిటిష్ ఇండియాలో భాగమవుతుంది. ఆన్‌స్లే Vs ప్లోడెన్ (1856-59) 1 Bom. 145.

చక్రవర్తి గానీ శాసన వ్యవస్థగానీ మార్చే వరకు ఆ చట్టాలను అవిధంగానే ఉంచుతారు. 19 Bom. 680 (486) (1. M.I.A. 175/271 అనుసరించి)

స్టాంప్స్ ఆక్ట్ వంటి చట్టాలు ఇండియన్ శాసనసభ ఆమోదించినవి బ్రిటీష్ ఇండియా బయట ఉండి కూడా బ్రిటీష్ పాలనలోనే ఉన్న ప్రాంతాలకు వర్తించకుండా మినహాయించారు. (ఉదా: బెంగుళూరు, హైదరాబాద్, కేటాయించిన జిల్లాలు. బరోడా కంటోన్మెంట్; మౌంట్ అబూ మొదలైనవి)

ఫారిన్ జూరిస్‌డిక్షన్ మరియు ఎక్స్‌ట్రాడిషన్ చట్టం 1879, ఇండియన్ (ఫారిన్ జూరిస్‌డిక్షన్) ఆర్డర్ ఇన్ కౌన్సిల్, 1902 కింద నోటిఫికేషన్ ద్వారా మినహాయించారు.

## తనఖా ఇచ్చే, తీసుకునే సామర్థ్యం

1. తనఖా అనేది ఆస్తి బదిలీ మాత్రమే కాకుండా ఒప్పందం కూడా. కనుక సక్రమమయిన ఆస్తి బదిలీకి సక్రమమయిన ఒప్పందానికి సంబంధించిన అర్హతా సూత్రాలు పాటించవలసి ఉంటుంది.

## సక్రమమయిన ఆస్తి బదిలీ సమర్థతకు కావలసినవి

1. ఆస్తి బదిలీ అంటే- సజీవుడైన ఒక వ్యక్తి మరొక లేదా మరికొందరు సజీవులయిన వ్యక్తులకు లేదా తనకు లేదా తనకు మరియు ఒకరు లేక మరికొందరు సజీవులకు ఆస్తిని మార్చడం - సెక్షన్ 5.

2. తనఖా ఒక ఆస్తి బదిలీయే కనుక పార్టీలు ఇరువురూ సజీవులై ఉండాలి.

3. ఇరువురూ సజీవులై ఉండాలని పేర్కొన్నారంటే రెండు తేడాలను దృష్టిలో ఉంచుకున్నారన్నమాట.

(i) సజీవుల మధ్య బదిలీ మరియు వీలునామాకు మధ్య

(ii) బదిలీకి, ప్రయోజనం సృష్టించడానికి మధ్య (సెక్షన్లు 13, 14, 16, 20)

4. వీలునామా- రాసిన వ్యక్తి మరణం నుంచి అమలవుతుంది. కనుక వీలునామా ద్వారా తనఖా సృష్టించడానికి వీలులేదు. ఇరువురు సజీవుల మధ్యనే తనఖా ఏర్పడుతుంది.

5. తనఖా అనేది ఒక హక్కును బదిలీ చేయడం. సెక్షన్లు 13, 14, 16, 20 బదిలీ చేదీన మనుగడలో లేని ఒక వ్యక్తి పేర హక్కును సృష్టించవచ్చునని చెప్తున్నాయి. కాని తనఖా ఒక హక్కును బదలాయించడమే గానీ సృష్టించడం కాదు.

## సజీవుడు

1. సజీవుడు అనే పదానికి అర్థం ఏమిటి? సహజ మరణం చెందని వాడని అర్థమా? లేక సివిల్ మరణం పొందనివాడనా? సహజ మరణం లేకపోయినా సివిల్ మరణం ఉండవచ్చు.

ఉదాహరణ: సన్యాసి-బౌద్ధమత అవలంబకుడు.

ఒక వ్యక్తి మతపరంగా అన్ని భౌతిక విషయాలను సన్యసిస్తే అది సివిల్ (పౌర) మరణానికి దారితీస్తుంది.

ఉదాహరణ: సన్యాసి - ముల్లా **P. 113**

బౌద్ధ మత గురువు - **7 Rang 677 1B.**

2. పౌర మరణం పొందిన వ్యక్తి టి.పి. ఆక్ట్ కొరకు మృతుడు కాబోడు.

3. సెక్షన్ 299 I.P.C వివరణ-3 ప్రకారం 'సజీవుడు' అన్న పదం నిర్వచనం ఇది. శరీరంలో ఏదో ఒక భాగం బయటకు వచ్చి ఉంటే సజీవుడని అర్థం. హిందూ చట్ట ప్రకారం కడుపులో ఉన్న కొడుకు పుట్టిన కొడుకుతో సమానం. ముల్లా పేజి 319. అంటే హిందూ చట్టం కింద సజీవుడుగా మరణించే వ్యక్తి టిపి ఆక్ట్ కింద చనిపోయిన వాడి కింద లెక్క.

**16 Mad. 76; 37 All 162; 58 Mad. 886**

4. ఇటువంటి సందర్భంలోనే మరో వ్యక్తి- ఖైదీ. ఇంగ్లీషు లా ప్రకారం ఖైదీ ఒప్పందం కుదుర్చుకోరాదు. ఆస్తి అమ్మరాదు. కనుక తనఖా పెట్టి అప్పు ఇవ్వరాదు. తీసుకోరాదు. అయితే ఖైదీకి చెందిన ఆస్తిలో భాగాన్ని ఖైదీ ఆస్తుల పాలకుడు (అడ్మినిస్ట్రేటర్) తనఖా పెట్టవచ్చు.

ఫర్ ఫీచర్ ఆక్ట్ (స్వాధీన చట్టం) కింద ఖైదీని నిర్వచించారు. 33, 34 **Vict. Ch.23 1870;** ఇంగ్లాండ్, వేల్స్, ఐర్లాండ్‌లలో దేశద్రోహం, తదితర తీవ్ర నేరాలకు గాను సక్రమ విచారణ పరిధి గల కోర్టు చేత మరణశిక్ష లేదా యావజ్జీవ ఖైదు తీర్పు చెప్పబడిన లేదా గుర్తించబడిన వ్యక్తి అని అర్థం.

5. ఖైదీకి భారతదేశంలో ఉన్న స్థితి ఏమిటి?

★ (వ్రాత ప్రతిలో ఈ పేజీ ఖాళీగానే వదిలేశారు. - సం)

---

★ ఇంగ్లీషు చట్టం ప్రకారం కూడా గర్భస్థ శిశువు సజీవుడే. 58 Mad. 886 కింద కేసులు సూచించారు.

(1903) 2 Ch. 411 (1909) 1 K.B. 178 (1907) 2 K.B. 422

(1926) L.I.K.B. 250 Cantra. 10 Lah. 713

## వ్యక్తి

1. వ్యక్తి అనే పదానికి జనరల్ క్లాజేస్ ఆక్ట్ కంపెనీని, సంఘాన్ని, కార్పొరేట్ అయినా కాకపోయినా వ్యక్తుల కూటమిని కూడా చేర్చారు.

2. కనుక వ్యక్తి అన్న పదం ''న్యాయపరమయిన వ్యక్తి''ని కూడా చేర్చుకుంటుందని చాలాకాలం నుంచి ఉన్న అభిప్రాయం. టి.పి. చట్టం సెక్షన్ 5లో 1929లో చేర్చిన మినహాయింపు వాక్యం ప్రకారం ఈ అభిప్రాయం స్థిరపడింది.

3. భూమిని సేకరించి, కలిగి ఉండే సామర్థ్యం అన్న కార్పొరేషన్‌కు, తను దేనికి ఏర్పడిందో ఆ కార్యక్రమ నిర్వహణకుగాను తనఖా ఇచ్చే సామర్థ్యం కలిగి ఉంటుంది.

సాధారణంగా కార్పొరేషన్ల అధికారులను ఇన్ కార్పొరేషన్ చట్టం క్రమబద్ధం చేస్తుంది. అయితే సంస్థ కోసం తనఖా అవసరమయితే దాన్ని టి.పి చట్టం నిరోధించబోరు. ఎందుకంటే అది 'వ్యక్తి' కనుక.

4. హిందూ చట్టం ప్రకారం దేవతా విగ్రహం కూడా ( జూరిస్టిక్ పర్సన్) 'న్యాయపరమయిన వ్యక్తి' ఆస్తిని కలిగి ఉండవచ్చు. **31 I.A. 203.**

దేవతా విగ్రహానికి చెందిన ఆస్తి కబ్జా, నిర్వహణ అధికారాలు సెబాయత్‌లో దాఖలు పరిచారు. కాని యాజమాన్యం విగ్రహంలో ఉంది కనుక, విగ్రహం చట్టపరంగా వ్యక్తి కనుక, అందువల్ల సజీవుడైన వ్యక్తి కనుక తనఖాలో పార్టీ కావచ్చు.

## ఒప్పందానికి సామర్థ్యానికి-కావలసినవి

1. ఇది సెక్షన్ 7లో ప్రస్తావించారు. సెక్షన్ 7 కింద రెండు అంశాలు అత్యవసరం.

(i) వ్యక్తి ఒప్పందానికి అర్హుడై ఉండాలి.

(ii) వ్యక్తి బదిలీ చేయతగిన ఆస్తి కలిగి ఉండాలి. లేదా బదిలీ చేయతగిన ఆస్తిని విక్రయించేందుకు అధికారం పొంది ఉండాలి.

## (i) ఒప్పందానికి అర్హుడు.

1. ఒప్పందాలకు సంబంధించి టి.పి. చట్టంలో ఉన్న అధ్యాయాలు సెక్షన్లు భారతీయ ఒప్పందాల చట్టాలలో భాగంగా పరిగణించాలని సెక్షన్ 4 పేర్కొన్నది.

2. అందువల్ల ఒప్పందానికి అర్హత అంటే ఒప్పందాల చట్టం కింద అర్హత అని అర్థం.

సెక్షన్ 11: ఆయా అంశాలకు సంబంధించిన చట్టాల ప్రకారం మెజారిటీ వయసు కలిగిన, మరియు ప్రశాంతమయిన మెదడు కలిగిన, మరియు అతనికి వర్తించే ఏ చట్టం కిందనయినా అనర్హుడని నిర్ణయం కాని వ్యక్తి ఎవరయినా ఒప్పందం చేసుకునేందుకు అర్హుడు.

3. దివాలాకోరు వ్యక్తి అనర్హత. దివాళాకోరు వ్యక్తి ఆ తర్వాత సంపాదించిన ఆస్తిపై ఏ సమర్థత కలిగి ఉండడు. తర్వాత సంపాదించిన స్థిరాస్తి పైన ఒక దివాళాకోరు వ్యక్తి, తన బాధ్యతలన్నీ తీరేవరకు, తనఖా సృష్టించడానికి వీల్లేదని చట్టం నిర్దేశిస్తున్నది. 17 Mad. 21 (కాని 8 Cal. 556 చూడండి)

## అర్హుడు

1. అర్హుడు అంటే పూర్తి యజమానిగా అర్హుడా లేక పరిమిత యజమాని అవుతాడా? అన్నది ప్రశ్న.

2. పూర్తి యజమాని తనఖా పెట్టే హక్కు ఉందని చెప్పనవసరం లేదు. పరిమిత యజమానికి తనఖా పెట్టే హక్కు ఉందా?

3. ఒక ఆస్తిని అమ్మేందుకు ట్రస్టీగా ఉన్న వ్యక్తి ప్రకటిత అనుమతి లేకుండా తనఖా పెట్టవచ్చా? అమ్మకానికి ఏర్పాటయిన ట్రస్టు తనఖా చేసే అధికారం కలిగి ఉండదనేది సాధారణ నియమమే.

4. భాగస్వామి - భాగస్వామ్య సంస్థ రుణం కోసం భాగస్వామ్య ఆస్తిని తనఖా పెట్టవచ్చు.

5. భారతీయ వారసత్వం చట్టం కింద ఎగ్జిక్యూటర్ లేదా అడ్మినిస్ట్రేటర్ (నిర్వాహకుడు లేదా పాలకుడు) బదిలీకి అధికారం కలిగి ఉంటాడు.

6. హిందూ విధవరాలు, సమిష్టి కుటుంబ సభ్యులు, సమిష్టి కుటుంబం కర్త, హిందూ ధార్మిక సంస్థల ధర్మకర్తలు.

7. వివరి ఇద్దరికి అధికారం అవసరం ఉన్నాయి.

## మార్చ తగిన ఆస్తి

1. వ్యక్తి పూర్తి యజమాని పరిమిత యజమాని అయినా, ఆస్తి మాత్రం మార్పిడికి అనువైనదై ఉండాలి.

2. మార్పితగిన ఆస్తి అంటే?

(i) సెక్షన్6 ప్రకారం- ఈ చట్టం ద్వారా లేదా మరే చట్టం ద్వారా మరో రకంగా పేర్కొంటే తప్ప ప్రతి ఆస్తి మార్పితగిందే. ఏదైనా చట్టం నిషేధిస్తే తప్ప ఏ ఆస్తినైనా బదిలీ చేయవచ్చు.

(ii) మినహాయింపులు రెండు వర్గాల కింద ఉంటాయి.

(a) కేవలం వ్యక్తిగత హక్కులు బదిలీ చేయడానికి వీల్లేదు.

(b) యజమాని అనుభవానికే పరిమితమయిన ఆస్తిలో హక్కును బదిలీ చేయడానికి వీల్లేదు.

3. దీన్ని బట్టి చరాస్తిని కూడా తనఖా పెట్టవచ్చు. దీనిగురించి ఆస్తి మార్పిడి చట్టం పేర్కొనలేదు. ఎందుకంటే తాకట్టు కింద కంట్రాక్టు చట్టంలో వివరణ ఉంది- దాన్ని నిషేధించలేదు.

## తనఖా పత్రంలో అంశాలు

తనఖా పత్రం కొన్ని వివరాలను పేర్కొనడం అవసరం.

1. పత్రంలో అప్పు లేదా బాకీకి హామీ ఇవ్వడమే తనఖా కనుక, ఆ అప్పు గురించి స్పష్టంగా పేర్కొనాలి లేకపోతే తనఖాకర్త ఒక అప్పుకు మరో అప్పు చూపవచ్చు

2. అప్పు చెల్లింపు లేదా షరతు అమలు సమయం పత్రంలో స్పష్టంగా ఉండాలి. మొత్తంగా ఇస్తారా వాయిదాల్లో చెల్లిస్తారా? అనే వివరణ కూడా అవసరం.

3. తిరిగి చెల్లించేందుకు అంగీకారం కూడా పత్రంలో పేర్కొనాలి. ఎందుకంటే ఎన్నో రకాల తనఖాలో అప్పు ఉందని కూడా ఊహించలేము.

4. తనఖా చేసిన ఆస్తి వివరాలను అవసరమయినంత మేరకు ఇవ్వాలి. వివరణ తగిన విధంగా లేనప్పుడు, తప్పుదోవ పట్టించినపుడు తనఖా చేసిన ఆస్తి ఏదో గుర్తించేందుకు ఇతర సాక్ష్యాలను అనుమతించవచ్చు.

ప్రశ్న: ఆస్తిని స్పష్టంగా వివరించని సందర్భంలో ఒక వ్యక్తి ఆస్తిపై తనఖాను సృష్టించవచ్చా? సాధారణ తనఖా చెల్లుతుందా?

ప్రశ్న- బాకీదారు తన వద్ద ఉన్న అన్ని ఆస్తులను, ఏ ఇతర తేడాలు లేకుండా సాధారణ తాకట్టు పెట్టడం ద్వారా చట్టం కింద తనఖాను సృష్టించవచ్చా?

1. తీసుకున్న అప్పుకు హామీ ఏర్పాటు చేస్తే రూపొందించిన పత్రానికీ, బాకీదారు కేవలం తను అప్పు తీర్చకపోతే రుణదాత తన మొత్తం ఆస్తి మరో అప్పు వసూలు చేయవచ్చునని అంగీకరించడానికీ తేడా ఉంది.

రెండో కేసులో రుణదాతకు బాకీదారు ఆస్తి పైన లెవీ విధించే అధికారం ఉంది కాని తాకట్టు సృష్టించజాలడు.

ఒకవేళ పరిస్థితులు మొదటి కేసు కిందక వస్తే ఆ తాకట్టు- తనఖా అవుతుందా?

భారత్‌లో అటువంటి సెక్యూరిటీల చెల్లుబాటును సవాలు చేశారు. సాధారణంగా తాకట్టు పెట్టడం ఒక అస్పష్టత కనుక దానిపై చర్య తీసుకోవడం సాధ్యం కాదు.

(1) సెక్షన్29 కాంట్రాక్ట్ చట్టం, సెక్షన్93 సాక్ష్య చట్టం ప్రకారం ఒప్పందం అనేది నిర్దిష్టమయిన రూపంలో ఉండాలి. కనుక అటువంటి తాకట్టు సాధ్యం కాదు.

(2) అస్పష్టత అనేది తప్పుదోవ పట్టించే పదం. అంటే (i) భాష ఎంత అయోమయంగా వాడారంటే అసలది ఏమిటో అర్థం చేసుకోలేం, (2) ఒప్పందంలో పేర్కొన్న ఆస్తి ఏమిటో నిర్దిష్టంగా చెప్పకపోవడం.

(3) అనిర్దిష్టత అనే పదానికి సవిస్తారమయిన అవకాశం కల్పించే లక్షణాన్ని సాధారణంగా ఆపాదిస్తారు.

ఒప్పందంలో వస్తువు విస్తారంగా ఉన్నా నిర్దిష్టంగా కూడా ఉండవచ్చు. మరోవైపు సంకుచితంగా ఉన్నా నిర్దిష్టంగా ఉండవచ్చు.

ఒక వ్యక్తి ''నా మొత్తం భూమిని తనఖా పెడుతున్నా''. అంటే విస్తారమయిందే కాని నిర్దిష్టత కూడా ఉంది.

ఎన్నో ఇళ్ళున్న మరో వ్యక్తి ''నాకున్న ఇళ్ళలో ఒక ఇంటిని తనఖా పెడుతున్నా'' అంటే వివరణ విస్తారం కాకపోయినా అనిర్దిష్టత ఉంది.

(4)•టి.పి. చట్టంలో 'స్పష్టంగా' అన్న పదాన్ని ఇతర సాధారణ ఉపయోగానికి విభిన్నంగా వాడారు. పత్రంలో ఆస్తి స్పష్టంగా పేర్కొనకపోతే చట్టం ప్రకారం తనఖా ఉండదు.

(5) ఏవిధంగా ఆస్తిని స్పష్టం చేయాలో చట్టంలో లేకపోయినా, స్పష్టత అవసరం.



# రెండో విభాగము

# తనఖా హక్కులు బాధ్యతలు

## పరిచయం

1. తనఖా పెట్టుబడిన ఆస్తి పైన తనఖా కర్తకు, తనఖా స్వీకర్తకు హక్కులు ఉంటాయి.

2. రెండు ప్రశ్నల్ని పరిశీలించాలి.

(i) తనఖాకర్త, స్వీకర్త హక్కులు ఏమిటి?

(ii) ఆ హక్కుల లక్షణం ఏమిటి?

## హక్కుల లక్షణం

(1) ఇంగ్లీషు చట్టం ఈవిధంగా విభజిస్తుంది. తనఖాకర్త హక్కులు సమతాపరమయినవి. తనఖా స్వీకర్త హక్కులు చట్టపరమయినవి. భారత చట్టంలో చట్టపరమయిన, సమతా పరమయిన అని తేడా లేరు.

(1872) I.A. Sepp. 47 (71) 30 I.A. 238

2. ట్రస్టు చట్టంలో కూడా ఈ తేడాను గుర్తించలేదు. 58 I.A. 279

3. ఇద్దరికీ చట్టపరమైన హక్కులు ఉంటాయి. చట్టపరమైన వాటికి వ్యతిరేకంగా సమతాపరమైనవి అంటూ ఉండవు.

II ఇంగ్లీషు చట్టం ప్రకారం తనఖా స్వీకర్త యజమాని కాగా తనఖాకర్తకు కేవలం తిరిగి కొనుక్కునే హక్కు ఉంటుంది.

1. భారత చట్టం ప్రకారం దీనికి భిన్నంగా ఉంటుంది. తనఖాకర్త యజమాని, తనఖా స్వీకర్తకు కేవలం 'అబెనా' (abena) హక్కు ఉంటుంది.

## తనఖాకర్త హక్కులు

1. తనఖాకర్త హక్కులు మూడు విభాగాలు

I. విముక్తి హక్కు

II. ఆస్తి యాజమాన్యం హక్కు

III. తిరిగి మార్పిడి కోరే హక్కు.

## విముక్తి హక్కు

### సెక్షన్ 60

1 తనఖాకర్త విముక్తి హక్కు ప్రకారం తనఖాకర్త తనఖా స్వీకర్తచేత మూడు పనులు చేయించవచ

(i) తనఖా పత్రాన్ని తనఖాకర్తకు స్వాధీనం చేయడం.

(ii) తనఖా స్వీకర్త కబ్జా కలిగి ఉంటే తనఖాకర్తకు స్వాధీనం చేయడం.

(iii) తనఖా విముక్తి హక్కు రాతపూర్వకంగా పత్రం వ్రాసి గుర్తించవలసి ఉంటుంది.

2. ఈ క్రింది షరతులు పాటించడంపై విముక్తి హక్కు ఆధారపడి ఉంటుంది.

(i) తనఖా సొమ్ము చెల్లింపు లేదా చెల్లించడానికి సిద్ధం కావడం.

(ii) అసలు సొమ్ము బకాయిపడిన తరువాత ఏ సమయంలోనైనా.

(iii) కోర్టు డిక్రీ ద్వారా కాని వ్యక్తుల చర్యల ద్వారా కాని విముక్తి హక్కు తొలగి కుండా ఉండాలి.

(iv) తనఖాకర్త ఆస్తిని మొత్తం విడిపించుకోవడానికి

## I. విముక్తి (విడిపించుకునే) హక్కు

1. ఇందుకు భిన్నంగా ఒప్పందం లేని పక్షంలో సెక్షనుకు మున్ముందు అటువంటి పదా ఉండవలసిన అవసరం లేదు.

2. కనుక విముక్తి హక్కు చట్టపరమైన హక్కు విముక్తిని నిరోధించడానికి ఏ షరతును విధించడా వీల్లేదు **4a IA 60.**

3. అటువంటి ఏ షరతు ఐనా విముక్తి ప్రతిబంధకం కనుక ఆ షరతు చెల్లదు.

II. విముక్తిపై ప్రతిబంధకం - తనఖాకర్త విడిపించుకునే హక్కును నిరోధించే ఏ షరతు అయినా చెల్లదు.

(1) విముక్తి ప్రతిబంధకాన్ని వ్యతిరేకించే నియమం వెనుక లక్ష్యం ఇది. తనఖా అనేది అప్పు తిరిగి చెల్లింపుకు హామీ ఇచ్చే బదిలీ మాత్రమే. ఆ హామీని తిరిగి పొందే హక్కును ఎవరూ నిరోధించలేరు.

(2) అమ్మకానికి- హామీకి మధ్య తేడా ఉంది. అమ్మకంలో ఆ ఆస్తిని తిరిగి పొందే అవకాశం లేదు. హామీ అయితే ఆ ఆస్తిని తిరిగి పొందవచ్చు.

(3) ఆ హక్కును ఒప్పందం ద్వారా తొలగించలేం. అట్లా తొలగించదలిస్తే, అది విముక్తిపై అడ్డంకి అవుతుంది. కనుక చెల్లబోదు.

**III విముక్తి ప్రతిబంధకాల ఉదాహరణ:**

I. ఈ కింది షరతులు, విముక్తికి ప్రతిబంధకాలు:-

(1) తనఖా స్వీకర్త జీవిత కాలంలోనే విముక్తి.

(2) స్వంత డబ్బుతోనే విముక్తి, ఇతరులిచ్చే డబ్బుతో కాదు.

(3) నిర్ణీత అప్పు చెల్లించకపోతే తనఖా అమ్మకంగా మారుతుంది.

(4) తనఖా స్వీకర్తకు ఆస్తిని శాశ్వత లీజు ఇస్తేనే విముక్తి అనే షరతు.

II. ఈ కింది షరతులు తనఖా విముక్తిపై ప్రతిబంధకాలు కావు.

(1) ఇంతకుముందు తనఖాల నుంచి విముక్తి అయ్యేదాకా విముక్తి చేయరాదు.

(2) 15 ఏళ్ళు ముగిసేదాకా ఉపయుక్త తనఖా విడిపించుకోరాదు.

(3) విముక్తి తర్వాత కొంత సమంజసమయిన, అవసరమయిన కాలం తర్వాతే కబ్జా తీసుకోవాలనే వాయిదా నిబంధన.

III. ఏది ప్రతిబంధకం, ఏది కాదు అనే అంశంపై ఖచ్చితమైన నియమం ఏదీ లేదు.

(i) తనఖా నిబంధనలు కఠినంగా ఉన్నంత మాత్రాన అది ప్రతిబంధకం కాబోదు.

**(ii) తనఖా ఆస్తి విడిపించుకోవడం అసాధ్యం చేసే విధంగా విముక్తి విధానాన్ని నిరోధించే అవకాశం ఉందా లేదా అన్నదే [illegible]**

(iii) ఆ షరతు ప్రతిబంధకం అయితే చెల్లదు- ఒకవేళ అది అంగీకారపు డిక్రీ రూపంలో ఉన్నా సరే. ఒప్పుకోలు వల్ల విడిపించుకునే హక్కు తొలగిపోదు.

IV. తనఖా ఒప్పందం కుదిరిన క్షణంలో తనఖా చేసుకున్న వ్యక్తులకు నడుమ ఏర్పడే లావాదేవీలకు సంబంధించి మాత్రమే విముక్తి ప్రతిబంధక సిద్ధాంతం వర్తిస్తుంది. ఆ ఒప్పందం తర్వాత ఇరువురి మధ్య కుదిరే ఒప్పందానికి వర్తించదు.

1. అంటే తనఖా కుదిర్చే సమయంలో తనఖా విడిపించుకునే హక్కును తొలగించేందుకు పార్టీలకు అధికారం లేదు.

2. కాని ఆ తర్వాత తనఖా నిబంధనలను మార్చుకుని విడిపించుకునే హక్కుపైన ప్రతిబంధకాలు సృష్టించుకున్నా అది 'ప్రతిబంధకం' కాబోదు.

## V. బాకీ

1. చెల్లింపతగిన సొమ్ముకు బాకీకి తేడా ఉంది. డబ్బు చెల్లింపతగిందే కాని బాకీ కాదు.

2. బాకీ- అంటే హక్కుగా అడగ తగింది.

3. నిర్ణీత తేదీన చెల్లించకపోతే విముక్తి హక్కు అంతరించదు. తనఖా తనఖాగానే మిగిలిపోతుంది అది చెల్లించవచ్చు.

## VI. చెల్లింపు:

(i) ఒకరికన్నా ఎక్కువ తనఖా స్వీకర్తలుంటే అందరికీ చెల్లింపులు జరగాలి.

(ii) చెల్లింపు పద్ధతి: చట్టపరంగా చెల్లించడం లేదా రుణదాతకు అంగీకారమయిన పద్ధతిలో.

(iii) చెల్లించే చోటు - (పుట ఖాళీగా వదిలారు -సం)

## విముక్తి - నిర్మాణాలు

### సెక్షన్ 63 కు

1. ఇందుకు భిన్నంగా ఒప్పందంలో లేనిపక్షంలో తనఖాకర్త ఆస్తి విడిపించుకున్న తర్వాత ఆస్తిపై చేసిన అభివృద్ధి నిర్మాణాలపై హక్కు పొందుతాడు.

2. అవసరమయిన అభివృద్ధి నిర్మాణాలయితే తనఖాకర్త ఆ పనుల ఖర్చు చెల్లించాలి. అవసరాలు ఇవి:

(i) ఆ ఆస్తి రక్షణకు అవసరం.

(ii) ఆ ఆస్తి హామీగా సరిపోయేందుకు అవసరం.

(iii) అధికారి న్యాయబద్ధమయిన ఉత్తర్వు ప్రకారం చేసిన నిర్మాణాలు.

3. ఇది కూడా ఇందుకు భిన్నమయిన ఒప్పందానికి లోబడి ఉంటుంది.

4. సెక్షన్ 63 Aలో తనఖా స్వీకర్తకు తనఖా ఆస్తిపై నిర్మాణాలు చేసి అందుకుగాను తనఖాకర్తపై ఛార్జ్ సృష్టించే స్వేచ్ఛలేదనే సాధారణ సూత్రం ఉంది. తనఖా స్వీకర్త భారీ ఎత్తున నిర్మాణాలు చేసి అప్పు సొమ్మును విపరీతంగా పెంచి విముక్తి శక్తిని దెబ్బతీసే ప్రయత్నాలను నిరోధించడమే ఈ సూత్రం లక్షణం. తనఖా స్వీకర్త అదనపు నిర్మాణాల ద్వారా విముక్తి అసాధ్యం చేయడానికి వీల్లేదు. దీన్ని తనఖాకర్త ఆస్తి నుండే అభివృద్ధి చేయడం అంటారు.

5. నిర్మాణాలకు తనఖాకర్త అనుమతించారంటే సరిపోదు- ఆ ఖర్చు భరిస్తాననే వాగ్దానం ఉంటే తప్ప.

## విముక్తి హక్కు, లీజు పొడిగింపు లాభం
## సెక్షన్ 64

తనఖాకర్తకున్న సహజ హక్కులకు లీజు పొడిగింపు అదనపు హక్కు అవుతుంది.

1. తనఖా స్వీకర్త పొడిగించిన లీజు పొందితే, విముక్తి ద్వారా పొడిగించిన లీజు లాభాలకు తనఖాకర్త అర్హుడవుతాడు.

2. ఇందుకు భిన్నమయిన ఒప్పందానికి ఇది లోబడి ఉంటుంది.

## తనఖాకర్త నిర్వహణ హక్కు
## సెక్షన్ 66:

1. తనఖాకర్త ఆధీనంలో కబ్జా ఉన్నంతకాలం ఆస్తిపై సాధారణ హక్కులు వినియోగిస్తూ అద్దెలు, లాభాలు పొందే అధికారం తనఖాకర్తకు ఉంటుంది.

2. తనఖాకర్త 'వృథా'కు బాధ్యుడవుతాడా అన్నది ప్రశ్న.

3. వృథా సిద్ధాంతం ఈ సెక్షన్‌లో ఉంది. వృథా అనేది స్వచ్ఛందంగా చేసినది, చూస్తూ అనుమతించే వృథా అనే రెండు రకాలు స్వచ్ఛంద వృథా అంటే ఆస్తి ఆవరణ విధ్వంసానికి ఉపకరించే చర్యలు- ఇళ్ళు కూల్చడం, అమర్చినవి తొలగించడం, వాటి లక్షణాల్ని మార్చడం- అంటే పచ్చిక భూమిని ఎండగొట్టడం, బంగ్లాలు పడగొట్టడం.

చూస్తూ అనుమతించే వృథా అంటే ఆవరణ అంతా నష్టమవుతున్నా పట్టించుకోకపోవడం, ఉదాహరణ ఇల్లు దెబ్బతిని కూలిపోతుంటే పట్టించుకోకపోవడం.

స్వచ్ఛంద వృథా ద్వారా ఆస్తి విధ్వంసం అంటే- కావాలని లేదా నిర్లక్ష్యంగా విధ్వంసం చేయడం; సమంజసమయిన వినియోగంలో విధ్వంసమవుతే అది వృథా కాదు. అది ఏ ఉపయోగానికైతే అనుకున్నారో అందుకు వినియోగిస్తే అది సమంజసమయిన వినియోగం అవుతుంది. ఉపయోగించే పద్ధతి, పరిధి సక్రమంగా కనిపిస్తే, అది ఆస్తికి అనుగుణమైనదే. అయితే, అది కిరాయిదారుకు తెలిసి ఉంటే అది సమంజసమయిన వినియోగం.

4. సెక్షన్ 66 ప్రకారం తనఖాకర్త 'పట్టించుకోని వృథా'కు బాధ్యుడు కాడు. అతను కేవలం స్వచ్ఛంద వృథాకు బాధ్యుడవుతాడు. ఎందుకంటే ఆ వృథా హామీని సరిపోకుండా చేస్తుంది.

5. తనఖా సొమ్ములో మూడింట ఒకటో వంతుకన్నా హామీ విలువ తగ్గితేనే, భవనాలే హామీ అయితే సగం కన్నా తక్కువ అయితే హామీ సరిపోనట్టు లెక్క.

## తనఖాకర్త బాధ్యతలు

## సెక్షన్ 65

1. కొన్ని చట్టపరమయిన ఒప్పందాలతో బాధ్యతలు ఉంటాయి.

2. ఇవి తనఖాకర్త ఉల్లంఘిస్తే బాధ్యుడయ్యే వారంటీలు.

### 1. సాధారణంగా

(ఎ) పట్టా కోసం ఒప్పందం.

(i) బదిలీ అయిన హక్కుపై తనఖాకర్తకు పట్టా ఉంటుంది.

(ii) మార్పిడి హక్కు అతనికే ఉంటుంది.

## హామీకి బదులుగా:

సమష్టి అవిభక్త ఆస్తిలో అవిభక్త వాటా స్వాంతదారు, ఆ అవిభక్త వాటాపై తనఖా సృష్టిస్తే తనఖా స్వీకర్త- సహ వాటాదారులు భాగ విభజనను అమలుచేసే హక్కుకు లోబడి తనఖా తీసుకోవలసి ఉంటుంది. అంటే అవిభక్త వాటా కాస్తా విడి వ్యక్తుల చేతిలో విభజిత వాటాగా మారుతుంది. 11 A 106. భాగ విభజన తర్వాత అవిభక్త వాటా స్థానంలో విడిపడిన వాటా సెక్యూరిటీ (హామీ) అవుతుంది. కనుక కేటాయించిన వాటా పైనే గానీ అసలు తనఖా చేసిన వాటాపైన చర్య తీసుకునే వీలుండదు.



(a) వాయిదాపడిన పట్టా కోసం ఒప్పందం.

(b) తనఖా స్వీకర్త కబ్జాలో లేకుంటే ప్రభుత్వ బాకీలు చెల్లించే ఒప్పందం.

(c) అంతకుముందే ఉన్న అప్పును చెల్లించే ఒప్పందం.

### II. తనఖా ఆస్తి అద్దెకు ఇచ్చి ఉంటే...

(i) తనఖా మొదలయ్యే నాటికి అన్ని షరతులు పాటించామనే ఒప్పందం.

(ii) తనఖా స్వీకర్త కబ్జాలో లేకపోతే లీజు ద్వారా నిర్ణయించిన అద్దె చెల్లించే ఒప్పందం.

(iii) లీజు పొడిగిస్తే అన్ని షరతులు పాటించే ఒప్పందం.

ఇవన్నీ వ్యక్తిగత ఒప్పందాలు కావు. ఇవన్నీ తనఖా పెట్టిన ఆస్తితో నడిచేవి. కనుక తనఖా స్వీకర్త నుండి తీసుకున్న వ్యక్తి కూడా ఆ ఒప్పందాలను వినియోగించవచ్చు.

## తనఖా స్వీకర్త హక్కులు

1. ఇవి రెండు రకాలు.

(1) తనఖా సొమ్ము వసూలు హక్కు.

(2) తనఖా కొనసాగినంత కాలం సెక్యూరిటీ (హామీ)ని అదేవిధంగా నిర్వహించే హక్కు.

I. తనఖా సొమ్ము వసూలు చేసే హక్కు

1. దీని కింద ఈ కింద హక్కులు ఉంటాయి.

(1) 67 - ముందు ముగింపు హక్కు 67

(2) 67/69 అమ్మకం హక్కు

(3) 68 తనఖా సొమ్ము కోసం దావా వేసే హక్కు

(4) 73 అమ్మకం - సేకరణపై డబ్బు కోరే హక్కు.

2. తనఖాకర్తకు తనఖా ఆస్తిని విడిపించుకునే వీలు లేకుండా పూర్తిగా నిరోధించాలనే డిక్రీ కొరే దావా వేయడాన్ని 'ముందు ముగింపు దావా' అంటారు.

గమనిక:-

1. తనఖా సొమ్ము అంటే మొత్తం తనఖా సొమ్ము కాదు. తనఖాలో వాయిదాల చెల్లింపు ఉంటే అసలులో చెల్లించని వాయిదా కోసం, వడ్డీ కోసం 'ముందు ముగింపు' దావా వేసే హక్కు తనఖ స్వీకర్తకు ఉంటుంది. -13 M.L.I. 2

2. స్పష్టమయిన నిబంధన లేకపోతే, వాయిదాల్లో స్వీకరించే అవసరం తనఖా స్వీకర్తకు లేదు. 24 All. 461.

3. మొత్తం 'అసలు' సొమ్ము బకాయి పడకముందే వడ్డీ కోసం దావా వేయవచ్చు- దాన్ని నిషేధించే ఒప్పందం ఉంటే తప్ప.

4. ప్రతి తనఖా స్వీకర్తకు ఈ హక్కులు లభించవు.

## I. డబ్బు కోసం దావా వేసే హక్కు.

### సెక్షన్ 68

తనఖాకర్త డబ్బు చెల్లించేందుకు తనకు తాను బద్ధుడైతేనే ఈ హక్కు ఉంటుంది.

ప్రశ్న:- ఎప్పుడు తనఖాకర్త తాను వ్యక్తిగతంగా చెల్లించడానికి బద్ధుడవుతాడు?

ఈ అంశంపై రెండు భిన్నాభిప్రాయాలున్నాయి.

(a) ఏ తనఖాలోనైనా వ్యక్తిగతమయిన బాధ్యత ఉందనే ఒప్పందం ఉన్నట్టే భావిస్తార ప్రకటితమయిన ఒప్పందాలు లేనపుడు- అవసరమయిన సందర్భాల్లో మరింత స్పష్టమయి సంభావ్య ఒప్పందాలను కోర్టు కోరవచ్చు. -13 Lah. 259

(b) ప్రకటితమయిన అంగీకారం ఉంటేనే ఇటువంటి ఒప్పందం ఉన్నట్టుగా, దాని బద్ధుడవుతాడని మరొక అభిప్రాయం. అన్ని తనఖాలలో వ్యక్తిగత బాధ్యత ఉంటుంద భావిస్తే ఈ పై నియమం అవసరం.

## నిర్వచనం:

## సెక్షన్ 58:

1. సాధారణ తనఖాలో తనఖాకర్త సొమ్ము తిరిగి చెల్లించేందుకు బద్ధుడవుతాడు.

2. షరతు అమ్మకంతో తనఖాలో అతను ''డబ్బు చెల్లిస్తే ఆస్తిని వాపస్ పొందుతాడు'' అంటాడు.

3. ఉపయుక్త తనఖాలో ఈ ఒప్పందం కూడా ఉండదు.

సాధారణ తనఖాలో తనఖా స్వీకర్త డబ్బు డిక్రీ కోసం దావా వేయవచ్చు. కాని ప్రత్యేక ప్రకటిత ఒప్పందం ఉంటే తప్ప ఇతర రకాల తనఖాల్లో ఇటువంటి కేసు వేయడానికి వీలులేదు.

## మినహాయింపులు:

తనఖా స్వీకర్త తనఖాకర్త నుండి డబ్బు డిక్రీ కోసం దావా వేయవచ్చు. తనఖా స్వీకర్త నుండిగానీ అతడి వారసుని నుండిగానీ డబ్బు డిక్రీ కోసం దావా వేయడానికి వీలులేదు.

డబ్బు డిక్రీ కోసం దావా చేయతగిన ఇతర కేసులు.

సాధారణంగా ఒక తనఖా స్వీకర్త తనకు డబ్బు చెల్లించేందుకు తనఖాకర్త వ్యక్తిగతంగా అంగీకరించిన పక్షంలో డబ్బు డిక్రీ కోసం దావా వేయవచ్చు.

2. వ్యక్తిగత ఒప్పందం లేకపోయినా తనఖా స్వీకర్త ఈ క్రింది పరిస్థితుల్లో దావా వేసే అవకాశాలున్నాయి-

## సెక్షన్ 68:

(i) ఇద్దరు వ్యక్తుల చర్య వల్ల కాకుండా ప్రమాదవశాత్తూ అంటే అగ్ని, వరద, ఇతర ప్రకృతి వైపరీత్యాల వల్ల ఆస్తి పూర్తిగా కానీ, కొంత భాగం కానీ ధ్వంసం అయితే, తనఖా కర్తకు అవకాశం ఇచ్చినా మరొక సెక్యూరిటీ ఇవ్వలేని పక్షంలో, 'హామీ' సొమ్ముకన్నా తక్కువయినప్పుడు,

(ii) తనఖాకర్త అప్పుడు నడతవల్ల సెక్యూరిటీ విషయంలో తనఖా స్వీకర్త మొత్తంగా గానీ, కొంత భాగంలో కానీ నష్టపోయినప్పుడు-

(iii) తనఖా స్వీకర్త కబ్జాకు అర్హుడైనప్పటికీ తనఖాకర్త కబ్జా ఇవ్వనప్పుడు లేదా తనఖా స్వీకర్తకు కబ్జాలో బాధ్యత కల్పించినపుడు.

## అమ్మకం హక్కు

1. ఈ హక్కు ఈ కింది వాటికి మాత్రమే చెందుతుంది.

(i) సాధారణ తనఖా

(ii) ఇంగ్లీషు తనఖా

(iii) సమతా తనఖా

• 2. కబ్జా కోసం వారు దావా వేయడానికి వీల్లేదు. అమ్మకం కోసమే కేసు వేయవచ్చు. కోర్టు పొరపాటున కబ్జా ఇచ్చిన పక్షంలో ఆ కబ్జా ''ముందు ముగింపు'' కాబోదు. తనఖాకర్త ఆ తర్వాత తనఖా నుండి ఆస్తిని విడిపించుకోవచ్చు.

**-19 Mad. 249 (252-23) P.C.**

## అమ్మకం, 'ముందు ముగింపు' హక్కుల అమలుకు పరిస్థితులు

1. తనఖా సొమ్ము బాకీ పడినప్పుడు మరియు విముక్తి డిక్రీకి ముందు.

2. మొత్తం తనఖా సొమ్ము కోసం దావా వేయాలి. తనఖా సొమ్ములో కొంత భాగం కోసం మాత్రమే ఆస్తిలో ఒక భాగం అమ్మకం లేదా ముందు ముగింపు కోసం దావా వేయకూడదు.

మినహాయింపు: తనఖా స్వీకర్త హక్కులను తనఖాకర్త అంగీకారంతో విడదీసే అవాశం ఉన్నప్పుడు, ఒక భాగం కోసం తనఖా స్వీకర్త దావా వేయవచ్చు.

## సెక్షన్ 67 ఎ

3. తనఖా స్వీకర్త - తనఖాకర్త నుంచి అనేక తనఖాలను కలిగి ఉంటే ఆ తనఖాల కోసం ఒకే దావా వేసే అవకాశం ఉంది- ఎప్పుడంటే.

(i) అతనికి దావా వేసే హక్కు వచ్చినపుడు, మరియు

(ii) అటువంటిదే మరో డిక్రీ పొందే హక్కు ఉన్నపుడు.

సెక్షన్ 65 ఎ

4. తనఖాకర్త ఆస్తిని నిర్వహించడమేగాక, తనఖా ఆస్తిపై చట్టపరమయిన కబ్జా కలిగి ఉంటే, అతనికి లీజుకు ఇచ్చే అధికారం ఉంది. ఆ లీజులు తనఖా స్వీకర్త బద్ధుడిని చేస్తాయి.

5. తనఖా తర్వాత తనఖా ఆస్తితో వ్యవహరించే తనఖా కర్త అధికారం పరిమితం అవుతుంది. అతనికి సర్వసాధారణ అధికారం ఉండదు.

6. లీజుకిచ్చే అధికారం కూడా షరతులతో పరిమితమవుతుంది.

(i) అతను స్థానిక చట్టం; ఆచారం, వాడుకను బట్టి లీజుకు ఇవ్వవచ్చు.

(ii) ప్రతి లీజులో అద్దెను సమానంగా పొందవచ్చు. లీజు అడ్వాన్స్‌గా చెల్లించరాదు.

(iii) లీజులో లీజును మళ్ళీ పొడిగించే షరతు ఉండకూడదు.

(iv) లీజు చేసిన తేదీ నుండి ఆరు నెలల కాలంలోగా అమలులోకి రావాలి.

(v) భవనం లీజు అయితే మూడు సంవత్సరాలకు మించి లీజు కాలం ఉండరాదు.

7. భిన్నమయిన ఒప్పందాలకు లోబడి సాధారణ లీజు అధికారం ఉంటుంది. ఇతర అంశాలు మారవచ్చు. 'ముందు ముగింపు' హక్కు- ఈ హక్కు కింద వారికి ఉంటుంది.

(i) షరతుతో కూడిన అమ్మకం తనఖా స్వీకర్త

(ii) అనామక తనఖాలో 'ముందు ముగింపు'కు సంబంధించి ఉన్న షరతులకు లోబడి తనఖా స్వీకర్త అమ్మకానికి గానీ, 'ముందు ముగింపు'కు గానీ దావా వేయలేని తనఖా స్వీకర్తలు.

(i) ఉపయుక్త తనఖా స్వీకర్త

(ii) ప్రజల ప్రయోజనాలతో ముడిపడి ఉన్న రైల్వే, కాలువ, ఇతర నిర్మాణాల తనఖా స్వీకర్త

తనఖా స్వీకర్తకు తనఖాకర్త ధర్మకర్త (ట్రస్టీ) లేదా అమలుదారు అయిన, లేదా తనఖాకర్తకు తనఖా స్వీకర్త ధర్మకర్త లేదా అమలుదారు అయిన సందర్భాల్లో-

ఆ తనఖాకర్త లేదా స్వీకర్త అమ్మకాన్ని ముందే ముగించుకోగలరా?

సెక్షన్ 67 (b)లో తనఖా స్వీకర్తకు తనఖాకర్త ధర్మకర్త అయిన సందర్భాన్ని వివరించారు. ట్రస్టీ తనఖాకర్త అమ్మకానికి దావా వేయగలిగినా ముందు ముగింపుకు దావా వేయలేడు.

మరో కేసులో ముందు ముగింపును ఇంగ్లీషు ఆచారం ప్రకారం సమానంగా నిషేధించారు. ఎందుకంటే తనఖాకర్తను సంప్రదించడం స్వీకర్త అయిన ట్రస్టీ బాధ్యత. తనఖాకర్త ప్రయోజనాల దృష్ట్యే 'ముందు ముగింపు' కన్నా అమ్మకం జరగడం మంచిది.

## కోర్టు జోక్యం లేకుండా అమ్మకం అధికారం వినియోగం

1. తనఖా స్వీకర్త కోర్టు ద్వారా మాత్రమే ఆస్తిని అమ్మకానికి పెట్టవచ్చుననేది సూత్రం.

2. సెక్షన్ 60లో దీనికి మినహాయింపులు పేర్కొన్నారు.

(i) తనఖా ఇంగ్లీషు తనఖా అయినప్పుడు, తనఖాకర్తగానీ, స్వీకర్తగానీ హిందువు, ముస్లిం, బౌద్ధుడు, లేదా గెజెట్‌లో పేర్కొన్న మత సభ్యుడు కానప్పుడు.

(ii) అమ్మకం హక్కు స్పష్టంగా తనఖా పత్రంలో పేర్కొన్నప్పుడు

(iii) అమ్మకం హక్కు తనఖా పత్రంలో స్పష్టంగా పేర్కొన్నప్పుడు, ఆ ఆస్తి పూర్తిగా కానీ కొంతగానీ బొంబాయి మొదలయిన పట్టణాలలో ఉన్నప్పుడు-

## సెక్షన్ 69 ఎ

కోర్టు ప్రమేయం లేకుండా అమ్మే అధికారం (హక్కుకు భిన్నంగా) ఉన్న తనఖా స్వీకర్తకు రిసీవర్‌ను వ్రాతపూర్వకంగా నియమిస్తూ తనుగానీ, తన తరపున మరొకరు గానీ సంతకం చేసే అధికారం ఉంటుంది.

4. తనఖా స్వీకర్త అమ్మకం, అధికారం లేదా రిసీవర్ నియామక అధికారం వాడే ముందు తనఖాకర్తకు నోటీసు ఇవ్వవలసి ఉంటుంది.

5. ఈ నోటీసు రాత పూర్వకంగా ఉండాలి. అసలు సొమ్ము చెల్లించాలని సూచిస్తూ మూడు నెలల గడువు ఆ నోటీసులో ఉండాలి.

## సెక్షన్ 73

1. అమ్మకం సొమ్ముపై తనఖా స్వీకర్త హక్కు.

1. రెవిన్యూ బకాయిలు చెల్లించకపోవడం లేదా ఇతర ప్రభుత్వ బకాయిలు చెల్లించకపోవడాని తనఖా స్వీకర్త లోపం కారణం కాకపోతే, అందుకోసం అమ్మితే వచ్చిన సొమ్ములో మిగిలిన డబ్బుక అర్హుడవుతాడు.

2. తనఖా ఆస్తిని నిర్బంధంగా సేకరించినట్లయితే తనఖా కర్తకు చెల్లించే నష్టపరిహారంలో నుండ తన డబ్బు కోరే అధికారం తనఖా స్వీకర్తకు ఉంటుంది.

3. అంతకుముందు ఏమయినా బకాయిలు ఉంటే తప్ప అతని క్లెయిమ్‌కే అన్నిటికీ వ్యతిరేకంగా ప్రాధమ్యం ఉంటుంది.

II: తనఖా కొనసాగుతున్న కాలంలో సెక్యూరిటీని భద్రంగా అదేవిధంగా నిర్వహించేందుకు గాను తనఖా స్వీకర్త హక్కు.

(i) చేర్చుకునే హక్కు - సెక్షన్ 70

(ii) లీజు కొనసాగించుకునే హక్కు - సెక్షన్ 71

(iii) ఆస్తిని రక్షించుకునే హక్కు - సెక్షన్ 72

## సెక్షన్ 70

## 1. చేర్చుకునే హక్కు (సేకరణ హక్కు)

1. తనఖా తేదీ తర్వాత 'చేర్పు' జరిగితే తనఖా స్వీకర్తకు సెక్యూరిటీ గురించి చేర్చుకునే హక్కు ఉంటుంది. 29 Cal. 803. ఒకే ఇల్లు ఉన్న ఒకే భూమిపై రెండు తనఖాలు ఏర్పాటు చేసినప్పుడు, ఆ తర్వాత తనఖాకర్త ఆ భూమిపై రెండు ఇళ్ళు నిర్మిస్తే - అవి ''చేరిన అంశాలు'' (Accession) అనే దానిపై తనఖా స్వీకర్త సెక్యూరిటీ కోసం ఆధారపడి ఉండవచ్చునని తీర్పు చెప్పారు.

తనఖాకు ముందు ఇల్లు కడితే, అలా చేయలేడు.

డిక్రీ తర్వాత కట్టినా అతను అలా చేయలేడు- సెక్షన్‌లో ఆవిధంగా లేకపోయినా.

ఇది- ఇందుకు భిన్నమయిన ఒప్పందానికి లోబడి ఉంటుంది.

## సెక్షన్ 71

## లీజు పొడిగింపు ప్రయోజనం పొందే హక్కు

తన 'హోమీ' ని పొడిగించుకునేందుకు లీజును పొడిగించే ప్రయోజనానికి అతను అర్హుడవుతాడు.

ఇది కూడా ఇందుకు భిన్నంగా ఒప్పందానికి లోబడి ఉంటుంది.

## సెక్షన్ 72

### 3. ఆస్తిని సంరక్షించుకునే హక్కు.

1. తనఖా స్వీకర్త అవసరమయినంత మేరకు డబ్బు ఖర్చు చేయవచ్చు.

(i) వినాశనం, స్వాధీనం, అమ్మకం నుంచి తనఖా ఆస్తిని రక్షించడానికి-

(ii) తనఖాకర్తకు ఆస్తిపై ఉన్న పట్టాను పదిలపరచడం కోసం-

(iii) తనఖాకర్తకు వ్యతిరేకంగా తన హక్కును పదిలపరచడం కోసం-

(iv) తనఖా ఆస్తి కొనసాగించగల లీజు ఆస్తి అయితే ఆస్తి లీజు పొడిగింపు కోసం-

(v) ఆస్తి భీమా చేయతగినదయితే, భీమా చేయాలి. ఆ ఖర్చును అసలు సొమ్ముకు అదనంగా చేర్చవచ్చు.

## ప్రాథమ్యం హక్కు

### 1. సమయ ప్రాథమ్యం

1. ఆస్తి మార్పిడి చట్టం సెక్షన్ 48లో స్థిరాస్తిలో హక్కుల బదిలీ విషయంలో ప్రాథమ్యాలను వివరించారు.

2. అదే నియమం తనఖాలకు కూడా వర్తిస్తుంది. మనదేశంలో తనఖా సృష్టించిన తేదీల ప్రాథమ్యాలు ఆధారపడి ఉంటాయి. తేదీ ముందుంటే తర్వాత వాటిపై వాటికి ప్రాథమ్యం ఉంటుంది

**56 Cal. 868**

3. సెక్షన్78 సూత్రానికి మినహాయింపు. మోసం ద్వారా, తప్పుడు మాటల ద్వారా, తీవ్ర నిర్లక్ష్యం ద్వారా రెండో తనఖా స్వీకర్త నుంచి ఆస్తి తనఖా ద్వారా డబ్బు రాబట్టితే మొదటి తనఖా పైన రెండో తనఖాకే ప్రాథమ్యం లభిస్తుందా.

తప్పుడు మాటలు- 1. భారతీయ ఒప్పందాల చట్టం సెక్షన్ (8) నిర్వచించింది.

2. తప్పుడు మాటలు అంటే మోసపూరితమయిన తప్పుడు మాటలు కానవసరం లేదు.

## మోసం, తీవ్ర నిర్లక్ష్యం

ఇంగ్లీషు చట్టానికి, భారత చట్టానికి మధ్య తేడా వుంది. ఇంగ్లీషు చట్టం ప్రకారం తీవ్ర నిర్లక్ష్యం అంటే మోసానికి దారితీసే నిర్లక్ష్యం. భారత చట్టం ప్రకారం తీవ్ర నిర్లక్ష్యం- మోసం వేరువేరు.

## II. చెల్లింపు ప్రాథమ్యం

ప్రశ్న: ఇంతకుముందు తనఖా స్వీకర్త హక్కులను కొనడం ద్వారా తనఖా స్వీకర్త మధ్యంతర తనఖాపై ప్రాధమ్యాన్ని సాధించవచ్చా?

## సెక్షన్ 93

1. ఇంతకుముందు తనఖా స్వీకర్తకు అంతకు ముందు తనఖా గురంచి తెలిసి గానీ తెలియకగానీ డబ్బు చెల్లించడం ద్వారా మధ్యంతర తనఖాపై ప్రాధమ్యాన్ని తనఖా స్వీకర్త సాధించలేడు.

2. తనఖాకర్తకు ఆ తర్వాత డబ్బు చెల్లించడం ద్వారా ఆ తర్వాత రుణానికి సంబంధించినంత వరకు మధ్యంతర తనఖాపైన ప్రాధమ్యాన్ని తనఖా స్వీకర్త పొందలేడు. మధ్యంతర తనఖా గురించి తెలిసి లేదా తెలియక చెల్లించినా ప్రాథమ్యం ఏర్పడదు.

## సెక్షన్ 79

సెక్షన్ 93లో పేర్కొన్న రెండో సూత్రానికి ఇది మినహాయింపు

సెక్షన్79 కింద- ఇంతకుముందు తనఖా మునుముందు ఇచ్చే రుణాల కోసం హామీ అయివుంటే, తర్వాత ఇచ్చిన ఋణాలు గరిష్ట పరిమితిని దాటకుండా ఉంటే అంతకుముందు తనఖాకు సంబంధించి తర్వాత తనఖా స్వీకర్తకు తెలిసి ఉంటే ముందు తనఖా వాయిదా పడుతుంది.

## తనఖా స్వీకర్త మార్షలింగ్ హక్కు

సెక్షన్ 81

సెక్షన్ 82

## మార్షలింగ్ ప్రశ్న:

1. రెండు లేదా అంతకన్నా ఎక్కువ ఆస్తులు ఇద్దరు విభిన్న వ్యక్తులకు తనఖా చేసినప్పుడు, అదీ రెండు ఆస్తులపై ఒక స్వీకర్తకు తనఖా హక్కులు ఇచ్చి, అందులో ఒక ఆస్తిపై మరొక స్వీకర్తకు తనఖా హక్కు ఇచ్చినపుడు ఈ ప్రశ్న తలెత్తుతుంది.

<u>ఉదాహరణ:</u>

రాముకు రెండు పొలాలు నల్లరేగడి పొలం, ఎర్రమట్టి పొలం ఉన్నాయి. సోముకు నల్లరేగడి, ఎర్రరేగడి పొలాలను అతను తనఖా పెట్టాడు. భీముకు నల్లరేగడి పైన మాత్రమే తనఖా పెట్టాడు.

దానివల్ల పరిస్థితి ఈ విధంగా ఉంటుంది. సోముకు నల్లరేగడి, ఎర్రరేగడిపై తనఖా హక్కులు ఉండగా, భీముకు కేవలం నల్లరేగడి పైనే తనఖా హక్కు ఉంటుంది. సోము తను ఇచ్చిన రుణం రాబట్టుకోవడానికి నల్లరేగడిని, ఎర్ర రేగడిని అమ్మించే హక్కు కలిగి ఉంటాడు. భీముకు మాత్రం కేవలం నల్లరేగడి పొలాన్ని అమ్మించే హక్కు ఉంటుంది.

సోముకు హక్కులను వినియోగించే అనుమతి లభిస్తే, భీము హక్కులకు భంగం ఏర్పడుతుంది. భీము ప్రయోజనాలను రక్షించేందుకు మార్షలింగ్ సమతా సిద్ధాంతం ఏర్పడింది. ఈ సమతా నియమం ప్రకారం మరో వ్యక్తి తనఖాకు లోబడిన ఆస్తి కాక మిగిలిన ఆస్తిపై తనఖా హక్కులను రాము వినియోగించవచ్చు. ఇది సెక్షన్ 81లో ఉంది.

గమనిక- 1. మార్షలింగ్ లాభం పొందేందుకు తనఖా స్వీకర్త తనకు అంతకుముందు తనఖా గురించి తెలుసని, తెలియదని చెప్పే అవసరం లేదు.



# 8. సాక్ష్యచట్టం

## 1. 'సాక్ష్యం' అనే మాటకు అర్థం.

శాసనాలలో వాడే చాలా మాటలకున్న విధంగానే ఈ మాటకు ప్రజామోదమైన అర్థం, సాంకేతికపరమైన అర్థం వున్నాయి.

### ప్రజామోదమైన అర్థం

సాధారణార్థంలో సాక్ష్యం అనే మాట విషయంలోని నిజాన్ని వ్యక్తపరచడం సూచిస్తుంది.
(4 మద్రాస్ 393)

### సాంకేతికార్థం

సాక్ష్య చట్టంలో ఈ మాటను సాంకేతికార్థంలోనే వాడతారు. సాక్ష్య చట్టంలోని 3వ విభాగంలో సాక్ష్యాన్ని ఈ కింది విధంగా నిర్వచించడం జరిగింది. ఆ విభాగం ప్రకారం సాక్ష్యం అంటే

(1) కోర్టువారు వారి ఎదుట విచారణలో వున్న విషయాలకు సంబంధించి వారు అనుమతించిన లేక కోరిన సాక్షుల వాంఙ్మూలాలు

(2) కోర్టు వారి పరిశీలన కోసం కోర్టులో దాఖలు చేసిన అన్ని అధికార పత్రాలు

### 'సాక్ష్యా'నికి ఈ నిర్వచనం అసంపూర్ణం

'సాక్ష్యం' అనే పదానికి పై సెక్షన్‌లో ఇచ్చిన నిర్వచనంలో ప్రకారం సాక్షుల వాంఙ్మూలాలు, అధికార పత్రాలు న్యాయాధికారి విచారణ చేయవలసిన విషయాలలో న్యాయవిచారణ చేయడానికి ఉపకరించే రెండు ప్రధాన సాధనాలు. అధికార పత్రాలలో లేని విషయాలు రుజువు కావడానికి సాక్ష్యులను విచారించడం అనివార్యం (సెక్షన్ 59)

ఎవరిని ఉద్దేశించి లేక ఎవరిపై నిందారోపణగావించి అధికార పత్రం సాక్ష్యులచే వాంఙ్మూలంగా కోర్టులో దాఖలు చేయబడిందో దానిని రుజువు చెయ్యడానికి మౌఖిక సాక్ష్యం అవసరం (సెక్షన్లు 67-73)

'రుజువు చెయ్యబడ్డది' అనే దానికున్న నిర్వచనంతో 'సాక్ష్యా'నికున్న నిర్వచనాన్ని పోల్చిచూస్తే 'సాక్ష్యా'నికిచ్చిన నిర్వచనం సంకుచితంగా కన్పడుతుంది. 'రుజువు చెయ్యబడ్డది' అనే దానికిచ్చిన నిర్వచనం ప్రకారం కోర్టువారు, వారి ఎదుట వున్న విషయాలను పరిశీలించి, వాటిలోని వాస్తవాలను నమ్మిన మీదటనే వాస్తవం రుజువు చెయ్యబడ్డట్లుగా భావించడమవుతుంది...

కోర్టువారి 'ఎదుట వున్న విషయాలు' అనే సాక్ష్య చట్టంలోని 'అధికార పత్రాలు', సాక్ష్యుల వాంఙ్మూలాలకంటే ఎంతో విస్తృత పరిధి కలిగిన విషయాలు.

సాక్ష్య చట్టంలో 'సాక్ష్యా'నికున్న నిర్వచనం ఈ కింది వాటిని పరిగణనలోనికి తీసుకోవడంలేదు.

(1) నిందారోపణ చేసినవారి, నిందారోపణ గావింపబడ్డ వారి వాంఙ్మూలాలు

(2) సాక్ష్యుల ప్రవర్తన

(3) స్థానిక తనిఖీ ఫలితాలు

(4) న్యాయ వివేచనాపరంగా గమనించబడ్డ వాస్తవాలు

(5) విచారణ పరిధిలోని ఆయుధాలు, పనిముట్లు, దొంగిలించబడిన ఆస్తి నిర్ధారణలో వుపకరించే వ్యక్తిగత ఆస్తి పరిశీలన

(6) మెజిస్ట్రేట్ నిందితుని అడిగే ప్రశ్నలు వాటి సమాధానాలు

కానీ పై విషయాలన్నీ 'కోర్టు వారి ఎదుట వున్న' విషయాల లోనికి వస్తాయి.

సాక్ష్యచట్టం నిర్వచనం 'సాక్ష్యచట్టం' ప్రకారం విచారణ చేసే విషయాలకు మాత్రమే వర్తిస్తుంది కాని ఇతర చట్టాల ప్రకారం విచారణ జరపబడే విషయాలలోని సాక్ష్యానికి వర్తించదు.

## 2. భారతీయ సాక్ష్యచట్టం పుట్టుక

1. 1872 చట్టంలో భారతీయ సాక్ష్యచట్టం పొందుపరచబడింది.

## సాక్ష్యచట్టంలోని వైవిధ్యం

2. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనలో బ్రిటిష్‌వారి ఆధీనంలో వున్న భారతీయ ఆస్తులను తమ అదుపులో వుంచుకోవడానికి 1773లో 'క్రమబద్ధీకరణ చట్టం' చేసినప్పటి నుంచి బ్రిటిష్ ఇండియాలో రెండు తరహాల కోర్టులుండేవి. ప్రెసిడెన్సీ పట్టణాలనబడే బొంబాయి,

మద్రాసు, కలకత్తాలలో రాయల్ ఛార్టర్ స్థాపించిన ఉన్నత న్యాయస్థానాలుండేవి. పల్లె ప్రాంత జిల్లాలలో ఈస్ట్ ఇండియా కంపెనీవారు స్థాపించిన సివిల్, క్రిమినల్ న్యాయస్థానాలుండేవి ఉన్నత న్యాయస్థానాలలో పాటించే సాక్ష్యచట్టానికి జిల్లా ప్రాంతంలోని న్యాయస్థానాలలో పాటించే సాక్ష్య చట్టానికి తేడాలుండేవి.

3. 1726వ సంవత్సరం కన్న ముందుగా ఇంగ్లండ్‌లో వున్న సాంప్రదాయక, శాసనబద్ధమైన సాక్ష్య నిబంధనలు 1726లో అధికార పత్రం ద్వారా భారతదేశంలో ప్రవేశపెట్టబడ్డాయి. బ్రిటిష్ పార్లమెంటు నిర్దిష్టంగా భారతదేశానికి విస్తరించబడి శాసనాల ద్వారా భారతదేశంలో ప్రవేశపెట్టిన నిబంధనలు వాడుక, అలవాట్ల ద్వారా చేరిన మరికొన్ని నిబంధనలు

4. రాయల్ ఛార్టర్ (ప్రెసిడెన్సీ పట్టణాలలో స్థాపించిన ఉన్నత న్యాయస్థానాలు కాకుండా పల్లె ప్రాంతాలలో స్థాపించబడిన న్యాయస్థానాలకు సాక్ష్యానికి సంబంధించిన సమగ్ర నిబంధనలు అధికారికంగా ప్రవేశపెట్టడం జరగలేదు. 1793-1834 మధ్య కాలంలో చేసిన నిబంధనలు కొన్ని మాత్రమే. మిగతా నిబంధనలు హెడ్యా, మహమ్మదీయ చట్ట సంబంధమైన అధికారుల నుంచి రివాజుగా వస్తున్న సాక్ష్య చట్టాల ద్వారా వచ్చినవే. మిగతా నిబంధనలు ఆంగ్ల పాఠ్య గ్రంథాల నుంచి సేకరించినవే.

## ఏకరూపకత కోసం ప్రయత్నాలు (అందరికీ ఒకే చట్టం)

5. గవర్నర్ జనరల్ చేసిన సాక్ష్యానికి సంబంధించిన మొదటి చట్టం 1835 చట్టం 10గా పిలువబడుతుంది. ఈ చట్టం బ్రిటిష్ ఇండియాలోని అన్ని కోర్టులకూ వర్తిస్తుంది. ఇది సాక్ష్యానికి, దాని రుజువుకు సంబంధించింది.

తరువాత 20 సంవత్సరాలలో ఈ విషయంలో 11 శాసనాలు చెయ్యబడ్డాయి. ఈ శాసనాల వల్ల సాక్ష్య చట్టానికి చిన్న చిన్న సవరణలు చెయ్యడం, ఇంగ్లండ్‌లో సాక్ష్య చట్టానికి జరిగిన సంస్కరణలను భారతీయ న్యాయస్థానాలకు వర్తింపజెయ్యడం జరిగింది.

బ్రిటిష్ ఇండియాలోని న్యాయస్థానాలకు ఎక్కువ సదుపాయాలు వర్తించే విధంగా వుండేటట్లు సాక్ష్య చట్టానికి చేర్పులు కూర్పులు చేస్తూ 1855లో 1855 చట్టం 2 అనే చట్టం చేయబడింది.

6. ఏకరూపకత కోసం ఇన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ ప్రెసిడెన్సీ పట్టణాలలోని ఉన్నత

న్యాయస్థానాలోని సాక్ష్య చట్టానికీ, పల్లె ప్రాంతాలలోని న్యాయస్థానాలలో పాటించే సాక్ష్య నిబంధనలకీ చాలా తేడాలుండిపొయ్యాయి.

ఈ తేడాలపై చాలా తరచుగా న్యాయసంబంధమైన వ్యాఖ్యానాలు వెలువడుతుండేవి.

ఈ పరిస్థితిని చక్కదిద్దడానికి 1872 చట్టం 1గా పిలువబడే చట్టం చేయబడింది.

## 2 చట్టం 1 నిర్మాణం

1. చట్టం అనేది (1) ఏకీకరణ (2) సవరణ (3) ఏకీకరణ, సవరణ లేక క్రోడీకరణ స్పష్టీకరణ కోసం. చట్ట నిర్మాణం ఏకీకరణ కోసం ఒకవిధంగానూ, క్రోడీకరణ కోసం మరొక విధంగా వుంటుంది.

2. క్రోడీకరణ చట్ట నిర్మాణం:

 క్రోడీకరణ చట్ట నిర్మాణ నిబంధన (1891) A.C.107 (120)లో పొందుపరచబడింది.

 బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండ్‌కు వగ్లియానోకు మధ్య జరిగిన వివాద విచారణలో లార్డ్ హాల్స్ బరీ ఈ కింది విధంగా అభిప్రాయపడ్డారు.

 ''ఒక చట్టాన్ని క్రోడీకరించడానికి శాసనం వున్నపుడు, క్రోడీకరణ కంటే ముందుగా చట్టం వుందనేవాదంతో, శాసనం విధించిన నియమావళి పరిధి దాటి క్రోడీకరించడం, సరియైనదనే అభిప్రాయానికి రాలేకపోతున్నాను.''

 లార్డ్ హార్‌షెల్ ఇదే విషయంలో ఈ కింది విధంగా అభిప్రాయపడ్డారు: పేజి. 144

 ''మొదటగా శాసనంలో వాడిన భాషను పరిశీలించి దాని సహజసిద్ధమైన అర్థం ఏమిటో తెలుసుకోవాలి. శాసనంకన్న ముందున్న చట్టం ప్రభావం ఈ విధమైన పరిశీలనపై వుండకూడదు. ఇంతకు ముందున్న చట్టం ఏవిధంగా వుందోననే విచారణతో బయలుదేరడంగానీ, బహుశా చట్టం ఏవిధంగానూ మార్చకుండా వుండాలనే వుద్దేశంతో చేయబడిందని వూహించడంగానీ, చట్టంలోని మాటలు శాసనంలోని మాటలకనుగుణంగా అన్వయించడానికి వీలుందేమోనని పరిశీలించడానికి జరగకూడదు.''

3. చట్టంలోని ఏభాగాన్నైనా క్రోడీకరణ చేయడంలోని లక్ష్యం ఏమిటంటే చట్టంలో ఏవిషయాన్ని పొందుపరచారో ఆ విషయాన్ని చట్టం సహాయంతో శాసనంగా

రూపొందించడంతోబాటు చట్టంలోని వాడిన భాషతో శాసనంలో వాడిన భాషను సరిచూడడం.

4. క్రోడీకరణ చట్ట నిర్మాణం:

క్రోడీకరణ చట్ట నిర్మాణానికి నిబంధన (1894) **2 Ch. 557**లో పొందుపరచబడివుంది.

జె.షిట్టీ **(P.561)**, బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండ్‌కు వగ్లియానోకు మధ్య తలెత్తిన వివాదంలో లార్డ్ హాల్స్ బరీ ఉటంకించిన క్రోడీకరణ చట్ట నిర్మాణ నిబంధనపై ఈ కింది విధంగా చెప్పారు.

''..... ఇక్కడ నేను పార్లమెంటు చేసిన క్రోడీకరణ చట్టాన్ని గురించి వ్యవహరించడంలేదు. చట్టాన్ని సవరించి క్రోడీకరించడానికి చేసిన చట్టంతో వ్యవహరిస్తున్నానుగాబట్టి లార్డ్ హాల్స్ బరీ అభిప్రాయాలు ఇక్కడ వర్తించవు. చట్టాన్ని సవరించి క్రోడీకరించే చట్టాన్ని గురించి వ్యవహరించేటపుడు ఇంతకు ముందు ఇదే విషయంపై పార్లమెంటు చేసిన చట్ట స్వభావాన్ని పరిశీలించి ఆ చట్టంచెయ్యడంలో పార్లమెంటు ఉద్దేశమేమిటో తెలుసుకోవడం న్యాయబద్ధం.

5. సవరణతోగానీ సవరణలు లేకుండా గానీ చట్టాన్ని క్రోడీకరణ చెయ్యడంలోని లక్ష్యం అమలులోనున్న చట్టంలో చెల్లాచెదురుగా వున్న భాగాలను క్రోడీకరించడం. ఇది పాతచట్టాన్ని మళ్ళీ చట్టం చెయ్యడమే. కొత్త చట్టాన్ని చెయ్యడం కాదు. ఏ పాత చట్టం స్థానంలో ఈ చట్టం ప్రవేశపెట్టబడిందో దాని ప్రభావమే స్థూలంగా దీనికీ వుంటుంది.

6. భారతీయ సాక్ష్యాచట్టం, అవతారికలో చెప్పిన విధంగా సాక్ష్య చట్టాన్ని క్రోడీకరించి, నిర్వచించి, సవరించడానికి ఉద్దేశించినదే.

అది సాక్ష్యాన్ని క్రోడీకరించి, సవరించే శాసనం కాదు. అది సాక్ష్యాన్ని క్రోడీకరించే చట్టం. బ్యాంక్ ఆఫ ఇంగ్లండ్‌కు వగ్లియానో కేసులో చెప్పబడిన నిబంధనపై దాని నిర్మాణం జరగాలి.

## చట్టపరిధి, విస్తృతి

1. చట్టం పరిధి రెండవ సెక్షన్‌లో నిర్వచించబడింది. సెక్షన్ 2 కింద సాక్ష్య చట్టం ఈ కిందవాటిలో వుంది.

(i) సాక్ష్యచట్టం

(ii) సాక్ష్యానికి సంబంధించిన విషయాలనుగురించి ప్రత్యేకించి చెప్తూ నిర్దిష్టంగా రద్దుచెయ్యబడని చట్టాలలో, శాసనాలలో చెప్పబడని సాక్ష్యాన్ని నిషేధిస్తూ నిర్దేశిస్తుంది.

సెక్షన్ 2: ఈ కింది చట్టాన్ని రద్దు చెయ్యాలి.

(1) అమలులో ఉన్న శాసనం, చట్టం, నిబంధనలలో లేని సాక్ష్యానికి సంబంధించిన అన్ని నిబంధనలు

(2) ఇండియన్ కౌన్సిల్స్ ఆక్టు 1861, సెక్షన్ 25 కింద చట్ట సామ్యతను పొందిన అన్ని నిబంధనలు

(3) అనుబంధంలో చేర్చబడిన అన్ని శాసనాలు

## 2. సాక్ష్యచట్టం, సాక్ష్యానికి సంబంధించిన ఇతర చట్టాలు -

(1) సాక్ష్యచట్టం చట్టంలో ఒక ముఖ్యమైన ప్రత్యేక భాగం. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని కార్య విధానంతో దీనికి ప్రమేయంలేదు. ఇది రద్దయినట్లుగానీ, సవరించినట్లు గానీ ఋజువు చేస్తే తప్ప దీని పరిధి సంపూర్ణ మనుకోలేము.

7 లాహోర్ 84

## చట్టం వర్తింపు

సెక్షన్ 1 ఈ చట్టం ఎంతవరకు వర్తిస్తుంది అనే దాన్ని నిర్ణీతపరుస్తుంది.

### (1) ప్రాంతీయ వర్తింపు

ఇది బ్రిటిష్ ఇండియా అంతకూ వర్తిస్తుంది. కావున అనుబంధ జిల్లాలకూ వర్తిస్తుంది. ఏ ప్రదేశాలలో ఇది వర్తిస్తుందని ప్రకటిస్తారో ఆ ప్రదేశాలన్నిట్లో ఈ చట్టం వర్తిస్తుంది.

### (2) ప్రాదేశిక వర్తింపు

కోర్టులోగాని, కోర్టు ముందుగాని ఉన్న అన్ని న్యాయసంబంధమైన కార్య వ్యవహారాలకు ఈ చట్టం వర్తిస్తుంది.

(i) న్యాయస్థాన కార్యవ్యవహారాలంటే ఏమిటి? దీనికి నిర్వచనం లేదు.

ఒక వ్యక్తికి మరొక వ్యక్తికి లేక వ్యక్తుల సముదాయానికి లేక సమూహానికి వున్న సంబంధాన్ని విచారణ చేసేటపుడు విచారణ లక్ష్యం సహజసిద్ధమైన హక్కును నిర్ణయించడానికియినప్పుడే దానిని న్యాయబద్ధ విచారణ అవుతుంది. అటువంటి లక్ష్యం లేకుండా న్యాయాధికారి వ్యవహరించినా ఆ న్యాయాధికారి న్యాయబద్ధంగా వ్యవహరించనట్లే.

12 బొంబాయి 10 M.I.A. 340

బాంబే ల్యాండ్ రెవెన్యూ కోడ్‌లోని సెక్షన్ 32 కింద జరిపే విచారణ న్యాయసంబంధ కార్యవ్యవహారం కాదు.

22 బొంబాయి 936

2. ఈ చట్టం న్యాయసంబంధమైన సివిల్, క్రిమినల్ కార్యవ్యవహారాలన్నిటికి వర్తిస్తుంది.

3. ఈ చట్టంలోని కార్యవ్యవహారాలనేవి చాలా విశాలార్థం కలిగి వున్నాయి. దావాలు, విచారణలు మాత్రమే కార్యవ్యవహారాలు కావు. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని సెక్షన్ 107 లేక 144 కింద జరిపే దర్యాప్తు కార్యవ్యవహారమేగాని విచారణ కాదు. ఈ చట్టం దావా విచారణలుగాని కార్యవ్యవహారాలకు వర్తిస్తుంది.

**(ii)** కోర్టు అంటే ఏమిటి?

1. సెక్షన్ 3లో ఇచ్చిన వివరణలో ఈ చట్టంలో కోర్టు అనే పదం ఏ అర్థంలో వాడబడిందనేది తెలుస్తుంది. దాని ప్రకారం-

   ''న్యాయరీత్యా సాక్ష్యం సేకరిచడానికి అధికారం కలిగిన జడ్జీలు, మెజిస్ట్రేట్‌లు, మధ్యవర్తులు తప్ప మిగిలిన అందరూ కలిసి కోర్టు అవుతుంది''

2. ఈ సెక్షన్‌లో కోర్టుకు నిర్వచనం చెప్పబడలేదు. ఏ ఏ వ్యవహర్తలు కలిసి కోర్టుగా ఏర్పడతారో మాత్రమే ఈ సెక్షన్ చెప్తుంది.

3. వివరణలో ఒక పదంలో ఏమేమి ఇమిడి వుంటాయో చెప్తుందంటే ఆ పదం సాధారణార్థాన్ని నిలిపి వుంచుకొన్నదనీ, సాధారణార్థంలో ఇమిడి వుండని విషయాల్ని వివరణ ద్వారా తెలిపి ఆ పదం అర్థాన్ని విస్తరించడం జరిగిందనుకొవాలి. **23 A.L.J. 845**

4. మధ్యవర్తులు మినహా న్యాయరీత్యా సాక్ష్యం సేకరించడానికి అధికారం కల్గిన వారందరూ

కలిసి కోర్టు అతుంది. అయితే కోర్టు అనే పదం సివిల్, క్రిమినల్ అధికారణాల అధ్యక్షులకు మాత్రమే పరిమితం చెయ్యకూడదు.

రిజిస్ట్రేషన్ చట్టం కింద దర్యాప్తు జరిపి సాక్ష్యం తీసుకొనే రిజిస్ట్రార్ కూడా కోర్టు అవుతుంది.
15 మద్రాస్ 138

సివిల్ ప్రొసీజర్ కోడ్ ఆదేశం XXVI R.1-10, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ సెక్షన్ 503-508 కింద నియమించబడిన కమిషనర్ కూడా న్యాయరీత్యా సాక్ష్యం తీసుకోవడానికి అర్హుడు కాబట్టి ఆయన కూడా కోర్టే.

## 5. జడ్జీలు

'జడ్జీలు' అనే మాటకు చట్టంలో నిర్వచనం ఇవ్వబడలేదు. సివిల్ ప్రొసీజర్ కోడ్ సెక్షన్ 2(8) లో 'జడ్జీ' అనే మాటను సివిల్ కోర్టు 'అధ్యక్ష అధికారి' అనే అర్థంలో వాడడం జరిగింది.

భారత శిక్షాస్మృతి (ఇండియన్ పీనల్ కోడ్) సెక్షన్ 19 కూడా 'జడ్జీ' అనే మాటను నిర్వచించింది. ఆ నిర్వచనం ప్రకారం జడ్జీగా హోదా నిర్దేశం చేసి చట్టరీత్యా సివిల్, క్రిమినల్ న్యాయవ్యవహారాలలో నిర్దిష్టమైన తీర్పు చెప్పడానికి అధికారమివ్వబడినవాడు.

## 6. మెజిస్ట్రేట్‌లు

ఈ పదానికి చట్టంలో నిర్వచనం లేదు. జనరల్ క్లాజెస్ ఆక్టు 1897, Xలో ఈ పదానికి క్రింది నిర్వచనమివ్వబడింది:-

అప్పటికప్పుడు అమలులోనున్న క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ ప్రకారం మెజిస్ట్రేట్ అధికారాలను కొన్నిటిని గానీ అన్నిటిని గాని నిర్వహిస్తున్న ప్రతివాడు మెజిస్ట్రేట్.

## 7. ఈ నిర్వచనాలలో వింతేమిటంటే వీటిలో ఏకరూపతా లేదు సహవ్యాప్తి లేదు.

(i) సివిల్ ప్రొసీజర్ కోడ్‌లోని 'జడ్జీ' నిర్వచనానికి ఆధారం, జడ్జీ అధ్యక్ష అధికారి కావడమే.

ఇదే మాటకు ఇండియన్ పీనల్‌కోడ్‌లో నిర్వచనానికి ఆధారం, అధికారికి తీర్పు చెప్పే అధికారం ఉండడమే. సాక్ష్య చట్టంలో నిర్వచనం సాక్ష్యం తీసుకోవడానికి అధికారం కలిగి వుండడం.

(ii) క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లో 'జడ్జీ' అనే పద నిర్వచనంలో మెజిస్ట్రేట్‌ను కలుపలేదు. కానీ ఇండియన్ పీనల్ కోడ్‌లో ఇచ్చిన నిర్వచనంలో జడ్జీలను, మెజిస్ట్రేట్‌లను, మధ్యవర్తులను కలపడం జరిగింది.

(iii) సాక్ష్యచట్టంలో జడ్జీలు, మెజిస్ట్రేట్‌లు, మధ్యవర్తుల మాటేలేదు. కానీ ఇండియన్ పీనల్ కోడ్‌లో 'జడ్జీ' నిర్వచనంలో జడ్జీలను. మెజిస్ట్రేట్‌లను, మధ్యవర్తులను కలిపారు.

దీనినిబట్టి తేలేదేమిటంటే సాక్ష్య చట్టంలో వాడబడిన 'కోర్ట్' నిర్వచనం సాక్ష్య చట్టానికి పరిమితమైనదే. కావున దాని న్యాయపరిమితి దాటి సాక్ష్యచట్టంలోని 'కోర్టు' అనే పదాన్ని విస్తరించకూడదు.

## సాక్ష్యచట్టం వర్తించని కార్యవ్యవహారాలు

**1. సాక్ష్యచట్టం ఈ కింది వానికి వర్తించదు:-**

(i) సైనిక, వైమానిక చట్టాలకింద నియమించబడిన కోర్ట్ మార్షల్ ముందున్న న్యాయసంబంధ కార్యవ్యవహారాలు

(ii) కోర్టుకుగాని అధికారికిగాని సమర్పించబడిన ప్రమాణ పత్రాలు

(iii) మధ్యవర్తుల ముందున్న కార్యవ్యవహారాలు

## కోర్ట్ మార్షల్ ముందున్న కార్యవ్యవహారాలు

1. భారతీయ సైనికచట్టం కింద నియమించబడిన కోర్టు మార్షల్ ముందున్న కార్యవ్యవహారాలకు ఈ చట్టం వర్తించదు. కానీ, దేశీయ కోర్టులచే నియమించబడిన మార్షల్ ముందున్న కార్యవ్యవహారాలకు ఈ చట్టం వర్తిస్తుంది.

2. భారతీయ నావికా కోర్టులచే నియమించబడిన కార్యవ్యవహారాలన్నింటికీ ఈ చట్టం వర్తిస్తుంది.

1887 చట్టం XIV S.68

1898 చట్టం V

1898 చట్టం XVII

1899 చట్టం I

3. బ్రిటిష్ సైనిక, వైమానిక చట్టం కింద నియమించబడిన కోర్టు మార్షల్ కార్య వ్యవహారాలకు ఈ చట్టం వర్తించదు.

ఏ దేశంలో సాక్ష్యానికి సంబంధించిన సమస్యలు ఉత్పన్నమవుతాయో, ఎక్కడయితే ఆ సమస్యలకు పరిష్కారం కావాలో, ఎక్కడయితే సాక్ష్య చట్టాన్ని అమలు పరచడానికి కోర్టు వుందో ఆ దేశానికి సంబందించిన చట్టం ప్రకారమే నిర్ణయాలు చెయ్యాలి.

కోర్టు ముందున్న కార్యవ్యవహారాలను పాలించే సాక్ష్య చట్టాన్ని 'ఏక్స్‌ఫోరై' అంటారు.

సాక్ష్య చట్టంలోని ఈ సదుపాయం, సాధారణ సూత్రానికి మినహాయింపు.

## II. ప్రమాణ పత్రాలు ( అఫిడవిట్లు)

సాధారణంగా బహిరంగ కోర్టులో జడ్జీగారి ఎదుట, వారి నిర్దేశానుసారం, వారి పర్యవేక్షణలో మౌఖిక సాక్ష్యాన్ని తీసుకోవడం జరుగుతుంది.

2. ఒక ప్రకటనలోగానీ, వాంఙ్మూలంలోగాని ప్రమాణం, ధృవీకరణ చేయించడానికి అధికారం గల వ్యక్తి ఎదుట ప్రమాణ పూర్వకంగా చేసిన ప్రకటనలోగాని, రాతపూర్వకంగా ఇచ్చిన వాంఙ్మూలంలో గాని ఉన్న సాక్ష్యాన్ని ప్రమాణపత్రం ( అఫిడవిట్) అంటారు.

3. ప్రమాణ పత్రానికి సంబంధిన విషయాలు సివిల్ ప్రొసీజర్ కోడ్‌ని బంధిస్తుంది.

4. ప్రమాణ పత్రం ( అఫిడవిట్) కోర్టుముందు తీసుకొనేది కాదు. దానిని అడ్డు పరీక్ష(Cross-examination) చెయ్యరాదు.

5. ప్రమాణ పత్రాలలో నిజానికి ఈ కింది వాటి నుంచి రెండు రక్షణలున్నాయి.

(i) సాక్షిని అడ్డుపరీక్షకు నిలుపడం.

(ii) తప్పుడు సాక్ష్యానికి సంబంధించిన శిక్షాస్మృతి వర్తింపు.

## III. మధ్యవర్తి కార్యవ్యవహారాలు.

మధ్యవర్తి ఇచ్చే తీర్పు సాక్ష్య చట్టం పరిధిలోనికి రాదు. అది కొంచెం అటూ ఇటూగా వెంటనే వెలువడినప్పటికీ సాక్ష్య చట్టానికి నిలబడదు.

## సాక్ష్య చట్ట అధ్యయనానికి సరియైన మార్గం

1. భారతీయ సాక్ష్యచట్టం సాక్ష్యానికి సంబంధించిన విషయాలను మూడు భాగాలుగా విభజించింది.

   మొదటి భాగంలో- ఘటనా సంబంధిత అంశాలు **(Relevency of facts)** - ఏ అంశాలు నిరూపించతగినవి అనే వాటి గురించి ఉంది.

2. ఇది తార్కిక క్రమం కావచ్చు. శాస్త్ర క్రమం కావచ్చు. కానీ వ్యాజ్యాలకోరు దృక్కోణం నుంచి చూస్తే సహజ క్రమంలాగా కన్పడదు.

3. కార్య వ్యవహారాల నిబంధనలు వ్యాజ్యాన్ని సాధారణంగా నడపవలసిన విధానాన్ని నిబంధిస్తాయి. కక్షిదారుల, కోర్టువారి మార్గదర్శనం కోసం సమస్యలలోని నిజాలను రాబట్టడం కోసం వాదనలుపకరిస్తాయి. వీటి తర్వాత సరియైన న్యాయసాధనాల ద్వారా సమస్యలలోని నిజాన్ని కోర్టువారి తృప్తిమేరకు నిరూపించడం వస్తుంది

4. వ్యాజ్యకారుని మొదటి సమస్య ఎవరు నిజాన్ని నిరూపించాలనేది. ఎట్లా, ఏవిధమైన సాక్ష్యం ద్వారా నిరూపించాలనేదానికి రెండోస్థాయి ప్రాముఖ్యమిస్తాడు. కాబట్టి రుజువు చేసే భారం ఎవరు వహించాలనేదానితో చట్ట అధ్యయనం సాగించాలి.

## భాగం-I

# నిరూపణ భారం

## 1. నిరూపణ భారం అంటే అర్థమేమిటి?

నిరూపణ భారానికి వివరణ, దాని విషయం, నిర్వచనం: ఒకకేసులోని అంశాలలో నిజానిజాలను కక్షిదారులు రుజువుచేసినప్పుడు, జడ్జీకిగాని న్యాయనిర్ణాయక సంఘం (జూరీ)కు గాని ఆ అంశాలలో నిజానిజాలు తెలియనప్పుడు, రుజువు చెయ్యబడిన అంశాలు ఆధారంగా కేసు పరిష్కరింపబడుతుంది. కేసులోని అంశాలు సాక్ష్యంతో నిరూపించబడాలి. అయితే ఈ సాక్ష్యం ఎవరు ప్రవేశపెట్టాలి అనే ప్రశ్న ఉదయిస్తుంది. సాక్ష్యం ప్రవేశపెట్టి, నిరూపణచెయ్యడమనే బాధ్యతను 'నిరూపణ భారం' అంటారు.

2. న్యాయ సంబంధమైన కార్య వ్యవహారాలలో నిరూపణ భారానికి సంబంధించిన విషయం రెండు భాగాలుగా విభజించబడింది.

1. వాదాంశాన్ని నిరూపించడం (issue)

2. వాస్తవాంశాన్ని నిరూపించడం (fact)

ఈ విధంగా విభజించాల్సిన అవసరం

1. వాదాంశం రుజువు చెయ్యడంలో చాలా అంశాల నిరూపణ ఇమిడి వుండవచ్చు.

ఉదాహరణ:-

1. 'ఏ' అనే వ్యక్తి 'బి' అనే వ్యక్తిని హత్యచేశాడా అనేది వాదాంశం అనుకుందాం.

2. అధికారపత్రం (డాక్యుమెంట్) పైనున్న సంతకం 'ఏ' అనే వ్యక్తిదేనా అనే రెండవ వివాదాంశం.

రెండవ వివాదాంశంలో నిరూపించాల్సిన విషయం ఒకటే.

మొదటి వాదాంశంలో నిరూపించాల్సిన విషయాలు చాలా వుంటాయి.

ఉదాహరణకు: 'ఏ' అనేవాడు హత్య జరిగినప్పుడు ఉన్నాడా? 'సి' అనేవాడు 'ఏ'ను చూడగలిగాడా? రక్తపు మరకలున్న చొక్కా అతనిదేనా? ఈవిధంగానే మరికొన్ని వివరణలు నిరూపణకు అవసరమవుతాయి.

వాదాంశాన్ని నిరూపించే భారం.

3. వాదాంశం ఉత్పన్నం కావడానికి కొన్ని అంశాలు, పరిస్థితులు ఉన్నాయనే పూర్వభావన గల కక్షిదారునికి, అటువంటి అంశాలు, పరిస్థితులు లేవనే ఎదుటి కక్షిదారుని భావన కారణాలు. వాదాంశాలలో న్యాయ నిర్ణయం చెయ్యడానికి రెండు పద్ధతులున్నాయి. అవి (1) కక్షిదారుడు పూర్వభావనపరంగా అనుకొంటున్న విషయాలూ, పరిస్థితులు లేవని నిరూపించడం (2) అటువంటి విషయాలూ, పరిస్థితులున్నాయని నిరూపించడం. ఈ రెండు పద్ధతులలో ఏ పద్ధతి అవలంబించి నిరూపించాలనేది సమస్య. నిందారోపణకు అవసరమైన పరిస్థితులున్నాయని నిరూపించడమా? అటువంటి పరిస్థితులేమీ లేవని నిరూపించడమా?

(a) నిందారోపణ చెయ్యడానికి తగిన విషయాలూ, పరిస్థితులూ ఉన్నాయనేదానికి లేవనేదానికన్నా సంభావ్యత (ప్రాబబలిటీ) వున్నపుడు

(b) నిందా నిరూపణకవసరమైన సాధనాలు ఇద్దరు కక్షిదారులకూ సమానంగా అందుబాటులోనున్నపుడు

పైవిధంగా భావించడానికి కారణాలు లేనప్పుడు నిందారోపణకు కావలసిన విషయాలూ పరిస్థితులూ వున్నాయనే కక్షిదారునిపై నిరూపించాల్సిన బాధ్యత నిబంధనల ప్రకారం వుంది. నిందారోపణ చెయ్యడానికి కావల్సిన పరిస్థితులు ఉన్నాయనే వాడిపైనే వాటిని నిరూపించాల్సిన బాధ్యత వుంటుంది గాని అటువంటి పరిస్థితులుగానీ, విషయాలుగానీ లేవనే వాడిపై లేవని నిరూపించాల్సిన బాధ్యతలేదు.

సాక్ష్యచట్టంలో ఈ నిబంధన సెక్షన్ 101 లో పొందుపరచబడింది.

5. నిందారోపణకు పరిస్థితులో, విషయాలూ లేవనేదానికి బదులుగా ఉన్నవనేది నిరూపించాలని చట్టం కోరడానికి గల కారణాలు.

(1) న్యాయవిచారణా సంఘం ముందుకు తన ఎదుటివానిని లాగినవాడు తన హక్కులో వున్న బలం, తనకున్న సాక్ష్యంలోని స్పష్టతపైననే ఆధారపడాలిగాని ఎదుటి వ్యక్తి హక్కు లేదనేదానిపైనా, ఎదుటి వ్యక్తి బలహీనతపైన కాదు.

<u>ఉదాహరణ:</u>

మిడ్‌ల్యాండ్ రైల్ కంపెనీ, బ్రాంచీల వివాదం - **17CB372**. డో, లాంగ్ ఫీల్డ్‌ల వివాదం - **16 M&W 497**

17 C.B. 372

**P.380**

(2) ఒక అంశానికి విరుద్ధంగా చెప్పాలంటే విరుద్ధానికున్న అనిశ్చిత కారణంగా దీని నిరూపణ అసాధ్యంకాకపోయినా కష్టమైన పని. ఒక వ్యక్తి ఎప్పుడు, ఎక్కడ, ఏ పరిస్థితులలో ఫలానా సంఘటన జరిగిందని గట్టిగా చెప్పాడనుకుందాం. ఆ సంఘటన ఎప్పుడూ, ఎక్కడా, ఏ పరిస్థితులలోనూ జరగలేదని అందరినీ ఒప్పించి మరో వ్యక్తి ఎలా నిరూపించగలడు? చాలా సందర్భాలలో ఇటువంటి విషయాలలో ఎక్కువలో ఎక్కువ చెయ్యగలగిందల్లా జరిగిందుకుంటున్న సంఘటన జరగడానికి వీలులేదని చూపించడమే. ఈవిధంగా చెయ్యాలన్నా చాలా పెద్ద పురోభావ్య (ప్రిజమ్టివ్) సాక్ష్యం కావాలి.

ఒక సంఘటన జరగలేదని గట్టిగా చెప్పడానికీ, జరిగిందని చెప్పేదాన్ని ఖండించడానికీ బేధాన్ని గమనించాలి. జరిగిందనేదాన్ని ఖండించడాన్ని సాంకేతికంగా 'ట్రావెర్స్' (ఖండన) అంటారు.

దురుద్దేశ పూరిత నేరవిచారణ (Malicious Prosecution) దురుద్దేశంతో నేరవిచారణ ప్రారంభించారనే అభియోగంలో వాది రెండు ముఖ్యమైన ఆరోపణలు చేస్తాడు.

(1) ప్రతివాది తనను ప్రాసిక్యూట్ చేశాడనీ

(2) ప్రాసిక్యూట్ చెయ్యడానికి తగిన కారణాలు లేవనీ.

పైవాటిలో మొదటిది సానుకూల (పాజిటివ్) మయినది. రెండవది ప్రతికూలమైనది (నెగెటివ్) ఈ రెండింటి నిరూపణ భారం వాదిపైననే వుంటుంది.

## నిర్లక్ష్యం

ప్రతివాది సరియైన జాగ్రత్త వహించలేదు. ఇది విరుద్ధమైన విషయాన్ని గట్టిగా చెప్పడం.

6. ప్రతిపాదనలోని సానుకూల (పాజిటివ్) విషయాన్ని నిరూపించాలనేది సాక్ష్యచట్ట నిబంధనలో ముఖ్యమనే విషయాన్ని గమనించాలి.

**12 Mad. 526 - 15 Jur. 544-545**

## ఖండన (ట్రావెర్స్) అంటే ఏమిటి

1. ఇది వకాల్తాకు సంబంధించిన చట్టసంబంధమైన విషయం. వ్యాజ్యకారుల మధ్యనున్న వివాదంలో తీర్పు చెప్పవలసిందిగా జడ్జీని కోరేముందు వారి ముందుంచిన విషయం సుష్పష్టంగా, నిశ్చితంగా

సమర్పించడమనేది చాలా కేసుల్లో అవసరం. ప్రతివాదికి వాది తనపై ఏ నింద వేశాడో తెలుసుకొనే హక్కుంది. వాదికి తాను చేసిన అభియోగానికి ప్రతివాది ఏ ప్రతివాదన ద్వారా సమాధానం చెపుతాడో తెలుసుకొనే హక్కుంది. వాది చెప్పే కథనాలన్నింటినీ ప్రతివాది వివాదాస్పదమైనవి అనవచ్చు. లేదా వాటిని ఒప్పుకొని కేసుకు వేరే స్వరూపం వచ్చే విషయాలను ప్రతిపాదించవచ్చు.

దీన్నే సాంకేతికంగా చెప్పాలంటే ప్రతివాది ఈ కింది విధంగా చెయ్యవచ్చు.

(1) ఒప్పుకోవడం (అంగీకారం)

(2) నిరాకరించడం

(3) నిరాకరిస్తూ, వేరే అంశాలను లేవనెత్తి అభియోగం చెయ్యడం

2. వాటి అభియోగాలను ప్రతివాది నిరాకరించినప్పుడు ప్రతివాది వ్యతిరేకించాడు ((ట్రావెర్స్) అంటారు. ట్రావెర్స్ అంటే ప్రత్యర్థి వాదనలలోని అభియోగాలకు వ్యతిరేకత తెల్పడం. అంటే ఈ నిబంధన ఒకరు తెచ్చే అభియోగాన్ని ప్రత్యర్థి వ్యతిరేకించడం అనే దానిని మూలాధారంగా చెయ్యబడింది. నిందను వ్యతిరేకించడానికీ ప్రతి నిందారోపణ చెయ్యడానికీ తేడా వుంది.

ఒక కక్షిదారుడు ఒక విషయం జరిగిందని గట్టిగా చెప్పినప్పుడు జరిగిందనడాన్ని నిరూపించడానికి కొన్ని అంశాలు లేవనో, లేక ఫలానా విషయం ఫలానా పనికోసం చాలదనో చెప్పాల్సి వుంటుంది. ఆ విధంగా చెప్పడమనేది పైకి వ్యతిరేకంగా (నెగెటివ్)గా కన్పించినా నిజానికి అది వ్యతిరేకం కాదు. అది నిజానికి అనుకూలమైన (పాజిటివ్) అంశాలే. ఈవిధంగా చెప్పిన కక్షిదారుడు వాటిని నిరూపించాల్సి వుంటుంది.

వాది తన అనుకూలమైన అంశాలను నిరూపించడాని ప్రతికూలమైన (నెగిటివ్) అంశాలను రుజువు చెయ్యవలసి రావచ్చు.

ప్రతికూలమైన విషయాలు నిజంగా సానుకూల అంశాలయితే వాటిని వాది రుజువు చెయ్యాలి. అమ్మకం, తాకట్టు పెట్టడం - చాలినంత విలువ అనే విషయాలలో విలువ చాలినంతగా లేదనేది ప్రతికూలంగా కన్పడ్డప్పటికీ దీనిని రుజువు చెయ్యాల్సిన బాధ్యత వారిదే.

**II. ఒక సమస్యలోని అనుకూలాలు, ప్రతికూలాలు విషయంలోని అనుకూలాలుగా, ప్రతికూలాలుగా భావించాలిగాని రూపంలో అనుకూలాలు, ప్రతికూలాలు భావించరాదని గుర్తుంచుకోవాలి.**

<u>ఉదాహరణలు:</u>

మోడి, రాజిన్‌సన్ 464. అమోస్, హ్యూజెస్ వివాదం.

దావాలో నిందమోపిన అంశం.

పని తెలిసినవాని మాదిరి ప్రతివాది కాలికోను ఉబ్బెత్తు ముద్ర వేయలేడనే ఆరోపణ. రాతపూర్వక వాంఙ్మూలంలోని నిందారోపణ.

ప్రతివాది పనివాని మాదిరిగానే కాలికో ఉబ్బెత్తు ముద్రవేశాడు. నిరూపించాల్సిన భారం ఎవరిపై వుంటుంది? ఈ అంశం రూపం మాత్రమే లెక్కలోనికి తీసుకుంటే నిరూపణ భారం ప్రతివాదిపై ఉంటుంది. ఈ అంశంలోనున్న విషయాన్ని లెక్కలోనికి తీసుకుంటే నిరూపణ భారం వాదిపైననే వుంటుంది. పనివాని నేర్పరితనంతో ముద్రించలేదని వాది ప్రతికూలంగా చెప్తున్నప్పటికీ పని తెలువనివానిగా ముద్రించాడనే భావం అనుకూలమవుతుంది.

(2) 7 కారింగ్‌టన్, పైన్ 612. లోవర్డ్, లెగ్గాట్ వివాదం వాది నిందారోపణ గావించిన అంశం.

రాత పూర్వకమైన ఒప్పందం ప్రకారం ప్రతివాది, వాదియొక్క ఆవరణ (ప్రెమిసెస్)ను మరమ్మతు చేయలేదు.

తాను మరమ్మతు చేశాననేది ప్రతివాది వాదన.

ఈ అంశం రూపం (ఫామ్) మాత్రమే చూస్తే అనుకూలమయిన ప్రతివాది వాదనను ప్రతివాదే నిరూపించాల్సి వుంటుంది. దానిలోని విషయం పరిశీలిస్తే ఒప్పందం ప్రకారం మరమ్మతు చెయ్యలేదనే అంశాన్ని నిరూపించాల్సింది వాది మాత్రమే.

క్రిమినల్ విచారణలలో నిరూపణ భారం.

1. 101వ సెక్షన్, సాధారణ సెక్షన్: ఇది సివిల్, క్రిమినల్ కార్యవ్యవహారాలకు వర్తిస్తుంది. 105వ సెక్షన్ అంశ నిరూపణకు కాక వివాద నిరూపణకు సంబంధించింది. ఈ సెక్షన్ క్రిమినల్ కార్యవ్యవహారాలకు మాత్రమే వర్తిస్తుంది.

2. ఈ సెక్షన్ అవగాహన చేసుకోవాలంటే భారతీయ శిక్షాస్మృతి (ఇండియన్ పీనల్ కోడ్) పథకాన్ని (స్కీమ్) తెలుసుకోవాలి. భారతీయ శిక్షాస్మృతి, దొంగతనం, హత్య, మోసం మొదలైన

పలురకాలైన 400 నేరాలను నిర్వచించింది. మరీ విశాలంగానూ, మరీ సంకుచితంగానూ లేకుండా నేరాలకు సరియైన నిర్వచనాలు చెప్పడం చాలా కష్టమైన విషయం. ఈ నిర్వచనాలు రచించిన వారు ఎంత మంచి ప్రయత్నాలు చేసినప్పటికీ నేరాలకు సరిగ్గా సరిపడే నిర్వచనాలు అందించలేకపొయ్యారు. నిర్వచనాలు చాలా విశాలంగా రచించి పొరపాటు చేయడంవల్ల, వాటిని మినహాయింపుల చట్టాల ద్వారా పరిమితులను కల్పించాల్సి వచ్చింది. కోడ్ నిర్వచించిన నేరాలన్నింటికీ వీటిలో కొన్ని పరిమితులు వర్తిస్తాయి. మిగిలిన మినహాయింపులు ప్రత్యేతమైన నేరాలకు మాత్రమే వర్తిస్తాయి.

<u>ఉదాహరణ (1):</u>

(1) గాయం చేసిన వారికి ... 323 IPC

(2) దొంగతనం చేసిన వారికి ... 379 IPC

ఇక్కడ గాయం చేసినవారు, దొంగతనం చేసినవారు ఏ వయస్సులోనున్నవారైనా ఈ మినహాయింపు చట్టం వర్తిస్తుంది. ఒక సంవత్సరం వయసున్న బిడ్డకైనా వర్తిస్తుంది. కానీ పీనల్ కోడ్‌లో 7 సంవత్సరాల వయసునన వారికి పైనేరాలు చెయ్యడానికి ముఖ్యం అయిన నేర ప్రవృత్తిగల మనస్సుండదని గుర్తిస్తుంది. కాబట్టి పీనల్ కోడ్‌లోని ప్రతి సెక్షన్‌లో నేరారోపణలు గావించబడడానికి, 7 సంవత్సరాల లోపు వయస్సున్న వారు మినహాయించబడతారని చెప్పవలసి వుంది.

(1) ఎవరైతే ఆస్తి సొంతదారులు అభిమతం లేకుండా వారి ఆస్తిని కాజేస్తారో వారు - 378

(2) అక్రమంగా నిర్బంధించిన వారు - 342

(3) ఇతరుల ఆధీనంలోని ఆస్తిలోనికి ప్రవేశించినవారు - 441

(4) ఇతరులపై దౌర్జన్యం లేక నేర బలప్రయోగం చేసినవారు - 352

ఈ నిర్వచనాల ప్రకారం న్యాయస్థానం ఉత్తర్వులపై వారంట్లు జారీచేసి ఆస్తి జప్తు చేయడానికి నియమించబడిన కోర్టు అమీను 378వ నిబంధన ప్రకారం దొంగతనం చేసినట్లూ, 441 నిబంధన ప్రకారం నేరం కింది వచ్చే అతిక్రమణ (ట్రెస్‌పాస్) చేసినట్లూ అవుతుంది. అదేవిధంగా 353 నిబంధన ప్రకారం తన విధి నిర్వహణలో ఒక వ్యక్తిని అరెస్టు చేసిన పోలీసు అధికారి 353 నిబంధన ప్రకారం తన విధినిర్వహణలో ఒక వ్యక్తిని అరెస్టు చేసిన పోలీసు అధికారి 353 నిబంధన ప్రకారం దౌర్జన్యం చేసినట్లూ, 342 నిబంధన ప్రకారం నేర బల ప్రయోగం చేసినట్లూ అవుతుంది.

పీనల్ కోడ్ చట్టం రూపొందించిన వారి ఉద్దేశం అదికాదు. శిక్షాస్మృతి (పీనల్‌కోడ్) కింద నేరాలుగా భావింపబడే వాటినుంచి, విధి నిర్వహణలో భాగంగా ప్రభుత్వోద్యోగస్తులు తీసుకున్న చర్యలను మినహాయించవలసిన అవసరాన్ని చట్టం గుర్తిస్తుంది. పై నిర్వచనాల పరిధి నుంచి ప్రభుత్వోద్యోగులను మినహాయించాలంటే ప్రతి నిర్వచనంలోనూ 'విధి నిర్వహణలోనున్న ప్రభుత్వ వుద్యోగస్తులుగాని ఎవరైనా' అని చేర్చవలసి వుంటుంది.

పీనల్‌కోడ్‌లోని ప్రతి సెక్షన్‌లో ఈ పరిమితుల నుద్దేశించిన మాటలను చేర్చేబదులు వాటన్నిటినీ ఒకచోట చేర్చి అధ్యాయం IVగా చెప్పడం జరిగింది. దీనినే 'సాధారణ మినహాయింపులు' అని పిలుస్తారు. సెక్షన్ 76 నుంచి 106 వరకు ఈ అధ్యాయంలో వున్నాయి.

పీనల్ కోడ్‌లో ప్రత్యేక నేరాలుగా నిర్వచించబడిన నేరాలకు వర్తించే కొన్ని పరిమితులను విధించే క్లాజులు కూడా ఉన్నాయి.

<u>ఉదాహరణ:-</u>

సెక్షన్ 499 పరువు నష్టం

దీని నిర్వచనం ఎంత విస్తృతమైనదంటే దానినుంచి మినహాయింపులే పది వున్నాయి.

తొమ్మిదవ మినహాయింపు 'ప్రయోజన రక్షణ' కోసం ఉద్దేశించబడింది.

ఈవిధమైన మినహాయింపులు ప్రత్యేక మినహాయింపులు. ఇవి సాధారణ మినహాయింపులు కావు.
షరతు - (ప్రొవిజో)

నిందితుని కేసుకు 'సాధారణ' లేక 'ప్రత్యేక' మినహాయింపు పరిధిలోనికి వస్తుందనేది ఎవరు రుజువు చెయ్యాలనే ప్రశ్న తలెత్తుతుంది. కేసు 'మినహాయింపు' కిందకు వస్తుందా, 'షరతు' కిందికి వస్తుందా? ప్రాసిక్యూషన్ వీటి కిందికి రాదంటాడు. నిందితుడు వీటి కిందికి వస్తుందంటాడు. దీనికి సమాధానం సెక్షన్ 105లో ఇవ్వబడింది. రుజువు చెయ్యాల్సిన భారం నిందితునిపైనే వుంటుంది.

ఇంతకు ముందున్న చట్టానికిది పొసగదు. ఇంతకు ముందు చేసిన చట్టం ప్రకారం తన కేసుకు 'మినహాయింపు' వర్తించదని రుజువు చెయ్యాల్సిన బాధ్యత ప్రాసిక్యూషన్ వారిదే.

## సివిల్ చట్టానికి మినహాయింపు రుజువు చెయ్యాల్సిన భారం-

1. సివిల్‌చట్టానికి మినహాయింపు విషయంలో 'నిరూపణ భారాన్ని' క్రమబద్ధీకరణ చేసే ప్రత్యేక

సెక్షన్ ఏదీ సాక్ష్యచట్టంలో లేదు. క్రిమినల్ చట్టంలోని నిబంధనలే ఈ విషయంలో సివిల్ చట్టానికి వర్తిస్తాయి. కేసు 'మినహాయింపు' కిందకు వస్తుందని ప్రతివాది రుజువు చెయ్యాలన్నదే అది.

**ఉదాహరణ - 15 కలకత్తా 555**

11/859 బెంగాల్ చట్టం XI (రెవిన్యూ అమ్మకం చట్టం) సెక్షన్37 కిందకు ఈ దావా వస్తుంది. తాకట్టు భారం (ఎన్‌కంబరెన్స్), ధారణభారం (టెన్యూర్)ల వ్యవహారాలను గురించి విడివిడిగా చెప్పబడిన ఈ సెక్షన్ వేలంలో ధారణ భారం కల ఆస్తులను తప్పించడం, ధారణ భారం వహించే వారిని ఆస్తుల నుంచి ఖాళీ చేయించడం అనే హక్కును కలిగి వుంటాడు. అయితే ఈ హక్కులకు కూడా కొన్ని మినహాయింపు లివ్వబడ్డాయి. ఇది సాధారణ చట్టానికి అనుకూలంగా వున్నట్లు కనపడ్డా, మినహాయింపు ఉందనే ప్రతివాది తన కేసు ఏ మినహాయింపు కిందికి వస్తుందనే వాదన చెయ్యడానికి వీలు కల్పిస్తుంది.''

ఒప్పందం లేక షరతు మినహాయింపు కిందకు వస్తుందని రుజువు చేసే భారం.

**1. షరతుకూ, మినహాయింపుకూ తేడా.**

రాతపూర్వకమైన ఒప్పందంలో లేని విషయాలకు సంబంధించిన షరతుల వాంఙ్మూలం ప్రొవిజో. ఇది ఒప్పందాన్ని గాని దానిలోని షరతులను గాని విఫలం చేసే మరో దస్తావేజు.

ఒప్పందంలోని విషయాలలో కొన్నిటిని ఒప్పందం నుంచి బయటకు తీయడం మినహాయింపు-

ప్రత్యేక పదాల కలయిక షరతు లేక మినహాయింపు కిందకు వస్తాయా లేదా అనేది ఆ పదాలు ఏ రూపంలో ప్రవేశపెట్టబడ్డాయి లేక ఏ రూపంలో ఒప్పందంలో ఉన్నాయి అనే దానిపై ఆధారపడి ఉండదు.

2. దావాలో వాది తన వాదనలో షరతును గురించి చెప్పనవసరంలేదు. కాని మినహాయింపు మాత్రం చెప్పాలి.

ఆగా స్యూడ్ సడక్, రాజి జకరియా మహమ్మల వివాదం. 2. ఇండోర్ యన్. యస్.308 (310)
310. జె. మార్క్బీ.

థర్స్‌బీ, ఫ్లింట్ 1 Wms. saund. పేజి. 2336లో ప్రొవిజను గురించి మార్క్బీ ఈవిధంగా చెప్పారు. ప్రొవిజో అనేది ఒప్పందాని సంబంధం లేని విషయం. ఇది ఒప్పందాన్ని విఫలం చేయడానికి

రాయబద్ధ, మరొక దస్తావేజు. మినహాయింపు అనేది ఒప్పందంలోని విషయాలలోని భాగం. ప్రొవిజో (షరతు) మినహాయింపులలో ప్రొవిజో వాది చెప్పనవసరంలేదు కాని మినహాయింపు చెప్పాలి.

3. పైవిధంగా చెప్పాలనడం వాదనలో నిబంధనగా పేర్కొన్నప్పటికీ ఈ నిబంధన నిరూపణ భారానికి కూడా వర్తిస్తుంది. కాబట్టి ఉపకరణం (ఇన్‌స్ట్రుమెంట్)లోని క్లాజు మినహాయింపు కిందకు వస్తుందని చెప్పడమే కాకుండా ఆ మినహాయింపు తన కేసుకు వర్తించదని చూపించాల్సిన అవసరం వాదికుంది. అది మినహాయింపు కిందకు కాకుండా ప్రొవిజో కిందకు వచ్చేటట్లయితే ప్రతివాది దానికి చెప్పడమే కాకుండా అది ఏవిధంగా కేసుకు వర్తిస్తుందో చూపించాలి.

2 ఇండోర్ NS 308 (310)

**2 ఇండోర్ యన్.యస్. 308, 1867**

'ఏ' అనే వ్యక్తి 'బి అండ్ కో'పై నవంబరు 24, 1865 మధ్యాహ్నం నుంచి నవంబరు 24, 1866 వరకు అన్ని ప్రదేశాలకూ, అన్ని ఓడ రేవులకూ వర్తించే విధంగా 'అలయా' అనే ఓడపై తీసుకున్న భీమా పాలసీపై దావా వేశాడు. భీమా పాలసీలో 'అన్ని ప్రదేశాలకూ, అన్ని ఓడరేవులకూ అనే మాటలు' చేతితో రాసి మిగిలిన పాలసీ అంతా అచ్చు వేశారు. 'బి అండ్ కో' వారు వారి రాత వాంజ్మూలంలో పాలసీని ఒప్పుకుంటూ, ఈ కింది మినహాయింపును లేవనెత్తారు. ''నిర్బంధాలు, తుఫాన్లు, దట్టమైన గాలులు, సముద్ర ప్రమాదాలు పాల్మరాల నుంచి సిలోన్ వరకు తగిలే కోరమండల్ తీరాలలో లేదా వాటిని చుట్టూ ఉన్న ప్రదేశాలలో అక్టోబర్ 15వ తేదీ నుంచి డిసెంబరు 15న మధ్య జరిగే వ్యాపార లావాదేవీలు మొదలైన వాటివల్ల జరిగే నష్టభరణాలు, నష్టాలు ఈ పాలసీ నుంచి మినహాయించబడ్డాయి. ఈ నష్టాలన్నీ పాలసీదారుడే భరించాలి గాని పాలసీ జారీ చేసినవారు కారు. దీనికి భిన్నంగా పాలసీలో దీనికంటే ముందు ఏమి ఉదహరించి ఉన్నప్పటికీ నష్టాలను పాలసీదారే భరించాల్సి వుంటుంది.''

## 3. అకిన్స్

4. పూర్వ షరతు = ప్రొవిజో

ఈ సందర్భంలో సాక్ష్య చట్టం మూడు సూత్రాలను చెప్పింది.

1. సాక్ష్య చట్టం కల్పించిన ప్రత్యేక సదుపాయాల వల్ల ఎవరు లాభించాలని కోరుకుంటారో వారే ఆ విషయాన్ని రుజువు చేసే భారం వహిస్తారు.

సెక్షన్ 104 ఈ సూత్రానికి ఉదాహరణ.

## 2. ఒక ప్రత్యేకాంశాన్ని నిరూపించే భారం.

1. వివాదాంశాన్ని నిరూపించడానికి అంశాన్ని నిరూపించడానికి నిబంధన ఒకటే- వివాదంలో ఒక అంశం (ఫాక్ట్) ఉన్నదని చెప్పే వారే వుందని రుజువు చెయ్యాలి గాని అంశం లేదనే వారు లేదని రుజువు చేసే భారం వహించరు. ఈ నిబంధన సెక్షన్ 103లో వుంది. ఈ నిబంధనకు కారణాలు రెంటిల్లోనూ. (వివాదం, అంశం) ఒకటే.

2. కానీ, కొన్ని అంశాల నిరూపణ భారం చట్టం ప్రకారం ఆ అంశాలు వున్నాయనే వారు, లేవనే వారు అనే దానితో సంబంధం లేకుండా ఫలానా వ్యక్తులే నిరూపించాలనేది సెక్షన్ 104 నుంచి 111 వరకు వున్న సెక్షన్‌లలో విశదీకరించబడింది. ఏఏ వివాదాలలో ఎవరు నిరూపణ భారం వహించాలనేది సాక్ష్య చట్టంలో పై సెక్షన్లలో వివరించబడింది.

3. నిరూపణ భారం ఎవరు వహించాలనే విషయంలో సాధారణ నిబంధన కాకుండా ప్రత్యేకంగా సెక్షన్ 104 నుంచి 111 లో చెప్పబడ్డ నిబంధనలూ, వాటి సమర్థన నాలుగు సూత్రాలపై ఆధారపడి చేసినట్లు కనపడుతుంది.

I సాక్ష్య చట్టంలో నిరూపణ భారం కోసం కల్పించబడ్డ సదుపాయాల ద్వారా లాభించాలని ఎవరనుకొంటారో వారే ఈ నిరూపణ భారం వహించాలి.

II కక్షిదారుల స్థాయి పోల్చి చూసినపుడు వారిద్దరిలో ఎవరు బలవంతులో, పై స్థాయిలో వున్నారో వారిపైనే ఒక అంశాన్ని నిరూపించాల్సిన భారం వుంటుంది.

III విషయాల ఉనికి కొనసాగుతూ వున్నప్పుడు, ఆ విషయాలు కొనసాగడం లేదని వాదించే వారిపైనే రుజువు చేసే భారం వుంటుంది.

IV ఒక విషయం మరొక విషయానికి న్యాయ సంబంధమైన సంఘటన మాత్రమే కాబట్టి సంఘటనను అంశానికి జోడించకూడదనే వాదనను చేసే వారే సంఘటనను అంశానికి ఎందుకు జోడించకూడదో రుజువు చెయ్యాలి.

పై సూత్రాలలోని మొదటి సూత్రాన్ని ఉదహరించే సెక్షన్లు.

1. 104వ సెక్షన్ మొదటి సూత్రానికి ఉదాహరణ. ఈ సెక్షన్ మరొక అంశాన్ని రుజువు చెయ్యడానికి ముందస్తు అవసరమైన అంశాన్ని రుజువు చెయ్యాల్సిన బాధ్యతను గురించి చెప్తుంది.

2. ఒక అంశాన్ని నిరూపించడానికి సాక్ష్యం ఇచ్చే ముందు నెరవేర్చవలసిన కొన్ని షరతులను సాక్ష్య చట్టం పొందుపరిచింది. అదేవిధంగా, ఒక ప్రత్యేక పద్ధతి ప్రకారం రుజువుచెయ్యడానికి పూనుకునే ముందు నెరవేర్చవలసిన షరతులను కూడా సాక్ష్య చట్టంలో రూపొందించడం జరిగింది.

<u>ఉదాహరణ-I</u>

కోర్టు వారి ముందు కోర్టులో ఇచ్చిన సాక్ష్యం తప్ప మరేదీ సాక్ష్యం కాదు. కాబట్టి చనిపోయిన వ్యక్తి వాంఙ్మూలం సాధారణంగా సాక్ష్యం కిందికారాదు. కానీ, ఒక వ్యక్తి చనిపోయాడని రుజువు చేస్తే, చనిపోయిన వ్యక్తి చెప్పాడనుకున్న విషయం వివాదానికి సంబంధించినదయితే, ఆ విషయాన్ని సాక్ష్యం కింద తీసుకోవడానికి సాక్ష్య చట్టం అనుమతిస్తుంది.

<u>ఉదాహరణ-II</u>

అధికార పత్రం (డాక్యుమెంట్)లోని విషయాలను నిరూపించడానికి ఆ పత్రం అసలు ప్రతి దాఖలు చెయ్యాలి. అయితే, అసలు ప్రతి లభ్యం కావడం లేదని రుజువు చెయ్యగలిగితే సహాయక సాక్ష్యం (సెకండరీ ఎవిడెన్స్) సాక్ష్య చట్టం అనుమతిస్తుంది.

3. ఒక వ్యక్తి చనిపోయాడనీ, వాంఙ్మూలం అసలు ప్రతి లభ్యం కాదనీ రుజువు చేసే భారం ఎవరు వహించాలనే ప్రశ్న ఉత్పన్నమవుతుంది. ఎవరు సాధారణంగా ఈ ముందస్తు అవసరాలకు సంబంధించిన విషయాలను రుజువు చెయ్యాలి? ఈ ప్రత్యేక సదుపాయాల ద్వారా ఎవరు లాభించాలనుకొంటారో వారే నిరూపణ భారం వహించాలని చెప్తుంది.

## సెక్షన్ 104

రెండవ సూత్రాన్ని విశదీకరించే సెక్షన్లు.

## సెక్షన్ 106

**1. కక్షిదారులలో** ప్రత్యేకంగా ఒకరి ఎరుకలోనున్న సాక్ష్య నిరూపణ భారాన్ని గురించి ఈ సెక్షన్ **చెప్తుంది.**

(i) 'ఏ' అనేవాడు ఒక అంశం ఆధారంగా 'బి'పై నింద మోపితే, అంశాన్ని 'బి' ఒప్పుకోవడానికి నిరాకరిస్తే సెక్షన్ 103 ననుసరించి ఆ అంశాన్ని నిరూపించాల్సిన భారం 'ఏ' వహించాలి.

(ii) కానీ ఏ అంశం ఆధారంగా నింద మోపబడిందో ఆ అంశం 'బి' ఎరుకలోనికి వచ్చేదయితే దాని నిరూపణ భారం 'బి' పైనే వుంటుంది.

2. ఉదాహరణలు

22 కలకత్తా 164

హరదాన్‌కు ఒక సంవత్సరం వయసుగల ఇద్దరు కవల పిల్లలున్నారు. అందులో ఒకరిని కరుణ అనే వేశ్యకు 9 రూపాయలకు హరదాన్ అమ్మింది. కరుణకు అమ్మిన బాలిక బాల్యం నుంచి కరుణతోనే నివసిస్తూ ఆమె మాదిరిగా వేశ్యా వృత్తినవలంబించి జీవనం సాగిస్తూ వుండేది.

సమస్య:

సెక్షన్ 372/373 కింద మైనర్ పిల్లలను అమ్మడం, కొనడంపై వేసిన దావాలో బాలికను కొనడంలోని ఉద్దేశం వేశ్యావృత్తికి ఉపయోగించడానికేననేది ఎవరు నిరూపించాలనేది ప్రశ్న. ఈ దావాలో వేశ్యా వృత్తి చేయించడానికా కాదా అనే అంశం నిందితుని ఎరుకలోనున్న విషయం కాబట్టి తనకా ఉద్దేశం లేదని నిరూపించే భారం కరుణపైనే వున్నది.

23 అలహాబాద్. 124.

ఆగ్రా పట్టణానికి వెలుపల ఉన్న ఒక రోడ్డు మీద లైసెన్సు లేని వ్యక్తులు కత్తులు, తుపాకులు వారు వేసుకున్న బట్టల చాటున దాచుకుని గుమికూడినట్లుగా కనుగొనబడింది. ఆ ప్రదేశంలో వారెందుకున్నారని ప్రశ్నిస్తే వారు సహేతుకమైన సంజాయిషీ ఇవ్వలేకపోయారు.

సెక్షన్ 402 కింద వారిపై పెట్టిన కేసులో లైసెన్సు లేకుండా ఆయుధాలు కలిగి వున్న నిందితులపై రుజు భారం వుంది.

## సెక్షన్ 111.

1. లావాదేవీలలో సద్భావం (గుడ్ ఫెయిత్) విషయంలో నిరూపణ భారాన్ని ఈ సెక్షన్ వివరిస్తుంది.

## 2. 'సద్భావా' నికి నిర్వచనం

(1) 'సద్భావం' అనే పదం సాక్ష్య చట్టంలో నిర్వచించబడలేదు.

(2) ఇండియన్ పీనల్ కోడ్ సెక్షన్ 52లో ఇది నిర్వచించబడింది. తగిన జాగ్రత్త, శ్రద్ధ తీసుకోకుండా చేసిన ఏ పని అయినా 'సద్భావం'తో చేసిన దాని కిందకు రాదు.

(3) జనరల్ క్లాజెస్ అక్టు X, 1897 సెక్షన్ 3 (20)లో కూడా 'సద్భావం' అనేది ఈవిధంగా నిర్వచించబడింది.

''శ్ర ద్ధ లేకుండా గానీ, శ్రద్ధతోగానీ నిజాయితీతో చేసిన ఏ పని అయినా 'సద్భావన' తో చేసినట్లుగా పరిగణింపబడుతుంది.''

(4) ఈరెండు నిర్వచనాల ప్రకారం పీనల్ కోడ్‌లోని నిర్వచనం ప్రకారం నిజాయితీకి 'సద్భావన' లో ప్రాముఖ్యం లేదు జనరల్ క్లాజెస్ అక్టులో 'సద్భావన' కు నిజాయితీయే ప్రధానం.

(5) 'సద్భావన' అనే పదం సాక్ష్య చట్టంలో జనరల్ క్లాజెస్ అక్టులో వాడిన అర్థంలోనే వాడారు.

## 3. 'సద్భావన' నిరూపణ భారం విషయంలో సాధారణ నిబంధన.

(i) అందరు వ్యక్తులూ వారి కార్యకలాపాల్లో నిజాయితీతో వ్యవహరిస్తారనుకోవడం సాధారణ సూత్రం. ఏ వ్యక్తికి కూడా కపటం, ద్వేషభావం ఆపాదించకూడదు. చట్టం ఎవరికీ కపటాన్నీ, దుర్భావాన్ని ఆపాదించదు. కాబట్టి ఎవరైతే మరొకరి ప్రవర్తన అమర్యాద, కపటంతో కూడుకున్నదని అభియోగం చేస్తాడో అతడే వాటిని నిరూపించాల్సిన భారం వహించాలి. దీన్నే మరోవిధంగా చెప్పాలంటే 'సద్భావన' లేదని అభియోగం చేశారో వారే ఆ అభియోగాన్ని నిరూపించాలి. ఏ ఉద్దేశ్యంతో చేశాడో కూడా నిరూపించబడాలి.

(ii) ఈ సాధారణ నిబంధనకు మినహాయింపు సెక్షన్ 111లో పొందుపరచబడింది. దీనిలో ఒకరు చేసిన పనిలో 'సద్భావన' వుందని నిరూపించడానికి నిర్ణీత పరిస్థితులు నిర్దేశించబడినాయి. ఆ పరిస్థితులలో సద్భావన వుందని గట్టిగా నిరూపించాలి.

లావాదేవీలతో సంబంధమున్న ఇద్దరు కక్షిదారులో ఒకరు మరొకరి కన్నా నమ్మకముంచదగిన స్థాయిల వున్నప్పుడు మాత్రమే ఈ మినహాయింపు వర్తింపజేస్తారు.

## (IV) 'క్రియాశీల విశ్వాస స్థాయి' అంటే అర్థం:

(i) స్థాయి అంటే న్యాయపరమైన సంబంధం.

(ii) క్రియాశీల విశ్వాసం అంటే సంప్రదింపు, సలహాలపై చర్య తీసుకునే అలవాటు కలిగి వుండడం.

ఇద్దరు కక్షిదారులు ఒకరినొకరు సంప్రదించుకుని ఒకరి సలహా మరొకర పాటించడంలో వారి ప్రయోజనాలను కాపాడుకుంటూ ఉండవలసిన న్యాయబద్ధమైన సంబంధాన్నే క్రియాశీల విశ్వాసం అంటారు.

ఇద్దరి మధ్య న్యాయబద్ధమైన సంబంధాన్ని ఈ సెక్షన్ ఉద్దేశిస్తుంది. ఈ సంబంధం విశ్వాసం వుంచదగిన వ్యక్తికి ఎదుటి వ్యక్తి ప్రయోజనాలను పరిరక్షించే బాధ్యత ఉద్దేశిస్తుంది.

కాల్సన్, అల్లిసన్‌ల వివాదం 2. D.F & J. 581

ఈ నిబంధన కక్షిదారులిద్దరూ భార్యాభర్తలైనందున వర్తిస్తుంది.

హర్ గీవ్, ఎవరార్డ్ వివాదం 6 Ir. Ch.R. 278

ఈ కేసులో వున్న ఇద్దరూ భార్యాభర్తలు కారు. ఉంపుడుగత్తె, ఉంచుకున్నవాడు కావడం వల్ల వీరి వివాదంలో ఈ నిబంధన వర్తించదు.

ధర్మకర్త, లబ్ధిదారుడు; సంప్రదింపు న్యాయవాది, వాది; తండ్రీ కొడుకు, భార్యా, భర్తల మధ్య జరిగే లావాదేవీలలో సద్భావన సమస్య ఉత్పన్నమైనప్పుడు ఈ నిబంధన వర్తిస్తుంది.

(V) న్యాయపరమైన సంబంధాలకే ఈ నిబంధన పరిమితమైనప్పటికీ, కోర్టు ఈ నిబంధనను ఇద్దరు కక్షిదారులలో ఒకరు ఇంకొకరికంటే ప్రాబల్యం కలిగివుండి, ఎదుటివారిపై అనుచితమైన ప్రభావాన్ని చలాయిస్తున్నారనున్న వివాదాలకు కూడా వర్తింపజేస్తుంది.

## 107-108 సెక్షన్లు

1. సెక్షన్ 108, సెక్షన్ 107లో పొందుపరచబడిన నిబంధనకు ఒక షరతు మాత్రమే కనుక ఈ రెండు సెక్షన్లను కలిపి చూడాలి.

2. ఒక వ్యక్తి ఎంతకాలం జీవించి వున్నాడనే ప్రశ్నను గురించి ఈ సెక్షన్లకు ఏ సంబంధం లేదు.

3. ఆ వ్యక్తి ఎప్పుడు చనిపోయాడనే విషయంతో కూడా ఈ సెక్షన్లకు సంబంధం లేదు.

4. ఆ వ్యక్తి పూర్వపు తేదీలలో బ్రతికి వున్నాడా లేదా అనే విషయంతో ఈ సెక్షన్‌లకు సంబంధం లేదు.

5. ఈ సెక్షన్‌లు దావా వేసే నాటి బ్రతికి ఉన్నాడా లేదా అనే విషయం మాత్రమే పరిగణనలోనికి తీసుకుంటారు.

మూడవ సూత్రాన్ని విపులీకరించే సెక్షన్లు.

## 107, 108, 109 సెక్షన్లు.

107వ సెక్షన్ ఒక వ్యక్తి బ్రతికున్నాడా, చనిపోయాడా అనే విషయ నిరూపణ భారాన్ని గురించి చెప్తుంది. చనిపోయాడనుకుంటున్న వ్యక్తి అంతకుముందు గడచిన 30 రోజుల్లో బ్రతికున్నాడని రుజువు చేయబడ్డ పక్షంలో, చనిపోయాడని గట్టిగా చెప్తున్న వాదిపైనే చనిపోయాడని రుజువు చేసే భారం ఈ సెక్షన్ ప్రకారం ఉంటుంది. చనిపోయాడనుకుంటున్న వ్యక్తి గత 30 రోజుల్లో బ్రతికున్నాడని రుజువుకాని పక్షంలో, బ్రతికున్నాడని వాదించే వారిపైనే నిరూపణభారం ఉంటుంది.

కనపడకుండా పోయిన వ్యక్తి బ్రతికే వున్నాడా, చనిపోయాడా అనే విషయంలో నిరూపణ భారాన్ని గురించి సెక్షన్ 108 చెప్తుంది.

ఈ సెక్షన్ ప్రకారం:

(1) గత 7 సంవత్సరాల నుంచీ ఒక వ్యక్తిని గురించి సమాచారం సహజంగా తెలుసుకోవలసిన వారికి తెలియకపోతే

(2) ఆ వ్యక్తి బ్రతికే వున్నాడని వాదించే వారి పైనే బ్రతికున్నాడని రుజువు చేయవలసిన భారం వుంటుంది.

వ్యాఖ్య-

ఒకసారి బ్రతికున్నాడని నిరూపించబడిన వ్యక్తి మరణాన్ని గురించి నిర్ణయించవలసింది కోర్టు వారే. బ్రతికి వుండడమనేది కొనసాగుతూ వుంటుందనే భావన కోర్టుకుంటుంది కాబటిట చనిపోయాడనే

భావన ఆ వ్యక్తి చివరిసారిగా కనిపించినప్పటి నుంచి 7 సంవత్సరాల తరువాత ఉండదు. కనుక గత 7 సంవత్సరాలలో ఆ వ్యక్తి బ్రతికున్నాడనే వారే ఆ విషయాన్ని నిరూపించాలి.

కానీ ఇతర పరిస్థితులు ఒక వ్యక్తి చనిపోయాడనే వాదానికి సహకరించినట్లయితే 7 సంవత్సరాల కంటే తక్కువ కాలంలోనే కోర్టు ఆ వ్యక్తి చనిపోయాడని విశ్వసించవచ్చు.

Re.: వాకర్ (1909) P. 115

## 107, 108 సెక్షన్ల అమలు

ఈ రెండు సెక్షన్లలో ఒక వ్యక్తి సమస్య ఉత్పన్నమయ్యే నాటికి బ్రతికున్నాడా, చనిపోయాడా అనే విషయాలను తేల్చవలసినపుడు వినియోగపడతాయి. నిర్దిష్ట సమయంలో ఒక వ్యక్తి చనిపోయాడా లేదా అన్న ప్రశ్నకు ఇవి వర్తించవు. ఒక వ్యక్తి ఖచ్చితంగా ఫలానా అపుడు చనిపోయాడని ప్రతిపాదించే వారే దాని రుజు భారం వహించాలి.

## సెక్షన్ 109

ఈ సెక్షన్ మూడు రకాల వ్యక్తుల సంబంధాలు కొనసాగటం, కొనసాగకపోవడం అనే విషయాలలో రుజు భారాన్ని గురించి చెప్తుంది.

(1) భాగస్తులు

(2) భూస్వామి, కౌలుదారు

(3) అసలుదారు, ఏజెంట్

ఒకసారి భాగస్తులు, భూస్వామి కౌలుదారు; అసలుదారు, ఏజంట్ అని తేలితే ఆ సంబంధాలు తెగతెంపులు చేసుకొన్నామని వాదించే వారే ఆ సంబంధాలు కొనసాగటం లేదనే విషయాన్ని నిరూపించే బారాన్ని వహించాలి.

## నాల్గవ సూత్రాన్ని విశదీకరించే సెక్షన్- సెక్షన్ 110

ఒక ఆస్తి స్వాధీనంలో వుండి, అసలుదారు స్వాధీనంలో లేనప్పుడు ఆ ఆస్తికి అసలు హక్కుదారుడెవరో తేల్చవలసిన విషయాలలో నిరూపణ భారాన్ని గురించి ఈ సెక్షన్ చెప్తుంది.

1. ఎవరి స్వాధీనంలోనయితే ఆస్తి వుందో, ఆ ఆస్తికి అతడు సొంతదారుడు కాదనే వారే రుజు భారం వహించాలి.

ఈ నిబంధనకు కారణం-

ఆస్తి సొంతదారే దాని స్వాధీనపు హక్కు అనుభవించే హక్కు కలిగివుంటాడు. ఇతరులు దానిని స్వాధీనపరచుకొనడం, అనుభవించడం అనే వాటినుంచి దూరంగా ఉంచే హక్కు సొంతదారునికుంది. ఒకవేళ తన హక్కుల నుంచి (స్వాధీనం, అనుభవించడం) తనను దూరం చేస్తే ఆ ఆస్తిని తిరిగి రాబట్టుకొనే హక్కు స్వంతదారునికుంది.

సొంత హక్కుదారునికి తన ఆస్తిని అమ్ముకోవడానికీ, తాకట్టు పెట్టడానికీ, విరాళమివ్వడానికీ హక్కుంది.

సొంతదారుడన్న దానితోనే స్వాధీనపు హక్కు, వదిలించుకునే హక్కు సంక్రమిస్తాయి. సొంతం అనడంలోనే స్వాధీనం, వదిలించుకోవడం ఇమిడి వున్నాయి.

సొంతం కాని దానిని స్వాధీనంలో వుంచుకోకూడదని చట్టం చెప్తుంది.

ఈ కింద కేసుల్లో ఈ సెక్షన్‌లోని సూత్రాన్ని వర్తించకూడదు.

(i) కోర్టు స్వాధీనంలోని ఆస్తులు

(ii) మోసంతోనో, బలవంతంగానో ఆస్తుల స్వాధీనం

నిరూపణ భారం

1. ఎవరిపైనైతే నిరూపణ భారం ఉందో వారే రుజువు చెయ్యాల్సిన బాధ్యత వహించాలని ఈ చట్టం చెప్తుంది.

2. రుజువు చేసే భారాన్ని అమలుపరిచేటప్పుడు ఈ కింది విషయాలను పరిగణనలోకి తీసుకోవాలి.

(i) రుజువు అవసరం లేని విషయాలు

(ii) రుజువు అనుమతించబడని విషయాలు

3. కావున విషయాలనూ వాటిని క్రమబద్ధీకరించే నిబంధనలనూ పరిశీలించవలసి వుంది.

# I నిరూపణ భారం

(i) రుజువు అవసరం లేని విషయాలు

రుజువు అవసరం లేని వాస్తవాలు

1. రుజువు అవసరం లేని విషయాలు ఈ కింది మూడు భాగాలుగా విభజించబడ్డాయి.

(1) న్యాయస్థానం గమనించిన వాస్తవాలు

(2) కక్షిదారులు ఒప్పుకున్న వాస్తవాలు.

(3) చట్టం వాస్తవాలని భావించే వాస్తవాలు

## న్యాయస్థానం గమనించిన వాస్తవాలు

1. 56, 57 సెక్షన్లు న్యాయస్థానం గమనించిన వాస్తవాలను విశదీకరించాయి.

2. కోర్టు వారు వాస్తవమని నమ్మిన విషయాన్ని నిరూపించాల్సిన అవసరం లేదని సెక్షన్ 56 చెప్తుంది.

3. కోర్టు వారు గమనించవలసిన 13 విషయాలు సెక్షన్ 57లో చెప్పబడ్డాయి.

4. కొన్ని విషయాలు ఎంత పేరు మోగినాయంటే, ఎంత విశదంగా స్థాపించబడ్డాయంటే, వాటిని సాక్ష్యంతో రుజువు చెయ్యాలనుకోవడం నిరుపయోగం.

<u>ఉదాహరణ-</u>

(1) విరోధాలు మొదలుగావడం, కొనసాగడం

(2) భౌగోళిక విభజనలు

5. చివరి రెండు పేరాలు ముఖ్యమైనవి. వాటిని సెక్షన్ 56తో కలిపి చూడాలి. సరిగా అర్థ చేసుకొనడానికి అవి క్లూ ఇస్తాయి. సెక్షన్ 57లో చెప్పబడిన విషయాలు పరిశీలన వచ్చినప్పుడు ఆ విషయాలకు వ్యతిరేకమైన విషయాలు వాస్తవాలని వాదించే వారు వాటి

రుజువు చెయ్యడానికి సాక్ష్యాలు చూపించనక్కరలేదు. ఏవిధమైన సాక్ష్యం కోరకుండానే న్యాయమూర్తి ఒక నిర్ణయానికి రావలసి వుంది.

(1) న్యాయమూర్తి యొక్క విషయ పరిజ్ఞానం నిర్ణయానికి రావడానికి సరిపోవచ్చు. అది చాలనపుడు న్యాయమూర్తి విషయాలను నిశితంగా గమనించాల్సి వుంటుంది.

(2) అవసరమనుకుంటే న్యాయమూర్తి తనకు ఈ విషయాలలో సహాయంజెయ్యమని కక్షిదారులను కోరవచ్చు.

(3) ఈ దర్యాప్తు చెయ్యడంలో వాస్తవ నిరూపణకు అవలంబించలసిన సాక్ష్య నిబంధనలను పాటించనవసరం లేదు.

**(II) కక్షిదారులు ఒప్పుకున్న వాస్తవాలు**

**సెక్షన్ 58**

1. ఇందులో వేరువేరుగా చూడాల్సిన రెండు అంశాల ఒప్పుకోళ్ళు **(Admissions)** ఉన్నాయి.

(1) కోర్టులోని కార్య వ్యవహారానికి సంబంధించిన లాంఛనప్రాయ ఒప్పుకోళ్ళు. ఇవి కక్షిదారులు నిరూపణ భారాన్ని వదిలించుకోవడానికి బుద్ధిపూర్వకంగా చేసే ఒప్పుకోళ్ళు.

(2) కార్య వ్యవహారం జరిగే సమయంలో అనుకోకుండా కక్షిదారుడు ఒప్పుకునే అనియత ఒప్పుకోళ్ళు.

2. సెక్షన్ 58 లాంఛనప్రాయమైన ఒప్పుకోళ్ళకు మాత్రమే వర్తిస్తుంది.

లాంఛనప్రాయమైన ఒప్పుకోళ్ళు ఆరు విధాలుగా చేయబడవచ్చును.

**(i)** వాదనల పైన

**(ii)** ప్రశ్నలకు సమాధానల రూపంలో

**(iii)** ప్రత్యేకించబడ్డ వాస్తవాలను ఒప్పుకోవలసిందనే నోటీసుకు సమాధానంగా

**(iv)** అధికారపత్రాలను (డాక్యుమెంట్స్) కోర్టు వారికి సమర్పించడంలో, వాటిని ఒప్పుకోవడంలో

**(v)** వివాదంలోని కక్షిదారుని సంప్రదింపు న్యాయవాది ఒప్పుకోవడం వల్లా

(vi) వాదే తానుగానో, తన న్యాయవాది ద్వారానో బహిరంగ కోర్టులో ఒప్పుకోవడం ద్వారానో

3. అటువంటి వాస్తవాలకు రుజువు వృధా. కక్షిదారులు ఆమోదించని విషయాలపై విచారణ జరగాలి గాని ఆమోదించిన విషయాలపై విచారణ జరపరాదు.

4. క్రిమినల్ విషయాలకు సెక్షన్ 58 వర్తింపుపై అభిప్రాయభేదాలున్నాయి.

(i) నోర్టన్ అనే ఆయన సెక్షన్ 58 క్రిమినల్ విచారణకు వర్తించదన్నారు.

(ii) కన్నింగ్ హోమ్ ఈ సెక్షన్ క్రిమినల్ విచారణలకు వర్తిస్తుందన్నారు.

30 బొంబాయి L.R. 646.

సెక్షన్ 58 క్రిమినల్ కార్యవ్యవహారాలకు ఎటువంటి మినహాయింపు చెప్పదు.

రాట్. అన్. క్రిమినల్ కోర్టు 769.

సెక్షన్ 58 క్రిమినల్ కార్య వ్యవహారాలకు ఎటువంటి మినహాయింపు చెప్పదు.

39 మద్రాసు 449.

న్యాయ వ్యవహారాలకు సంబంధించిన సాధారణ సూత్రాలపై సెక్షన్ 58 క్రిమినల్ విచారణలకు వర్తించరాదు.

''సాక్ష్య చట్టంలోని నిబంధనలు (ప్రొవిజన్స్) ఆమూలాగ్రమైనవేనా, వాటి సహాయార్థం న్యాయశాస్త్ర సూత్రాలనూ, ఇంగ్లీషు వారి చట్టాన్నీ వాటికనుబంధంగా, వాటిని విశదీకరించడంలోనూ వాడుకొనవచ్చునా అనే ప్రశ్న మిగిలే వుంటుంది''. 12 అలహాబాద్ 1. ఇంగ్లీషు వారి సాక్ష్య నిబంధనలు వర్తిస్తాయి.

నిబంధన సమగ్రమైన నిబంధనగాదు. ఒప్పుకున్న వాస్తవాన్ని నిరూపణ భారం మోపబడిన కక్షిదారుడు రుజువు చెయ్యాలని న్యాయమూర్తి కోరవచ్చును.

ఇది సామాన్యులనూ, తెలివిలేని వారినీ కాపాడడానికి ఉద్దేశించిన రక్షణ.

బహుశా ఈ నిబంధన వల్లనే క్రిమినల్ విచారణలలో సాక్ష్యాధారాలు లేని ఒప్పుకోళ్ళు అనుమతించరు.

అస్తిత్వం ఉందని చట్టం భావించే వాస్తవాలు.

1. పురోభావన (Pressumption) అనే దాని నిర్వచనం

పురోభావన అనేది ఒక అంశం నుంచి వెలువడిన సారాంశం లేదా అభిప్రాయం

2. పురోబావన అనే నిబంధన ఆధారపడి వున్న సూత్రం.

(1) విశ్వం భిన్నరకాల మూలకాల సమ్మేళనం, వ్యక్తులపై రకరకాలైన ప్రేరణల ప్రభావం వుంటుంది.

(2) అయినప్పటికీ కొంత ఏకత్వం క్రమబద్ధత వుంది. క్రమబద్ధత రుతు మార్పులు, గోళాల కక్ష్యలు, అవి ఉదయించడం, అస్తమించడం, పదార్థం- అయస్కాంత శక్తి- సాపేక్షాకర్షణ వస్తువుల కదలికలనూ వాటి సంభవాలనూ క్రమబద్ధీకరిస్తాయి.

(3) మానవ జాతికి వుండే సహజ సిద్ధమైన గుణగణాలూ, శక్తులూ ప్రతిభలూ దాదాపు ఒకటిగానే వుంటాయి.

(4) అందరు మానవుల గుణాలూ, ప్రవర్తనా దాదాపు ఒకే విధంగా వుంటాయి. ఏకవిధంగానే ప్రేరణ పొందుతారు.

3. క్రమబద్ధత ప్రతి విషయంలోనూ వుందన్నది నిజమైనప్పుడు ఒక విషయం జరిగిందని చెప్పినప్పుడు దాని వెంట జరిగే విషయం జరుగుతుందని చెప్పవచ్చు.

4. ఈ సూత్రంపైనే 114వ సెక్షన్ ఆధారపడి వుంది.

1. ఒక ఘటన మూలంగా మరొక ఘటన సంభవించడానికి వీలుందనుకున్నప్పుడు, కోర్టు సంభవించడానికి వీలుందన్న ఘటన సంభవించిందని భావించడానికి ఈ సెక్షన్ అధికారమిస్తుంది.

2. దీనికి పరీక్ష ఏమిటంటే-

(i) సహజ సంఘటనల సాధారణ సరళి

(ii) మానవ ప్రవర్తన

(iii) ప్రభుత్వ, ప్రయివేట్ వ్యవహారం

3. కొన్ని వాస్తవాల మూలంగా భావించడానికి వీలున్న 9 ఘటనలను ఈ సెక్షన్ ఉదహరించింది.

4. విశదీకరించడం- ఉదాహరణలు (వ్రాతప్రతిలో ఇవ్వబడలేదు- సం.)

5. ఒక పరిస్థితిలో జరిగిన సంఘటన మరో పరిస్థితిలో జరగడానికి చాలావరకు అవకాశం వుండదు. కాబట్టి ఒక కేసులోని అంశాల నుంచి భావనలను చేసేటప్పుడు కోర్టువారు జాగ్రత్త వహించాలి.

6. పరిస్థితులను బట్టి భావనలు మారుతూ వుంటాయి కాబట్టి వాటిని సాధారణ క్రోడీకరణ చెయ్యడం వీలుకాదు.

7. భావన యొక్క ఉద్దేశం నిరూపణ భారం వహించవలసిన వారిని ఆ భారాన్నుంచి దూరం చెయ్యడమే.

8. చట్టపరమయిన భావన, ఘటనాపరమైన భావన.

9. ఖండించదగిన పురోభావన, ఖండించదగని పురోభావన.

## నోర్టన్ పి. 381

II ఒకే రకమైన పురోభావనలను చట్టంలో సూక్తులంటారు. వాటినే సాధారణార్థంలో పురో భావనలు అంటారు.

1. చట్టంలోని కొన్ని సూక్తులను పురోభావనలని కూడా పిలుస్తారు.

2. చట్టంలో సూక్తులనబడే వాటికి ఉదాహరణలు:

(1) ప్రతి వారికీ చట్టం తెలుసనే భావన

(2) ప్రతి ఒక్కరికీ తాము చేసే పనుల వల్ల గలిగే ఫలితాలు తెలుసనే భావన

(3) నిందితుడిపై ఆరోపణ రుజువయ్యేదాకా అతను అమాయకుడు అని చట్టం పురోభావించడం

(4) ప్రతి మానవునికీ అర్థం చేసుకునే శక్తి భగవంతుడు ప్రసాదించాడని చట్టం పురోభావించడం.

(5) ఏ వ్యక్తీ తానివ్వనవసరం లేని బాకీ డబ్బు చెల్లిస్తాడనీ, తన ఆస్తిని పారవేస్తాడనే పురోభావన లేకపోవడం

(6) తల్లిదండ్రులు తమ సంతానానికిచ్చే డబ్బు కానుకగా ఇచ్చిందేనని అది అప్పుగా మాత్రం కాదనే పురోభావన

(7) ప్రతి వ్యక్తీ ఇతరులకన్నా తన బిడ్డలకే ప్రాధాన్యం ఇస్తాడని చట్టం పురోభావించడం.

ఈ సూక్తులు నిరూపణ భారానికి సంబంధించినవి. భారం ఎవరిపై వుంచాలనే విషయ నిర్ణయంలో ఇవి ఉపకరిస్తాయి.

అధికార పత్రాలకు (Documents) సంబంధించిన పురోభావనలు 79–90

1. ధ్రువీకరించబడిన కాపీల వాస్తవికత 79
2. సాక్ష్యానికి రికార్డుగా సమర్పించబడిన పత్రాలలోని వాస్తవికత 80
3. గజెట్‌లు, వార్తాపత్రికలోని వాస్తవికత 81
4. పత్రాలలోని వాస్తవిక- ఇంగ్లండులో సీలు, 82 సంతకంలేని పత్రాలు
5. ప్రభుత్వ అధికారంతో వేయబడ్డ ప్లానులు, పటాలు 83
6. చట్ట పుస్తకాలు, నిర్ణయాల రిపోర్టులు 84
7. అటార్నీ అధికారాలు 85
8. ధ్రువీకరించబడిన న్యాయ సంబంధమైన ఇతర దేశాల రికార్డులు 86
9. పుస్తకాలు, పటాలకూ సంబంధించిన పురో భావనలు 87
10. తంతి ద్వారా అందుకునే సందేశాలు 88
11. సమర్పించబడని అధికార పత్రాల ధ్రువీకరణ, అమలు 89
12. 30 సంవత్సరాల నాటి అధికార పత్రాలు

## నిరూపణ భారం

### (iii) రుజువు అనుమతించబడని విషయాలు

1. **నిర్ణాయక సాక్ష్యం (Conclusive Evidence) కక్షిదారులు చెప్పడానికి అనుమతించబడని విషయాలు.**

2. కక్షిదారులు రుజువు చెయ్యడానికి కట్టుబాటు విధించిన విషయాలు ( మాట కట్టుబాటు (Estoppel)

3. దురభిమానం లేకుండా చేసిన వాంఙ్మూలాలు

4. సంబంధం లేని విషయాలు

**I కక్షిదారులు చెప్పడానికి అనుమతించబడని విషయాలు-**

ఈ విషయాలను సాక్ష్య చట్టంలో నిర్ణాయక రుజువు, ఖండించదగని పురోభావాలు, చట్ట పురోభావాలు అని పిలుస్తారు.

ఇవి 41, 112, 113 సెక్షన్లలో చెప్పబడ్డాయి.

**II 112వ సెక్షన్**

1) 'ఏ' అనేవాడు 'బి'కి అతని భార్యకూ పుట్టిన బిడ్డ అని ఏవిధంగా నిరూపించాలనే సమస్యను గురించి చెప్తుంది.

2. పై ప్రశ్నలో వాస్తవాన్ని రుజువు చెయ్యడానికి రెండు యాదృచ్ఛిక పరిస్థితుల ప్రకారం రెండు రకాలుగా రుజువు చెయ్యవచ్చును.

(i) వివాహ బంధంతో యాదృచ్ఛికంగా ఆ బిడ్డ పుడితే

(a) 'బి', 'సి'ల వివాహం న్యాయబద్ధమైనదని రుజువు చెయ్యడం

(b) 'బి', 'సి'ల మధ్య 'ఏ' అనే బిడ్డ పుట్టేనాటికి వివాహ బంధాలున్నవని రుజువు చెయ్యడం

పై రెండు విషయాలు రుజువు చేస్తే 'ఎ' అనే బిడ్డ 'బి', 'సి'లకు న్యాయబద్ధంగా పుట్టిన బిడ్డేనని చట్టం నిర్ణయిస్తుంది.

(ii) 'బి', 'సి'ల మధ్యనున్న వివాహ బంధం తండ్రి చనిపోవడం వల్ల లేక విడాకుల వల్ల తెగిపోయిన తర్వాత బిడ్డ పుట్టడం యాదృచ్ఛికంగా జరిగినట్లయితే

(a) చావు మూలంగానో, విడాకుల మూలంగానో వివాహ బంధం రద్దయితే 'ఏ' అనే బిడ్డ వివాహ బంధం రద్దయిన నాటి నుంచి 280 రోజులలోగానే పుట్టినట్లు రుజువు చెయ్యాలి.

(b) ఈ 280 రోజుల కాలంలో తల్లి పెళ్ళి చేసుకోకుండా వున్నట్లు కూడా రుజువు చెయ్యాలి.

ఈ రెండు రుజువులు చేస్తే చట్టం 'ఏ' అనే బిడ్డ 'బి', 'సి' ల న్యాయమైన బిడ్డగా నిర్ణయిస్తుంది.

## గమనించదగిన అంశాలు

1. బిడ్డ న్యాయసమ్మతమైన సంతానమా కాదా అనే వివాదంలో నిర్ణయానికి రావడానికి ముఖ్యమైన అంశం బిడ్డ పుట్టిన తేదీయే కాని బిడ్డ తల్లి ఎప్పుడు గర్భవతి అయిందనేది కాదు.

ఉదా:

1. పాల్‌సింగ్, జాగిర్‌ల వివాదం. 7 లాహోర్ 368.

హర్‌నామ్ కౌర్- హరిసింగ్‌ను వివాహమాడింది. హరిసింగ్ జనవరి 10, 1919 నాడు చనిపోయాడు. ఫిబ్రవరి 25, 1919 నాడు హర్‌నామ్ కౌర్, సోహన్‌సింగ్‌ను వివాహమాడింది. హర్‌నామ్ కౌర్‌కు అక్టోబర్ 17, 1919 నాడు జాగిర్ అనే కుమారుడు పుట్టాడు. అంటే హరిసింగ్ చనిపోయిన తర్వాత 279 రోజులకు, సోహన్‌సింగ్ పెండ్లాడిన తర్వాత 198 రోజులకు హర్‌నామ్ కౌర్‌కు జాగిర్ పుట్టాడు.

జాగిర్ హరిసింగ్, సోహన్ సింగ్‌లలో ఎవరికి పుట్టినాడో తేల్చే వివాదంలో, జాగిర్ సోహన్‌సింగ్‌కు పుట్టినట్టుగా కోర్టు తీర్పునిచ్చింది.

2. పళని, సేతుల మధ్య వివాదం. 49 మద్రాసు 553.

1903 అక్టోబర్‌లో పెచ్చి అమ్మాళ్, సుబ్రహ్మణ్య అనే ఆయనను పెళ్ళాడింది. ఆ పెండ్లి 1904 జూన్‌లో రద్దయింది. 1904 జులైలో పెచ్చి అమ్మాళ్, తిరుమణి అనే మరొకరిని పెళ్ళాడింది.

1904 సెప్టెంబర్ రెండవ వారంలో పెచ్చి అమ్మాళ్‌కు పళని అనే బిడ్డ పుట్టింది. అంట సుబ్రహ్మణ్యతో ఆమె పెండ్లి రద్దయిన నాలుగు నెలల తర్వాత, తిరుమణితో పెండ్లయిన మూడు నెలల తర్వాత ఆమెకు సంతానం కలిగింది. పళని ఎవరి కొడుకు? సుబ్రహ్మణ్య కొడుకా? తిరుమణి కొడుకా?

పళని తిరుమణి కొడుకని కోర్టు తీర్పు చెప్పింది.

2. ఇది నిర్ణాయక రుజువు కేసుగా పరిగణించబడింది. ఇది ఆ విధంగా పరిగణించబడడానికి కారణం ఈ కేసులో వాస్తవం వివాదరహితమైనదనే కారణం వల్ల కాదు. న్యాయ సమ్మతంగా ఒకరిని,

స్త్రీ పెండ్లాడినప్పటికీ ఇంకొకరికి ఉంపుడుగత్తెగా వుండవచ్చు. ఆ విధంగా వున్నప్పుడు ఆ స్త్రీకి కలిగే సంతానం తను ఉంచుకున్న వానిదై ఉంటుంది. ప్రభుత్వ విధానం లేక సంఘ సంక్షేమం దృష్ట్యా కొన్ని వాస్తవాలకు రుజువు పరిచిన విలువ ఇవ్వడం జరిగింది. ఆ ప్రభావాన్ని ఎదుర్కొనడానికుద్దేశించిన ఏ సాక్ష్యం అనుమతించబడదు. సెక్షన్ 112 క్రింద కృత్రిమ రుజు విలువ ఉన్న వాస్తవాలు ఈ కింద విధంగా ఉన్నాయి.

(1) వివాహమనే సత్యం

(2) అందుబాటు, దగ్గరితనం అనే సత్యం

పై రెండు వాస్తవాన్న చోట న్యాయ సమ్మతమైన సంతానం కలగడం వాస్తవమనీ, కలిగిన సంతానం భర్త ద్వారా కలిగినదేననీ చట్టం నిర్ధారిస్తుంది.

(2) ఈ నిర్ణయం తప్పుడు నిర్ణయం అని రుజువు చెయ్యడానికి భార్యాభర్తలు ఒకరినొకరు అందుబాటులో లేరని రుజువు చెయ్యాలి. సంతానం కలగడానికి వీలు లేనంత దూరంగా ఒకరికొకరున్నారని రుజువు చెయ్యాలి.

అందుబాటులో లేకపోవడమంటే అర్థం.

1934 38 బొంబాయి L.R. 394.

కరపయ్య, మమందిల మధ్య వివాదం.

అందుబాటు అంటే కలిసి నివసించటం కాదు. అందుబాటు అంటే కలిసి కాపురం చేయటమే.

కరపయ్య మద్రాసుకు చెందిన హిందూమతస్తుడు. అతను బర్మాలో బాగా ఆస్తులు సంపాదించుకున్నాడు. మతిస్థిమితం చలించి 1923లో చనిపోయాడు.

కరపయ్య ముందు కరపాయినీ, ఆ తర్వాత నచియమ్మనీ పెళ్ళాడాడు. కరపయ్య నచియమ్మతో కలిసి టమాగ్యోలో ఉండేవాడు. కరపాయి తన తల్లి, సోదరుడుతో కలిసి హాల్‌మీన్‌లో ఉండేది.

1911వ సంవత్సరం, డిసెంబరు నెలలో ఒక ఒప్పందం కుదిరింది (అసంపూర్ణంగా వదిలివేయబడింది - సం)

(3) చేసిన తీర్మానాన్ని కలిసి కాపురం చేయలేకపోయిన వారి ఉదాహరణల సహాయంతో కొట్టిపారేయడానికి వీలులేదు.

29 I.A. 17 1901

నరేంద్ర, రామగోవింద్‌ల మధ్య వివాదం

ఉపేంద్రకు తిలోత్తమతో వివాహమయింది. ఉపేంద్ర వీపున పుండు పుట్టి కొంతకాలం బాధపడి చివరికి జులై 15న మరణించాడు.

ఉపేంద్ర మరణానంతరం, 1887, ఏప్రిల్ 18న తిలోత్తమ పుత్రుడికి జన్మనిచ్చింది. అతనే నరేంద్ర. తండ్రి మరణం తర్వాత 9 నెలల 10 రోజులకు, అంటే 280 రోజులకు నరేంద్ర పుట్టాడు.

దీనికి సంబంధించిన ఈ క్రింది మూడు ప్రశ్నలు ముఖ్యమైనవి.

1. నరేంద్ర తిలోత్తమ, ఉపేంద్రలకు పుట్టినవాడేనా?

2. నరేంద్ర ఉపేంద్ర చనిపోయాక 280 రోజులలోపే పుట్టాడా?

3. అపీలుదారు పుట్టటానికి వారిరువురి మధ్య ఎప్పుడూ ఏ సంబంధం లేదని రుజువైందా?

ఈ చివరి ప్రశ్నకు సంబంధించి సాక్ష్యాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

పెళ్లి నాటికి తిలోత్తమ చిన్న పిల్లే కావడం వలన చాలాకాలం తల్లిదండ్రుల దగ్గరే ఉండిపోయింది. అయితే 1886, జులైలో ఉపేంద్ర మరణానికి కొద్ది రోజుల ముందు ఆమె భర్త దగ్గరకు వెళ్ళింది. ఆమె భర్త దగ్గర ఎంతకాలమున్నదనే విషయం తేలటం లేదు. సాక్ష్యులలో కొంతమంది 5 రోజులనీ, 6 రోజులనీ, మరికొందరు 10 రోజులనీ, 12 రోజులనీ చెప్పారు.

ఈ కేసుకు సంబంధించిన ముఖ్య విషయాలు రెండు.

(1) ఉపేంద్ర వీపు మీద పుండు పుట్టి రెండు వారాలు బాధపడి మరణించటం

(2) ఉపేంద్ర 1886 జులై 14న విల్లు వ్రాశాడు. అందులో తిలోత్తమను వీలునామా అమలుదారుగా పేర్కొంటూ ఆమెను ఒక పుత్రుడిని దత్తత తీసుకోవలసిందిగా కోరాడు.

ఇక్కడ వివాదాంశం ఏమిటంటే అతడు అనారోగ్య కారణంగా ఆమెతో కలిసి ఉండకపోవచ్చు. ఇది వాదానికి వ్యతిరేకంగా ఉంది.

(3) కలిసి కాపురం చేయలేకపోవటం అనేది నపుంసకత్వం కాదు. 1935 (All India Reporter) P.O. 199 (శారీరక అశక్తతకు సంబంధించి).

క్రాి - అతను నపుంసకుడా?

హిందూ, మహమ్మదీయ చట్టాలలో వారసత్వానికి సంబంధించిన నియమాలను రద్దు చేసే విభాగం 10 All. 289.

1. మహమ్మదీయ చట్టం ప్రకారం పెళ్ళికి ఆరు నెలలు ముందుగానీ, విడాకులు పొందిన తర్వాత, లేక మరణించిన తర్వాత 2 సంవత్సరాల లోపుగానీ పుట్టిన బిడ్డ ఆ తల్లికి న్యాయబద్ధంగా పుట్టిన బిడ్డే అవుతుంది.

2. హిందూ చట్టం ప్రకారం విడాకులు పొందిన తర్వాతగానీ, మరణించిన తర్వాతగానీ పది నెలలలోపు పుట్టిన బిడ్డ మాత్రమే న్యాయబద్ధమైనది.

ఈ సెక్షన్ తండ్రి మరణించిన తర్వాత 280 రోజులకు పుట్టిన బిడ్డను న్యాయబద్ధంగా పుట్టిన బిడ్డగా రుజువు చేసుకోటానికి ఏమాత్రం అడ్డు చెప్పదు. కాకపోతే సాక్ష్యం అంతా వ్యక్తి మీదే ఆధారపడి ఉంటుంది.

24 All. 445. తండ్రి మరణానంతరం 357 రోజులకు పుట్టుక.

ఒక బిడ్డ న్యాయ సమ్మతమా, కాదా అనే విషయంలో అందుబాటుకు సంబంధించి భార్యాభర్తల సామర్థ్యం విషయంలో సాక్ష్యం భారతీయ చట్టంలోనూ, ఇంగ్లీషు చట్టంలోనూ తేడాగా ఉంది.

1. ఇంగ్లీషు చట్టం ప్రకారం వారు ఈ విషయంలో అసమర్థులు.

2. భారతీయ చట్టం ప్రకారం వారు సమర్థులు.

38 Mad. 466. 28 Bom. L.R. 207

## సెక్షన్ 113

ఈ సెక్షన్ భూభాగాన్ని వదులుకొనే విషయంలో రుజువు చేసే భారానికి సంబంధించినది.

ఒక నిశ్చిత భూభాగం ఒకప్పుడు బ్రిటీష్ ఇండియాలో భాగంగా ఉన్నది ఇప్పుడు లేదని రుజువు చేయటం ఎలా.

## సాక్ష్య చట్టం

1. ఈ ప్రశ్న సిద్ధాంత సంబంధమైనది మాత్రమే కాదు. ఆచరణ దృష్ట్యా ఇది చాలా ముఖ్యమైనది.

ఇది కోర్టు పరిధికి సంబంధించి చాలా ముఖ్యం. ఒక నిశ్చిత భూభాగం బ్రిటీష్ ఇండియాలో భాగం కాని పక్షంలో అది ఏ కోర్టు పరిధిలోకి రాదు.

2. సెక్షన్ 113లో సదుపాయం చేయబడింది. భారత ప్రభుత్వ అధికార పత్రం బ్రిటీష్ భూభాగం కొంత స్థానిక రాష్ట్ర పరిపాలకుడికి గానీ, రాకుమారుడికి గానీ ఇచ్చివేయబడినట్లుగా తెలుపుతూ ఉన్నట్లయితే దానిని ఆ తేదీన ఆ భూభాగం ఇచ్చివేయబడినట్లుగా తెలిపే ఖచ్చితమైన సాక్ష్యంగా పరిగణించవచ్చు.

3. ఈ విభాగం భారత విధానమండలి అధికార బాహ్యంగా నిర్దేశించబడినది. అందువలన చెల్లనేరదు. అంతేకాక రహస్యమండలి ద్వారా ఏ న్యాయబద్ధ ప్రభావానికీ లోనుకాదు.

1. బొంబాయి 367 P.O. 1876 దామోదర్ గోర్ధాన్, దేవ్‌రామ్ కంజిల మధ్య వివాదం

విధాన మండలిలో గవర్నర్ జనరల్ 24-25 Vic. O.67 విభాగం 22 ద్వారా భారత భూభాగంలో ఏ ప్రాంతాన్నయినా సార్వభౌమత్వం లేదా అభినివేశం చేయటానికిగానీ, బ్రిటీష్ పాలితుల ధర్మవిధికి సంబంధించిగానీ, ప్రత్యక్షంగా శాసించటానికి నిరోధించబడటం వలన భూభాగాన్ని ఇచ్చివేయటానికి సంబంధించిన ఖచ్చితమైన సాక్ష్యంగా అధికార పత్రాన్ని జారీ చేయు శాసనిక చట్టం (E.K. సాక్ష్య చట్టం S. 113) ద్వారా ఆ భూభాగం ఇచ్చివేత చట్ట సమ్మతమా కాదా అనే విషయంపై న్యాయ విచారణను రద్దు చేయలేడు.

## ఆఖరు సాక్ష్యంగా తీర్పులు

1. కొన్ని విషయాలు మరికొన్ని విషయాలకు సంబంధించి ఆఖరు సాక్ష్యంగా ఎలా పరిగణించబడతాయో అలాగే సాక్ష్య చట్టం కొన్ని తీర్పులను కొన్ని వివాదాలకు సంబంధించి ఆఖరు నిర్ణయాలుగా భావిస్తుంది. విభాగం 41.

2. నిర్ణాయకమూ, ఆఖరూ పరిగణింపబడే తీర్పులు:-

(1) సమర్థ న్యాయస్థానం ఈ క్రింది విషయాలకు సంబంధించి ఇచ్చిన తుది తీర్పు లేదా ఉత్తరువు, లేదా నిర్ణయం:

(1) వీలునామా ధ్రువపత్రం

( ) వివాహ సంబంధిత విషయాలు

(3) నౌకాదళాధికారం

(4) దివాలా న్యాయస్థాన అధికార పరిధి

ఈ తీర్పు శాసనిక స్వభావం ప్రదానం చేయటంగానీ, తీసివేయటంగానీ, లేదా ఒక వ్యక్తికి శాసనిక స్వభావం లేదా వస్తువును మరొక వ్యక్తికి వ్యతిరేకంగా కాకుండా పూర్తిగా ఇవ్వాలని తీర్మానించటం గానీ చేస్తుంది.

## ఆఖరు సాక్ష్యం:

(1) శాసనిక స్వభావాన్ని ఆపాదించటం గానీ, రద్దు చేయటం గానీ.

(2) తీర్పు ఇచ్చిన తేదీనే శాసనిక స్వభావాన్ని ఇవ్వటం గానీ, తొలగించటం గానీ జరుగుతుంది.

ఈ విభాగం కొన్ని నిర్దేశింపబడిన సమస్యలకు న్యాయస్థానాలిచ్చే తీర్పుల ఉపయోగానికి సంబంధించినది.

ప్రశ్న:

(1) ఒక హోదా పొందటానికి ఒక వ్యక్తికి గల హక్కు (2) ఎప్పుడు ఆ హక్కు అతనికి సంప్రాప్తించబడింది

ప్రశ్న:

(1) ఒక వ్యక్తి ఒక హోదాకు అనర్హుడవులాడా?

(2) అయితే ఎప్పుడవుతాడు?

ఒక వ్యక్తి నిర్దేశింపబడిన ఆస్తికి హక్కుదారుడు కాగలడా అనేది ప్రశ్న.

ఈ సెక్షన్ కొన్ని తీర్పులు ఇటువంటి అంశాల విషయంలో ఆఖరు సాక్ష్యాలు కాగలవని ప్రకటిస్తుంది.

## ఈ తీర్పులు ఏవి:

(1) అది సమర్థ న్యాయస్థానం ఇచ్చిన తీర్పు అయివుండాలి.

(2) అది ఈ క్రింది వాటికి సంబంధించిన తీర్పు అయి ఉండాలి.

(i) వీలునామా ధ్రువప్రతం

(ii) వివాహ సంబంధిత విషయాలు

(iii) నౌకాదళాధికారం

(iv) దివాలా

1. అది ఒక వ్యక్తికి శాసనిక స్వభావాన్ని ఇవ్వటాన్నిగానీ, తొలగించటాన్ని గానీ వ్యక్తపరిచేదిగా ఉండాలి.

2. అది ఒక వ్యక్తికి ఒక వస్తువుపై మరొక వ్యక్తికి వ్యతిరేకంగా కాకుండా పూర్తిగా అధికారాన్ని కలుగజేస్తూ తీర్మానించేదిగా ఉండాలి.

3. అది ఆఖరు తీర్పుగానీ ఉత్తరువుగానీ నిర్ణయంగానీ అయి వుండాలి.

## వీలునామా పరిధి

న్యాయస్థానాలు ఈ క్రింది చట్టాల క్రింద వీలునామా లేనప్పుడు కూడా అధికారాలను చలాయిస్తాయి:

(1) భారతీయ వారసత్వపు చట్టం

(2) హిందూ వీలునామా చట్టం

(3) వీలునామా, చనిపోయిన వ్యక్తి ఆస్తి నిర్వహణ చట్టం వైవాహిక పరిధి

భారతీయ విడాకుల చట్టం, పెళ్ళి, విడాకులకు సంబంధించిన ఇతర చట్టాల క్రింద అధికారం చలాయింపు

## నౌకాదళ పరిధి

హైకోర్టు, వలస దేశాలు న్యాయస్థానాల ప్రత్యేక పత్రాలు నౌకాదళ చట్టం 1890.

## దివాలా పరిధి

అధికార పత్ర చట్టాలు, దివాలా చట్టాలు.

కక్షిదారులు బుజువు చేయకుండా నివారింపబడిన విషయాలు మాట కట్టుబాటు (Estoppel) చట్ట నియమాలు సెక్షన్లు 115, 116, 117లలో పొందుపరచబడినది. సెక్షన్115 మాటకట్టుబాటుకు సంబంధించిన సాధారణ నియమాన్ని తెలియజేస్తుంది. సెక్షన్లు 116, 117లు కొన్ని నిర్దిష్ట మాట కట్టుబాట్లను వివరిస్తాయి.

## 2. సెక్షన్ 115

(i) సెక్షన్ 115కు సెక్షన్ 31తో సామ్యము

మాట కట్టుబాటు కూడా ఒప్పుకోలు వలే వాస్తవాంశాల వివరణే చాలారకాల ఒప్పుకోళ్ళను కక్షిదారు కావాలనుకుంటే ఉపసంహరించుకోవచ్చు. అటువంటి ఒప్పుకోళ్ళు చేసిన విషయం నిలిచే ఉంటుందిగానీ అవి అప్పీలు చేసిన కక్షిదారు తాను తొందరపాటుతోనో, నిర్లక్ష్యం వల్లనో లేదా నిజమయిన తప్పుడు ఆలోచన వల్లనో ఒప్పుకున్నట్టు వివరించటం జరుగుతుంది. అంతేకాక ఆ వ్యక్తి తాను చెప్పిన విషయాలు అసత్యాలని తనకు తెలుసునని చెప్పటం కూడా జరుగుతుంది. అయితే ఒక వ్యక్తి మరొక వ్యక్తితో నిర్దిష్టంగానూ, ప్రత్యేక పరిస్థితులలో ఒక ప్రకటన చేయటం వలన అది రెండవ వ్యక్తి ప్రవర్తన మీద నిర్ణాయక ప్రభావాన్ని చూపేదిగా ఉండే అవకాశముంది. ఆ వ్యక్తికి తాను చేసిన ప్రకటనను ఖండించే వీలును చట్టం కల్పించదు. ఒప్పుకోలుకూ మాట కట్టుబాటుకూ మధ్య వ్యత్యాసం చాలా తక్కువగా ఉంటుంది. ఒక ప్రకటన మాట కట్టుబాటా లేక ఒప్పుకోలా అనే విషయం ఆ ప్రకటన స్వభావం మీద, దానికి సంబంధించిన పరిస్థితుల మీదా ఆధారపడి వుంటుంది.

(ii) మాట కట్టుబాటు సూత్రానికి సంబంధించిన న్యాయపరమయిన ఆవశ్యకత ఏమిటి?

మాట కట్టుబాటు సూత్రం ఈ క్రింది మూడు నిబంధనలు నెరవేరినప్పుడే అమలులోకి వస్తుంది. **37 Bom. L.R. 544 P.C.**

(i) ఒక ప్రతివాది గానీ, అతని అధీకృత ఏజెంటు గానీ లేదా అతని తరఫున నియమించబడిన వాది గానీ ఒక యదార్థాన్నీ వ్యక్తపరుస్తూ చేసిన ప్రకటన.

(ii) వాది ఆ ప్రకటనను విశ్వసించి, తదనుగుణంగా వ్యవహరిస్తాడనే ఉద్దేశం ఉన్నప్పుడు అంతేకాక

(iii) వాది, ఆ ప్రకటనను విశ్వసించి తదనుగుణంగా వ్యవహరించినప్పుడు

★ ఆ ప్రకటన ఒక విన్నపం రూపంలో (Representation) ఉండాలి.

(1) ప్రకటన మాట ద్వారాగానీ, ప్రవర్తన ద్వారా చేయవచ్చు.

A. ఒకవేళ అది మాట ద్వారా చేయబడినట్లయితే అది తప్పు అని తెలిసీ కావాలని చెప్పినట్టయితే అది స్పష్టమయిన సమాచారం అయి వుండవచ్చు.

ఉదాహరణ:

మెక్ కాన్స్, లండన్, నోదర్ వెస్టర్న్ రైల్వే కో.,ల వివాదం. (1861) 7 H. & N.. 477.

మెక్ రైల్వే కంపెనీలో తన అశ్వాలను లివర్‌పూల్ దగ్గరనున్న ఎడ్జిహిల్ నుండి వోల్వర్ హామ్‌టన్‌కు అనుకూలమైన ట్రక్కులలో రవాణా చేయటానికి కాంట్రాక్ట్ కుదుర్చుకుంటాడు. రైల్వేవారు అశ్వాల రవాణాకు తగినటువంటి ట్రక్కులను ఏర్పాటు చేయటానికి అంగీకరిస్తారు.

మెక్ ఒక్కొక్క అశ్వం విలువ 10 డాలర్ల కంటే ఎక్కువ లేదని ఒక ధృవీకరణ పత్రాన్ని నింపాడు. రైల్వే వారి నిబంధనల ప్రకారం ఎన్నో రకాలుగా అశ్వాలను రవాణా చేయవచ్చు. ఒకటి- వాటిని ట్రక్స్‌లో పంపటం. ఈ ట్రక్స్‌లో ఒక్కొక్క దానిలో ఎన్ని అశ్వాలుండాలనేది యజమాని ఇష్టానికే వదిలివేస్తారు. రెండవది- అశ్వాలను పెట్టెలలో పంపటం. ఒక్కొక్క పెట్టెను ఒక్కొక్క కంపార్టుమెంటులో ఉంచటం. ఈ రెండవ రకంగా అశ్వాలను రవాణా చెయ్యటానికి అయ్యే ఖర్చు మొట్టమొదట పద్ధతిలో కంటే మూడు రెట్లు ఎక్కువగా ఉంటుంది. రైల్వే వారి మరొక నియమావళి ప్రకారం పది డాలర్ల కంటే ఎక్కువ ఖరీదు చేసే అశ్వాలను ట్రక్స్‌లో పంపుతారు.

ఒకసారి మార్గమధ్యంలో రైల్వేవారు ఏర్పాటుచేసిన ట్రక్స్ సరిగా లేకపోవటం వలన అశ్వాలు గాయపడ్డాయి. ఒక్కొక్క అశ్వం విలువ పది డాలర్ల చొప్పున మొత్తం 25 డాలర్లు మెక్‌కు నష్టం జరిగిందని ఒప్పుకుని ఆ డబ్బు చెల్లించటానికి అంగీకరించారు కాని వాది ఒక్కొక్క అశ్వం విలువ 40 డాలర్లనీ మొత్తం నష్టం 55 డాలర్లనీ క్లెయిమ్ చేశాడు.

ఈ కేసు తప్పుడు సమాచారానికి ఒక ఉదాహరణ.

ఉదాహరణ (2) మున్నీలాల్, లల్లా చోనీలాల్ మధ్య వివాదం 1. I.A. 144

**రీప్ సింగ్ అప్పులపాలయ్యాడు. అయితే అతనికి చెప్పుకోదగిన ఆస్తి కూడా ఉంది. మెక్ అతని బ్యాంకరు అక్టోబరు 9, 1863వ మెక్, సింగ్ అప్పుగానున్న 20 వేల రూపాయలకు గాను అతని ఆస్తికి**

తాకట్టు పెట్టుకున్నాడు. ఆగస్టు 9, 1863న సింగ్ తన ఆస్తిని సి కి అమ్మాడు. ఆ కొనుగోలుకు సంబంధించి సింగ్‌కూ, సికీ మధ్య బేరసారాలు జరిగినప్పుడు ఎమే కూడా ఉన్నాడు. ఆ ఆస్తి తాకట్టులోగాని ఉన్నదా అని సి అడిగితే అటువంటిదేమీ లేదని ఎమేను నమ్మించాడు.

1868లో ఎమ్ సి మీద కోర్టులో ఆ ఆస్తిపైనున్న తనఖా బాండులోనున్న ధనంచెల్లించవలసిందిగా దావా వేశాడు. అయితే న్యాయస్థానం అందుకు అనుమతించలేదు.

ఇది కూడా స్పష్టమైన తప్పుడు సమాచారానికి ఒక ఉదాహరణ.

**B.** విన్నపం అమాయకపు తప్పుడు నివేదన కావచ్చు

ఉదాహరణ: గొల్డ్, బాకప్ లోకల్ బోర్డుల మధ్య వివాదం (1881) **50 L.J. (M.C.) 44**

గొల్డ్‌కు చెందిన కొన్ని ఆవరణలు చాలా అపరిశుద్ధ్యంగా ఉంచబడుతున్నాయి. బోర్డు అతనిని వాటిని శుభ్రం చేయవలసిందిగా కోరింది. అందుకు అతను నిరాకరించాడు. అప్పుడు బోర్డు వారు సూచించిన మార్పులను అతడు గడువు లోపులో చేయని పక్షంలో తామే వాటిని అమలు చేస్తామని నోటీసు ఇచ్చింది.

చట్ట ప్రకారం పెట్టిన ఖర్చులను తిరిగి రాబట్టుకోవటాని రెండు మార్గాలున్నాయి. ఒకటి సెక్షన్ 213 ప్రకారం, రెండవది సెక్షన్ 240 ప్రకారం. సెక్షన్ 213 ఆ ఖర్చులను బోర్డు విధించిన స్థానిక రేటుకు అదనంగా చేర్చటం ద్వారా రాబట్టుకునే అవకాశాన్ని బోర్డుకు కల్పిస్తుంది. సెక్షన్ 240 బోర్డు ఆ ఖర్చులను విడిగా ఒకేసారి ఏకమొత్తంలో రాబట్టుకునే సదుపాయాన్ని కలుగజేస్తుంది. గొల్డ్‌కు పంపిన నోటీసులో బోర్డు ఆ ఖర్చులను సెక్షన్ 213 ఆదేశాల మేరకు రాబట్టుకుంటున్నట్లు తెలియజేయబడింది. కానీ దావాలో మాత్రం బోర్డు ఆ మొత్తాన్ని సెక్షన్ 240లో సూచించినట్లుగా రాబట్టుకోవాలనుకుంటున్నట్లు పేర్కొనబడింది. దాంతో బోర్డు ఆదేశాలు నిషేధించబడ్డాయి. ఇది అమాయకపు తప్పుడు నివేదికకు ఒక ఉదాహరణ.

(2) నివేదన మాటల ద్వారా గానీ, మౌనం ద్వారా గానీ చేయబడవచ్చు. మౌనం కూడా కొన్ని కొన్ని సందర్భాలలో ఎంతో అర్థవంతంగా ఉండి నోటిమాట ద్వారా చేసిన నివేదన కంటే ఎంతో ఉత్తమంగానూ, వాస్తవికంగానూ ఉంటుంది.

కానీ ప్రతి సందర్భంలోనూ మౌనాన్ని ప్రసంగంతో సమానంగా పరిగణించటానికి వీలులేదు. అయితే చట్టం ప్రతిసారీ ఒక వ్యక్తికి అతని మనసులోనున్న భావాలను వ్యక్తపరిచే అవకాశం కలిగించదు.

చట్టం ప్రకారం ఒక వ్యక్తి మాట్లాడవలసిన అవసరం వస్తే తప్ప మాట్లడటానికి వీల్లులేదు. ఇతరత్రా మౌనమే శ్రేయస్కరం.

మౌనం కట్టుబాటుగా మారాలంటే మాట్లాడవలసిన అవసరం ఉండి తీరాలి. మౌన ప్రభావాన్ని పరిశీలించేటప్పుడు మాట్లాడటానికి తగిన అవసరముందా లేదా మౌనాన్ని పాటించటానికి తగిన కారణముందా అనే విషయాన్ని పరిశీలించవలసి ఉంటుంది. మౌనం నుంచి ఒక అభిప్రాయానికి వచ్చేముందు ఈ పరిశీలన జరపవలసి ఉంటుంది.

(1896) A.C. 231 (238)

2 Br. C.C. 400 (419)

6 Bom. L.R.

ఉదాహరణ: (1) మౌనం మాట కట్టుబాటుకు ఆధారం కాదు.

10 Bom. L.R. 297

తండ్రికి వ్యతిరేకంగా ఒకరు డిక్రీ పొందాడు. ఆ డిక్రీ అమలు ద్వారా వచ్చిన సొమ్మును కలెక్టర్ రుణదాతకు ఇచ్చారు. ఇది జరుగుతున్న సమయంలో తండ్రి చనిపోవటం, కొడుకుకు ఆస్తి సంక్రమించటం జరిగింది. సంయుక్త రుణదాత కొడుకుకు వ్యతిరేకంగా తీర్పు అమలు జరపాలనుకున్నాడు. కొడుకు ఆస్తికంటే అప్పులు ఎక్కువగా ఉన్నందున తాను బాధ్యుడున్ని కానన్నాడు. కొడుకు మౌనంగా ఉండటం వలన అతను తీర్పును ఆమోదించినట్లేనని అతను చేసిన వాదాన్ని కొట్టివేశారు.

**ఉదాహరణ (2) మౌనం మాట కట్టుబాటుకు కారణం:**

**15 I.A. 171**

ఒక డిక్రీ అమలు సందర్భంలో జడ్జిమెంట్-డెటార్ (JDR) ఆస్తిని విక్రయించినపుడు అతని ఆస్తి విలువలను సరిగా లెక్కించలేదు. దాని ఫలితంగా 40 వేల రూపాయల ఆస్తి 20 వేల రూపాయలకు విక్రయించబడింది. సంయుక్త రుణగ్రస్తుడి ద్వారా ఆ విక్రయాన్ని చెల్లదంటూ పక్కన పెట్టడానికి దావా వేయబడింది. అతని మౌనం అతని అంగీకారంగా మారి అందుకు భిన్నంగా వ్యవహరించకుండా కట్టుబాటు చేసిందని వాదించారు. అమ్మకానికి సంబంధించిన Proclamation (అధికారిక ప్రకటన) సవరించాలని దావా వేయవలసిన బాధ్యత ఉన్నందున, ఆ పని చేయని వ్యక్తి దాన్ని అంగీకరించినట్టే భావించవలసి వస్తుందంటూ కోర్టు ఆ వాదనను సమర్థించింది.

## నివేదన ప్రవర్తన రూపంలలో ఉండవచ్చు:

1. ప్రవర్తన విన్నపంగా ఉండవచ్చు లేకనూ పోవచ్చు

   (i) ఎప్పుడు అది విన్నపంగా ఉంటుంది 191 A. 203

   (ii) ఎప్పుడు ఉండదు 191 A. 221

ప్రవర్తన క్రియాత్మకంగా గానీ, క్రియారహితంగా గానీ ఉండవచ్చు.

## క్రియారహిత ప్రవర్తన

(1) ఉదాసీనత

(2) నిరాక్షేపణ సమ్మతి

క్రియారహిత ప్రవర్తన కట్టుబాటు కలిగించడానికి నిరాక్షేపణ సమ్మతిగా ఉండాలి. అది కేవలం ఉదాసీన ప్రవర్తనగా ఉంటే సరిపోదు.

నిరాక్షేపణ సమ్మతి ప్రవర్తనను ఈ క్రింది విధంగా వర్ణించవచ్చు.

''హక్కు ఉన్న వ్యక్తి మరొక వ్యక్తి ఆ హక్కును అతిక్రమించబోతున్నప్పుడు కాని, అతిక్రమించుతున్నప్పుడు కానీ ఆ వ్యక్తి చేసే పనిని ప్రోత్సహిస్తున్నట్లుగా ఉంటాడు. నిజానికి ఆ పని చేయకుండా అడ్డుపడాల్సింది. ఈ విధంగా మరొక వ్యక్తి తన హక్కును అతిక్రమించటాన్ని బలపరుస్తున్నట్లుగా నమ్మిస్తాడు. ఈ పని నిరాక్షేపణ ప్రవర్తన అవుతుంది.

2 Bh. 117 (123) 41 E.R. 886

Imp. 45 Bom. I.L.R. 80

14 All. 362 (364)

నిరాక్షేపణ సమ్మతి నిరాక్షేపణ ప్రవర్తన జరుగుతున్నప్పుడు గానీ, పూర్తి అయింతర్వాత గాని సంభవించవచ్చు. నిరాక్షేపణ సమ్మతి అతిక్రమణం జరుగుతున్నప్పుడు మాత్రమే సంభవిస్తే అది మాట కట్టుబాటుగా మారుతుంది. Ch. D. 286 (314)

## గుర్తుంచుకోదగిన అంశాలు

1. తప్పుడు నివేదన ఉద్దేశపూర్వకంగా కాకుండా వాస్తవాలను రాబట్టేదిగా ఉండాలి. 5 R.L.

C 185

<u>ఉదాహరణ:</u>

1. ఒక వ్యక్తి తనకున్న న్యాయబద్ధమైన హక్కును పరిత్యాగం చేయదలుచుకున్నట్లుగా నివేదనను ఆ హక్కును పొందిన తర్వాత, దానిని అమలులో పెట్టటానికి నడుమ చేయడం జరిగింది.

2. విషయానికి సంబంధించిన నిజాలేమిటో ఇరుపక్షాల వారికి తెలిసి ఉన్నప్పుడు మాట కట్టుబాటు ఉండదు.

30 Cal. 539 P.C.

మొహరి బీబి, ధరేమ్‌దాస్ ఘోస్‌ల మధ్య వివాదం.

జులై 20, 1895న దామోదర్ దాస్, వడ్డీ వ్యాపారి బ్రహ్మదత్ పేరుమీద ఒక తాకట్టు పత్రం వ్రాశాడు. బ్రహ్మదత్ ఈ వ్యవహారం జరిగినప్పుడు లేడు. అతని తరపున అతని వకీలు కేదార్‌నాథ్ వ్యవహారం నడిపించాడు. బ్రహ్మదత్‌కు స్థానికంగా మానేజర్‌గా పనిచేస్తున్న డేద్రాజ్ డబ్బు అందజేశాడు. ఈ లావాదేవీలన్నీ జరుగుతున్నప్పుడు దామోదర్‌దాస్ తల్లి కేదార్‌నాథ్‌కు దామోదర్‌దాస్ ఇంకా మైనరేననీ, ఎవరయినా అతనికి డబ్బు ఇస్తే అందుకు బాధ్యులు వారే అవుతారనీ పేర్కొంటూ ఉత్తరం రాసింది.

తాకట్టు పత్రం రాయించిన రోజు కేదార్‌నాథ్ దామోదర్ దాసుతో తాను మేజర్‌నేనని తెలిపే ప్రకటనను రాయించి తీసుకున్నాడు.

సెప్టెంబర్10, 1895న దామోదర్ దాసు తల్లి ఆ తాకట్టు పత్రం దామోదర్ మైనర్ కావటం వలన చెల్లనేరదని దావా వేసింది.

బ్రహ్మదత్ దామోదర్ తాను ముందు చెప్పిన దానిని ఉపసంహరించుకోరాదని వాదించాడు. దానిని కోర్టువారు ఒప్పుకున్నారు. దీనికి కారణం వాస్తవాలు బ్రహ్మదత్‌కు తెలియటం వలన కాదు.

నిజానికి వాస్తవాన్ని తెలుసుకోవటం, వాస్తవాన్ని తెలుసుకోటానికి మార్గముండటం వంటిది కాదు.

L.R. 20 Ch. D. 1 రెడ్‌గ్రీవ్, హర్డ్‌ల మధ్య వివాదం

వాది తన వ్యాపారం సంవత్సరానికి 300 డాలర్ల లాభాన్నిస్తుందని తెలుపుతూ మూడు సంతృప్తిపరచాడు. కానీ ప్రతివాది వాటిని పరిశీలించలేదు. వాది మీది నమ్మకంతో ప్రతివాది వాది

వ్యాపారాన్ని కొనుగోలు చేస్తున్నట్లుగా ఒప్పందం పత్రం మీద సంతకంచేసి కొంత డిపాజిట్ కట్టాడు. తర్వాత ఆ వ్యాపారం నిరుపయోగమైనదని ప్రతివాది మిగిలిన డబ్బు చెల్లించటానికి నిరాకరించాడు. అయితే వాది అందుకు దావా వేశాడు. వాది ప్రకారం ప్రతివాది వాది చేసిన ప్రకటన తప్పని చెప్పటానికి కట్టుబాటు అడ్డొస్తుంది. దీనికి కారణం వాది చెప్పిన విషయాలను బలపరచటానికి సాక్ష్యాలున్నాయి. వాటిని తెలుసుకునే వీలు ప్రతివాదికి ఉంది.

జొస్సెల్ M.R.P. 21

''ఒక వ్యక్తి తప్పుడు సమాచారాన్ని పొందుపరచటం ద్వారా మరొక వ్యక్తిని కాంట్రాక్టు ఒప్పుకునేలాగా ప్రేరేపించినప్పుడు, ఆ రెండవ వ్యక్తి అది అసత్యమని తెలుసుకున్నప్పుడు లేదా తెలుసుకునే అవకాశం ఉన్నప్పుడు అది కాంట్రాక్టు రద్దుచెయ్యటానికి తగిన ప్రతివాదం కాజాలదు. కాంట్రాక్టులో పేర్కొన్నదానికి భిన్నంగా ఉన్న వాస్తవాలు అతనికి తెలిసినట్లుగానీ, లేదా ఆ ప్రకటనను అతను నమ్మనట్లుగా పేర్కొనబడటంగానీ, అతని ప్రవర్తన ద్వారా వెల్లడి కావటంగానీ జరిగినట్లు చూపించాల్సి ఉంటుంది.''

11. మాట కట్టుబాటు సూత్రంలోని రెండవ అంశం - వాది ప్రకటనపై విశ్వాసంతో వ్యవహరించాలనే ఉద్దేశం.

నివేదన చేసిన వ్యక్తి తప్పుచేయకుండా ఉండాలని లేదు.

అలాగే నివేదన చేసిన వ్యక్తి బుద్ధిపూర్వకంగా పెడదారి పట్టించాలనిగానీ మోసగించాలని గానీ లేదు.

191 A. 203

కానీ నివేదన చేసిన వ్యక్తికి వాది నివేదన పట్ల విశ్వాసంతో వ్యవహరించాలనే ఉద్దేశం ఉండటం అవసరం.

ఉద్దేశాన్ని ఎలా రుజువు చేయటం?

ఉద్దేశాన్ని రెండు వేర్వేరు అర్థాలతో వాడవచ్చు.

(1) దానిని న్యాయాంశ పురోభావనను తెలియజేయటానికి వాడవచ్చు. ఒక వ్యక్తి తన చర్య యొక్క తప్పనిసరి, సహజ ఫలితాలను ఊహించినట్లుగా భావించాలి.

(2) ఉద్దేశం ఒక వ్యక్తి ప్రత్యేక మానసిక పరిస్థితిని తెలిపేదిగా ఉంటుంది.

ఈ ప్రత్యేక మానసిక పరిస్థితిని మిగతా ఘటనల వాస్తవాలవలే ఒక ఘటనగా రుజువు చేయవలసి ఉంటుంది. అంతేకానీ దానిని ఊహించటానికి వీలులేదు.

ఉదాహరణ-

(1) సెక్షన్ 225, I.P.C. ఎవరయితే ఉద్దేశపూర్వకంగా ప్రతిపాదన చేస్తారో.

(2) సెక్షన్ 124, I.P.C. ఎవరయితే ఉద్దేశపూర్వకంగా ఉంటారో.

ఉద్దేశం ఇక్కడ న్యాయాంశ పురోభావనగా వాడబడింది. అది రెండవ అర్థంలో వాడబడలేదు.

కావున కక్షిదారు ఒక ప్రత్యేక అంశంగా వ్యవహరించాడనే ఉద్దేశాన్ని రుజువు చేయవలసిన అవసరం లేదు.

ఒక వ్యక్తి నివేదనను నిజమయినదిగా తీసుకొని, దాని ప్రకారంగా వ్యవహరించాలని అనుకొన్నప్పుడు ఉద్దేశం యొక్క ఆపక్షితం నెరవేరుతుంది.

**191 A. 203 (219)**

III. మాట కట్టుబాటు సూత్రంలోని మూడవ అంశం ఎవరికయితే నివేదన చేయబడిందో ఆ కక్షిదారు ఆ నివేదనపై నమ్మకంతో వ్యవహరించవలసి ఉంటుంది.

1. ఈ అంశం కట్టుబాటు సూత్రానికి మూలస్తంభం వంటిది. ఇది అందులో ఇమిడిఉన్న సూత్రాన్ని వివరిస్తుంది. ఈ సూత్రంలో ఇమిడి ఉన్న ప్రధాన అంశం అది అసామ్యమైనన్యాయవిరుద్ధంగా ఉండటం.

ఒక వ్యక్తి చేసిన నివేదన ద్వారా గానీ ప్రవర్తన ద్వారా గానీ మరొక వ్యక్తి సాధారణ పరిస్థితులలో వ్యవహరించటానికి భిన్నంగా వ్యవహరించటానికి ప్రేరేపించటం. నివేదన చేసిన వ్యక్తి తాను ముందుగా చేసిన ప్రకటన వలన దాని ప్రకారంగా వ్యవహరించిన వ్యక్తికి నష్టంకానీ హానిగానీ జరిగితే ఆ ప్రకటనను తిరస్కరించటానికి గానీ, దాని ఫలితాన్ని నిరాకరించటానికి గానీ విలు ఉంటుంది.

2. ఆ వ్యక్తి దాని ప్రకారం వ్యవహరించి తన అభిప్రాయాన్ని మార్చుకోవటం ఈ సూత్రానికి గల కారణం. ఈ ప్రకటన ఎవరికోసం చేయబడిందో ఆ కక్షిదారు మీద అది పనిచేయటం జరిగిన పక్షంలో దానిని కట్టుబాటుగా పరిగణించవలసి ఉంటుంది.

**14 Bom. 312**

**13 Moo I.A. 585 (599)**

## కట్టుబాటు సూత్రానికి గల పరిమితి

### 1. ఇది దేశీయ చట్టాన్ని ధిక్కరించలేదు.

**(i)** మైనర్ మేజర్‌గా ప్రకటించుకున్నప్పుడు అతను మైనారిటీనీ నిరూపించుకోటాన్ని ఈ కట్టుబాటు ఆపలేదు.

**(ii)** పాలక సంఘం అధికార బాహ్య చర్యలకు పాలుపడినప్పుడు ఆ పనులు దాని అధికారాలకు మించి ఉన్నాయని రుజువు చేయటాన్ని నిషేధించలేదు.

అనుమతికీ ఒప్పుకోళ్లకు, కట్టుబాటులకూ మధ్యగల ఇతర విభేదాలు.

1. ఒక ఒప్పుకోలు కక్షిదారు అది అసత్యమని రుజువు చేయటాన్ని నిలిపివేయలేదు. కానీ ఒక కట్టుబాటు మాత్రం కక్షిదారు ఆ పని చేయకుండా నిలిపివేయగలదు.

2. ఒక ఒప్పుకోలును అది ఇవ్వబడిన వ్యక్తి మాత్రమే కాకుండా మరెవరికయినా ఉపయోగించుకోవచ్చు. కానీ ఒక కట్టుబాటు మాత్రం అది ఎవరికయితే ఇవ్వబడిందో అతనే దాన్ని ఉపయోగపెట్టుకోగలడు. కొత్త వ్యక్తికి ముందు దాన్ని అతను నిరాకరించవచ్చు.

**5 W.R. 209**
**5 A.R. 209**

వాది తాను ఆ ఆస్తిని పదివేల రూపాయలకు కొనుగోలు చేసినట్లుగా దావాలో పేర్కొన్నాడు. తర్వాత డబ్బుకోసం దానిని అతని తల్లికి తాకట్టు పెట్టాడు. తర్వాత ఒక సంవత్సరానికి ఆ ఆస్తిని తాకట్టు నుంచి విడిపించుకొని స్వాధీనం చేసుకున్నాడు.

ప్రతివాది వాది తల్లిమీద డిక్రీ పొందాడు. డిక్రీని అమలు చేయటం ద్వారా కోర్టు ఆ ఆస్తిని అమ్మేటట్లు చేసి దానిని తానే బినామీ పేరుతో కొనుగోలు చేశాడు. వాది తొలగించబడ్డాడు. వాది తన ఆస్తిని తిరిగి పొందటానికి దావా వేశాడు.

ప్రతివాది వాది అది తన ఆస్తేనని నిరూపించుకొనే అవకాశం కోర్టువారు అతనికి ఇవ్వకూడదనీ, అందుకు కారణం వాది అంతకు ముందు వేసిన దావాలో అది తన తల్లి ఆస్తేనని ప్రతివాది కక్షిదారు కాదనీ ఒప్పుకున్నాడనీ వాదించాడు. నిషేధం లేకపోవటం వలన కోర్టు దీనికి సమ్మతించింది.

**మాట కట్టుబాటుకు, నిర్ధారిత రుజువుకు మధ్య తేడా:**

1. తనకు అనుకూలంగా వ్యవహరించే కట్టుబాటును ఆ వ్యక్తి కాదనుకోవచ్చు. కాని నిర్ధారిత రుజువును ఎవరూ కాదనలేరు.

**నిర్ధారిత తీర్పు (Res Judicata)** కూ కట్టుబాటుకూ మధ్య తేడా

Res Judication ( నిర్ధారిత తీర్పు) ఒక వ్యక్తి ఒకే విషయాన్ని రెండుసార్లు వరుసగా వ్యాజ్యాలలో చెప్పటాన్ని నిషేధిస్తుంది.

మాట కట్టుబాటు ఒక వ్యక్తి ఒకసారి ఒకమాట, మరొకసారి మరొకమాట చెప్పటాన్ని తిరస్కరిస్తుంది.

**36 Bom. 214**

ఇంగ్లీషు, భారతీయ మాట కట్టుబాటు సూత్రం.

1. ఇంగ్లీషు న్యాయశాస్త్రం ప్రకారం మాట కట్టుబాట్లు సాధారణంగా ఈ క్రింది మూడురకాలుగా వర్గీకరించబడతాయి.

(i) రికార్డు పరమయిన కట్టుబాటు

(ii) పత్రకారణ కట్టుబాటు

(iii) ప్రవర్తన కారణ కట్టుబాటు

2. రికార్డు కారణ కట్టుబాటు అనగా సమర్థ న్యాయస్థాన తీర్పు ద్వారా చేయబడిన కట్టుబాటు.

(i) రికార్డు కారణ కట్టుబాటు భారతీయ చట్టం ద్వారా గుర్తింపు పొందింది. ⁻ది ఈ క్రింది వాటికి సంబంధించి ఉంటుంది.

(a) సివిల్ ప్రక్రియ నియమావళి ద్వారా. సెక్షన్లు 11-4

(b) సాక్ష్య చట్టం ద్వారా. సెక్షన్లు 40-4

3. పత్రకారణ నిషేధం.

1. ఇంగ్లీషు న్యాయశాస్త్ర ప్రకారం ఒక కక్షిదారు తనకూ మరొక కక్షిదారుకూ మధ్య జరిగిన వ్యవహారానికి సంబంధించి దస్తావేజులో పేర్కొన్నదానికి వ్యతిరేకంగా ఏమీ చేయలేడు. ఈ సూత్రం

ఇంగ్లీషు న్యాయశాస్త్రంలోని 'సీల్' ప్రాముఖ్యాన్ని అతిశయం చేసి చూపటానికి ఉదాహరణగా ఉంటుంది. ''సీలు'' వేశారనడానికి లక్క గానీ, ముద్రగానీ అవసరంలేదు. సిరా గుర్తులైనా సరే తలచుకుంటే 'సీలు'గా పనిచేస్తాయి. స్పష్టమయిన గుర్తించతగిన సంతకం కన్న నిర్దిష్టమైన 'సీల్'కు శాసనం మరింత ప్రాధాన్యతనిస్తుంది. కనుక మామూలు సంతకాలతో కూడిన కాగితాలు ఒక్కోసారి మాట కట్టుబాటు సృష్టించలేవు.

2. పత్రకారణ కట్టుబాటుకు ఖచ్చితమయిన సాంకేతిక సిద్ధాంతం భారతదేశంలో ఉన్నట్లు లేదు.

3. అయితే సాంకేతిక సిద్ధాంతం మన దేశంలో అమలులో లేదు. కాని అధికార పత్ర ప్రకటనలు ఒప్పందాలవలే ఎప్పుడూ కక్షిదారులకు వ్యతిరేక సాక్ష్యాలుగా ఉంటాయి. కొన్ని సందర్భాలలో ఒక ప్రకటన పరిస్థితులనుబట్టి ఒప్పుకోలుకు కొద్దోగొప్పో సాక్ష్యంగా విలువ కలిగిన దానిగా ఉంటుంది, కాని తుది నిర్ణయంగా మాత్రం కాదు. మరికొన్నిసార్లు ముఖ్యంగా రెండవ కక్షిదారు డాక్యుమెంట్‌లోనున్న ప్రకటనపై విశ్వాసంతో తన స్థితిని మార్చుకునేటట్లు ప్రేరేపించబడితే అటువంటి ప్రకటన ఒక కట్టుబాటుగా వ్యవహరించబడుతుంది. ఈ విషయంలో దస్తావేజు ద్వారా గానీ ఇతరత్రాగానీ ఉద్భవించిన కట్టుబాటు సెక్షన్ 115 క్రింద ప్రవర్తన ద్వారా గానీ తప్పుడు నివేదన ద్వారా గానీ ఆ కట్టుబాటు యొక్క ప్రత్యేక దరఖాస్తుగా పరిగణించబడుతుంది.

4. ఒక కట్టుబాటు సాక్ష్యచట్టం ప్రకారం దస్తావేజులో పేర్కొనబడిన ప్రకటన వలన మాత్రమే ఉత్పన్నమవ్వదు. అది సెక్షన్ 115 పరిధిలోకి వచ్చినప్పుడు మాత్రమే కట్టుబాటుగా పనిచేసుంది.

1. All. 403

II. Bom. 708

5. దస్తావేజులోని కథనం కేవలం ఒక అంగీకారంగానే కానీ లేదా పరిస్థితులనుబట్టి కట్టుబాటుగా గానీ ఉంటుంది.

## ప్రత్యేక నిషేధాలు

1. సెక్షన్ 115 సాధారణ కట్టుబాటులతో, సెక్షన్ 116, 117లు ప్రత్యేక కట్టుబాట్లతోను సంబంధించి ఉంటాయి.

2. సెక్షన్ 115 లోని కట్టుబాటుకు, సెక్షన్లు 116-117లలోని కట్టుబాట్లుకూ మధ్య ఉన్న భేదాన్ని గుర్తించవచ్చు.

(i) సెక్షన్ 115 ప్రకారం కట్టుబాట్లు ఏ ఇద్దరు కక్షిదారుల మధ్యనైనా ఉత్పన్నమవ్వవచ్చు. అవి తప్పనిసరిగా ఒక ప్రత్యేక న్యాయ ఘర్షణకు సంబంధించి ఉండాలి. 116-117ల ప్రకారం కట్టుబాటు బంధుత్వం ఉన్న కక్షిదారుల మధ్య మాత్రమే ఉత్పన్నమవుతాయి.

(ii) సెక్షన్ 115 ప్రకారం ఒక కక్షిదారు మరొక కక్షిదారుకు చేసిన తప్పుడు నివేదన కారణంగా కట్టుబాటు ఉత్పన్నమవుతుంది. సెక్షన్లు 116, 117ల ప్రకారం ఇద్దరు కక్షిదారుల మధ్య జరిగిన ఒప్పందం నకిలీ సంబంధాన్ని సృష్టించటం కారణంగా ఈ కట్టుబాటు ఉత్పన్నమవుతుంది.

సెక్షన్ 116. ఇది ఈ క్రింది వాటి మధ్య కట్టుబాట్లకు సంబంధించి ఉంటుంది.

(i) యజమాని, కిరాయిదారు

(ii) స్థిరాస్తికి లైసెన్స్‌దారు, లైసెన్స్‌దాత

1. యజమాని, కిరాయిదారు కట్టుబాటు స్థిరాస్తి కిరాయిదారుకు సంబంధించినది.

2. ఈ కట్టుబాటు ఒక వ్యక్తి కిరాయిదారు ద్వారా ఆస్తిపై హక్కును ప్రకటించిన సందర్భాలకు వర్తిస్తుంది. కిరాయిదారు తన స్వాధీనంలోనున్న ఆస్తిని యజమాని అనుమతి తీసుకోకుండా, అతనికి తెలియకుండా ఉప కిరాయిదారునికి ఇచ్చినప్పుడు ఉపకిరాయిదారు ఆ ఆస్తికి అసలు హక్కుదారు యజమాని కాదని ప్రకటించకుండా ఈ కట్టుబాటు నిరోధిస్తుంది.

3. ఈ కట్టుబాటు ఒక వ్యక్తి యజమాని ద్వారా ఆస్తిపై హక్కు చేకూర్చుకోవాలనుకుంటే అందుకు అడ్డుపడుతుంది.

రెండు సందర్భాలలో ఆవరణలను కిరాయికివ్వవచ్చు.

(i) వాది, ప్రతివాదికి ఆస్తిపై హక్కు వచ్చేలా చేసిన సందర్భాలలోనూ,

(ii) సందర్భాలలోనూ, ప్రతివాదికి ఆస్తిపై హక్కు లభించేలా చేసింది వాద కాకపోయినా అందుకు కారకుడయిన వ్యక్తి ద్వారా హక్కు పొంది క్లెయిం చేసినప్పుడు.

ఈ సెక్షన్ మొదటి కేసు విషయంలో వర్తిస్తుంది. ఇది కిరాయిదారుని యజమానికి ఆస్తిపై హక్కులేదని తిరస్కరించకుండా నివారిస్తుంది. కానీ ఈ సెక్షన్ రెండవ సందర్భానికి వర్తించదు. దీనికి

కారణం ఈ సందర్భంలో యజమానికి ఆస్తిపై హక్కు మొదటిది కాక దాని నుంచి ఉత్పన్నమయినది కావటం. ఇది కొనటం వలనగానీ, వారసత్వంగా రావటం వలన గానీ, కౌలుగా తీసుకోవటం వలన గానీ సంక్రమించవచ్చు. ఈ విషయంలో వాది ఉత్పన్న హక్కు ద్వారా క్లెయిం చేసుకున్నప్పుడు ప్రతివాది ఆ ఆస్తి అతని పేరుమీద లేదని అది మరొకరికి చెందిందనీ నిరూపించటాన్ని ఏ విధంగానూ నిషేధించదు. కౌలుదారు తన హక్కు ఉత్పన్నమయినది కాదని నిరూపించుకోవచ్చు. ఇందుకు ''యజమాని ద్వారా హక్కు ప్రతిపాదించటం'' అనే మాటలు లేకపోవటమే కారణం.

ఈ కట్టుబాటు కౌలుదారు ప్రారంభంలో హక్కును నిరాకరించినప్పుడు వర్తిస్తుంది. ఈ కారణంగా కౌలుదారు తన యజమాని హక్కుకు గడువు తీరిపోయిందని కానీ, లేదా సమాప్తమయిందని కానీ చూపించవచ్చు. అటువంటి సందర్భాలలో అతడు హక్కుదారు విషయంలో తగాదా పడడు కానీ దానిని ఒప్పుకొని కార్యానంతరం నిర్లక్ష్యం చేస్తాడు. న్యాయశాస్త్రం ప్రకారం కౌలుదారుకు ఈ విన్నపం చేసే అవకాశం కలిగించాల్సి ఉంటుంది. దీనికి కారణం కౌలుదారు అసలు యజమానికి రుణపడి ఉంటాడు. అతనికి డబ్బు చెల్లిస్తూ ఉంటాడు. అటువంటప్పుడు యజమానికి ఆ ఆస్తిపై హక్కుకు గడువు తీరిపోయిందనో, సమాప్తమయిందనో తన ప్రతివాదంగా కౌలుదారు చూపించలేకపోవటం అన్యాయమవుతుంది.

4. కట్టుబాటు అవకాశం: కౌలుదారుగానీ అతనిచే నియమించబడిన వ్యక్తిగానీ కౌలుదారి ప్రారంభంలో తమ కౌలుకిచ్చిన యజమానికి ఆస్తిపై హక్కు లేదని వాదించటానికి ఈ నిషేధం అనుమతించదు.

5. ఈ కట్టుబాటు కౌలుదారి ఉన్నంతకాలం మాత్రమే కౌలుదారునికి వర్తిస్తుంది. ఒక్కసారి కౌలుదారి గడువు అయిపోయినట్లయితే కౌలుదారు తన యజమానికి ఆస్తిపై హక్కులేదని, కౌలుదారి ప్రారంభంలో కూడా దానిమీద అతనికి ఏవిధమైన హక్కులేదని వాదించవచ్చు.

## II. స్థిరాస్తికి లైసెన్స్‌దారు, లైసెన్స్‌దాత.

1. ఈ నియమం లైసెన్స్‌దారు విషయంలో కూడా అంతే వర్తిస్తుంది. లైసెన్స్‌దాత లైసెన్స్ ఇచ్చే నాటికి అది అతని స్వాధీనంలోనే ఉంటుంది.

2. కౌలుదారుకీ, లైసెన్స్‌దారుకీ మధ్యగల బేధం లైసెన్స్ అనగా ఒక వ్యక్తికి మరొకవ్యక్తి ఒక పని చేయటానికి అనుమతి ఇవ్వటం. ఈ అనుమతి లేకుండా ఆ వ్యక్తి ఆ పని చేయటం చట్టరీత్యా

నేరమవుతుంది. ఇది సొంత హక్కు. ఇతరులకు బదిల చేయటానికి వీలుండదు. ఆ వ్యక్తి చనిపోతే అతనితోటే అది కూడా సమాప్తమవుతుంది. నియమానుసారం లైసెన్స్‌దాత దానిని ఉపసంహరించుకోటానికి వీలుంటుంది. కానీ లైసెన్స్‌దారు డబ్బు చెల్లించిన సందర్భాలలో మాత్రం ఇది కుదరదు.

కౌలుదారి భూమిపై వచ్చే వడ్డీ. ఇది ఒకరినుంచి మరొకరికి బదిలీ చేయబడవచ్చు లేదా వారసత్వంగా సంక్రమించవచ్చు.

సెక్షన్ 117 ఈ క్రింది వాటికి సంబంధించి ఉంటుంది.

(1) మారకపత్రం అంగీకరణదారుకు సంబంధించిన కట్టుబాటు

(2) బెయిలీకి సంబంధించిన కట్టుబాటు

(3) లైసెన్స్‌దారుకు సంబంధించిన కట్టుబాటు

(1) అంగీకరణదారుకు సంబంధించిన కట్టుబాటు చెక్కు వ్రాసే వ్యక్తికి బిల్లు వ్రాసే అధికారం కానీ దానిని ఆమోదించే అధికారంగానీ లేదని అంగీకరణదారు వాదించటాన్ని నిషేధిస్తుంది.

అంగీకరణదారుకూ, బిల్లుదారుకూ మధ్యనున్న ఒప్పందంలో ఈ నియమానికి గల కారణం తెలుస్తుంది.

అంగీకరణ ఒప్పందం ఏ నిబంధనలను విధిస్తుంది?

(1) అతడు చెల్లింపు గ్రహీతకుగానీ, హక్కుదారునకు గానీ డబ్బు చెల్లించవలసి ఉంటుంది.

(2) అతడు డబ్బు చెల్లించని పక్షంలో చెక్కు కర్త చెల్లించాల్సి ఉంటుంది.

చెక్కు కర్త డబ్బు చెల్లించాలంటే దాని అర్థం ఏమిటి? దాని అర్థం చెక్కుకర్తకు తనకుతానే బాధ్యత వహించటానికి తగిన అధికారం, యోగ్యతా ఉంటాయి.

చెల్లింపు గ్రహీత ఈ ఒప్పందం మేరకు దాన్ని తీసుకున్నాడు. అంగీకరణదారు ఈ కారణంగా **ఒప్పందాన్ని** తిరస్కరించటానికి వీలులేదు.

**వివరణ I** ప్రకారం అతడు చెక్కుదారు సంతకం నకిలీ అనే వాదాన్ని తిరస్కరించటానికి **వీలుంటుంది.**

ఇది ఇంగ్లీషు న్యాయశాస్త్రానికి వ్యతిరేకంగా ఉంది.

(2) & (3) బెయిలీ, లైసెన్స్‌దారులకు సంబంధించిన నిషేధం

వారు నిక్షేపదాతకు బెయిల్మెంటు చేసుకునే అధికారాన్నిగానీ, లైసెన్స్‌దాతకు లైసెన్స్ మంజూరు చేసే అధికారాన్ని గాని వాటి ప్రారంభంలో తిరస్కరించటానికి వీలులేదు. దురభిమానం లేకుండా ప్రతిపాదించిన విషయాలు.

1. కక్షిదారు చేసిన కొన్నిరకాల ఒప్పందాలు ఈ విభాగం పరిధిలోకి వస్తాయి.

2. ఒకవేళ ఒప్పుకోలు సెక్షన్23లో పేర్కొన్న పరిస్థితులననుసరించి చేయబడినట్లయితే అది ఆ కక్షిదారుకు వ్యతిరేకంగా నిరూపించబడటానికి వీలులేదు.

3. ఈ పరిస్థితులు ఏమిటి?

(1) అది దానికి సంబంధించిన సాక్ష్యాన్ని ఇవ్వకూడదనే నిబంధన మేరకు చేయబడినదయితే

(a) నిబంధనను వ్యక్తపరచవచ్చు

(b) నిబంధనను కక్షిదారుల ప్రవర్తనను బట్టి తెలుసుకునేదిగా ఉండవచ్చు.

(2) ఒప్పుకోలు నోటి మాట ద్వారా గానీ, లిఖితపూర్వకంగా గానీ ఉండవచ్చు.

## 4. సెక్షన్ 23 అమలు

(1) అది సివిల్ కేసులకు మాత్రమే వర్తిస్తుంది. ఈ నియమం క్రిమినల్ కేసులకు వర్తించదు.

(2) న్యాయనిర్ణయ అర్థ వివరణ ప్రకారం ఈ సెక్షన్ అమలు అందులోనే బదలాయింపులప్పుడు చేసిన ఒప్పందాలకు పరిమితం చేయబడింది.

ఒక ధృవీకరణ పత్రం నిష్పక్షపాతంగా రాయబడినట్టు చేసిన ప్రకటన దాని నుంచి మినహాయింపు పొందదు. 'నిష్పక్షపాతం' అనే గుర్తు పెట్టబడిన ధృవీకరణ పత్రాలను మినహాయించే నియమం ఇక్కడ వర్తించదు. కానీ ఒక వ్యక్తి మరొకరితో వాదోపవాదాలు సంప్రదింపులు జరుపుతున్నప్పుడు, వాటిని తీర్చి రాజీ కుదర్చటానికి షరతులు ప్రతిపాదించబడినప్పుడు ఈ నియమం వర్తిస్తుంది.

23 Bom. 117 (180)

వివరణ-

ఈ సెక్షన్ ఒక వ్యక్తి సమాధానం తప్పనిసరిగా ఇవ్వవలసి వచ్చినప్పుడు వర్తించదు. సంబంధం లేని విషయాలు

1. సాక్ష్యచట్టం ఏ విషయాలు సంబంధం లేనివో పేర్కొనదు.

2. అది సంబంధమున్న విషయాలను పేర్కొంటుంది. సంబంధంలేని వాటిని వదిలి వేస్తుంది.

3. సంబంధ నియమాలు నిరుపయోగకరమని ఆక్షేపణ చెప్పబడింది.

4. న్యాయాధిపతి ముఖ్యంగా ఈ క్రింది రెండు సమస్యలను ఎదుర్కొంటాడు.

(i) సాక్షి చెప్పేది నమ్మవచ్చా, లేదా? నమ్మితే ఎంతవరకు నమ్మాలి?

(ii) న్యాయాధిపతి నిరూపించబడినట్లుగా తాను నమ్మిన విషయాల నుంచి ఎంత సారాంశాన్ని గ్రహించాలి?

న్యాయస్థాన కార్యవ్యవహారాలన్నింటిలోను రెండు ముఖ్యమైన ప్రశ్నలుంటాయి - ఇది నిజమా? నిజమయితే ఏం చెయ్యాలి?

5. సంబంధ నియమాలు ఈ రెండు ప్రశ్నలకు సంబంధించి ఏ విధంగానూ ఉపకరించవు. ఈ నియమాలు తెలియని వ్యక్తులే ఈ ప్రశ్నలకు మంచి సమాధానాలు ఇవ్వగలుగుతారు.

6. ఆక్షేపణలకు సమాధానం

(i) తర్కం తెలియకపోయినా మనుష్యులు చక్కగా వాదిస్తారు. అంటే దీని అర్థం మనం తర్కం చదువుకొని ఉండాలని కాదు.

(ii) ఏకాగ్రతతో కూడిన మనసును దారి తప్పించి అనవసరమయిన సమాంతర ప్రశ్నలతో తలనొప్పి కలిగించే సంబంధం లేని అంశాల ప్రవహాన్ని సంబంధ నియమాలు పూర్తిగా నిరాకరిస్తాయి.

1. ఒక ఘటనను నిరూపించవచ్చుగాని ఒక అభిప్రాయాన్ని కాదు అనేది సంబంధ నియమాలలో ముఖ్యమైనది. ఘటనలను రెండు వర్గాలుగా విభజించవచ్చు.

ఇంద్రియాల ద్వారా తెలుసుకోగలిగేవి, ఇంద్రియాల ద్వారా తెలుసుకోలేనివి. ఇంద్రియాల ద్వారా తెలుసుకోలేనివి ఈ క్రింద పేర్కొనబడినాయి.

(1) ఉద్దేశం (2) మోసం (3) సద్భావన (4) విజ్ఞానం

న్యాయశాస్త్ర ప్రకారం రుజువు చేయదగ్గ విషయాలు

1. వివాదాంశాలు 3, 5, 12

2. వివాదాంశాలకు సంబంధించిన విషయాలు. 3, 6, 7, 8, 9, 13-16, 52-58, 45-51.

3. వివాదాంశాలకు గాని, సంబంధిత విషయాలకు గాని సంగతంగా ఉన్న అంశాలు గానీ, వివాదాంశాల లేదా సంబంధిత అంశాల సంభావ్యతను తెలియజేసే అంశాలు గాని. 34-39-46.

నోట్- 31-32లు ప్రత్యక్ష సాక్ష్యం క్రింద మినహాయించబడతాయి.

11(1)లో అసంగతంగా ఉన్న ఘటనలను (17-31)

4. వివాదాంశాలతోగానీ, సంబంధిత విషయాలతో వివాదాంశాల లేదా సంబంధిత అంశాల అసంభావ్యతను తెలియజేసే అంశాలు గాని. 41-44, 46.

## వివాదాంశాలు

సెక్షన్ 3. వివాదాంశానికి రెండు ఆక్షేపితాలుంటాయి:

(1) ఇది అవసరమైన అంశం.

వివాదాంశమనేది ఒకకక్షిదారు మరొక కక్షిదారు మీదకానీ, అతనికి వ్యతిరేకంగా గానీ క్లెయిం చేసిన హక్కుకు గానీ, విధించవలసిందిగా ప్రతిపాదించిన చెల్లింపు బాధ్యతకు గానీ మూలాధారమైన విషయం.

వివాదాంశమనేది ఒక ఘటన. ఏదయినా క్లెయిమ్‌ను ఆమోదించాలన్నా, చెల్లింపు బాధ్యతను అంటగట్టాలన్నా ఈ ఘటనకు సంబంధించిన రుజువు అవసరం.

<u>ఉదా-</u>

(1) ఒకవేళ 'ఎ', 'బి'కి కొడుకుగా అతని ఆస్తికి వారసుడా, కాదా అన్న విషయంలో విచారణ జరపాలంటే ఈ క్రింది అంశాలు అవసరమవుతాయి.

(a) 'ఎ', 'బి'కి కొడుకేనా?

(b) 'బి' మరణించాడా?

(c) ఆస్తి 'బి'కి చెందుతుందా?

ఇవి చాలా ముఖ్యమైన విషయాలు. ఇవి రుజువు కాకపోతే తండ్రి ఆస్తికోసం 'ఎ' పెట్టుకున్న అర్జీ మంజూరు చేయబడదు.

ఇవే అతని క్లెయింకు పునాది

<u>ఉదా-</u>

(2) ఒకవేళ 'బి' మరణానికి 'ఎ' కారకుడా అనే విషయాన్ని వాకబు చెయ్యాలంటే ఈ క్రింది విషయాలు అవసరమవుతాయి.

(i) 'బి' మరణానికి 'ఎ' కారకుడా?

(ii) 'బి'ని చంపాలనే ఉద్దేశం 'ఎ'కు ఉందా?

2. అవసరమైన ప్రతి అంశం వివాదాంశం కాజాలదు. ఒక ముఖ్య అంశం నొక్కిచెప్పబడినా, తిరస్కరించబడినా అది వివాదాంశమవుతుంది.

ఉదాహరణ 1, 2 లలో ఏదైనా ముఖ్య అంశం తిరస్కరించబడితే అది వివాదాంశం అవుతుంది.

3. ఈ కారణంగా వివాదాంశమనేది ఇద్దరు కక్షిదారుల మధ్య వివాదంగా ఉన్న ఒక ముఖ్య అంశం.

2. వివాదాంశానికి సంబంధించిన అంశాలు

సెక్షన్ 3.1. సంబంధిత అంశం అంటే వివాదాంశానికి ముడిపడి ఉన్న మరొక అంశం.

1. ఈ సంబంధం బాహాటంగా, కనబడేలాగా ఉండాలి. ఒక్క మాటలో చెప్పాలంటే అది స్పష్టంగా వ్యక్తమయ్యేదిగా ఉండాలి.

2. సంబంధం సన్నిహితంగా ఉండాలి, దూరంగా ఉండకూడదు.

3. సంబంధం పురోభావ్య సాక్ష్యాన్ని మినహాయించే ముఖ్యమైన సంబంధంగా ఉండనక్కర్లేదు. **కాని అది ఊహించేదిగాగానీ,** నిగూఢమయినదిగా గానీ కాక సబబైనదిగా ఉండాలి.

4. సంబంధం ఉన్నదా, లేదా అనేది అభ్యాసంతో వచ్చే న్యాయ సహజాతం లేదా న్యాయ సంబంధిత వివేకం. ఈ క్రిందివి ఉదాహరణలుగా ఉపకరిస్తాయి.

(a) 'ఎ'కి చెందిన నేర విచారణలో సాక్షికాని 'బి' తానే అసలు నేరస్థుడననీ, 'ఎ' నిర్దోషి అని చేసిన ప్రకటన తిరస్కరించబడుతుంది. దీనికి కారణం అది లాలూచీ, కల్పితం అవటమే కాకుండా సంబంధం లేకుండా సుదూరంగా ఉండటమే.

R Vs. Gray Ir. Cir. Rep. 76

(b) 'ఎ' తన దగ్గర అప్పుగా తీసుకొన్న 5 పౌండ్లు ఇవ్వవలసిందిగా 'బి'పై పెట్టుకున్న అర్జీకి సంబంధించి 'ఎ' తన డైరీలో 'బి' తనకు 5 పౌండ్లు బాకీ ఉన్నట్లుగా నోటు చేసుకున్నది సంబంధం లేకపోవటం వలన తిరస్కరించబడుతుంది.

Storr Vs. Scott. 6 C & P 241

(c) విదేశాలలో నివసిస్తున్న 'బి'కి ప్రతినిధిగా 'ఎ' 'సి' దగ్గర నుంచి వస్తువులను కొనుగోలు చేశాడు. కొనేటప్పుడు 'ఎ' 'సి'కి అసలు కొనుగోలుదారు ఎవరో చెప్పలేదు. కాని ఇన్వాయిస్‌లు మాత్రం సరుకును 'బి' తరపున 'ఎ' కొన్నట్లుగా పేర్కొన్నాయి. 'సి' డబ్బుకోసం 'ఎ'ని అడిగాడు. 'బి' కొనమని సలహా, ఆ తర్వాత బిల్లులు 'ఎ' దగ్గర నుంచి పొందింతర్వాత డబ్బును 'ఎ'కు చెల్లించాడు. కాని ఇంతలో 'ఎ' దివాలా తీశాడు.

'సి' డబ్బుకోసం 'బి'పై దావా వేశాడు. 'సి' తన ఎకౌంటు పుస్తకాలను 'బి' అసలు కొనుగోలుదారు అని నిరూపించటానికి ఉపయోగించదలిచాడు.

కాని ఆ సాక్ష్యాన్ని కోర్టు ఒప్పుకోలేదు.

స్మిత్, ఆండర్సన్‌ల మధ్య వివాదం. 76-b. 21

II. ప్రతి సంబంధిత అంశం ముఖ్యం కాకపోవచ్చు. ఒక ప్రత్యేక రీతిలో సంబంధం కలిగిఉన్న అంశాలు మాత్రమే ముఖ్యమవుతాయి.

సాక్ష్యచట్టం ఒక అంశం ఏవిధంగా వివాదాంశంతో సంబంధం కలిగివుంటే ముఖ్యాంశంగా పరిగణించబడుతుందో తెలియజేస్తుంది.

6.1. వివాదాంశాలకు సంబంధించిన వ్యవహారాలలోనే భాగంగా ఉన్న అంశాలకు నిరూపణ అనుమతించబడుతుంది.

ఉదా. (a), (c), (d)లను చూడండి.

## వ్యవహారాలంటే ఏమిటి?

వ్యవహారాలు - అనగా కొన్ని ఘటనల సముదాయం. ఈ ఘటనలు ఒకదానితో ఒకటి ఎంతగానో ముడిపడి ఉండటం వలన మొత్తం సముదాయానికి ఒకటే పేరు నేరం అనో, ఒప్పందం అనో, అమ్మకం అనో ఇవ్వవచ్చు.

ఒక నేరంతోగానీ, ఒప్పందంతోగానీ సంబంధమున్నదేదయినా, సంబంధం బాహాటంగా గోచరిస్తూ ఉంటే, అంటే స్పష్టమవుతూ, దగ్గరి సంబంధమున్నదిగా ఉంటే అదే ఆ వ్యవహారంలో భాగమవుతుంది. ముఖ్యమైనదిగా కూడా ఉంటుంది.

వ్యవహారంలో ఏముంటాయి?

వ్యవహారంలో భాగంగా అమలుపరచిన చర్యలు, వ్యవహారం నడుస్తున్నప్పుడు చేసిన ప్రతిపాదనలు ఉంటాయి.

<u>ఉదా-</u>

మానభంగం చేయబడినప్పుడు ఓ స్త్రీ చేసే ఆక్రందనలు. ఒక ప్రకటన అదే వ్యవహారంలో భాగం కావాలంటే అది చర్యతోపాటుగా ఉండాలి.

ఒకటే వ్యవహారం అంటే ఏమిటి?

1. ఒకటే అంటే ఒకేలాగా ఉన్నదనికాదు. ఒకే మాదిరిగా ఉన్న వరుస వ్యవహారాల సాక్ష్యం అసందర్భమతుంది.

2. ఒకటే వ్యవహారమంటే ఒకేచోట, ఒకే సమయంలో జరిగిన వ్యవహారమని కాదు. సమయం, స్థలం ఏకకాలికంగా ఉండటానికీ దానికీ ఏమి సంబంధం లేదు.

<u>ఉదా-</u>

జనవరిలో ఒకచోట దోపిడీ జరగవచ్చు. పోయిన వస్తువులు ఫిబ్రవరిలో మరొకచోట గ్రహీతకు అప్పగించబడవచ్చు. అవి మార్చిలో మరొకచోట ఎక్కడో అమ్మబడవచ్చు. ఇదంతా ఒకే వ్యవహారంలో భాగమే అవుతుంది.

3. ఒకే వ్యవహారం అంటే ఒక సంబంధం ఉన్న వ్యవహారం - ఒకే దానిలోని భాగాలు.

కేస్‌లా కాకిల్స్ PP. 66-88

53 కలకత్తా 372

సూత్రం. విషయాలను స్పష్టం చేస్తుంది. కనుకనే అటువంటి సాక్ష్యం అనుమతించబడుతుంది. అది సందర్భాన్ని కలిగిస్తుంది.

2. ఒక వివాదాంశానికి లేదా, ఒక సంబంధిత అంశానికి సందర్భాన్నిగానీ, కారణాన్నిగానీ, ప్రభావాన్నిగానీ, అవకాశాన్నిగానీ తెలియజేసే ఘటనకు రుజావు అనుమతించబడుతుంది.

1. ఒక వ్యక్తిమీద దొంగతనం చేసినట్లుగా నేరారోపణ జరిగింది. అతని దగ్గర డబ్బుదొరకకపోతే అతను దొంగతనం చేసి ఉండకపోవటానికి అవకాశం ఉంది. ప్రతి కారణానికీ ఒక ఫలితం ఉంటుంది. ఫలితం లేకపోతే కారణముండదు.

2. ఒక వ్యక్తి దౌర్జన్యం చేసినట్లుగా ఆరోపించబడ్డాడు. దానికి తగిన సందర్భం, కారణం ఉందని చెప్పటానికి తగాదా పడినట్లుగా రుజావు చెయ్యవచ్చు.

3. ఒక వ్యక్తి భార్యపై విషప్రయోగం చేసినట్లుగా నిందించబడ్డాడు. అతనికి ఆ పనిచేయటానికి ఎటువంటి అవకాశమూ లేదని చెప్పటానికి నర్సు ఎప్పుడూ అక్కడే ఉన్నట్లుగా రుజావు చెయ్యొచ్చు.

4. బిని హత్య చేసినట్లుగా ఎపై అభియోగం ఉంది. దానికి తగిన కారణమున్నదని చూపించటానికి ఎకి సితో పెళ్ళయినట్లు బికి తెలుసనీ, బి ఎను లంచం డబ్బు అడిగాడనీ రుజావు చెయ్యవచ్చు.

8. 3. ఏదైనా వివాదాంశానికిగానీ, సంబంధిత అంశానికిగానీ ఉద్దేశాన్నీ, సన్నాహాన్ని తెలిపే అంశాలకు రుజావును అనుమతించటం జరుగుతుంది.

ఉద్దేశం ఉదా (a) (b) ఉద్దేశం లేకుండా హేతుబద్ధంగా ఆలోచించే ఏ వ్యక్తయినా ఏ చర్యకూ పాల్పడడు.

సన్నాహం. ఉదా (c) (d). సన్నాహం లేకుండా ఏ పనయినా చేయలేం.

1. కేస్ లా 61 కాలే. 54 - ఉద్దేశం - సంకల్పం - సన్నాహం - ప్రయత్నం - చర్య.

2. ఆర్ Vs. పామర్ - కాకల్‌పి వంటవాడిని చంపాడు.

ధనసంబంధమైన వేధింపు, అతను విషం కొనటం, మరణ విచారణను తప్పుకోటానికి ప్రయత్నం చేయటం.

3. ఆర్ Vs. లిల్లీమన్ కాకల్ P. (1896) 2 QB 167

4. ఒక ఘటన ఒక దావాకు సంబంధించిన కక్షిదారు ప్రవర్తనను తెలిపేదిగానీ, దావాకు సంబంధించినదై ఉన్నప్పుడుగానీ, లేదా దావాలోని ఏదైనా వివాదాంశానికి గానీ, సంబంధిత అంశానికిగానీ నిర్దేశమిస్తున్నప్పుడుగానీ ఆ అంశానికి రుజువు అనుమతించబడుతుంది. అదేవిధంగా ఒక అంశం ఒక నిందితుడి ప్రవర్తనను తెలియపరుస్తున్నట్లయితే, ఆ ప్రవర్తన ఒక వివాదాంశాన్నిగానీ, సంబంధిత అంశాన్ని గానీ ప్రభావితం చేయటం లేదా ప్రభావితం చేయబడటం జరుగుతున్నట్లయితే అటువంటి అంశానికి కూడా. రుజువును అనుమతించటం జరుగుతుంది.

## 1. వ్యక్తుల సాధారణ ప్రవర్తన

ఉదా- (d) వీలునామా రాయటం. వీలునామా రాయటానికి కొద్దిరోజుల ముందు, మరణించిన వ్యక్తి కొంత విచారించి అవసరమైన పత్రాలను సిద్ధం చేశాడు.

## నిందితుడి ప్రవర్తన:

ఉదా- (e) సాక్ష్యులను తప్పుడు సాక్ష్యం ఇవ్వటానికి ప్రేరేపించటం.

ఉదా -(h) పారిపోవటం

ఉదా -(h) విషయాన్ని దాచటం

## వివరణ-

1. ప్రకటన ప్రవర్తనలో మినహాయించబడుతుంది. కానీ ప్రకటన ప్రవర్తనతో పాటుగా ఉండి ప్రవర్తనను వివరించేదిగా ఉన్న సందర్భాలలో మాత్రం అది ప్రవర్తనలో భాగంగా ఉంటుంది.

2. ప్రవర్తన సంబంధించినదైనప్పుడు

ఒక ప్రకటన ప్రవర్తనను ప్రభావితం చేసేదిగా ఉండి ఆ వ్యక్తి సముఖంలో చేయబడినప్పుడు అది సంబంధించినదవుతుంది.

ఉదా-

(g) ఎ బికి 10,000ల రూపాయలు అప్పుగా ఉన్నాడా లేదా అనేది సమస్య. ఎ సిని డబ్బు అప్పు ఇవ్వమని అడిగాడు. డి ఎ సమక్షంలోనే ''ఎని నమ్మవద్దు అతను పదివేలు అప్పు ఉన్నాడు'' అన్నాడు. ఎ ఏం సమాధానం చెప్పకుండానే వెళ్ళిపోయాడు. ఇది సంబంధమున్న ప్రకటన.

కేసులా

Imp. 34 om. & R 1087

Imp. 7 All. 385 F.E

కాకిల్స్ - P.75 (బ్రౌట్, అతని శత్రువు బి టాథమ్‌ల మధ్య వివాదం.

5. ఒక వివాదాంశాన్ని గానీ, సంబంధిత అంశాన్ని గానీ తెలియజేసే లేదా వివరించే ఘటనలకు రుజావు అనుమతించబడుతుంది.

ఉదాహరణ-

**(d)** నేరం మోపబడటం వలన నిందితుడు పరారీ అయినట్లుగా ఆరోపించబడింది. అతడు అతి ముఖ్యమైన పనిమీద వెళ్ళినట్లుగా తెలుపుతూ సాక్ష్యం ఇవ్వవచ్చు.

**(f)** పోలీసు అధికారిపై దౌర్జన్యం చేసినందుకుగాను ఎ పై విచారణ జరిగింది. ఎ గుంపుకు ముందుండి గుంపును నడిపించినట్లుగా రుజావు చేయబడింది. జరిగిన విషయానికి సాక్ష్యంగా గుంపులోని ప్రజల అరుపులను, ఏడుపులను తెలియజేయవచ్చు.

**(b)** పరువునష్టం చేసినందుకు వేసిన దావా - అవినీతికరమైన చర్యకు పాల్పడినట్లు ఆరోపణ. నిందాలేఖనం ప్రచురితమయినప్పుడు కక్షిదారుల పరిస్థితినీ, వారి మధ్యగల సంబంధంనూ తెలుపుతూ సాక్ష్యం ఇవ్వవచ్చు. ఇది వివాదాంశాలను తెలియపరుస్తుంది. ఈ విభాగం క్రింద సాక్ష్యాన్ని ఈ దిగువ పేర్కొన్న సందర్భాలలో కూడా ఇవ్వవచ్చు.

(1) ఒక వ్యక్తినిగానీ, ఒక వస్తువునుగానీ తెలుసుకోవటం సమస్య అయినప్పుడు ఆ వ్యక్తికిగానీ, వస్తువుకు గానీ సంబంధించిన గుర్తుకు సాక్ష్యం ఇవ్వవచ్చు.

(2) ఒక వివాదాంశం గానీ, సంబంధిత అంశం కానీ జరిగిన సమయానికి గానీ స్థలానికి గానీ సంబంధించిన సాక్ష్యం ఇవ్వవచ్చు.

(3) వివాదాంశానికి గానీ, సంబంధిత అంశానికి గానీ సంబంధించిన కక్షిదారుల మధ్యగల సంబంధానికి సాక్ష్యం ఇవ్వవచ్చు.

4. ఏరకమైన మానసిక స్థితిని తెలియజేసే అంశానికయినా రుజావు అనుమతించబడుతుంది.

1. ఈ సెక్షన్ క్రింద ఉద్దేశాన్ని, విజ్ఞానాన్ని, సద్భావాన్ని, అశ్రద్ధను, సుహృద్భావాన్ని, దురభిప్రాయాన్ని తెలియజేసే అంశాలను రుజావు చేయవచ్చు.

విజ్ఞానం, ఉదా (a): సద్భావం ఉదా (f): ఉద్దేశం. ఉదా (e) (j): దురభిప్రాయం. ఉదా (k)

2. ఈ సెక్షన్ ప్రకారం, పూర్వ శిక్షకు సంబంధించి సాక్ష్యం ఇవ్వవచ్చు.

ఉదా (b)

3. ఈ సెక్షన్ ప్రయోగానికి పరిమితులు

(1) సాక్ష్యం ఇవ్వబడిన మానసిక స్థితి ఒక సాధారణ మానసిక స్థితి కానీ, ఒక సాధారణ మనోవైఖరి కానీ కాదు. అది పరిశీలనలోనున్న విషయానికి సంబంధించినది మానసిక స్థితి.

(2) నేరానికి పూర్వ పరిశీలనా సాక్ష్యం పరిశీలనలోవున్న విషయానికి సంబంధించి అతని మానసిక పరిస్థితి తెలియచెప్పటానికే గానీ మరెందుకూ కాదు.

15. ఒక చర్య వరుసగా చేసిన సారూప్య చర్యలలో భాగమని తెలియజేయటానికి రుజువును అనుమతించవచ్చు. ఇది ఆ చర్య అప్రయత్నంగా చేసింది కాదనీ ఉద్దేశపూర్వకంగా చేసినదేనని తెలియజేస్తుంది.

ఉదాహరణ - (a) (b)

1. సాధారణంగా అదేవిధంగా ఉన్న చర్యల సాక్ష్యం ఉపయోగపడదు. దీనికి కారణం ఒక వ్యక్తి ఒక పని చేసి ఉంటే దానినిబట్టి విచారణలో ఉన్న పని కూడా అతను చేసిందేనని చెప్పలేం.

16. ఒక చర్య జరిగిందా, జరగలేదా అనేది ప్రశ్న అయినప్పుడు వ్యాపార సరళి ఉనికిని తెలుపుతున్న అంశాలకు రుజువు అనుమతించబడుతుంది.

ఉదా:- (a) (b)

ఇది సంభావ్యతను తెలుపుతుంది.

ఉత్తరం ఎ కు చేరిందా లేదా అనేది ప్రశ్న. ఉత్తరం పోస్టు చేయబడింది. అది అడ్రసు సరిగా లేని ఉత్తరంగా తిరిగి రాలేదని రుజువు చేయవచ్చు.

13. వ్యవహారానికి సాక్ష్యం. హక్కులు, ఆచారాలకు నిదర్శనంగా రుజువు.

1. హక్కు అనే పదానికి గల పరిధి

(A) మూడురకాల హక్కులుంటాయి.

వ్యక్తిగతమయినవి - ఉదా: వర్గానికి వ్యక్తిగత హక్కు సాధారణమయినవి - చెప్పుకోదగిన ఏ వర్గానికి చెందిన ప్రజలకయినా సాధారణంగా ఉన్న హక్కు.

ఉదా: ఒక గ్రామ ప్రజలకు ఆ గ్రామంలోని ఒక ప్రత్యేక బావి నుంచి నీరు తీసుకొనే హక్కు.

<u>సెక్షన్ 48 ఉదా.</u>

జనసామాన్యమయినవి - ఇది చట్టంలో నిర్వచించబడలేదు. పైన పేర్కొన్న సాధారణ హక్కువలే ఇది కూడా సామాన్యమయినది. అయితే ప్రతి సాధారణ హక్కు జనసామాన్య హక్కు కాదు ( ఇంగ్లీషు న్యాయశాస్త్రంలో ఈ విభజన చేయబడింది)

ఈ సెక్షన్ అన్నిరకాల హక్కులకూ వర్తిస్తుంది. అవి వ్యక్తిగతమయినవి కావచ్చు, సాధారణమయినవి కావచ్చు లేదా జనసామాన్య హక్కులు కావచ్చు.

**(B)** ఈ సెక్షన్ అన్నిరకాల హక్కులకూ వర్తిస్తుందా? ప్రతి అనే పదం లేకపోవటం వలన ఈ ప్రశ్న ఉత్పన్నమవుతుంది. ఈ ప్రశ్నకు సంబంధించి ఒకప్పుడు విరుద్ధ నిర్ణయాలు తీసుకొనబడినాయి. ఒక అభిప్రాయం ప్రకారం అందులో అన్ని హక్కులూ ఇమిడి ఉన్నాయి. రెండవ అభిప్రాయం ప్రకారం అప్రత్యక్ష హక్కులు మాత్రమే ఇందులో ఇమిడి ఉన్నాయి.

నేటి అభిప్రాయం ప్రకారం అది అన్నిరకాల హక్కులకు వర్తిస్తుంది.

ఆచారం అనే పదానికి గల పరిధి

ఆచారం అనేది ప్రాచీన ఆచారానికే పరిమితంకాదు. అది రీతిరివాజులకు కూడా వర్తిస్తుంది. రివాజు ఒక ప్రాంతానికి చెందిన ప్రజల ప్రస్తుత అలవాట్లను తెలుపుతుంది. ఆ అలవాటు క్రొత్తగా అలవడినది కావచ్చు లేదా ఎంతో కాలం నుంచి ఉన్నది కావచ్చు. అది సాధారణంగా అందరూ చేసేదే అయితే రివాజు అవుతుంది.

**B. ఆచారం అనేది**

**(i)** వ్యక్తిగత ఆచారం - కుటుంబ సంప్రదాయం

**(ii)** సామాన్య ఆచారం - ఒక వర్గానికి చెందిన ప్రజలందరికీ సామాన్యంగా ఉండే ఆచారం.

**అది**

**(a)** ప్రాంతీయమైనది

(b) కులానికీ లేదా వర్గానికి చెందింది

(c) లేదా వ్యాపార రీతి రివాజులకు చెందింది కావచ్చు.

(iii) ప్రజా ఆచారం - నిర్వచించబడలేదు.

(c) ఈ సెక్షన్ అన్ని రీతి రివాజులకు వర్తిస్తుంది.

3. ఇవ్వవలసిన సాక్ష్యం ఏదైనా వ్యవహారానికి చెందింది కానీ హక్కుగానీ, ఆచారం కానీ వాడుకలోకి వచ్చిన సందర్భాలకు చెందింది కానీ కావచ్చు.

A. వ్యవహారానికీ, ఉదాహరణకూ అర్థం

(1) వ్యవహారం - రెండు కానీ అంతకంటే ఎక్కువకానీ వ్యక్తుల మధ్య నడిచిన వ్యాపారం లేదా వ్యవహారం.

(2) ఉదాహరణ - తలెత్తిన కేసు - వ్యక్తి ఒక ప్రత్యేక రీతిలో వ్యవహరించటం.

B. కార్య వ్యవహారాలకు సంబంధించిన కక్షిదారుల మధ్యగల కేసులలో పూర్వపు లావాదేవీలకు మాత్రమే రుజువు పరిమితం చేయబడదు. 'ఏదైనా' అనే మాట వ్యవహారమనేది ఒక వ్యాజ్యానికి చెందిన కక్షిదారుల మధ్య మాత్రమే కాదనే విషయాన్ని తెలుపుతుంది.

వ్యవహారం ఇద్దరు అపరిచితుల మధ్యగానీ, లేదా వ్యాజ్యానికి కక్షిదారు అయిన వ్యక్తికీ, అపరిచితుడికీ మధ్య కూడా ఉండవచ్చు.

C. వ్యవహారమనే మాట కొన్ని చిక్కులను తెచ్చిపెట్టింది. అది తీర్పు డిక్రీకి వర్తిస్తుందా, లేదా అనీ, ఒకే కక్షిదారుల మధ్య కాని వ్యాజ్యానికి వర్తిస్తుందా లేదా అనీ సందేహాలు వెలువడ్డాయి.

ఈ ప్రశ్న గజ్జులాల్, ఫత్తేలాల్ మధ్యగల వివాదంలో విచారించబడింది. 6 కలకత్తా 171

III. వివాదాంశంతోగానీ, సంబంధిత అంశంతోగానీ సంగతంగా ఉన్న అంశాలుగానీ, వివాదాంశంగా గానీ, సంబంధిత అంశంగాగానీ పరిగణించబడే అంశాలుగానీ అత్యధిక సంభావ్యత కలిగియుంటాయి.

1. ఈ విభాగం చాలా విస్తృతంగానూ, సమగ్రంగానూ పేర్కొనబడింది. దీని ప్రకారం మరొక అంశంతో హేతుబద్ధంగా కలపటానికి వీలుండి తద్వారా వివాదాంశంపై కానీ, సంబంధిత అంశంపైగానీ ప్రభావం చూపగలిగే ఏ అంశమైనా అనుమతియోగ్యమవుతుంది.

2. శాసనసభ ప్రకారం అటువంటి సమగ్రభావం ఉద్దేశింపబడలేదనే విషయం 'అత్యధిక' అనే మాట ద్వారా స్పష్టమవుతుంది. అత్యధిక సంభావ్యత అనే మాటలు వివాదాంశాలకూ, రుజువు చేయాల్సిన అంశానికి మధ్యనున్న సంబంధం చాలా దగ్గరగా అత్యధిక సంభావ్యతను కలుగజేసేదిగా ఉండాలని సూచిస్తాయి. 6 కలకత్తా 665 (662)

3. ఈ సెక్షన్ క్రింద ఒక సహాయక విషయాన్ని అనుమతియోగ్యం చేయాలంటే అది **(a)** తగిన నిర్ణాయక సాక్ష్యం ద్వారా నిరూపితం కాబడాలి.

**(b)** నిరూపితమైనప్పుడు వివాదాస్పద విషయానికి తగిన పురోభావననూ లేదా అనుమతినీ పొందుపరచేదిగా ఉండాలి. **6 Bom. L.R. 983**

4. ఈ సెక్షన్‌కు చెందిన నిబంధనలు విస్తృతంగా ఉన్నప్పటికీ వాటిని చట్టంలోని ఇతర సెక్షన్‌లతో అన్వయించి గ్రహించవలసి ఉంటుంది.

ఉదా-

1. రామానుజన్, కింగ్ ఎంపరర్‌ల మధ్య వివాదం. **58 Mad. 523 F.B.**

సీతమ్మాళ్‌ను హత్య చేసినట్లుగా రామానుజన్‌పై నేరారోపణ చేయబడింది. దీనికి సంబంధించిన విషయాలు మరోచోట ఇవ్వబడ్డాయి.

ఈ హత్యకు ప్రత్యక్షసాక్షులెవరూ లేరు. ప్రాసిక్యూషన్ వారు ఈ క్రింది అంశాలకు సంబంధించిన సాక్ష్యాన్ని సమర్పించారు.

1. సీతమ్మాళ్ భర్తను వదిలిపెట్టాక కొన్ని నగలు, కొంత వెండి సామాను తీసుకుని నిందితుడి దగ్గరకు వచ్చింది.

2. సీతమ్మాళ్, నిందితుడు పలు ప్రాంతాలలో కలిసి నివసించారు.

3. వారిద్దరూ చివరిసారి జనవరి 11న 24 పెడు నాయకన్ వీధిలో కన్పించారు.

4. 12వ తారీఖు ఉదయం పాలావిడ వెళ్ళేటప్పటికి తలుపు తాళం పెట్టి ఉంది.

5. 13వ తారీఖునగానీ, ఒకరోజు అటో ఇటోగానీ నిందితుడు సీతమ్మాళ్‌కు చెందిన కొన్ని ఆభరణాలను తాకట్టుపెట్టాడు.

6. అతడు పరుపు కొన్నాడు. అందులోనే తర్వాత శవాన్ని చుట్టిపెట్టాడు.

2. అప్పు చెల్లించినట్టుగా రుజువు చేయమనే అభ్యర్థన చాలాకాలం వరకు చేయబడలేదు.

3. మనోవర్తి కేసులో బిడ్డకు ప్రతివాదితో ఉన్న పోలికలు అతను తండ్రేనని రుజువు చేయడానికి ఉపయోగపడతాయి.

11 (2) వివాదాంశాలతో గానీ, సంబంధిత అంశాలతో గానీ అసంగతంగా ఉన్న విషయాలు లేదా అటువంటి వాటిని అత్యధిక సంభావ్యత కల వాటిగా చేసే విషయాలు.

ఉదాహరణలు

1. డబ్బు అప్పు పెట్టిన కేసుకు సంబంధించి అప్పు పెట్టినట్టుగా చెప్పే వ్యక్తి బీదరికం అవసరమైన విషయమవుతుంది. బీదరికంలో వున్న వ్యక్తి అప్పు ఇవ్వటం అనేది అసంగతం కనుక ఇది కేసుకు సంబంధించిన ముఖ్య విషయమవుతుంది.

2. సాక్షిగానీ, నిందితుడు గానీ వేరెక్కడో ఉన్నాడనే విషయం కేసుకు సంబంధించినదవుతుంది. ఇది నేరం జరిగిన స్థలంలో వారున్నారనటానికి అసంగతంగా ఉంటుంది.

3. వేలిముద్ర ''ఎ''దేనా కాదా అనే విషయాన్ని నిర్ధారించవలసి వచ్చిన కేసు విషయంలో అదే వ్యక్తి మరొక పత్రంపై వేసిన వేలిముద్రను సాక్ష్యంగా ప్రవేశపెట్టవచ్చు. ఒకవేళ రెండు వేలిముద్రలు భిన్నంగా ఉంటే ఆ వేలిముద్ర అతనిదేననే వాదాన్ని కొట్టివేయవచ్చు.

## 55-55 స్వభావానికి సంబంధించిన అంశాలకు రుజువు

1. స్వభావానికి సంబంధించిన సాక్ష్యానికి గల నిబంధనలు ఈ క్రింది రెండు విధాలుగా ఉంటాయి.

I. సాక్షుల స్వభావానికి సంబంధించిన నియమాలు.

II. కక్షిదారుల స్వభావానికి సంబంధించిన నియమాలు.

## సాక్షుల స్వభావం

1. సాక్షి స్వభావం అతని పరిపతిని తెలియపరుస్తుంది కనుక చాలా ముఖ్యం. సాక్షినమ్మదగినవాడా లేదా అనేది చాలా ముఖ్యం. కోర్టు ఏ కేసు విషయంలోనయినా సాక్షుల కథనం ఆధారంగానే తుది

నిర్ణయం చేస్తుంది. కనుక ఆ సాక్షులు నమకస్తులా కాదా అనేది తెలుసుకోవటం చాలా అవసరం ఈ విషయం నిర్ధారించుకోటానికి ఇతర ప్రశ్నలతో పాటు సాక్షి స్వభావాన్ని తెలియజేసే ప్రశ్నలు కూడా అనుమతించబడతాయి. సెక్షన్లు 145-153.

## కక్షిదారు స్వభావం

1. కక్షిదారు స్వభావానికి సంబంధించి ఈ క్రింది వాటి మధ్య భేదాలను గుర్తించవలసి ఉంటుంది.

కక్షిదారు స్వభావం వివాదంగా ఉన్న కేసులనూ, వివాదంగా లేని కేసులనూ వేరుపరచాలి.

కక్షిదారు స్వభావం వివాదంగా ఉన్న సందర్భాలలో స్వభావానికి సంబంధించిన అంశాలకు రుజువు అనుమతించబడుతుంది. ఈ విషయంలో ప్రొసీడింగులు పౌర సంబంధమైనవా, నేర సంబంధమైనవా అనేది నిర్వివాదం. సెక్షన్ 52

ఉదా- ఒక పౌర సంబంధ దావాలో వివాదం

(i) దాది ఉద్యోగంలో ఉన్నప్పుడు మంచి స్వభావాన్ని, స్త్రీ పరమైన ప్రవర్తననూ, సమర్థతనూ కలిగి ఉన్నదా లేదా అనేది వివాదం అయినప్పుడు సాక్ష్యులకు ఆమె సమర్థతను కానీ, సత్ప్రవర్తనను గానీ, స్వభావాన్ని గానీ తిరస్కరించటానికిగానీ, నొక్కి చెప్పటానికి గానీ అనుమతి ఇవ్వాలి.

(ii) క్రిమినల్ ప్రాసిక్యూషన్‌లో చిన్న చిన్న నేరాలు, మోసాలు చేయటానికి కుట్ర చేసినప్పుడు సాక్షులకు నిందితుడి సహజ స్వభావాన్ని నొక్కి చెప్పటానికి గానీ, తిరస్కరించటానికి గానీ అనుమతి లభిస్తుంది.

ఆ కక్షిదారు సహజ స్వభావం వివాదం కాని సందర్భాలలో అతని స్వభావానికి సంబంధించిన రుజువు చట్ట ప్రకారం అనుమతించబడదు. సెక్షన్ 52.

ఈ నియమానికి రెండు మినహాయింపులున్నాయి. వాటి ప్రకారం స్వభావాన్ని తెలియబరిచే సాక్ష్యం స్వభావం వివాదం కాని సందర్భాలలో కూడా అనుమతించబడుతుంది.

(i) పౌర సంబంధ కార్యకలాపాలలో నష్టపరిహారపు చెల్లింపును ప్రభావితం చేసే విధంగా ఉన్నప్పుడు స్వభావానికి సంబంధించిన అంశాలకు రుజువు అనుమతించబడుతుంది. సెక్షన్ 55.

(ii) నేర సంబంధ కేసులలో

(i) నిందితుడు సత్ ప్రవర్తన కలవాడని తెలిపే అంశాలకు ఎప్పుడూ రుజువు అనుమతించబడుతుంది. సెక్షన్ 53

(ii) నిందితుడు చెడు ప్రవర్తన కలవాడని తెలిపే అంశాలకు రుజువు ఈ క్రింది సందర్భంలో తప్ప అనుమతించబడదు:

నిందితుడు తాను సత్ ప్రవర్తన కలవాడినని తెలుపుతూ సాక్ష్యం ఇచ్చినపుడు

పౌర సంబంధ చర్యలకూ, నేర సంబంధ చర్యలకూ మధ్య ఈవిధమైన విభజన చేయటానికి గల కారణాలు స్పష్టంగానే ఉన్నాయి.

(1) చెడు ప్రవర్తన నిందితుడిపై ప్రతికూల ప్రభావాన్ని కలుగజేస్తుంది. అది నిందితునికి వ్యతిరేకంగా కేసును రుజువు చెయ్యదు. నిందితుడు తన సత్‌ప్రవర్తనకు సాక్ష్యం ఇచ్చి తద్వారా ప్రవర్తనను వివాదం చేసిన సందర్భాలలో తప్ప ప్రవర్తన కేసుకు సంబంధం లేని విషయమవుతుంది. పై సందర్భంలో చెడు ప్రవర్తనకు కూడా సాక్ష్యం ఇవ్వటానికి వీలుంటుంది.

(2) సత్‌ప్రవర్తన నిందితుడు నిర్దోషి అయినప్పుడు అతని నిర్దోషిత్వాన్ని బలపరుస్తుంది. కాబట్టే మానవతా దృక్పథంతో దాన్ని అనుమతించటం జరుగుతుంది.

గుర్తింపదగినవి రెండు విషయాలున్నాయి.

1. స్వభావం అనే మాటలో ఏమేమి ఇమిడి ఉంటాయి? సెక్షన్ 55.

స్వభావం అనే మాట పేరు ప్రఖ్యాతుల్నీ, మనో వైఖరినీ తెలియజేస్తుంది. ఇది ఇంగ్లీషు న్యాయశాస్త్రానికి భిన్నంగా ఉంది. ఇంగ్లీషు న్యాయశాస్త్ర ప్రకారం స్వభావం అనేది పలుకుబడిని మాత్రమే తెలుపుతుంది.

పేరు ప్రఖ్యాతులకీ, మనో వైఖరికీ భేదం ఉంది. పలుకుబడి అంటే ఇతరులు ఒక వ్యక్తి గురించి అనుకునే మాటలు. అందువలన ఇది ప్రజా అభిప్రాయంతో కూడి ఉంటుంది. ఇది ఒక వ్యక్తి ప్రజాభిప్రాయంలో పొందిన సామాన్య పరపతి.

మనోవైఖరి ప్రేరణలనూ, ఉత్తేజాలను తెలియజేస్తుంది. ఇది శాశ్వతమైనదీ, స్థిరమైనదీ కూడా. ఇది మనసు స్వరూప స్వభావాలకు సంబంధించినది.

## 2. స్వభావాన్ని నిరూపించటం ఎలా?

ఒక వ్యక్తి స్వభావాన్ని నిరూపించటానికి రెండు మార్గాలున్నాయి. ఒకటి అతడి పేరు ప్రఖ్యాతుల్నీ, సాధారణ మనోవైఖరిని సాక్ష్యంగా ఇవ్వటం. రెండవది అతని చర్యలను కొన్నిటిని అతని స్వభావానికి సాక్ష్యాలుగా ఇవ్వటం. ఈ చర్యలను బట్టి ఆ వ్యక్తి కీర్తినీ మనోవైఖరినీ అర్థం చేసుకోవచ్చు.

**55 - వివరణ**

సాక్ష్య చట్టం సాధారణ పేరు ప్రతిష్ఠలకూ, మనో వైఖరికీ సంబంధించిన సాక్ష్యాన్ని మాత్రమే అనుమతిస్తుంది.

**55 - వివరణ**

ఈ నియమానికి ఒకే ఒక మినహాయింపు ఉంది. అది చెడు స్వభావానికి సాక్ష్యంగా పూర్వపు నేరాలకు సంబందించిన సాక్ష్యాన్ని ప్రవేశపెట్టవచ్చు.

**సెక్షన్లు 45-51**

**అభిప్రాయాలకు రుజువు**

1. కేసుకు సంబంధించిన వాస్తవాలను కోర్టుకు తెలియజేయటానికి సాక్షులు ఉపయోగపడతారు. కోర్టు తన అభిప్రాయాలను తానే ఏర్పరచుకోవాల్సి ఉంటుంది.

2. సాక్షి అనుకున్నది కానీ, నమ్మినది కానీ తెలియజేయటం ఈ క్రింది రెండు కారణాల వల్ల ఆమోదయోగ్యంకాదు: (1) అది ఏమీ తెలియజేయ లేదు, (2) అది న్యాయాధిపతి విధి నిర్వహణలో జోక్యం కలుగజేసుకుంటుంది.

3. నియమం ప్రకారం సాక్షి వాస్తవాలను చెప్పాలి కానీ, తన సొంత అభిప్రాయాలను కాదు. ఈ నియమాన్ని ఖచ్చితంగా అమలు జరపాలంటే రెండు చిక్కులెదురవుతాయి.

(i) మూడవ వ్యక్తి (వాది కానీ, ప్రతివాది కానీ, ఖైదీ కానీ కాకుండా వేరొక వ్యక్తి) కేసుకు సంబంధించి ఏం అనుకుంటాడో, నమ్ముతాడో అనేది అవసరం. ఒకవేళ అటువంటి మూడవ వ్యక్తి సాక్షి అయితే వాస్తవాలను మాత్రమే ప్రకటించాలి కానీ, అతని సొంత అభిప్రాయాలను ప్రకటించకూడదు. కానీ ప్రధాన చర్యకు పాల్పడిన సమయంలో కక్షిదారు

ఏం అనుకున్నాడో, నమ్మాడో అనేది పౌర సంబంధ కేసులలోను, నేర సంబంధ కేసులలో కూడా వివాదగ్రస్త విషయమవుతుంది.

ఉదా- కార్వర్, బోహిన్‌ల మధ్య వివాదం కాకిల్

ఒక భీమా పథకం వాస్తవాలను హామీదారులకు తెలియబరచకుండా దాచిపెట్టటం వలన రద్దు చేయబడిందా లేదా అనేది సమస్య. బ్రోకరు వాస్తవాల ఆవశ్యకతకు సంబంధించి సాక్ష్యం ఇచ్చాడు. అతన్ని ఈ విషయాలన్నీ తెలిస్తే ఒప్పందం కుదుర్చుకునేవాడా లేదా అని అడగటం జరిగింది. అతను లేదని సమాధానమిచ్చాడు. ఆ సమాధానం అతని అభిప్రాయం మాత్రమే కనుక దాన్ని అనుమతించలేదు. అయితే అదే ప్రశ్న కక్షిదారునడిగినప్పుడు మాత్రం అతని అభిప్రాయం ఆమోదయోగ్యమవుతుంది.

(2) ఈ నియమాన్ని నిష్కర్షగా అమలుపరచటంలో కొన్ని సమస్యలు తప్పనిసరిగా ఉత్పన్నమవుతాయి. కోర్టు ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకోవాల్సిన అవసరం వచ్చినప్పుడు అందుకు తగిన సమర్థతను కోర్టు కలిగి ఉండకపోవచ్చు. కొన్ని కేసులకు సంబంధించి సరియైన అభిప్రాయాన్ని ఏర్పరచుకోవాలంటే తగిన ప్రత్యేక అనుభవమూ, ప్రత్యేక శిక్షణ అవసరమవుతుంది. అటువంటి సందర్భాలలో ఈ విషయంలో ప్రత్యేక అనుభవం, శిక్షణ కలిగినవారి అభిప్రాయాన్ని సరియైన నిర్ణయాన్ని తీసుకోవటానికి వీలుగా ట్రిబ్యునల్ ముందుంచవలసి ఉంటుంది.

(3) కొన్ని కేసులకు సంబంధించి ఏ సాక్షికయినా సానుకూలంగా మాట్లాడటం కష్టమవుతుంది. ఒకవేళ మాట్లాడటం జరిగితే ఆ సాక్షి తన అభిప్రాయానికిగానీ, నమ్మకానికి గాని సంబంధించి అది కేవలం అతని అభిప్రాయం మాత్రమేనని వాంఙ్మూలం ఇచ్చినప్పుడు కోర్టు దాన్ని విలువ ఉన్నా లేకున్న పరిగణించవలసి వస్తుంది.

ముందు పేర్కొన్న కేసులు కళలకు, నైపుణ్యానికీ, సైన్స్‌కూ సంబంధించినవి. వీటిలో నిపుణుల అభిప్రాయం తప్పనిసరి అవుతుంది. తర్వాత పేర్కొన్న కేసులు అభిప్రాయానికి సంబంధించినవి. ఈ విషయంలో నిపుణులు కాని వారి వ్యక్తిగత అభిప్రాయాన్ని కూడా పరిగణించవచ్చు.

(5) సాక్ష్య చట్టం సాక్షి వ్యక్తిగత అభిప్రాయాన్ని అనుమతించకూడదు అనే సాధారణ సూత్రానికి ఈ క్రింది మినహాయింపులు చేస్తుంది.

## సెక్షన్ 45

(1) వృత్తిపరమైన లేదా వైజ్ఞానికపరమైన స్వభావం కలిగిన విషయాలకు సంబంధించి నిపుణుల లేదా శాస్త్రవేత్తల అభిప్రాయాలు ఆమోదయోగ్యమైన సాక్ష్యంగా పరిగణించబడతాయి.

ఉదాహరణ:

(i) విదేశీ చట్టానికి సంబంధించిన వివాదం

(ii) వైజ్ఞానిక వివాదం లేదా కళకు సంబంధించిన వివాదం (ఒక తుపాకీ పనితనాన్ని గురించి)

(iii) వేలిముద్రను గాని, చేతి వ్రాతనుగాని గుర్తించే విషయంలో తలెత్తిన వివాదం.

## సెక్షన్ 47

(2) ఒక పత్రం వ్రాసిన లేదా దానిపై సంతకం చేసిన వ్యక్తిని గుర్తించాలంటే ఆ వ్యక్తి చేతి వ్రాతతో పరిచయం ఉన్న మరొక వ్యక్తి అభిప్రాయం ముఖ్యమవుతుంది.

## సెక్షన్ 48

(3) ఒక సాధారణ రీతి రివాజు ఉన్నదా లేదా అనే విషయానికి సంబంధించి కోర్టు ఒక అభిప్రాయానికి రావాలంటే దాని ఉనికి తెలిసి ఉండటానికి అవకాశం ఉన్న వ్యక్తి అభిప్రాయం ముఖ్యమవుతుంది.

## సెక్షన్ 49

(4) కోర్టు ఈ క్రింది విషయాలకు సంబంధించి ఒక అభిప్రాయానికి రావాలంటే సమాచారం తెలుసుకోవటానికి ప్రత్యేక అవకాశం కలిగిన వ్యక్తుల అభిప్రాయాలు ముఖ్యమైన అంశాలవుతాయి.

(1) ఒక కుటుంబానికి గానీ, కొందరు వ్యక్తులకు గానీ చెందిన ఆచార వ్యవహారాలను తెలుసుకోవటానికి

(2) ఒకమతానికిగానీ, స్వచ్ఛందసంస్థకుగానీచెందినసంస్థాపననూ, పరిపాలననూ తెలుసుకోవలసి వచ్చినప్పుడు

(3) ఒక ప్రాంతంలో వాడబడే పదాలకూ లేదా ఒక వర్గానికి చెందిన ప్రజలు వాడే పదాలకు అర్థం చేసుకోవలసి వచ్చినప్పుడు.

## సెక్షన్ 50

(5) ఇద్దరు వ్యక్తుల మధ్య ఉన్న సంబంధం గురించి కోర్టు ఒక అభిప్రాయానికి రావాలంటే కక్షిదారుల ప్రవర్తననూ, విషయం తెలిసిన వ్యక్తుల అభిప్రాయాలనూ పరిగణించవలసి ఉంటుంది.

ఉదా- (ఎ) (బి)

నిబంధన

అటువంటి అభిప్రాయాలు భారతీయ విడాకుల చట్టం కింద గానీ, భారతీయ శిక్షాస్మృతిలో 494, 495, 497, 498 సెక్షన్ల కింద గానీ చేసిన అభియోగాలను గానీ రుజువు చేయటానికి ఉపయోగపడవు.

## నిరూపణకు అవసరమైన సాక్ష్య స్వభావం

చట్ట సారాంశం

I ఉత్తమ సాక్ష్య నియమం.

II ఉత్తమ సాక్ష్య నియమానికి ఆవశ్యకతలు.

(i) ఉత్తమ సాక్ష్య నియమానికి ఈ క్రిందివి అవసరం.

(a) సాక్ష్యం మౌఖికమయితే అది ప్రత్యక్షంగా ఉండాలి.

(b) మినహాయింపులు.

(ii) సాక్ష్యం లిఖితపూర్వకంగా ఉన్నట్లయితే ఉత్తమ సాక్ష్య నియమానికి ఈ క్రిందివి అవసరం.

(i) అది అసలు పత్రమై ఉండాలి.

(a) మినహాయింపులు.

(ii) అది ప్రత్యేకంగా ఉండాలి.

(a) మినహాయింపులు.

## ఉత్తమ సాక్ష్య నియమం:

1. కక్షిదారు ఏదైనా అంశాన్ని రుజువు చేయాలంటే ఆ కేసులో సాధ్యమయిన ఉత్తమ సాక్ష్యం ఇవ్వాలనేది నిర్వివాదగ్రస్తమైన ప్రతిపాదన.

2. ఈ నియమం నిజానికి సాక్ష్య చట్టం మొత్తానికి పునాదిగా ఉంటుంది.

(i) ఈ నియమం వలననే, సాక్ష్యం అనుమతికి పూర్వవర్తి షరతుగా ముఖ్య వాస్తవానికీ, సాక్ష్యాధార వాస్తవాలకూ మధ్య బహిరంగంగా కనబడే సంబంధం ఉండాలనేది చట్టం ఆపేక్షిస్తుంది.

(ii) ఈ నియమం వలననే, సాక్ష్యం ఆమోదయోగ్యంగా ఉండాలంటే తగిన దస్తావేజుల సహాయంతో ప్రవేశపెట్టబడాలని చట్టం ఆపేక్షిస్తుంది.

(iii) ఈ నియమం వలననే ఏదైనా సాక్ష్యం అనుమతించబడాలంటే ప్రాథమికమైనదిగా ఉండాలి కానీ, ఉత్పన్నమయినదిగా ఉండకూడదని చట్టం ఆపేక్షిస్తుంది.

3. ఒకప్పుడు ఉత్తమ సాక్ష్య నియమం తూ.చ. తప్పకుండా అమలుపరచబడేది. కానీ ప్రస్తుతం ఈ నియమం చాలావరకు సడలించబడింది. ఒకప్పుడు అనుమతికి ప్రతిపాదించబడిన అభ్యంతరాలన్నీ ఇప్పుడు సడలిపోయాయి.

4. కానీ ఈ నియమం ఇంకా అమలులోనే ఉంది. ఈ నియమం మౌఖిక సాక్ష్యానికీ, పత్ర సాక్ష్యానికీ సంబంధించిన సాక్ష్య చట్ట ఆపేక్షితాల ద్వారా ఉదహరించబడుతుంది.

## మౌఖిక సాక్ష్యం:

1. ఉత్తమ సాక్ష్య నియమం సాక్ష్యం మౌఖికమయితే ప్రత్యక్షంగా ఉండాలని ఆపేక్షిస్తుంది.

2. ఈ నియమం సాక్ష్య చట్టంలోని సెక్షన్ 60లో పొందుపరచబడింది.

3. ప్రత్యక్ష సాక్ష్యం అంటే ఏమిటి?

4. మౌఖిక సాక్ష్యం వినికిడి సాక్ష్యంగా ఉండకూడదనేదే ఈ ప్రశ్నకు సాధారణంగా వచ్చే సమాధానం. ఇది వినికిడి సాక్ష్య పరిశీలనకు దారి తీస్తుంది.

వినికిడి సాక్ష్యాన్ని మినహాయించే నియమం ఈ క్రింది మూడు రకాల అపవాదులకు గురి అవుతుంది.

(i) అనుమతులు, ఒప్పుదలలు: కక్షిదారు సమక్షంలో చేసిన ప్రకటనలు.

(ii) మరణించిన వ్యక్తులు చేసిన ప్రకటనలు.

(iii) బహిరంగ పత్రంలో చేసిన ప్రకటనలు.

## వినికిడి సాక్ష్యం (Hear say) అంటే ఏమిటి?

వినికిడి సాక్ష్యం పలు రకాలుగా నిర్వచించబడింది.

(i) సాక్షిమీద ఉన్న నమ్మకం ఆధారంగా మాత్రమే విలువ పొందిన సాక్ష్యం కాక మరొక వ్యక్తి నిజాయితీ మీద, సమర్థత మీద కూడా కొంతవరకు ఆధారపడిన సాక్ష్యం.

(ii) విచారణలోనున్న అంశం ఉనికికి గానీ, లేకపోవటానికి గానీ సంబంధించి ఒక సాక్షి కేసు విచారణ జరిగేటప్పుడు చేసిన ప్రకటనను సాక్ష్యంగా వాడవచ్చు.

2. వినికిడి సాక్ష్యం అనేది సాక్షులు కాని వారు చేసిన ప్రకటనలను సాక్షులు తెలియపరిచే సాక్ష్యం.

## వినికిడి అర్హత ఎందుకు మినహాయించబడింది?

1. ఏ కోర్టులో ప్రమాణంచేసి తన కళ్ళతో తాను ప్రత్యక్షంగా చూసిన విషయాలను పేర్కొన్నప్పుడు అతడు తన ఇంద్రియాలు ఇచ్చిన సాక్ష్యాన్ని చెప్పటం లేదు. ఎవరో మూడవ వ్యక్తి ప్రమాణం చేయకుండా చెప్పిన విషయాలను తెలియపరుస్తున్నాడు. అతడు సాక్ష్యానికి మంత్రసాని ద్వారా జీవం పోస్తున్నాడు. అతడు కోర్టు బయట ఒక వ్యక్తి చెప్పిన మాటలను కోర్టుకు తెలుపుటకు కేవలం ఒక సాధనంగా మాత్రమే పని చేస్తున్నాడు. ఎ తాను విన్న విషయాన్ని తూ.చ. తప్పకుండా కోర్టులో తెలుపవచ్చు. అయితే అసలు ఆ ప్రకటన నిజమా, కాదా అనే విషయాన్ని ఆ పరిస్థితుల్లో తేల్చుకోలేం. ఆ విషయాన్ని ముందుగా ప్రకటించిన వ్యక్తి-ప్రమాణం చేసి చెప్పలేరు. పైగా అతన్ని అడ్డు పరీక్ష **Non Constat** చేయటానికి వీలు లేదు. అతడు ఉబుసుపోక గానీ, హాస్యానికి గానీ ఆ మాటలు అని ఉండవచ్చు. అతన్ని ప్రమాణం చేసి చెప్పమంటే అది బయట సంభాషణలో స్వేచ్ఛగా చెప్పిన వ్యక్తి ఇప్పుడు చెప్పటానికి నిరాకరించవచ్చు. అతడు ఉద్దేశపూర్వకంగా ఆ కథను అల్లి ఉండకపోవచ్చు, లేదా మరొకరెవరో తెరవెనుకనున్న వ్యక్తికి ప్రతినిధిగా ఆ పని చేసి ఉండకపోవచ్చు. అతడు తన ఉద్దేశాన్ని నిజాయితీగా వెల్లడిచేసి ఉండవచ్చు. అయితే అతడు తన అంచనాలో పొరబడి ఉండవచ్చు లేదా మతిమరుపు కలిగియుండవచ్చు. కాబట్టి అడ్డు పరీక్షకు గురిచేస్తే అతడు పూర్తిగా నీరుకారిపోవచ్చు. ఈ కారణంగా అటువంటి సాక్ష్యాన్ని అనుమతించకూడదని చట్టం నిర్దేశిస్తుంది. కక్షిదారుకు ఎ సాక్ష్యం అవసరమై, అతడు బి ద్వారా తెలుసుకున్న విషయాలు వాస్తవమో కాదో తెలుసుకోవలసిన అవసరం ఏర్పడినప్పుడు బినే కోర్టులో ప్రవేశపెడతారు. బినే చెప్పదలచుకున్నది ప్రమాణం చేసిచెప్పమంటారు. తర్వాత అతన్నే అడ్డు పరీక్షచేస్తారు. అస్పష్టమయిన, తప్పుడు సాక్ష్యాను కనిపెట్టడానికి భయంకరమయిన పరిశోధకుడి వలె కోర్టు వ్యవహరించడం కష్ట సాధ్యం. అయితే న్యాయపాలనలో అపారమయిన

అనుభవం, మానవ స్వభావానికి సంబంధించిన నైపుణ్య విజ్ఞానం, పౌరులతత్వం, విభాగాలు, వారి ప్రవర్తన, తన ముందుకు వచ్చే ప్రతి సాక్షిని పరిశీలించి తప్పుడు అస్పష్ట సాక్ష్యాలను నిరోధించే ప్రయత్నం చేస్తారు.

## మినహాయింపు నియమం అన్నిరకాల వినికిడి సాక్ష్యాలకు వర్తిస్తుందా?

1. వినికిడి సాక్ష్యం అనేది కోర్టులో సాక్షికాని మరొక వ్యక్తి చేసిన ప్రకటన. ఇది సాక్షిగా కోర్టులో హాజరయిన మరొక వ్యక్తి ద్వారా సాక్ష్యంగా ప్రకటించబడుతుంది.

2. మినహాయింపు నియమం కోర్టులో సాక్షి కాని వ్యక్తి చేసిన అన్ని ప్రకటనలకూ వర్తిస్తుందా లేదా అనేది ఇక్కడ ప్రశ్న.

3. ఈ ప్రశ్నను అర్థం చేసుకోవటానికి ఏ ప్రకటనకయినా సాక్ష్యంగా పరిగణించబడాలంటే రెండు భిన్న అర్హతలుండాలనే విషయాన్ని గ్రహించాలి. ఒక ప్రకటన వాస్తవమై ఉండాలి, వాస్తవాన్ని తెలియజేయటానికి చేసిన ప్రకటన అయి ఉండాలి.

<u>ఉదా-</u>

ఒక విషయాన్ని బి చెప్పినట్లుగా ఎ సాక్ష్యమిచ్చినప్పుడు

(i) ఆ విషయం వాస్తవంగా తీసుకోబడినట్లయితే అతడు నిజంగా అలా చెప్పాడా లేదా అనేది ప్రశ్న

(ii) ఆ విషయాన్ని వాస్తవానికి చేసిన ప్రకటనగా తీసుకుంటే ఆ ప్రకటన సత్యమా, అసత్యమా అనేది ప్రశ్న.

4. సాక్షికాని వ్యక్తి చేసిన ప్రకటనకు సాక్ష్యం ఈ క్రింది రెండు కారణాల వల్ల ఇవ్వవలసి ఉంటుంది.

(i) అటువంటి ప్రకటన చేయబడ్డట్లు రుజువు చేయటానికి,

(ii) చేయబడిన ప్రకటన నిజమైన ప్రకటనేనని రుజువు చేయటానికి.

మొదటి విషయంలో అది కేవలం వివాదాంశం మాత్రమే. రెండవ విషయంలో అది ప్రకటించిన విషయ యదార్థతను రుజువు చేయటానికి చేసిన తీర్మానం.

5. సాక్ష్యేతరులు చేసిన ప్రకటన సాక్ష్యంగా ప్రవేశపెట్టబడినప్పుడు అది వివాదాంశంగా లేదా సంబంధిత అంశంగా ప్రవేశపెట్టబడిందా, లేదా అనేదీ, కేసుకు సంబంధించి నిజాన్ని రుజువు చేసేదిగా ప్రవేశపెట్టబడిందా అనేది ఆ ప్రకటన చేయటంలో ప్రకటనదారునికి గల ఉద్దేశం మీద ఆధారపడి యుంటుంది. ఈ ఉద్దేశాన్ని పరీక్షించవలసి యుంటుంది.

6. వినికిడి సాక్ష్యపు మినహాయింపు నియమం విస్తృతార్థంలోనూ, సంకుచితార్థంలోనూ కూడా వెల్లడించబడింది. సంకుచితార్థంలో అది కేసులోని అంశాల నిజానిజాలను రుజువు చేయటానికి ప్రమాణం చేయకుండా చేసిన ప్రకటనలకు పరిమితం చేయబడింది. విస్తృతార్థంలో అది ప్రమాణం చేయకుండా సాక్ష్యులు చేసిన అన్ని ప్రకటనలకూ వర్తిస్తుంది. ఆ ప్రకటనల ఉద్దేశం ఏదైనా కూడా ఆ ప్రకటనలు కేవలం అంశాలుగా వాడబడినప్పుడు కూడా ఈ నియమం వర్తిస్తుంది.

## సాక్ష్య చట్టంలో ఆచరించబడుతున్న నియమం

1. భారతీయ సాక్ష్య చట్టం ఈ క్రింది నియమాన్ని గుర్తించదు: ''విచారణలోవున్న విషయానికి సంబంధించి దాని ఉనికినిగానీ, లేకపోవటాన్నిగానీ తెలియజేసే ఏ ప్రకటనయినా కోర్టులో హాజరయిన సాక్షికాక మరెవరయినా వెల్లడించిన సందర్భంలో దాన్ని సాక్ష్యంగా వాడరాదు'' - మార్క్ బై.

2. భారత సాక్ష్యం చట్టం క్రింద సాక్ష్యేతరులు చేసిన ప్రకటనలు, ప్రకటన యదార్థత కాక అది చేయబడిందా, లేదా అనేది ముఖ్యమైన విషయమైనప్పుడు ఆమోదయోగ్యాలవుతాయి.

3. కాబట్టి సాక్ష్యేతరులచే చేయడినప్పటికీ ఈ క్రింది ప్రకటనలు ఆమోదయోగ్యాలు.

- **(i)** **Res gestae** (వినికిడి అయినా అనుమతించతగిన సంబంధిత సాక్ష్యాన్ని **Res Gestae** అంటారు)లో భాగాలుగా ఉన్న ప్రకటనలు. ఇవి వివాదాంశాలుగా గానీ, వివాదాంశానికి అనుబంధంగా గాని ఉండవచ్చు **(SS 5, 8)**
- **(ii)** కౌలుగా గానీ, లైసెన్స్‌లుగా గానీ, గ్రాంట్‌లుగా గానీ యాజమాన్యాన్ని తెలిపే ప్రకటనలు (విభా. 13)
- **(iii)** సాక్షి ఇచ్చిన సాక్ష్యాన్ని బలపరచటం గానీ, ఖండించడం కానీ చేసే ప్రకటనలు **(SS 155, 157, 158)**

4. వినికిడి సాక్ష్య మినహాయింపు నియమం విషయానికి సంబంధించి నిజాన్ని రుజువు చేయటానికి వాడబడిన సాక్ష్యేతరులు చేసిన ప్రకటనలకు వర్తిస్తుంది.

## 4. నియమానికి గల మినహాయింపులేవి?

1. సాక్ష్య చట్టంలో పేర్కొనబడిన సాక్ష్య నియమం ప్రకారం కేసులో చెప్పబడిన వాస్తవాలను రుజువు చేయటానికిగాను సాక్షి కాని వ్యక్తి చేసిన ప్రకటన అనుమతించబడదు.

2. ఈ నియమానికి మినహాయింపులున్నాయి.

సెక్షన్ 32లో పొందుపరచబడిన మినహాయింపులు

1. ఒకవేళ ఒక వ్యక్తి మరణించినా, లేదా కనపడకపోయినా, లేదా సాక్ష్యం ఇవ్వలేని పరిస్థితిలోనున్నా, లేదా అతన్ని కోర్టులో హాజరుపరచటం ఆలస్యం లేదా అధిక ఖర్చుతో కూడుకొని ఉన్నా అటువంటి వ్యక్తి చేసిన లిఖిత లేదా మౌఖిక ప్రకటనలు విభాగం 32లోని ఈ క్రింది 8 తరగతులలో దేనికి చెందినా అవి నిరూపించబడతాయి.

- **(i)** అది అతని మరణానికి గల కారణానికి సంబంధించినదైనప్పుడు **(a)**
- **(ii)** అది వ్యాపారం సాగుతున్నప్పుడు చేసినదయినా, ఉదా **(b) (j)**
- **(iii)** అది ప్రకటించిన వ్యక్తికి చెందిన ధనాసక్తికి గానీ యాజమాన్యపు ఆసక్తికి గానీ వ్యతిరేకంగా ఉన్నప్పుడు లేదా అది నిజమయితే అతన్ని నేరాభియోగానికిగానీ, నష్టపరిహార దావాకుగాని గురిచేసేదిగా ఉన్నప్పుడు ఉదా **(e) (f)**
- **(iv)** ఒకవేళ ప్రకటన పౌరహక్కుకూ లేదా సాంప్రదాయానికీ లేదా జనాసక్తి కలిగించే విషయానికి సంబంధించి అతని అభిప్రాయాన్ని తెలిపేదిగా ఉన్నప్పుడూ, అది వివాదం తలెత్తకముందే ఇవ్వబడిన ప్రకటన అయినప్పుడు ఉదా (i)
- **(v)** అది రక్తసంబంధాన్ని గానీ, వివాహ సంబంధాన్నిగానీ, దత్తత సంబంధాన్ని గానీ తెలుపుతున్నప్పుడూ, ఆ వ్యక్తికి ప్రత్యేక సమాచారమున్నప్పుడూ, వివాదం తలెత్తకముందే ఆ ప్రకటన చేయబడి ఉన్నప్పుడు.
- **(vi)** అది మరణించిన వ్యక్తుల మధ్యగల సంబంధాన్ని తెలిపేటప్పుడు, కుటుంబ వ్యవహారాలకు సంబంధించిన వీలునామాలో గానీ, దస్తావేజులో గానీ, వంశవృక్షంలో గానీ, సమాధి పలకమీద గానీ, కుటుంబ చిత్రపటంపై గానీ రాయబడినప్పుడు.

(vii) అది దస్తావేజులోగానీ, వీలునామాలో గానీ మరే ఇతర పత్రంలో గానీ పేర్కొనబడినప్పుడు, సెక్షన్ 13 'క్లాజు' (a)లో పేర్కొన్నట్లుగా లావాదేవీలకు సంబంధించినదయినప్పుడు.

(viii) అది అనేకమంది వ్యక్తులు వారి అభిప్రాయాన్ని, భావాలను తెలుపుతూ చేసిన ప్రకటన అయినప్పుడు సెక్షన 33లో పేర్కొనబడిన మినహాయింపులు

1. ఒక వ్యక్తి మరణించినప్పుడు లేదా కనబడకుండాపోయినప్పుడు, లేదా సాక్ష్యం ఇవ్వలేని పరిస్థితిలోవున్నప్పుడు లేదా రెండవ పార్టీ వారిచే దాచిపెట్టబడినప్పుడు లేదా అధిక కాలం లేదా డబ్బు ఖర్చుకాకుండా అతన్ని హాజరుపరచటం వీలుకానప్పుడు, అటువంటి వ్యక్తి సాక్షిగా మొదటి న్యాయస్థాన కార్య వ్యవహారాలలో గానీ లేదా చట్టం ద్వారా నియమితుడైన ఏ వ్యక్తి ముందుగానీ ఇచ్చిన సాక్ష్యం తర్వాతి న్యాయస్థాన కార్యవ్యవహారాలలోగానీ లేదా అదే న్యాయస్థాన వ్యవహారాలలో తర్వాత కాలంలోగానీ కేసుకు చెందిన వాస్తవాలను రుజువు చేయటానికి సమర్పించబడవచ్చు. అయితే అందుకు ఈ క్రింది నిబంధనలు అమలులో ఉంటాయి.

(i) కార్యకలాపాలు ఒకే కక్షిదారుల మధ్య గానీ వారి ప్రతి నిధుల మధ్యగానీ జరిగి ఉండాలి.

(ii) మొదటి చర్యకు సంబంధించిన విరుద్ధ పక్షానికి అడ్డు పరీక్ష చేసే హక్కు, అవకాశం ఉంటాయి.

(iii) వివాదంలో నున్న విషయాలు రెండవ ప్రొసీడింగులోనూ మొదటి ప్రొసీడింగులోను ఒకటిగానే ఉంటాయి.

35 ఏదైనా పుస్తకంలోగానీ, రిజిష్టర్‌లోగానీ, రికార్డులోగానీ గల ఖాతా పద్దులు (Entries)

## 1. ప్రవేశానికి గల నిబంధనలు

(i) ఈ సెక్షన్ ప్రకారం రెండు రకాల ఖాతా పద్దులు ఉద్దేశింపబడ్డాయి. (a) ప్రభుత్వ ఉద్యోగుల చేత (b) ప్రభుత్వ ఉద్యోగులు కాని వ్యక్తుల చేత. ఒకవేళ అది ప్రభుత్వ ఉద్యోగి చేత చేయబడినట్లయితే అది అతని కర్తవ్య నిర్వహణలో భాగమై ఉండాలి. ఒకవేళ ప్రభుత్వ ఉద్యోగులు కాని వారి చేత చేయబడినట్లయితే, అది చట్టపు ఉత్తర్వుల మేరకు విధిగా చేసిన ఎంట్రీ అయి ఉంటుంది. మొట్టమొదటి విషయంలో చేసిన ఎంట్రీ క్రమసరళిలో చేయబడినటువంటిది. రెండవ విషయంలో ప్రత్యేక ఆదేశాల మేరకు చేయబడినటువంటిది.

(ii) పుస్తకంగానీ, రిజిష్టరుగానీ, రికార్డుగానీ, ప్రజాపరమైనది గానీ, అధికారపరమయినది గానీ కావచ్చు.

అధికారికం అంటే కార్యాలయ వినియోగార్థం నిర్వహించబడినదని కాదు. ప్రైవేట్ వ్యక్తిచే కాక రాష్ట్రంచే నిర్వహించబడినదని అర్థం.

ప్రజాపరమయినదంటే ప్రజల ఉపయోగార్థం పొందుపరచబడినదని అర్థం. అంటే ప్రజలందరికీ అందుబాటులోవున్నదని కాదు. దానికి సంబంధించిన వ్యక్తులందరికీ అందుబాటులోనున్నదని మాత్రమే. 18 కాలే. 584.

(iii) పుస్తకంగానీ, రిజిష్టరుకానీ, రికార్డు కానీ, భారతదేశంలో మాత్రమే అనికాదు మరే దేశంలోనయినా ఉంచబడిన పుస్తకంలోగానీ, రిజిష్టరులోగానీ, రికార్డులోగానీ ఉండవచ్చు. అయితే అన్నీ కొన్ని నిబంధనలకు లోబడియుండాలి. ఇతర దేశానికి చెందిన ఒక పుస్తకం, రిజిష్టరు, లేదా రికార్డులోని ఖాతాను రుజువు చేయవచ్చు.

## గుర్తుంచుకోవాల్సిన విషయాలు

(1) ఖాతా సాక్ష్యంగా పరిగణించబడుతుంది. అయితే ఆ ఖాతా ప్రవేశపెట్టిన వ్యక్తి జీవించే ఉన్నా సాక్షిగా పిలవబడడు. ప్రజా సంబంధ, ప్రభుత్వ సంబంధ పత్రాల రుజువుకుసెక్షన్‌లు 76-78 చూడవచ్చు.

(2) ఈ సెక్షన్లు ఒక ఎంట్రీ చేయబడలేదు అని తెలియజేయడానికి సాక్ష్యంగా పుస్తకాన్ని గానీ, రిజిష్టర్‌ను గానీ, రికార్డును గానీ వాడవు.

10 కలకత్తా. 1024 ; 24 అలహాబాద్ 90.

(3) ఈ సెక్షన్ ఒక ప్రభుత్వ అదికారి తనకు తెలిసిన వాస్తవాన్ని రిజిష్టరులోగానీ, పుస్తకంలోగానీ నమోదు చేసే సందర్భాలకు మాత్రమే పరిమితం చేయబడలేదు.

20 కలకత్తా 940.

(4) ప్రభుత్వ ఉద్యోగి విధి నిర్వహణలో భాగంగా నమోదు చేసినా, లేదా చట్టంచే నిర్దేశింపబడి విధిగా చేసినా, అది ఒక ప్రభుత్వ ఉద్యోగి చేయదగని ఎంట్రీగా గానీ, తన విధులు తెలియకపోవటం

వలన లేక తొందరపాటు వలన లేదా మరే ఇతర కారణంగానయినా చేసిన ఎంట్రీగా ఉండకూడదు. అతడు ఎంట్రీలో పేర్కొనబడిన అంశానికి సంబంధించిన నిజానిజాలు తెలిసిన వ్యక్తి చెయ్యమనటం వలన ఆ పని చెయవచ్చు.

25 అలహాబాద్ 90 F.B. 101

2. లావాదేవీలు జరుగుతున్నప్పుడు ప్రతిరోజూ ఎంట్రీలను నమోదు చేయవలసిన అవసరంగానీ లేదా బాంకులలో వలే గంట గంటకీ నమోదు చేయవలసిన అవసరంగానీ లేదు. ఎంట్రీలను నమోదు చేసిన సమయం ముఖ్యంకాదు. ఎంట్రీలు క్రమబద్ధంగా చేయబడినవా లేదా అనేది ముఖ్యం. ఎంట్రీలు నమోదు చేయటంలో జాప్యం జరిగితే దాని విలువ మారుతుంది. కానీ దాని అనుమతి యోగ్యతకు ఎటువంటి ప్రమాదం వాటిల్లదు. 27 కలకత్తా. 118 (P.C) ; 13 C.I.J. 139.

3. ఖాతా పుస్తకాలలో వ్యాపారం సాగుతున్నప్పుడు దానికి సంబంధించిన ఎంట్రీలు క్రమబద్ధంగా నమోదు చేయబడినప్పటికీ ఆ పుస్తకం ఏదైనా వ్యవహారానికి చెందిన ఆరోపణను దానికి సంబందించిన ఎంట్రీ పుస్తకంలో లేకపోవటం వలన కాదని రుజువు పరచటానికి సరిపోదు.

10 కలకత్తా. 1024.

గమనిక: సెక్షన్ 9, 11-19 C.N. 1024ల కింద అది ఆమోదయోగ్యం కాగలదు.

ఎంట్రీ లేకపోవటం ద్వారా రాబట్టే భావం

30 కలకత్తా. 231 (247) P.C.

4. ఎంట్రీ ఏదైనా పుస్తకంలో గానీ, రిజిస్టరులోగానీ, రికార్డులోగానీ ఉండాలి. ఎంట్రీ ఉత్తర ప్రత్యుత్తరాలను కలిగియుండదు.

7 M.L.I. 117.

ఉదా-

1. జనన మరణాల రిజిస్టరులలో నమోదులు.

2. జననం, రెవెన్యూలకు చెందిన రిజిస్టరులలో నమోదులు.

3. జననం, వివాహంలకు చెందిన రిజిష్టరులలో నమోదులు.

36 పటాల్లోనూ, చార్టులలోనూ, ప్రణాళికలలోనూ వివాదాంశానికి గానీ, ముఖ్యాంశాలకు గానీ సంబంధించి చేసిన ప్రకటనలు.

1. అనుమతి యోగ్యతకు గల షరతులు.

ఈ సెక్షన్ రెండు రకాల పటాలకూ, ప్రణాళికలకూ సంబంధించినది.

(a) సాధారణంగా బహిరంగ విక్రయానికి పెట్టబడేవి.

(b) ప్రభుత్వ అధికారంలో ఏర్పాటయిన పటాలూ, ప్రణాళికాలు.

(a) ఆమోదయోగ్యం కావటానికి గల కారణాలు

ప్రచురణ అయినది సమాజం మొత్తానికీ ఆమోదయోగ్యమవటం వలనా, అందరి విమర్శకూ అందుబాటులోనుండటం వలన అందులో ఏవైనా తప్పులుంటే వాటిని బయటపెట్టడానికిగానీ, సవాలు చేయటానికిగానీ అవకాశం ఉంటుంది.

(b) ఆమోదయోగ్యం కావడానికి గల కారణాలు

ప్రభుత్వ అధికారం కింద తయారయి, ప్రచురితమవటం వలన అవి సమర్థులయిన వ్యక్తులచే తయారుచేయబడినవిగా, వారి అధ్యయనానికీ, పరిశీలనకూ నిదర్శనాలుగా పరిగణింపబడతాయి.

37 ఏ చట్టంలోనయినా కథనం చేయబడిన, లేదా ప్రభుత్వం జారీచేసిన అధికార పత్రంలో వెలువడిన ఉత్తర్వులలో పేర్కొనబడిన ప్రకటనలు.

## కారణాలు.

1. అధికార ప్రతాలూ, చట్టాలు ఆమోదయోగ్యాలు. దీనికి అవి ప్రభుత్వ నిర్ణీత ఏజెంటుల ద్వారా, వారి విధి నిర్వహణలో భాగంగా చేయబడటం, ప్రభుత్వమే అధికార పూర్వకంగా వాటిని ప్రచురించటం, అందులో పేర్కొనబడిన విషయాలు పౌర సంబంధమైనవీ, అందరికీ తెలిసినవీ కావటం కారణాలు.

వాటిలో పేర్కొనబడిన అంశాలు పౌర సంబంధమైనవి కావటం వలన వాటిని ప్రమాణం చేసిన సాక్ష్యుల ద్వారా నిరూపించటం కొన్నిసార్లు కష్టమవుతుంది.

1. ఏదైనా పౌర సంబంధమైన విషయ ఉనికికి సంబంధించి కోర్టు ఒక అభిప్రాయానికి రావాలంటే ఇవి చాలా ముఖ్యమవుతాయి.

2. పౌర సంబంధం (వివరించబడలేదు - సం.)

3. ఈ సెక్షన్ పార్లమెంటు చేసిన బహిరంగ చర్యలకూ, వ్యక్తిగత చర్యలకూ మధ్య ఏవిధమైన విభేదాన్ని చూపించదు. రెండు రకాల చర్యలలోనూ పేర్కొనబడిన అంశాలు పౌర సంబంధమైనవిగా ఉండాలనేది ఈ సెక్షన్ ఆపేక్షించేది.

4. సాక్ష్య చట్టం ప్రకారం కథనాలు నిర్ణాయకమైనవి కావు. అయినా అవి నిర్ణాయకమైనవిగా ప్రకటించబడవచ్చు.

5. ఒక కథనం ఒక అంశం ఉనికిని తెలుపుతున్నట్లుగా రుజువు చేయబడాలి. ఒక వ్యక్తికి దాని ఉనికి తెలుసు అనటానికి అది సాక్ష్యం కాదు. ఒక అంశానికి చెందిన సమాచారం, ఆ అంశం పౌర సంబంధమైనదైనప్పటికీ దానిని అధికారపత్రంలో ఇచ్చిన ప్రకటననుండి నిర్ణాయకమైనదిగా భావించటానికి వీలులేదు. అది కోర్టు నిర్ణయించవలసిన వాస్తవాంశ ప్రశ్న. నోటీసుకు గురికాబడిన కక్షిదారు దానిని చదివినట్లుగా చూపించాలి.

38 S

1. ఏ ప్రదేశానికి చెందినదైనా న్యాయాశాస్త్ర ప్రకటన ఈ క్రింది వాటిలో ప్రకటించబడినది.

(a) ఆ దేశపు ప్రభుత్వ అధికారం క్రింద ముద్రితం లేదా ప్రచురితం కావాలనీ, ఏదైనా అటువంటి చట్టాన్ని కలిగియుండాలనీ ఉద్దేశింపబడిన పుస్తకం

(b) ఆ దేశపు కోర్టు నిర్ణయానికి చెందిన రిపోర్టు అటువంటి నిర్ణయాలకు సంబంధించిన రిపోర్టులకు మద్దతు ఇచ్చే పుస్తకంలో పేర్కొనబడినది.

ఏ దేశపు న్యాయశాస్త్రానికి సంబంధించైనా కోర్టు ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకోవలసిన సందర్భాలకు ఇది వర్తిస్తుంది.

వివాదాంశాలతో గానీ, ముఖ్యాంశాలతోగానీ, లేదా వాటిని అసంభావ్యాలుగా చేసే వాటితోగానీ అసంగతంగా ఉన్న అంశాల ప్రత్యేక ఉదాహరణలు. ఇవి (1) ఒప్పుకోళ్లు (2) ఒప్పందాలు (3) తీర్పులు.

## ఒప్పుకోళ్ళు (Admissions)

### సెక్షన్ 21

1. ఒప్పుకోలు వాటిని కోరే వ్యక్తికి వ్యతిరేకంగా గానీ, అతని ప్రతినిధికి వ్యతిరేకంగా గానీ నిరూపించబడవచ్చు.

2. ఒప్పుకోలు అంటే ఏమిటి అనేది ప్రశ్న. దీనికి సమాధానం ఆలోచించే ముందు ఒప్పుకోళ్ళ ప్రాముఖ్యతను గురించి కొన్ని అంశాలను గమనించవలసి ఉంది.

(1) ఒక వ్యక్తికి వ్యతిరేకంగా ఒప్పుకోలును రుజువు చేయవచ్చు. ఒక వ్యక్తికి మద్దతుగా చేసిన ఒప్పుకోలు అతని ద్వారానే రుజువు చేయబడలేదు. ఒక వాది తన కేసుకు అవసరమయితే ప్రతివాది చేసిన ఒప్పుకోలు రుజువు చేయవచ్చు. అలాగే ఒక ప్రతివాది తన కేసుకు అవసరమయితే వాది చేసిన ఒప్పుకోలుని రుజువు చేయవచ్చు. అయితే ఒక వాది తాను చేసిన ఒప్పుకోలున్న తన కేసుకు ఎంత అవసరమయినా సరే రుజువు చేయలేడు. అలాగే ఒక ప్రతివాది తన కేసుకు ఎంత ఉపయోగమయినా తానే చేసిన ఒప్పుకోలు సాక్ష్యం ఇవ్వటానికి వీలులేదు.

దీనికి కారణం కక్షిదారు తనకు అనుకూలంగా సాక్ష్యం సృష్టించుకోవడానికి అనుమతింపబడడు.

ఈ నియమానికి మూడు మినహాయింపులున్నాయి. వీటి ప్రకారం ఒక కక్షిదారు తనకనుకూలంగా ఒప్పుకోలు సాక్ష్యం ఇవ్వటానికి అనుమతించబడతాడు.

**(a)** సెక్షన్ 32 ప్రకారం ఒప్పుకోలు తత్‌సంబంధితమయినప్పుడు

**(b)** ఒప్పుకోలు ఆ సమయంలో మానసిక స్థితికి గానీ, శారీరక స్థితికి గానీ సంబంధించినదై, ప్రవర్తనతో జతచేయబడినప్పుడు

**(c)** ఒప్పుకోలు ఒక ఒప్పుకోలుగా కాక మరేవిధంగానయినా ముఖ్యమైనదైనప్పుడు
ఉదా: (d) (e)

### సెక్షన్ 23

(2) ఈ మూడు సందర్భాలనూ మినహాయించి, ఏదైనా ఒప్పుకోలు నిరూపించబడాలంటే కక్షిదారుకు వ్యతిరేకంగా మాత్రమే నిరూపించబడగలదు. కానీ ఒప్పుకోలుకు రుజువు ఇవ్వలేని

సందర్భం కూడా ఉంటుంది. ఒప్పుకోలు రుజువు ఇవ్వకూడదనే ఒప్పందం మీద చేయబడిన ఒప్పుకోలు ఈ కోవకే చెందింది.

## సెక్షన్ 31

(3) ఒప్పుకోళ్ళు చేర్చుకున్న విషయానికి నిర్ణయాత్మక రుజువుగా పరిగణించబడవు. ఒక ఒప్పుకోలు అందులో నిషేధానికి తగిన అంశాలున్నప్పుడు నిషేధమవుతుంది. ఈ సందర్భంలో ఏ కక్షిదారుకు వ్యతిరేకంగా అది రుజువు చేయటానికి ప్రవేశపెట్టబడిందో ఆ కక్షిదారు దానికి కాదని రుజువు పరచటానికి గానీ, సంజాయిషీ చెప్పటానికి గానీ సాక్ష్యం ఇవ్వలేడు. అయితే అది నిషేధం కానప్పుడు మాత్రం ఏ వ్యక్తికి వ్యతిరేకంగా అది నిరూపించబడిందో ఆ వ్యక్తి దానిని కాదని రుజువు పరచటానికిగానీ, సంజాయిషీగా గానీ సాక్ష్యం ఇవ్వవచ్చు.

3. ఒప్పుకోళ్ళు ఏ కక్షిదారు అయితే వాటిని చేశాడో అతనికి వ్యతిరేకంగా మాత్రమే రుజువు చేయబడతాయి. అయితే అతని ప్రతినిధికి హక్కు కలిగియున్న వ్యక్తికి వ్యతిరేకంగా కూడా ఒప్పుకోళ్ళు రుజువు చేయవచ్చు.

### హక్కు కలిగియున్న ప్రతినిధి అంటే ఎవరు?

(i) చట్టంలో ఈ పదానికి నిర్వచనం ఇవ్వబడలేదు.

(ii) అది 'న్యాయ ప్రతినిధి' అనే పదానికంటే విస్తృతార్థంలో తీసుకోబడినది. న్యాయ ప్రతినిధి అనగా శిక్షాస్మృతి ప్రకారం మరణించిన వ్యక్తి ఆస్తికి న్యాయస్థానంలో ప్రతినిధిగా వ్యవహరించేవాడు.

(iii) ఈ పదం 'న్యాయ ప్రతినిధి' అనే అర్థాన్నే కాక మరణించిన వ్యక్తికి చెందిన 'సొంత వ్యక్తి' అనే అర్థాన్ని కూడా కలిగియుంటుంది.

(iv) ఒక వ్యక్తి సొంత మనుషులు ఈ క్రింది రకాలుగా ఉండవచ్చు.

(i) రక్త సంబంధీకులు - పూర్వీకులు, వారసులు వంటివారు.

(ii) చట్టరీత్యా సొంతదారులు - వీలునామా అమలుదారు లేదా వీలునామా లేని ఆస్తికి పరిపాలకుడు మొదలగువారు.

ఏ ఒడంబడికై

(iii) ఆస్తికి సొంతదారులు లేదా, ఆస్తిలో ప్రయోజనమున్నవారు విక్రయదారు, కొనుగోలుదారు, అనుదాత, అనుదాన గ్రహీత, కౌలుదాత, కౌలుదారు వంటివారు.

ఈ కారణంగా ఒక ఒప్పుకోలు

(1) తండ్రి చేసినది కుమారుడికి వ్యతిరేకంగా రుజువు చేయవచ్చు.

(2) మరణించిన వ్యక్తి అమలుదారు లేదా పరిపాలకుడికి వ్యతిరేకంగా చేసినది

(3) విక్రయదారు కొనుగోలుదారుకు వ్యతిరేకంగా చేసినది.

## 17-20 ఒప్పుకోలు అంటే ఏమిటి?

1. ఒప్పుకోలు (1) నియతంగా గానీ (2) అనియతంగా గానీ ఉంటాయి.

(1) నియత ఒప్పుకోలు:

(i) కోర్టుకు సమర్పించబడిన కేసులో ఉన్న ఒప్పుకోళ్ళు

(ii) విచారణ ప్రశ్నలకు సమాధానాలుగా నున్న ఒప్పుకోళ్ళు

(iii) వాస్తవ విషయ అనుమతి నోటీసుకు సంబంధించిన ఒప్పుకోళ్ళు

(iv) దస్తావేజుల ఒప్పుకోలు నోటీసుకు సంబంధించిన ఒప్పుకోళ్ళు

(v) సంప్రదింపు న్యాయవాది చేసిన ఒప్పుకోళ్ళు

(vi) సలహా వకీలులు చేసిన ఒప్పుకోళ్ళు

(2) అనియత ఒప్పుకోళ్ళు

(i) ప్రకటనల ద్వారా చేయబడిన ఒప్పుకోళ్ళు

(ii) ప్రవర్తన ద్వారా చేయబడిన ఒప్పుకోళ్ళు

(1) అమలు లేదా తొలగింపు

(2) మౌనం

(3) నిరాక్షేపణ సమ్మతి

4. సెక్షన్21 ప్రకారం రుజువు అనుమతించబడిన ఒప్పుకోళ్ళు నియత ఒప్పుకోళ్ళు కావు. సెక్షన్ 21 అనియత ఒప్పుకోళ్ళకు మాత్రమే సంబంధించి ఉంటుంది. అయితే ఇది అన్ని రకాల అనియత ఒప్పుకోళ్ళకు వ్యవహరించదు. ఇది ప్రకటనల రూపంలోనున్న అనియత ఒప్పుకోళ్ళకు మాత్రమే వర్తిస్తుంది. ఇది నొక్కి చెప్పబడిన వాటినే గానీ, చర్యలను వ్యవహరించదు.

5. సెక్షను 21లో ఒప్పుకోలు ఉపయోగించబడిన నిర్వచనం సెక్షన్లు 17-20 లకు కూడా విస్తరింపబడింది.

ఒప్పుకోలు అనేది ఏదైనా వివాదాంశానికి గానీ, తత్‌సంబంధిత ఒప్పుకోలు అంశానికి గానీ సంబంధించిన భావాన్ని సూచిస్తూ మౌఖికంగా లేదా లిఖితపూర్వకంగా సెక్షన్లు 18, 19, 20లో నిర్దేశింపబడిన వ్యక్తి చేసిన ప్రకటన.

రెండు విషయాలు ముఖ్యంగా తెలుసుకోవాలి. ప్రకటన వివాదాంశానికిగానీ, తత్‌సంబంధిత అంశానికి గానీ సూటిగా సంబంధించినది కానక్కర్లేదు. అది వివాదాంశాన్నిగానీ, తత్‌సంబంధిత అంశాన్ని గానీ గుర్తిస్తూ చేసిన ఒప్పుకోలు సూచిస్తే చాలు.

ఉదా:- 'ఎ' పంటలను ఎక్స్ పశువులు నాశనం చేసినందుకు గాను 'ఎ' 'ఎక్స్'పై నష్టపరిహారం చెల్లించమని దావా వేశాడు. ఎక్స్ పశువులు పంటన నష్టపరచినట్లుగా సాక్ష్యం చూపించటం కోసం ఎక్స్ కొంత సొమ్మును 'ఎ'కు నష్టపరిహారంగా ఇవ్వబోయాడని 'బి' ఇచ్చిన సాక్ష్యాన్ని ప్రవేశపెడతారు.

ఇది తన పశువులే 'ఎ' పంటను నష్టపరిచాయని ఎక్స్ ఒప్పుకున్నట్లుగా తెలియజేసే ప్రకటన.

ఉదా:- 'ఎ' తన గొర్రెలను ఎక్స్‌కు చెందిన కుక్క చంపిందని ఆరోపిస్తూ ఎక్స్‌పై దావా వేశాడు. దీనికి సాక్ష్యంగా ఎక్స్ ఇకమీదట తన కుక్క గొర్రెలను చంపకుండా తన కుక్కను తానే చంపేసుకున్నాడని 'ఎ' తెలియజేశాడు.

ఇది ఒప్పుకోలు అవుతుందా?

11. అది సెక్షన్లు 18-20లలో నిర్దేశింపబడిన వ్యక్తులచే చేయబడి వుండాలి.

1. సెక్షన్లు 18-20ల ప్రకారం వ్యక్తులకు సంబంధించి నిర్దేశింపబడిన కారణాలు ఈ క్రింది విభజనకు గురి అవుతాయి.

(1) ప్రొసీడింగ్‌లకు కక్షిదారులయిన వ్యక్తులు

(2) ప్రొసీడింగ్‌లకు కక్షిదారులు కాని వ్యక్తులు- అపరిచితులు.

**ప్రొసీడింగ్‌లకు కక్షిదారులయిన వ్యక్తులు ఈ క్రింది విధంగా ఉంటారు:**

(1) కక్షిదారులు

(2) కక్షిదారులచే నియమింపబడ్డ ఏజెంట్లు

(3) ప్రొసీడింగులకు సంబంధించిన విషయాలలో సంయుక్తంగా ఆసక్తి ఉన్న వ్యక్తులు. ఉదా- భాగస్తులు, సంయుక్త కాంట్రాక్టరులు.

(4) కక్షిదారులు తమ ప్రయోజనాలును ఎవరి దగ్గరనుండి సాధించుకున్నారో ఆ వ్యక్తులు.

## 1. అపరిచితులు

సెక్షన్ 18లో పేర్కొనబడినట్లుగా ప్రొసీడింగులకు ఏమాత్రం సంబంధం లేని, అపరిచిత వ్యక్తి ఇచ్చిన ప్రకటన ఒక కక్షిదారు చేసిన ఒప్పుకోలు ఎక్కడ పరిగణించబడుతుంది.

రెండు సందర్భాలున్నాయి.

(1) ప్రకటన రిఫరీ చేసినదైనప్పుడు - సెక్షన్ 20

II ఆ అపరిచిత వ్యక్తి స్థితి, ఉత్తరదాయిత్వం ప్రొసీడింగులలోని చర్చనీయాంశమైనప్పుడు

అంతేకాక

(2) అపరిచిత వ్యక్తి చేసిన ప్రకటన తన బాధ్యతకి సంబంధించి అతను చేసిన ఒప్పుకోలుగా ఉన్నప్పుడు- అంటే అది సెక్షను 17-18ల పరిధిలోకి వచ్చి ఉండాలి.

ఉదా- సెక్షన్ బాధ్యత.

ఉదా- 5 మద్రాసు 239 - స్థితి నేరస్థాయి.

ఎ, బి లు ఇద్దరు కలిసి సి కి క/త డబ్బు అప్పుగా ఉన్నారు. సి, ఎ ఒక్కడిమీదే కేసు వేస్తాడు.

ఎ తానొక్కడినే అందుకు బాధ్యుడ్ని చెయ్యకూడదనీ, బికి కూడా అప్పులో భాగం ఉంది కనుక అతన్ని కూడా సహ ప్రతివాదిగా చేయాలని వాదించాడు.

తనకు కూడా అప్పులో భాగం ఉందని బి డికి చేసిన అంగీకరణ ఎ, సిల మధ్య వివాదానికి సంబంధించి ఒక ముఖ్య విషయమవుతుంది. దీనిని నిరూపించవచ్చు కూడా.

## నేరం ఒప్పుకోలు (Confession)

1. ఒక నేరం ఒప్పుకోలుకు సంబంధించి అది స్పష్టంగా మినహాయించబడని సందర్భాలలో సాక్ష్యం ఇవ్వవచ్చు. అది ఒక ప్రైవేట్ వ్యక్తి ముందు కానీ, మెజిస్ట్రేట్ ముందు కానీ చేసిన ఒప్పుకోలు కావచ్చు.

2. నేరాన్ని ఒప్పుకోవటం అనేది ఒక అంశం కాబట్టి ఇతర అంశాల వలే అది కూడా రుజువు చేయబడుతుంది.

9. మద్రాసు. 224 (240)

5 లాహోర్. 140.

4. అలహాబాద్. 46 (94)

8. W.R. Cr. 28

3. రెండు ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి:

I నేరం ఒప్పుకోలు అంటే ఏమిటి?

II ఏఏ సందర్భాలలో నేరం ఒప్పుకోలుకు సాక్ష్యం మినహాయింపబడుతుంది.

## I ఒప్పుకోలు అంటే ఏమిటి?

1. చట్టంలో 'నేరం ఒప్పుకోలు' అనే పదానికి నిర్వచనం లేదు.

2. కాబట్టి ఈ పద నిర్వచనం న్యాయస్థాన అర్థ వివరణ మాత్రమే.

3. నేరం ఒప్పుకోలు ఒక ప్రకటన ఒప్పుకోలు కూడా ఒక ప్రకటనే. అయితేమొదటిని నిందితుడు నేస్తాడు, రెండవది కక్షిదారు చేసిన ప్రకటన కావచ్చు. ఇక్కడ రెండు ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి.

(1) నేరం ఒప్పుకోలుకు, ఒప్పుకోలుకు ఉన్న ఖచ్చితమైన తేడా ఏమిటి.

(2) ఒక నిందితుడు చేసిన ప్రకటన ఎప్పుడు నేరం ఒప్పుకోలు అవుతుంది, ఎప్పుడు ఒప్పుకోలు అవుతుంది.

1. నిందితుడు చేసిన ప్రకటనలు సాక్ష్య చట్టంలో పిలువబడే ఒప్పుకోలు తరగతికి చెందుతాయి (సెక్షన్లు 17, 18) ఇవి ఒప్పుకున్న వ్యక్తికి మద్దతుగా కాక వ్యతిరేకంగా సాక్ష్యమిస్తాయి.

2. నేరం ఒప్పుకోళ్ళు 'ప్రకటన' లలో ఉప తరగతిగానూ, ఒక తరగతికి చెందిన అంగీకరణగానూ పరిగణింపబడతాయి.

3. ఈ క్రింది పట్టిక ఈ సంబంధాన్ని విశదీకరిస్తుంది.




4. నేరం ఒప్పుకోలులకూ, ఒప్పుకోలుకూ సమిష్టిగా ఉండే లక్షణం అవి రెండూ ప్రొసీడింగులకు కక్షిదారు చేసిన ప్రకటనలు అయి ఉండటమే.

5. ఇక్కడ రెండు ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి.

1. ఒక ప్రకటన కక్షిదారుచే చేయబడకపోయినా ఒప్పుకోలే అవుతుంది. అది సెక్షను 18-20లలో నిర్వచించబడిన వ్యక్తిచే చేయబడినదయితే అది ఒప్పుకోలు అవుతుంది. ఒక ప్రకటన నిందితుడిచే కాక సెక్షన్లు 18-20లో నిర్దేశింపబడిన వ్యక్తులచేచేయబడితే అదినేరం ఒప్పుకోలుగా పరిగణింపబడుతుందా?

1. అది నేరం ఒప్పుకోలుగా పరిగణించబడాలంటే అది నిందితుడిచే చేయబడినదై వుండాలి. నిందితుడిచే చేయబడకపోతే అది నేరం ఒప్పుకోలు కాదు.

1. నిందితుడు నేరం కిందకుగా రాని ప్రకటన చేస్తే అది నేరం ఒప్పుకోలు కాదు.
2. నిందితుడు నేరం కిందికి వచ్చేది, తన ప్రమేయాన్ని తెలియజేయటమేగానీ తనను నేరంలో ఇరికించనిదీ అయిన ప్రకటన చేస్తే అది నేరం ఒప్పుకోలు కాదు.
3. నేరం కిందకి వచ్చే ప్రకటన, నిందితుడి ప్రమేయాన్ని తెలియజేయటమే కాకుండా అతనిని నేరంలో ఇరికించేదిగా ఉంటే అది నేరం ఒప్పుకోలు అవుతుంది.

గమనించదగిన అంశాలు.

1. నేరారోపణ సూటిగా గానీ లేదా ఒప్పుకోలు రూపంలోగానీ ఉండవచ్చు. దానికదే నేర నిర్ణయానికి మూలాధారంగా ఉండే ప్రకటన నేరం ఒప్పుకోలు అవుతుంది.

2. ప్రకటన నిందితుడిచే స్వయంగ నేరం కిందికి రాని విధంగా ఉద్దేశింపబడవచ్చు. అయినప్పటికీ అది నేరాన్ని ఇరికించే అంగీకారణ కావచ్చు. అటువంటప్పుడు అది నేరం ఒప్పుకో అవుతుంది.

6 బొంబాయి 34

## రెండు రకాల నేరం ఒప్పుకోళ్లు

1. నేరం ఒప్పుకోళ్లు న్యాయాధికారమైనవి గానీ, న్యాయస్థానేతరమైనవి కానీ కావచ్చు.

(i) మెజిస్ట్రేట్ ముందుకానీ, కోర్టులో కానీ న్యాకార్య వ్యవహారాలు జరుగుతున్నప్పుడు చేయబడిన ఒప్పుకోలులు న్యాయాధికార ఒప్పుకోలులు.

(ii) మెజిస్ట్రేట్ ముందు కానీ, కోర్టులోకానీ కాక ఇతరత్రా చేయబడిన ఒప్పుకోలులు న్యాయస్థానేతరమైనవి.

నేరం ఒప్పుకోలుకు సాక్ష్యం మినహాయింపబడిన సందర్భాలు ఏవి?

1. సాక్ష్య చట్టం మూడు అనుకూలంగా సందర్భాలను పరిగణిస్తుంది.

(i) పోలీసు అధికారి ముందు చేయబడిన నేరం ఒప్పుకోలు.

(ii) పోలీసు సంరక్షణలోనున్నప్పుడు చేయబడిన నేరం ఒప్పుకోలు.

(iii) పోలీసు అధికారి కాక ఇతరుల ముందు చేసిన నేరం ఒప్పుకోలు లేదా పోలీసు సంరక్షణలో నున్నప్పుడు చేయబడని నేరం ఒప్పుకోలు.

(i) కు సంబంధించి

అది సెక్షన్ 25 కింద మినహాయించబడుతుంది.

(ii) కు సంబంధించి

అది సెక్షన్లు 25, 26ల కింద మినహాయించబడతుంది. అపవాదం.

సెక్షను 27 ప్రభావం.

6. అలహాబాద్ 509 (F.B.)

ప్రశ్న: సెక్షన్ 27, సెక్షన్ 26కేగాని 25కు మినహాయింపు కాదా? లేదా అది ఆ రెండు విభాగాలకూ మినహాయింపేనా?

57 కలకత్తా 1062.

**(iii)** కు సంబంధించి

సెక్షన్ 24లో విషయం పొందుపరచబడింది.

వివరణ 1. అధికారంలోనున్న వ్యక్తి. 2. హాజరవటం.

గమనించవలసిన విషయాలు:

1. సెక్షన్ 28 ఒప్పుకోలు తర్వాత ..... తొలగించబడింది.

2. సెక్షన్ 29

ప్రశ్నలు

1. సెక్షన్ 287 కింద నిందితుడు మెజిస్ట్రేట్ ముందు చేసిన ప్రకటనలకు సెక్షన్ 24 వర్తిస్తుందా?

ప్రశ్న: పరిష్కరించబడలేదు.

II సెక్షన్ 339 (2) నేర విచారణ స్మృతి (నేర ప్రక్రియ చట్టం) **(22 Bom. L.R. 1247)** కింద అభయదత్త నేరస్తుడు చేసిన ప్రకటనకు సెక్షన్ 24 వర్తిస్తుందా?

## నేరం ఒప్పుకోలుల ఉపయోగం

1. ఒక నిందితుడు చేసిన ప్రకటన ఈ క్రింది రెండు కారణాల వల్ల అతనిని మాత్రమే బంధిస్తుంది.

**(i)** న్యాయశాస్త్ర సాధారణ నియమం ప్రకారం ఒక వ్యక్తి చేసిన అంగీకరణ మరొక వ్యక్తికి ప్రతికూలంగా పరిణమిస్తుంది.

**(ii)** నిందితుడైన వ్యక్తి చేసిన ప్రకటన ప్రమాణ పూర్వకంగా చేసినది కాదు.

**(iii)** ప్రకటన అడ్డు పరీక్షకు గురిచేయబడదు.

2. కానీ ప్రకటన అతనినీ, రెండవ వ్యక్తినీ కూడా ప్రభావితం చేసే ఒక ఒప్పుకోలు అయినప్పుడు సెక్షన్ 30 ప్రకారం కోర్టు, నిందితుడు రెండవ వ్యక్తికి వ్యతిరేకంగా ఇచ్చిన ఒప్పుకోలును పరిశీలించవచ్చు.

3. కాబట్టి సెక్షన్ 30 సాధారణ నియమానికి మినహాయింపు. ఈ అ మినహాయింపు కారణం స్వయం అంతర్నిహితం. ఇది ఒక ప్రమాణ మంజూరుగా లేదా, మరొక వ్యక్తిపై చేసిన నేరారోపణలోని వాస్తవానికి హామీగా ఉపకరిస్తుంది.

4. ఒక నిందితుడు మరొక నిందితుడికి వ్యతిరేకంగా చేసిన ఒప్పుకోలు ఉపయోగానికి సంబంధించి ముఖ్యమైన మాటలు ''కోర్టు పరిశీలనలోనికి తీసుకోవచ్చు'' అని దీని అర్థం,

(1) ఒప్పుకోలును ఉపయోగించటం తప్పనిసరికాదు. అది అనుమతింపబడినదీ, వివేచనాత్మకమైనదీ కూడా. కోర్టు దానిని వాడటానికి అనుమతించబడుతుంది. అయితే కోర్టు దానిని తప్పనిసరిగా వాడాలనే నిర్బంధం లేదు.

(2) కోర్టు దానిని పరిశీలించవచ్చు. 'పరిశీలన' అనే మాట ప్రముఖమైనది.

(3) ఆ పద నిర్వచనం ప్రకారం ఒక సాక్షిచే చేయబడిన ప్రకటన సాక్ష్యమవుతుంది. ఒక నిందితుడు తననూ, తన సహనిందితుడినీ గురిచేసేటట్లుగా చేసిన ఒప్పుకోలు అటువంటి ప్రత్యేకార్థంలో సాక్ష్యం కాజాలదు. అది కోర్టు పరిశీలనార్థం కోర్టుముందు ఉంచబడిన విషయం. ఇక్కడ తలెత్తే సందేహం ఆ విధంగా పరిగణించబడినప్పుడు అది ఇతర సాక్ష్యాల అవసరం లేకుండా చేస్తుందా? సాక్ష్య చట్టంలో దీనికి సూటిగా సమాధానం ఇవ్వబడలేదు. కానీ కోర్టులు అది ఇతర సాక్ష్యాలు అవసరం లేకుండా చేయదని భావిస్తున్నాయి. దీనికిగల కారణాలు ఈ క్రింద పేర్కొనబడినవి.

(1) ఒక నేరం ఒప్పుకోలు అనేది దానికి సంబంధించిన వ్యక్తులకు వ్యతిరేకంగా చెప్పిన నిజాలకు పూర్తి హామీ ఎప్పుడూ ఇవ్వదు. ఒక ఒప్పుకోలు దానిని చేసిన వ్యక్తికి దానితోగల సంబంధం చెప్పటం వరకు వాస్తవం కావచ్చు. దీనికి విరుద్ధంగా, దానికి గురిఅయ్యే ఇతర వ్యక్తులకు సంబంధించి అది దుర్బుద్ధితో, పగతో చేసిన కల్పితమూ, అసత్యమూ కావచ్చు.

(2) సహాపరాధి ఇచ్చినసాక్ష్యాన్ని అడ్డుపరీక్ష చేస్తారు కానీ నేరం ఒప్పుకోలును చేయరుగనుక నేరం ఒప్పుకోలును సహాపరాధి సాక్ష్యం కంటే విలువయినదిగా పరిగణించకూడదు. సహాపరాధి ఇచ్చిన సాక్ష్యాన్ని బలపరచటం అవసరమయితే నేరం ఒప్పుకోలుకు కూడా అది అవసరం.

## ముగింపు, అదంటూ వుంటే

**(a)** కేసుకు సంబంధించి మరే ఇతర సాక్ష్యం లేనట్లయితే, లేదా

(b) ఇతర సాక్ష్యం అనుమతి యోగ్యం కాకపోతే అటువంటి నేరం ఒప్పుకోలు ఒక్కటే నేర నిర్ణయాన్ని చెల్లేదిగా అంగీకరించదు. దానిని బలపరచటం అవసరం.

ఒకవేళ కొందరు వ్యక్తులు ఒకే వ్యవహారానికి సంబంధించిన ఒకేరకమైన నేరాలు చేసినట్లుగా ఆరోపించబడినప్పుడు ఒకరు చేసిన నేరం ఒప్పుకోలు ఇతరులకు వాడవచ్చు.

అతడు చేసిన చర్యలు అతని సహాపరాధి చేసిన చర్యలకు భిన్నంగా ఉన్నా, తద్వారా అతడి నేరం అతని సహాపరాధి నేరం కంటే భిన్నంగా ఉన్నా కూడా ఈ పని చేయడానికి వీలవుతుంది.

8 బొంబాయి 223: 7 మద్రాసు 579

## నేరం నిర్మూలన అదే నేరం

1. 'చేయబడిన', 'రుజువు చేయబడిన' అనే పదాల ప్రాముఖ్యం. విచారణ జరిగేటప్పుడు ఒక నిందితుడు తనను నేరంలో ఇరికించే విధంగానూ, మరొక సహనిందితుడికి ఆ కేసుతో సంబంధం కలుగజేసేదిగానూ చేసిన ప్రకటన ఈ సెక్షన్ ఉంటుందా?

## ఉండదనేది సమాధానం

'విచారణ జరిగేటప్పుడు' అనే పదాలు 'చేసిన' అనే పదం తర్వాత చేర్చి, 'నమోదు చేయబడిన' అనే మాటను 'రుజువు చేయబడిన' అనే పదానికి బదులుగా వాడి ఈ సెక్షన్‌ను అర్థం చేసుకోకూడదు.

(1890) 14 MO. Jur. N.S. 516

ఈ సెక్షన్ విచారణ జరిగేటప్పుడు చేసిన ప్రకటనలకు సంబంధించినది కాదు. ఇది ముందుగా చేయబడి, విచారణలో నిరూపించబడిన ప్రకటనలకు సంబంధించినది. 'నేరం ఒప్పుకోలును నిరూపించటం' అనే పదం న్యాయాధిపతి ప్రశ్నలు అడగటం, నిందితుడు వివరణ ఇవ్వటం వంటి పద్ధతికి వర్తించదు.

45 అలహాబాద్ 323

## 2. 'సంయుక్త విచారణ' ప్రాముఖ్యం

దీనికి సంబంధించి రెండు ముఖ్య ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి - ఒక నిందితుడు నేరం ఒప్పుకోలు చేస్తాడు. ఆ ఒప్పుకోలులో ఒక సహనిందితుడికి నేరంలో భాగమున్నట్లు చేస్తాడు. నేరం చేసినట్లు ఒప్పుకుంటాడు.

(i) అటువంటి సందర్భంలో అతని నేరం ఒప్పుకోలు ఈ సెక్షన్ కింద అతని సహనిందితులకు కూడా వర్తింపచేయటం వలన అతడు మిగిలిన వారితో కలిసి సంయుక్తంగా విచారింపబడినట్లుగా పరిగణింపబడతాడా?

(2) అటువంటి సందర్భంలో నేరం చేసినట్లు ఒప్పుకొంటున్న నిందితుడు నేరం ఒప్పుకోని ఇతరులకు సాక్షిగా పరిగణింపబడతాడా?

ప్రశ్న 1. అతడు సంయుక్త విచారణకు లోనుకాకపోవటం వలన అతని సాక్ష్యాన్ని పరిశీలనకు తీసుకోవటం జరగదు.

5 బొంబాయి 63, 7 మద్రాసు 102, 19 బొంబాయి 195

నేరం ఒప్పుకున్న నిందితుడ్ని శిక్షించకుండా విచారణ కొనసాగించే హక్కు కోర్టుకు ఉన్నా, నిందితుడు చేసిన నేరం ఒప్పుకోలు ఇతర నిందితులకు కూడా వర్తిస్తుంది కాబట్టి నిందితుడ్ని శిక్షించకుండా నిలిపివేయటమనేది అనుచితం కాదు.

23 అలహాబాద్ 53

ప్రశ్న II. ఇది 'నిందితుడు' అనే పద నిర్వచనం మీద ఆధారపడి వుంటుంది. ఒక నిందితుడు ఎప్పుడు నిందితుడు కాకపోతాడు?

నేరం ఒప్పుకున్న నిందితుడైన ఒక వ్యక్తి శిక్షపొందే వరకూ లేదా విముక్తుడయ్యే వరకూ నిందితుడిగానే పరిగణింపబడతాడు. కాబట్టి సహనిందితులకు సంబంధించి అతడు సమర్థుడయిన సాక్షి కాజాలదు. **13 C.W.M. 552** నేరం ఒప్పుకున్న నిందితుడైన ఒక వ్యక్తి శిక్షింపబడేవరకూ, లేదా జైలు శిక్ష అనుభవింపబడేవరకూ నిందితుడిగానే పరిగణింపబడతాడు. కాబట్టి సహనిందితులకు సంబంధించి అతడు సమర్థుడయిన సాక్షి కాజాలడు. **3 Bom. L.R.**

## సారాంశం

1. ఒక వ్యక్తి నేరం ఒప్పుకున్నట్లయితే అతడు సంయుక్త విచారణ నుంచి తొలగింపబడతాడే తప్ప నిందితుడు కాకుండా పోడు. అతను నేరం ఒప్పుకుంటూ చేసిన ఒప్పుకోలు ఇతర నిందితులకు వర్తింపచేయబడదు. దీనికి కారణం వారు సంయుక్తంగా విచారింపబడ్డ సహనిందితులు కాకపోవటమే. అతడు శిక్షపొందేవరకూ నిందితుడిగానే ఉంటాడు గనుక సాక్షిగా కూడా పరిగణింపబడడు.

2. ఒక వ్యక్తి నేరం ఒప్పుకున్నప్పుడూ, సంయుక్తంగా విచారింపబడినప్పుడూ, నిందితుడిగా

పరిగణింపబడనప్పుడు అతని ఒప్పుకోలు ఉపయోగపడదు కానీ అతడు అర్హుడయిన సాక్షిగా గుర్తింపబడతాడు.

# తీర్పుల సుసంగతం

## సెక్షన్ 40

కోర్టు దావాపై విచారణ జరపాలా, లేక విచారణ నిలిపివేయాలా అనేది సమస్య అయినప్పుడు కోర్టు దావాపై విచారణ జరపటాన్నిగానీ, విచారణను నిలిపివేయటాన్నిగానీ అప్పగిస్తూ ఏదైనా తీర్పు డిక్రీగాని, ఉత్తరువుగానీ ఉంటే అది సంబంధిత అంశమవుతుంది.

## వ్యాఖ్యానం

1. ఒక సివిల్ కోర్టును దావాపై విచారణ జరపకుండా నిలిపివేస్తూ ఉన్న పూర్వ తీర్పు డిక్రీనిగానీ ఉత్తరువుగానీ తెలిపే సూత్రం పౌరన్యాయకార్యస్మృతిలో పొందుపరచబడింది. అలాగే ఒక క్రిమినల్ కోర్టు విచారణ ఆపివేయటాన్ని నిరోధించే పూర్వ తీర్పును తెలిపే సూత్రం నేర శిక్షాస్మృతిలో పొందుపరచబడింది.

2. దీనికి సంబంధించి పౌరన్యాయ ప్రక్రియ చట్టం (సివిల్ ప్రొసీజర్ కోడ్) చెందిన సెక్షన్లు 11-14 క్షేత్రపుస్తకం 260వ పుటలో నిబంధనలు సంక్షిప్తం చేయబడినవి.

3. దీనికి సంబంధించిన విభాగం నేరప్రక్రియ చట్టంలోని సెక్షన్ 434

4. సెక్షన్ 40 ప్రకారం కోర్టును ముగించేదిగా ఉన్న తీర్పు సంబంధిత తీర్పు అవుతుంది.

5. అంటువంటి తీర్పు ఒకేరకమైన వివాదాలపై, ఒకేరకమైన కక్షిదారుల మధ్య చేయబడి ఉండాలి.

6. ఉభయపక్ష తీర్పు అపరిచితులను నిర్బంధించదు. ప్రొసీడింగులతో ఎటువంటి సంబంధంలేని అపరిచితుడ్ని ప్రొసీడింగులు నిర్బంధించలేవు అనేది ఈ సూత్రానికి ఆధారంగా ఉన్న నియమం.

## ఈ సూత్రానికి మినహాయింపులు

(1) సెక్షన్41 ఈ సూత్రానికి మినహాయింపులను శాసనం చేస్తుంది. ఒక సమర్థవంతమైన కోర్టు, ఈ క్రింది వాటికి సంబంధించి.

(i) వీలునామా ధ్రువపత్రం పరిధి

(ii) వైవాహిక పరిధి

(iii) నౌకాదళ పరిధి

(iv) దివాలా న్యాయస్థాన అధికార పరిధి

వాటికి శాసనిక స్వభావాన్ని ఆపాదిస్తూగానీ, తొలగిస్తూగానీ, లేదా, ఒక వ్యక్తికి ఒక వస్తువుపైగానీ, ఆస్తిపైగానీ హక్కు ఉందని నిర్ధారిస్తూగానీ చేసిన ఆఖరి తీర్పును పరిశీలనకు అనుమతిస్తుంది.

## వ్యాఖ్యానం

1. ఉభయపక్ష తీర్పు ప్రొసీడింగులకు ఏమాత్రం సంబంధం లేని వ్యక్తుల మధ్య జరిగిన ప్రొసీడింగులు కూడా అనుమతించబడుతాయి.

2. ఈ సెక్షన్ సర్వవర్తి తీర్పులకు సంబంధించి ఉంటుంది. కానీ ఆ మాట మాత్రం వాడబడలేదు. అన్ని తీర్పులూ ఉభయపక్ష తీర్పులే. కానీ కొన్ని ఉభయపక్ష తీర్పులు వ్యక్తివర్తి తీర్పులుకాగా మరికొన్ని సర్వవర్తి తీర్పులు. రెండూ ఉభయపక్ష తీర్పులే. ఈ సెక్షన్ సర్వవర్తి తీర్పులను నిర్వచించటానికి బదులు పేర్కొంటుంది.

3. దీని ఫలితంగా స్వభావాన్ని ఆపాదించే లేదా తొలిగించే ప్రతి తీర్పు అనుమతించబడదు. ఒక ప్రత్యేక పరిధికి సంబంధించి ఇవ్వబడిన తీర్పులే అనుమతియోగ్యాలవుతాయి.

ఉదా:- అపరిచితుల మధ్య దత్తత ఆమోదయోగ్యం కాదు. తీర్పే గణాంకాలను ప్రదత్తం చేసింది. కానీ అది పైన పేర్కొన్న ఏ పరిధిలోనూ లేకపోవటం వలన అనుమతించబడదు.

## II. మినహాయింపు సెక్షన్ 42

వ్యక్తివర్తి తీర్పు ప్రజలకు సంబంధించిన విషయానికి చెందినదయితే అది అపరిచితుల మధ్య కూడా ఉపయోగపడుతుంది.

## ప్రజా సంబంధిత విషయాలు

(1) ఆచారాలు

(2) నిర్ణీతాలు

(3) పన్నులు

(4) సరిహద్దులు

(5) జలమార్గ హక్కులు (Rights of Ferry)

(6) సముద్రపు సరిహద్దులు మొదలగునవి.

**III. మినహాయింపు సెక్షన్ 43:**

ఈ సెక్షన్ కింద వ్యక్తివర్తి తీర్పులు అపరిచితుల మధ్య కూడా ఈ క్రింది రెండు సందర్భాలలో ఆమోదయోగ్యాలవుతాయి.

(i) అటువంటి తీర్పు ఉనికి వివాదాంశమయినప్పుడు

(ii) తీర్పు సాక్ష్య చట్టంలోని మరొక నిబంధన ప్రకారం సంబంధించినదవుతుంది.

## వ్యాఖ్యానం

1. మొదటి పరిస్థితిని తేలికగా ఊహించవచ్చు.

<u>ఉదా:-</u>

(1) బి తాను దొంగ సంతకం చేసినట్లుగా ఆరోపించాడనీ, దానికి ఫలితంగా తాను శిక్ష అనుభవిస్తున్నాననీ, ఇది వట్టి అపవాదేనని ఎ బి పై దావా వేశాడు. బి అది అపవాదుకాదనీ, నిజమేననీ సమర్థించుకున్నాడు.

ఎ దొంగసంతకం పెట్టినట్లుగా నేర నిర్ణయం చేయటం వివాదాంశం. అతని నిర్దోషిత్వాన్ని బలపరుస్తూ చేసిన తీర్పు అనుమతించబడుతుంది. బి ఆ తీర్పుకు బాధ్యుడు కాదు.

(2) హామీదారు అసలు బాకీదారుపై దావా వేసినప్పుడు, అసలు బాకీదారు దానికి కక్షిదారుకాకపోయినా పెట్టుబడిదారు పొందిన హామీపై తీర్పు అనుమతించబడుంది.

3. న్యాయవిచారణ కార్యకలాపాలలో తప్పుడు సాక్ష్యం ఉద్దేశపూర్వకంగా ఇచ్చినందుకుగాను విచారణ జరిపేటప్పుడు న్యాయవిచారణ జరిగిందని చెప్పటానికి సాక్ష్యంగా రికార్డు ఉపయోగపడుతుంది.

2. రెండవ విషయంలోనే ఇబ్బందులు ఎదురవుతాయి. ఏఏ విభాగాల కింద ఒక తీర్పు సంబంధించినదవుతుంది?

సెక్షన్ 7 కింద - కారణం చూపు, సందర్భం

సెక్షన్ 8 కింద - ఉద్దేశ పూర్వక చర్య

సెక్షన్ 9 కింద - సంబంధిత చర్యలను వివరించటానికి అవసరమైన అంశాలు

సెక్షన్ 11 కింద - అసంగతంగా ఉన్న అంశాలు

సెక్షన్ 13 కింద - లావాదేవీలు

**3. రెండు ప్రశ్నలు**

I. తీర్పు అనేది ఒక ఘటనా?

II. తీర్పు అనేది ఒక వ్యవహారమా?

6 కలకత్తా 171 F.B.

**4. 6 కలకత్తా 171 పైది అంశమేనని వ్యాఖ్యానం.** P. 181

ఘటన (అంశం) (1) ఏదైనా వస్తువుల స్థితిగానీ, వాటి మధ్యగల సంబంధంగానీ ఇంద్రియాలతో గ్రహించగలిగేది.

(2) ఒక వ్యక్తికి తెలిసిన ఏదైనా మానసిక స్థితి.

**II. పత్రసాక్ష్యం**

ఈ సెక్షన్‌లో వ్యవహరించే విషయం

(1) ఒక పత్ర సాక్ష్యంలో చేసే ప్రకటనలకు రుజువు, అనగా పత్రంలోని విషయాలకు సాక్ష్యం. మౌఖిక సాక్ష్యం ఒక కక్షిదారు మౌఖికంగా చేసిన ప్రకటనల రుజువుకు సంబంధించినది.

(2) ఒక పత్రంలో పొందుపరచిన విషయానికి సంబంధించి ఉత్తమ సాక్ష్య నియమానికి గల ఆవశ్యకాలు ఏవి? దీనికి రెండు ఆవశ్యకాలు ఉన్నాయి.

(i) కొన్ని కేసులకు సంబంధించి సాక్ష్యం పత్రరూపంలో ఉండాలిగానీ మౌఖికంగా ఉండకూడదు.

(ii) సాక్ష్యం పత్రరూపంలో ఉన్న సందర్భాలలో సాక్ష్యం ప్రాథమిక సాక్ష్యమై ఉండాలి.

సాక్ష్యం పత్రరూపంలో ఉన్న సందర్భాలు

1. చాలా విషయాలు పత్రరూపంలోనే ఉంటాయి. విషయాలు పత్రరూపంలో ఉండటం వలన అటువంటి ప్రతి కేసులో విషయాలు పత్రసమర్పణ ద్వారానే రుజువు చేయబడాలని చట్టం ఆశించదు. కొన్ని మౌఖిక సాక్ష్యం ద్వారా, మరికొన్ని పత్రసాక్ష్యం ద్వారా రుజువు చేయబడతాయి.

2. ఈ ప్రయోజనార్థం భారతీయ సాక్ష్య చట్టం ఈ క్రింది విభజనను చేస్తుందని గమనించటం ఆవశ్యకం.

(1) విక్రయ స్వభావం ఉన్న పత్రాలకూ, లేని పత్రాలకూ మధ్య

(2) చట్ట ప్రకారం వ్రాతపూర్వకంగా ఉండవలసిన వ్యవహారాలకూ, వ్రాతపూర్వకంగా ఉండనవసరంలేని వ్యవహారాలకూ మధ్య

3. విక్రయం జరిగేవి, విక్రయం జరగనివి

విక్రయం అంటే కక్షిదారులు తమ కాంట్రాక్టులు, గ్రాంటులు మొదలగు హక్కులను విక్రయించటంతో కూడుకున్న వ్యవహారాలు. విక్రయింపు లేనివంటే హక్కుల విక్రయం జరగని వ్యవహారాలు.

4. సాక్ష్యచట్టంలో పొందుపరచబడిన సూత్రం రెండు విధాలుగా ఉంటుంది.

(i) పత్రం విక్రయ పత్రం అయినప్పుడూ, చట్టం వ్రాతపూర్వకంగా ఉన్న పత్రాలనే అనుమతించే విషయమైనప్పుడు విషయాన్ని రుజువుచేస్తూ పత్రం తప్ప మరే సాక్ష్యం అనుమతించబడదు. మరో విధంగా చెప్పాలంటే అటువంటి కేసులలో మౌఖిక సాక్ష్యాన్ని పత్రసాక్ష్యానికి బదులుగా వాడటానికి వీలుండదు. కానీ పత్రం విక్రయపత్రం కాని సందర్భాలలోనూ, లేదా విక్రయం చట్ట ప్రకారం వ్రాతపూర్వకంగా ఉండనవసంలేని సందర్భాలలోనూ విషయానికి సంబంధించిన లావాదేవీలన్నీ వ్రాతపూర్వకంగానే ఉన్నా మౌఖిక సాక్ష్యం కూడా విషయాన్ని రుజువు పరచటానికి అనుమతించబడుతుంది.

(ii) కానీ వ్యవహారం విక్రయ పత్రానికి సంబంధించినదయినప్పుడూ లేదా చట్ట ప్రకారం వ్రాతపూర్వకంగా ఉండవలసిన వ్యవహారమయినప్పుడూ, మౌఖిక సాక్ష్యం పత్రసాక్ష్యానికి బదులుగా వాడబడదు. అంతేకాక మౌఖిక సాక్ష్యాన్ని పత్రంలో పేర్కొనబడిన అంశాలను మార్చటానికిగానీ, ఖండించటానికి గానీ, సరిదిద్దటానికి గానీ వాడటానికి వీలుండదు.

5. ఈ సూత్రం సెక్షన్లు 91 - 92లలో పొందుపరచబడింది. సెక్షన్లు 91 - 92 లలో పొందుపరచబడిన నియమానికి మినహాయింపులు.

1. ఈ నియమానికి మినహాయింపులున్నాయి. అవి కొన్ని తరగతులుగా ఉంటాయి. వాటిని వేర్వేరుగా పరిగణించాలి. ఒక తరగతికి చెందినవి మౌఖిక సాక్ష్యాన్ని పత్ర సాక్ష్యానికి బదులుగా వాడవచ్చా, లేక అవే సమస్యకు సంబంధించిన కేసులకు వర్తిస్తాయి. రెండవ తరగతికి చెందినవి సూత్రం ప్రకారం సాక్ష్యం పత్రరూపంలో ఉండాలన్నప్పుడు మౌఖిక సాక్ష్యాన్ని పత్ర సాక్ష్యానికి బదులుగా కాక దానిలో మార్పులు చేయటానికి అనుమతింప వీలుందా అనే సమస్యకు సంబంధించిన కేసులకు వర్తిస్తాయి.

మౌఖిక సాక్ష్యాన్ని పత్రసాక్ష్యానికి బదులుగా వాడటాన్ని అనుమతించే మినహాయింపులు

1. ఇవి సెక్షన్ 91లో పొందుపరచబడ్డాయి. ఇవి ఈ క్రింది కేసులను ప్రస్తావిస్తాయి.

(i) ప్రభుత్వాధికారి నియామకం

(ii) వీలునామాను రుజువుచేసే ధ్రువపత్రం

మౌఖిక సాక్ష్యానికి పత్రంలోని షరతులను మార్చటానికి అనుమతినిచ్చే మినహాయింపులు

1. ఇవి సెక్షన్ 92లో పొందుపరచబడ్డాయి. ఇవి ఈ క్రింది కేసులను ప్రస్తావిస్తాయి.

2. మొదటగా గమనించవలసిన విషయం అటువంటి సాక్ష్యం పత్రానికి కక్షిదారులు కాని వ్యక్తులు గానీ, పత్ర కక్షిదారులచే నియమింపబడని ఆస్తిలో ప్రయోజనం లేని ప్రతినిధులచే గానీ ఇవ్వబడవచ్చు.

3. పత్రానికి సంబంధించిన కక్షిదారులుగానీ, వారిచే నియమింపబడిన ఆస్తిలో ప్రయోజనం పొందే ప్రతినిధులుగానీ మౌఖిక సాక్ష్యం ఈ క్రింది సందర్భాలలో ఇవ్వవచ్చు:-

(i) ఒక పత్రాన్ని రద్దుచేసే అంశాలు. ఉదా- మోసం, సామర్థ్యలోపం.

(ii) పత్రంలో నిర్లక్ష్యం చేయబడిన అంశం. ఈ అంశం దానికి సంబంధించిన షరతులతో అసంగతంగా లేదు.

(iii) ముందుగా ఉన్న షరతు

(iv) తర్వాత చేయబడిన మౌఖిక ఒప్పందం

(v) ఆచార వ్యవహారాల ద్వారా ఒడంబడికకు ముడిపడి ఉన్న సంఘటనలు

అది అసంగతం కాకుండా ఉన్నప్పుడు మాత్రమే ఇది వీలవుతుంది.

(vi) భాష ఏవిధంగా ఆచరణలోనున్న అంశాలకు సంబంధించబడి ఉన్నదో తెలిపే అంశాలు.

## మౌఖిక సాక్ష్యం పత్రసాక్ష్యాన్ని వివరించటానికి అనుమతించబడే సందర్భాలు

పత్రసాక్ష్యానికి సంబంధించిన ఉత్తమ సాక్ష్య ప్రథమ నియమం నుంచి రెండు శాసన ప్రతిపాదనలు ఉత్పన్నమవుతాయి.

1. పత్రంలో పొందుపరచబడిన వ్యవహారం విక్రయ స్వభావం లేనిదయినప్పుడు లేదా చట్టం ప్రకారం వ్రాతపూర్వకంగా ఉండనవసరంలేనిదయినప్పుడు వ్యవహారంలో నున్న అంశాన్ని మౌఖిక సాక్ష్యం ద్వారా రుజువు చేయవచ్చు.

2. కానీ ఆ వ్యవహారం విక్రయ స్వభావం కలిగినదయినప్పుడు, లేదా చట్టం ద్వారా లిఖితపూర్వకంగా ఉండాలని శాసించబడినప్పుడూ మౌఖిక సాక్ష్యాన్ని పత్రంలోని వ్యవహారానికి సంబంధించిన షరతులను రుజువు చేయటానికి గానీ, ఖండించటానికి గానీ, మార్చటానికి గానీ, లేదా సవరణ చేయటానికి గానీ ఇవ్వకూడదు.

3. అయితే ఒక ప్రశ్న మిగులుతుంది. మౌఖిక సాక్ష్యాన్ని పత్రసాక్ష్యాన్ని వివరించటానికి ఇవ్వవచ్చా? ఇది ప్రత్యేకమైన ప్రశ్న. అందుచే దీనిని పత్రసాక్ష్యంలోని షరతులను మార్చటానికిగానీ, ఖండించటానికి గానీ సాక్ష్యం ఇవ్వవచ్చా అనే ప్రశ్న నుంచి వేరుపరచవలసి ఉంటుంది.

4. సెక్షన్ 93-100 లలో ఈ ప్రశ్న విచారించబడింది.

5. పత్రసాక్ష్యంతో వ్యవహరించేటప్పుడు వివాదాలు మూడు వ్యాజ్యాంశాలకు సంబంధించి తలెత్తవచ్చు.

(i) అమలులోనున్న అంశాలకు పత్రంలోని భాష వర్తిస్తుందా, లేదా అనే విషయంపై వివాదాలు

(ii) పత్రాలలో వాడబడిన భాష అస్పష్టంగా, లోపభూయిష్టంగా ఉన్న సందర్భాలలో పత్రాల భావానికి సంబంధించి తలెత్తిన వివాదాలు

(iii) పత్రంలో వాడబడిన పదాల అర్థాలకు సంబంధించి తలెత్తిన వివాదాలు

1. మొదటి తరహాకు చెందిన వివాదాలకు సంబంధించి మూడు సందర్భాలు ఉంటాయి.

(1) భాష కచ్చితంగా అంశాలకు వర్తించినప్పుడు. ఇక్కడ వాదన అది వర్తించటానికి ఉద్దేశింపబడకపోవటం. ఈ వాదనను బలపరచటానికి అది ఆచరణలో నున్న అంశాలకు వర్తించటానికి ఉద్దేశింపబడలేదని తెలియజేస్తూ సాక్ష్యం ఇవ్వలేకపోవచ్చు - సెక్షన్ 94.

(2) భాష ఆచరణలోనున్న అన్ని అంశాలకూ కాక ఒక అంశానికి మాత్రమే వర్తించినప్పుడు - ఇక్కడ వాదన అది ఒక ప్రత్యేకించబడిన అంశానికి వర్తిస్తుంది - ఏ ప్రత్యేక అంశానికి వర్తించేలా అది ఉద్దేశింపబడిందో తెలియజేస్తూ ఈ వాదనను బలపరచటానికి సాక్ష్యం ఇవ్వవచ్చు - సెక్షన్ 95

(3) భాషలో కొంత ఒక తరగతికి చెందిన అంశాలకు, మరికొంత మరో తరగతికి చెందిన అంశాలకు వర్తిస్తున్నప్పుడు, భాష సంపూర్ణంగా ఏ అంశాలకూ వర్తించని సందర్భాలు. ఇక్కడ వాదన అది ఒక తరగతికి మాత్రమే వర్తించాలనేది.

రెండింటిలో ఏ తరగతి అంశాలకు మాత్రమే వర్తించాలో తెలుపుతూ వాదనను బలపరచటానికి సాక్ష్యాన్ని ఇవ్వవచ్చు - సెక్షన్ 95

1. రెండవ తరహాకు చెందిన వివాదాలకు సంబంధించి రెండు సందర్భాలున్నాయి.

(i) భాష అస్పష్టంగానూ, లోపభూయిష్టంగాను ఉన్నప్పుడు. ఇక్కడ వాదన కక్షిదారులు ఒక స్పష్టమైన విషయాన్ని ఉద్దేశించారనేది. ఈ వాదనను బలపరచటానికి పత్రంలోని భావాన్ని తెలుపుతూ కాని, అందులోనున్న లోపాలను సవరిస్తూగానీ సాక్ష్యం ఇవ్వకూడదు - సెక్షన్ 93

(ii) భాష స్పష్టంగానే ఉన్నా అమలులోనున్న అంశాలకు సంబంధించి అది అర్థరహితంగా ఉన్నప్పుడు. ఇక్కడ వాదన అది ఒక ప్రత్యేక విషయాన్ని తెలియజేయటానికి నిర్దేశించబడినదనేది. ఈ వాదనను బలపరచటానికి ఏ అర్థం ఉద్దేశింపబడిందో తెలియజేస్తూ సాక్ష్యం ఇవ్వవచ్చు - సెక్షన్ 95.

3. మూడవ తరహాకు చెందిన వివాదాలకు సంబంధించి ఈ క్రింద పేర్కొన్న కేసు తలెత్తుతుంది.

(i) ....

(వ్రాత ప్రతిలో స్థలం ఖాళీగా వదిలివేయబడింది - సం.)

## II. ఒక పత్రంలోని విషయాలను రుజువు చేసేదెలా?

1. ఒక పత్రంలోని విషయాలను రుజువు చేయటానికి సంబంధించి ఉత్తమ సాక్ష్య నియమానికి అవసరమయిన ఆపేక్షితాలు ఏవి?

2. సాక్ష్య చట్టం ప్రకారం ఈ విషయంలో రెండు ఆపేక్షితాలున్నాయి.

(i) ఒక పత్రంలోని విషయాలు ప్రధాన సాక్ష్యం ద్వారా రుజువు చేయబడాలి.

(ii) పత్రం అసలయినదిగా రుజువు చేయబడాలి.

ప్రధాన సాక్ష్యమనగా కోర్టు పర్యవేక్షణార్థం తయారు చేయబడిన పత్రమే.

## వివరణ

(వ్రాత ప్రతిలో స్థలం ఖాళీగా వదిలివేయబడింది - సం.)

పత్రం అసలయినదేనని నిరూపించటమెలా? పత్రాలను రెండు వర్గాలుగా విభజిస్తుంది. (1) బహిరంగ పత్రాలు (2) ప్రైవేట్ పత్రాలు.

2. బహిరంగ పత్రం సెక్షన్ 74లో నిర్వచించబడింది.

3. సెక్షన్ 75 బహిరంగ పత్రం కాని ఏ పత్రమైనా ప్రైవేటు పత్రమేనని ప్రకటిస్తుంది.

4. పత్రం బహిరంగ పత్రమా, లేక ప్రైవేటు పత్రమా అనే దానిని బట్టి పత్రాల వాస్తవికతను నిరూపించే నియమాలు కూడా మారతాయి.

5. బహిరంగ పత్ర వాస్తవికతను నిరూపించే పద్ధతి సెక్షన్ 76-78 లలో చెప్పబడినది.

6. ప్రైవేట్ పత్ర వాస్తవికతను నిరూపించే పద్ధతి సెక్షన్ 67-75 లలో పేర్కొనబడినది.

7. ప్రైవేట్ పత్రాలను రుజువు చేయటానికి సాధారణంగా అసలు దస్తావేజును, చేతి వ్రాతకూ, సంతకానికీ, వ్రాయడానికీ సాక్ష్యాలు జతపరచి కోర్టులో ప్రవేశపెట్టవలసి ఉంటుంది. దీనికి ఒక మినహాయింపు ఉంది. అది వీలునామాను ధ్రువపత్రంలో రుజువు చెయ్యవచ్చు.

8. బహిరంగ పత్రాల వాస్తవికతను సెక్షన్77 ప్రకారం ధ్రువపరచిన ప్రతులు చూపించటం ద్వారా గానీ, లేదా అవి సెక్షన్ 78లో పేర్కొనటువంటి పత్రాలయినప్పుడు ఆ విభాగంలో పేర్కొనబడిన వివిధ పద్ధతుల ద్వారా గానీ నిరూపించవచ్చు.

9. ఒక దస్తావేజు వాస్తవికతకు సంబంధించి అది బహిరంగ పత్రమయినా లేక ప్రైవేటు పత్రమయినా సాక్ష్య చట్టం కొన్ని పురోభావనలను ప్రవేశపెట్టింది. ఇది సెక్షన్ 79-90 లలో పొందుపరచబడ్డాయి. అయితే ఈ పురోభావనలు నిశ్చయాత్మక పురోభావనలు కావు.

10. ఈ పురోభావనలు ఈ క్రింది వర్గాలుగా విభజింపబడ్డాయి-

(1) కోర్టు భావించేవి 79-85, 89.

(2) కోర్టు భావించటానికి అవకాశమున్నవి 86-88, 90

## ప్రాథమిక సాక్ష్యం వర్తించకుండా పోయినప్పుడు ఒక దస్తావేజులోని విషయాలను నిరూపించటమెలా?

**1. సహాయక సాక్ష్యం ద్వారా.**

(వ్రాత ప్రతిలో స్థలం ఖాళీగా వదిలివేయబడింది - సం.)

సహాయక సాక్ష్యం అంటే ఏమిటి?

(వ్రాతప్రతిలో స్థలం ఖాళీగా వదిలివేయబడింది- సం.)

# నిరూపణ భారం

1. ఏ వ్యక్తిపైనయితే రుజువు చేసే భారం మోపబడిందో ఆ వ్యక్తే ఆ భారాన్ని అమలుపరచాలని కోర్టు నిర్దేశిస్తుంది.

2. రుజువు చేసే భారాన్ని అమలు పరచటంలో ఈ క్రింది విషయాలు దృష్టిలో పెట్టుకోవాలి:-

(i) కొన్ని విషయాలకు రుజువు అవసరం లేదు.

(ii) మరికొన్ని విషయాలకు రుజువు అనుమతించబడదు.

3. (i) కింద నిరూపణ భారం మోపబడిన వ్యక్తి పని తేలికవుతుంది.

(ii) కింద అతని పని మరింత కష్టతరమవుతుంది.

### నిరూపణ భారం

## (i) చట్టప్రకారం రుజువు అవసరం లేని విషయాలు

1. చట్టప్రకారం రుజువు అవసరంలేని విషయాలను ఈ క్రింది మూడు రకాలుగా విభజించవచ్చు

(a) న్యాయస్థానంచే ప్రకటించబడిన విషయాలు

(b) కక్షిదారులచే అనుమతించబడిన విషయాలు

(c) చట్టంచే ఉనికి పురోభావన చేయబడిన విషయాలు

## న్యాయస్థానంచే ప్రకటించబడిన విషయాలు

1. సెక్షన్లు 56, 57 లు న్యాయస్థానంచే ప్రకటించబడిన అంశాలకు సంబంధించి ఉంటాయి. సెక్షన్ 57 న్యాయస్థాన నోటీసు అవసరమయిన 13 విషయాలను పేర్కొంటుంది.

సెక్షన్ 56 ప్రకారం కోర్టు న్యాయస్థాన నోటీసు తీసుకున్న ఏ అంశాన్నయినా సాక్ష్యంతో రుజువు పరచవలసిన అవసరం లేదు. కక్షిదారులకు సెక్షన్ 57 పరిధిలోకి వచ్చే ఏ అంశాన్నయినా రుజువు చేయటానికి సాక్ష్యాన్ని ప్రవేశపెట్టే భారం ఉండదు.

2. ఈ సెక్షన్‌లకు పునాదిగా ఉన్న సూత్రాలు:- కొన్ని విషయాలు బాగా పేరుమోగినవీ, స్పష్టంగా నిర్ధారించబడినవి కావటం వలన వాటిని సాక్ష్యం ద్వారా రుజువు చేయాలని పట్టుబట్టటం అనవసరం.

ఉదా.

1. విరోధాలు ప్రారంభం కావటం, కొనసాగటం

2. దేశ భౌగోళిక విభజనలు

ఈ అంశాలు బాగా తెలిసినవే కావటం వలన వాటిని సాక్ష్యరూపేణా నిరూపించటం అనవసరం.

3. సెక్షన్ 57లో పేర్కొనబడిన అంశాలు

## (1) చట్టబలం ఉన్న అంశాలు

స్థానిక ప్రభుత్వానికి చట్టంలో పొందుపరచిన సూత్రాలను అమలుపరచటానికీ, ఆ సూత్రాలకు చట్టబలం ఉన్నదని ప్రకటించటానికి అనేక చట్టాలు ఒక విభాగానికి సర్వాధికారాలను ఇస్తాయి.

ఉదా. భారత ప్రభుత్వ చట్టంలో ఏర్పాటుచేయబడ్డ నియమాలు. అటువంటి సూత్రాలు ఈ విభాగం పరిధిలోకి వస్తాయి.

2. చట్టబలం ఉన్న సూత్రానికీ, ఆ సూత్రానికి ఆధారభూతమైన ఆచారానికీ మధ్య భేదాలను గమనించాలి. హిందూ చట్టం చాలావరకు ఆచారంపైనే ఆధారపడి వుంటుంది. కానీ కోర్టు ఒక ఆచారాన్ని న్యాయస్థాన పరిశీలనకు తీసుకోదు. ఒక ఆచారంపై ఆధారపడిన కక్షిదారు ఆ ఆచారం ఉన్నట్లుగా రుజువు చేయవలసి ఉంటుంది. అలా రుజువు చేసినప్పుడు కోర్టు అది మాన్యమైన ఆచారం అనే నిర్ణయానికొచ్చినప్పుడు మాత్రమే దానిని అమలుపరుస్తుంది.

3. అయితే రుజువు చేయటానికి కోర్టుకు సాక్ష్యం అక్కరలేని ఆచారాలు కూడా కొన్ని ఉన్నాయి. కాని దానికి కారణం కోర్టు న్యాయస్థాన నోటీసును పరిగణించటం కాదు. కోర్టుకు ముందు జరిగిన ఉదాహరణ ఉండటం వలన రూపగత రుజువు అవసరం లేదు. ఒక ఆచారానికి సంబంధించి దాని ఉనికి, మాన్యత ఒక కోర్టు అంతకు పూర్వమే తీసుకున్న నిర్ణయంలో గుర్తించినట్లయితే దాని కింది కోర్టు ఆచారాన్ని సమర్థిస్తుంది.

### ii. శాసనాలు

పార్లమెంటుచే జారీచేయబడిన శాసనాలు సాధారణమైనవిగాగానీ, ప్రత్యేకమైనవిగాగానీ ఉంటాయి.

ఒక సాధారణ శాసనం వినియోగంలో సార్వత్రికంగా ఉండి అందరికీ, అన్ని ప్రాంతాలకూ వర్తిస్తుంది.

ఒక ప్రత్యేక శాసనం ప్రాంతీయంగాగానీ, వ్యక్తిగతంగాగానీ ఉండి ప్రత్యేక వ్యక్తులకుగానీ, ప్రైవేటు సంస్థలకు గాని వర్తిస్తుంది.

2. పార్లమెంటు శాసనాలన్నీ వేరుగా చెప్పబడకపోతే ప్రభుత్వపరమైనవిగానే భావించబడతాయి - 14 Vict. C. 21లోని సెక్షన్ 13.

3. అన్ని ప్రభుత్వ శాసనాలకూ న్యాయస్థాన నోటీసు తీసుకోవలసి ఉంటుంది. కోర్టు ప్రైవేట్ శాసనాలకు ఆ శాసనంలో కోర్టు న్యాయస్థాన నోటీసు తీసుకోవల్సిందిగా ఆదేశం ఉంటేతప్ప న్యాయస్థాన

నోటీసు తీసుకోదు. అటువంటి ఆదేశం లేకపోయినట్లయితే కక్షిదారు తాను నమ్మిన ప్రైవేట్ శాసనం పార్లమెంటు శాసనాలలో ఒకటేనని రుజువు చేయవలసి ఉంటుది.

## (iii) భారతీయ యుద్ధ నిబంధనావళి

ఇవి స్థానిక అధికారులకూ, సైనికులకూ, ఇతర వ్యక్తులకూ మహాప్రభువు భారతీయ సైనిక దళంలో పేర్కొనబడిన క్రమశిక్షణా నియమాలు. ఇవి భారతీయ సైనిక చట్టం 1911లో పొందుపరచబడ్డాయి.

## (iv) పార్లమెంటు, రాజ్యసభ కార్యకలాపాల సరళి

1. కార్యకలాపాల సరళిని కార్యకలాపాల నుంచి వేరుచేయాలి.
2. కోర్టు కార్యకలాపాల సరళిని న్యాయస్థాన నోటీసుగా తీసుకుంటుంది గాని కార్యకలాపాలను మాత్రం తీసుకోదు.

## విదేశీ రాజ్యం

కోర్టు ఒక విదేశ రాజ్యం రాజుచేగానీ, రాజ్యసభ గవర్నర్ జనరల్‌చేగానీ గుర్తించబడినా, లేకపోయినా కూడా న్యాయస్థాన నోటీసు తీసుకుంటుంది.

# యుద్ధ పరిస్థితి

విదేశీ రాజ్యాల మధ్య ఏర్పడిన యుద్ధ పరిస్థితి న్యాయస్థాన నోటీసు పొందదు.

**భూమిమీదగానీ, సముద్రంపై గానీ రోడ్డుకు సంబంధించిన నియమాలు**

1. న్యాయస్థాన నోటీసు తీసుకోవలసిన విషయాలకు కొన్ని పరిస్థితులలో న్యాయస్థాన నోటీసును తీసుకోటానికి కోర్టు తిరస్కరించవచ్చు.

2. కోర్టు న్యాయస్థాన నోటీసు తీసుకోటానికి వీలుగా కక్షిదారు అవసరమైన విషయాన్ని తప్పనిసరిగా దాఖలు చేయవలసి ఉంటుంది.

ఉదా:- కోర్టు ఒక అధికార ప్రకటనకు న్యాయస్థాన నోటీసు తీసుకోవాలంటే కక్షిదారు రాజపత్రాన్ని దాఖలు చేయవలసి ఉంటుంది.

## నిరూపణ పద్ధతి

1. రుజువు పద్ధతికి సంబంధించిన సాధారణ నియమాన్ని ఈ క్రింది విధంగా పేర్కొనవచ్చు.

## చట్ట ప్రకారం సాక్ష్యం ఇచ్చే వ్యక్తి:-

(i) కోర్టులో హాజరయి ఉండాలి.

(ii) సాక్షిగా ఉండటానికి న్యాయపరంగా అర్హుడై ఉండాలి.

(iii) ప్రమాణంగానీ, ప్రతిజ్ఞగానీ చేసి ఉండాలి.

(iv) క్రమబద్ధ పరిశీలనా సరళిలో ఉండాలి.

(v) అంశాలకు సంబంధించి ప్రతివాదానికి గురిచేయబడాలి.

(vi) ప్రామాణికతకు సంబంధించి అవిశ్వాసానికి గురిచేయబడాలి.

## 1. కోర్టుకు హాజరుకావటం

1. సరియైన న్యాయపాలనకు అవసరమయిన అంశాలకు సంబంధించి తమకు తెలిసిన సమాచారాన్ని అందించటానికి పౌరులకు కోర్టులో హాజరు కావలసిన బాధ్యత ఉంది. సాంప్రదాయిక ధర్మం ప్రారంభ కాలం నుంచే ఈ బాధ్యతను గుర్తించి అమలు పరుస్తున్నది.

2. సాక్ష్యులు కోర్టులో హాజరుకావాలని ఒత్తిడిచేసే హక్కు సాధారణ న్యాయకోర్టుకు దాని పరిధిలోనే లభ్యమయ్యే హక్కు. శాసనాలు ఈ అధికారాన్ని మధ్యవర్తుల వంటి ఇతర అధికారలకు కూడా ప్రదత్తం చేస్తాయి. ఏ దావానైనా విచారించి నిర్ధారించే హక్కు ఉన్న ఏ కోర్టయినా సాంప్రదాయిక ధర్మం ద్వారా వివాదాంశాలున్నప్పుడు అవసరమైన రుజువును కోరే స్వతస్సిద్ధాధికారాన్ని, ఈ విషయమై సాక్ష్యులను కోర్టుకు పిలిపించటానికి, హాజరు కావాలని నిర్దేశించటానికి తగిన అధికారాన్ని కలిగి యుంటుంది.

3. తగిన కోర్టు హాజరు సమను అందిన తర్వాత కూడా హాజరు కావటానికి, సాక్ష్యమివ్వటానికి బుద్ధిపూర్వకంగా ఉపేక్షించటం, పౌరసంబంధ కేసులలో సాక్షి రుసుము కట్టేంతర్వాత దానిని పరిత్యజించటం కోర్టు ధిక్కారమవుతుంది.

4. సాక్ష్య చట్టంలో సాక్ష్యులు హాజరవ్వాలని కానీ, దస్తావేజులు సమర్పించాలని కానీ బలవంత పెట్టే

పద్ధతి పేర్కొనబడలేదు. ఇది పౌర, నేర ప్రక్రియ చట్టాల్లో పొందుపరచబడివున్నది.

5. ఈ క్రింది విషయాలను దేశంలోగల పౌర, నేర ప్రక్రియ చట్టాలు పొందుపరచాయి.

(i) సాక్ష్యులను సమను చేయటం :

(C.P.C.) పౌర న్యాయ ప్రక్రియ చట్టం . O. XII
(Cr.P.C.) నేర న్యాయ ప్రక్రియచట్టం 68-74 (సమనులు)
90-93 (పద్ధతికి చెందిన ఇతర నియమాలు)
328 (జూరీ సభ్యునికీ, నిర్ధారకునికీ సమనులు)
244 (సమన్ను కేసులలో కోర్టు వ్యవహార పత్రాల జారీ)
254 (వారంటు కేసులలో కోర్టు వ్యవహార పత్రాల జారీ)
256 (వారంటు కేసులలో కోర్టు వ్యవహార పత్రాల జారీ)
257 (వారంటు కేసులలో కోర్టు వ్యవహార పత్రాల జారీ)
540 (హాజరయిన వ్యక్తిని పరీక్షించటానికి గట్టి సాక్షిని సమనుచేయు అధికారం)

(ii) దస్తావేజులు, ఇతర వస్తువులు దాఖలు చేయటం

(C.P.C.) పౌర న్యాయ ప్రక్రియ చట్టం O.XVI
(Cr.P.C.) నేర న్యాయ ప్రక్రియ చట్టం 94, 95 (దస్తావేజులుగానీ ఇతర వస్తువులుగానీ దాఖలు చేయమని సమను చేయటం)
96-99 (సోదా వారంటులు)
485 (దాఖలు చేయటానికి నిరాకరించినప్పుడు ఏర్పడే పరిణామాలు)

(iii) సాక్షుల ఖర్చులు : పౌర న్యాయ ప్రక్రియ చట్టం O.XVI, R. 2-4
నేర న్యాయ ప్రక్రియ చట్టం 244, 257

(iv) నేర సంబంధ కేసులలో పోలీసు అవరోధాల నుంచి ఫిర్యాదుదారుల, సాక్షుల విముక్తి
నేర న్యాయ ప్రక్రియ చట్టం. 171

(v) నేర కార్యకలాపాలలో ఫిర్యాదుదారుల, సాక్షుల హాజరుకు గుర్తింపు
నేర న్యాయ ప్రక్రియ చట్టం. 217, 170
గమనిక- ఇది పౌరసంబంధ కేసులలో పొందుపరచబడలేదు.

(vi) పౌర విచారణ కింద అరెస్టు నుంచి సాక్షులను మినహాయించటం.
పౌర న్యాయ ప్రక్రియ చట్టం ఎస్.135

గమనిక- నేర విచారణ కింద రక్షణ కల్పించబడలేదు.

6. ఒక సాక్షిని సమను చేయటానికే కాక, అతను హాజరు కావాలని బలవంతపెట్టే-సదుపాయం కూడా ఉంది.

(1) సమను చేయబడిన వ్యక్తి దానిని ధిక్కరించి కోర్టుకు హాజరు కాకపోతే అది సెక్షన్ 174, 175, ఐ.పి.సి. కింద నేరమవుతుంది.

(2) అలా సమను చేసినప్పుడు హాజరుకాని పక్షంలో సెక్షన్లు 75-86 ల ప్రకారం అరెస్టు వారంటులు, నేర ప్రక్రియ చట్టంలోని సెక్షన్లు 87-89ల ప్రకారం ప్రకటనా, జప్తు చేయటం చేయవచ్చు.

(3) సాక్షికోర్టుకు హాజరుకాకపోతే సెక్షన్26 (చట్టంXIX, 1853 - ఇది బెంగాలులో అమలులో ఉంది) ప్రకారం, విభాగం 10 (చట్టం X, 1855 - ఇది బొంబాయి, మద్రాసులలో అమలులో ఉంది) ప్రకారం అతనిపై పౌరచర్య తీసుకోబడుతుంది.

**24 W.R. 72**

7. సాక్షులుగా పిలవబడిన వ్యక్తులు వ్యక్తిగతంగా కోర్టుకు హాజరు కావాలని చట్టం కొన్ని సందర్భాలలో మాత్రం హాజరుకాకపోయినా అభ్యంతరం చెప్పదు.

(i) కొన్ని హద్దుల లోప నివాసి కాకపోవటం చేత.

పౌర న్యాయ ప్రక్రియ చట్టం O.XVI R.19

(ii) సాక్షి ఘోషా స్త్రీ కావటం వలన.
పౌర న్యాయ ప్రక్రియ చట్టం సెక్షన్ 132

(iii) సాక్షి హోదా గల వ్యక్తి కావటం వలన.
పౌర న్యాయ ప్రక్రియ చట్టం, సెక్షన్ 133

## సాక్ష్యం ఇవ్వటానికి సాక్షి అర్హుడై వుండాలి

1. ఒక వ్యక్తి సమర్థుడా, కాదా అనే విషయాన్ని రెండు కోణాల నుంచి పరిశీలించవచ్చు.

(1) అతని భావ సమర్థతను బట్టి.

(2) అతని మాన్యతను బట్టి.

## (1) మేధశ్శక్తి ఆధారంగా అర్హత

1. సెక్షన్ 118 మేధశ్శక్తి ఆధారంగా సాక్షి అర్హతను విచారిస్తుంది.

2. సెక్షన్ 118లో చెప్పబడిన నియమం అవగాహనా శక్తిని మాత్రమే అర్హతకు పరీక్షగా గుర్తిస్తుంది.

3. ప్రతి వ్యక్తికీ సామాన్యంగా విషయాలను అవగాహన చేసుకోటానికీ, వాటి ప్రాముఖ్యతను తెలుసుకోటానికీ కావలసిన మేధశ్శక్తి ఉంటుంది. ఈ కారణంగా అవగాహనా శక్తి లోపించటం వలన బాధపడుతున్నవారు తప్ప వ్యక్తులందరూ పరీక్షణార్థం అర్హులేనని సెక్షన్ 118 ప్రకటించింది.

4. కాబట్టి అర్హతా నియమం అనేది ఆచరణలో అనర్హతా నియమం అయిపోతుంది. ఒక వ్యక్తి అనర్హుడు కానట్లయితే అర్హుడైనడైన సాక్షి అవుతాడు.

5. ఈ కారణంగా అనర్హత అంటే అవగాహనా శక్తి లేకపోవటం. ఇది ఈ క్రింది నాలుగు కారణాలలో దేనివలనైనా తలెత్తవచ్చు.

(i) లేత వయస్సు.
(ii) పూర్తి ముసలి తనం
(iii) శారీరక వ్యాధి, మనోవ్యాధి

(iv) ఇటువంటి మరే కారణమైనా

6. వ్యాఖ్యానం

(i) లేత వయస్సు లేదా (ii) పూర్తి ముసలితనం - నిర్వచించబడలేదు.

7 సంవత్సరాల బాలుడికి అవగాహనా శక్తి ఉంటే అర్హుడవుతాడు, 12 సంవత్సరాల బాలుడు అవగాహనా శక్తి లోపించటం వలన అనర్హుడవుతాడు. అలాగే 60 సంవత్సరాల వ్యక్తి అనర్హుడు కావచ్చు కానీ 80 సంవత్సరాల వ్యక్తి అర్హుడు కావచ్చు.

ఇక్కడ పరీక్షాంశం వయస్సు కాదు. పరీక్షించవలసినది అవగాహనా శక్తి ఉందా, లేదా అనే విషయాన్ని.

## (iii) శారీరక వ్యాధి

ఒక సాక్షి విపరీతమైన నొప్పితో బాధపడుతూ ఉండవచ్చు. ఆ కారణంగా అడిగిన ప్రశ్నలను అర్థం చేసుకోలేకపోవచ్చు. ఒకవేళ అర్థం చేసుకున్నా సమాధానమివ్వలేకపోవచ్చు. అతడు మూర్ఛలో వున్నట్లుగా స్పృహలో లేకపోవచ్చు. ఇక్కడ వివాదాంశం ఏ వ్యక్తికి సంబంధించినదయినా అతని శారీరక వ్యాధి అతని అవగాహనాశక్తిని నష్టపరచేదా, కాదా అనేది.

## (iii) మనోవ్యాధి

1. ఇది మెదడుకు సంబంధించిన వ్యాధులతో బాధపడు పుట్టు వెర్రివాడు, ఉన్మాది వంటి వారికి ఉద్దేశింపబడింది.

2. పుట్టు వెర్రివాడు పుట్టుకతోటే హేతు విరుద్ధంగా ఉంటాడు. హేతుబద్ధంగా ఆలోచించే శక్తి అతనిలో లోపిస్తుంది. ఉన్మాది పుట్టుకతో హేతుబద్ధంగానే ఉంటాడు. కానీ తర్వాత హేతువిరుద్ధంగా మారతాడు. హేతుబద్ధంగా ఆలోచించే శక్తి కోల్పోతాడు.

3. ఒక ఉన్మాది ఏకవిషయకోన్మాదిగా గానీ, తాత్కాలికంగా ఉన్మాదిగా గానీ ఉండవచ్చు. ఈ కారణంగా ఒక ఉన్మాది ఉన్మాదిగా ఉండటం వలన అసమర్థుడు కాదు. పిచ్చి అంటే అవగాహనా శక్తి పూర్తిగా నశించినదని కాదు. అది సాధారణ పిచ్చి అయితే, ఆ వ్యక్తి అప్పుడప్పుడు మామూలుగా ఉంటాడు, స్పష్టంగా అర్థం చేసుకుంటాడు. అయితే అతడు ఏక విషయకోన్మాది అయినప్పుడు ఇతర విషయాలకు సంబంధించి అతని అవగాహన సక్రమంగానే ఉంటుంది.

ఉదా. పాక్షిక ఉన్మాదం

(1) పిచ్చాసుపత్రిలో హత్య గురించి చర్చించుకోవటం.

(2) ఒక వ్యక్తి ఉన్మాది అయిన తన స్నేహితుని పిచ్చాసుపత్రిలో ఇంటర్వ్యూ చేసినప్పుడు అతడు టైమ్ గురించి ప్రస్తావించటం.

ఏక విషయకోన్మాదికి ఉదాహరణ.

(1) ఆర్. వి. హిల్ - హత్య చేసినందుకుగాను హిల్ శిక్షింపబడ్డాడు. సాక్షి డోనెల్లీ - ఉన్మాది. ఇతడు తన దగ్గర 2 వేల దెయ్యాలున్నాయని, అవి ఎప్పుడూ తనలో మాట్లాడుతూ ఉంటాయనే భ్రమతో బాధపడుతున్నాడు.

అందువలన ఒక ఉన్మాది కూడా అర్హుడైన సాక్షి కాగలడు.
ఇది వివరణలో గుర్తించబడింది.

**(iv) ఇతర కారణం.**

ఇది ఒక మనిషికి అవగాహనాశక్తి నశింపజేసే మరే ఇతర కారణమైనా కావచ్చు.
ఉదా- తాగుడు మైకం

ఇటువంటి కొన్ని అనర్హతలు వాటిని ప్రేరేపించిన కారణంతో సహవ్యాప్తిలో నుంటాయి కాబట్టి ఆ ప్రేరకం లోపిస్తే సాక్షి అర్హుడవుతాడు.
ఉదా- నొప్పి తగ్గిపోవటం
తాగిన మైకం దిగిపోవటం
పిచ్చి కుదరటం
సాక్షిని ప్రశ్నించటం ద్వారా కోర్టు సాక్షికి అవగాహనా శక్తి ఉందా, లేదా అనే విషయాన్ని నిర్ధారిస్తుంది.

**సాక్షిగా నిందితుడు**

1. అవగాహనా శక్తి ఉన్న వ్యక్తులందరూ సాక్షులుగా సమర్థులు కాగా, ఈ నియమానికి ఒక మినహాయింపు ఉంది. ఇది ఒక క్రిమినల్ కేసులో నిందితుడిగా విచారింపబడుతున్న వ్యక్తి సాక్షిగా పరీక్షింపబడకూడదు.

శారీరక వ్యాధి అవగాహనా శక్తిని నష్టపరచని సందర్భం కూడా ఒకటుంది. అది మూగతనం.

సెక్షన్ 119 అటువంటి సాక్షికి సంబంధించినది. ఈ సెక్షన్ అతడు అసమర్థుడని ప్రకటించదు. పైగా ఇది అతన్ని సమర్థుడుగా గుర్తించి, అతనికి తన సాక్ష్యాన్ని లిఖితపూర్వకంగా గానీ, కోర్టు సమక్షంలో సంజ్ఞల ద్వారా గానీ చేయటానికి అనుమతినిస్తుంది.

## సాక్షి మాన్యత ఆధారంగా అర్హత

ఒక వ్యక్తికి నిజం చెప్పకుండా అడ్డుపడే కారణాలు జీవితంలోని సామాన్య వ్యవహారాలలో కంటే న్యాయ కార్యకలాపాలలో మిక్కిలి అధికంగా ఉంటాయి. దీనికి కారణం న్యాయ కార్యకలాపాల తీర్పును తిరస్కరించటానికి వీలులేదు. ఇవి ఇతర అనధికార పంచాయతీ కార్యకలాపాలకంటే ఖచ్చితంగా అమలు జరుపబడతాయి. తత్ఫలితంగా చట్టం ఒక్కొక్కసారి మేధః సమర్థత కలిగిన వారిని కూడా ఒక ప్రత్యేక దావాకు సంబంధించి అసమర్థులుగా చేస్తుంది.

2. పూర్వం మానసిక బలహీనత ఉన్నవారే కాక, కేసుకు, కేసుకు సంబంధించి ప్రయోజనం పొందే వ్యక్తులు కూడా సాక్ష్యం ఇవ్వటానికి అనర్హులుగా పరిగణించబడ్డారు. దీనికి కారణం దావాలో తీర్పుపై ఆసక్తి ఉన్న వ్యక్తి నిజం చెప్పడు. తత్ఫలితంగా ఒకసారి ఈ క్రింది వ్యక్తులు అనర్హులులుగా పరిగణింపబడ్డారు.

1. దావాకు సంబంధించిన కక్షిదారులు.
2. భర్తకు భార్య కానీ, భార్యకు భర్త కానీ.
3. నిందితుడు తనకు తానుగా.
4. ఒక సహాపరాధి.

3. చట్టానికి గల ఈ అభిప్రాయం ఇప్పుడు మారింది.

ఈ నియమం మార్పుకు లోనయింది. అనర్హత ఉందా, లేదా అనే ప్రశ్న వ్యక్తిని నమ్మవచ్చా, లేదా అనే ప్రశ్నగా మార్చబడింది. కాబట్టి ప్రతి వ్యక్తీ సాక్ష్యం ఇవ్వటానికి అర్హుడే. కాని అతన్ని నమ్మాలా, వద్దా అనేది కోర్టు ఇష్టం.

4. ఈ సరికొత్త నియమం సెక్షన్లు 120, 133 లలో పొందుపరచబడినది.

## సెక్షన్ 120

### 1. పౌరకార్యకలాపాలు

(i) దావాకు సంబంధించిన కక్షిదారులు అర్హులయిన సాక్ష్యులు.

(ii) దావాకు కక్షిదారులయిన వారి భార్యలుగానీ, భర్తలుగానీ అర్హులయిన సాక్షులుగా పరిగణింపబడతారు.

### II. నేర కార్యకలాపాలు

1. నిందితుల భార్యలుగానీ, భర్తలుకానీ నిందితులకు అనుకూలంగా మాట్లాడినా, వ్యతిరేకంగా మాట్లాడినా అర్హులయిన సాక్ష్యులే.

## సెక్షన్ 133

1. ఈ సెక్షన్ సహాపరాధి సమర్థతకు సంబంధించినది. సహాపరాధి సాక్ష్యం ఈ క్రింది మూడు కారణాల వల్ల నమ్మరానిదిగా పరిగణింపబడుతుంది.

(i) సహాపరాధినేరం తనమీదనుంచి తొలగించుకోవడానికి అబద్ధపు సాక్ష్యం చెప్పే అవకాశముంది కాబట్టి.

(ii) సహాపరాధినేరంలో భాగం పంచుకున్నవాడు కావటంవలనా, అవినీతిపరుడైన వ్యక్తి కావటం వలన ప్రమాణాన్ని లక్ష్యపెట్టకపోవచ్చు కాబట్టి.

(iii) నేరంలో భాగమున్న మిగిలిన నిందితుల గురించిన సమాచారాన్ని అందజేస్తే నిన్ను శిక్షించకుండా వదిలివేస్తామని కోర్టువారు హామీ ఇచ్చినప్పుడే అతడు సాక్ష్యం ఇస్తాడు కాబట్టి.

2. కానీ అతని సాక్ష్యాన్ని అవసరార్థం వినియోగించుకోవాల్సి ఉంటుంది. దీనికి కారణం ప్రధాన నిందితులను గురించి తెలుసుకోవాలంటే ఇంతకు తప్ప వేరే మార్గం ఉండదు కనుక.

## సహాపరాధి సాక్ష్యానికీ, ఇతర వ్యక్తుల సాక్ష్యానికీ విలువలో గల భేదం

1. సహాపరాధులు కాని వ్యక్తులు అర్హులే కాక నమ్మదగ్గవారు కూడా. సహాపరాధి అర్హుడేకాని నమ్మకస్థుడు కాదు.

2. న్యాయాధిపతి దృష్టిలో సాక్ష్యులు నమ్మదగ్గవారు కాకపోవచ్చు. కానీ చట్టం దృష్టిలో వారు నమ్మదగ్గవారు కావచ్చు. చట్టం ఒక సహాపరాధిని శాసనబద్ధంగా విశ్వసించదు.

3. సాక్ష్య చట్టంలోని సెక్షన్ 114కు చెందిన ఉదాహరణ (b) ప్రకారం శాసనబద్ధంగా విశ్వసించకపోవటమనేది తలెత్తుతుంది. చట్టం ద్వారా ఈ పురోభావన అనుమతించబడింది. ఇది ఖండించదగినదయినా అలా చేయకపోవటం శాసనగతమైన పొరపాటు.

4. శాసనబద్ధంగా విశ్వసించకపోవటం అనేదాన్ని అంటగట్టటానికి ముందు సాక్షి సహాపరాధా, కాదా అనేది నిర్ధారించుకోవలసి ఉంటుంది. ఈ పదం నిర్వచించబడలేదు.

(i) సహాపరాధి మరోక వ్యక్తితోగానీ, వ్యక్తులతోగానీ కలసి నేరం చేసిన వ్యక్తి. అతడు నేరంలో పాల్గొన్న వ్యక్తి. నేరంలో పాలుపంచుకున్న ప్రతిసారీ అతడు సహాపరాధి కాడు. ఇది నేరం స్వభావం మీదా, ఆ సాక్షి నేరంలో తీసుకున్న పాత్రమీదా ఆధారపడి ఉంటుంది.

5 W.R. Cr. 59

(ii) సహాపరాధి నేరంలో భాగమున్న వ్యక్తికానీ, లేదా క్రిమినల్ చట్ట ప్రకారం శిక్ష పొందుతున్న నేరస్థుడితో కలసినేరం మోపబడటానికి తగిన సంబంధాన్ని నేరంతో కలిగిన వ్యక్తిగాని అయి ఉంటాడు.

27 మద్రాసు 271

## సెక్షన్లు 120, 133ల ప్రభావం

1. ఈ సెక్షన్లు కొందరు వ్యక్తులకు సాక్ష్యం ఇవ్వటానికి అర్హులుగా పేర్కొంటాయి. ఇక్కడ ప్రశ్న, ఇతరులు సమర్థులు కారా? ఈ సెక్షన్లు ఈ వ్యక్తులే సమర్థులు, మిగిలినవారు కారు అనే అర్థంలో తీసుకోకూడదు. ఈ సెక్షన్లు ప్రభావం వలన సెక్షన్లు 120, 133 లలో పేర్కొనబడిన వారితో సహా అందరూ అర్హులే అవుతారు.

2. ఈ వర్గాలను ప్రత్యేకంగా పరిశీలించటానికి గల కారణం పూర్వపు చట్టం ప్రకారం వారు అనర్హులు. వారిపై విధించబడిన నిషేధాన్ని తొలగించాలి. ఇందుకుగాను వాటికి సంబంధించి ప్రత్యేక సదుపాయాలు చేయబడ్డాయి. మిగిలిన వర్గాలకు చెందిన ప్రజలు అర్హులుగానే భావించబడ్డారు కాబట్టి వారికి సంబంధించి వేరుగా చెప్పటం అనవసరమవుతుంది.

3. సెక్షన్లు 120, 133 ల ప్రభావం-

(1) దావాకు చెందిన కక్షిదారులు

(2) భర్తలు, భార్యలు

(3) సహాపరాధులు

## అర్హులైన సాక్షులు వీరు మాత్రమే కాకుండా

(1) జూరీ సభ్యులు, న్యాయనిర్ణాయకులు - సెక్షన్ 294 Cr.P.C.

(2) వీలునామా అమలుదారు

(3) కక్షిదారుచే నియమింపబడ్డ న్యాయవాది

వీరు కూడా వారు కక్షిదారులైన దావాలలో అర్హులైన సాక్ష్యులు కావచ్చు. అయితే వీరు దావాలో ప్రయోజనమున్న వ్యక్తులు.

సాక్షం ప్రమాణ పూర్వకంగా ఇవ్వవలసి ఉంటుంది.

1. భారతీయ సాక్ష్య చట్టం ప్రకారం ప్రమాణమనేది ఆపేక్షితం కాదు. భారతీయ సాక్ష్య చట్టం ప్రకారం సాక్షి ప్రమాణం చేయకుండా సాక్ష్యమిచ్చినా అది శాసనబద్ధమైన సాక్ష్యమే అవుతుంది.

2. భారతీయ ప్రమాణ చట్టం X, 1873 ప్రమాణాన్ని ఆపేక్షిస్తుంది. ప్రమాణాల చట్టానికి చెందిన సెక్షన్ 5 ఈ క్రింది వాటిని పొందుపరుస్తుంది.

1. ప్రమాణం కానీ ప్రతిజ్ఞ కానీ ఈ క్రింది వ్యక్తుల ద్వారా చేయబడుతుంది.

(a) సాక్షులందరు

(b) వ్యాఖ్యాతలు

(c) జ్యూరీ సభ్యులు

3. సెక్షన్ 6, ప్రమాణం చేయటానికి అభ్యంతరం తెలిపిన వ్యక్తికి ప్రతిజ్ఞ చేయటానికి అనుమతిస్తుంది.

4. సెక్షన్ 14 - కోర్టులోగానీ, ప్రమాణంగానీ ప్రతిజ్ఞగానీ చేయించటానికి నియమింపబడ్డ వ్యక్తి ముందుగాని సాక్ష్యం ఇచ్చే ఏ వ్యక్తయినా విషయానికి సంబంధించి నిజాలే ప్రకటిస్తాడు.

5. మూడు ప్రశ్నలు పరిశీలనకు వస్తాయి.

(1) కోర్టు ఒక సాక్షికి ప్రమాణం చేయించటానికి గానీ, ప్రతిజ్ఞ చేయించటానికి గానీ నిరాకరించగలదా?

(2) ఒక కక్షిదారు ప్రమాణం చేయటానికిగానీ, ప్రతిజ్ఞ చేయటానికి గానీ నిరాకరించవచ్చా?

(3) సాక్షి ప్రమాణం చేయటానికి గానీ, ప్రతిజ్ఞ చేయటానికి గానీ నిరాకరిస్తే దాని ప్రభావం, కోర్టు సాక్షిచే ప్రమాణం చేయించలేకపోయినప్పుడు దాని ప్రభావం.

మొదటి ప్రశ్నకు సమాధానం. ప్రమాణం చేయించటం కోర్టుకు శాసనపూర్వక విధి.

దీనికి ఒక అర్హత ఉంది. అర్హుడైన వ్యక్తిచే కోర్టు ప్రమాణం చేయించాల్సి ఉంటుంది. వ్యక్తి అర్హుడు కానట్లయితే ప్రమాణం చేయించవలసిన అవసరం లేదు. ఉదా. బాలుడు

**6 Pat. L.J. 147**

రెండవ ప్రశ్నకు సమాధానం. సెక్షన్ 12 లో సమాధానం ఇవ్వబడింది. కక్షిదారును ప్రమాణం చేయమని బలవంతం చేయకూడదు. కానీ కోర్టు అతను తిరస్కరించినట్లుగానూ, అందుకు అతను కారణాలు ఇచ్చి ఉన్నట్లయితే వాటినీ నమోదు చేయవలసి ఉంటుంది.

## మూడవ ప్రశ్నకు సమాధానం

భాగం-I- ఒక కక్షిదారు ప్రమాణం చేయటానికి గానీ, ప్రతిజ్ఞ చేయటానికి గాని నిరాకరిస్తే దాని ప్రభావం.

1. ....

2. అటువంటి తిరస్కారం సాక్ష్యపు విలువను ప్రభావితం చేస్తుంది.

## భాగం-II- న్యాయాధిపతి ప్రమాణం చేయించకపోతే దాని ప్రభావం.

1. సాక్ష్యం అనుమతియోగ్యంగా ఉంటుంది.

2. నిజం చెప్పవలసిన అవసరం ఉంటుంది.

6. భారతదేశంలో ప్రమాణ చట్ట నిబంధనలు ఇంగ్లాండులో నున్నంత నిష్కర్షగా ఉండవు.

(1) వాస్తవాన్ని చెప్పటానికి గల బాధ్యతకు పూర్వదృష్టాంతంగా ప్రమాణం అవసరమైన షరతు కాదు. అది సాక్షికి దాని మంజూరును గుర్తుచేయటానికి అవసరం.

(2) భారతీయ చట్టం ప్రమాణంచెయ్యకపోవటాన్నిగానీ, ప్రమాణాన్నిగుర్తుచేయకపోవటాన్ని గానీ క్షమిస్తుంది. ఇంగ్లీషు చట్టం సాక్ష్యాన్ని అనుమతించదగనిదిగా చేస్తుంది.

## IV. పరీక్షా సరళి

1. ఒక సాక్షి వాఙ్మూలం ఇవ్వటానికి అనుకూలమైన మార్గాలు రెండున్నాయి.

(i) వాస్తవాలను చెప్పటం ద్వారా.

(ii) అతనిని అడిగిన ప్రశ్నలకు సమాధానాలివ్వటం ద్వారా

2. సాక్ష్య చట్ట ప్రకారం ఒక సాక్షి ఇచ్చిన సాక్ష్యం పరీక్ష రూపంలో ఉండాలిగాని, కథనం రూపంగా ఉండకూడదు. చట్టం పరీక్ష పద్ధతిని సాక్ష్యం ఇవ్వటానికి ప్రాధాన్యమైన పద్ధతిగా తీసుకోవటానికి కారణం సంబంధిత నియమాలు ఒక వ్యక్తి సంబంధిత విషయాలకు సాక్ష్యం ఇవ్వటానికి అనుమతించబడతాడు. వివాదాంశానికి సంబంధించిన అన్ని విషయాలకు సాక్ష్యం ఇవ్వటానికి అతనికి అనుమతి ఉండదు. వివాదానికి సంబంధమున్న విషయాలు వివాదానికి సంబంధిత అంశాలుగా ఉండనవసరంలేదు. సాక్ష్య చట్టం కింద ఏదైనా ఒక అంశం సంబంధించినదా, కాదా అనేదాన్ని నిర్ధారించటం, సంబంధం లేకపోతే ఆ అంశాన్ని వెంటనే అక్కడికక్కడే రద్దుచేయటం న్యాయాధిపతి విధి.

ఒక సాక్షి సాక్ష్యాన్ని కథనం రూపంలో ఇవ్వటానికి అనుమతించబడితే ఈ క్రింది రెండు విషయాలు చోటుచేసుకుంటాయి :

(i) సాక్షిఅన్ని ముఖ్య అంశాలనూ, ఇతరసంబంధిత అంశాలనూ చెప్పటం ద్వారా సంబంధంలేని విషయాలను కూడా ప్రవేశపెడతాడు.

(ii) న్యాయాధిపతి సంబంధం లేని విషయాలను కొట్టివేసే చర్య కార్యానంతర చర్య.

అలాకాక సాక్షి తన సాక్ష్యాన్ని ప్రశ్నలకు సమాధానాల రూపంలో ఇవ్వవలసి వచ్చినప్పుడు ఈ క్రింది రెండు లక్ష్యాలు సాధించబడతాయి:-

(i) అతని సాక్షాన్ని వివాదానికి సంబంధించిన ముఖ్యాంశాలకు మాత్రమే పరిమితం చేయవచ్చు.

(ii) కోర్టు వెంటనే పరిశీలించి సంబంధం లేని సాక్ష్యాన్ని ప్రవేశపెట్టటాన్ని రద్దు చేయవచ్చు.

4. సాక్ష్యుల పరీక్షకు సంబంధించి రెండు భిన్న ప్రశ్నలు, భిన్న చట్టాల ద్వారా క్రమబద్ధం చేయబడినవి, ఉన్నాయి. కక్షిదారులు తమ సాక్ష్యులను పరిశీలనార్థం ప్రవేశపెట్టే వరుస క్రమం మొట్టమొదటిది. కోర్టులో ప్రవేశపెట్టబడ్డ ప్రతి సాక్షి గురిచేయబడే పరీక్షా సరళి రెండవ ప్రశ్న.

## సెక్షన్లు 135, 138

కక్షిదారులచే సాక్షులు ఏ వరుస క్రమంలో కోర్టులో ప్రవేశపెట్టబడాలనేది పౌర, నేర న్యాయ కార్యస్మృతులచే క్రమబద్ధం చేయబడింది. సాక్షిగురిచేయబడిన పరీక్షా సరళి దాఖలు చేయబడినప్పుడు సాక్ష్యచట్టం ద్వారా విధించబడింది.

## సాక్షుల ప్రవేశానికి వరుస క్రమం

1. పౌర దావాలలో
   క్రమం XVIII నియమం 1.

   నేర దావాలలో
   సమను దావాలు 224 నేర న్యాయ ప్రక్రియ చట్టం
   వారంటు దావాలు 252, 254, 257
   సమీక్ష దావాలు 262

నియమం ఈ క్రింది విధంగా ఉన్నట్లు అనిపిస్తుంది.

1. నిర్ధారించవలసిన మొదటి ప్రశ్న, ప్రారంభించటానికి ఎవరికి హక్కు ఉంది.

2. ప్రారంభించే హక్కు నిరూపణ భారం ఎవరిపై ఉన్నదనే విషయంమీద ఆధారపడి వుంటుంది.

## పరీక్షా సరళి

1. ఒక సాక్షిని పరీక్షించే విధానాన్ని సాక్ష్య చట్టం నిర్ణీతం చేస్తుంది. ఈ విధానం 3 భాగాలుగా ఉంటుంది.

## సెక్షన్ 138

(i) ముఖ్యమైన పరీక్ష

(ii) అడ్డు పరీక్ష

(iii) పునఃపరీక్ష

2. ముఖ్య పరీక్ష సాక్షిని పిలిచిన కక్షిదారే సాక్షిని పరిశీలించటం.

## సెక్షన్ 137

అడ్డు పరీక్ష సాక్షిని అవతలి పక్షపు కక్షిదారు పరిశీలించటం.

పునఃపరీక్ష అడ్డు పరీక్ష అయింతర్వాత సాక్షిని పిలిచిన కక్షిదారే తిరిగి సాక్షిని పరిశీలించటం.

## పరిశీలించవలసిన ప్రశ్నలు

3. ప్రధాన పరీక్ష లేదా ముఖ్య పరీక్ష అభీష్టానికి చెందిన విషయం. ఎవరూ కక్షిదారును సాక్షిని పిలవవలసిందిగా కోరరు. కానీ ఒక సాక్షి పిలవబడినప్పుడు ప్రధాన పరీక్షకు గురిచేయబడినప్పుడు ఉత్పన్నమయ్యే ప్రశ్న ఇది:- అడ్డు పరీక్షగానీ, పునఃపరీక్షకానీ కోర్టు విచక్షణ ప్రకారం అనుమతించబడే లేదా నిలిపివేయబడే హక్కా లేక ప్రత్యేక అధికారమా?

ఈ ప్రశ్నకు సమాధానం:- అడ్డు పరీక్షగానీ, పునఃపరీక్షగానీ హక్కు మాత్రమే, ప్రత్యేకాధికారం కాదు. ఒక కక్షిదారు ఒక ప్రధాన పరీక్ష తర్వాత అడ్డు పరీక్షగానీ, పునఃపరీక్షగాని చేయకుండా కోర్టు నిరోధించలేదు. అయితే కక్షిదారు ద్వారా గాక కోర్టు ద్వారానే రప్పించబడ్డ సాక్షి సంగతేమిటి? అటువంటి సాక్షిని అడ్డు పరీక్ష చేసే హక్కు ఉందా? ఉంటే ఏ కక్షిదారు చేయాలి? సాక్ష్య చట్టం ఇటువంటి సందర్భానికి సంబంధించి ఎటువంటి ఏర్పాటు చేయలేదు. కానీ సాధారణంగా కోర్టు ద్వారా పిలవబడి, పరీక్షింపబడిన సాక్షిని న్యాయాధిపతి అనుమతి తీసుకోకుండా ఏ పక్షానికి చెందిన కక్షిదారయినా అడ్డు పరీక్ష చేయటానికి వీలులేదు.

(1894) 2 Q. B. 316
3 B. L.R. 145
11 W.R. 110
24 Cal. 288
5 Cal. 614
16 W.R. 257

4. అడ్డు పరీక్ష చేసే హక్కు ఎప్పుడు ఉపయోగించుకోవచ్చు? ఈ విషయంలో పౌర కేసులకూ, నేర కేసులకు భేదం ఉంది.

(i) పౌర కేసులలో ఈ హక్కు వెంటనే ఉపయోగించుకోవాల్సి ఉంటుంది. దాన్ని మరొక తారీఖుకు వాయిదా వేసుకోటానికి వీలులేదు.

(ii) నేరకేసులలో మెజిస్ట్రేటు ముందు జరిగేసమను వ్యవహారంలోనూ, సెషన్సు వ్యవహారంలోనూ ఈ హక్కును వెంటనే వినియోగించుకోవాలి. కానీ వారంటు వ్యవహారంలో ప్రాసిక్యూషన్ తరపు సాక్షికి అడ్డు పరీక్షను తర్వాత విచారణ రోజు దాకా వాయిదా వేసే హక్కు నిందితుడికి ఉంది. ఇరువురు కక్షిదారులు సాక్షిగా పిలిచే వ్యక్తి విషయం:

ఏకూ బికీ మధ్య ఉన్న వ్యాజ్యంలో సి ని సాక్షిగా ఎ, బి ఇద్దరూ పేర్కొన్నారు. మొదట అతడు ఎ తరపున సాక్షిగా పిలవబడ్డాడు. అతడ్ని బి అడ్డు పరీక్ష, ఎ పునః పరీక్ష చేయటం అయ్యాక బి అతడ్ని తన తరపున సాక్షిగా పేర్కొనబడ్డాడు.

## బి సి ని అడ్డుపరీక్ష చేయవచ్చా?

సాక్ష్య చట్టంలో ఈ ప్రశ్నకు సమాధానంగా ఏ విధమైన ప్రత్యేక నిబంధన లేదు. ఇది న్యాయనిర్ణయ అభిప్రాయం. ఈ ప్రశ్నకు సంబంధించి భిన్నాభిప్రాయాలున్నాయి.

(1) ఒక అభిప్రాయం ప్రకారం, ఒక వ్యక్తి సాక్షిని అడ్డుపరీక్ష చేయటానికి హక్కు పొందితే ఆ హక్కును తర్వాత ఆ కేసుకు సంబంధించిన అన్ని దశలలో కూడా ఆ సాక్షిపై ఉపయోగించుకోవచ్చు. తర్వాత ఆ సాక్షి ఏ రూపంలో కోర్టులో హాజరయినా, చివరికి అతని తరపునే సాక్షిగా వచ్చినప్పుడు కూడా ఆ సాక్షిని అడ్డుపరీక్ష చేసే హక్కు ఆ వ్యక్తికి ఉంటుంది. ఈ అభిప్రాయం ప్రతిసాక్షి తనను పిలిచిన కక్షిదారుకు అనుకూలంగా ప్రవర్తిస్తాడు అనే సిద్ధాంతంపై ఆధారపడివున్నది.

(2) రెండవ అభిప్రాయం ప్రకారం ప్రతి కక్షిదారు ఒకరి తర్వాత ఒకరు అటువంటి సాక్షిని తమ ప్రత్యర్థుల విషయమై అడ్డుపరీక్ష చేసే హక్కు కలిగివుంటారు. కాని ఇద్దరు కక్షిదారులు తమ తమ ప్రధాన పరీక్షలో వారి సొంత కేసుకు సంబంధించి ముఖ్యమైన ప్రశ్నలు అడగటానికి వీలుండదు. ఈ కారణంగా ప్రతివాది తరపున విచారణ జరిగిన తర్వాత వాది తన సొంత సాక్షులను అడ్డు పరీక్ష చేయవచ్చు.

వీటికంటే మేలైన అభిప్రాయం ప్రకారం అడ్డు పరీక్ష చేసే హక్కు స్థిరంగా ఉండదు. అందువలన రెండవసారి పరీక్షలో సాక్షిని ముఖ్యమైన ప్రశ్నలు అడగకూడదు.

కాని రెండవ పార్టీచే పరీక్షింపబడి తనచే అడ్డుపరీక్ష చేయబడిన సాక్షిని ప్రతివాది పిలిచినట్లయితే అతను ప్రధాన పరీక్షనే జరిపే అవకాశముంటుంది.

ఈ నియమం సాక్ష్య చట్టంచే అమలుపరచబడినట్లు కన్పిస్తుంది.

§. ఈ విధంగా నియంత్రించబడిన పరీక్షా సరళి అందరు సాక్షులకూ వర్తిస్తుందా?

1. మూడురకాల సాక్షులను కోర్టు హాజరుకావలసిందిగా కోరుతుంది. వీరు :
   (i) ప్రధాన అంశాలకు సాక్ష్యం ఇవ్వటానికి పిలిపించబడ్డ వ్యక్తులు.
   (ii) స్వభావాన్ని గూర్చి తెలియజేయటానికి పిలిపించబడ్డ సాక్షులు.
   (iii) దస్తావేజులను ప్రవేశపెట్టటానికి పిలిపించబడ్డ సాక్షులు.

2. ప్రధాన అంశాలకు సాక్ష్యం ఇవ్వటానికి పిలిపించబడ్డ సాక్షులు, స్వభావాన్ని తెలియజేయటానికి పిలిపించబడ్డ సాక్షులు తు.చ. తప్పకుండా నియంత్రించబడిన పరీక్షా సరళికి, అడ్డు పరీక్ష, పునఃపరీక్షలకు గురిచేయబడతారు. కానీ దస్తావేజులు దాఖలు చేయటానికి పిలిపించబడ్డ సాక్షి పరిస్థితి వేరుగా ఉంటుంది. అతడు సాక్షి కాదు కాబట్టి అడ్డు పరీక్షకు గురికాడు.

6. ఒకే కేసుకు సంబంధించిన నిందితుడు అదే కేసుతో సంబంధం ఉన్న సహనిందితుడిచే పిలిపించబడ్డ సాక్షిని అడ్డు పరీక్ష చేయవచ్చా? అలాగే ఒక సహ ప్రతివాది మరొక సహప్రతివాదిని కానీ, సహవాదిచే పిలిపించబడ్డ సాక్షినిగాని అడ్డు పరీక్ష చేయవచ్చా?

(1) సహనిందితుల, సహప్రతివాదుల అడ్డు పరీక్షకు సంబంధించి ఈ సెక్షన్ ఏ విధమైన ప్రత్యేక నిబంధింపు చేయదు.

(2) సాక్ష్యచట్టం విరోధిచే పిలిపించబడిన సాక్షులనే అడ్డుపరీక్ష చేసే హక్కు ప్రసాదిస్తుంది కానీ ఇతరులను చెయ్యటానికి ఇవ్వదు. ఫలితంగా ఒక సహనిందితుడు మరొక సహనిందితుడుచే పిలిపించబడిన సాక్షిని అతని కేసు తన కేసుకు విరోధంగా ఉన్నప్పుడు మాత్రమే అడ్డు పరీక్ష చేయవచ్చు.

21 కలకత్తా 401

(3) ఇంగ్లీషు చట్ట నియమం ఈ విషయంలో భిన్నంగా ఉంటుంది. ఇంగ్లీషు చట్టం ప్రకారం ప్రతివాదికి (బలవత్తరకారణంచే నిందితుడైనవాడు) సహ ప్రతివాదినిగానీ, సహ నిందితుడ్ని కానీ అడ్డు పరీక్షచేసే హక్కు బేషరతుగా ఉంటుంది. ఈ హక్కు నిందితుడి సహనిందితుడి కేసులు విరుద్ధంగా ఉన్నాయనే అంశం మీదగానీ, ప్రతివాదికి, సహ ప్రతివాదికి మధ్య వివాదం ఉన్నదనే అంశం మీద గాని ఏ విధంగానూ ఆధారపడియుండదు. పైగా ఒక సహప్రతివాది మరొక సహప్రతివాది సాక్షినీ, సహప్రతివాది సాక్ష్యం ఇచ్చిన పక్షంలో అతనిని కూడా అడ్డు పరీక్ష చేయవచ్చు.

## ఈ ఇంగ్లీషు నియమానికి గల కారణాలు:

(i) ఒక కక్షిదారుచే ఇవ్వబడిన సాక్ష్యాన్ని మరొక కక్షిదారుకు వ్యతిరేకమైనదానిగా రెండవ కక్షిదారు అడ్డుపరీక్షద్వారా ఆ సాక్ష్యాన్ని పరీక్షించినప్పుడు తప్ప మరెప్పుడూ తీసుకోకూడదని నిర్ధారించటమైనది.

అలెన్ అలెన్‌ల మధ్య వివాదం L.R.P.D.C. (1894) 248/254

(ii) ప్రధాన పరీక్ష ద్వారా గానీ, అడ్డు పరీక్ష ద్వారా గానీ తీసుకున్న సాక్ష్యమంతా ఉమ్మడిగా ఉండి కక్షిదారులందరికీ అందుబాటులో ఉంటుందనేది ఆమోదించబడింది.

లార్డ్, కొలాయిన్‌ల మధ్య వివాదం

3 డ్రీవరీ 222

(iii) సాక్ష్యం ఉమ్మడిగా ఉన్నప్పుడు, ఒక కక్షిదారు ఇచ్చిన సాక్ష్యం రెండవ కక్షిదారుకు అనుకూలంగా గానీ, వ్యతిరేకంగాగానీ ఉన్నప్పుడు, రెండవ కక్షిదారుకు అడ్డుపరీక్షచేసే హక్కు ఉండాలనేది స్పష్టం చేయబడింది.

7. సాక్షిని విచారించేటప్పుడు సరియైన విచారణ జరగకపోతే చట్టం నిబంధింపుల మేరకు దాని ప్రభావం ఏమిటి?

(i) ఈ ప్రశ్న అడ్డు పరీక్షగానీ, పునఃపరీక్షగానీ ఉపేక్షించబడినప్పుడు మాత్రమే తలెత్తుతుంది. చట్టరీత్యా ప్రధాన విచారణ ముగిస్తే తప్ప వేరే సాక్ష్యమేమీ అనుమతించబడదు.

సాక్షి ప్రధాన విచారణలో సాక్ష్యం ఇచ్చిన తర్వాతే ఈ ప్రశ్న తలెత్తుతుంది. పరిశీలనలోనున్న వివాదం సాక్షి ఇచ్చిన సాక్ష్యం ఆధారంగా అడ్డుపరీక్షకు, పునఃపరీక్షకు సంబంధించి జరిగిన ఉపేక్షకు ఫలితంగా రూపుదిద్దుకుంటుంది.

(2) అటువంటి ఉపేక్ష సాక్షి మరణించినప్పుడు కానీ, అస్వస్థతకు గురైనప్పుడు కానీ, పిచ్చివాడైనప్పుడు కానీ, లేదా ప్రధాన పరీక్ష కాగానే లేదా అడ్డు పరీక్షకు ముందు అదృశ్యమై పోవటం వలన కానీ జరగవచ్చు.

(3) సాక్ష్య చట్టం ఈ విదంగా సాక్ష్యం ఉపేక్షించబడినప్పుడు దాని ఫలితం ఏమిటనే విషయాన్ని వివరించదు.

అడ్డుపరీక్ష, పునఃపరీక్ష జరగకపోవటం వలన ప్రధాన పరీక్షలో సాక్షి ఇచ్చిన సాక్ష్యం చట్టరీత్యా సాక్ష్యంగా పనికిరాకుండా పోతుందా? దానిని రద్దుచేసి కోర్టు పరిశీలననుంచి తొలగించవలసి ఉంటుందా? లేదా దాని సాక్ష్యపు విలువ తగ్గిపోతుందా? అనే విషయాలు సాక్ష్య చట్టంలో పేర్కొనబడలేదు. ఈ ప్రశ్నను న్యాయవివరణ ద్వారా నిర్ధారించవలసి ఉంటుంది.

న్యాయవివరణ ప్రకారం, రెండు ప్రతిపాదనలు స్థిరపడ్డాయి.

(1) అటువంటి ఉపేక్ష సాక్ష్యానికి అనుమతియోగ్యత లేకుండా చేయదు. అది సాక్ష్యపు విశ్వసనీయతను దెబ్బతీస్తుంది.

(2) అది నమ్మదగినదా, కాదా అనే విషయం అడ్డు పరీక్ష జరగకపోవటానికి గల కారణాల మీద ఆధారపడి ఉంటుంది.

అడ్డు పరీక్ష జరపటంలో ఉపేక్ష ఈ క్రింది రెండు కారణాల వల్ల జరుగుతుంది.

(i) ఒక కక్షిదారుకు అడ్డు పరీక్ష జరిపే వీలుండీ జరపని సందర్భం

(ii) ఒక కక్షిదారు అడ్డుపరీక్ష నిర్వహించవలసి ఉండీ నిర్వహించలేని సందర్భం.

సాక్ష్యం నమ్మదగినదా, కాదా అనే ప్రశ్న రెండవ సందర్భంలోనే తలెత్తుతుంది. మొదటి సందర్భంలో ఈ ప్రశ్న తలెత్తదు. చట్టం అడ్డు పరీక్ష జరపటానికి అవకాశాన్ని మాత్రమే ఇస్తుంది కాని మరేమీ చేయదు. ఆ అవకాశాన్ని ఉపయోగించుకోకపోతే చట్టం నిలిపివేయబడుతుంది. అంతకు మించి మరే హానీ జరగదు.

## క్రమబద్ధ పరీక్షా సరళి

1. సాక్షికి విధించబడిన పరీక్షా సరళి క్రమబద్ధంగా ఉండాలి.

2. పరీక్షా సరళి క్రమబద్ధంగా ఉండాలంటే అది సాక్ష్య చట్టంలో పేర్కొనబడిన నియమానుసారంగా ఉండాలి.

3. క్రమబద్ధ పరీక్షా సరళికి సంబంధించిన నియమాలు ఈ క్రింది విధంగా ఉంటాయి.

(i) పరీక్షా పరిధి

(ii) పరీక్షా విధానం

(iii) పరీక్షా హద్దులు

## సాక్షికి పరీక్షా పరిధి

ఈ సెక్షన్ కింద సాక్షిని కక్షిదారు ఏయే విషయాలకు సంబంధించిన ప్రశ్నలు అడగటానికి అర్హుడో తెలియజేయబడుతుంది.

1. ఒక సాక్షిని విచారించటంలో గల ముఖ్య ఉద్దేశాలు రెండు. ఇవి:

(i) అతనికి తెలిసింది చెప్పించటం.

(ii) అతను చెప్పిన దాంట్లో నిజానిజాలను పరీక్షించటం.

2. సాక్షి చెప్పిన విషయాల నిజానిజాలను అతనికి పెట్టే పరీక్షలో ఈ క్రింది వాటికి సంబంధించిన ప్రశ్నలు కూడా చేర్చినప్పుడే తెలుసుకోటానికి వీలవుతుంది.

(i) సాక్షిని బలపరిచటానికీ, ఖండించటానికి సంబంధించిన ప్రశ్నలు

(ii) సాక్షి ప్రతిష్టను లేదా స్వభావాన్ని దృఢీకరించటానికి లేదా మహాభియోగం చేయటానికి సంబంధించిన ప్రశ్నలు.

3. కాబట్టి పరీక్షా పరిధి కింద ఈ క్రింది విషయాలకు సంబంధించిన నియమాలు ప్రాముఖ్యత సంతరించుకుంటాయి.

(i) సాక్షిని పరీక్షించేటప్పుడు ఏయే అంశాలు రాబట్టవచ్చు, ఏయే అంశాలు రాబట్టకూడదు అనే విషయానికి సంబంధించిన నియమాలు.

(ii) సాక్షి విశ్వసనీయతను పరీక్షించటానికి అవసరమైన నియమాలు

(iii) సాక్షి చెప్పిన విషయాలను బలపరచటానికి గానీ, ఖండించటానికి గానీ అవసరమైన నియమాలు.

## I. పరీక్షలో రాబట్టగలిగే విషయాలు, రాబట్టలేని విషయాలు:

సెక్షన్లు 138, 146లలో ఈ ప్రశ్న పరిశీలించబడింది. ఈ సెక్షన్ ప్రకారం రెండు రకాల విషయాలకు సంబంధించిన సమాచారాన్ని సాక్షిని పరీక్షించేటప్పుడు అతని ద్వారా పొందవచ్చు.

(i) వివాదానికి సంబంధించిన ముఖ్యమైన విషయాలు

(ii) సాక్షి విశ్వసనీయతకు సంబంధించిన విషయాలు

ఈ రెండు విషయాలకు సంబంధించి మాత్రమే సాక్షిని ప్రశ్నలు అడగవలసి ఉంటుంది.

2. కానీ ప్రతి కక్షిదారుకు సాక్షిని రెండు విషయాలకు సంబంధించి విచారించటానికి హక్కు ఉండదు.

(1) కేసులోని ముఖ్యమైన విషయాలకు సంబంధించి ఇద్దరు కక్షిదారులు - సాక్షిని పిలిపించిన కక్షిదారు, రెండవ పక్షపు కక్షిదారు కూడా సాక్షిని విచారణ చేయటానికి అర్హత కలిగివుంటారు. నిజానికి ఇక్కడ నియమం కక్షిదారు ముఖ్యమైన అంశాలన్నిటికీ సంబంధించి సాక్షిని విచారించే హక్కు కలిగివున్నాడని కాదు. ఈ నియమం ప్రకారం సాక్షిపై జరిపే విచారణ ముఖ్యమైన అంశాలకు మాత్రమే పరిమితం కావలసి ఉంటుంది.

ఈ నియమం ప్రధాన విచారణకు మాత్రమేకాక అడ్డుపరీక్షకు కూడా వర్తిస్తుంది. అయితే రెండింటికీ మధ్య భేదం అడ్డు పరీక్షలో ప్రధాన విచారణలో అడిగిన విషయాల గురించే అడగాలనే నియమం లేదు. దానిని ప్రధాన విచారణలో అడగని విషయాలకు కూడా విస్తరించవచ్చు. అయితే ఈ విషయాలు కూడా కేసుకు సంబంధించి ముఖ్యమైనవై ఉండాలి. కేసుకు సంబంధంలేని విషయాలు ప్రధాన విచారణలోగానీ, అడ్డుపరీక్షలోగానీ అనుమతించబడవు. ముఖ్య అంశాలకు సంబంధించి ప్రధాన విచారణ పరిధికీ, అడ్డుపరీక్ష పరిధికీ ఏవిధమైన భేదం లేదు.

( ఇక్కడ వ్రాతప్రతిలో 203వ పేజీ అయిపోయింది. 204వ పేజీ లేదు. ఈ క్రింద ఇచ్చినది 205వ పేజీ నుంచి మొదలవుతుంది - సం. )

సత్యం పలికే గుణం లేకపోవటమనేది మనిషి పరపతిని దెబ్బతీస్తుందనే విషయం అందరూ ఒప్పుకునేదే. అందువలన మనిషిలోని ఈ గుణాన్ని తెలిపే ప్రశ్నలు ఎప్పుడూ అనుమతించబడతాయి. ఇటువంటి ప్రశ్నలను అడ్డుపరీక్షలో కూడా అడగవచ్చు.

కానీ ఒక సాక్షికి మంచి స్వభావం లేకపోతే అతనిచ్చిన సాక్ష్యపు నిజానిజాలు ఏవిధంగా అంచనా వేయబడతాయనే విషయంలో ఏకాభిప్రాయం లేదు.

ఈ విషయంలో రెండు భిన్నాభిప్రాయాలున్నాయి. మొదటి అభిప్రాయం ప్రకారం చెడు స్వభావానికి కారణం నిజం చెప్పే సమర్థత లోపించటమే. కాబట్టి నైతిక విలువలు లేకపోవటమనేది నిజాయితీలో చోటుచేసుకున్న హీనతను సూచిస్తుంది. రెండవ అభిప్రాయంలో చెడు స్వభావం అనేది ఎప్పుడూ నిజాయితీ లేకపోవటాన్ని చూపించాల్సిన అవసరం లేదు. ఈ కారణంగా చెడు స్వభావానికి సాక్షి ప్రతిష్టను దెబ్బతీయటానికి రుజువుగా ఉపయోగపడే శక్తిలేదు.

ఇంగ్లీషు న్యాయశాస్త్ర ప్రకారం, పరువు ప్రతిష్టలను ప్రభావితం చేసి స్వభావాన్ని కించపరిచే విషయంలో సాధారణ స్వభావం మినహాయించబడింది. ఈ విషయంలో నిజాయితీకి సంబంధించిన స్వభావం మాత్రమే పరిగణనలోకి తీసుకోబడుతుంది.

## అడ్డు పరీక్ష ద్వారా కాక ఇతరత్రా స్వభావ దోషారోపణ సెక్షన్ 155

1. ఒక సాక్షి స్వభావ దోషారోపణ సెక్షన్ 155లో పేర్కొనబడిన నిబంధింపుల ప్రకారం స్వతంత్ర సాక్ష్యాన్ని ఇవ్వటం ద్వారా అనుమతించబడుతుంది.

2. ఇది విరుద్ధ పక్షపు వారి హక్కు. దీనివలన సాక్షిని పిలిపించిన కక్షిదారు ఇతర వ్యక్తులకు సంబంధించిన సాక్ష్యాన్ని ఇవ్వటం ద్వారా ఆ సాక్షి స్వభావానికి సంబంధించి అభియోగం చేయటానికి వీలులేదు.

3. దోషారోపణ ఈ క్రింది విధాలుగా చేయబడవచ్చు.

(1) సాక్షి గౌరవం ఇవ్వదగ్గ వ్యక్తి కాదని తమ వ్యక్తిగతానుభవం ద్వారా సాక్ష్యమిచ్చే వ్యక్తుల ద్వారా

(2) లంచం ఇచ్చిగానీ, ఇస్తానని చెప్పిగానీ, లేదా మరోరకంగా సాక్షిని సాక్ష్యం ఇవ్వటానికి పురికొల్పిగానీ ఇప్పించిన సాక్ష్యం ద్వారా

(3) ఒప్పందానికి లోనయ్యే అవకాశం ఉన్న ఏ సాక్ష్యంతోనయినా అసంగతంగా వున్న పూర్వపు ప్రకటనల రుజువు ద్వారా

(4) ఒక మానభంగం కేసులో అభియోగం మోపబడిన వ్యక్తి సాధారణంగా అవినీతిపరుడనే రుజువు చూపించటం ద్వారా

## 3. ఒక సాక్షిని బలపరచటానికి, ఖండించటానికి సంబంధించిన నియమాలు

1. రూఢి సాక్ష్యం లేదా బలపరిచే సాక్ష్యపు నిర్వచనం-

రూఢి సాక్ష్యం అనగా ఒక సాక్షి ఇచ్చిన సాక్ష్యపు సత్యతను నిర్ధారించే శక్తి ఉన్న సాక్ష్యమని అర్థం. ఈ సాక్ష్యం సాక్షిపై ఉన్న నమ్మకాన్ని రెండింతలు చేస్తుంది.

2. రూఢి సాక్ష్యపు రకాలు:- సాక్ష్య చట్టం రెండురకాల రూఢి సాక్ష్యాన్ని గుర్తిస్తుంది.
   (i) ముఖ్యాంశాలకు కాక ఇతర అంశాలకు చెందిన సాక్ష్యం.
   (ii) అదనపు సాక్ష్యం

### సెక్షన్ 156
### ముఖ్యేతర అంశాలకు చెందిన రూఢి సాక్ష్యం.

ఇది ఈ క్రింది రెండు షరతులను పూర్తిచేయవలసి ఉంటుంది.

(i) సాక్ష్యం ఇవ్వబడిన బలపరచే పరిస్థితి సాక్షి ద్వారా ముఖ్యాంశం జరిగినప్పుడుగానీ, జరిగిన సమయానికి దగ్గరగాగానీ గమనించబడియుండాలి.

(ii) కోర్టు అటువంటి పరిస్థితులు రుజువు చేయబడినట్లయితే ముఖ్యాంశాలకు సంబంధించి సాక్షి ఇచ్చిన సాక్ష్యాన్ని రూఢి చేస్తాయనే అభిప్రాయాన్ని కలిగియుండాలి.

<u>ఉదాహరణ</u>

ఎ, బిలు ఇద్దరూ కలసి ఒక చోట దొంగతనం చేశారు. బిపై నేరం మోపబడింది. సహాపరాధి ఎ బికి విరుద్ధంగా సాక్ష్యమిచ్చాడు. తన సాక్ష్యంలో ఎ దొంగతనంతో సంబంధం లేని అనేక విషయాలు దొంగతనం చేయటానికి వెళ్తున్నప్పుడు దారిలో జరిగినవి వివరించాడు.

మార్గమధ్యంలో జరిగిన విషయాల గూర్చి సహాపరాధి ఇచ్చిన సాక్ష్యంలోని నిజాన్ని రుజువు చేయటానికి ప్రాసిక్యూషన్ స్వతంత్ర సాక్షులను పిలుస్తుంది.

ఇక్కడ ముఖ్యమైన ప్రశ్న బి దొంగతనం చేశాడా, లేదా అనేది. ప్రాసిక్యూషన్‌వారిచే సమర్పించబడిన సాక్ష్యం ముఖ్య ప్రశ్నతో సంబంధం లేకుండా ఉంది. అది దొంగతనానికి సంబంధించి సహాపరాధి ఇచ్చిన సాక్ష్యాన్ని బలపరచటానికి సహాయ పడుతుందని అభిప్రాయపడినప్పుడు మాత్రమే కోర్టు దానిని రూఢి సాక్ష్యంగా తీసుకుంటుంది.

ముఖ్యాంశాలకు సంబంధించిన అదనపు సాక్ష్యం రూపంలో ఉండే ధృఢ సాక్ష్యం.

## సెక్షన్ 157

1. అదే విషయానికి సంబంధించి సాక్షి పూర్వం చేసిన ప్రకటనలేవైనా సాక్ష్యంగా ఇవ్వటం ద్వారా ఇటువంటి సాక్ష్యం సాధ్యపడుతుంది. ఇది సంగతంగా ఉన్న వ్యక్తి నమ్మదగ్గ వ్యక్తి అనే నియమాల మీద ఆధారపడి వుంటుంది. ఒక వ్యక్తి అంతకుముందు సందర్భంలో కూడా ఇటువంటి మాటే చెప్పాడనే విషయం సత్యానికి ఏమాత్రం తోడ్పడలేదు. ఒక వ్యక్తి తగిన ప్రేరణ ఉంటే ఎప్పుడూ ఒకేరకమైన అబద్ధం చెపుతూ ఉండవచ్చు. దీనివలన స్థిరత్వమనేది నిర్ణయదాయకమైన అంశమైతే అవినీతిపరులు అతి తేలికగా ఒక పథకం ప్రకారం నిరపరాధిపై నేరం మోపవచ్చు. అటువంటివారు ఒక వ్యక్తి పట్ల తమకు విరోధం ఉంటే వారే నేరాలు చేసి తర్వాత వేర్వేరు చోట్ల, వేర్వేరు వ్యక్తుల ముందు లేదా వేర్వేరు సమయాలలో నిరపరాధిని కేసులో ఇరికిస్తూ ప్రకటనలు చేయటం ద్వారా నిరపరాధికి శిక్షపడేలా చేయవచ్చు. ఆర్ నూలప్పల మధ్య వివాదం. 11 Bom. H.C.R. 196 (198)

2. తొలుత చేసిన ప్రకటన ప్రమాణపూర్వకంగా చేసినది కావచ్చు, కాకపోవచ్చు. అది మామూలు సంభాషణలో చేసింది కావచ్చు లేదా ప్రకటన చేసిన వ్యక్తిని ప్రశ్నించటానికీ, కేసును విచారించటానికీ అధికారం కలిగిన వ్యక్తుల ముందు చేసినది కావచ్చు. అది మౌఖికంగా గానీ, లిఖితపూర్వకంగాగానీ ఉండవచ్చు. అయితే విచారణ చేయటానికి అధికారమున్న వ్యక్తి ముందు చేసిన ప్రకటనకీ, అటువంటి అధికారం లేని వ్యక్తి ముందు చేసిన ప్రకటనకీ మధ్య ఒక తేడా ఉంది. అది చట్టపూర్వక అధికారం లేని వ్యక్తి ముందు చేయబడిన పూర్వ ప్రకటన అయితే అది సాక్ష్యంగా అనుమతించబడాలంటే అది కేసుకు సంబంధించిన ప్రధాన ఘట్టం జరిగిన సమయంలో మాత్రమే చేయబడిన ప్రకటన అయి ఉండాలి. ఈ నిబంధన చట్టరీత్యా విచారణ జరిపే అధికారం ఉన్న వ్యక్తుల ముందు చేసిన పూర్వపు ప్రకటనకు వర్తించదు. 25 మద్రాసు 210

ఉదా:

(i) ఒక బాలిక తనపై అత్యాచారం జరిగినట్లుగా అత్యాచారం జరిగిన వెంటనే ప్రకటన చేస్తే అది ఆమోదయోగ్యమవుతుంది.

(ii) ఒక వ్యక్తి ఇచ్చిన మరణ వాంఙ్మూలం అదృష్టవశాత్తూ ఆ వ్యక్తి మరణం నుండి బయటపడి బ్రతికినప్పుడు బలపరిచే సాక్ష్యంగా అనుమతించబడుతుంది.

(iii) పోలీసులకు ఇచ్చిన ప్రథమ సమాచారం సమాచార దాత సాక్ష్యాన్ని రూఢిచేసే సాక్ష్యంగా అనుమతించబడుతుంది.

(iv) పంచనామా బలపరిచే సాక్ష్యంగా అనుమతించబడుతుంది.
ముందు జాగ్రత్తగా రెండు విషయాలను తెలుసుకోవాలి.

(1) నేర న్యాయ ప్రక్రియ చట్టం చెందిన సెక్షన్ 162 ప్రకారం విచారణ జరిగేటప్పుడు పోలీసుల ముందు చేసిన ప్రకటనలను ఉపయోగించవలసి ఉంటుంది. చట్టరీత్యా విచారణ జరపటానికి అధికారం గల వ్యక్తి ముందు చేసిన పూర్వపు ప్రకటనలు కూడా ఉంటాయి.

ఇవి సాక్ష్యాన్ని బలపరచటానికి వినియోగించవచ్చా? ఒకప్పుడు వాటిని వినియోగించవచ్చుననే అభిప్రాయం ఉండేది.

36 కలకత్తా 281
25 మద్రాసు 397
39 బొంబాయి 58

నేర న్యాయ ప్రక్రియ చట్టం చెందిన విభాగం 162కు చేసిన సవరణ పోలీసుల ముందు చేసిన వ్రాతపూర్వక నివేదికలనూ, మౌఖిక నివేదికలనూ మినహాయింపు చేసింది. అవి పూర్వపు ప్రకటనలే అయినా రూఢి సాక్ష్యంగా ఉపయోగించబడవు.

రూఢి సాక్ష్యానికీ, ప్రధాన సాక్ష్యానికీ మధ్య గల తేడా ముఖ్యమైనది. దీనికి కారణం రూఢి సాక్ష్యపు ఉపయోగం. ఈ తేడా మీదే ఆధారపడి యుండటమే. రూఢి సాక్ష్యం ప్రధాన సాక్ష్యం కాదు.

ఉదా.

ఒక ఖైదీని విచారించేటప్పుడు అంతకుముందు అటువంటి నేరమే చేసిన ఇతర వ్యక్తులను విచారించేటప్పుడు సాక్షులు ఇచ్చిన ప్రమాణ పూర్వక వాంఙ్మూలాన్ని ఈ ఖైదీకి విరుద్ధంగా వాడవచ్చు. ఈ సందర్భంలో సాక్షులు మామూలు పద్ధతిలో విచారించబడటానికి బదులుగా పునఃప్రమాణం ఈ విధంగా చేస్తారు: ''ఈ కోర్టులో నేను పూర్వం సాక్ష్యమిచ్చివున్నాను. ఆ సాక్ష్యం నిజమే.''

ఈ సాక్ష్యం అనుమతి యోగ్యత లేని దానిగా తీసుకోబడింది. ఇది రూఢి సాక్ష్యం మాత్రమే. ఆ కారణంగా ఇది ప్రధాన సాక్ష్యం ఇచ్చిన తర్వాత మాత్రమే వాడబడుతుంది. ఒకవేళ ప్రధాన సాక్ష్యం ఇవ్వబడకపోతే రూఢి సాక్ష్యం ఇవ్వకూడదు. **12 W.R.Cr. 3**

అదేవిధంగా పంచనామా నేరస్తుడిని గుర్తించలేకపోతే రూఢి సాక్ష్యంగా గుర్తింపు పంచనామా అనుమతి యోగ్యం కాజాలదు.

ఈ సందర్భంగా ప్రధాన సాక్ష్యం ఇవ్వలేని వ్యక్తికి రూఢి సాక్ష్యం ఇవ్వాలా అన్న ప్రశ్న తలెత్తుతుంది. ఒక వ్యక్తి ప్రధాన సాక్ష్యం ఇవ్వలేకపోవటానికి అనేక కారణాలుంటాయి. ఇవి సాక్షి మరణించటం కానీ, లేదా కనబడకపోవడం, లేదా సాక్ష్యం ఇవ్వలేని స్థితిలో ఉండటం లేదా అతనిని కోర్టులో ప్రవేశపెట్టడానికి అధిక వ్యయంతో కానీ, అధిక సమయంతో కానీ కూడుకున్న పని అయినప్పుడు కోర్టు అతనిని ప్రవేశపెట్టడం సబబు కానట్లుగా భావించటం.

## సెక్షన్ 158

ప్రధాన సాక్ష్యం ప్రవేశపెట్టబడకపోయినా రూఢి సాక్ష్యాన్ని ఇవ్వటానికి అనుమతిస్తుంది. ఇది సాధారణ నియమానికి మినహాయింపు. ఈ మినహాయింపు సాక్షిని హాజరుపరచటం వీలుకాని పరిస్థితులలో మాత్రమే అమలుచేయబడుతుంది.

ఈ మినహాయింపు శాసనం ద్వారా చేయబడింది. శాసనం ద్వారా చేయబడిన మరొక మినహాయింపు నేర ప్రక్రియ చట్టం చెందిన సెక్షన్ 288లో పొందుపరచబడింది. ఈ సెక్షన్ ప్రకారం, విచారణ జరుపుతున్న మెజిస్ట్రేట్ ముందు ఇచ్చిన సాక్ష్యాన్ని సెషన్స్ కోర్టు ముందు ఇచ్చిన సాక్ష్యంగా అన్ని విషయాలలోను పరిగణించవచ్చు. అనగా అక్కడ పొందుపరచిన అన్ని విషయాలనూ ప్రధాన సాక్ష్యంగా తీసుకోవచ్చు.

3/2 సాక్షిని ప్రతివాదనకు గురి చేయటానికి సంబంధించిన నియమాలు.

2. ఈ విషయంలో రెండు పరిశీలనలచే తప్పనిసరిగా కట్టుదిట్టం చేయబడియుండాలి.

(i) కోర్టు చేసే విచారణ ముఖ్య ఉద్దేశం నిజం తెలుసుకోవటం కాబట్టి ప్రతివాదాన్ని అనుమతించవలసి ఉంటుంది.

(ii) ప్రతివాదాన్ని అనుమతించినప్పుడు విచారణ ముగింపు లేకుండా సాగుతుంది కాబట్టి ప్రతివాదన చేసే విధానానికి ఒక పరిమితి అంటూ ఉండటం అవసరం.

2. ఏయే కేసులలో సాక్షిని ప్రతివాదనకు గురిచేయవచ్చు?

సాక్షిని ప్రతివాదనకు గురిచేయటానికి సంబంధించిన విషయాలు సెక్షన్ 153లో పొందుపరచబడ్డాయి.

ప్రతివాదన కోసం ఈ సెక్షన్ సాక్షి సమాధానాలను రెండు తరగతులుగా విభజిస్తుంది: (1) ముఖ్యాంశాలకు సంబంధించిన సమాధానాలు (2) సాక్షి పరపతికి సంబంధించిన సమాధానాలు.

3. సాక్షి పరపతికి సంబంధించిన ప్రశ్నలకు సమాధానాలు ప్రతివాదానికి గురి చేయబడతాయా?

సెక్షన్153లో ఇచ్చినసమాధానంసానుకూలంగా ఉంది. వాటిని ప్రతివాదానికిగురిచేయకూడదని పేర్కొంటుంది.

ఈ నియమానికి రెండు మినహాయింపులున్నాయి.

(i) ముందు చేయబడిన నేర నిర్ణయం తిరస్కరించబడినప్పుడు ఎవరయినా సాక్ష్యంలో దానిని ఖండించవచ్చు.

(ii) సాక్షి పాక్షికంగా తిరస్కరించినప్పుడు అతన్ని ఖండించవచ్చు.

ఈ సందర్భంలో గుర్తుంచుకోవలసిన విషయం సెక్షన్ 155లో పొందుపరచబడిన నిబంధనల ప్రకారం అడ్డు పరీక్షలో ఒక సాక్షి మరొక సాక్షి అవిశ్వసనీయ పట్ల తన నమ్మకానికి కారణాలను తెలుపుతూ ఇచ్చిన సమాధానాలను ఖండించడానికి వీలులేదు.

ఇటువంటి సందర్భాలన్నిటిలో ఒక సాక్షి పరపతికి సంబంధించి ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలను ఖండించటానికి వీలుకానప్పుడు, వారి సమాధానాలు అసత్యాలయితే వారిపై అబద్ధపు సాక్ష్యం ఇచ్చినందుకుగాను నేరం మోపటానికి చట్టం అనుమతినిస్తుంది.

4. ముఖ్యాంశాలకు సంబంధించిన ప్రశ్నలకు సాక్షి ఇచ్చిన సమాధానాలు ఖండనకు అర్హమవుతాయా?

(1) సెక్షన్ 153 వ్యతిరేక స్వభావాన్ని కలిగివుంటుంది. ఇది ఖండన లేదా ప్రతివాదం అనుమతించబడని సందర్భాలను పేర్కొంటుంది.
ఇది ఏ సందర్భాలలో ఖండన అనుమతించబడుతుందో తెలియజేయదు.

(2) ఈ సెక్షన్ దాని నిషేధంలో ముఖ్య ప్రశ్నలకు సమాధానాలను చేర్చదు. అటువంటి సమాధానాలకు ప్రతివాదాన్ని అనుమతిస్తున్నట్టుగా ఈ సెక్షన్ సూచిస్తుంది.

(3) సెక్షన్ 153లో ఉదాహరణ (c) శాసనమండలి అటువంటి సమాధానాలకు ప్రతివాదాన్ని అనుమతించాలని ఉద్దేశించినట్లుగా తెలుపుతుంది.

5. ఈ కారణంగా సెక్షన్ 153 ముఖ్య ప్రశ్నలకు సమాధానాలను ఖండించవచ్చుననే నియమాన్ని ప్రతిపాదిస్తుంది. కానీ పరపతికి సంబంధించిన ప్రశ్నలకు సమధానాలను ఖండించడానికి వీలుండదు.

### ముఖ్యాంశాల ఖండన (Contradiction)

1. తరువాత ప్రశ్న: సాక్షిని పిలిచిన కక్షిదారు ఖండించటానికి అనుమతించబడతాడా? లేక అది విరోధి కక్షిదారుచే మాత్రమే అనుమతించబడుతుందా?

2. ఒక కక్షిదారు విరోధి కక్షిదారుచే పిలిపించబడ్డ సాక్షి ఇచ్చిన సమాధానాలను ఖండించవచ్చు అనేది నిర్వివాదమైనది. ఇది ఎప్పుడు అనుమతించబడుతుంది. ప్రతివాది సాక్ష్యులు ఖండించబడతారు. కానీ ఇది రెండవ కేసులో ఉన్నట్లు స్పష్టంగా కనిపించదు. ఒక సాక్షి ఒక కక్షిదారు తరఫున పిలవబడతాడు. ముఖ్యాంశానికి సంబంధించిన ప్రశ్నకు సమాధానంగా అతడు ఒక ప్రత్యేక సమాధానమిస్తాడు. దానిని అసత్యంగా అతనిని పిలిపించిన కక్షిదారు భావిస్తాడు. ఆ సాక్షిని పిలిపించిన కక్షిదారు మరొక సాక్షిని ఖండించటానికి పిలిపించవచ్చా?

3. అతడు పిలిపించవచ్చు అనేది ఈ ప్రశ్నకు సమాధానం. చట్టం తమ సొంత సాక్షిని అతని సాధారణ స్వభావాన్ని ఆక్షేపించటం ద్వారా పరపతి లేనివాడిగా చేయటానికి, ఏదైనా విషయానికి సంబంధించి అతని సాక్ష్యం తప్పు అని తెలియజేయటానికి మధ్య విభజ చేస్తున్నట్లుగా కన్పిస్తుంది.

## సాక్షిని విచారణ చేసే పద్ధతి

1. సాక్షిని విచారణ చేసే పద్ధతి అనగా అతనిని ప్రశ్నించే విధానం, అంటే అతనిని ప్రశ్నలు అడిగే విధానం.

2. ఈ విషయం సాక్షిని పరీక్షించే కక్షిదారు విచక్షణ వదిలివేయబడలేదు. ఇది చట్టం ద్వారా క్రమబద్ధం చేయబడింది.

3. ప్రశ్నలు అడిగే విధానాన్ని బట్టి అవి జవాబు సూచక ప్రశ్నలుగా గానీ, లేదా జవాబు సూచకంగా లేని ప్రశ్నలుగా గానీ ఉండవచ్చు.

4. జవాబు సూచక ప్రశ్న సాధారణంగా 'అవును', 'కాదు' అని చెప్పటం ద్వారా సమాధానమివ్వగలిగే ప్రశ్నగా ఉంటుంది. అలాంటి ప్రశ్నలన్నీ సూత్ర పరిధిలోనే ఉన్నా జవాబు సూచక ప్రశ్నల స్వభావం ఆ ప్రశ్నలకే పరిమితం కాబడదు.

సాక్ష్య చట్టం జవాబు సూచక ప్రశ్నను ఈ క్రింది విధంగా నిర్వచిస్తుంది: జవాబు సూచక ప్రశ్న అనేది ఒక ప్రత్యేక సమాధానాన్ని సూచించే ప్రశ్న. ఈ సమాధానాన్ని సాక్షివద్దనుంచి పొందాలనుకుంటాడు అడిగే వ్యక్తి.

ఉదాహరణ.

కత్తిపోట్లతో ఒక వ్యక్తి హత్యచేయబడినప్పుడు ఆ కేసు విచారణలో సాక్షిని 'నిందితుడు రక్తపు మరకలతో చేతిలో కత్తితో శవం దగ్గర నుండి బయటకు వస్తుండగా నువ్వు చూశావా?' అని అడిగితే అది జవాబు సూచక ప్రశ్న అవుతుంది.

5. రెండు రకాల జవాబు సూచక ప్రశ్నల మధ్య విభజన చేయవలసి వుంటుంది.

(i) సమాధానాన్ని సూచించే జవాబు సూచక ప్రశ్న.

(ii) సాక్షి దృష్టిని విషయం వైపుకు మరల్చేటట్లుగా విషయం గురించి అడిగే జవాబు సూచక ప్రశ్న.

రెండవ తరగతికి చెందిన జవాబు సూచక ప్రశ్నకు ఉదాహరణగా ఈ క్రింద విషయంగమనించవచ్చు.

బి ఎ పై పరువు నష్టం దావా వేశాడు. దీనికి కారణం ఎ సితో మాట్లాడుతున్నప్పుడు బి దివాలా తీశాడనీ, అతని పేరు లండన్ రాజపత్రంలో దివాలాదారుల జాబితాలో వస్తుందనీ చెప్పినట్లుగా బి ఆరోపిస్తాడు. సాక్షిని ఈ క్రింది ప్రశ్న అడిగారు.

''రాజపత్రం (గెజిట్) గురించి ఏమన్నా చెప్పబడిందా?''

ఇది సమాధానాన్ని సూచించే ప్రశ్నలాంటి జవాబు సూచించే ప్రశ్న కాదు. ఇది సాక్షి మనసును ఏ విషయం గూర్చి ప్రశ్నలు అడగబోతున్నారో ఆ విషయం మీదికి మళ్ళించే విధంగానున్న జవాబును సూచించే ప్రశ్న.

ప్రధాన పరీక్షలో సాక్షిని విచారించే విధానానికి అడ్డు పరీక్షలో విచారణ జరిపే విధానానికీ తేడా ఉంది.

అడ్డు పరీక్షలో సాక్షిని జవాబు సూచక ప్రశ్నలతో పరీక్షించవచ్చు. కానీ విరోధిపక్షం వారు అభ్యంతరపెడితే జవాబు సూచక ప్రశ్నలు ప్రధాన పరీక్షలో అనుమతించబడవు.

ప్రధాన పరీక్షలో సాక్షిని ఈ క్రింది ప్రశ్నల వంటివి మాత్రమే అడుగవలసి ఉంటుంది:

''నువ్వు ఏం చూశావు?'', ''నువ్వు ఏం విన్నావు?'', ''తర్వాత ఏమైంది?''

## నియమానికి గల కారణాలు

(1) ఒక సాక్షి తనను పిలిపించిన కక్షిదారుకు అనుకూలంగానూ, విరోధి కక్షిదారుకు వ్యతిరేకంగానూ ఉంటాడు. కాబట్టి అతడు తనను పిలిపించిన కక్షిదారుచే నియమింపబడ్డ న్యాయవాది సూచించిన సమాధానాలకు సాధారణంగా అంగీకారాన్ని తెలియజేస్తాడు.

(2) సాక్షిని పిలిచిన కక్షిదారుకు విరోధి కక్షిదారు కంటే ఎక్కువ ప్రయోజనం కలుగుతుంది. దీనికి కారణం అతనికి సాక్షి ఏ విషయాలను రుజువు చేస్తాడో లేదో ఏ విషయాలను రుజువు చేయటానికి పిలవబడ్డాడో తెలిసుంటుంది. ఈ కారణంగా అతనే ముందుగా సాక్షిని ప్రశ్నించవలసి వస్తే అతడు సాక్షి తనకు అనుకూలంగా ఎంత సమాచారాన్ని ఇస్తాడో అంతవరకే అతని వద్ద నుండి రాబట్టే విధంగా లేదా విషయాన్నంతటినీ తప్పుడు అర్థంలో నుండి చూపించే విధంగా సాక్షిని ప్రశ్నిస్తాడు.

ఈ నియమానికి గల మినహాయింపులు.

జవాబు సూచక ప్రశ్నలు ప్రధాన పరీక్షలో ఈ క్రింది సందర్భాలలో అనుమతించబడతాయి:-

(i) విషయాలు సాక్షి పేరు, వృత్తి మొదలగు వాటిని పరిచయం చేసేవిగా మాత్రమే ఉన్నప్పుడు.

(ii) వ్యక్తులను గానీ, వస్తువులను గానీ గుర్తించేటప్పుడు

(iii) వివాదంగా లేని విషయాల గురించి ప్రశ్నించేటప్పుడు

(iv) ఒక ప్రశ్నను దాని స్వభావ దృష్ట్యా జవాబు సూచక ప్రశ్న రూపంలో కాక మరే రూపంలోనూ పెట్టలేని సందర్భాలలోను.

(v) రెండవ పక్షానికి చెందిన సాక్షి ఇచ్చిన సాక్ష్యాన్ని ఖండించవలసి వచ్చినపుడు.

ఉదా- వాది ప్రమాణం చేసి ప్రతివాది ''వస్తువులన్నీ నమూనాగా ఇచ్చిన దానికి సమానంగా ఉండాల్సిన అవసరం లేదు'' అని అన్నట్లుగా చెప్పినప్పుడు ప్రతివాదిని ''నువ్వు వాదితో వస్తువులన్నీ నమూనా వస్తువుతో సమానంగా ఉండాల్సిన అవసరం లేదనిగానీ, ఈ భావం వచ్చేటట్లు మరేదన్నా గాని అన్నావా?'' అని అడగవచ్చు, అడగాల్సి ఉంటుంది కూడా.

(vi) సాక్షి ప్రతికూలంగా ఉన్నప్పుడు. ప్రతికూలంగా ఉన్న సాక్షికి, అనుకూలంగా లేని సాక్షికీ గల విభేదం.

ఒక సాక్షి తనకు తెలిసినంతవరకూ ఏం జరిగిందో గుర్తు చేసుకుని చెప్పాలిగానీ తాను విన్నదాన్ని చెప్పకూడదు.

ఒకవేళ సాక్షి ఏం జరిగిందో గుర్తు చేసుకోలేనప్పుడు, అతని జ్ఞాపకశక్తి నశించినప్పుడు ఏం చేయాలి?

ఇటువంటప్పుడు ఈ క్రింది రెండు మార్గాలు అందుబాటులో ఉంటాయి.

(1) జవాబు సూచక ప్రశ్నల ద్వారా సాక్షికి జ్ఞాపకం వచ్చేలాగా చేయటం.

(2) అంశానికి సంబంధించి ఏదైనా లిఖితపూర్వకంగా ఉంటే దానిని చదవటానికి అనుమతించటం ద్వారా అతనిని విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకునేలా చేయటం.

జ్ఞాపకం తెప్పించేందుకు సహాయపడే పత్రాలకు ఉదాహరణలు.

(i) డైరీలో నమోదు చేసుకున్న విషయాలు, వాయిదాల పుస్తకంలో నమోదైన విషయాలు, ఎకౌంటు పుస్తకాలలో నమోదైన విషయాలు, రైల్వే టైం టేబుల్‌లో నమోదు చేయబడిన విషయాలు.

ఒక సాక్షి తానే రాసుకున్న ఏ పత్రాన్నయినా చదవటం ద్వారా విషయాన్నంతటినీ జ్ఞప్తికి తెచ్చుకోవచ్చు. అంతేకాక తన పర్యవేక్షణలో ఇతరులు రాసిన పత్రాల ద్వారా కూడా అతడు మరచిపోయిన విషయాన్ని తిరిగి జ్ఞప్తికి తెచ్చుకోవచ్చు.

అయితే ఇందుకు ఒక నిబంధన ఉంది. ఆ పత్రం వ్యవహారమంతా అతని మెదడులో స్పష్టంగా ఉన్నప్పుడు మాత్రమే రాయబడినదై ఉండాలి. అదే ఇతరులు రాసినదైతే వ్యవహారమంతా అతని మెదడులో స్పష్టంగా ఉన్నప్పుడు అతడు చదివి సరియైనదిగా గుర్తించనటువంటిదై ఉండాలి.

మూలపత్రాన్ని కోర్టులో దాఖలు చేయకపోవటానికి తగిన కారణాలుంటే వాటిని కోర్టు ఒప్పుకుంటే నకలు పత్రాన్ని వాడవచ్చు.

ఒక పత్రాన్ని తనిఖీ చేయటం ద్వారా విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవటం కారణంగా ఆ పత్రం పత్ర

సాక్ష్యం కానేరదు. దీనివలన ముద్రలేని కారణంగా సాక్ష్యంగా పనికిరాని పత్రం మర్చిపోయిన విషయాన్ని జ్ఞప్తికి తెప్పించటానికి వాడటానికి అనుమతించబడుతుంది.

ఒక పత్రాన్ని విషయాన్ని జ్ఞాపకం చేయటానికి వాడటానికీ, విషయాన్ని బలపరచటానికి వాడటానికీ తేడా ఉంది.

బలపరచటానికి ఉపయోగించబడని పత్రం జ్ఞాపకం చేయటానికి ఉపయోగించబడుతుంది.

ఉదాహరణ: పోలీసు డైరీల వాడకం.

జ్ఞాపకం చేయటానికి వాడిన పత్రానికి సంబంధించి జ్ఞాపక పత్రం జ్ఞాపకాన్ని తెప్పిస్తుందా లేదా అనే విషయాన్ని నిశ్చయించవలసి ఉంటుంది.

అందువలన చట్ట ప్రకారం అటువంటి జ్ఞాపక పత్రాన్ని విరోధి కక్షిదారు కోరినట్లయితే అతనికి చూపించవలసి ఉంటుంది. ఆ పైన అతను అవసరమనుకుంటే సాక్షిని అడ్డుపరీక్ష చేయవచ్చు.

ఈ క్రింది విషయాల పరిశీలన కొరకు విరోధి కక్షిదారు పత్రాలను పరీక్షించటానికి అనుమతి లభిస్తుంది:

(i) విషయానికి సంబంధించి సాక్షి జ్ఞాపకాల పూర్తి ప్రయోజనం పొందటానికి;

(ii) అనుచిత పత్రాలు వాడబడకుండా నిరోధించటానికి;

(iii) సాక్షి మౌఖిక సాక్ష్యాన్ని లిఖిత సాక్ష్యంతో సరిపోల్చటానికి.

విరోధి కక్షిదారు సాక్షిని పత్ర సహాయంతో విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకోమని వత్తిడి చేయగలడా?

పోలీసు అధికారి ఏదైనా ఒక విషయాన్ని ప్రకటిస్తే దానివలన నిందితుడికి చాలా లాభం చేకూరవచ్చు. పోలీసు అధికారి విషయాన్ని గుర్తు చేసుకోడు. అతడు తన డైరీ చూసుకొని విషయాన్ని స్పష్టంగా జ్ఞప్తికి తెచ్చుకోడు.

**(8 Cal. 154), (8 Cal. 739)** అతనిని బలవంత పెట్టకూడదని చెబుతాయి.

**A.I.R. (1924). Pat. 829.** అతనిని బలవంత పెట్టవచ్చుని చెబుతుంది.

## సాక్షి పరీక్షపై పరిమితులు

**1.** ఈ విభాగం క్రింద పరిశీలించబోయే విషయం సాక్షి ఏ ప్రశ్నలకు సమాధానాలివ్వాలి, ఏ ప్రశ్నలకు ఇవ్వనవసరం లేదు అనేది.

2. సాధారణ నియమం ప్రకారం సాక్షి తనను అడిగిన అన్ని ప్రశ్నలకూ సమాధానమివ్వాల్సి ఉంటుంది.

## సెక్షన్ 132

సెక్షన్ 132 విషయాన్ని విరుద్ధంగా సూచిస్తుంది.

3. ఈ నియమానికి రెండు పరిమితులున్నాయి.:

(i) కొన్ని ప్రశ్నలకు సమాధానమివ్వవలసిందిగా సాక్షిని ఒత్తిడి పెట్టడానికి వీలులేదు.

(ii) కొన్ని ప్రశ్నలకు సమాధానమివ్వటానికి సాక్షికి అధికారమివ్వబడదు.

4. సమాధానాలివ్వవలసిందిగా ఒత్తిడి చేయకూడని ప్రశ్నలు సెక్షన్లు 121, 122, 124, 125, 129లలో పొందుపరచబడ్డాయి

5. సమాధానాలివ్వటానికి సాక్షికి అధికారం ఇవ్వబడని ప్రశ్నలు సెక్షన్లు 123, 126, 127, 128లలో పొందుపరచబడ్డాయి.

నిరూపణ భారాన్నుండి విముక్తి చేయటం

1. సాక్ష్య ప్రభావం ఈ క్రింది విధంగా ఉండవచ్చు.
   (i) ఒక అంశాన్ని రుజువుపరచుట.
   (ii) ఒక అంశాన్ని కాదని రుజువుపరచుట.
   (iii) రుజువుపరచుటలో విఫలమై ఆ కారణంగా కాదని రుజువుపరచుట.

2. నిరూపణ భారం తొలగిపోవు సందర్భాలు:
   (i) రుజువుపరచవలసిన అంశం రుజువుపరచబడటం.
   (ii) కాదని రుజువుపరచవలసిన అంశం కాదని రుజువుపరచబడటం.

3. నిరూపణ భారం ఉన్న కక్షిదారు రుజువుపరచటంలో గానీ, కాదని రుజువుపరచటంలో గానీ విఫలమైతే అతడు రుజువు చేసే భారాన్నుండి విముక్తి పొందడు.

4. ఒక అంశం రుజవుపరచబడినట్లుగా గానీ, కాదని రుజువు పరచబడ్డట్లుగా గానీ ఎప్పుడు చెప్పబడుతుంది? ఒక అంశం రుజువుపరచనట్లుగా ఎప్పుడు చెప్పబడుతుంది?

ఈ ప్రశ్నకు సమాధానం సెక్షన్ 3లో ఇవ్వబడుతుంది.

గమనిక:- రెండు విషయాలను గుర్తుంచుకోవాలి.

(i) రుజువంటే నిర్దిష్టమైన గణాంక ప్రదర్శన కాదు.

(ii) నైతిక నమ్మకం రుజువు కానేరదు.

రుజువంటే సాక్ష్యం

అయితే ఆ సాక్ష్యం సగటు వ్యక్తిని ఒక నిర్ణయానికి వచ్చేలా చేసేదిగా ఉండాలి.

(1911) I.K.B 988 (995).

31 Bom. L.R. 516.

రుజువనేది ఒకానొక సంభావ్యతే కాని నిశ్చయం కాదు.

## నిరూపణ భారాన్నుండి విముక్తి చేయటం, సాక్ష్య పరిమాణం

I ఇంగ్లీషు చట్ట ప్రకారం కొన్ని కేసులలో బలపరచటం అవసరం:

(1) ఘోర రాజద్రోహం - ఇద్దరు సాక్షులు.

(2) అబద్ధపు సాక్ష్యం

(3) వాగ్దానం దాటివేత

(4) జారజుడు - తల్లి సాక్ష్యం బలపరచబడాలి.

II భారతీయ చట్టంలో సంపూర్ణమయిన నియమం ఉంది. ఒకే సాక్షి ఇచ్చిన సాక్ష్యం ఆధారంగా ది మరో సాక్ష్యంతో బలపరచబడకపోయినప్పటికీ కోర్టు చర్య తీసుకోవచ్చు.

## అయిదో భాగం

# అన్ని మతాలవారికీ అస్పృశ్యులే

అస్పృశ్యత గురించి విదేశీయులకు తెలుసు. కాని ఆ దురాచారాన్ని దగ్గర నుంచి చూడలేదు కనుక నిజంగా అదెంత దారుణమైందో అర్థం చేసుకోలేరు. అగ్రవర్ణాల హిందువులు అధిక సంఖ్యలో ఉన్న గ్రామాలలో ఊరి చివర చెత్తకుప్పల సరసన హిందువుల ఇళ్ల ముందు ఆహారం అడుక్కుని, దుకాణాలకు దూరంగా నిలబడి నూనెలు దినుసులు కొనుక్కుని, ప్రతి ఇల్లూ తనదే అనుకుంటూ, ఊరంతా తనదే అనుకుంటూ ఎవరినీ అంటకుండా ఎవరికీ కాకుండా ఎంత ఘోరంగా బతుకుతున్నారో అర్థం చేసుకోవడం వారికి కష్టమే. అగ్రవర్ణాల వారు అస్పృశ్యుల పట్ల ప్రవర్తించిన తీరు అర్థమయ్యేట్టు వివరించడమే లక్ష్యం. ఒక వివరణ లేదా కొన్ని వాస్తవిక సంఘటనల ఉదాహరణ - అని ఈ అంశం గురించి రెండు రకాలుగా చెప్పవచ్చు. రెండో పద్ధతే సరైనదని నా అభిప్రాయం. నా జీవితం నుంచి, మరికొందరి జీవితాల నుంచి కొన్ని సంఘటనలను ఎంచుకున్నాను. నా జీవితంలో నాకు ఎదురయిన కొన్ని అనుభవాలతో ప్రారంభిస్తాను.

బొంబాయి ప్రెసిడెన్సీలో రత్నగిరి జిల్లా - దాపోలీ తాలూకాలో మా కుటుంబం ఉండేది. ఈస్ట్ ఇండియా కంపెనీ వ్యాపారం ప్రారంభించిన నాటినుంచి మా పూర్వీకులు వారసత్వ వృత్తులు వదిలేసి కంపెనీ సైన్యంలో చేరారు. మా తండ్రి కూడా ఆ కుటుంబ సంప్రదాయాన్ని అనుసరించి సైన్యంలో చేరారు. ఆఫీసర్‌గా ఎదిగి సుబేదార్‌గా పదవీ విరమణ చేశారు. తర్వాత దాపోలీలో స్థిరపడదామని కుటుంబాన్ని తీసుకువెళ్లారు. కాని ఎందుకో మనసు మార్చుకున్నారు. దాపోలీ నుంచి సతారాకు కుటుంబాన్ని తరలించారు. అక్కడే 1904 వరకు ఉన్నాం. నాకు గుర్తున్న తొలి సంఘటన సతారాలో 1901లో జరిగింది. మా అమ్మ అప్పుడు చనిపోయింది. తీవ్రమయిన కరవు ఏర్పడి వేలాది మంది ఆకలి చావులు చస్తున్నందున దుర్భిక్ష పీడితులకు పని కల్పించడం కోసం సతారా జిల్లా ఖటావ్ తాలూకా గోరేగావ్‌లో ఒక చెరువు తవ్విస్తుంటే కాషియర్‌గా పనిచేసేందుకు మా నాన్న అక్కడికి వెళ్లారు. నన్ను మా అన్నను, చనిపోయిన మా పెద్ద అక్క కొడుకులిద్దరినీ, మా పిన్ని చేతిలో పెట్టి నాన్న వెళ్లారు. పొరుగున ఉన్న మంచివారికి మమ్మల్ని అప్పగించారు. మా పిన్ని ఎంతో ఉత్తమురాలు. కాని మాకు అంతగా ఉపయోగం ఉండేది కాదు. ఆమె కాళ్లకు ఏదో జబ్బు చేసింది. ఆమె పొట్టిగా ఉండేవారు. ఎక్కడికయినా కదలాలంటే ఆమెకు ఎవరయినా సాయం చేయక తప్పదు. ఒక్కోసారి

పూర్తిగా ఎత్తుకోవలసి వచ్చేది. నాకు అక్క చెల్లెళ్లున్నారు. వివాహమయి వెళ్లిపోయారు. పిన్ని నిస్సహాయత వల్ల, మాకు రోజూ వంట ఒక పెద్ద సమస్యగా ఉండేది. మేం నలుగురు పిల్లలం బడికి వెళ్లేవారం. ఇంట్లో వంట కూడా మాపనే. బియ్యం, మాంసం కలిపి సులువుగా వండుకోవచ్చని ఎప్పుడు పులావే చేసుకునేవారం.

కాషియర్ కనుక మా నాన్న పనిచేసే చోటునుంచి సతారాకు వచ్చి మమ్మల్ని చూడడం సాధ్యంకాకపోయేది. కనుక గోరేగావ్‌కు రమ్మని మాకు ఉత్తరం రాసేవారు. అట్లా వేసవి సెలవులను ఆయనతో గడిపేవారు. అప్పటివరకు మాలో ఎవ్వరూ రైలు చూళ్లేదు కనుక గోరేగావ్‌కు వెళ్లడమంటే సరదాగా ఊహించుకునేవాళ్లం. చాలా వస్తువులు సిద్ధం చేసుకున్నాం. ఇంగ్లీషు తరహాలో కొత్త షర్ట్‌లు కుట్టించుకుని, బాగా మెరిసే రాళ్లు పొదిగిన టోపీలు, కొత్త బూట్లు, పట్టు అంచు ధోవతులు ప్రయాణానికి ముందే సిద్ధం చేసుకునేవారం. ప్రయాణం గురించి మాకంతా నాన్న వివరించేరు. ఎప్పుడు రైలెక్కుతున్నామో చెప్తే గోరేగావ్‌కు ప్యూన్‌ను పంపుతానని లేఖ రాశారు. పొరుగువారికి మా పిన్నిని అప్పగించి నేనూ, అన్నయ్య, మా అక్క కొడుకు బయలుదేరాం. మా ఊరి నుంచి రైల్వేస్టేషన్ 10 కిలోమీటర్ల దూరం. అక్కడికి టాంగా (గుర్రంబండి)లో వెళ్లాం. కొత్త బట్టలు వేసుకుని ప్రయాణానికి వెళ్తుంటే మాకేమో చాలా సంతోషంగా ఉంది. మా పిన్ని మాత్రం మేం దూరమవుతున్నామన్న బాధతో నేలపైపడి ఏడ్చింది.

రైల్వే స్టేషన్ చేరగానే మా అన్నయ్య టికెట్లు కొన్నాడు. నాకు, అక్క కొడుక్కి టిక్కెట్, తలా రెండణాలు ఇచ్చాడు. దాంతో మన ఇష్టం వచ్చినట్టు ఖర్చుచేసుకొనడానికికన్నమాట. అక్కడ నిమ్మ పానీయం కొనడంతో మా కొనుగోళ్లు ప్రారంభించాం. రైలు కూత వినగానే - కదలకముందే ఎక్కాలన్న ఆతృతతో వీలయినంత వేగంగా రైలు ఎక్కేశాం. గోరేగావ్‌కు దగ్గరి స్టేషన్ మాసూర్. అక్కడ దిగమని మాకు చెప్పారు. సామాన్లతో దిగాం. మాతో దిగినవాళ్లంతా వెళ్లిపోయారు. మొత్తం ప్లాట్‌ఫాంమీద మేం నలుగురమే మిగిలాం. నాన్నయినా వస్తారు లేకపోతే ఎవర్నయినా పంపుతారని ఎదురుచూశాం. ఎంతసేపయినా రాలేదు. గంట దాటింది. స్టేషన్ మాస్టర్ వచ్చి టికట్లడిగారు. చూపాం. ఎందుకు ఆగారని అడిగాడు. గోరేగావ్‌కు వెళ్లాలని, మా నాన్నగానీ లేదా ఆయన నౌకరు ఎవరయినా వస్తారని ఎదురుచూస్తున్నామని చెప్పాం. గోరేగావ్ ఎట్లావెళ్లాలో తెలియదని చెప్పాం. మా బట్టలు, మాటలు చూస్తే ఎవ్వరూ మమ్మల్ని అస్పృశ్యులు అనుకోరు. స్టేషన్ మాస్టర్ మమ్మల్ని బ్రాహ్మణ పిల్లలని అనుకుని ఉంటారు. మా పరిస్థితి తెలిసి ఎంతో బాధపడ్డారు. మామూలుగానే అందరు హిందువులను అడిగినట్టే మేమెవరిమని అడిగారు. నేను ఒక్క క్షణం కూడా సంకోచించకుండా 'మహర్'లమని

చెప్పాను (బొంబాయి ప్రెసిడెన్సీలో మహర్‌లను అస్పృశ్య కులాల్లో ఒకటిగా పరిగణిస్తారు) అతను ఆశ్చర్యపోయాడు. ముఖంలో హఠాత్తుగా మార్పులు వచ్చాయి. అతనిలో విద్వేషం పొంగుతున్నదని నేనుగమనించాను. నా జవాబు వినగానే అతను స్టేషన్‌లో తనగదిలోకి వెళ్లిపోయాడు. మేం ఎక్కడున్నామో అక్కడే నిలబడ్డాం. ఇంకో పదిహేను నిమిషాలు గడిచాయి. సూర్యుడు అస్తమిస్తున్నాడు. నాన్న రాలేదు, ఆయన నౌకరూ రాలేదు. స్టేషన్ మాస్టర్ కూడా వదిలేశారు. ప్రయాణం ప్రారంభించినపుడు ఉన్న ఉత్సాహం సంతోషం కరిగిపోయి విపరీతమయిన విచారం మిగిలింది.

అరగంట తర్వాత స్టేషన్ మాస్టర్ వచ్చి మేం ఏం చేయదలచుకున్నామో చెప్పమన్నాడు. మాకు ఎడ్లబండి కిరాయికు దొరికితే గోరేగావ్ దాకా వెళ్తాం. అంతదూరం కాదంటే నడిచి వెళ్తాం అని చెప్పాము. అక్కడ చాలా ఎడ్లబండ్లు కిరాయికి తిరుగుతాయి, కాని నేను మహర్‌లమని చెప్పిన మాట అక్కడి బండివాళ్లందరికీ తెలిసిపోయింది. అస్పృశ్య కులాల పిల్లలను ఎక్కించుకుని మైలపడే కష్టానికి ఎవరూ సిద్ధంగా లేరు. రెట్టింపు డబ్బు ఇస్తామని చెప్పాం. అయినా ఎవరూ రాలేదు. మా తరపున బండివారితో మాట్లాడిన స్టేషన్ మాస్టర్‌కి ఏం చేయాలో తోచలేదు. ఏదో ఆలోచన మెరిసినట్టుంది. మావైపు తిరిగి ''మీలో ఎవరయినా బండి తోలగలరా?'' అని అడిగాడు. మా సమస్యకో పరిష్కారం చెప్తున్నాడన్న ఉత్సాహంతో 'తోలగలం' అని జవాబిచ్చాం. బండి మేం తోలుతూ వెళ్లాలి. బండివాడు మమ్మల్ని అంటకుండా ప్రక్కన నడుస్తాడు. అతనికి రెట్టింపు డబ్బు ఇవ్వాలి. బండివాడు ఆనందంగా ఒప్పుకున్నాడు. డబ్బొవస్తుంది, తాను మైలపడడు.

అప్పటికి ఆరున్నరయింది. మేం బయలుదేరబోతున్నాం. కాని చీకటి పడేలోగా గోరేగావ్ చేరలేకపోతే బయలుదేరడం ఎందుకని మా ఆలోచన. గోరేగావ్ చేరడానికి ఎంతసేపవుతుందని బండివాడిని అడిగాం. మూడు గంటలు మించదు అని చెప్పాడు. ఆ మాట నమ్మి సామాన్లు ఎక్కించాం. స్టేషన్ మాస్టర్‌కు కృతజ్ఞతలు చెప్పి బండి ఎక్కాం. మాలో ఒకరు పగ్గాలు అందుకున్నాడు. బండివాడు ప్రక్కన నడుస్తున్నాడు.

స్టేషన్‌కు సమీపంలోనే ఓ నది ప్రవహిస్తున్నది. అక్కడక్కడ కొన్ని నీళ్లు తప్ప నది ఎండిపోయి కనిపిస్తున్నది. అక్కడ ఆగి భోజనం చేయాలని బండివాడు చెప్పాడు. తర్వాత నీళ్లు దొరకవన్నాడు. సరేననుకున్నాం. కిరాయిలో కొంత డబ్బిస్తే ఊళ్లోకి వెళ్లి తాను ఏమయినా తింటానని చెప్పాడు. డబ్బు తీసుకుని వెంటనే వస్తానని వెళ్లాడు. ఆకలితో ఉన్నాం కనుక తొందరగా తిందామనుకున్నాం. మా పిన్ని ప్రక్కింటివారి సాయంతో తినుబండారాలు చేసిపెట్టింది. టిఫిన్ బుట్ట తెరిచి తినడం మొదలుపెట్టాం. పాత్రలు కడిగేందుకు నీళ్లు కావాలి. నీటి ఊట దగ్గరికి మాలో ఒకరు వెళ్లారు. కాని అది నీరు కాదు.

బురద. పశువుల పేడ, మూత్రం కలిసి ఉంది. అది మనుషులు వాడే నీరు కాదు. అంత మురికివాసనకొట్టే నీటిని తాగడం అసాధ్యం. కనుక అర్థాంతరంగా ఆకలి తీరకుండానే భోజనం ముగించక తప్పలేదు. బండివాడికోసం ఎదురుచూస్తూ కూచున్నాం. ఎంతసేపటికీ అతను రాలేదు. అతని కోసం అన్నిదిక్కులా చూడడం తప్ప మేం చేయగలిగిందేమీ లేదు. చాలాసేపటికి అతను వచ్చాడు. మళ్లీ ప్రయాణం మొదలయింది. నాలుగైదు మైళ్లు గడిచిన తర్వాత బండివాడు మా చేతుల్లోంచి పగ్గాలు తీసుకుని బండి నడపడం ప్రారంభించాడు. అంటరానివారిని అంటితే మైలపడతానని నడిచిన బండివాడు ఎందుకు హఠాత్తుగా బండెక్కాడో అర్థంకాలేదు. అయినా మేమెవ్వరమూ ఎందుకని అడిగే సాహసం చేయలేదు. గోరేగావ్‌కు వీలైనంత తొందరగా చేరుకోవడమే మా ఆలోచన. బండి నడిస్తే చాలనుకున్నాం. అంతలోనే మా చుట్టూ చీకట్లు కమ్ముకున్నాయి. మనుషులెవరూ నడవడంలేదు. కనీసం పశువులు కూడా కనిపించడంలేదు. ఒంటరితనం మమ్మల్ని బాధించింది. ఆందోళన పెరిగింది. ధైర్యం కూడగట్టుకుని ప్రయాణిస్తున్నాం. మాసూర్ నుంచి చాలా దూరం వచ్చాం. మూడు గంటలు దాటింది. గోరేగావ్ జాడేలేదు. బండివాడు మమ్మల్ని మోసంచేసి ఎక్కడికో తీసుకవెళ్లి చంపేస్తాడేమోనన్న భయం మొదలైంది. మా వంటిమీద బంగారు ఆభరణాలున్నాయి. కనుక భయం మరింత పెరిగింది. ఇంకా ఎంతదూరం అని అడిగిన ప్రతిసారీ ''ఇంకెంత? వచ్చేశాం!'' అంటున్నాడు. రాత్రి 10 అయింది. పిల్లలు ఏడవడం మొదలుపెట్టారు. బండివాడిని తిట్టడం కూడా సాగింది. అతను జవాబివ్వలేదు. దూరంగా వెలిగే ఓ దీపాన్ని చూపి ''ఆ కాంతి చూశారా? అది టోల్ కలెక్టర్ లైట్. మనం ఈ రాత్రి అక్కడ ఆగుదాం.'' అన్నాడు. పిల్లలు ఏడ్పులు ఆపారు. ఆ దీపం మరీ దూరంగా ఉంది. అక్కడికి చేరుకోవడానికి 2 గంటలు పట్టింది. ఇంతసేపు మాలో ఆతురత భయం ఆందోళన. ఎందుకింత ఆలస్యం, మనం సరైన రోడ్డుమీదే వస్తున్నామా? ఇంకెంతసేపు అంటూ ఎన్నో ప్రశ్నలు వేశాం.

చివరకు అర్ధరాత్రికిగాని టోల్‌కలెక్టర్‌గుడిసెకు చేరుకోలేకపోయాం. కొండ దిగువన ఉందాగుడిసె. అక్కడ ఎన్నో ఎడ్లబండ్లు రాత్రి బసకోసం ఆగాయి. బాగా ఆకలిగా ఉంది. కాని నీళ్లు ఎట్లా? బండివాడిని అడిగాం. మీరు మహర్‌లమన్న నిజం చెప్తే నీళ్లు పుట్టవు. ఎందుకంటే టోల్ కలెక్టర్ హిందువు. మహ్మదీయులమని చెప్పండి. తర్వాత మీ అదృష్టం. ఆయన చెప్పినట్టే నేను టోల్ కలెక్టర్ గుడిసెకు వెళ్లి నీళ్లడిగాను. ''మీరెవరు'' అని అడిగాడు. ''ముసల్మాన్‌లం'' అని చెప్పాను. నాకు ఉర్దూ బాగా తెలుసుకనుక ఉర్దూలో మాట్లాడాను. కాని లాభం లేదు. అతను కఠినంగా జవాబిచ్చాడు. ''నీకోసం ఇక్కడ నీళ్లు ఎవరు పెట్టారు?'' ఆ కొండమీద నీళ్లున్నాయి. నా దగ్గర లేవు. వెళ్లి తెచ్చుకో '' నేను బయటికి వచ్చి అన్నకు ఆ విషయం చెప్పాను. ఆయన ఏమనుకున్నాడోకాని పడుకోమని మాకు సలహా ఇచ్చాడు.

ఎడ్ల కట్లు విప్పారు. బండి నిలబెట్టారు. బండి కింద పరుపులు పరచుకుని పడుకున్నాం. సురక్షిత ప్రదేశానికి వచ్చాం కనుక ఏ భయమూ లేకుండా ఉన్నాం. కాని నాకు అప్పుడే జరిగిన సంఘటనమీంచి మనసు మళ్లడంలేదు. మాదగ్గర కావలసినంత తిండిపదార్థాలున్నాయి. కడుపులో ఆకలి మండుతున్నది. అయినా ఆకలితో నిద్రపోవాలి. ఎందుకంటే నీళ్లులేవు. నీళ్లు ఎందుకు లేవంటే మేం అస్పృశ్యులం కనుక. కనీసం ఒక సురక్షిత ప్రాంతానికి వచ్చాం. కాని మా అన్నకు ఆలోచనలు మరోవిధంగా ఉన్నాయి. మనం నలుగురమూ పడుకోవడం మంచిదికాదు. ఏమయినా జరగవచ్చు. ఇద్దరు మేలుకుని ఉండడం మంచిది. మరో ఇద్దరు నిద్రపోవచ్చు. ఆ కొండ దిగువన రాత్రి ఆవిధంగా గడిపాం.

తెల్లవారు ఝామున 5 గంటలకు బండివాడు వచ్చి గోరేగావ్‌కు బయలుదేరడం మంచిదని చెప్పాడు. మేం రాం అని చెప్పాం. ఎనిమిదింటికి వస్తామని చెప్పాం. మరోసారి ఏ ప్రమాదమూ రాకుండా చూడాలనుకున్నాం. ఎనిమిది గంటలకు బయలుదేరి 11 గంటలకు గోరేగావ్‌కు చేరుకున్నాం. మా నాన్న మమ్మల్ని చూసి ఆశ్చర్యపోయాడు. మేం వస్తున్నట్టు ఆయనకు తెలియదు. మేం ఉత్తరం రాశామని చెప్పాము. నాన్న లేదన్నారు. తర్వాత తేలిందేమిటంటే ఆయన నౌకరు తప్పు చేశాడని. అతనికి మా ఉత్తరం అందింది. కాని నాన్నకు ఇవ్వలేదు.

ఈ సంఘటన నా జీవితంలో ఎంతో ముఖ్యమయింది. ఇది జరిగినపుడు నా వయసు తొమ్మిది సంవత్సరాలు. నా మనసులో ఈ సంఘటన చెరగని ముద్ర వేసింది. ఇంతకు ముందు అస్పృశ్యత అంటే ఏమిటో నాకు తెలుసు. వారికి అవమానాలు, వివక్ష తప్పదనీ తెలుసు. ఉదాహరణకు నా పాఠశాలలో నేను రాంక్‌నుబట్టి కూర్చోవటానికి వీల్లేదు. విడిగా ఎక్కడో ఎవరికీ అంటకుండా ఒంటరిగా కూర్చోవాలి. బళ్లో నాకు విడిగా తట్టుగుడ్డముక్క కూచోడానికి ఇస్తారనీ తెలుసు. బడిలో శుభ్రంచేసే పనివాడు కూడా దాన్ని ముట్టుకోడు. నేనా తట్టు ముక్కను తీసుకుపోయి రాత్రి ఉతుక్కొని, మరునాడు నేనే క్లాసుకు తెచ్చుకోవాలన్నమాట. బళ్లో పిల్లలకు దప్పి అయితే వెళ్లి టాంకు కుళాయి విప్పి నీళ్లు తాగుతారు. టీచర్ అందుకు అనుమతిస్తే అంతే చాలు. కాని నా పరిస్థితి వేరు. నేను కుళాయి ముట్టడానికి వీల్లేదు. స్పృశ్యుడెవరయినా కుళాయి విప్పితే తప్ప నాకు నీరు తాగే అవకాశం లేదు. నాకు టీచర్ అనుమతి ఒక్కటే సరిపోదు. బళ్లో ప్యూను కూడా వెంట ఉండాలి. అతనినే అందుకు నియోగిస్తారు.

ప్యూన్ లేకపోతే నాకు నీళ్లు ఉండవన్నమాట. ''ప్యూన్ లేడు కనుక నీళ్లు లేవు'' అన్న మాట చాలు పరిస్థితి వివరించడానికి. ఇంట్లో బట్టలను మా చెల్లెలే ఉతికేది. సతారాలో చాకలివారు లేరనికాదు. మేం అస్పృశ్యులం కనుక చాకలివారు మా బట్టలను ముట్టరు కనుక. అంతేకాదు క్రాప్ చేయించడం

(క్షవరం) కూడా మా అక్కే చేసేది. నాకయినా అంతే. చేసి చేసీ ఆమెకు క్షవరంలో నైపుణ్యం కూడా వచ్చింది. మంగలికి డబ్బులు ఇవ్వలేమని కాదు. మమ్మల్ని మంగలి కూడా ముట్టడు కనుక. ఇవన్నీ నాకు తెలుసు. అయినా ఈ సంఘటన నా మనసుపైన ఒక అఘాతం కలిగించింది. అంతకు ముందు అస్పృశ్యత, స్పృశ్యత ఒకానొక సామాజిక వ్యవహారం వలె తోచిందేకాని ఈ సంఘటన నా గురించి, అస్పృశ్యత గురించి నన్ను ఆలోచింపజేసింది.

## రెండు

నేను 1916లో భారత్‌కు తిరిగి వచ్చాను. ఉన్నత విద్యాభ్యాసానికి బరోడా మహారాజు నన్ను అమెరికాకు పంపారు. 1913 నుంచి 1917 వరకు న్యూయార్క్‌లోని కొలంబియా విశ్వవిద్యాలయంలో చదువుకున్నాను. 1917లో లండన్ చేరుకున్నాను. అక్కడ లండన్ విశ్వవిద్యాలయం ఎకనామిక్స్ స్కూల్ పోస్టుగ్రాడ్యుయేట్ డిపార్ట్‌మెంట్‌లో చేరాను. చదువులు పూర్తికాకముందే 1918లో నేను భారత్‌కు రావలసి వచ్చింది. బరోడా రాజ్యం నన్ను చదివించింది కనుక ఆ రాజ్యంలో పనిచేయవలసిన బాధ్యత నాపై ఉంది. కనుకనే నేను ఇండియా రాగానే నేరుగా బరోడాకు వెళ్లాను. బరోడా ఉద్యోగం ఎందుకు వదిలానో చెప్పడం ఇప్పుడు అనవసరం. కనుక నేను అందులోకి వెళ్లను. బరోడా సాంఘిక పరిస్థితులు నా అనుభవాలు ప్రస్తుతాంశం కనుక వాటికే పరిమితమవుతాను.

అయిదేళ్లపాటు యూరప్‌లో, అమెరికాలో నివసించిన నా మనసులోంచి నేను అస్పృశ్యుడినన్న విషయమే గుర్తురాకుండా పోయింది. భారత్‌లో అయితే నేనెక్కడికివెళ్లినా నా అస్పృశ్యత నాకూ, ఇతరులకూ ఇబ్బంది కలిగించేదే. స్టేషన్ బయటకు వచ్చిన తర్వాత ''ఎక్కడికి వెళ్లాలి? నన్నెవరు స్వీకరిస్తారు'' అనే ప్రశ్న నన్ను వేధించసాగింది. హిందూ హోటళ్లు - విషీస్ అని పిలుస్తారు. వారు నన్ను రానీయరు. వేరే ఎవరిపేరో చెప్పి అందులో చేరాలన్నమాట. నేనాపని చేయదలచుకోలేదు. ఏ క్షణం నా అసలు కులం తెలిసినా ప్రమాదకరమయిన పరిణామాలు ఉంటాయని నాకు తెలుసు. బరోడాలో నా స్నేహితులున్నారు. అమెరికాలో వారూ విద్యకోసం వచ్చారు. 'నేను వెళ్తే వారు నన్ను రానిస్తారా?' నాకేం నమ్మకం కలగడంలేదు. ఒక అస్పృశ్యుడిని ఇంట్లోకి రానీయడానికి వారు ఇబ్బంది పడతారేమో. స్టేషన్ కప్పుకింద కాస్సేపు నిలబడ్డాను. ఎక్కడికి వెళ్లాలి, ఏం చేయాలి అని ఆలోచిస్తూ. కాంప్‌లో ఏదైనా స్థలం ఉందేమోనని అడగాలని తోచింది. ప్రయాణికులు అందరూ వెళ్లిపోయి ఉంటారు. సవారీ దొరకని టాక్సీ డ్రైవర్లు నాకోసం ఎదురు చూస్తున్నారు. కాంప్‌లో హోటల్ ఏదైనా ఉందా? అని అడిగాను. పార్సీ వారి సత్రం ఉందని, వారు 'పేయింగ్ గెస్టుల''ను తీసుకుంటారని చెప్పారు. ఆ సత్రం పార్సీలు నిర్వహిస్తున్నారని తెలిసి సంతోషించాను. పార్సీలు జోరాస్ట్రియన్ మతాన్ని

అవలంబిస్తారు. వారి మతం అస్పృశ్యతను పాటించదు కనుక నన్ను తాకరేమోనన్న భయం లేదు. ఉప్పొంగిన మనసుతో, నిశ్చింతగా సామాన్లు ఓ బండిలో పెట్టాను. పార్సీ సత్రానికి పొమ్మన్నాను.

ఆ సత్రం రెండంతస్తుల భవనం. కింది అంతస్తులో ఒక వృద్ధ పార్సీ కుటుంబం నివసిస్తున్నది. ఆయన అక్కడ కేర్‌టేకర్. వచ్చి బసచేసిన ప్రయాణికులకు తినుబండారాలు విక్రయిస్తాడు. బండి చేరింది. పార్సీ కేర్‌టేకర్ పై అంతస్తుకు దారి చూపాడు. నేను వెళ్లాను. డ్రైవర్ సామాన్లు పైకి తెచ్చాడు. డబ్బిస్తే అతను వెళ్లిపోయాడు. బసకోసం అవస్థ తీరింది. చివరికో ఆవాసం దొరికిందని సంతోషించాను. కేర్‌టేకర్ చేతిలో ఒక పుస్తకం పట్టుకుని వచ్చాడు. నేను సగం బట్టలు విప్పి కనిపించేసరికి నేను పార్సీలోని రెండు జాతులు సాద్రా, కాస్తి కాదని తెలిసిపోయింది. వెంటనే నేనెవరని అడిగాడు. పార్సీల కోసం మాత్రమే ఈ సత్రం నిర్వహిస్తున్నారని తెలియక 'హిందువు' నని చెప్పాను. అతను ఆశ్చర్యపోయి అక్కడ ఉండడానికి వీల్లేదన్నాడు. ఆ జవాబుకు నేనూ ఆశ్చర్యపోయాను. మళ్లీ ప్రశ్న మొదటికి వచ్చింది. ఎక్కడికి వెళ్లాలి. నేను హిందూనైనా ఇక్కడ ఉండడానికి నాకు అభ్యంతరం లేదు. మీకూ అభ్యంతరం లేకపోతే. ''మీరు ఎట్లా ఉంటారు? ఇక్కడ ఉండే పార్సీల వివరాలు నేను పుస్తకంలో రాసుకోవాల్సి ఉంటుంది''. అతని ఇబ్బంది అర్థమయింది. రిజిస్టర్‌లో రాసుకోవడానికి నేను పార్సీ పేరు పెట్టుకుంటానని చెప్పాను. ''నాకేం అభ్యంతరం లేనపుడు నీకెందుకు. నేనిక్కడ ఉండడం వల్ల నీకు లాభమేకాని నష్టం ఉండదు'' అన్నాను. అతను కొంత సుముఖంగా ఉండడం గమనించాను. అతనికి ప్రయాణికుడే లేక చాలా కాలమయింది. కాస్త డబ్బు చేసుకునే అవకాశాన్ని చేజారిపోనీయరాదనుకున్నాడు. నా 'పార్సీ' పేరు రిజిస్టర్‌లో రాసుకున్నాడు. రోజుకు బస, భోజనానికి రూపాయన్నర అడిగాడు. అతను కిందికి వెళ్లిపోయాడు. ఒక నిట్టూర్పు విడిచాను. సంతోషించాను. కాని అప్పటికి నాకింకా ఆ సంతోషం క్షణికం అని తెలియదు. ఈ సత్రంలో నా బస సత్వర విషాదాంతం వివరించేముందు ఆ స్వల్ప సమయంలో నా అనుభవాలు వివరిస్తాను.

తొలి అంతస్తులో చిన్న పడకగది. దానికి ఆనుకుని చిన్న బాత్‌రూం, అందులో ఒక కుళాయి ఉంది. మిగిలింది ఒక పెద్ద హాల్. ఆ హాల్ విరిగిన కుర్చీలు, బెంచీలు, చెక్కముక్కలు, ఇతర చెత్తాచెదారంతో నిండి ఉంది. వాటన్నిటి మధ్య నేను ఒంటరిగా మిగిలాను. ఉదయం టీ కప్పుతో కేర్‌టేకర్ వచ్చాడు. తొమ్మిదిన్నరకు ఉదయం ఫలహారంతోనో భోజనంతోనో వచ్చాడు. మళ్లీ రాత్రి 8.30కు భోజనం తెచ్చాడు. అతను తప్పదనుకున్నపుడే పైకి వచ్చాడు. వచ్చిన కొద్దిసేపు కూడా మాట్లాడేందుకు ఆగలేదు. ఏదోవిధంగా గడిచిపోయింది.

బరోడా మహారాజు కార్యాలయంలోని అకౌంటెంట్ జనరల్ ఆఫీసులో ప్రొబేషనర్‌గా నాకు నియామకం లభించింది. సత్రం నుంచి ఉదయం 10 గంటలకు బయలుదేరితే రాత్రి 8 గంటలకే మళ్లీ

వచ్చేది. సాయంత్రం వస్తే స్నేహితులతో సత్రం బయటే కాలం గడిపేది. మళ్లీ సత్రంలోకి రావాలనే ఆలోచన నాకు భయంకరంగా తోచేది. నాకు మరో చోటు లేదు కనుకనే నేను సత్రానికి రావలసి వచ్చేది. పలకరిద్దామంటే ఇంత విశాలమయిన తొలి అంతస్తులో ఒక్క మనిషీ లేడు. హాల్‌నిండా చీకటి అలుముకున్నది. ఎలక్ట్రిక్ దీపాలే లేవు. నూనెదీపాలు కూడా లేవు. నాకోసం ఓ చిన్న హరికేన్ లాంతరు మాత్రం తెచ్చేవాడు కేర్‌టేకర్. మనుషుల తోడు లేని నేను పుస్తకాలు, చదువుల సాహచర్యంతో ఒంటరితనం మరిచాను. మధ్య మధ్య గబ్బిలాలు తిరగడం, కీచురాళ్ల ధ్వనులు నేను మరిచిపోదామనుకున్నా ఒంటరితనాన్ని గుర్తుచేస్తున్నాయి. వింత పరిస్థితుల మధ్య వింత బతుకు. ఎన్నోసార్లు నాకు కోపం వచ్చింది. నా ఆవేదనను ఆగ్రహాన్ని దిగమింగుకున్నాను. అదో డంజన్ అయినా ఒక ఆవాసం. ఏమీలేనిదానికన్నా ఉన్న ఆ ఆవాసమే నయం కదా!

నా పరిస్థితి ఎంత హృదయవిదారకంగా ఉందంటే నేను బొంబాయిలో మిగిల్చిన సామాన్లు తీసుకువచ్చిన నా చెల్లెలి కొడుకు నా స్థితి చూసి వెక్కి వెక్కి ఏడ్చాడు. నేను అతన్ని వెంటనే ఊరికి పంపించాను. పార్సీ పేరుతో పార్సీ సత్రంలో ఈవిధంగా నివసిస్తున్నాను. ఈ మోసం ఎన్నోనాళ్లు సాగదని నాకు తెలుసు. ఏదో ఓరోజు నేనెవరో తెలిసిపోతుంది. ప్రభుత్వ భవనం ఒకటి దొరికితే బాగుండునని అన్వేషణ ప్రారంభించాను. బరోడా రాజ్య ప్రధాన మంత్రికి నా అత్యవసర స్థితి అర్థం కాలేదు. నా దరఖాస్తు ఓ ఆఫీసరు నుంచి మరో ఆఫీసుకు వెళ్తున్నది. దాని సంగతి తేలేలోగా నా సంగతి బయటపడే రోజు రానే వచ్చింది.

సత్రంలో చేరి అది పదకొండోరోజు. ఉదయం భోజనం అయింది. ఆఫీసుకు వెళ్లేందుకు సిద్ధమవుతున్నాను. నిన్న రాత్రి తెచ్చుకున్న గ్రంథాలయం పుస్తకాలు వాపస్ ఇవ్వాలని వెతుకుతున్నాను. చాలామంది వస్తున్నట్టు అడుగుల చప్పుడు వినిపించింది. టూరిస్టులు అనుకున్నాను. కాని పన్నెండు మంది - కోపంగా చూస్తున్నారు. అందరూ పార్సీలు. పొడుగ్గా బలిష్ఠంగా ఉన్నారు. చేతిలో ఓ కర్ర. నాగదివైపే వస్తున్నారు. వాళ్లు టూరిస్టులు కాదన్న విషయం స్పష్టమయిపోయింది. వస్తూనే ప్రశ్నలవాన కురిపించారు. ''ఎవర్నువ్వు. ఇక్కడికి ఎందుకు వచ్చావు. పార్సీ పేరు పెట్టుకోవడానికి ఎన్ని గుండెలు నీకు. స్కౌండ్రల్. పార్సీ సత్రం కలుషితం చేసేవుకదరా?'' అని అరుస్తున్నారు. నేను నిశ్శబ్దంగా ఉన్నాను. ఏ జవాబూ ఇవ్వలేదు. ఇంకా పార్సీనని అబద్ధం చెప్పలేను. అది మోసం, మోసం బయటపడింది. ఇంకా అదే మాట మాట్లాడితే నాపై దాడి తప్పదు. మతపిచ్చి పార్సీల చేతిలో చావు మూడినా చెప్పలేను. నా మౌనం - ఆగ్రహాన్ని దాటించింది. వారిలో ఒకరు ఎప్పుడు ఖాళీచేస్తావని అడిగాడు. ఆ క్షణానికి నా ఆవాసం నా ప్రాణాలకన్నా మిన్న అనిపించింది. కనీసం ఒక వారం రోజుల గడువన్నా ఇస్తే బాగుండు.

నా దరఖాస్తు ఈలోగా మంజూరు అవుతుందేమోనన్న ఆశ. కాని వాళ్లేమీ వినేట్టులేరు. సాయంత్రానికల్లా సత్రంలో కనిపించవద్దన్నారు. ఖాళీ చేయాల్సిందే. లేకపోతే ప్రమాదకరమయిన పరిణామాలు తప్పవు అని బెదిరించి వెళ్లిపోయారు. నేను క్రుంగిపోయాను. నాగుండె కూడా ఒక్క క్షణం గుబగుబలాడింది. అందరినీ తిట్టుకున్నాను. ఏడ్చాను. అవును. నాకెంతో విలువైన ఆశ్రయం మళ్లీ నేను కోల్పోయాను. నిజానికది జైలుగదికన్నా గొప్పది కాదు. అయినా నాకెంతో విలువైంది.

పార్సీలు వెళ్లిపోయిన తర్వాత పరిష్కారమార్గం కోసం ఆలోచించడం ప్రారంభించాను. ప్రభుత్వ భవనం దొరికితే సమస్య తీరుతుందనుకున్నాను. కనుక నాకు అంతవరకే ఇబ్బంది. అంటే తాత్కాలికంగా నేను మిత్రులనాశ్రయించడం మంచిదనుకున్నాను. బరోడా రాజ్యంలో నాకు అస్పృశ్యుల్లో స్నేహితులు లేరు. ఇతర కులాల్లో ఉన్నారు. ఒకరు హిందూ మిత్రుడు. మరొకరు ఇండియన్ క్రిస్టియన్. హిందూ మిత్రుడి దగ్గరకు వెళ్లి నాకొచ్చిన కష్టం చెప్పుకున్నాను. అతనొక ఉత్తముడు. వాడు అప్తుడు. నా వైనం విని విచారించాడు. ఆ మనుషులపై అతనికి పట్టరాని కోపం వచ్చింది. కాని ఆయనొకమాట చెప్పాడు. ''నువ్వు మాయింటికి వస్తే నౌకర్లు వెళ్లిపోతారు.'' నాకు సంగతి తెలిసిపోయింది. అతన్ని ఆశ్రయం కోసం వత్తిడి చేయదలచుకోలేదు. ఇండియన్ క్రిస్టియన్ మిత్రుడి దగ్గరికి వెళ్లాలనిపించలేదు. ఎందుకంటే అతను నన్ను తనింట్లో ఉండమని చెప్పినా, ఆ ఆహ్వానాన్ని కాదని పార్సీ సత్రానికి వెళ్లాను. అతని అలవాట్లు నాకు సరిపడవని నేను భావించాను. అక్కడకి ఇప్పుడు వెళ్లడమంటే అతని నోట మాటపడాల్సి వస్తుంది. నేను ఆఫీసుకు వెళ్లిపోయాను. బసకోసం మనసు వెతుకుతూనే ఉంది. మరో మిత్రుని సంప్రదించి ఆ మిత్రుని దగ్గరికి వెళ్లి ఉండడానికి అనుమతి కోరాలనే అనుకున్నాను. అతని జవాబు ఏమిటంటే అతని భార్య మరునాడు బొంబాయి నుంచి వస్తుందట. ఆమెనడిగి చెప్తాడట. అదొక తెలివైన తిరస్కారమని నాకు ఆ తర్వాత తెలిసింది. ఆ మిత్రుడు, అతని భార్య అసలు బ్రాహ్మణ కుటుంబం నుంచి వచ్చారు. అతను మతం మారిన తర్వాత 'అభ్యుదయం'గా ఆలోచించినా భార్య ఇంకా ప్రాచీన సంప్రదాయాలను వదలలేదు. కనుక అస్పృశ్యుడికి నివాసం ఇచ్చే అవకాశమే లేదు. మినుకు మినుకుమన్న ఆ ఆశాదీపం కూడా ఆరిపోయింది. సాయంత్రం నాలుగు గంటలకు క్రిస్టియన్ మిత్రుడి ఇంటినుంచి బయటపడిన నాకు ఎక్కడికి వెళ్లాలన్నది భయంకరమయిన ప్రశ్నగా కనపడింది. సత్రం వదలక తప్పదు. కాని ఒక్క మిత్రుడూ లేడు ఆదుకోవడానికి. బొంబాయికి వెళ్లిపోవడమొక్కటే మార్గం.

బొంబాయి రైలు బరోడా నుంచి రాత్రి 9కి బయలుదేరుతుంది. ఈ అయిదు గంటలు ఎక్కడ గడపటం? సత్రానికి వెళ్లనా? మిత్రుడి ఇంటికి వెళ్లదలచుకోలేదు. నాది దయనీయమయిన స్థితి కాని

నాకు దయ కలగలేదు. కామాటిబాగ్ ఉద్యానవనంలో ఆ కాస్సేపు గడుపుదామని నిర్ణయించాను. అదయితే సిటీ అంచుల్లో, కాంప్‌కు దగ్గర్లో ఉంది. అక్కడ కూర్చున్నాను. నా మనసు కాసేపు శూన్యంతోను, మరికాసేపు విచారంతోనూ సతమతమవుతున్నది. ఏమిటిది? ఎందుకిట్లా జరుగుతున్నది. ఏమీ తోచని ఒంటరి స్థితిలో తల్లిదండ్రులను జ్ఞాపకం చేసుకునే పిల్లలవలె నేనూ అమ్మా నాన్నలను గుర్తుచేసుకున్నాను. ఎనిమిదింటికి తోటలోంచి బయటికి నడిచాను. సత్రానికి కారేజ్‌లో వెళ్లాను. అతను వెళ్లి సామాన్లు తెచ్చాడు. కేర్‌టేకర్ బయటికి వచ్చాడు. అతనూ మాట్లాడలేదు. నాకూ మాట పెగలలేదు. తన కష్టాలకు తాను కొంత కారణమనుకున్నాడేమో. బిల్లు చెల్లించాను. ఉ. అతను మౌనంగా తీసుకున్నాడు. నేనూ మౌనంగానే సెలవుతీసుకున్నాను. నేను బరోడాకు ఎన్నో ఆశలతో వెళ్లాను. ఎన్నో మంచి అవకాశాలు వదులుకున్నాను. అది యుద్ధ సమయం. ఇండియన్ ఎడ్యుకేషనల్ సర్వీస్‌లో ఎన్నో ఖాళీలున్నాయి. లండన్‌లో ఎందరో పలుకుబడిగల వ్యక్తులు నాకు పరిచయం. ఏదీ అడగలేదు. ఎవరినీ అడగలేదు. నా చదువుకు ఆర్థిక సాయం చేసిన బరోడా మహారాజుకు సేవచేయడం కృతజ్ఞత చూపడం నా కర్తవ్యం అనుకున్నాను. కేవలం 11 రోజుల నివాసం తర్వాత బరోడా నుంచి బయటపడవలసిన పరిస్థితి ఏర్పడింది.

డజన్ మంది పార్సీలు చేత కర్రలతో దారుణంగా నావైపు చూడడం నేను బిక్కమొగంతో క్షమకోసం భయపీడితుడనై నిస్సహాయంగా నిల్చోవడం పద్దెనిమిది సంవత్సరాల సుదీర్ఘ కాలం గడిచినా నా మనసునుంచి చెదిరిపోని దృశ్యాలుగా మిగిలాయి. నాకెప్పుడూ అది గుర్తొస్తూనే ఉంటుంది. ఎప్పుడు గుర్తొచ్చినా కళ్లు చెమ్మగిల్లుతాయి. అప్పుడు నాకు తెలిసింది - హిందువుకు అస్పృశ్యుడైనవాడు పార్సీలకు కూడా అస్పృశ్యుడే - అని.

## మూడు

అది 1929వ సంవత్సరం. అస్పృశ్యుల బాధలను పరిశోధించడానికి బొంబాయి ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది. కమిటీ ప్రావిన్స్ అంతా తిరిగి అన్యాయం, అణచివేత, దారుణాల వంటి అన్ని అంశాలను ఆరోపణలను విచారించవలసి ఉంది. కమిటీ చీలిపోయింది. నేనూ మరొకరూ ఖండేశ్‌లో రెండు జిల్లాల పని తీసుకున్నాం. నేనూ సహచరుడు పని ముగించుకుని విడిపోయాం. అతను హిందూ స్వామిని కలవడానికి వెళ్లాడు. నేను బొంబాయికి రైల్లో బయలుదేరాను. చాలీస్‌గావ్ దగ్గరదిగి ధూలియా మార్గంలో ఉన్న ఓ గ్రామానికి వెళ్తున్నాను. అక్కడ అగ్రవర్ణాలవారు ఆ ఊరి అస్పృశ్యులపైన సాంఘిక బహిష్కారం విధించారు. చాలీస్‌గావ్‌లో అస్పృశ్యులు నా దగ్గరికి వచ్చి ఆ రాత్రి

అక్కడ ఉండమని అడిగారు. సాంఘిక బహిష్కారం సంఘటన విచారించి నేరుగా బొంబాయి వెళ్లామని మొదట్లో అనుకున్నాను. వారంతగా అడిగితే కాదనలేక ఆగిపోయాను. ధూలియా వెళ్లేందుకు రైలెక్కాను. గ్రామంలో దిగి కావలసిన సమాచారం సేకరించి అక్కడి పరిస్థితులు గమనించి చాలీస్‌గావ్‌కు తర్వాత రైల్లో వచ్చేశాను.

చాలీస్‌గావ్‌లో అస్పృశ్యులు నాకోసం ఎదురు చూస్తున్నారు. నాకు పూలహారాలు వేశారు. రైల్వే స్టేషన్‌కు వారి నివాసం మహర్‌వాడ రెండు మైళ్ల దూరం. దారిలో నది దాటాలి. చిన్న వంతెన ఉంది. స్టేషన్‌లో గుర్రంబండ్లు కిరాయికి తిరుగుతాయి. మహర్‌వాడకు నడిచి కూడా పోవచ్చు. నేను ఎవరయినా తీసుకుపోతారేమోనని చూస్తున్నాను. కాని ఆవైపు కదలికే లేదు. ఇంకా ఎందుకు ఎదురుచూడాలో నాకు అర్థం కాలేదు. గంట తర్వాత ఒక టాంగా వచ్చింది. ప్లాట్‌ఫారం దాకా తెచ్చి నిలబెడితే నేను ఎక్కాను. నేనూ డ్రైవర్ టాంగాలో ఉన్నాం. మిగిలినవాళ్లు డొంకదారిలో నడిచి వస్తున్నారు. 200 అడుగులు దాటేమో లేదో మెటార్ కార్‌తో ఢీ కొట్టడం కొద్దిలో తప్పిపోయింది. రోజూ కిరాయికి తిరిగే టాంగావాలా అంత అనుభవంలేనట్టు నడవడమేమిటో నాకర్థం కాలేదు. అక్కడి పోలీసు పెద్దగా అరిస్తే విని కారు డ్రైవర్ వెనక్కి తీసుకున్నాడు. లేకపోతే ప్రమాదం తప్పేదేకాదు.

నదిపై చిన్న వంతెన దాకా ఎట్లాగో చేరుకున్నాం. రాళ్లవరస ఒకటి మాత్రం ఉంది. అదీ అయిదు పది అడుగుల దూరంలో. వంతెనపై రాళ్లు పరిచారు. రోడ్డు నుంచి మలుపు తిరిగితే తప్ప వంతెన పైకి ఎక్కలేము. వంతెన పైన తొలి రాయికి ప్రక్కనుంచి నేరుగా ఎక్కవలసిన గుర్రం వెనక్కి తిరిగి తిరగబడింది. టాంగా చక్రం ఎంత వేగంగా రాయిని తాకిందంటే నేను అమాంతం ఎగిరి వంతెన పేవ్‌మెంట్ రాళ్లమీద పడ్డాను. టాంగా - గుర్రం నదిలో పడ్డాయి. ఆ దెబ్బకు నాకు స్పృహ పోయింది. నదికి ఆవలి ఒడ్డున మహర్‌వాడ. నన్ను స్టేషన్‌లో కలిసి నా కన్నా ముందే ఊరికి చేరుకున్న వారు నన్ను ఎత్తుకుని మహర్‌వాడకు తీసుకువెళ్లారు. చుట్టూ ఆడవాళ్లు, మగవాళ్లు, పిల్లల ఏడుపులు, అరుపులూ నాకు ఎన్నో దెబ్బలు తాకాయి. కాలు విరిగింది. అసలిదంతా ఎట్లా జరిగిందో నాకు అర్థంకాలేదు. ఆ వంతెనమీద రోజూ అనేకసార్లు టాంగాలు వస్తూపోతూ ఉంటాయి. ఎవ్వరూ ఇంతగా పడిపోలేదు.

అడిగితే అసలు సంగతులు తెలిశాయి. రైల్వే స్టేషన్ దగ్గర ఆలస్యం కావడానికి కారణం ఏ టాంగావాలా కూడా ఒక అస్పృశ్యుని తీసుకువెళ్లడానికి సిద్ధంగా లేరు. అది వారి గౌరవానికి తక్కువ అని. మహర్‌లకు నన్ను నడిపించడం నచ్చలేదు. అది నా గౌరవానికి తక్కువ అని వారు అనుకున్నారు. టాంగా యజమాని టాంగా ఇచ్చేందుకు, మహర్‌లలో ఎవరయినా నడిపేందుకు అంగీకారం కుదిరింది. ఇది మంచి పరిష్కారమని వారనుకున్నారు. మనిషి గౌరవం కన్న అతని క్షేమం ముఖ్యమన్న ఆలోచన

వారికి రాలేదు. ఇట్లా జరుగుతుందని తెలిస్తే మంచి అనుభవం ఉన్న డ్రైవర్ని తెచ్చేవారేమో. వారిలో ఎవరూ నడపలేరు. ఎందుకంటే అది వారి వృత్తి కాదు. పగ్గాలు అందుకున్న వ్యక్తి టాంగా తోలడం ఎంతలే అనుకున్నాడు. కాని టాంగా నడపడం మొదలైన తర్వాత అతని బాధ్యత ఎంత భారమయిందో తెలిసి ఉంటుంది. ఆ భయంతో అతనికి పట్టుతప్పిపోయింది. నా గౌరవం కోసం మహర్లు నా ప్రాణాలకే ముప్పుతెచ్చారు. హిందూ టాంగావాలా, అతనెంత తక్కువస్థాయివాడయినా, ఇతర అస్పృశ్యులందరికన్నా, బారిస్టర్-ఎట్-లా చదివిన అస్పృశ్యుడికన్నా గొప్పవాడని భావిస్తారని అప్పుడు తెలిసింది.

## నాలుగు

1934వ సంవత్సరంలో దళిత వర్గాల ఉద్యమంలో నా సహచరులు ఏదయినా పిక్నిక్కు వెళదామనుకున్నారు. నన్నూరమ్మన్నారు. ఒప్పుకున్నాను. వేరుల్లో బుద్ధగుహను తప్పకుండా చూసేవిధంగా పర్యటన రూపొందించుకోవాలని అనుకున్నాం. నేను నాసిక్ వెళ్లాలని, నాసిక్లో మిగతా బృందం కలవాలని ప్లాన్వేసాం. వేరుల్వెళ్లాలంటే ఔరంగాబాద్వెళ్లాలి. ఔరంగాబాద్ముస్లింలపాలనలో ఉన్న హైదరాబాద్ రాజ్యంలోని ఒక పట్టణం. మహోఘనతవహించిన నిజాంగారి రాజ్యం అది. ఆ రాజ్యంలోనే ఉన్న దౌలతాబాద్ దాటితే తప్ప ఔరంగాబాద్ రాదు. దౌలతా బాద్ చారిత్రక ప్రసిద్ధి కలిగిన నగరం. హిందూ రాజు రాందేవ్రాయ్ రాజధాని అది. దౌలతాబాద్ కోట కూడా ప్రాచీన చారిత్రక కట్టడం. అటు వెళ్లేవారెవరూ ఆ కోట చూడకుండా పోరు. కనుక మా యాత్రలో దౌలతాబాద్ కూడా చేర్చాం.

కొన్ని బస్సులను, టూరిస్టు కార్లను అద్దెకు తీసుకున్నాం. మొత్తం 30 మందిమి. నాసిక్ నుంచి యెవోలా ద్వారా ఔరంగాబాద్కు కదిలాం. మా యాత్ర గురించి మేం ప్రకటనలు చేయలేదు. ఎవరికీ తెలియకుండా అజ్ఞాతంగానే వెళదామనుకున్నాము. లేకపోతే అస్పృశ్యులయిన యాత్రికులకు ఎదురయ్యే కష్టాలు తప్పవు. మేం ఎక్కడ ఆగదలచుకున్నామో అక్కడ మా వాళ్లకు మాత్రం ముందే తెలియజేశాం. కనుక నిజాం రాజ్యంలో మేం ఎంతో దూరం సాగినా దారిలో మమ్మల్ని ఎవరూ కలవడానికి రాలేదు. దౌలతాబాద్ స్థితివేరు. అక్కడ అందరికీ ముందే చెప్పాం కనుక వారు మాకోసం నగరం ప్రవేశం దగ్గరే ఎదురు చూస్తున్నారు. అక్కడ దిగి టీ తాగి కోటకు వెళ్లవచ్చునన్నారు. మేం ఒప్పుకోలేదు. టీ తాగాల్సిన అవసరం ఉంది కాని కోట చూడడానికి సమయం సరిపోదేమోనని మా అనుమానం. తిరిగి వచ్చేపుడు టీ తీసుకుంటాం అని చెప్పి కోటకు వెళ్లిపోయాం. గేటు చేరుకున్నాం.

అది రంజాన్‌నెల. ముస్లింలు ఒకపూట ఉపవాసం ఉండే నెల. కోట ద్వారం ప్రక్కన చిన్న చెరువు ఉంది. చుట్టూ రాతి పేవ్‌మెంట్. మా ముఖాలు, బట్టలు దుమ్ముకొట్టుకుని ఉన్నాయి. అందరం ముఖం కడుక్కుందామని అనుకున్నాం. చెరువు నీరు తీసుకుని కొందరు మిత్రులు ముఖం కడుకున్నారు. తర్వాత కోట గుమ్మంవైపు వెళ్లాం. లోపల సాయుధ సైనికులున్నారు. గేట్లు తెరిచి మమ్మల్ని లోపలికి వెళ్లనిచ్చారు. కోట లోపలికి వెళ్లేందుకు అనుమతికోరే విధానాన్ని అడిగి తెలుసుకుంటున్నంతలోపల ఒక తెల్లగడ్డం ముసలి మహ్మదీయుడు గేటు దగ్గర నుంచి అరుస్తూ వస్తున్నాడు ''దేఢ్‌లు (అస్పృశ్యులు) మంచినీటిని మైలపరిచారు'' అంటూ. ముసలి, యువ మహ్మదీయులంతా కలిసి అక్కడ చేరి మమ్మల్ని తిట్టడం మొదలుపెట్టారు. ''దేఢ్‌లకు పొగరెక్కింది. వాళ్ల మతం మరిచిపోయారు. (అణగిమణగి ఉండాలని అర్థం) దేఢ్‌లకు బుద్ధి చెప్పాలి'' అన్నారు. వాళ్లంతా కోపంతో ముందడుగు వేస్తుంటే - మేం బయటి నుంచి వచ్చాం. మాకిక్కడి ఆచారాలు తెలియవు. స్థానిక అస్పృశ్యులు అప్పటికే అక్కడికి చేరుకున్నారు. ముస్లింలు వారిమీద మండిపడ్డారు. ''అస్పృశ్యులు ఈ నీటిని అంటరాదని మీరు బయిటివారికెందుకు చెప్పలేదు'' అని ప్రశ్నించారు. మేం చెరువులో అడుగు పెట్టేటపుడు వారు లేరు. నిజంగా అది మా తప్పు. మేం ఎవరినయినా అడగాల్సింది. అది మాతప్పు కాదని వాళ్లు అన్నారు. నా వివరణ వినడానికి మహ్మదీయులు సుముఖంగా లేరు. వాళ్లనీ మమ్మల్నీ తిడుతూనే ఉన్నారు. ఎంత హీనంగా తిడుతున్నారంటే ఇక మా సహనం చచ్చిపోయింది. అక్కడ హత్యలు దొమ్మీలు కూడా జరిగే అవకాశం ఉంది. మా కోపం మేము అణచుకున్నాం. క్రిమినల్‌కేసులో ఇరుక్కుని యాత్ర అర్థాంతరంగా ముగించుకోవడం ఇష్టంలేదు.

ప్రతివాడు తన మతాన్ని అనుసరించాల్సిందేనని ఒక యువ ముస్లిం అన్నాడు. అంటే ఊరి చెరువులో అస్పృశ్యులు అడుగు పెట్టరాదు. ''ఇదేనా మీ మతం చెప్పింది?'' అని నేను కొంచెం కోపంగానే అడిగాను. ''అస్పృశ్యుడు మహ్మదీయుడైతే వాడిని నీవు నీళ్లు తీసుకోనిస్తావా?'' అని నిలదీసి అడిగేసరికి ముస్లింలలో కొంత ప్రభావం కన్పించింది. ఏ జవాబూ ఇవ్వకుండా నిశ్శబ్దంగా నిలబడ్డారు. అక్కడి గార్డువైపు తిరిగి అతన్నీ కోపంగానే అడిగాను. ''కోట లోపలికి మేం వెళ్లొచ్చా లేదా? వెళ్లకూడదంటే చెప్పండి. మేమిక్కడ ఉండదలచుకోలేదు.'' గార్డు నా పేరు అడిగాడు. కాగితంమీద రాసి ఇచ్చాను. లోపల సూపరింటెండెంట్‌కు తీసుకువెళ్లి ఇచ్చాడు. మళ్లీ బయటకి వచ్చాడు. మేం కోటలోకి వెళ్లవచ్చునన్నాడు. కాని ఎక్కడా నీటిని అంటరాదట. మావెంట కాపలాకు ఒక గార్డును కూడా పంపారు.

ఒదూకు అస్పృశ్యులైననాడు పార్శీకి కూడా అస్పృశ్యులేనని చెప్పేందుకు ఒక సంఘటన వివరించాను. అతను ముస్లింలకు కూడా అస్పృశ్యుడే అని ఈ సంఘటన వివరిస్తుంది.

# అయిదు

ఈ సంఘటన కూడా అంతే విలువైంది. కథియవార్‌లో ఒక అస్పృశ్య ఉపాధ్యాయుడి కథ ఇది. మహాత్మా గాంధీ సంపాదకత్వం వహిస్తున్న 'యంగ్ ఇండియా' పత్రిక 1929 డిసెంబర్ 12వ తేదీ సంచికలో ప్రచురించిన ఒక లేఖలో ఈ కథ ఉంది. అప్పుడే ప్రసవించిన తన భార్యనూ, పాపనూ పరీక్షించమని ఆ ఉపాధ్యాయుడు హిందూ డాక్టర్‌ను వేడుకున్న తీరు, వైద్యసాయం లేకుండా ఆ తల్లీ పిల్లలు చనిపోయిన సంఘటన ఇందులో హృదయ విదారకంగా ఉంది. లేఖలో ఇలా ఉంది:

''ఈనెల 5వ తేదీన నాకో శిశువు పుట్టింది. 7వ తేదీన జ్వరం వచ్చింది. నీటి విరేచనాలు అవుతున్నాయి. ఆమె శక్తి ఉడిగిపోయింది. ఛాతీ ఉబ్బింది. శ్వాసకూడా కష్టమైపోయింది. ప్రక్కటెముకల్లో విపరీతమైన నొప్పి మొదలైంది. నేనో డాక్టర్ ఇంటికి వెళ్లాను. అతను అస్పృశ్యుడైన హరిజనుడి ఇంటికి వెళ్లనన్నాడు. పాపను పరీక్షించనన్నాడు. నగర్‌సేట్, గరేసియా దర్బార్‌కు వెళ్లి అక్కడి పెద్దలను బతిమాలుకున్నాను. డాక్టర్ రావడానికి ఒప్పుకున్నాడు. కాని హరిజన కాలనీకి బయట మాత్రమే పరీక్షిస్తానని షరతుపెట్టాడు. నా భార్యను, పసికందును కాలనీ బయ టకు తీసుకువచ్చాను. డాక్టర్ ఒక ముస్లింకు థర్మామీటర్ ఇచ్చాడు. అతడను నాకిచ్చాడు. నేను నా భార్యకు ఇచ్చాను. కాస్సేపటికి అదేవిధంగా అది తిరిగి వచ్చింది. అప్పుడు రాత్రి ఎనిమిది గంటలు. దీపం వెలుగులో థర్మామీటర్ చూసి తల్లికి న్యుమోనియా ఉందని చెప్పాడు. డాక్టర్ వెళ్లిపోయి మందు పంపాడు. నేను రెండు రూపాయల ఫీజు ఇచ్చినా డాక్టర్ మళ్లీ చూడడానికి రాలేదు. రోగం భయంకరమయింది. మమ్మల్ని ఆ దేవుడే కాపాడాలి. నా జీవనజ్యోతి ఆరిపోయింది. ఈరోజు మధ్యాహ్నం 2 గంటలకు ఆమె చనిపోయింది.''

అస్పృశ్య టీచర్ పేరు ఇవ్వలేదు. ఆ డాక్టర్ పేరు కూడా ప్రచురించలేదు. అదీ ఆ అస్పృశ్యుడి కోరికమీద. అంటే పేర్లు బయటపెట్టి కొత్త కష్టాలు కొనుక్కోవడం ఇష్టంలేక. ఇవి నిస్సందేహమయిన నిజాలు.

వివరణ అవసరంలేదు. చదువుకున్న డాక్టర్ థర్మామీటర్ వాడడానికీ, రోగిని చూడడానికీ ఇష్టపడలేదు. అతని తిరస్కారం వల్ల ఆమె చనిపోయింది. అతని వృత్తి తాలూకు ప్రవర్తనా నియమావళికి కూడా అతను కట్టుబడి ఉండలేకపోయాడు. ఒక అస్పృశ్యుడిని తిట్టడంకన్న అమానుషంగా వ్యవహరించడానికే హిందువు ఇష్టపడతాడన్నమాట.

# ఆరు

ఇంతకన్న దారుణమయిన మరో సంఘటన ఇది. 1938 మార్చి 6న బొంబాయి, దాదర్‌లోని వులన్‌మిల్స్ వెనుక కాసర్‌వాడిలో భాంగీల సమావేశం ఇందూలాల్ యాగ్నిక్ అధ్యక్షతన జరిగింది. ఈ సమావేశంలో భాంగీ బాలుడు తను అనుభవాన్ని ఈవిధంగా వివరించాడు.

''1933లో ప్రాంతీయ భాష ఫైనల్ పరీక్ష పాసయ్యాను నేను. 4వ స్టాండర్డ్ వరకు ఇంగ్లీషు చదివాను. బొంబాయి మునిసిపాలిటీలో స్కూల్స్ కమిటీకి ఉద్యోగం కోసం దరఖాస్తు పంపుకున్నాను. కానీ ఖాళీలేక నాకు దొరకలేదు. అహ్మదాబాద్‌లో వెనుకబడిన వర్గాల అధికారికి తలారి (గ్రామ పట్వారి) ఉద్యోగం ఇవ్వమని దరఖాస్తు పెట్టుకున్నాను. ఇచ్చారు. ఖేదీ జిల్లాలో బొర్సాద్ తాలూకా మామ్లతేదార్ కార్యాలయంలో నాకు 1936 ఫిబ్రవరి 19న తలారి ఉద్యోగం దొరికింది.

నా కుటుంబం గుజరాత్ నుంచి వచ్చినా మేమెప్పుడూ గుజరాత్‌లో లేము. అక్కడికి వెళ్లడానికి ఇదో అవకాశం. ప్రభుత్వ ఆఫీసుల్లో కూడా అస్పృశ్యత ఉంటుందని నాకు తెలియదు. నా దరఖాస్తులో నేను హరిజనుడిననే విషయం చెప్పాను. కనుక ఉద్యోగులందరికీ ఆ విషయం తెలుసనే అనుకున్నాను. తలారి ఉద్యోగంలో చేరడానికి వెళ్లగానే క్లర్కు ధోరణి చూసి ఆశ్చర్యపోయాను.

''ఎవరునువ్వు?'' అని క్లర్కు అడిగాడు. నేను చెప్పాను ''సర్ - నేను హరిజనుడిని.'' అతను ''పో - దూరంగా నిలబడు. నాకింత దగ్గరగా నిలబడతావా ఎంత ధైర్యం? ఇది ఆఫీసుగనుక సరిపోయింది. ఇదే బయట అయిఉంటే ఆరుతన్నులు తన్నేవాడిని. ఇక్కడ నౌకరీకి వచ్చి ఇంత పొగురా?'' అన్నాడు. నా సర్టిఫికేట్, నియామక పత్రం నేలమీద వేయమన్నాడు. వేశాను. తీసుకున్నాడు. మామ్లత్‌దార్ ఆఫీసులో తలారిగా పనిచేస్తున్న కాలంలో మంచినీటికి చాలా బాధపడేవాణ్ణి. ఆఫీసు వరండాలో క్యాన్‌లలో నీళ్లు పెట్టారు. వాటికి ఒక ఇంఛార్జ్ నీటి మనిషి ఉండేవాడు. క్లర్కులు అడిగినప్పుడల్లా నీళ్లుపోసి ఇవ్వడం అతని పని. అతను లేకపోతే క్లర్కులే నీళ్లు తీసుకుని తాగేవారు. నా విషయంలో అది సాధ్యంకాదు. నేను వాటర్ క్యాన్స్‌ను తాకరాదు. తాకితే కలుషితమవుతాయి. కనుక నీటి మనిషి దయపైనే నేను ఆధారపడవలసిందే. నాకోసం చిలుంపట్టిన ఒక చిన్న పాత్ర విడిగా పెట్టారు. దాన్ని ఎవరూ ముట్టుకోరు. కడగరు. నేనే కడుక్కోవాలి. అందులో నీటి మనిషి నీళ్లుపోస్తే నేను తాగాలి. నీటిమనిషి ఉంటేనే ఆ మాత్రం నీళ్లయినా దక్కేది. కాని నీటి మనిషికి నాకు నీళ్లివ్వడం ఇష్టంలేదు. నేను వస్తుండడంగమనించి అతను తప్పుకునేవాడు. నాకు గుక్కెడు నీరు లేకుండా పోయేది. అలా నీళ్లు లేని రోజులు తక్కువేంకాదు.

ఇంటి విషయంలోనూ ఇవే కష్టాలు. బోర్సాద్ ఊరు నాకు కొత్త. అగ్రవర్ణాలవారు నాకు ఇల్లు అద్దెకు ఇవ్వరు. అస్పృశ్యులు తమ ఊరి హిందువులకు కోపం వస్తుందేమోనని నాకు ఇల్లు ఇవ్వరు. ఒక అస్పృశ్యుడు ఉద్యోగం చేయడమేమిటని వారికి కోపం. నా స్థాయికి ఆ ఉద్యోగం ఎక్కువ అని అగ్రవర్ణాల అభిప్రాయం. తిండి విషయంలో అయితే కష్టాలు మరీ ఎక్కువ. ఎక్కడా ఎవరూ నాకు తిండి పెట్టరు. ఉదయం సాయంత్రం ''ఖాజా''లు కొనుక్కుని ఊరిబయట ఒంటరి ప్రదేశంలో తిని, ఊళ్లోకి వచ్చి మామ్లాత్‌దార్ ఆఫీసు వరండాలో పడుకునేవాడిని. ఇట్లా నాలుగు రోజులు గడిచాయి. ఇది అసాధ్య జీవనం అనిపించింది. నా పూర్వీకుల గ్రామం జెంత్రాల్‌కు వెళ్దామనుకున్నాను. అది బోర్సాద్‌కు ఆరు మైళ్ల దూరంలో ఉంది. రోజూ పదకొండు మైళ్లు నడవాలి. నెలన్నర రోజులు నడిచాను.

మామ్లత్‌దార్ నన్ను తలారీ పని నేర్చుకోమని పంపించాడు. జెంత్రాల్, ఖాపూర్, సెమీజ్‌పుత్ అనే మూడు గ్రామాలకు తలారీగా పనిచేయాలి. జెంత్రాల్ ప్రధాన కార్యాలయం. జెంత్రాల్ తలారితో రెండు నెలలు ఉన్నాను. అతను నాకు నేర్పిందేమీ లేదు. నేను ఒక్కసారి కూడా గ్రామం కార్యాలయంలో అడుగుపెట్టలేదు. గ్రామం పెద్దకు నామీద ఎందుకో కోపం ఉంది. అతనోసారి ''ఒరేయ్ - నీ తండ్రి నీ అన్నలు గ్రామం ఆఫీసు ఊడ్చేవాళ్లురా. నువ్వు ఇప్పుడు మాతో సమానంగా ఆఫీసులో కూచుంటావా. వళ్లు జాగ్రత్త. ఉద్యోగం విడిచి వెళ్లిపో?'' అన్నాడు.

ఒరోజు జెంత్రాల్ తలారీ నన్ను సైజ్‌పూర్ జనాభా వివరాల పట్టిక తయారుచేసేందుకు సైజ్‌పూర్‌కు రమ్మన్నాడు. వెళ్లాను. ఊరి పెద్ద తలారీ ఏదో పని చేస్తూ కనిపించారు. ఆఫీసు తలుపు దగ్గరికి వెళ్లి 'గుడ్‌మార్నింగ్' అన్నాను. వాళ్లు గమనించలేదు. బయట పావుగంట నిలబడ్డాను. అప్పటికే అలసిపోయాను. తిరస్కారానికి అవమానానికి గురయ్యేసరికి కోపం వచ్చింది. అక్కడ ఖాళీగా ఉన్న కుర్చీలో కూర్చున్నాను. నేను కూర్చోవడం చూసి ఊరిపెద్ద, తలారీ ఏమీ అనకుండా అక్కడి నుంచి వెళ్లిపోయారు. కొంతసేపటికి అక్కడికి జనం చేరుకున్నారు. గుంపులు ఎక్కువైనాయి. నన్ను చుట్టుముట్టారు. ఊరి గ్రంథాలయం లైబ్రేరియన్ వారికి నాయకత్వం వహించాడు. చదువుకున్నవాడు ఈ గుంపులకు నాయకత్వం ఎందుకు చేస్తున్నాడో అర్థంకాలేదు. నన్ను నానా దుర్భషలాడడం మొదలుపెట్టాడు. ఊరి నౌకరు ''రావానియా''ను ''ఎవడీ భాంగీ మురికి కుక్కను కుర్చీలో కూర్చోనిచ్చిన వాడు? అని అడిగాడు. రావానియా నన్ను లేపి కుర్చీ తీసుకుపోయాడు. నేను నేలమీద కూర్చున్నాను. తర్వాత మంది ఆఫీసులోకి వచ్చి నా చుట్టూ నిలబడ్డారు. నన్ను తిట్టారు. కోపం వెళ్లగక్కారు. ధరేయా (కత్తివంటి ఆయుధం) తో ముక్కలు ముక్కలుగా నరుకుతామని బెదిరించారు. క్షమించమని దయతలచమని అడిగాను. అసలు నన్ను నేను ఎట్లా రక్షించుకోవాలో నాకు తెలియలేదు.

నన్ను ఒకవేళ వాళ్ళు చంపేస్తే శవంకి పవిత్రంగా అంత్యక్రియలు ఎలా చేయాలో వివరిస్తు మామ్లత్‌దార్‌కు లేఖ రాయాలనుకున్నాను. ఈ కష్టాలూ చెప్పాలనుకున్నాను. కనీసం మామ్లత్‌దార్‌కు ఫిర్యాదు చేస్తాడేమోనన్న భయంతోనైనా వెనక్కు తగ్గుతారేమోనని ఆశపడ్డాను. నాకొక కాగితం ఇమ్మని రావానియాను అడిగాను. ఇచ్చాడు. అందరికీ కనపడేవిధంగా పెద్దక్షరాలతో ఈ ఉత్తరం రాశాను.

''బొర్సాద్ తాలూకా మామ్లాత్‌దార్ గారికి

అయ్యా,

పర్‌మార్ కాళిదాస్ శివరాం నమస్కారాలు దయచేసి అందుకోండి. ఈరోజు నాకు చావు దగ్గరకొచ్చిందని వినయంగా మనవి చేసుకుంటున్నాను. మా తల్లిదండ్రుల మాటలు వినిఉంటే ఈ గతి పట్టేది కాదు. నా చావు గురించి నా తల్లిదండ్రులకు దయచేసి చెప్పండి.

లైబ్రేరియన్ అది చదివాడు. వెంటనే చింపేయమన్నాడు. చింపేశాను. లెక్కలేనన్ని తిట్లు అవమానాలు నానెత్తిన కురిపించారు. ''నువ్వు మాకు తలారీగా వస్తావా? భాంగీవై ఉండి విలేజి ఆఫీసులో ప్రవేశించి కుర్చీలో కూచుంటావా?'' అని అడిగారు. దయచూపండి అని అడిగాను. ఈ తప్పు మళ్లీ చేయననీ, ఉద్యోగం వదిలేస్తానని చెప్పాను. సాయంత్రం 7 గంటలదాకా జనం నన్ను వదలలేదు. ఆ తర్వాతగాని తలారీ, గ్రామమున్సబూ రాలేదు. ఆ తర్వాత 15 రోజుల సెలవు తీసుకుని బొంబాయిలో అమ్మా నాన్న దగ్గరికి వెళ్లిపోయాను.''

## ఆరో భాగం

# వివిధ అంశాలపైన నోట్సు

1. బ్రిటిష్ ఇండియా రాజ్యాంగం

2. పార్లమెంటరీ వ్యవహార పద్ధతి గురించి నోట్సు

3. భారతదేశ చరిత్రకి సంబంధించిన నోట్సు

4. మనువు, శూద్రులు

5. సాంఘిక వ్యవస్థని కాపాడడం

6. హిందువులతో

7. నిస్పృహ

8. రాజకీయ అణచివేత సమస్య

9. ఏది అధ్వాన్నం? బానిసత్వమా, అంటరానితనమా?

# బ్రిటిష్ రాజ్యాంగం

## 1. ప్రవేశిక: ఈ విషయానికి ఉన్న పరిమితులు

బ్రిటిష్ ఇండియా రాజ్యాంగం 1919 గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్టు అనే దాంట్లో వుంది. అంచేత ఇండియా రాజ్యాంగం గురించి అధ్యయనం చేసే విద్యార్థి ఇంగ్లీషు రాజ్యాంగ విద్యార్థి లాగా రాజ్యాంగం కోసం వెతుక్కోనక్కర్లేదు. అతనూ అమెరికన్ రాజ్యాంగం అభ్యసించే విద్యార్థీ ఈ విషయంలో ఒకలాగే ఉంటారు. అమెరికన్ విద్యార్థికి అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగంలోని చట్టాన్ని వ్యాఖ్యానించుకుని బోధపరచుకోవడం కంటే ఎక్కువ సమస్య మరేం లేదు. ఈ దృష్ట్యా రాజ్యాంగ చట్టం అంటే ఏమిటి, ఈ పరిధిలోకి సాధారణంగా ఏ సమస్యలు వస్తాయి అనే అంశాన్ని లేవనెత్తడం అనవసరం ఇక రెండవది: రాజ్యాంగ చట్టంలోని విషయం పరిమితులు ఏమిటో నిర్వచించుకోవడం అవసరం అని అనుకున్నా అలాంటి విషయ చర్చ ముందే వుండాలా లేక ఆఖర్న ఉండాలా అనేది సమస్య. ''ఇంగ్లీషు రాజ్యాంగ చరిత్ర అధ్యయనం'' అనే గ్రంథంలో స్వర్గీయ ప్రొఫెసర్ మెయిట్‌లేండ్ రెండవ మార్గాన్ని అనుసరించేరు. అలాంటి పద్ధతి గురించి ఎంతైనా చెప్పవచ్చు. అయితే ఇండియన్ రాజ్యాంగ అధ్యయనం విషయంలో అలాంటి పద్ధతి ఎందుకు అనుకూలం కాదో కారణాలు ఉన్నాయి.

విషయానికి ఉన్న పరిమితులు ఏమిటో, ఇందులో వచ్చే అంశాలేమిటో మనకి స్పష్టం కావాలంటే రాజ్యాంగ చట్టం అంటే ఏమిటి అన్న సమస్యని మొదట లేవనెత్తాలి. ఈ విషయం రెండు మూడు ఉదాహరణల వల్ల విశదమౌతుంది. ఇండియా గవర్నమెంట్ యాక్ట్ హెబియస్ కార్పస్ రిట్ గురించి గాని, మాండమస్ రిట్ గురించి గాని, సర్షియో రారి గురించిగాని ఏమీ ప్రస్తావించదు. మార్షల్‌లా గురించి గాని, పాలక చట్టం గురించి గాని ఏమీ చెప్పదు. సార్వభౌమత్వాన్ని గురించీ ఏమీ లేదు. భారతీయ సంస్థానాలతో వ్యవహరించేటప్పుడు ఈ హక్కుని నిస్సందేహంగా ఇండియా ప్రభుత్వం వాడుతోంది. ఈ సమస్యల్ని అధ్యయనం చెయ్యడం అవసరమా? కాదా? ఇండియన్ రాజ్యాంగ అధ్యయనం విషయంలో అవి సముచిత అంశాలా కాదా? ఇతర దేశాల్లో ఆయా రాజ్యాంగాల్ని అధ్యయనం చేసిన నిపుణులు ఈ అంశాల్ని ఎలా పరిశీలించారోనన్నదాన్ని బట్టి చూస్తే అందరూ ఆమోదించినట్టు ఇవన్నీ కూడా రాజ్యాంగ చట్టం పరిధిలోకి వస్తాయని చెప్పడానికి అనుమానం లేదు. గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్టులో ఈ అంశాలు లేవు కాని, ఏమైనా అది రాజ్యాంగ చట్ట అధ్యయనంలో భాగం అవుతుంది కాబట్టి విషయ నిర్వచనం ప్రాముఖ్యాన్ని సంతరించుకుంటుంది.

ఏది రాజ్యాంగం అనే ప్రశ్నకి అనేకమంది అనేక నిర్వచనాలు ఇచ్చారు. ఆస్టిన్, మెయిట్‌లేండ్ రెండు ధోరణులకు ప్రతినిధులుగా తీసుకోవచ్చు. ఆస్టిన్ ''పబ్లిక్ లా''ని - దానికి రాజకీయ పరిస్థిత చట్టం అని ఆయన పేరుపెట్టాడు- రాజ్యాంగ చట్టం అనీ, పాలనా చట్టం అనీ రెండుగా విభజించా రాజ్యంలో సార్వభౌమ అధికారం వుండే వ్యక్తుల్నీ లేకపోతే వ్యక్తుల వర్గాల్నీ రాజ్యాంగ చ నిర్ణయిస్తుందని ఆయన అభిప్రాయం. ఈ వ్యక్తులు ఆ అధికారాన్ని పంచుకునే పద్ధతిని ఆం వివరించాడు. స్పష్టపడేదేమంటే రాజ్యాంగ చట్టం గురించిన ఆస్టిన్ నిర్వచనంలో సార్వభౌమ స నిర్మాణం, స్వరూపం (ఏర్పడ్డం, నిర్మితమవడం) అనే వాటి నియమాలే ఉంటాయి. ఆ సార్వభౌ సంస్థ సార్వభౌమ అధకారాన్ని వినియోగించడం గురించి నియమాలన్నిట్నీ ఆయన రాజ్యాం నుంచి మినహాయించాడు. ఆస్టిన్ తన సూత్రబద్ధ తార్కికత మీద ఆధారపడి రాజ్యాంగ చట్ట నిర్వచిస్తే, మెయిట్‌లేండ్ అంతరాత్మకి సంబంధించిన విషయంగా రాజ్యాంగ చట్టం పరిమిత పెట్టాడు. మెయిట్‌లేండ్ ప్రకారం సార్వభౌమ సంస్థ (నిర్మాణ) నియమాలే కాక ప్రీవీ కౌన్సి ఆంతరంగిక శాఖలు, రాజ్య మంత్రులు, న్యాయమూర్తులు, శాంతిభద్రతల న్యాయాధికారు (పేదల న్యాయ సంరక్షకులు), ఆరోగ్య శాఖలు, పోలీసు శాఖలు రాజ్యాంగంలో ఉంటాయి. దృక్పథాలు రెండూ భిన్నధృవాల్ని ప్రతిబింబిస్తున్నాయి. ఆస్టిన్‌ది మరీ సంకుచితైన దృష్టి అయి మెయిట్‌లేండ్‌ది నిస్సందేహంగా మరీ విస్తృతమైన దృష్టి.

అయితే ప్రొఫెసర్ హలండ్ అభిప్రాయం మీద ఆధారపడి ఓ మధ్యేమార్గాన్ని స్థాపించవచ్చు అభిప్రాయాలు ఆయన న్యాయశాస్త్రంలో వెల్లడయేయి. హక్కు అనేది ఒక వ్యక్తికి ఉంటు ప్రభుత్వ ఆమోదంతో, సహాయంతో మరొకరి చర్యల్ని ఆ వ్యక్తి నియతం చేసే సత్తా అది. ఒక వ వృత్తిగా మరో వ్యక్తి దఖలు చేసే హక్కులు ప్రైవేట్‌న్యాయానికి సంబంధించిన విషయాలు అవుతాం ప్రభుత్వం పాలితుల మీద తనకి ఉందనే హక్కులు, అది తనకి తను సానుకూలపరచుకునే హక్కు పబ్లిక్ న్యాయం అవుతాయి. రాజ్యాంగ చట్టం అనేది పబ్లిక్ న్యాయంలో భాగం అవుతుంద నిస్సందేహం. అది అలా ఉన్నంతవరకూ పాలితులకి సంబంధించి ప్రభుత్వానికి కల హక్కుల ప్రభుత్వానికి సంబంధించి పాలితులకు కల హక్కులన్నీ అది చర్చించాలి. కాని రాజ్యాంగంలో ఇంతక ఎక్కువే ఇమిడి ఉంటాయి. రాజ్య వ్యవస్థ అధ్యయనం ఇందులో ఇమిడి ఉండాలి, ఏమంటే రా అనేది నైరూప్య వ్యక్తి. దండించే హక్కుని, ఆస్తి కలిగి వుండే హక్కుని, ఒప్పందాలు కుదుర్చు హక్కుని, తనకీ పాలితులకీ మధ్య ఉండే హక్కుల్నీ విధుల్నీ నియతం చేసే అవకాశాన్ని, అదేరక పాలితుల మధ్య ఉండే హక్కుల్నీ విధుల్నీ నియతం చేసే అవకాశాన్ని రాజ్య వ్యవస్థ అపేక్షిస్తుంది. నైరూప్య వ్యక్తి ఎలా ఏర్పడ్డం జరుగుతుందో పరిశోధించడం అవసరం. అంచేత రాజ్యాంగ చ

అధ్యయనంలో మూడు అంశాలుండాలి: (1) రాజ్యవ్యవస్థీకరణ (2) పాలితులకి సంబంధించి ప్రభుత్వానికి ఉన్న హక్కులు (3) ప్రభుత్వంపై (విషయంలో) పాలితులకి ఉన్న హక్కులు. రాజ్యాంగ చట్టం పరిధి, పరిమితుల విషయంలో గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్టు గురించి చేసే ఈ ప్రసంగాలలో నేను అనుసరించేవైఖరి ఇది. ప్రొఫెసర్ ఆన్‌సన్ ఇంగ్లీషు రాజ్యాంగం గురించిన అధ్యయనంలో ఈ వైఖరినే అనుసరించారు.

విధిగా తలెత్తే మరో సమస్య వుంది, దాన్ని మొదట్లోనే తేల్చుకోవడం మంచిది. ఈ విషయాన్ని పరిశీలించే పద్ధతి చారిత్రకమైందిగా ఉండాలా లేక వివరణాత్మకమైందిగా ఉండాలా? గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్టుని అధ్యయనం చేసేటప్పుడు కొంత చరిత్ర ఉండక తప్పదు. ఈస్టిండియా కంపెనీ విషయంలో లభించిన సకల నష్టపరిహారాలూ సెక్రటరీ ఆఫ్ స్టేట్ విషయంలోనూ కొనసాగుతాయని ఈ యాక్టు చెపుతోంది. ఘనత వహించిన ప్రభువులు లెటర్స్ పేటెంట్ (అధీకృత ఉత్తర్వులు) ద్వారా హైకోర్టులని స్థాపించవచ్చని కూడా ఈ యాక్టు చెపుతోంది. సుప్రీంకోర్టుని తోసిరాజని వచ్చిన హైకోర్టు ఆ అధికారాలన్నిట్నీ చలాయించవచ్చని లెటర్స్ పేటెంట్ చెపుతున్నాయి. ఇండియా గవర్నమెంట్ యాక్టులో ఈ బాపతు స్వభావంతో ఉన్న ఇతర విభాగాలు చాలా ఉన్నాయి. కాని చరిత్రని తడమకుండా తప్పించుకోలేం అనేందుకు ఈ రెండు ఉదాహరణలూ చాలు. ఇండియా రాజ్యాంగాన్ని పరిశీలించేటప్పుడు సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కి సంబంధించి ఏ శాసనోక్త పరిష్కారాలు లభ్యమానమో గ్రహించాలంటే ఈస్ట్ ఇండియా కంపెనీ రోజుల్లో పౌరులకి అవి ఎలా ఉండేవో విధిగా చూడాలి. అదేరకంగా సుప్రీంకోర్టుకి ఏ అధికారాలు ఉండేవో తెలిస్తేకాని హైకోర్టు అధికారాలు ఏమిటో బోధపడవు. కొంతమేరకు చరిత్ర అవసరమే అయినా, ఇవాళ రాజ్యాంగ చట్టం అమలులో ఉన్న తీరుని అధ్యయనం చెయ్యడానికి అందులోని ప్రతి భాగాన్ని చారిత్రకంగా అధ్యయనం చెయ్యడానికి ఏ సమర్థనా లేదు. వర్తమానం విషయంలో గతమంతటికీ ఏ ప్రాముఖ్యమూ లేదు. వర్తమానానికి సంబంధించిన భాగాన్నే సూచించాల్సి ఉంది. అంచేత ఏ సందర్భంలోనైనా సరే అవగాహన కోసం అవసరం పడితే నేను అలా చేస్తాను. అదే నేను అనుసరించబోయే పద్ధతి.

(ఈ విషయానికి సంబంధించి మరే ఇతర వ్యాసం లభ్యం కాలేదు - సం)

## 2. పార్లమెంటరీ వ్యవహార పద్ధతి గురించిన నోట్సు

ఒక వ్యవస్థ నిర్వహించే విధులని బట్టి ఆ వ్యవహార పద్ధతి రూపాలు ఉంటాయి.

**పార్లమెంటరీ వ్యవస్థ నిర్వహించే ముఖ్య విధులు:**

(1) కార్యనిర్వాహక చర్యని దేన్నైనాగానీ విమర్శించడం, దానిమీద అభిప్రాయాన్ని వెల్లడించే అధికారం ఉండడం.

(2) చట్టాల్ని చేసే హక్కు ఉండడం.

(3) పరిపాలనని సాగించేందుకు ధనాన్ని సమకూర్చడం.

**I. కార్యనిర్వాహకమండలి చేసిన ఏ చర్యమీదనైనా అభిప్రాయం చెప్పడం, విమర్శించడం. వ్యవహారసరళి నియమాలు ఈ అంశాలని ఆమోదిస్తాయి:**

1. ప్రశ్నలు అడగడం
2. తీర్మానాలు ప్రవేశపెట్టడం
3. సభని వాయిదా వెయ్యమనడం
4. ప్రభుత్వానికి వ్యతిరేకంగా విశ్వాసరాహిత్య తీర్మానం ప్రవేశపెట్టడం.

**1. ప్రశ్నలడిగే అధికారం**

రూల్ 7

ఇది ఈ పరిమితులకి లోబడి ఉంటుంది:

కార్యకలాపాలని క్రమబద్ధీకరించడం.

1. ముందు వెనుకలు ఉండాల్సిన తీరు

1. ప్రశ్నోత్తరాలు 1 గంట. పద్దులపైన చర్చలు ఓటింగ్ జరిగే సందర్భాల్లో 1/2 గంట.

2. బిల్లులు

3. స్థాయీ ఉత్తర్వులని **(Standing Orders)** సవరించే ప్రతిపాదనలు

4. తీర్మానాలు

అధ్యక్షులు వీటిలో ఏ అంశానికైనా (ప్రాథమ్యం) ఇవ్వవచ్చు. 11 బిల్లులకి, ప్రతిపాదనలకి, తీర్మానాలకి ప్రాముఖ్యం ఇవ్వడం.

(i) బిల్లులు, ప్రతిపాదనలు

అతి తక్కువ వాటికంటే అత్యంత అధిక ప్రాధాన్యం ఉన్న వాటికి ప్రాముఖ్యం ఉంటుంది.

(ii) తీర్మానాలు

ఓటింగ్ ద్వారా ప్రాముఖ్యం నిర్ణయిస్తారు.

కోరమ్ (కనీస నిర్ణీత సంఖ్య)

బొంబాయిలో 25 మంది సభ్యులు

కోరమ్ లేనట్లయితే అధ్యక్షుడు మర్నాటికి వాయిదా వెయ్యచ్చు.

రూల్ 27 బడ్జెట్‌ని రెండు దశలుగా పరిశీలిస్తారు.

(i) సాధారణ చర్చ

(ii) పద్దుల మీద వోటింగ్

సాధారణ చర్చకి గవర్నర్ తనకిష్టమైనన్ని రోజుల్ని కేటాయించవచ్చు.

సాధారణ చర్చ జరిగేటప్పుడు ఏ ప్రతిపాదనా ఉండదు, బడ్జెట్‌ని కౌన్సిల్ వోటుకి ప్రతిపాదించరు.

రూల్ 29 పద్దులకి సంబంధించి వోటింగ్

పద్దుల వోటింగ్ విషయంలో గవర్నర్ పన్నెండు రోజులకి మించకుండా కేటాయించవచ్చు. ఏ డిమాండ్‌కైనా రెండు రోజులు మించకూడదు. నిర్దేశించిన ఆఖరి రోజున పద్దులకి సంబంధించిన విషయాలేవైనా తేలకుండా ఉన్న పక్షంలో అధ్యక్షులు పరిష్కృతం కావాల్సిన అంశాలనన్నిటినీ ప్రతిపాదించవచ్చు.

రూల్ 30

ద్రవ్య వినియోగంకి సంబంధించిన ఏ ప్రతిపాదననీ చెయ్యరాదు. చేసినా కౌన్సిల్‌కి నివేదించిన

గవర్నర్ సిఫారసుతో మాత్రమే జరగాలి. ఏ పద్దునైనా తగ్గించడానికి, మినహాయించడానికి, ఓ పద్దులో ఏ అంశాన్నైనా కుదించడానికి ప్రతిపాదనలు ఉండవచ్చు. కాని ఆ పద్దు ఉద్దేశించిన లక్ష్యాన్ని మార్చడానికి గాని పెంచడానికి గాని ఆ ప్రతిపాదనలు ఉండరాదు.

రూల్ 31 అధిక నిధులు

(రచయిత ఈ భాగం ఖాళీగా వదిలేశారు -సం)

రూల్ 32

అనుబంధ లేదా అదనపు గ్రాంట్

నిధి (ధనం) తక్కువ అయినా

కొత్త వనరుల అవకాశం తలెత్తినా

పబ్లిక్ ఎకౌంట్స్ కమిటీ

రూల్ 33

పబ్లిక్ ఎకౌంట్స్ కమిటీ ఏర్పాటు

(రచయిత ఖాళీగా వదిలేశారు -సం)

రూల్ 34

పబ్లిక్ ఎకౌంట్స్ కమిటీ విధులు

ఉద్దేశించిన పరిధిలోనే ద్రవ్యాన్ని వినియోగించడం జరిగిందని సంతుష్టి చెంది, దృష్టికి తీసుకురావడం.

వ్యవహారాన్ని నడిపించడం.

స్టాండింగ్ ఆర్డర్స్ (స్థాయీ ఉత్తర్వుల) ద్వారా ఇది క్రమబద్ధం అవుతుంది.

కౌన్సిల్ సమావేశాలు

1. గవర్నర్ నొటిఫికేషన్ ప్రకారం నిర్దేశించిన సమయంలో, స్థలంలో మాత్రమే కౌన్సిల్ సమావేశం అవుతుంది.

2. గవర్నర్ ఆజ్ఞ మేరకి సమావేశం ప్రోరోగ్ (నిలిపివేయడం) అవుతుంది.

3. అధ్యక్షుడు నిర్దేశించిన రోజులలోనూ, సమయంలోనూ కౌన్సిల్‌సమావేశం జరుపుతుంది.

ప్రొరోగేషన్ (నిలుపుచేయడం) ఫలితాలు

ప్రొరోగేషన్ జరిగేటప్పటికి పెండింగ్‌లో ఉన్న నోటీసులన్నీ మురిగిపోతాయి. తర్వాతి సమావేశానికి తాజా నోటీసుల్ని యివ్వాలి. అయితే ఈ కింది సందర్భాల్లో ఈ నియమానికి మినహాయింపు ఉంది:

1. ప్రశ్నలు

2. చట్టపరమయిన తీర్మానాలు

3. ప్రవేశపెట్టిన బిల్లులు

4. సెలెక్ట్ కమిటీకి నివేదించిన స్థాయీ ఉత్తర్వులని సవరించే ప్రతిపాదనలు

----

ఇవి తరవాతి సమావేశపు కార్యనిర్వహణ పట్టీకి చేరతాయి.

## కార్యనిర్వహణక్రమం

I ప్రశ్నలు

అధ్యక్షుడు తమ వివేచనానుగుణంగా నిర్ణయించిన రీతిలో ప్రశ్నలని అడగవచ్చు, జవాబులు ఉండవచ్చు.

II వాయిదా తీర్మానం

ముప్పై మంది ప్రతిపాదించాలి (అనుకూలంగా ఉండాలి)

తీర్మానాన్ని చర్చించేందుకు సాయంత్రం 4 గం సమయం. సాయంత్రం 6 గంటలకి చర్చ ముగుస్తుంది. ఆ తర్వాత ఆ తీర్మానానికి సంబంధించిన విషయాన్ని ఎత్తకూడదు.

III బిల్లులు

(1) నాలుగు దశలు

1. ప్రవేశపెట్టడం సభ అనుమతి తీసుకోవడం

2. మొదటి పఠనం

3. రెండవ పఠనం

4. మూడవ పఠనం

(1) ఆస్ట్రేలియా రాజ్యాంగం సెక్షన్ 49

(2) కెనడా రాజ్యాంగం సెక్షన్ 18

(3) దక్షిణ ఆఫ్రికా రాజ్యాంగం సెక్షన్ 57

శాసనసభకి (సభ్యునికి) ఏ హక్కునీ ఇచ్చే సెక్షన్ గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్టులో లేదు.

ఈ యాక్టు శాసనసభ్యులకి రెండు హక్కుల్ని మాత్రమే ప్రసాదిస్తోంది.

1. వాక్ స్వాతంత్ర్యం

సెక్షన్ 67 (7)

ఇండియా శాసనసభ ఉభయ సభల్లోనూ వాక్స్వాతంత్ర్యం ఉంటుంది. సభలో సభ్యులు చేసిన ఉపన్యాస కారణంగా గాని, వోట్ చేసిన కారణంగాగాని లేదా సభలో జరిగిన కార్యసరళి గురించిన ఏ అధికారిక నివేదిక కారణంగా గాని ఏ సభ్యునిపైనైనా ఏ న్యాయస్థానంలోనూ చర్యలు తీసుకోవడానికి వీలులేదు.

సెక్షన్ 72 డి (7)

గవర్నర్ శాసనమండలిలో వాక్ స్వాతంత్ర్యం ఉంటుంది. అలాంటి సభలో సభ్యులు చేసిన ఉపన్యాసాల కారణంగాగాని, వోటు కారణంగాగాని, అలాంటి మండలి కార్యసరళిగురించిన అధికారిక నివేదికలో ఉన్న దేని కారణంగానైనాగాని ఏ సభ్యునిపైనా ఏ న్యాయస్థానంలోనూ చర్యలు తీసుకోవడానికి లేదు.

ఈ వాక్ స్వాతంత్ర్య హక్కు రెండు పరిమితులకి లోబడి ఉంటుంది.

(1) స్థాయీ ఉత్తర్వులు

(2) అధికారిక నివేదికలు

<u>II అరెస్ట్ చెయ్యకుండా ఉండడం</u>

ఈ హక్కుని గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్టు ఇవ్వలేదు. దీన్ని ఇండియన్ శాసనసభ యాక్టు కల్పించింది. దాన్ని శాసనసభ్యులని మినహాయించే చట్టం, 1925 (నం. 23 ఆఫ్ 1925) అని పిలుస్తారు.

## ఈ చట్టం కింద

1. గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్టు ప్రకారం ఏర్పాటైన శాసనసభ్యులు జ్యూరీ సభ్యులుగా న్యాయనిర్ణేతలుగా ఉండడానికి లేదు ఉండనవసరం లేదు.

2. సివిల్ ప్రాసెస్ (పౌర నియమావళి పద్ధతి)లో ఏ వ్యక్తినీ అరెస్ట్ చెయ్యడానికి గాని అదుపులో తీసుకోవడానికి గాని లేదు,

    (అ) ఆ వ్యక్తి గనక గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్టు ప్రకారం ఏర్పాటైన శాసనసభ్యుడైనా, అలాంటి సభ సమావేశం సాగుతూ ఉన్నా

    (ఆ) అతను గనుక ఆ సభ ఏర్పాటుచేసిన ఏ కమిటీలో ఉన్నా, ఆ కమిటీ సమావేశం సాగుతూ ఉన్నా

    (ఇ) అతను ఉభయ సభల్లోనూ ఎందులో సభ్యుడైనా, ఆ సభల సంయుక్త సమావేశం జరుగుతూ ఉన్నా, లేదా తను సభ్యుడైన సభల సంయుక్త కమిటీ సమావేశంగాని, సభ సమావేశంగాని జరుగుతూ ఉన్నా. అలాంటి సభ, సమావేశానికి 14 రోజులు ముందుగాని తర్వాతగాని.

## గమనించాల్సిన అంశాలు

(1) సివిల్ అరెస్టు నుంచి మాత్రమే ఈ స్వేచ్ఛ.

(2) ఆ సమయం ముగిసేక తిరిగి అరెస్ట్ చెయ్యచ్చు.

## శాసనసభల కార్యసరళి

1. ఇండియన్ శాసనసభల కార్యసరళి ఇలా క్రమబద్ధం అవుతుంది.

(1) వ్యవహార నియమాల్ని బట్టి

(2) స్థాయీ ఉత్తర్వుల్ని బట్టి

| | |
|---|---|
| సెక్షన్ 67 (1) | కేంద్ర శాసనసభకి చేసిన నియమాల్ని |
| సెక్షన్ 67 (6) | స్థాయీ ఉత్తర్వుల్ని ఆమోదిస్తాయి. |
| సెక్షన్ 72 డి (6) | స్థానిక శాసనసభకి సంబంధించిన |
| సెక్షన్ 72 డి (7) | నియమాలని, స్థాయీ ఉత్తర్వులని ఆమోదిస్తాయి. |

II నియమాలని చెయ్యడానికిగాని, స్థాయీ ఉత్తర్వుల్ని చెయ్యడానికి గాని శాసనసభలకి అధికారం లేదు.

అధినివేశ రాజ్యాలకి ఉంది.

భారత్‌లో ఈ విషయం 129 ఎ సెక్షన్ కిందకి వస్తుంది. మండలిలో గవర్నర్ జనరల్ నియమాలని, స్థాయీ ఉత్తర్వుల్ని చేస్తాడు.

### నియమాలకీ, స్థాయీ ఉత్తర్వులకీ తేడా

1. ఇండియన్ శాసనసభ- అది స్థానికమైనా, కేంద్రమైనా , నియమాల్ని మార్చడానికి గాని రద్దు చెయ్యడానికిగాని లేదు.

2. కొన్ని షరతులకి లోబడి స్థాయీ ఉత్తర్వుల్ని సవరించవచ్చు.

నియమాలకి, స్థాయీ ఉత్తర్వులకీ కల విభిన్న ఉద్దేశాలు

<u>రెండు ప్రశ్నలు:</u>

1. శాసనసభ ఏ విషయాన్ని గురించి చర్చించవచ్చు, ఏది దాని అధికారం కిందకి వస్తుంది, ఏది రాదు?

2. ఒక ఫలానా అంశం దాని అధికారం కిందకి వస్తుందని అనుకున్నా ఆ విషయాన్ని ఎలా చర్చించాలి? దాన్ని ఒక చర్చనీయాంశంగా తేవడం ఎలా? సభ్యులు ఏ క్రమంలో మాట్లాడాలి? ఏ సభ్యునికైనా ముందుగా మాట్లాడే హక్కు ఉంటుందా? వోట్లని ఎలా నమోదు చేస్తారు? వాటిని ఎలా లెక్కపెడతారు? వాటి విలువని ఎలా పరిగణిస్తారు?

మొదటి ప్రశ్నని వ్యవహారసరళి నియమాలు పరిష్కరిస్తాయి. రెండవదాన్ని స్థాయీ ఉత్తర్వులు తేలుస్తాయి. యాక్టులో ఉన్న పరిభాషని వాడి చెప్పాలంటే వ్యవహారసరళి నియమాలు కార్యసరళి తీరుని నియతం చేస్తాయి.

స్థాయీ ఉత్తర్వులు కార్యనిర్వహణ తీరుని నియతం చేస్తాయి.

## కార్యసరళి నియమాలు, ఆచరణ స్వేచ్ఛ

కార్యసరళి నియమాలు తమ విధుల్ని నిర్వహించేందుకవసరమైన స్వేచ్ఛని శాసనసభ్యులకి ఇస్తాయా?

★ రూల్ 8

ప్రజాప్రయోజనం కల విషయానికి సంబంధించి సమాచారం రాబట్టేందుకు ప్రశ్నని అడగవచ్చు. ఎవర్ని ఉద్దేశించి ఆ ప్రశ్నని అడుగుతున్నారో వారి ప్రత్యేక గమనిక (వారి చేత గుర్తింపబడే పరిధి) లో ఆ విషయం ఉండాలి.

## నోటీస్ వ్యవధి

(అ) ముఖ్యంగా స్థానిక ప్రభుత్వానికి సంబంధం లేని విషయానికి చెందిన ప్రశ్న అయితే అధ్యక్షుడు దాన్ని తోసిపుచ్చవచ్చు.

(ఆ) ఆదేరకంగా అధ్యక్షుడు అంగీకరించిన ప్రశ్నని గవర్నర్ తోసిపుచ్చవచ్చు. అది గనక

(i) ఏ విదేశంతోనైనా ఘనత వహించిన ఏలిన వారి ప్రభుత్వానికి గాని, ఇండియా ప్రభుత్వానికి గాని, గవర్నర్‌కి గాని, మండలితో గవర్నర్‌కి గాని ఉన్న సంబంధాలకి ప్రతికూలమైందైతే

(ii) ఏలినవారి సర్వంసహాధిపత్యానికి లోబడి ఉన్న ముఖ్యులతోగాని, సంస్థానాధీశులతోగాని పైన చెప్పిన అధికారుల సంబంధాలకి ప్రతికూలంగా ఉండేదైతే, లేదా ఆ సంస్థానాధీశుల లేదా సంస్థానాధీశుల ముఖ్యుల పాలనా వ్యవహారాలకి సంబంధించిందైతే.

(iii) ఏ న్యాయస్థానంలోనైనా తీర్పు కోసం ఉన్న విషయమైనా, ఆ న్యాయస్థానం ప్రభువుల అభినివేశ ప్రతి రాజ్యంలోనైతే గవర్నర్ తోసిపుచ్చవచ్చు.

గమనిక: ఏదేనా సందేహం తలెత్తితే గవర్నర్ దానిమీద నిర్ణయం తీసుకుంటాడు, ఆ నిర్ణయమే తుది నిర్ణయం

(ఇ) మండలిగవర్నర్‌జనరల్‌కి, స్టేట్ సెక్రటరీకి స్థానిక ప్రభుత్వంతో విభేదం వస్తే తత్సంబంధమైన ప్రశ్నలేవీ అడగకూడదు; యథార్థ విషయానికి సంబంధించి ప్రశ్న ఉండవచ్చు, దాని జవాబు కూడా యథార్థ విషయానికి పరిమితమయే ఉంటుంది.

## తీర్మానాలు ప్రతిపాదించే హక్కు

రూల్స్ 22-23

రూల్ 23 (1) ప్రతి తీర్మానం ప్రభుత్వానికి నివేదించే నిర్దిష్ట సిఫార్సుగానే ఉండాలి.

## శాసనబద్ధ పరిమితులు

ప్రశ్న అడగడానికి వీలులేని విషయం గురించి తీర్మానం ప్రతిపాదించడానికి లేదు.

రూలు 22

తీర్మానాలు ప్రతిపాదించే హక్కుకి సంబంధించిన శాసనబద్ధ పరిమితులేకాక, నోటీసు ఇచ్చిన కాలపరిమితిలో ఏ తీర్మానాన్నైనా గవర్నర్ త్రోసిపుచ్చవచ్చు. ప్రజాప్రయోజనం దృష్ట్యా దాన్ని ప్రతిపాదించరాదని లేదా అది ప్రధానంగా స్థానిక ప్రభుత్వ సంబంధించినది కాదనీ అలా తోసిపుచ్చవచ్చు.

## తీర్మానాలకి వ్యతిరేకంగా ఆంక్షలు

రూల్ 24 ఎ

అధ్యక్షుడు అనుమతి గాని, తత్సంబంధిత శాఖ ప్రభుత్వ సభ్యుని అనుమతి గాని లేకుండా, నియమాలకి అనుబంధంగా ప్రవేశపెట్టిన తీర్మానం మీద తప్ప మరే ఇతరమైన ప్రజానుకూల విషయం మీదా చర్చ జరగదు.

2. తీర్మానాలు ప్రవేశపెట్టడానికి లేని విషయంగురించి ఏ తీర్మానాన్నీ అధ్యక్షుడుగాని తత్సంబంధ శాఖ సభ్యులుగాని ఆమోదించడానికి వీలులేదు.

## వాయిదా తీర్మానం

రూల్స్ 11, 12

రూల్ 11

అత్యవసర ప్రజా ప్రాముఖ్యం కల నిర్దిష్ట విషయాన్ని చర్చించేందుకు మండలి కార్యక్రమాన్ని వాయిదా వెయ్యాలన్న తీర్మానాన్ని ప్రవేశపెట్టవచ్చు.

రూల్ 12

ఇది ఈ కింది పరిమితులకి లోబడి ఉంటుంది.

(i) అదే సమావేశంలో అలాంటి తీర్మానం ఒక్కటే ఉండాలి.

(ii) ఒక విషయాన్నే చర్చించాలి, అంతకుమించి కూడదు, ఇటీవల సంభవించిన నిర్దిష్ట విషయానికే అది పరిమితమై ఉండాలి.

(iii) అంతకుముందే పరిష్కృతమైన విషయానికి సంబంధించినదిగా ఉండరాదు, దాన్ని తిరగదోడరాదు.

(iv) అప్పటికే ఎజెండాలో ఉన్న అంశానికి సంబంధించి గానీ, నోటీసు ఇచ్చి వున్న అంశానికి సంబంధించిగాని ఆ తీర్మానం ఉండకూడదు.

1. తీర్మానం ప్రవేశపెట్టడానికి వీలుకాని విషయం మీద అది ఉండకూడదు.

2. అధ్యక్షుడి అనుమతి ఉండి తీరాలి.

## విశ్వాస రాహిత్య తీర్మానం

రూల్ 12 ఎ

ఒక మంత్రి మీద విశ్వాసం లేదని ప్రకటించే తీర్మానం లేదా ఒక ప్రత్యేక సందర్భంలో ఆ మంత్రి విధానాన్ని అంగీకరించడం లేదని ప్రకటించే తీర్మానం.



# భారతదేశ చరిత్రకి సంబంధించిన నోట్సు

(రాత ప్రతి నుంచి గ్రహించినది - సం)

భారతదేశ చరిత్రకి సంబంధించి శకుల, యుహె-చి తెగల దండయాత్రలు మరింత ముఖ్యమైనవి. వాళ్ళు మధ్య ఆసియా సంచార తెగలవాళ్ళు ఈనాటి తుర్కొమాన్‌లకి[1] తుల్యమైన వాళ్ళు. శకుల గురించి ఇలి నదీ లోయ ప్రాంతంలో మొదట తెలిసింది. యుహె-చి ముందుకు తోసుకువస్తూ ఉంటే దక్షిణ ప్రాంతాలకి పోయేరు. క్రీ.పూ. 150 ప్రాంతంలో భారతదేశపు వాయవ్య సరిహద్దు చేరేరు. అక్కడ అనేక చిన్న సంస్థానాలు స్థాపించేరు. ఆ సంస్థాన పాలకులు కొంతకాలం పార్థియన్ల సర్వంసహాధిపత్యాన్ని అంగీకరించేరు. సత్రవ (మండలాధికారి) బిరుదు వహించేరు. పశ్చిమ భారతం శక్త యవన, పల్లవ అని పిలిచే విదేశీ పాలకుల మధ్య విభజితం అయి ఉండేది. వాటి సరిహద్దులూ, పరస్పర సంబంధాలు నిరంతరం మారుతూ ఉండేవి. ఆ సంస్థానాల్లో అతి ముఖ్యమైంది 'మహాసాత్రపి' అనే పేరు పొందింది. అందులో సౌరాష్ట్ర (కథియవార్), ప్రధాన భూభాగంలోని పరిసర ప్రాంతాలు కలిసి ఉండేవి. అది క్రీ.శ. 395 దాకా సాగింది.

యుహె-చి తెగవాళ్ళు చైనా నుంచి క్రీ.పూ. 100 ప్రాంతంలో పశ్చిమాభిముఖంగా శకుల్ని తరుముకుంటూ పోయేరు, బాక్ట్రియాలో స్థిరపడ్డారు. కుషాన్లు అని పిలిచే ఒక తెగ నాయకుడైన కాడ్‌ఫిసెస్ మిగతావాళ్ళ మీద తన ఆధిపత్యం స్థాపించుకోగలిగేడు. అవన్నీ ఒక జాతిగా కలిసిపోయేయి. అక్కడ నుంచి తెగనామంతోనే వ్యవహృతమయేయి. భారతదేశ చరిత్రలో కుషాన్ సామ్రాజ్య కాలక్రమం చిక్కుపెట్టే సమస్యల్లో ఒకటి. ఈ కింద ఇస్తున్న సంవత్సరాలు సుమారుగా ఉండేవి మాత్రమే. ఏమంటే తగినంత చర్చ చెయ్యడానికి తగ్గ సావకాశం లేదు. అంచేత కొంత అనుమానంగానే వీటిని ఇవ్వడం జరిగింది. వాస్తవాల ఆధారంగా మరింత పరిజ్ఞానం కావాల్సి ఉంటుంది. సామ్రాజ్యాన్ని సంఘటితపరచుకున్నాక కాడ్‌ఫిసెస్ I (క్రీ.శ. 15-45) సైన్యాన్ని దక్షిణ దిశగా నడిపించేడు. కాబూల్‌ని జయించేడు. బహుశా కాశ్మీర్‌ని జయించేడు.

అతని తరువాత వచ్చిన కాడ్‌ఫిసెస్ II (క్రీ.శ. 45-78) సింధ్, పంజాబ్, బహుశా కాశీలతో సహా యావత్ వాయవ్య భారతాన్ని వశపరచుకున్నాడు. ఆ సమయంలో రోమన్ సామ్రాజ్యానికీ భారతదేశానికీ మధ్య సుమారైన వ్యాపారం సాగుతూ ఉండేది. కాడ్‌ఫిసెస్ తర్వాత అధికారంలోకి వచ్చిన కనిష్కుడు

---

1. కాని భాషలో కాకపోవచ్చు. కుషాన్లు లేక యుహె-చి తెగలవాళ్ళు ఓ ఇరానియన్ నుడికారం వాడేవారని ఇటీవలి పరిశోధనల వల్ల తెలుస్తోంది.

(క్రీ.శ. 78-123) ట్రోజన్‌కి దౌత్యవర్గాన్ని పంపినట్టుంది. ఈ చక్రవర్తి బౌద్ధమత ఉత్తర చరిత్రలో పాలుపంచుకున్నాడు. అతని పాత్ర అందులో తొలినాళ్ళలో అశోకుని పాత్రతో తుల్యమైంది.[1] అతను పార్థియన్లతో, చైనా వాళ్ళతో యుద్ధాలు చేశాడు. పెషావర్ రాజధానిగా ఉన్న అతని సామ్రాజ్యంలో ఆఫ్ఘనిస్తాన్, బాక్ట్రియా, కష్గర్, యార్‌ఖండ్, ఖోటన్[2] కాశ్మీరు కలిసి ఉండేవి. తూర్పున గయ దాకా బహుశా విస్తరించిన ఈ భూభాగాల్ని అతని వారసులైన హువిష్క (123-140 క్రీ.శ.) వసుదేవ (క్రీ.శ 140-178) నిలబెట్టుకున్నారు. కాని ఆ తర్వాత ఆంధ్ర, కుషాన్ వంశాలు రెండూ భారత రాజ్యాలుగా ఉండకుండా పతనమయేయి. కుషాన్లు కాబూల్ ఏలుబడి సాగించినా, వాళ్ళ పతనానికి కారణాలేమిటో తెలీదు. కాని పర్షియాలో సస్సానిద్‌ల ఉన్నతికీ దీనికీ సంబంధం ఉండచ్చు. ఒక శతాబ్దం పైబడి భారత రాజయీ చరిత్ర శూన్యంగా ఉండిపోయింది. శక వంశం కింద సురాష్ట్ర రాజ్యం సాగిందని చెప్పడానికి మించి మరి ఎక్కువ ఏమీ లేదు.

గుప్త వంశ ఆవిర్భావంతో మళ్ళీ చీకట్లు తొలగేయి. అది ఆధునిక హిందూమతానికి ఓ మాదిరిగా నాంది పలుకుతుంది బౌద్ధ మతానికి వ్యతిరేకంగా. క్రీస్తు శకంలోని మొదటి మూడు శతాబ్దులలోనూ మౌర్యుల ప్రాచీన సామ్రాజ్య రాజధానీ నగరం అయిన పాటలీపుత్రం భాగ్యలక్ష్మి ఎలా ఉండిందో ఏమీ తెలియకపోయినా, అది మనుగడ మాత్రం సాగించింది. క్రీ.శ. 320 ప్రాంతంలో ఒకటో చంద్రగుప్తుడు తన భూభాగాల్ని విస్తరించుకుని గుప్తయుగాన్ని సంస్థాపిస్తూ సింహాసనం అధిష్ఠించేడు. అతని కుమారుడైన సముద్రగుప్తుడు కూడా దండయాత్రలు సాగించేడు. క్రీ.శ 340 ప్రాంతంలో పరాకాష్ఠకి చేరిన ఒక మహత్తరదండయాత్రతో మొత్తం ద్వీపకల్పం మీద ఆధిపత్యం సంపాదించినట్టు కనిపిస్తోంది. ఆ భూభాగాన్నంతట్నీ తన అధీనంలో ఉంచుకునే ప్రయత్నం అతను చెయ్యలేదు. అయితే హుగ్లీ నుంచి యమున, చంబల్ నదుల దాకా పశ్చిమ దిశలోనూ, హిమాలయాల నుంచి నర్మదదాకానూ అతని అధికారం యథార్థానికి సాగింది. అతని కుమారుడైన చంద్రగుప్త II - విక్రమాదిత్య - ఈ భూభాగాలకి మాళ్వ, గుజరాత్, కథియవార్ ప్రాంతాల్ని చేర్చేడు. సుమారుగా అర్ధ శతాబ్దం పైబడి గుప్తులు నిరాఘాటంగా దాదాపు యావత్ ఉత్తర భారతాన్నీ ఏలేరు- ఒక్క రాజపుటానా, సింధ్‌లని మినహాయించి. మొదట్లో వాళ్ళ రాజధాని పాటలీపుత్రం, కాని తర్వాత కౌశాంబి, అయోధ్యలు రాజనివాసాలు అయేయి.

---

1. కనిష్కుడు కాడ్‌ఫిసెస్‌కి ముందే క్రీ.పూ. 58 ప్రాంతంలో పాలించేడని ఫ్లీట్, ఫ్రాంక్‌ల అభిప్రాయం.
2. క్రీ.శ. 90 ప్రాంతంలో ఈ భూభాగంలో అతన్ని చైనా సైన్యాధ్యక్షుడు పాన్-చావో ఓడించినట్టు కనిపిస్తోంది. కాని పదిహేనేళ్ల తర్వాత మరింత విజయం సాధించినట్టు తెలుస్తోంది.

హూణులు, ఎఫ్తాలైట్స్[1] లేక శ్వేతహూణులు అని పిలిచే బర్బరులు చేసిన మరో దాడి వల్ల గుప్త రాజుల పతనం జరిగింది. ఆ బర్బరులు ఐరోపా ఖండం మీద దాడి చేసిన హూణుల సంబంధీకులై ఉంటారు. ఈ శాఖీయులు ఆసియాలో దిగడిపోయేరు, ఉత్తర పర్షియాని ఆక్రమించుకున్నారు. వాళ్ళు మొదట 455లో భారత్ మీద దండెత్తేరు, అపుడు వాళ్ళని తిప్పికొట్టడం జరిగింది. కాని మళ్ళీ 490 ప్రాంతంలో తిరిగి మరింత బలం పుంజుకుని వచ్చి గుప్తుల్ని కూలదోశేరు. వాళ్ళ రాజులైన తోర్మాన, మిహిరగుల 540 దాకా ఉత్తర భారతాన్ని గుప్పిట్లో ఉంచుకున్నారు. వాళ్ళ రాజధాని పంజాబ్‌లోని సియాల్‌కోట- వాళ్ళ ప్రధాన నివాసం బమియాన్, బాల్ఖ్‌లు అయినా. మిహిరగులుని దుర్మార్గాల వల్ల హిందూ రాజులు ఏకం అయేరు. హూణుల్ని ఉత్తరాదికి తరిమేశారు. క్రీ.శ. 565 ప్రాంతాలకి వాళ్ళని పూర్తిగా విధ్వంసంచేశేరు. తురుష్కులు, పర్షియన్లు సంఘటితమై దీన్ని సాధించేరు. వాళ్ళు శాశ్వత ప్రాతిపదిక మీద రాజ్యాల్ని స్థాపించకపోయినా వాళ్ళ దాడికి ప్రాముఖ్యం ఉంది. వాళ్ళల్లో చాలామంది సోదర తెగలైన గుర్జరుల (గుజార్లు) లాంటి వారితోబాటు, తమ రాజకీయాధికారం విచ్ఛిన్నమైనప్పుడు, వెనకదిగడిపోయేరు. అంతకుముందు శకులు, కుషాన్లు మాదిరే వీళ్ళూ ఇక్కడే ఉండిపోయి, వాయవ్య భారత జనాభా ఆవిర్భవించడానికి కారణభూతులయేరు. ముఖ్యంగా రాజపుత్ర తెగలు ఏర్పడ్డానికి కారణభూతులయేరు.

హూణుల పతనం తర్వాత మరో అంధ దశ వచ్చింది. అయితేథానేశ్వర్ రాజైన హర్షుడు (క్రీ.శ. 606-647) ముప్పై అయిదేళ్ళ యుద్ధాల తర్వాత క్రీ.శ. ఏడవ శతాబ్ది ఆరంభంలో రాజ్యాన్ని స్థాపించేడు. అది అతని జీవితకాలం అంతా కూడా నిలవలేదు. కొంతకాలం పాటు అది గుప్త సామ్రాజ్య వైభవాన్ని విస్తృతినీ సంపాదించుకుంది. చైనా యాత్రీకుడు హ్యుయన్ త్సాంగ్, కనౌజ్‌లో అతని దర్బార్‌ని సందర్శించేడు. బెంగాల్, అస్సాం, ఉజ్జయిని రాజులు హర్షునికి సామంతులుగా ఉన్నారనీ, కాని పంజాబ్, కాశ్మీర్, సింధ్‌లు స్వతంత్రంగా ఉండేవనీ ఆ యాత్రికుడు అన్నాడు. బెంగాల్‌కి దక్షిణంగా ఉన్న కళింగని నిర్జనం చెయ్యడం జరిగింది కాని హర్షుడు దక్షిణ చాళుక్య రాజైన రెండవ పలకేశిని లొంగ దీసుకోలేకపోయేడు.

ఇపుడు ఓ క్షణం సేపు దక్షిణాది చరిత్రకి వెడదాం. ఉత్తరాది కంటే ఇది సంఘటనల రీత్యా, కాలక్రమ రీత్యా మరింత చీకటి కమ్ముకుని ఉంటుంది. అయితే ద్రవిడ దేశాలు నిరావాసంగా ఉన్నాయని గాని, అనాగరికంగా ఉన్నాయనిగాని అనుకోకూడదు. ఐరోపాలోని ప్రామాణిక రచయితలకి

1 ప్రామాణికత కోసం విన్సెంట్ స్మిత్ రాసిన ''ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా'', 1908, పే. 401 చూడండి.

కూడా వాటి గురించి కొంత తెలుసు. పాండియన్ రాజు (పాండ్య) క్రీ.పూ. 20లో[1] ఆగస్టస్‌కి దౌత్యం పంపించేడు. ప్లినీ[2] మోదుర (మధుర) ప్రస్తావన చేశాడు. టోలెమీ కూడా మరో నలభై పట్టణాలతో బాటుగా ఈ పట్టణం పేరునీ ప్రస్తావించేడు. అగస్టస్‌కి మాజిరిస్‌లో ఓ దేవాలయాన్ని అంకితం చేసినట్టు ఉంది. ఈ మాజిరిస్ అనేది క్రాగనోర్‌గా గుర్తించేరు. తొలి శతాబ్దుల నుంచీ ద్వీపకల్పంలోని చివరి భాగం మూడు రాజ్యాలుగా విభజితమైంది. అవే పాండ్య, చేర, చోళ రాజ్యాలు.[3] వీటిలో మొదటిది మధుర, తిరునల్వేలి జిల్లాలకి చెందింది. ఈనాటి ట్రావెన్కోర్‌కి పశ్చిమంగా ఉంటాయి. చేర, కేరళలు. చోళ దేశంలో తంజావూర్, తిరుచినాపల్లి, మద్రాస్‌లు, మైసూర్‌లోని అధిక భాగం ఉంటాయి. క్రీ.శ. ఆరవ శతాబ్దం నుంచి ఎనిమిదవ శతాబ్దం దాకా మరో నాల్గవ రాజ్యం, పల్లవ రాజ్యం, ప్రముఖంగా ఉండింది. వాళ్ళు మద్రాస్ రాష్ట్ర ఉత్తర ప్రాంతాల నుంచి వచ్చి ఉంటారు. వాళ్ళ రాజధాని కంజీవరం. సాధారణంగా మిగతా మూడు రాజ్యాలతోనూ యుద్ధం చేస్తూనే ఉండేవారు. వాళ్ళ రాజైన నరసింహవర్మ (క్రీ.శ. 625-645) దక్షిణ భూభాగంలో కొంత ప్రాంతం మీద ఏలుబడి సాధించేడు. దాదాపు చోళ దేశం మొత్తం మీద పాలన సాగించేడు. కాని 750 ప్రాంతాల తర్వాత వాళ్ళు క్షీణించేరు. అటుపక్క చోళులు బలపడ్డారు. రాజరాజు (985-1018) ఏలుబడిలోని భూభాగాలలో మద్రాస్ రాజ్యం, మైసూర్‌లు కలిసి ఉన్నాయి. అతను దక్షిణ భారతంలో వాటిని తిరుగులేని రాజ్యాలుగా చేశాడు. పదమూడవ శతాబ్ది దాకా ఆ స్థానాన్ని అవి నిలబెట్టుకున్నాయి.

ఇంతకుముందే ప్రస్తావించుకున్నట్టు దక్షిణాదిని ఆంధ్రులు క్రీ.పూ. 220 నుంచి క్రీ.శ. 236 దాకా పరిపాలించేరు. అయితే తర్వాత మూడు దశాబ్దాల పాటు దాని చరిత్ర గురించి ఏమీ తెలీదు. బీజాపూర్‌లోని వాతాపి (బాదామి)లో చాళుక్య వంశం ఆవిర్భవించేదాకా పరిస్థితి అలాగే ఉంది. ఈ వంశస్థుడైన రెండవ పులకేశి (608-642) హర్షుని సమకాలికుడు. పోటీ సామ్రాజ్య స్థాపనలో కొంతకాలం కృతకృత్యుడయేడు. ఆ సామ్రాజ్యం గుజరాత్ నుంచి మద్రాస్ దాకా విస్తరించుకుంది. అతని అధికారం చాలా గణనీయమైందని చెప్పాలి. అతను పర్షియా రజు ఖుస్రు IIకి దౌత్య ప్రతినిధుల్ని పంపేడు, అక్కడినుంచి రప్పించుకున్నాడు. ఈ విషయాన్ని అజంతా కుడ్య చిత్రాలు తెలియజేస్తున్నాయి. అయితే 642లో పల్లవులు అతన్ని ఓడించి చంపేశారు.

---

1. స్ట్రాబో xv. 4.73

2. హిస్ట. నాట్. vi. 23 (26)

3. అశోకుని శాసనాల్లో పాండ్య, కేరళపుత్ర, చోళ, సతియాపుత్ర అని నాలుగు రాజ్యాలున్నాయి.

పులకేశి, హర్షుల మరణంతో రాజపుత్ర దశ అని పిలిచే కాలం ప్రారంభమైంది. అది క్రీ.శ. 650 నుంచి 1000 దాకా సాగింది. నామకః హిందువులైన వంశాలు అనేక రాజ్యాల్ని పాలించడం ఈ దశ విశిష్టత. అయితే వాళ్ళు ఉత్తరాది దండయాత్రదారుల నుంచి, లేకపోతే హైందవేతర స్థానిక తెగల నుంచీ వచ్చినవాళ్ళు. వాళ్ళల్లో నుంచి ఈ కింది వారిని పేర్కొవచ్చు.:-

1. కనౌజ్ లేక పాంచాల, ఈ రాజ్యం హర్షుని తదనంతరం కష్టాల పాలైంది. అయితే క్రీ.శ. 840 నుంచి 910 దాకా భోజుడు (మిహిరుడు) అతని కొడుకు రావడంతో ఉత్తర భారతంలో ప్రధాన రాజ్యం అయింది. బీహార్ నుంచి సింధ్ దాకా వ్యాపించింది. 12వ శతాబ్దంలో మళ్లీ ఘర్‌వార్ వంశం ఏలుబడిలో ప్రాముఖ్యం గడించింది.

2. బెంగాల్ ''పాల'' వంశీకులతో కనౌజ్ తరచుగా తలపడుతూ ఉండేది. పాల వంశీకులు క్రీ.శ. 730 ప్రాంతంలో అవిర్భవించిన బౌద్ధరాజుల వంశీకులు. ధర్మపాలుడు (క్రీ.శ. 800) కనౌజ్ రాజుని కూలదోయ కలిగినంత శక్తిమంతుడు. తర్వాత పాల రాజ్య తూర్పు భాగం సేనులని పేరు గడించిన ప్రత్యర్థి వంశం కింద విడిపోయింది.

3. యమునకి దక్షిణాన జెజాభుక్తి (బుందేల్ ఖండ్) చేది (మన మధ్య రాష్ట్రాలకి ఇంచుమించు సమంగా ఉండే భాగం) అనే ప్రాంతాల్ని చాండెల్ అని, కాళ కూరులని పిలిచే రెండు వంశాలు పాలించేయి. వీళ్ళల్లో చాండెలులు మొదట్లో గోండుల సంతతి అని భావిస్తారు. వాళ్ళు గొప్ప నిర్మాణ దక్షులు, ఘనమైన కట్టడాలెన్నో నిర్మించేరు. వాటిలో ఖజురాహో దేవాలయాలు కూడ ఉన్నాయి. కీర్తి వర్మ, చాండెల్ (1049-1100) రాజ్య భూభాగాల్ని చాలా విస్తరింపజేశాడు. అతను విద్యాపోషకుడు, ప్రబోధ చంద్రోదయం అనే అన్వార్థ ప్రతిపాదక నాటకం ఆయన ఆస్థానంలో కూర్చినదే.

4. మాళ్వ పరమర (పవార్) వంశం కూడా సాహిత్య పోషణకి ప్రఖ్యాతి గడించింది. ముంజ (974-995) భోజ (1018-1060) రాజులు స్వయంగా కృతికర్తలు, యోధులూనూ.

## II

## శక దశ

మొదట్లో ఎంతో సంభావితంగా కనిపించే క్రీ.శ. 78ని, చివరికి క్రీ.శ. 120ని విన్సెంట్ స్మిత్ అంగీకరించాడు. శక యుగం ఆరంభానికి ఈ తేదీని మనం అంగీకరించవచ్చు. దీన్ని కనిష్కుడు స్థాపించేడు.

కుషాన్ రాజులు ఏ క్రమంలో ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు వచ్చిందీ అనే విషయం ఇంకా అనుమానాస్పదమే. కనిష్కుడు కాడ్‌ఫిసెస్ I (కుజులకార కాడ్‌ఫిసెస్) కాడ్‌ఫిసెస్ II (విమా కాడ్‌ఫిసెస్) తర్వాతి వాడని సాధారణంగా అంగీకరిస్తున్నారు. మొదటి కాడ్‌ఫిసెస్ బాక్ట్రియన్ అయిన సిథియన్. విన్సెంట్ స్మిత్ అభిప్రాయం ప్రకారం క్రీ.శ. 40లో అతను అధికారం సాధించేడు. అతను గొండొఫరేస్ నుంచి తక్షశిల దేశాన్ని, గాంధారనీ వశపరచుకున్నాడు. గొండొఫరేస్ బైబిల్ ప్రక్షిప్త భాగాల ప్రకారం సెయింట్ థామస్‌ని ఆదరించిన పార్థియన్ రాజు. అతని కుమారుడైన విమా (78-110) ఒక మహాసామ్రాజ్యాన్ని నిర్మించేడు. ఆ సామ్రాజ్యంలో పంజాబ్ ప్రాంతం, గంగాతీరంలోని యావత్ పశ్చిమ అర్ధభాగం ఉన్నాయి.

కాడ్‌ఫిసెస్‌కీ కనిష్కునికీ మధ్యలో 10 ఏళ్ళ విరామం ఉన్నట్టు కనిపిస్తుంది. కనిష్కుడు వజేష్కుని కుమారుడు. అతనికీ కాడ్‌ఫిసెస్‌కీ సంబంధం ఏమీలేదు. అతను బాక్ట్రియా వాడు కాదు, ఖోటాన్ ప్రాంతం వాడు, యదార్థానికి అతను వేసవి కాలం పరోపాన్‌లోని కపీస్‌లోనూ[1]... శీతకట్టు పురుషపురం (పెషావర్) లోనూ గడిపేవాడు. అతని సామ్రాజ్య అక్షం గ్రేసో- ఇరానియన్ దేశపు (మధ్య భాగంలో)[2] ఇక ఎంతమాత్రం లేకపోయింది.

కనిష్కుని సామ్రాజ్యం ఎక్కువ కాలం మనలేదు. వశిష్క, హవిష్క అనే అతని ఇద్దరి కొడుకుల్లోనూ రెండోవాడే అతనికి వారసుడయేడు.

మూడవ శతాబ్దంలో కుషాన్‌ల అధికారం కాబూల్, గాంధారలతో బాక్ట్రియాకే పరిమితమైపోయింది. అవి సస్సానీద్‌ల పాలన కిందికి పోయేయి.

## క్షాత్రప లేక సాత్రప

ఈ బిరుదు ఇరాన్‌కి సంబంధించింది. యూక్-చి దండయాత్ర వల్ల దేశం నుంచి తరిమెయ్యబడ్డ శకులు స్థాపించిన రెండు వంశాల వాళ్ళు ఈ బిరుదు ఉంచుకున్నారు.

I. మొదటి వంశం సురాష్ట్ర (కథియవార్) కి చెందింది. ఖష్టానుడనే ఈ వంశపురాజు కుషానుల వైభవోపేత దశకే ముందే మాళ్వని తన ఆధిపత్యం కింద ఉంచుకున్నట్టుంది. కనిష్కునికి సామంతుడుగా ఉన్నట్టూ ఉంది. భారత నాగరికతకి కేంద్ర స్థానమైన ఉజ్జయిని అతని పాలనలో ఉంది.

---

1. మూల రాత ప్రతిలో అక్షరాలు లేవు - సం.

2. చెదలు తినేసినందువల్ల చేర్చడం జరిగింది - సం.

II. రెండవ వంశానికి క్షహరాత అనే పేరు ప్రత్యేకంగా ఉండింది. ఆ వంశం వాళ్ళు పరంపరాగతంగా ఆంధ్రులకి శత్రువులు. అది ఈనాటి సూరత్, బొంబాయిల మధ్య ఉన్న మహారాష్ట్రాన్ని పాలించింది. ఈ రెండో శక రాజ్యాన్నే శాతకర్ణి నాశనం చేశాడు. దానికి దారి చూపించిన వాళ్ళు మొదటి వంశం వాళ్ళు, ఆంధ్ర రాజుని ఉజ్జయిని సత్రపుడైన రుద్రదామన్ జయించినపుడు అది జరిగింది. తూర్పు, పశ్చిమ రాజ్యాల మధ్య విద్వేషం ఆదర్శాల విభేదంగా వచ్చినట్టు కనిపిస్తుంది. భారత సిథియన్లందరికీ లాగా

లేకపోతే తోర్మాన్ల లాంటి సెరిండియా సిథియన్లకి లాగా శకులు బౌద్ధమతం పట్ల విదేశీ సంభూత సానుభూతిని ప్రదర్శించేరు, ఆంధ్రులు బ్రాహ్మణ మతాన్ని ప్రోత్సహించేరు.

# గుప్తులు

మూడవ శతాబ్ది సంఘటనలు చరిత్రలో అజ్ఞాతం. కుషాన్ సామ్రాజ్యం గురించి మనకి చాలా తక్కువ సమాచారం లభ్యమవుతోంది.

318-19 ప్రాంతంలో మళ్లీ వెలుగు గోచరించింది. ప్రాచీన దేశమైన మగధలో ఒక నూతన వంశం ఉదయించింది. అది గుప్త వంశం.

గుప్తులు- రెండవ చంద్రగుప్తుడు మాళవ దేశాన్ని, గుజరాత్‌ని, సురాష్ట్రాన్ని (కథియవార్) జయించేడు. ఉజ్జయినికి చెందిన శకవంశీకుడు మొదటి మహత్తర సత్రపుణ్ణి సింహాసనచ్యుతుణ్ణి చేశాడు. పశ్చిమ దిశగా భూభాగాన్ని విస్తృతపరుస్తూ అతను పాటలీపుత్రం స్థానంలో అయోధ్యనీ, కౌశాంబీనీ రాజధానులు చేశాడు. క్రీ.పూ. 155 ప్రాంతంలో అతను దిగువ సింధు ప్రాంతం యావత్తూ జయించేడు, కథియవార్‌ని జయించేడు. రాజపుటానాతో యుద్ధం సాగించేడు. జేథ్‌తో యుద్ధం చేశేడు. కాని యమునా తీరస్థ మధుర (హుత్రా) ని వశపరచుకున్నాడు. పాటలీపుత్రం దాకా వెళ్ళేడు.

పుష్యమిత్ర (?) అతన్ని ఘోరంగా ఓడించేడు. పార్థియాకీ, భారత్‌కీ మధ్య అవరోధంగా బాక్ట్రియానా కనీసం ఉత్తరాదిన ఉంది. అంచేత భారత్‌కి పార్థియా దాడి గాలి సోకలేదు. అయినాగానీ ఒక్క పార్థియన్ పాలకుడేనా కనీసం అతను మిత్రా డేట్స్ 1 (171-136), కొంతకాలం, సుమారుగా 138 ప్రాంతంలో, తక్షశిలని ఆక్రమించినవాడుగా కనిపిస్తున్నాడు.

# పార్థియా, బాక్ట్రియాల స్వాతంత్ర్యం అంతం

పార్థియా, బాక్ట్రియాల స్వాతంత్ర్యాన్ని అంతం చేసిన సంఘటన ఒక దండయాత్ర, తెగలు ముందుకు సాగడం వల్ల అది జరిగింది. అది ఎక్కడో మంగోలియా పచ్చిక బీళ్ళలో భారత్‌కి సుదూరంగా జరిగింది.

క్రీ.పూ. 170 ప్రాంతంలో యూక్-చి లేక తొఖారియన్లనే సంచార సిథియన్ల మూకల్ని గోబీ నుంచి హిమాన్గ్‌ను లేక హూణులు తరిమేశారు. గోబీ ఈనాటి కాన్సు. దాంతో ఆ మూకలు పిచ్చిగా వలస పోయేయి. దానివల్ల ఆసియా ఖండంలో సమతూకం దెబ్బతింది.

వాళ్ళు శకుల మీద పడ్డారు. శకులు ఇరానియన్‌గా మారిన సిధియన్లు. వాళ్ళు పర్షియన్ సామ్రాజ్యపు ఉత్తరాన నివసించేవాళ్ళు. పచ్చిక బీళ్ళలో జాజరెట్స్‌కి ఉత్తరాదిన స్థిరపడ్డారు. బహిష్కృతులైన శకులు పార్థియా మీదా, బాక్ట్రియానా మీదా పడ్డారు. గ్రీకుపాలన కడపటి అవశేషాల్ని తుడిచిపెట్టేరు. అది క్రీ.పూ. 140-120 మధ్య జరిగింది. అపుడు వూ-సన్ తెగ తొఖారిన్లని ఓడించడంతో, తొఖారిన్లు ఆక్సర్ నదీ తీరం మీద వ్యవస్థితం అయేరు. ఆ తర్వాత భారత ప్రవేశ మార్గం దగ్గరలోని తూర్పు ఇరాన్ శక దేశాన్నంతటినీ వశపరుచుకున్నారు. ఆ ప్రవేశ మార్గాన్ని క్రీ.శ. మొదటి శతాబ్దంలో కనిపెట్టేరు.

భారత్‌ని జయించిన వాళ్ళు కుషాన్లు (కుషానా). ఆ వంశం యుమె-చి తెగల్ని ఐక్యం చేసింది. తమ సంబంధీకులైన శకుల మీద, పార్థియన్ల మీద, ఇంకా పంజాబ్ ప్రజల మీద తన ఆధిపత్యాన్ని స్థాపించింది.

ఈ వంశంలో ముఖ్యుడు కనిష్కుడు. అతను సింహాసనం అధిష్ఠించిన సమయం చాలా అనిర్దిష్టం. క్రీ.పూ. 57 నుంచి క్రీ.శ. 200 మధ్యలో ఎక్కడో ఉండచ్చని అంటారు.

పుష్యమిత్ర- సిత్రాని లేవీ అన్నట్టు అతను అంతఃపుర ఉపద్రష్ట.

సెల్యూసిడ్ సామ్రాజ్యాన్ని ఆంటియోకస్ III (క్రీ.పూ.261-246) పాలించేడు. పార్థియా భాక్ట్రియానా అనే రెండు ప్రాంతాల్ని పోగొట్టుకున్నాడు. అవి అదే సమయంలో విముక్తం అయేయి. పార్థియన్లని భారతీయులు పహ్లవీలు అనేవారు. వాళ్ళకీ తుర్కోమాన్ పచ్చిక బీళ్ళ సంచార తెగలకీ సంబంధం ఉండేది. వాళ్ళు కాస్పియన్ సముద్రానికి ఆగ్నేయంగా ఉన్న ప్రాంతాన్ని ఆక్రమించుకున్నారు. ఈశాన్య దిక్కులో పార్థియన్లకి బాక్ట్రియన్లు సరిహద్దుగా ఉన్నారు. హిందూ-కుష్ పర్వతాలకీ, ఆక్సస్‌కీ మధ్య స్థిరపడ్డారు. వాళ్ళ పట్టణాల సంఖ్య గురించి, వాళ్ళ ఐశ్వర్యం గురించి ఐతిహ్యంగా చెప్పుకునేవారు.

ఈ రెండు జాతుల వాళ్ళూ ఆంటియోకస్ గడ్డు కాలాన్ని అతని వారసులైన రెండవ సెల్యుకస్ (క్రీ.పూ. 246-266) మూడవ సెల్యుకస్ (క్రీ.పూ. 226-223) పడ్డ కష్టాల్నీ తమకి అనుకూలంగా మలచుకుని చీలిపోయేరు.

పార్థియన్ల తిరుగుబాటు సహజమే. దానికి అర్సాసెస్ నాయకత్వం వహించేడు. అతను ఒక వంశస్థాపకుడయేడు. ఆ వంశం దాదాపు 500 ఏళ్ళు పర్షియాని పాలించింది.

బాక్ట్రియన్ల ఆవిర్భావం ఓ గ్రీకు సత్రప అత్యాశ వల్ల సంభవించింది. ఆసియా నడిబొడ్డున హెల్లెనిజం విరుచుకుపడ్డం డియొడొటస్‌తోనే జరిగింది.

ఈ సాహసోపేతమైన జాతులు ఇండో-ఇరానియన్ సరిహద్దుల్లో రూపు తీసుకోవడం వల్ల అశోక సామ్రాజ్యం అతని వారసుల కాలంలో కదిలిపోయిందనడంలో సందేహం లేదు.

పంజాబ్ ఒకప్పుడు పర్షియన్ సాత్రపి. తర్వాత అలెగ్జాండర్ కింద ఒక రాష్ట్రం. అలాంటి పంజాబ్ గుమ్మం దగ్గర కల్లోలితమైన చిన్న రాజ్యాలు తలెత్తడంతో దాడికి గురయ్యే ప్రమాదం మరింత ఎక్కువైంది. మొదటి, రెండవ డియొడెటస్ తర్వాత యూథిడెమస్ బాక్ట్రియా రాజు అయేడు. అతనికీ సిరియా రాజు ఆంటియోకస్ ది గ్రేట్‌కీ యుద్ధం జరిగింది. 208 ప్రాంతంలో బాక్ట్రియన్ స్వాతంత్ర్యాన్ని గుర్తించడంతో శాంతి పొదుకొంది. అయితే పోరు జరిగేటప్పుడు సిరియన్ సైన్యాలు హిందూకుష్ దాటి, కాబూల్ లోయలోకి ప్రవేశించాయి. సుభగసేన రాజుని విపరీతంగా నాశనం చేశాయి. ఎంథిడెమోన్ కొడుకైన డిమెట్రియస్ ఈనాటి ఆఫ్ఘనిస్తాన్‌లోనే కాక, ఇండియా భౌగోళిక ప్రాంతంలో కూడా తన భూభాగాల్ని విస్తరించుకున్నాడు. భారత ప్రజల రాజు (200-190) అనే బిరుదు కూడా పెట్టుకున్నాడు. 190-180ల మధ్య పాలియోన్, అగథోక్లెస్ అనే గ్రీకు సైనికులు తక్షశిలని పాలిస్తూ ఉండేవాళ్ళు, సుమారుగా 160 నుంచి 240 దాకా కాబూల్, పంజాబ్‌లు మిలింద లేక మినందర్ అనే అద్భుతమైన గ్రీక్ పాలన కింద ఉన్నాయి. బౌద్ధమత చరిత్రలో తనకంటూ ఒక స్థానం ఏర్పాటు చేసుకున్నాడతను.

## III

## హూణులు

కుమారగుప్తుని కడపటి దశలో ఇరానియన్ జాతులు సామ్రాజ్యాన్ని ఎదిరించేయి. అయితే వాళ్లని సరిహద్దులకావలనే అదుపు చేశారు. స్కందగుప్తుని సమయంలో అప్రతిహతమైన తొలివలస

అదే సరిహద్దుల మీదకి వచ్చిపడింది. అందులో మంగోలాయిడ్స్ ఉన్నారు. తర్వాత ఇండియా వాళ్ళకి అసలైన పేరును పెట్టింది- హూణులు. ఆరకంగా యూరప్ మీద దండయాత్ర చేసిన హూణుల్ని మనం గుర్తించేం.

ఐదవ శతాబ్దం మధ్య భాగం తర్వాత భారతదేశానికి వచ్చిన వాళ్ళు శ్వేత హూణులు లేక ఎఫ్తాలైట్స్. వాళ్ళు పోలికపరంగా చూస్తే అత్తిలా క్రూర వారసుల కంటే ఎక్కువగా తురుష్కులకి దగ్గరగా కనిపిస్తారు. ఆక్సస్ లోయలో విరామం తర్వాత వాళ్ళు పర్షియాని, కాబూల్‌ని వశపరచుకున్నారు. స్కందగుప్తుడు కొంతకాలం పాటు (455 క్రీ.శ.) వాళ్ళని తరిమేశాడు. కానీ 484లో వాళ్ళు సస్సానిడ్ ఫెరోడ్‌ని హతమార్చిన తర్వాత ఏ భారత రాజ్యమూ వాళ్ళని ఆపలేకపోయింది. వాళ్ళల్లో ఒకడైన తోరమాన నామధేయుడు 500 సంవత్సరంలో మాళవలో ప్రతిష్ఠితం అయేడు. అతని కొడుకు మిహిరగుళుడు పంజాబ్‌లోని సాకొల్ (సియాల్‌కోట)ని రాజధానిగా చేసుకున్నాడు.

యశోధర్ముడనే స్థానిక రాజు మిహిరగుళుని పాలనని అంతం చేశాడు. హూణుల బహిష్కారం అన్నిచోట్లా పూర్తిగా జరిగిందని చెప్పడానికి లేదు. చాలామంది సింధు తీర ప్రాంతంలో నివాసం ఉండి పోయేరు.

7వ శతాబ్దం ఆరంభంలో ఈ గందరగోళం నుంచి స్థానీశ్వర (ఢిల్లీ దగ్గర ఉన్న థానేశ్వర్) అనే చిన్న సంస్థానం ఉదయించింది. ప్రభాకర వర్ధనుడనే సాహసవంతుడైన రాజు ఒక రాజ్యాన్ని ఏర్పాటు చేశాడు. ఆ రాజ్యం గుర్జరులకి, మాళవలకి, ఇతర ఇరుగుపొరుగు రాజ్యాలకి వ్యతిరేకంగా తన సత్తా నిరూపించుకుంది. 604లోనో 605లోనో అతను మరణించేడు. ఆ తర్వాత కొద్ది కాలానికి బెంగాల్‌లోని గౌడ రాజు ఆజ్ఞ మేరకి అతని పెద్ద కొడుకుని హత్య చేశారు. అధికారం అతని తమ్ముడైన హర్షునికి దక్కింది.

★★★

# 4. మనువు, శూద్రులు

(డాక్టర్ అంబేద్కర్ చేత్తో రాసిన 31 పేజీల పత్రం ఇది. అధ్యాయానికి పేరు లేదు. అసంపూర్తిగా కూడా ఉంది. శీర్షికని సూచించేం -సం)

## 1

మనువు ప్రణాళికలో రెండు ముఖ్యమైన సాంఘిక విభాగాలున్నాయని ఈ పాటికి పాఠకునికి తెలిసే ఉంటుంది. చాతుర్వర్ణ విభజనకి అవతల ఉండే విభాగం, చాతుర్వర్ణ విభజనలో ఉండే విభాగం. ఈనాటి అస్పృశ్యులు చాతుర్వర్ణ విభజనకి బయట ఉన్న వాళ్ళకి సమానంగా ఉంటారని, చాతుర్వర్ణ విభాగంలోపల ఉంటే వాళ్ళకీ, బయట ఉండే వాళ్ళకీ తేడా వుందని కూడా పాఠకుని ఎరుకలో ఉండే ఉంటుంది. చాతుర్వర్ణం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే భిన్న తరగతుల సమాహార రూపం. సాధర్మ భావం అంటే అంతస్తు తరగతుల భావమే. ఎక్కువ ఆధిక్యం ఉన్న వ్యవస్థ హిందూ వ్యవస్థ. అంతేకాదు. తరగతుల మధ్య అసమానత్వం ఉండి, దానిమీదనే ఆధారపడ్డ వ్యవస్థ; ఆరకంగా వ్యక్తుల మధ్య అసమానత్వం ఉండే వ్యవస్థ. ఇంకా సూటిగా చెప్పాలంటే, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అన్య జాతులు (అస్పృశ్యులు) అనే ఈ తరగతులు సమతులంగా ఉన్నటువంటివి కాదు, అన్నీ ఒక స్థాయిలో ఉన్నటువంటివి కాదు. అవి లంబంగా, ఒక దానిపైన ఒకటిగా ఉంటాయి. ఈ మాటని ఏ హిందువూ కాదనడు. ప్రతి హిందువుకీ ఈ విషయం తెలుసు. ఇందుకు సంబంధించి ఎవరికన్నా ఏదన్నా అనుమానం ఉంటే అతను పరాయిదేశం వాడన్నమాట. పరాయి దేశం వ్యక్తికి ఏ అనుమానం ఉన్నా అది మనుధర్మ శాస్త్రం చూస్తే ఇగిరిపోతుంది. మనువే హిందూ సమాజానికి ప్రధాన రూప నిర్మాత. అతని ధర్మశాస్త్రమే హిందూమతానికి పునాది, దానిమీదే అది నిర్మితమైంది. ఆ పరాయి వ్యక్తి సౌకర్యార్థం ఇక్కడ నేను హిందూ సమాజం అసమానత్వ సూత్రం మీద ఆధారపడిందని రుజువు చేసే మనుస్మృతి భాగాల్నే ఉల్లేఖిస్తాను.

## II

మనుధర్మశాస్త్రం నిర్దేశించిన అసమానత్వం అనే దానికి చారిత్రక ప్రాముఖ్యం తప్ప మరేం లేదని వాదించవచ్చు. అదంతా గడచిన చరిత్ర, దానికీ ప్రస్తుత హిందూ నడవడికకీ, సంబంధం లేదనచ్చు. ఇంతకంటే ఘోరమైన తప్పిదం వుండదని నా అభిప్రాయం. మనువు గతానికి చెందిన ప్రస్తావన మాత్రమే కాదు. వర్తమానానికి చెందిన గతం కంటే కూడా ఎక్కువ ఇది. ఇది ''సజీవగతం'', అంచేత వర్తమాన విషయం ఎలా ఉండగలదో అంత యదార్థమైన వర్తమానమూనా.

మనుస్మృతి విధించిన అసమానత్వమే బ్రిటిష్ పాలనకి పూర్వం రోజుల్లో ఈ దేశ న్యాయంగా చలామణి అయిందన్న సంగతి చాలామంది విదేశీయులకి తెలియదు. పరిస్థితి అలా ఉండేదనడానికి కొన్ని ఉదాహరణలు మాత్రం చాలు.

మరాఠాల పాలనలో, పీష్వాల పాలనలో అస్పృశ్యుల్ని రాజధాని పూనా నగర ద్వారం లోపలికి మధ్యాహ్నం మూడు గంటల నుంచి ఉదయం తొమ్మిది గంటల దాకా రానిచ్చేవారు కాదు. ఏమంటే ఆ వేళల్లో వాళ్ళ నీడలు పొడుగ్గా పరుచుకుంటాయి. మరి నీడ పడితే బ్రాహ్మణుడు మైలపడిపోతాడు. మళ్లీ శుచి అయేంతవరకూ ఆ బ్రాహ్మణుడు నీరు తాగలేడు, తిండి ముట్టలేడు. అదేరకంగా ఏ కుడ్య పట్టణంలోనూ ఏ అస్పృశ్యుణ్ణీ ఉండనిచ్చేవారు కాదు. కుక్కలు, పశువులు యధేచ్ఛగా తిరగచ్చు కాని అస్పృశ్యుడు మాత్రం తిరగడానికి లేదు.[1]

మరాఠాల పాలనలో, పీష్వాల పాలనలో అస్పృశ్యులు నేలమీద ఉమ్మి వెయ్యడానికి లేదు. ఏ హిందువేనా కాలితో తొక్కి మైలపడిపోతాడు. అంచేత మెడలో ఓ మట్టికుండని వేలాడేసుకుని అందులో ఉమ్మేసుకోవాలి. అతను నడిచి వెళ్ళేటప్పుడు అతని అడుగు జాడలు పడతాయి, అంచేత వాటిని తుడిచేందుకు ఓ ముళ్ళ కంపని కూడా ఈడ్చుకుపోవాలి. బ్రాహ్మణుడెవరైనా ఎదురుపడితే తల వాల్చుకుని, నేల మీద సాగిలబడాలి. లేకపోతే అతని నీడ బ్రాహ్మణుడి మీద పడచ్చు.[2]

తను ఫలానా అని వెంటనే గుర్తు పట్టేందుకు వీలుగా మహారాష్ట్రలో అస్పృశ్యులు నల్లని దారాన్ని మెడచుట్టూతానో, మణికట్టుకో చుట్టుకోవాలి.

గుజరాత్‌లో అయితే తాము అస్పృశ్యులమని చాటేందుకు అస్పృశ్యులు ఒక కొమ్ముని ధరించాల్సి ఉండేది.[3]

తను పాకీ పని మనిషినని తెలియజేసేందుకు పంజాబ్‌లో పాకీ మనిషి వీథుల్లో వెళ్ళేటప్పుడు ఓ చీపుర్ని చేత్తోనో, చంకలోనో పెట్టుకువెళ్ళాలి.[4]

బొంబాయిలో అస్పృశ్యులు శుభ్రమైన చిరగని బట్టలు తొడుక్కోవడానికి లేదు. నిజంచెప్పాలంటే

1. డా. ముర్రే మిచెల్ - గ్రేట్ రెలిజియన్స్ ఆఫ్ ఇండియా పే. 63
2. బొంబాయి గెజటీర్ వాల్యూం XII, పే. 175
3. ఎన్సీఆర్ అండ్ ఇ. వాల్యూం IX పే. 636 (బి)
4. పంజాబ్ జనాభా లెక్కలు 1911, పే. 413

అస్పృశ్యులకి బట్టలు అమ్మేవాళ్ళు అమ్మడానికి ముందే అవి చిరిగి మకిలిగా ఉన్నాయో లేదో జాగ్రత్తపడేవాళ్ళు.

మలబార్‌లో అస్పృశ్యులు ఒక అంతస్తు కంటే ఎక్కువ ఎత్తు ఉండే ఇళ్ళు కట్టుకోవడానికి లేదు.[1] చనిపోయినవాళ్ళ మృతదేహాల్ని దహనం చెయ్యడానికి లేదు.[2]

మలబార్‌లో హరిజనులు గొడుగులు తీసుకువెళ్ళకూడదు. చెప్పులు వేసుకోకూడదు. బంగారు నగలు పెట్టుకోకూడదు. ఆవుల పాలు పితకడానికి లేదు. కనీసం అందరూ ఆ ప్రాంతంలో మాట్లాడుకునే భాషని కూడా మాట్లాడ్డానికి లేదు.[3]

దక్షిణ భారతంలో అస్పృశ్యులు నడుంకి పైన పైబట్ట కప్పుకోవడాన్ని స్పష్టంగా నిషేధించేరు. ఇక ఆడవాళ్ళయితే వక్షస్థల భాగాలకి ఆచ్ఛాదన లేకుండానే ఉండి తీరాలి.[4]

బొంబాయి ప్రెసిడెన్సీలో సోనార్లు (కంసాలులు) అంతటి హెచ్చు కులం వాళ్ళు కూడా కుచ్చెళ్ళు పోసి పంచెలు కట్టుకోవడం నిషిద్ధం.[5] అంతేకాదు ప్రణామపూర్వకంగా 'నమస్కారం' చెయ్యడం కూడా వాళ్ళకి నిషిద్ధం.[6]

మరాఠా పాలనలో బ్రాహ్మణులు తప్ప మరి ఇతరులెవరైనా వేదోచ్చారణ చేసినట్లయితే వాళ్ళ నాలుకలు ఖండనకి గురవవచ్చు. నిజానికి అనేకమంది కంసాలుల నాలుకలు నిజంగానే ఖండనపాలయేయి. వాళ్ళు శాసనధిక్కారంగా వేద మంత్రోచ్చారణ చేసినందుకు పీష్వా ఆజ్ఞ మేరకి ఆ ఖండనలు జరిగాయి.

యావద్భారతంలోనూ మరణ దండన లేకుండా మినహాయింపు

---

1. భట్టాచార్య పే. 259
2. మద్రాస్ జనాభా లెక్కలు 1891, పే. 299.
3. భట్టాచార్య - హిందూ కులాలు పే. 259.
4. మద్రాస్ జనాభా లెక్కలు 1891, పే. 224.
5. ఆ మాదిరి పంచెలు కట్టుకోవడం బ్రాహ్మణులకి మాత్రమే ఉద్దేశించింది. శూద్రులు కుచ్చెళ్ళు లేకుండానే కట్టుకోవాలి.
6. మనువు శాసించిన ధర్మం దేశంలో ఆచరించాల్సిందో కాదో తేటతెల్లంగా తెలియజేసే ఈ ఉత్తరం పాఠకునికి ఆసక్తికరంగా ఉంటుంది.

''కంపాలి కుల పెద్దలైన దెముల్‌సెట్ తింబుక్‌సెట్‌కి- (మిగతా 705 పేజీలో ఉంది)

బ్రాహ్మణులు మాత్రమే. బ్రాహ్మణుడు హత్య చేసినా అతనికి ఉరిశిక్ష లేదు.

పీష్వాల పాలనలో నేరస్థుల్ని దండించడానికి కులం రీత్యా విభేదం పాటించేవారు. కఠిన శ్రమ, మరణదండన ఎక్కువగా అస్పృశ్యుల పాలబడేవి.[1]

పీష్వాల పాలనలో బ్రాహ్మణ గుమస్తాల సరుకుల మీద కొన్ని సుంకాలు లేకుండా వాళ్ళకి రాయితీ ఉండేది. వాళ్ళు దిగుమతి చేసుకున్న ధాన్యం ఏరకమైన పడవ రుసుం లేకుండా వాళ్ళకి చేరేది. బ్రాహ్మణ భూస్వాములు ఇతర వర్గాల వారి భూములకంటే తమ భూముల్ని ఎంతో తక్కువ తేడాగా అంచనా వేయించుకునేవారు. బెంగాల్‌లో భూయజమాని కులాన్నిబట్టి శిస్తు ఉండేది. కౌలుదారు గనుక అస్పృశ్యుడైతే అత్యధిక శిస్తు కట్టాల్సి వచ్చేది.

---

(704 పేజీ తరువాయి)

''కంసాలి కులం వారిని ప్రణామపూర్వకమైన 'నమస్కారం' అనే పదాన్ని వాడకుండా గౌరవనీయ మండలి అధ్యక్షులు నిషేధించాలని తలపోసినందువల్ల ఈ విషయాన్ని ప్రకటించవలసిన బాధ్యత మీమీద ఉంది. ఈ ఆజ్ఞని తీర్మానాన్ని యావత్ కులం వారికి తెలియపరచి కచ్చితంగా అమలుజరపాలి.''

ఆదేశం మేరకి

| | |
|---|---|
| బొంబాయి కోట | సం. డబ్ల్యు.పేజ్ |
| 9 ఆగస్టు 1779 | ప్రభుత్వ కార్యదర్శి |

ప్రభుత్వ తీర్మానం ది 28 జులై 1779

కంసాలులు 'నమస్కారం' అని ప్రణామం చేస్తూ ఉండడం వల్ల, అలాంటి హక్కు వారికి లేదని బ్రాహ్మణులు అంటూ ఉండడంతోనూ, అలాంటి పద్ధతిని కంసాలులు అనుసరించడం జెంటూ (హిందూ) మతానికి భంగకరంగా ఉంటుందని, తరచూ బ్రాహ్మణులకి కంసాలులకీ మధ్య తగవులు తలెత్తుతున్నాయి. బ్రాహ్మణులు ఎన్నోసార్లు మాకు విజ్ఞప్తులు చేశారు పీష్వాలు కూడా ఎన్నోసార్లు కంసాలులు ఈ పద్ధతిని అనుసరించకుండా నిషేధించాలని అధ్యక్షునికి రాశారు. అంచేత ఇది అవసరమని తీర్మానించడం జరిగింది. ఈ విషయాన్ని మేమే పరిష్కరించాలి. రెండు కులాల మధ్య ఉన్న తగూని అంతం చెయ్యాలి. దీన్ని శాసన రీత్యా చెయ్యాలి. బ్రాహ్మణుల ఫిర్యాదు సమంజసమైందిగా కనిపిస్తోంది కాబట్టి 'నమస్కార్'ని వాడకూడదని ప్రభుత్వం నిషేధిస్తోంది. ఇది కంపెనీ వారి ప్రయోజనాలకి సంబంధించిన విషయం కాదు కాబట్టి మా తీర్మానం పీష్వ అభినందన స్థాయిలో పెట్టవలసిందని, మా నిర్ణయం ఏమిటైందీ పీష్వాకి తెలియచెయ్యాలని అధ్యక్షుల కోరిక.

మనువు క్రీస్తుపూర్వం వాడైనా, క్రీస్తు తర్వాతి వాడైనాగానీ మరణించలేదనీ, హిందూ రాజులు పాలించినపుడు హిందువుకీ హిందువుకీ మధ్య స్పృశ్యులకీ అస్పృశ్యులకీ మధ్య మనుస్మృతి ప్రకారమే హక్కుల సంరక్షణాధికార నిర్వహణ సాగేదని, ఆ ధర్మం అసమానత్వం మీదనే త్రికరణశుద్ధిగా ఆధారపడి ఉండేదని ఈ పై అంశాలనిబట్టి తెలుస్తుంది.

III

మనుస్మృతి ఏర్పాటుచేసిన ధర్మం అదీ. దీన్ని మానవ ధర్మమని అంటున్నారు. అంటే స్వభావ సిద్ధంగా ఇందులో ఉన్న సుగుణం వల్ల సర్వ మానవాళికీ సర్వకాలాలకీ, సర్వ ప్రాంతాలకీ దీన్ని వర్తింపచెయ్యవచ్చుట. భారతదేశం బయట దీనికి చలామణీ లేదన్న విషయం వరమో శాపమో పరిశీలించేందుకు ప్రయాసపడను. ఈ మానవ ధర్మం బ్రాహ్మణులకే సర్వహక్కులూ వుంటాయన్న సిద్ధాంతం మీదా, శూద్రులకి కనీస మానవ హక్కులు ఉండకూడదన్న సిద్ధాంతం మీదా ఆధారపడింది. బ్రాహ్మణుడు అన్నివిధాలా అందరికంటే అధిక స్థానంలో ఉంటాడు, మరే ఇతర కారణమూ లేదు. ఒట్టి పుట్టుకలోని ఆధిక్యాన్ని బట్టే. శూద్రుడు అందరికంటే తగ్గులో ఉంటాడు. అతని 'ప్రతిభా సంపత్తు' లే స్థాయివైనాగానీ ఏ హక్కులూ వుండవు.

మానవ ధర్మాన్ని ఇలా తలకిందులుచేసి పెట్టడం కంటే సిగ్గుమాలినతనం, అసంబద్ధత మరిలేదు. ఈ విషయంలో డా. ఆర్.కె. పరంజపె చేసిన ప్రయత్నం కంటే మంచిది లేదు. ఆయన విద్యావేత్త, రాజకీయవాది, సాంఘిక సంస్కర్త. దాన్ని సంపూర్తిగా ఇక్కడ ఇస్తున్నందుకు నేను ఏ తప్పూ చెయ్యడం లేదు-

## భవిష్యత్ దర్శనం[1]

అప్పట్లో బొంబాయిలో, మద్రాస్ ప్రెసిడెన్సీలో, మధ్య రాష్ట్రంలో అధికారంలో ఉన్న బ్రాహ్మణేతర పార్టీలకి వ్యతిరేకంగా రాసిన భాగం ఇది. ప్రభుత్వ కొలువులో ఏ ఒక్క కులమో గుత్తాధిపత్యం చెలాయించకుండా చూసే ప్రకటిత లక్ష్యంతోనే బ్రాహ్మణేతరపార్టీలని స్థాపించడం జరిగింది. భారత్‌లోని అన్ని రాష్ట్రాల ప్రభుత్వోద్యోగాలలోనూ ప్రభుత్వ శాఖల్లోనూ బ్రాహ్మణులే దాదాపు సంపూర్ణ గుత్తాధిపత్యంలో ఉన్నారు. అంచేత బ్రాహ్మణేతర పార్టీలు ఒక సూత్రాన్ని ముందు పెట్టేయి. దాన్ని కుల దామాషా సూత్రం అంటారు. కనీస అర్హతలు గనుక ఉన్నట్టయితే బ్రాహ్మణేతర కులాల అభ్యర్థులకి ప్రభుత్వోద్యోగాలలో బ్రాహ్మణుల కంటే ఎక్కువ అనుకూల్యం కలిగించాలి అనేది ఆ

1. గుజరాతీ పంచ్ నుంచి పునర్ముద్రితం - మే 1921 (రాతప్రతిలో ఉల్లేఖించ లేదు -సం)

సూత్రం. ఇందులో తప్పేమీ లేదని నా అభిప్రాయం. ఒక కులం ఎంత శక్తియుక్తులు కలిగినదైనా ఆ ఒక్క కులం చేతిలోనే దేశాన్ని పాలించే పగ్గాలు ఉండడం కంటే అన్యాయం మరొకటి లేదు.

సమర్థవంతమైన ప్రభుత్వం కంటే మంచి ప్రభుత్వం మేలన్న బ్రాహ్మణేతర పార్టీ అభిప్రాయం ఒక్క శాసనసభ, కార్యనిర్వాహక మండలుల ఏర్పాటుకి పరిమితమైన సూత్రం మాత్రమే కాదు. దాన్ని పరిపాలన క్షేత్రానికి విస్తరింపజేసేట్టు కూడా కలిగివుండాలి. పరిపాలన ద్వారానే ప్రభుత్వం నేరుగా ప్రజాబాహుళ్యంతో సంబంధాలు కలిగి వుంటుంది. సానుభూతితో వ్యవహరిస్తే తప్ప ఏ ప్రభుత్వమూ మంచి చెయ్యలేదు. ఒక్క బ్రాహ్మణులు మాత్రమే చక్రం తిప్పేవాళ్ళుగా ఉంటే ఏ పరిపాలనా మంచి చెయ్యలేదు. బ్రాహ్మణుడు ప్రజాబాహుళ్యం కంటే తాను అధికుణ్ణని అనుకుంటూ వుంటాడు. మిగతా వాళ్ళని తక్కువ కులం వారనీ, శూద్రులనీ ఏవగించుకుంటాడు. వాళ్ళ ఆశలని వ్యతిరేకిస్తాడు. స్వభావ సిద్ధంగా తన కులస్థుల్ని అభిమానిస్తాడు. ప్రజాబాహుళ్యం పట్ల ఆసక్తి చూపించడు. అవినీతికి గురయ్యేట్టు ఉంటాడు. అలాంటి బ్రాహ్మణుడు మంచి పాలనదక్షుడెలా అవగలడు? భారతదేశంలోని ప్రజాబాహుళ్యానికి విదేశీయుడెంత పరాయివాడో బ్రాహ్మణుడూ అంతే. దీనికి ప్రతిగా బ్రాహ్మణులు పరిశుద్ధ, అకలంక ప్రతిభ అంటూ వాదిస్తున్నారు. విద్యా విషయకంగా ముందు ఉండడం వల్ల ఈ ఒక్క పాచికనే ఒడుపుగా వాడగలమన్న విషయం వాళ్ళకి తెలుసు. కానైతే సామర్థ్యం అనేదే ఏకైక కొలమానం అయితే వాళ్ళు ఉన్నంత స్థాయిలో ప్రభుత్వోద్యోగాల్ని గుత్తస్వామ్యం చేసుకునే అవకాశాలు బహు తక్కువ అన్న విషయాన్ని వాళ్ళు మర్చిపోతున్నారు. సామర్థ్యం ఒక్కటే కొలమానం అయితే ఓ ఇంగ్లీషువాణ్ణో, ఫ్రెంచివాణ్ణో, జర్మన్ దేశస్థుణ్ణో, తురుష్కుణ్ణో బ్రాహ్మణులకి బదులుగా నియోగించుకోవచ్చు. సరే ఆ విషయాన్ని అలా ఉంచినా, బ్రాహ్మణేత పార్టీలు ప్రతిభ ఏదో మహత్తరమైందని కొలుస్తూ కూచోలేదు. కుల దామాషా అనే సూత్రాన్ని ప్రభుత్వోద్యోగాల్లో పాటించాలని, పరిపాలనలో అన్ని కులాలనీ, విశ్వాసాల వాళ్ళనీ సంయోజితం చెయ్యాలనీ, ఆరకంగా మంచి పరిపాలన ఏర్పాటయేట్టు చెయ్యాలనీ పట్టుబడుతున్నాయి. బ్రాహ్మణులు అధికారంలో ఉండగా పరిపాలన బ్రాహ్మణమయం అయినందు వల్ల దాన్ని తుడిచిపెట్టెయ్యాలన్న ఆతృతలో ఓ విషయాన్ని బ్రాహ్మణేతర పార్టీలు ఈ సూత్రాన్ని అమలు జరిపించే సందర్భంలో మరిచిపోతున్నాయి. అదేమిటీ అంటే ప్రభుత్వోద్యోగాలలో బ్రాహ్మణ, బ్రాహ్మణేతర సమతూకాన్ని సరిచేసేటప్పుడు కనీస సామర్థ్యం అనేది అవసరం అన్న విషయం. అయితే అంత మాత్రాన ప్రజా బాహుళ్య ప్రయోజనాల దృష్ట్యా వాళ్ళు తమకి మార్గదర్శకంగా ఉండేందుకు అనుసరించిన సూత్రాన్ని ఆమోదయోగ్యం కాదని అనలేం.

ఈ విధానం చాలామంది బ్రాహ్మణులకి తలనొప్పి తెప్పించింది. కోపంతో ఉడికిపోయేరు.

బ్రాహ్మణేతర పార్టీ విధానం మీద డా. పరంజపే రాసిన ఈ వ్యాసం చక్కని అధిక్షేపం. బ్రాహ్మణేతర పార్టీ విధానాన్ని ఇది అనుకరణీయమైన రీతిలో అధిక్షేపిస్తుంది. దాన్ని ప్రచురించినప్పుడు, చాలామంది బ్రాహ్మణేతర పార్టీ నాయకులు మండిపడిపోవడమేకాక అవాక్కయిపోవడం నాకు తెలుసు. పరంజపేతో పేచీ అల్లా ఆయన అందులో ఉన్న హస్తాన్ని చూడలేదని. బ్రాహ్మణేతర పార్టీ కొత్త పని ఏదీ చెయ్యడం లేదు. మనుస్మృతిని తలకిందులుగా పెడుతోందంతే. ఇటుదాన్ని అటూ, అటుదాన్ని ఇటూ తిప్పుతూందంతే. మనువు శూద్రుణ్ణి ఉంచిన స్థానంలోకి బ్రాహ్మణుణ్ణి అదినెట్టుతోంది. బ్రాహ్మణుడు కాబట్టే మనువు బ్రాహ్మణునికి హోదా కల్పించలేదూ? శూద్రునికి అర్హత ఉన్నా మనువు అతనికి హోదా తిరస్కరించలేదా? అంచేత ఇవాళ శూద్రుడు కాబట్టే శూద్రునికి కొన్ని హోదాలు ఇస్తే గొణుక్కోవడం ఎందుకు? ఇలా తలా తోకా లేని విషయంగా కనిపించవచ్చు, కాని ఈ నియమానికి ఒరవడి లేకపోలేదు. ఆ ఒరవడి మరేదో కాదు, మనుస్మృతే. ఎవళ్ళు బ్రాహ్మణేతర పార్టీమీద రాళ్ళు వేస్తారు? తమకి ఏ పాపమూ లేనట్లయితే బ్రాహ్మణులు ఆ పని చెయ్యచ్చు. అయితే మనుస్మృతిని కూర్చినవాళ్ళు, ఆరాధించేవాళ్ళు భుజాన్నెత్తుకుని మోసేవాళ్ళు పాపరహితులమని అనగలరా? ఈ మానవ ధర్మంలో ఉన్న అసమానత్వాన్ని చాలా బాగా ఖండించే వ్యాసం పరంజపే వ్యాసం. బ్రాహ్మణుడు శూద్రుని స్థానంలో పడితే ఎలా ఉంటాడో మరేదీ చెప్పలేనంతగా ఇది చెపుతుంది.

IV

అసమానత్వం అనేది హిందువులకి మాత్రమే పరిమితం అనుకునేరు. ఇతరత్రా కూడా అది ఉంది. సమాజాన్ని హెచ్చు, తగ్గు స్థాయిలుగా, స్వేచ్ఛాయుతులు బానిసలు అనే తరగతులుగా విభజించడానికి అదే హేతువు.

(రాతప్రతి అసంపూర్తిగా ఉంది - సం)

## 5. సాంఘిక వ్యవస్థని కాపాడడం

(డా. అంబేద్కర్ చేత్తో రాసిన నాలుగు పేజీలివి. ధర్మశాస్త్రాల నుంచి గ్రహించిన ఉల్లేఖనలు నిండుగా టైప్ చేసి ఉన్నాయి. మొదటి పేజీకి 56 అని నంబరు ఉంది. అంటే అంతకుముందు భాగం అలభ్యం అనిపిస్తుంది. అదేరకంగా తర్వాతి భాగమూ లుప్తం. శీర్షికని సూచించడం జరిగింది - సం)

**XII. 100** ''వేద శాస్త్ర పారంగతుడైన వానికే (అంటే బ్రాహ్మణునికే) సైన్యాల్ని నడిపించడం, రాజ్యాధికారం చలాయించడం, దండన విధించే అధికారం, అన్ని దేశాల మీద సర్వంసహాధికారం నెరపడం తగును'' (మనుస్మృతి)

యథాతథ స్థితిని కాపాడి నిలబెట్టే రెండవ నైపుణ్యానికీ మొదటి దానికీ చాలా తేడా ఉంది. నిజం చెప్పాలంటే హైందవ సాంఘిక వ్యవస్థ ప్రత్యేక లక్షణం ఇదే.

సాంఘిక వ్యవస్థని తీవ్రమైన దాడి నుంచి కాపాడాలీ అంటే మూడు విషయాల్ని దృష్టిలో వుంచుకోవాలి. విప్లవం చెలరేగడానికి మూడు అంశాలు కారణం. (1) తప్పు జరిగిందన్న భావం ఉండడం (2) ఎవళ్ళైనా ఆ అన్యాయం వల్ల బాధపడుతున్నారన్న ఎరుక ఉండడం (3) ఆయుధాలు అందుబాటులో ఉండడం. ఇక రెండవ విషయం, ఆ తిరుగుబాటుని రెండు విధాలుగా ఎదుర్కోవడం. ఒకటి తిరుగుబాటు తలెత్తకుండా చేసుకోవడం, రెండవది తిరుగుబాటు తలఎత్తేకా దాన్ని అణచడం. మూడవ విషయం తిరుగుబాటు తలెత్తకుండా చెయ్యడం సాధ్యమా లేక తిరుగుబాటును అణచడం ఒక్కటే మార్గమా అన్నది తిరుగుబాటుకి నడిపించే మూడు నియమాల మీద ఆధారపడి ఉంటుందన్నది.

సాంఘిక వ్యవస్థ గనక పైకి వచ్చే అవకాశాల్ని విద్యావకాశాల్ని తిరస్కరిస్తే, ఆయుధాల్ని వినియోగించే హక్కుని తోసిరాజంటే ఆ వ్యవస్థ తిరుగుబాటుని తలెత్తకుండా చేసుకోగలదు. అలాకాక పైకి వచ్చే హక్కుని ఇచ్చి, విద్యావకాశాన్ని అందించి, ఆయుధ వినియోగాన్ని అంగీకరించే సాంఘిక వ్యవస్థ అన్యాయంతో అలమటించిపోయే వాళ్ళ తిరుగుబాటుని నిరోధించలేదు. ఇక అది సాంఘిక వ్యవస్థని నిలబెట్టి ఉంచే మార్గమల్లా క్రూరంగా బలప్రయోగం చెయ్యడం ద్వారా తిరుగుబాటుని అణచడమే. హిందూ సాంఘిక వ్యవస్థ మొదటి పద్ధతిని అనుసరించింది. తరతరాలకీ వర్తించేటట్టు అది కింది శ్రేణుల సాంఘిక హోదాని బిగించేసింది. వాళ్ళ ఆర్థిక స్థాయిని కూడా బిగించేసింది. ఈ రెండింటికీ హెచ్చు తగ్గులు లేకపోవడంతో అసంతృప్తి పెరిగేందుకు అవకాశమే లేదు. కింది వర్గాల వాళ్ళకి విద్య లేకుండా చేసింది. తత్ఫలితంగా తన దీన పరిస్థితే అసంతృప్తికి హేతువు అన్న ఎరుకే ఎవళ్ళకీ లేదు. ఒకవేళ ఆ ఎరుకలాంటిది ఏమన్నా ఉన్నా అది తన నీచ పరిస్థితికి ఎవళ్ళూ కారణభూతులు కారు అన్నదే. అది కర్మ ఫలితం. అసంతృప్తి ఉందనుకున్నా, అసంతృప్తి గురించిన ఎరుక ఉందనుకున్నా హిందూ సాంఘిక వ్యవస్థ మీద కింది వాళ్ళ నుంచి తిరుగుబాటు రాదు. ఏమంటే ప్రజలు ఆయుధాలని వాడే హక్కుని హిందూ సాంఘిక వ్యవస్థ తిరస్కరిస్తుంది... అలా వాడేందుకున్న సాంఘిక వ్యవస్థలు... రెండవ పక్షాన్ని అనుకరిస్తాయి. అందరికీ సమానావకాశాల్ని కలిగిస్తాయి. విజ్ఞాన సముపార్జనా స్వేచ్ఛని ఇస్తాయి. ఆయుధాల్ని ఉంచుకునే హక్కుని ఇస్తాయి. తిరుగుబాటు బలాన్ని, హింసనీ అణచివేసే నిందని నెత్తికెక్కించుకుంటాయి. అందరికీ అవకాశం ఉండే స్వేచ్ఛని తిరస్కరించడం, విజ్ఞాన సముపార్జనా స్వేచ్ఛని తిరస్కరించడం, ఆయుధాలు ఉంచుకునే హక్కుని తిరస్కరించడం పరమ అన్యాయం. దాని ఫలితం... మనిషికి. ఇందుకు హిందూ సాంఘిక వ్యవస్థ ఏమాత్రం తలవంచుకోవడం

లేదు. ఏమైనా అది రెండింటిని సాధించింది. స్థాపిత వ్యవస్థని కాపాడుకునేందుకు మహాసమర్థవంతమైన పద్ధతిని స్థాపించింది, అది ఎంత సిగ్గుమాలిన పద్ధతి అయినా, ధైర్యసాహసాల్ని అంతం చెయ్యడానికి పరమ అమానుషవైఖరి అవలంబించినా, హిందువులు చాలా దయాంతఃకరణ కలవాళ్ళన్న బిరుదుని వాళ్ళకి ప్రసాదించింది.

హిందూ సాంఘిక వ్యవస్థ తనని నిలబెట్టుకోవడానికి ఏర్పాటు చేసుకున్న సూత్రం దాని మరో ప్రత్యేక అంశం.

ఆ సూత్రం రెండు విధాలు ఉంది.

మొదటిది, ఆ సాంఘిక వ్యవస్థని నిలబెట్టి కాపాడ్డం రాజు భుజస్కంధాల మీద పెట్టిన బాధ్యత. మనువు ఈ విషయాన్ని స్పష్టంగా చెప్పేడు.

**VIII-410** వైశ్యుల్లో ప్రతివాళ్ళూ వాణిజ్యాన్నో, కుసీద వృత్తినో (వడ్డీ వ్యాపారాన్ని), వ్యవసాయాన్నో, పశుపోషణనో అవలంబించాలనీ, సేవక వృత్తివాళ్ళు ద్విజులకి సేవ చెయ్యాలనీ రాజు శాసించాలి.

**VIII-418** వైశ్యులు, చేతివృత్తుల వాళ్ళు తమ తమ విధుల్ని నిర్వహించేట్టు రాజు వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉండాలి. ఈ వృత్తుల వాళ్ళు గనక తమ విధులు విస్మరించి ఏమరుపాటుగా ఉంటే లోకవ్యవహారం అల్లకల్లోలం అయిపోతుంది.

ఈ విషయంలో రాజు నిర్వర్తించాల్సిన కర్తవ్యం ఏమిటో చెప్పి మాత్రమే మనువు ఊరుకోలేదు. ఆయన... రాజు సర్వవేళలా తన విధిని వ్యవస్థీకృత ధర్మాన్ని కాపాడి పరిరక్షించేందుకు అనుసరించాలి. అందుకని మనువు మరో రెండు నిబంధనలు చేర్చేడు. రాజు వ్యవస్థీకృత ధర్మ పరిరక్షణలో విఫలమైతే అది నేరం, అందుగ్గాను రాజుని నేరస్థునిగా విచారణ జరపవచ్చు, రాజుకి దండన విధించవచ్చు- సామాన్యునికి జరిగే మాదిరీ. ఈ దిగువ ఉల్లేఖనలని బట్టి ఈ విషయం స్పష్టమవుతుంది.

**VIII-335** ''ఓ తండ్రిగాని, ఆచార్యుడుగాని, మిత్రుడుగాని, తల్లిగాని, భార్యగాని, కొడుకుగాని, ఇంటి పురోహితుడుగాని తమ విధులకి విధేయులై ఉండకపోతే వాళ్ళని రాజు దండించకుండా ఉండరాదు.''

**VIII-336** ''తక్కువ కులం వాడికి ఒక పణం జరిమానా విధించే సందర్భంలో రాజుకి వెయ్యి పణాలు జరిమానా పడుతుంది. ఆ రుసుముని అతను పురోహితులకి చెల్లించాలి. లేకపోతే నదిలోకి విసరాలి. ఇది పవిత్ర విధి.''

రాజు వ్యవస్థని వ్యతిరేకించినా, ఉపేక్షించినా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, త్రివర్ణాలూ రాజుకి వ్యతిరేకంగా సాయుధ తిరుగుబాటు చెయ్యచ్చు, ఈ హక్కుని మనువు ప్రసాదించేడు.

**VIII-348** ''ద్విజులు తమ విధికి బలవంతంగా అవరోధం కలిగినప్పుడు సాయుధ తిరుగుబాటు చెయ్యచ్చు. ద్విజులకి దుష్టకాలంలో ఏ ఉత్పాతం సంభవించినా అలా చెయ్యొచ్చు.

(అసంపూర్తిగా ఉందీ రాత ప్రతి - సం)

★★★

# 6. హిందువులతో

(రాతప్రతి నుంచి ముద్రితం - సం)

హిందువులు ఎప్పటికేనా అస్పృశ్యుల్ని తమ సమాజంలో కలుపుకుంటారన్నది నమ్మలేని విషయం. వాళ్ళ వర్ణవ్యవస్థ, మతం ఈ విషయంలో ఏరకమైన ఆశకీ అవకాశం ఇవ్వవు. అయితే అస్పృశ్యుల్లో కంటే ఎక్కువగా హిందువుల్లో మూర్ఖ ఆశావాదులున్నారు. హిందువులు అస్పృశ్యుల్ని తమలో కలిపేసుకుంటారని వాళ్ళ నమ్మకం. ఈ మూర్ఖ ఆశావాదులకి అలాంటి అభిప్రాయం నిజంగానే ఉందా లేక నాటకమా అనే ప్రశ్నని మరిచిపోకూడదు. ఎంత వ్యవధిలో ఈ సమ్మేళనం జరుగుతుందీ వాళ్ళు చెప్పలేరు. ఆ ఆశావాదులు నిజంగానే అలా భావిస్తున్నారనుకున్నా, ఈ సమ్మేళన ప్రక్రియ ఎన్నో శతాబ్దాలు సాగే దీర్ఘకాలికం కాబోతోందన్న దాంట్లో సందేహం లేదు. ఈ లోపున హిందువు సాంఘిక, రాజకీయ పెత్తనం కింద అస్పృశ్యులు బతకాల్సిందే, గతంలో అనుభవించిన నరకయాతనలన్నీ, అణచివేతలన్నీ అనుభవించాల్సిందే. ఎప్పుడో ఫలానా అప్పుడు అని తేలని భవిష్యత్తులో వాళ్ళని హిందువులు తమలో కలుపుకుంటారన్న ఆశతో హిందువుల దయాదాక్షిణ్యాలకి అస్పృశ్యుల్ని ఇంగితం ఉన్న ఎవడూ బలిపెట్టడు దీర్ఘకాలికమో, స్వల్పకాలికమో పరివర్తన దశ అనేది ఒకటి ఉండాలి, హిందువుల ద్వేషానికి, పీడనకి వ్యతిరేకంగా ఏదో చట్ట నిబంధన ఉండాలి. ఈ సందర్భంలో ఏ నిబంధనలు చెయ్యవచ్చు? ఈ ప్రశ్నల్ని అస్పృశ్యులకే వదిలిపెడితే వాళ్లు రెండు నిబంధనలు కావాలంటారు: ఒకటి రాజ్యాంగపరమైన హక్కులు, రెండు ప్రత్యేక పరిష్కారాలు.

I

అస్పృశ్యులకి రాజ్యాంగపరమైన హక్కుల పరిరక్షణ ఎలా ఉండాలన్నదానికి సంబంధించి ఆలిండియా షెడ్యూల్డ్ కులాల ఫెడరేషన్ నిర్వచించింది. అది భారతదేశంలోని అస్పృశ్యుల రాజకీయ సంస్థ. తీర్మానాల రూపంలో ఆ నిర్వచనం ఉంది. నంబరు 3,7 తీర్మానాల్లో ఇలా విశదీకరించి ఉందా విషయం:

తీర్మానం 3

(పే 359ని ఉల్లేఖించాలి)

(రాతప్రతిలో లేదు - సం)

తీర్మానం 7

(పే. 361 నుంచి ఉల్లేఖించాలి)

(రాతప్రతిలో లేదు - సం)

స్పృశ్యులకి ఈ రక్షణ కల్పించడానికి హిందువులు ఏమాత్రం అనుకూలంగా లేరు. వ్యతిరేకత సాధారణంగా అన్నిటికినీ. ప్రత్యేక రక్షణకీ వ్యతిరేకత ఉంది. సాధారణ వ్యతిరేకత అస్పృశ్యులు అల్పసంఖ్యాక వర్గం వాళ్ళు కాదని, అంచేత ఇతర అల్పసంఖ్యాక వర్గాలకి కల్పించినట్టు రక్షణ కల్పించక్కర్లేదని, అల్పసంఖ్యాకవర్గంగా ఎవళ్ళనన్నా గుర్తించాలీ అంటే అల్పసంఖ్యాకవర్గ ప్రజానీకం మతం ఆధారంగానే ఉంటుందనేది ఆ వాదన. మత రీత్యా అస్పృశ్యులు హిందువుల నుంచి వేర్పాటుగా లేరు. అంచేత వాళ్ళు అల్పసంఖ్యాక వర్గం కారు. అల్పసంఖ్యాకవర్గం గురించి చెప్పే ఈ భాష్యం కుత్రతరహాగా ఉంటుందన్నది తెలుస్తూనే ఉంది. ఈ సమస్యని అధ్యయనం చేసిన వాళ్ళందరికీ ఇది స్పష్టమే.

(అసంపూర్ణం - సం.)

# 7. నిస్పృహ

చరిత్రలో అస్పృశ్యులంత నీరసులు, అసహ్యానికి గురయినవాళ్ళు, దయనీయులు మరి లేరు. వాళ్ళు జవసత్వాలుడిగిన వాళ్ళు, ఎంతో బలైపోయినవాళ్ళు. షెల్లీ భాషలో చెప్పాలంటే వాళ్ళు-

''స్వర్గారోహణ చెయ్యలేని అశక్త నీరసులు, భూమి మీదకి చూస్తూ, తోడు లేక సంచరిస్తూ భిన్న జన్మకల తారల మధ్య''

సాదా భాషలో చెప్పాలంటే అస్పృశ్యులు ఒక తీవ్ర నిస్పృహతో పూర్తిగా కుంగిపోయేరు. మాథ్యూ ఆర్నాల్డ్ చెప్పినట్టు[1], ''ఎవళ్ళ సత్తా వాళ్ళు నిరూపించుకునే ప్రయత్నంలోనే జీవితం ఉంది, దీనర్థం నిండుగా, స్వేచ్ఛగా సొంత ఉనికిని అభివృద్ధి చేసుకోవడం, హాయిగా కావాల్సినంత వెలుతురు, గాలి ఉండడం, ఏదీ లేకపోవడం (.....)★ లొంగిపోకపోవడం. ఎవళ్ళ సత్తా వాళ్ళు నిరూపించుకోవడంలో విఫలమవడమే నిస్పృహకి మరో పేరు. అదే ఒక వ్యక్తి ప్రయత్నాలు ఫలించకపోవడం, బుద్ధి కుశలత వాడిపోవడం, వ్యక్తిత్వం గిడసబారిపోవడం.''

తమ చరిత్రలో చాలామంది ప్రజలు అలాంటి నిస్పృహకి గురవుతారు. కాని ఆ మసకనుంచి వాళ్ళు త్వరలోనే తేరుకుంటారు, వైభవం పొందుతారు, నూతన ఉత్తేజం పొందుతారు. అయితే అస్పృశ్యుల విషయం భిన్నమైంది. వాళ్ళ నిస్పృహ శాశ్వతమైన నిస్పృహ. స్థలకాలాల వల్ల తొలగిపోయేది కాదది.

ఈ విషయంలో యూదులతో పోలిస్తే అస్పృశ్యుల గోడు భిన్నంగా ఉంటుంది.

ఈజిప్టులో నిర్బంధం యూదుల పాలబడిన మొదటి విపత్తు.

(పిల్లల బైబిల్- 39ని ఉల్లేఖించాలి) (ఉల్లేఖనని ఇక్కడ ఇవ్వలేదు -సం)

చివరికి ఫారో దిగిరాక తప్పలేదు. యూదులు బానిసత్వం నుంచి బయటపడ్డారు. కానాన్‌కి వెళ్ళేరు. మధుక్షీరాలతో పొంగిపొర్లే ఆ గడ్డ మీద స్థిరపడ్డారు.

ఇక యూదుల పాలబడ్డ రెండవ విపత్తు బాబిలోనియన్ నిర్బంధం. (కొన్ని పుటలు పోయేయి -సం.)

ఇపుడు మనం అస్పృశ్యులు ఎందుకు నిస్పృహకి గురయేరో వివరించుకోవచ్చు. వాళ్ళ శారీరక, మానసిక పరిస్థితికి సుగుణం లేదు. భవిష్యత్తులో తలెత్తుకోగల ఆశకి సంబంధించి నీరస నికృష్ట గతంలోనూ ఏ సూచనా లేదు, పోనీ దాని ఆధారంగా అలా ఉన్నతి సాధిద్దామన్నా. అది కూడా వాళ్ళ దోషం వల్ల వచ్చిందేమీ కాదు. వాళ్ళ నిస్పృహ హిందూ సాంఘిక వ్యవస్థలో పుట్టిన అసమాన సాంఘిక

1. ఎస్సేస్ ఆన్ డెమోక్రసీ

★ రాతప్రతిలో చెరిగిపోయింది -సం.

వాతావరణ ఫలితంగా వాళ్ళ నెత్తికి చుట్టుకున్న కర్మ. హిందూ సాంఘిక వ్యవస్థ వాళ్ళ పురోభివృద్ధి దారిలో ముళ్ళు పెట్టింది.

వాళ్ళ దురదృష్టం దురంరం. కార్లైల్ చెప్పినట్టు-

(పే. 201 ఉల్లేఖించాలి)

(ఉల్లేఖనని ఇవ్వలేదు -సం.)

హిందూ సాంఘిక వ్యవస్థని కూలదొయ్యాలని విప్లవాల గురించి, రక్తసిక్త విప్లవాల గురించి కూడా, కొంతమంది ఆలోచిస్తున్నారు. కాబ్లి విలియమ్ ఒకప్పుడు చెప్పినట్టు అందరూ అంటున్నారు-

(పే. 152 నుంచి ఉల్లేఖించాలి)

(ఉల్లేఖనని ఇవ్వలేదు -సం)

అదీ వాళ్ళ నిస్పృహ స్థాయి.

III

దేవుని ఒడంబడిక, ఎమర్సన్ భాషలో చెప్పాలంటే, మానసిక, శారీరక సుగుణ పరిస్థితి. ఎమర్సన్ చెప్పినట్టు, ''విజయం శారీరక మానసికతత్వం మీద ఆధారపడుతుంది- శారీరక మానసిక సుగుణ స్థితి మీద ఆధారపడుతుంది- శక్తిమీదా, శ్రమ మీదా- సాహసం మీద. విజయం ఒక నిర్దిష్ట సుగుణ లేక అనుగుణ్య శక్తిని అనుసరించి ఉంటుంది. ఒక ఔన్సు శక్తి ఒక బరువుతో తూగాలి.''

యూదులు తమ తొలి నిర్బంధం తర్వాత పైకి వచ్చేరూ అంటే అది వాళ్ళ శారీరక, మానసిక సుగుణ స్థితి వల్లనే. ఈ శారీరక మానసిక సుగుణ స్థితి రెండు మూలాధారాల నుంచి రావచ్చు. భగవంతుని మీద విశ్వాసం బట్టి రావచ్చు. దేవుడు మరేదీ లేనప్పుడు శక్తి జనకంగావచ్చు. దిక్కుతోచని పరిస్థితిలో మనిషికి మనోబలం కావాలి. విజయానికి అవసరమైన శారీరక, మానసిక సుగుణ స్థితికి కావాల్సింది అది ఒకటే కదా. అంచేత యూదులు దేవునితో ఒడంబడిక వల్ల విజయం సాధించేరని చెప్పడంలో తప్పులేదు, ఈ విషయాన్ని సరిగా వ్యాఖ్యానిస్తే.

IV

శారీరక మానసిక సుగుణస్థితి సాంఘిక వాతావరణ ఫలితంగా కూడా వస్తుందని, ఆ వాతావరణం

అనుకూలమైందైతే, నిర్బంధం లేని సమాజంలో, అవరోధం నుంచి విముక్తమైన సమాజంలో ప్రతి మానవుడు జీవనాధారాలకే కాక సుభిక్షంగా ఉండగలిగే సమాజంలో మరొకళ్ళు భోగభాగ్యాలతో తుల తూగేందుకు వీలుగా ఏ మనిషీ బలవంతపు శ్రమకి గురికానక్కర్లేని సమాజంలో, తన శక్తి సామర్థ్యాల్ని పెంపొందించుకునే హక్కు మానవునికి ఉన్న సమాజంలో పక్షపాతంతో లబ్ధిపొందే వాళ్ళతో పోటీలేని సమాజంలో, సామర్థ్యానికి పురస్కారం లభించే సమాజంలో యావన్మందికీ శ్రేయస్సుకల సమాజంలో,

(తర్వాతి భాగం చెరిగిపోయి, అస్పష్టంగా ఉంది - సం)

(పై భాగాలు డా. అంబేద్కర్ స్వదస్తూరిలో ఉన్నాయి. ప్రతి భాగం విడివిడి పుటల మీద రాసినటువంటిది - సం.)

## 8 రాజకీయ అణచివేత సమస్య★

భారతదేశంలో రాజకీయ స్వేచ్ఛా సూత్రాన్ని చాలా నింపాదిగా, కొంచెం, కొంచెంగా ప్రవేశపెట్టడం జరిగింది. అది 1892లో ఆరంభమైంది. అప్పుడు శాసనసభా నిర్మాణంలో ప్రజాప్రాతినిధ్య సూత్రాన్ని ప్రవేశపెట్టేరు. 1909లో దాన్ని విస్తృతం చేశారు. 1909 నాడు ఉన్నప్పటి దాన్ని చూస్తే ప్రజాప్రాతినిధ్యంలో రెండు లోపాలున్నాయి. వోటు హక్కు ఎంతో అందనిదిగా ఉండడం మొదటి లోపం. అది ఎంత అందనిదిగా ఉందంటే ప్రజా బాహుళ్యంలో అధిక భాగానికి వోటు లేకపోయింది. అది అందినవాళ్ళు ఎవరయ్యా అంటే హిందువుల్లోనూ, ముస్లింలలోనూ ఉన్న సంపన్న వర్గాలవాళ్ళు. ఇక రెండవ లోపం, ప్రజాప్రాతినిధ్య ప్రణాళిక ఒక్క శాసనసభకి మాత్రమే సంకుచితం అవడం. కార్యనిర్వాహకమండలికి అది విస్తరించలేదు. కార్యనిర్వాహకమండలి స్వతంత్రంగానే ఉండిపోయింది. తర్వాతి అడుగు 1919లో పడింది. చిత్రం ఏమిటంటే 1919 ప్రణాళికలో ప్రజాప్రాతినిధ్య సూత్రాన్ని కార్యనిర్వాహకమండలికి వర్తింపచేట్టు చేశారు. కాని శాసనసభతో సమంగా ఉండేట్టు వర్తింపచెయ్యలేదు. అలా జరగడానికి కారణం భారతదేశంలో రాజకీయ ఉద్యమాన్ని అధికభాగం పై తరగతుల వాళ్ళు నడిపించడం. వాళ్ళు ఎప్పుడూ ఓటు హక్కు విస్తృతి కంటే కార్యనిర్వాహక అధికారం అంటేనే ఎక్కువ ఆత్రుతగా ఉన్నారు. అది సహజం. దానివల్ల వాళ్ళకి కార్యనిర్వాహక అధికారం హస్తగతమవుతుంది. ఓటు హక్కు వల్ల లాభపడేది ప్రజాబాహుళ్యం.

★ ఇది డా. అంబేద్కర్ చేత్తో రాసిన ఆరు పేజీల పత్రం. 'హిందూ సాంఘిక వ్యవస్థ' ప్రణాళికలో XVIII అని నంబరు వేశారు. ఆఖరి వాక్యాన్నిబట్టి, ఈ అధ్యాయాన్ని అసంపూర్తిగా వదిలివేసినట్టు కనిపిస్తుంది - సం.

పై తరగతుల వాళ్ళు చెప్పింది బ్రిటిష్ అధికారులు విన్నారు. పై తరగతుల వాళ్ళు కార్యనిర్వాహక అధికారం కోసం ఒత్తిడి చేశారు. వోటు హక్కుని విస్తృతపరచకుండా దాన్ని పొందేరు.

అయితే 1909లో హద్దుల గీసిన గీతల నుండి వోటు హక్కు పెరిగిందనే దాంట్లో సందేహం లేదు. అయితే అది అస్పృశ్యులని స్పృశించలేదు. నిజానికి వాళ్ళు ఎంతో దారిద్ర్యంతో ఉన్నారు. ఒక్క సార్వత్రిక వోటు హక్కు తప్ప మరేదీ వాళ్లని ఎన్నికల పట్టీలోకి తీసుకురాలేదు.

ఇండియా ప్రభుత్వం చాలా కలవరపడింది. కాని వాళ్ళు చెయ్యగలిగింది ఏమీ లేకపోయింది. అస్పృశ్యులకి వోటు హక్కు ఇవ్వకుండా

వాళ్ళని పై కులాల వాళ్ళ రాజకీయాధికారం కింద ఉంచడం పట్ల వాళ్ళు తమ ఆందోళనని వ్యక్తం చేశారు. 1919 మార్చి 19న జారీచేసిన పత్రంలో ప్రభుత్వం ఇలా చెప్పింది-

(ఉల్లేఖించాలి)

ఆ పరిస్థితి 1935లో మారింది. కమ్యూనల్ అవార్డ్ అని బ్రిటిష్ ప్రభుత్వం ప్రతిపాదించిన ప్రణాళికలో అది మారింది.

(i) అస్పృశ్యుల జనాభాలో 10 శాతం మందికి ఓటు హక్కు వచ్చేట్లు వాళ్ళకి విభిన్న వోటు హక్కు ఉండాలి.

(ii) అస్పృశ్యులకి విభిన్నమైన వోటు హక్కు ఉండడమేకాదు, వాళ్ళకి ప్రావిన్షియల్, కేంద్ర శాసనసభల్లో కొన్ని స్థానాల్ని కేటాయించాలి.

(iii) వాళ్ళకి కేటాయించిన సీట్లని భర్తీ చెయ్యడానికి, ప్రత్యేకం అస్పృశ్యులే వోటర్లుగా ఉన్న ప్రత్యేక నియోజకవర్గాలు ఉండాలి.

(iv) ప్రత్యేక నియోజకవర్గాల్లో వోటు అస్పృశ్యులకి ఉంటుంది, దాంతోబాటు, అస్పృశ్యేతర హిందువులకి కల స్థానాల్లోనూ సాధారణ ఎన్నికల్లో వాళ్ళకి రెండవ లేక అదనపు వోటు ఉంటుంది.

అస్పృశ్యులకి ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని వ్యతిరేకిస్తున్నగాంధీగారు బ్రిటీష్‌వాళ్ళు చేసిన ఈ ప్రతిపాదనకి నిరసన తెలియజేశాడు. ఈ రాయితీల్ని ఉపసంహరించకపోతే ఆమరణ నిరాహారదీక్షకి పూనుకుంటానని బెదిరించేడు. గాంధీగారి అభ్యంతరం ముఖ్యంగా ప్రత్యేక ఓటర్లకి సంబంధించింది. అస్పృశ్యులకి

హిందువులకీ మధ్య ఒప్పందం లేకపోతే ఆ ప్రతిపాదనల్ని ఉపసంహరించుకుందుకు బ్రిటీష్ ప్రభుత్వం నిరాకరించింది. దానిమీద గాంధీ నిరాహారదీక్షకి దిగేడు. క్రమేణా 1932 సెప్టెంబర్‌లో హిందువులకీ అస్పృశ్యులకీ మధ్య ఒప్పందం కుదిరింది. ఆ ఒప్పందాన్నే పూనా ఒడంబడిక అంటారు. దాని షరతులు ఇక్కడ ఇస్తున్నాం:

## పూనా ఒడంబడిక ★

(1) సాధారణ ఎల్క్టరేట్‌లో దళిత వర్గాలకి ప్రావిన్షియల్ శాసనసభలో స్థానాలని ఈ కింది విధంగా కేటాయిస్తారు:

మద్రాస్ 30; బొంబాయి, సింధ్‌తో కలిసి 15; పంజాబ్ 8; బీహార్, ఒరిస్సాలు 18; సెంట్రల్ ప్రావిన్సెస్ 20; అస్సాం 7 యునైటెడ్ ప్రావిన్సెస్ 20. మొత్తం 148.

(2) ఈ స్థానాలకి ఎన్నిక సంయుక్త ఎల్క్టర్లేని బట్టి ఉంటుంది, అయితే ఈ కింది పద్ధతికి లోబడి:

ఒక నియోజకవర్గంలో సాధారణ ఎల్క్టరల్ రోల్‌లో నమోదైన దళిత వర్గాల సభ్యులందరూ ఒక ఎల్క్టరల్ కాలేజీ అవుతారు. ఆ కాలేజీ ఒక్కరికి ఒక్క వోటు అన్న పద్ధతిలో అలా కేటాయించిన స్థానాల్లో ప్రతి ఒక్కదానికీ దళిత వర్గాలకి చెందిన నలుగురు అభ్యర్థుల పానెల్‌ని ఎన్నుకుంటుంది. ప్రాథమిక ఎన్నికలో అత్యధిక ఓట్లు వచ్చిన ఆ నలుగురూ సాధారణ ఎల్క్టరేట్ జరిపే ఎన్నికలో అభ్యర్థులుగా ఉంటారు.

(3) కేంద్ర శాసనసభలో దళిత వర్గాల ప్రాతినిధ్యం కూడా ఇదే మాదిరి సంయుక్త ఎల్క్టరేట్స్, కేటాయించిన స్థానాలు అన్న సూత్రం మీద, ప్రావిన్షియల్ శాసనసభల్లో వాళ్ళ ప్రాతినిధ్యం కోసం పైన నిర్దేశించిన రెండవ అధికరణం పద్ధతిలో ఉంటుంది.

(4) బ్రిటీష్ ఇండియా సాధారణ ఎల్క్టరేట్ కేటాయించిన స్థానాల్లో కేంద్ర శాసనసభలలో 18 శాతం దళితులకి ప్రత్యేకించాలి.

(5) ఇంతకుముందే చెప్పినట్టు కేంద్ర, ప్రావిన్షియల్ శాసనసభల ఎన్నికలకి జరిగే ప్రైమరీ ఎన్నిక అభ్యర్థుల పట్టీ పద్ధతి మొదటి పదేళ్ళు పూర్తయేక ముగుస్తుంది. కింద సూచించిన ఆరవ

★ 1932 సెప్టెంబరు 25 సంతకాలు జరిగేయి.

అధికరణం ప్రకారం పరస్పర ఒప్పందం ద్వారా ఆ గడువుకి ముందే దాన్ని ముగించేస్తే తప్ప అది అంతకాలం కొనసాగుతుంది.

(6) అధికరణం 1,4లలో కల్పించిన రీతిలో దళిత వర్గాలకి కేంద్ర ప్రావిన్షియల్ శాసనసభల ప్రాతినిధ్యంకేటాయింపు ఆయావర్గాలు పరస్పరం ఒప్పందానికి వచ్చేదాకా కొనసాగుతుంది.

(7) కేంద్ర, ప్రావిన్షియల్ శాసనసభలకి దళిత వర్గాల ఓటు హక్కు ఎలా ఉండాలన్నది లోథియన్ కమిటీ నివేదికలో సూచించినట్టు ఉంటుంది.

(8) స్థానిక సంస్థల ఎన్నికలకి, పౌర ఉద్యోగాల్లో నియామకాలకి సంబంధించి ఎవరికీ దళిత వర్గం వాళ్ళన్న కారణంగా ఆటంకం ఉండదు. ఈ విషయంలో దళితులకి సముచిత స్థానం కల్పించడానికి సర్వప్రయత్నాలూ జరుగుతాయి. ప్రభుత్వ ఉద్యోగాలకి అవసరమైన విద్యార్హతలు ఉండడం అనేది ఎలాగూ తప్పదు.

(9) ప్రతి రాష్ట్రంలోనూ విద్యకి కేటాయించిన మొత్తంలో నుంచి దళిత వర్గాల వాళ్ళకి విద్యావకాశాలు సమకూర్చేందుకు గాను తగినంత సొమ్ముని ప్రత్యేకించాలి.

ఈ ఒడంబడిక అస్పృశ్యుల రాజకీయ స్వేచ్ఛా పత్రంగా ఉంటుంది. తొలి ఎన్నిక....

(అసంపూర్తిగా ఉంది - సం.)



# 9. ఏది అధ్వాన్నం?

## బానిసత్వమా? అంటరానితనమా?

('సమస్య మూలం', 'సారూప్య దృష్టాంతాలు' అనే శీర్షికల కింద ఈ రచనాక్రమంలో 5వ వాల్యూమ్‌లో 38 అధ్యాయాల్లో బానిసత్వం, అంటరానితనం అనే విషయం గురించి పరిశీలించేరు.

ఇప్పుడు మాకు ఓ చిన్న పుస్తకం దొరికింది. అందులోని కొన్ని పేరాగ్రాఫులు 5వ వాల్యూమ్ 3,8 అధ్యాయాల్లో కనిపించడం లేదు.

ఇక్కడ అందిస్తున్న విషయాన్ని దానితో కలిపి చదివితే పొంతన, పరిపూర్తి ఉన్నట్టు తెలుస్తుంది. అది నిజంగా ఆయన రాసిందేనని చెప్పడానికి అనుమానం లేదు. ఏమంటే ఆ చిన్న పుస్తకాన్ని ప్రచురించిన శ్రీ దేవీదయాళ్ 1943-1947 సంవత్సరాల్లో డా. అంబేద్కర్‌తో కలిసి ఉన్నారు. మొదటి ప్రకరణం ఆరంభంలో ముద్రించిన శీర్షిక నకలుని బట్టి చూస్తే దీన్ని డా. అంబేద్కర్ రాశారని చెప్పడానికి సందేహం లేదు. ఆ చిన్న పుస్తకంలోని ముందటి పేరాగ్రాఫులు, అంటే 1 వ పేజీ నుంచి 11 దాకా- ''మానవులు పరిశీలించాల్సిన అంశాలు'' దాకా 5వ వాల్యూంలో 80 నుంచి 88 పేజీ దాకా ముద్రితం అయి వున్నాయి. శ్రీ దేవీ దయాళ్‌గారి కోసం ఈ వ్యాసాన్ని ప్రచురించిన ఢిల్లీ వాస్తవ్యులు శ్రీ భగవాన్‌దాస్ గారికి కృతజ్ఞతలు - సంపాదకుడు)

# భారతదేశంలో బానిసత్వం

ఇతర జాతుల కంటే తాము అధికులమని హిందువులు చాటుకుంటూ ఉంటారు. అందుగ్గాను వాళ్ళు చేసే వాదనల్లో కింది రెండు విషయాల్ని చెపుతూ ఉంటారు. ఒకటి హిందువులలో బానిసత్వం లేదు అన్నది, రెండవది అస్పృశ్యత బానిసత్వం కంటే చాలా తక్కువ హానికరమైంది అన్నది.

సరే మొదటి వాదన అసత్యం. బానిసత్వం హిందువులలో ఏనాటినుంచో ఉన్నటువంటిది. దాన్ని మనువు, స్మృతికారుడు గుర్తించేడు. మనువు తర్వాతి స్మృతికారులు దాన్ని విపులీకరించి వ్యవస్థీకరించేరు. హిందువులలో బానిసత్వం ఎప్పుడో చరిత్రలో ఉన్న వ్యవస్థ మాత్రమే కాదు. 1843 దాకా చరిత్రలో కొనసాగిన వ్యవస్థ. బ్రిటిష్ వాళ్ళు చట్టరీత్యా దాన్ని ఆ ఏడు రద్దు చేసి ఉండకపోతే ఇవాళ్టికీ ఉండి ఉండేదే. బానిసత్వం కొనసాగినప్పుడు అది స్పృశ్యులకీ, అస్పృశ్యులకీ కూడా వర్తిస్తూ ఉండేది.

అస్పృశ్యులు పేదరికం కారణంగా స్పృశ్యుల కంటే ఎక్కువగా బానిసత్వం పాలబడుతూ ఉండేవారు. అంచేత 1843 దాకా అస్పృశ్యులు భారతదేశంలో జంట దాస్యాలకి గురవాల్సి వచ్చేది- బానిసత్వ దాస్యం, అస్పృశ్యత దాస్యం. ఆ బంధనాల్లో సులువైన దాన్ని తెంపేరు, అస్పృశ్యుడు దాన్నుంచి విముక్తం అయేడు. అయితే ఇవాళ అస్పృశ్యులు బానిసత్వ శృంఖలాలతో కనిపించడం లేదు కాబట్టి వాళ్ళకి అవి ఎప్పుడూ లేవని అనుకోకూడదు. అలా అనుకుంటే చరిత్ర నుంచి పుటలకి పుటలు చించెయ్యడమే అవుతుంది.

మొదటి వాదనని ఎక్కువగా ప్రస్తావించరు. రెండవ దాన్ని ప్రస్తావిస్తారు. లాలా లజపతిరాయ్ అస్పృశ్యులకి ఎంతో హితుడు, చాలా గొప్ప సాంఘిక సంస్కర్త. అలాంటి ఆయన మిస్ మేయో చేసిన

హిందూ సమాజ విమర్శకి జవాబు చెప్పేడు.[1] అదేమిటీ అంటే ఒక కీడుగా బానిసత్వంతో పోలిస్తే అస్పృశ్యత ఏమీకాదని నొక్కి చెప్పేడు. అమెరికాలోని నీగ్రోని, భారత్‌లోని అస్పృశ్యుణ్ణి పోలుస్తూ తన వాదనని బలపరచుకున్నాడు. తన వాదన సత్యమని రూపించుకున్నాడు. లాలా లజపత్‌రాయ్ లాంటి వ్యక్తి చెప్పిందానివల్ల ఈ విషయాన్ని మరింత నిశితంగా పరిశీలించాలి.

అంటరానితనం బానిసత్వం కంటే తక్కువ హానికరమైందా? బానిసత్వం అంటరానితనం కంటే తక్కువ కారుణ్యమైందా? అంటరానితనం కంటే ఎక్కువగా బానిసత్వం అభివృద్ధిని అడ్డుకుంటుందా? లాలా లజపతిరాయ్ లేవనెత్తిన వివాదం అలా ఉంచినా, ఈ ప్రశ్నలు ముఖ్యమైనవి, వాటి గురించిన చర్చ ఆసక్తిదాయకంగా, విషయబోధకంగా ఉంటుంది. ఈ రెండింటికీ గల తేడా అర్థం చేసుకోవాలంటే అసలు బానిసత్వం అంటే ఏమిటో నిర్వచించుకోవాలి. ఇది తప్పనిసరి, ఏమంటే బానిసత్వం అనే మాటని సాంఘిక సంబంధాన్ని ఇముడ్చుకునే ఆలంకారిక అర్థంలో కూడా వాడుతూ ఉంటారు కనక. అయితే అది బానిసత్వం కాదు. భార్య కర్మాత్మణా భర్త అధీనంలో వుంది కనుక, అతనామెని కొన్ని సందర్భాల్లో దుర్మార్గంగా చూసి చంపేడు. కనకా, భర్త భార్యని వేరేవాళ్ళకి అప్పగించేడు కనకా, తనకి సేవ చేసేట్టు వినియోగించుకున్నాడు కనక భార్యని బానిసగా చెప్పుకోవడం జరుగుతూ ఉంటుంది. ఇక ఆలంకారికంగా ఆ పదాన్ని వాడే రెండో ఉదాహరణ భూస్వామ్య దాసుల్ని గురించిన సందర్భం. కాని అతను నియమిత దినాల్లోనే పనిచేస్తాడు, నియమిత కొలువునే చేస్తాడు, భూస్వామికి ఫలానా మొత్తం అనే చెల్లిస్తాడు, అంచేత అతనూ బానిసే. ఇవి స్వేచ్ఛని కత్తిరించే ఉదాహరణలు మాత్రమే. అంత మేరకి అవి బానిసత్వానికి దగ్గరగానే ఉంటాయి. ఏమంటే బానిసత్వంలో కూడా స్వేచ్ఛాహరణం ఉంటుంది. అయితే చట్టంలో ఈ పదాన్ని ఈ అర్థంలో వాడరు. అంచేత వాదనలో గజిబిజి లేకుండా ఉండేందుకు బానిసత్వం అంటే చట్టపర అర్థం తీసుకునే ఈ పోలికని గురించి చర్చిద్దాం.

సామాన్య మానవుడి భావనలో బానిస అంటే మరొకరి ఆస్తిగా ఉండేవాడు. ఈ నిర్వచనం చాలా సరళంగా సామాన్య పాఠకుడికి కనిపిస్తుంది. మరింత వివరణ ఉంటేనే గాని దీని పూర్తి అంతరార్థం గ్రహించలేడు. ఆస్తి అంటే వేరే ఏదో అర్థం ఉంది. ఆస్తి అంటే కొన్ని హక్కులు ఉండేటువంటిది. స్వామ్యం కలిగి ఉండడం, వినియోగించుకోవడం, లబ్ధిపొందడం, క్రయం ద్వారా బదలాయించుకోవడం, తనఖా పెట్టుకోవడం, కౌలుకు ఇవ్వడం, నాశనం చేసుకోవడం లాంటి హక్కులు అన్నమాట. అంచేత స్వామ్యం అంటే ఆస్తిమీద పూర్తి ఆధిపత్యం ఉండడమన్నమాట. ఇప్పుడు నిర్దిష్టంగా చెప్పాలంటే, బానిస యజమాని ఆస్తి అంటున్నప్పుడు యజమాని బానిసని అతని ఇష్టానికి వ్యతిరేకంగా

1 దురదృష్ట భారత్

పనిచేయించవచ్చు. బానిస ఉత్పత్తి చేసిన దేన్నంచేనా లబ్ధిపొందవచ్చు, బానిస అనుమతి లేకుండా. బానిస ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా యజమాని బానిసని మరొకళ్ళకి ఇవ్వచ్చు, అమ్మచ్చు, కుదువపెట్టచ్చు. కచ్చితమైన న్యాయపర అర్థంలో అతన్ని చంపను కూడా చంపచ్చు. చట్టం దృష్టిలో ఒక వస్తువు మాత్రమే, ఆ వస్తువుని యజమాని చిత్తం వచ్చినట్టు వాడుకోవచ్చు.

చట్టపరమైన నిర్వచనం ప్రకారం బానిసత్వం అంటరానితనం కంటే అధ్వాన్నంగా కనిపించవచ్చు. బానిసని అమ్మచ్చు, కుదువపెట్టచ్చు, మరొకళ్ళకి అప్పివచ్చు; అయితే అస్పృశ్యుణ్ణి అమ్మడానికి లేదు, కుదువ పెట్టడానికి లేదు, మరొకళ్ళకి ఇవ్వడానికి లేదు. హత్యానేర దోషం లేకుండా బానిసని చంపెయ్యవచ్చు, అస్పృశ్యుణ్ణి అలా చెయ్యడానికి లేదు. అతన్ని ఎవరేనా చంపితే హత్యానేరం మోపవచ్చు. నిజానికి, బానిసని ఏ శిక్ష లేకుండా చంపడానికి లేదు. స్వేచ్ఛాయుత పౌరుని హత్య మాదిరి బానిస హత్యనేరపూరిత నరహత్యగానే చట్టంగుర్తిస్తుంది. కాని చట్టం నిర్దేశించినట్టుగా బానిస పరిస్థితి చూస్తే అస్పృశ్యుని కంటే బానిస స్థితి స్పష్టంగా ఉంది- అస్పృశ్యుని కంటే బానిస పరమ అధ్వాన్న పరిస్థితిలో ఉన్నాడని.

ఏమైనా బానిస అంటే ఎవరు? దీన్ని నిర్వచించే మరో పద్ధతి ఉంది. అదీ అంతే చట్టబద్ధం, అంతే నిర్దిష్టం. అయితే ఆ పద్ధతి సాధారణంగా ఉండేది కాదు. ఆ పద్ధతి నిర్వచనంలో బానిస ఎవరూ అంటే: బానిస మనుష్యమాత్రుడు కానీ చట్టం దృష్టిలో అతనొక వ్యక్తి కాదు. బానిసని ఈ రకంగా నిర్వచించడం కొందరికి బహుశా గజిబిజిగా కనపంచవచ్చు. అంచేత చట్టం దృష్టిలో ఒక వ్యక్తి అనే పదం మనుష్యమాత్రుడు అనే పదానికి సమరూపం అని చెప్పడం అవసరం. చట్టంలో వ్యక్తులుగా పరిగణించని మనుషులు ఉండచ్చు. విపర్యయంగా చట్టంలో మనుష్యులు గాని వ్యక్తులున్నారు. ఈ చిత్రమైన పరిస్థితి వ్యక్తి అనే పదానికి చట్టం ఇచ్చే అర్థం మీద ఆధారపడింది. చట్టం రీత్యా వ్యక్తి అంటే మనిషిగాని, ఇతరమైంది గాని, అస్తిత్వంలో ఉన్నటువంటిది అని. వ్యక్తి హక్కులూ, బాధ్యతలూ కలిగి ఉండచ్చు. బానిస మనిషే అయినా చట్టం దృష్టిలో వ్యక్తి కాడు. చట్టం దృష్టిలో విగ్రహం వ్యక్తి, విగ్రహం ప్రాణం లేని వస్తువు అయినా. ఈ తేడాకి కారణం స్పష్టం. హక్కులూ విధులూ పొందగలిగే సామర్థ్యంతో అస్తిత్వం లేదని చట్టం పరిగణించడం వల్ల బానిస మనిషే అయినా వ్యక్తికాడు. సంక్షిప్తంగా విగ్రహం వ్యక్తి మానవుడు కాకపోయినా, ఏమంటే చట్టం గుర్తిస్తోంది కనక- అది యుక్తమా కాదా అనేది వేరే సంగతి- హక్కులకీ విధులకీ సంబంధించి సామర్థ్యాన్నిగుర్తిస్తోంది కనక. వ్యక్తిగా గుర్తింపు పొందడం విపరీత పరిణామాలతో నిండిన ముఖ్యాంశం. ఈ విషయంలో ఎవళ్ళకేనా హక్కులు, స్వేచ్ఛలు ఉన్నాయో లేదో కాని, వ్యక్తిగా గుర్తింపు పొందినప్పుడు లభించే హక్కులు ప్రాణప్రదమే కాదు, ప్రాణమంత ముఖ్యమైనవీనూ. ఆ హక్కుల్లో వస్తువుల మీద హక్కు, వాటిని పొందడం, అనుభవించడం, అమ్ముకోవడం- ఆస్తి హక్కు

అని పిలిచేవి, ఉంటాయి. పదార్థాల మీద ఉన్న ఈ హక్కుల కంటే ఇంకా ఎక్కువ విలువైనవి చాలా ఉన్నాయి. మొదటిది, వ్యక్తిగా వ్యక్తికి సంబంధించిన హక్కు- జీవిత హక్కు అని పిలిచే చట్టబద్ధ ప్రక్రియ లేకుండా చంపకూడదని, అంగవైకల్యం కలిగించకూడదని, గాయపరచకూడదని హక్కు. అలాగే జైలులో నిర్బంధించకూడదని హక్కు ఉంది. స్వేచ్ఛగా ఉండే హక్కు అని ఉంది, ఆ చట్ట ప్రక్రియ కనుగుణంగానే నిర్బంధం ఉండాలి. ఇక రెండవది. ప్రతిష్ఠ కలిగి ఉండే హక్కు- అతని పేరుని తోటివాళ్ళ దృష్టిలో చులకన చెయ్యకూడదు, అవమానం కూడదు. గౌరవానికి సంబంధించిన హక్కు ఇది, ఇతరులు అతన్ని గురించి బాగా అనుకున్న దాన్ని తగ్గించకూడదు అని. మూడవది అధికారాల్నీ, స్వేచ్ఛనీ యధేచ్ఛగా వినియోగించుకునే హక్కు.[1]

ఏ అపకారమూ లేకుండా సకల చట్టబద్ధ చర్యలనీ నిర్వర్తించడానికీ, వ్యక్తిగా తనకి లభించే అన్ని హక్కులనీ అనుభవించడానికీ ప్రతి వ్యక్తికీ హక్కు ఉంది. ఈ రకమైన దాంటో ప్రత్యేకమైంది ఏ వ్యక్తైనా తన జీవనాధారం కోసం నిరాఘాటంగా తనకి నచ్చిన వృత్తిన ఎన్నుకోవడం. అదేరకంగా ప్రతివ్యక్తీ ప్రజా రహదారుల్ని, నౌకా జలమార్గాల్ని, తదితర ప్రజా సౌకర్యాల్ని స్వేచ్ఛగా వాడుకోవచ్చునే హక్కు ఉంది. అందరినీ పరిరక్షించేందుకు ఉద్దేశించిన చట్ట యంత్రాంగం అతనికి అవరోధంగా ఉండేట్టు దురుద్దేశపూర్వకంగా వాడకపోవడమూ ప్రతి వ్యక్తి హక్కులోనూ మిళితమై ఉంది. మోసం వల్లగాని,

---

1. హక్కులు, అధికారాలు, స్వేచ్ఛలు- వీటి మధ్య అంతరం ఉంది. దాన్ని గురించి వివరించాలి, ముఖ్యంగా సామాన్యునికి ఉద్దేశించిన వ్యాసంలో. ఓ వ్యక్తికి హక్కు భావన ఉండడమంటే మరో వ్యక్తి తన విధిని నిర్వర్తిస్తూ దాన్ని యదార్థం చెయ్యడమో లేదా తప్పు చెయ్యడం ద్వారా లేక ఏమీ చెయ్యకపోవడం ద్వారా దాన్ని గాయపరచడమో చెయ్యకూడదు.

హక్కుకీ స్వేచ్ఛకీ తేడా వుంది. స్వేచ్ఛని కూడా ఇముడ్చుకునేటంత అర్థంలో హక్కుని వాడడం వల్ల ఒకో అప్పుడు అది జారిపోతుంది. ఉదాహరణకి ఓ వ్యక్తికి హక్కు ఉందంటాం, అంటే తనకి సంబంధించి తను ఇష్టం వచ్చినట్టు చెయ్యొచ్చు. అయితే ఇతరుల వ్యవహారంలో స్వేచ్ఛలో జోక్యం చేసుకునే హక్కు లేదు అన్న అంశాన్ని ఇది దృష్టిలో ఉంచుకోకుండా వదిలేస్తోంది. హక్కుకీ, స్వేచ్ఛకీ మధ్య తేడాని ఇలా చెప్పవచ్చు. వ్యక్తి హక్కులు అతనికి ఇతరులు ''చెయ్యవలసిన'' వాటికి సంబంధించినవి. స్వేచ్ఛలు తనకి తను ''చేసుకోవచ్చునేవి''.

చట్టం నిరోధించకుండా ఏ వ్యక్తైనా పొందగలిగేవి స్వేచ్ఛలు. ఒక వ్యక్తి న్యాయబద్ధ స్వేచ్ఛారంగం, ఆ వ్యక్తిని ఒంటరిగా చట్టం వదిలేసే కార్యకలాప రంగమే.

బలాత్కారం వల్ల గానీ నష్టం కలిగితే రక్షణ హక్కు ఉంది. అంటే నష్టం కలిగించే వ్యవహారాన్ని ఒప్పుకునేట్టు మోసం వల్ల చెయ్యకూడదు, ఇష్టం లేని పనిని బలవంతంగా చేయించనూకూడదు- ఇది మూడవ హక్కు. ఇక నాల్గవది ఉమ్మడిగా కుటుంబ హక్కులు అని పిలిచే వ్యక్తి హక్కులు. ఈ కుటుంబ హక్కుల్ని ''వివాహ సంబంధమైన'', ''పైతృకమైన'', ''సంరక్షక సంబంధమైన'', ''ఆధిపత్య సంబంధమైన'' అని ప్రత్యేకించుకోవచ్చు. వివాహ సంబంధమైన హక్కు, లోకం ప్రతిగా భర్తకి ఉన్న హక్కు. అంటే ఏ మనిషీ బలవంతంగా గానీ, ఒప్పించడం ద్వారా గాని, భర్తకి భార్య సాహచర్యం లేకుండా చెయ్యరాదు- ఆమెతో హద్దుమీరి ప్రవర్తించడం సంగతి సరేసరి. దీనికి సమానమైన హక్కు భార్యకీ ఉన్నట్టు గ్రహించవచ్చు. అమెరికాలో కొన్నిచోట్ల దాన్ని గుర్తించేరు. 'పైతృకహక్కు' అంటే పిల్లల ఆలనాపాలనా ఉన్న హక్కు. వాళ్ళ శ్రమ ఉత్పత్తికి సంబంధించిన హక్కు, వాళ్ళు ఏ జోక్యం లేకుండా తమ విచక్షణ తమకి తెలిసే వయసు వచ్చేదాకా. సంరక్షణ హక్కు అంటే తన పోషణలో ఉన్న వాళ్ళ ఉపయోగార్థమే కాని సంరక్షకుని ఉపయోగార్థం కాక తల్లో తండ్రో సంరక్షకులుగా ఉండే హక్కు... సంరక్షణలోని వ్యక్తి అవగాహనాలోపాన్ని సంరక్షకులు పూర్తి చేస్తారు. వాళ్ళ వ్యవహారాలన్ని నిర్వహిస్తారు. ఆధిపత్య హక్కు సంరక్షణలో ఉన్నవాళ్ళ శ్రమని వినియోగించుకునే హక్కు. చంపడం ద్వారా, నిరుపయోగకరం అయ్యేట్టు గాయపర్చడం ద్వారా, ఆకర్షించి వశం చేసుకోవడం ద్వారా ఈ హక్కుని ఉల్లంఘించడం జరగవచ్చు.

చట్టానికి సంబంధించినంత మేరకు, బానిస ఒక వ్యక్తి కాకపోవడం వల్ల ఈ హక్కులేమీ ఉండవు. చట్టం దృష్టిలో అస్పృశ్యుడు వ్యక్తి. అంచేత చట్టం ''వ్యక్తి''కి ఇచ్చే హక్కులు ఏవీ అతనికి లేవనుకోవడానికి లేదు. అతనికి ఆస్తి హక్కు ఉంది, జీవించే హక్కు ఉంది, స్వేచ్ఛ, కీర్తి, కుటుంబం హక్కులున్నాయి. తన స్వేచ్ఛల్ని, శక్తుల్ని, యధేచ్ఛగా వాడుకునే హక్కు ఉంది. బానిస నిర్వచనం ఎలానేనా ఉండనీయండి. వ్యక్తి కాకపోవచ్చు, ఆస్తి కావచ్చు. అతని పరిస్థితి అస్పృశ్యుని కంటే అధ్వాన్నం.

చట్ట ప్రకారం బానిస ఉన్న స్థానాన్ని బట్టి చూస్తే మాత్రం అంతేమరి. అయితే రోమన్ సామ్రాజ్యంలో, యునైటెడ్ స్టేట్స్‌లో యదార్థంగా బానిస పరిస్థితి ఎలా ఉందో చూద్దాం. శ్రీ బరో రాసిన దాన్నుంచి భాగాలు గ్రహిస్తున్నాను[1]

''ఇప్పటిదాకా ఇంటి బానిసత్వంలోని ఏహ్యమైన పార్శ్వాన్నే చూశాం. మరో పార్శ్వం ఉంది. విశాలగృహ సముదాయాన్ని సాధారణమైందిగా సాహిత్యం చూపిస్తుంది. అయితే అది మినహాయింపు. విస్తృత బానిస సిబ్బంది నిస్సందేహంగా ఉండేది, సామాన్యంగా వాళ్ళు రోమ్‌లో కనిపిస్తారు. ఇటలీలో

1. రోమన్ సామ్రాజ్యంలో బానిసత్వం పే. 47-49

ఇటలీ వెలుపల రోమన్ గవర్నర్ పాలనలోని ప్రాంతంలో, అంత బాహాట ప్రదర్శన అవసరం లేదు. భవంతి సిబ్బందిలో చాలా మంది భూమికి సంబంధించిన ఉత్పాదక క్రియలో, ఉత్పత్తిలో పాల్గొనేవాళ్ళు. బానిసకీ, పర్యవేక్షకునికీ ఉండే పాత సంబంధం అలాగే ఉంది. బానిస సాటి పనివాడుగానే ఉన్నాడు. ప్లినీ తన కింద పనిచేసేవాళ్ళ పట్ల ఎంత దయగా ఉండేవాడో జగద్విఖ్యాతం. తన బానిసలకి జబ్బు చేస్తే చనిపోతే ఎంతో వ్యధకి గురవుతూ ఉత్తరాలు రాశేడు. భావితరాల వాళ్ళు తన ఉత్తరాలు చదువుతారని అతను ఆశించేడు. వాళ్ళ దృష్టిలో గొప్పగా కనిపించాలనిగాని, తనేదో పత్తిత్తునని తెలియచేసుకుందుకు గాని అతను అలా ఁ-యలేదు. (ప్లినీ) ఇల్లు బానిసల స్వేచ్ఛా రాజ్యం. ప్లినీ తన బానిసలని చూసుకున్న వైనం రాబోయే సాధారణ ఆచరణకి. లేకపోతే సందర్భవశాత్తూ వచ్చే ఆచరణకీ ఎంతో ముందే సంఘటన అయింది, సాక్ష్యంగా విలువలేకపోయింది. ఈ దృక్పథానికి కారణం కనిపించదు.

గొప్ప కోసమో, నిజమైన సాహిత్య ఆసక్తి రీత్యానో సంపన్న కుటుంబాలు సాహిత్యంలోనూ కళల్లోనూ శిక్షణ పొందిన బానిసల్ని తమ ఇళ్ళల్లో ఉంచుకునేవి. హోమర్, హెసియోడ్ కృతులని, తొమ్మిది మంది లాలిత్య భరిత కవుల కృతుల్ని కంఠస్థం చేసి అప్పచెప్పే పదకొండు మంది బానిసలు క్వాలిసినెస్, సాచినస్ దగ్గర ఉండేవాడని సెనెకా రాశాడు. 'పుస్తకాల బీరువాలు ఇంతకంటే చవక' అని ఓ మొరటు మిత్రుడన్నాడు. 'కాదు, ఇంట్లో వాళ్ళు దేన్ని గురించి తెలుసుకుంటారో, అదే యజమానికీ తెలుసున్న మాట' అని ప్రత్యుత్తరం. సరే, ఆ నిందలు అలా పక్కన పెట్టినా అచ్చు యంత్రం లేని రోజుల్లో చదువు వచ్చిన బానిసలు అవసరం... రెండు చేతులా పని ఉన్న న్యాయవాదికి, మంచి అభిరుచికల కవికి, తత్వవేత్తకి, చక్కని సాహిత్య అభిరుచులున్న విద్యావంతుడికి రాయసగాళ్ళు, సహాయకులు అవసరం. అలాంటి వాళ్ళు సహజంగా భాషా పరిజ్ఞానవంతులై ఉంటారు. ఇరవై ఏళ్ళకే చనిపోయిన ఓ గ్రంథాలయ అధికారి తను 'గ్రీకులో, లాటిన్‌లో విద్వాంసుణ్ణి' ని గొప్ప చెప్పుకున్నాడు. రాయసగాళ్ళు ఎక్కడపడితే అక్కడ ఉండేవాళ్ళు. గ్రంథాలయోద్యోగులు సొంత లైబ్రరీలలోనూ, ప్రభుత్వ లైబ్రరీలోనూ ఉండేవాళ్ళు... సామ్రాజ్యంలో హ్రస్వలిపి సాధారణంగా ఉండేది. బానిస న్యాయముద్రాధికారిని నియమించేవాళ్ళు.

సెట్వోనియస్ ఓ ప్రత్యేక వ్యాసంలో చాలామంది స్వేచ్ఛాయుతుల్ని, అలంకార శాస్త్రవేత్తల్ని, వైయ్యాకరణుల్ని సంకలనం చేశాడు. వైరియస్ ఫ్లాకస్ అగస్టస్ మనసులకి గురువుగా ఉన్నాడు. చనిపోయిం తర్వాత బహిరంగంగా అతని విగ్రహం స్థాపించేరు, ఆ రకంగా గౌరవం పొందేడు. స్క్రిబోనియస్ ఆఫ్రోడిసియస్ డార్బిలియస్‌కి బానిస, శిష్యుడు. తర్వాత స్క్రిబేనియా అతన్ని విడుదల చేశాడు. హిజినస్ పలాటీన్ గ్రంథాలయంలో అధికారి. తర్వాత జూలియస్ మోడెస్టస్ అని

అతని సొంత స్వేచ్ఛాయుతుడు ఆ అధికారి అయేడు. ఓ బానిస తత్వవేత్త గురించి కూడా వినబడుతుంది. యజమాని స్నేహితులతో, వాళ్ళ బానిసలతో విముక్తమైన శిల్పులతో వాదనకి అతన్ని యజమాని ప్రోత్సహించాడు. విముక్తులైనవాళ్ళు భిషక్కులుగా శిలా శాసనాల్లో కనిపిస్తారు. వాళ్ళలో చాలామంది నిపుణులు. వాళ్ళు పెద్ద పెద్ద ఇళ్ళలో బానిసలుగా శిక్షణ పొందేరు, ఒకటి రెండు ఉదాహరణలని బట్టి ఈ విషయం తెలుస్తుంది. బానిస స్వేచ్ఛ ప్రకటన తర్వాత వాళ్ళు ప్రముఖులై, విపరీతంగా శుల్కం గుంజినందుకు చెడ్డ పేరు కూడా పొందేరు.

''సమాజంలో కొందరి అభిరుచులకి నృత్యకారులు, గాయకులు, సంగీతకారులు, విచిత్రకారులు, క్రీడా శిక్షకులు కావాలనిపించింది. ఈ రకం వాళ్ళంతా బానిసల్లో ఉన్నారు. కొంత కీర్తి గడించిన గురువుల శిక్షణ పొందిన వాళ్ళే.''[1]

* * * * *

''ఆగస్టస్ యుగం వాణిజ్య, పారిశ్రామిక విస్తృతికి నాంది పలికింది... అంతకుముందే (కళల్లో, చేతివృత్తుల్లో) బానిసలు నియోగితమై ఉన్నారు, కాని వ్యాపారం ఒక్క ఉదుట్న వృద్ధి చెందడంతో... వాళ్ళకి అధిక సంఖ్యలో ఉద్యోగాలు వచ్చేయి, వేరే సందర్భంలో అయితే అది అవసరమై ఉండేది కాదు. రోమన్లు మరింత స్వేచ్ఛగా, మరింత బాహాటంగా వాణిజ్య, పారిశ్రామిక రంగాల్లో అనేక రకాలుగా దిగేరు. అయినా కూడా నిర్వాహకుడు మరింత ముఖ్యం అయ్యేడు, వాణిజ్య కార్యకలాపాలు మరింత విస్తరించడంతో అలా జరిగింది; అలాంటి నిర్వాహకులు దాదాపు తప్పనిసరిగా బానిసలే... (ఇది సాధ్యమవడానికి) బానిసత్వ బంధనాలు (నమ్మకంగా ఉండడమే). దీన్ని (బానిసకి) ప్రోత్సాహం ఇవ్వడానికి గాను సడలించవచ్చు. ఐశ్వర్యం, స్వేచ్ఛ వస్తాయన్న ఆశతో అతను పనిచేస్తాడు. దాన్ని బిగించనూ బిగించవచ్చు, బానిస యజమానికి నష్టం కలిగించేట్టు చెడుగా ప్రవర్తించకుండా. యజమానికీ బానిసకీ మధ్య కుదిరే వ్యవహార ఒప్పందంలో మూడవ వ్యక్తి సామాన్యంగా ఉన్నట్టు కనిపిస్తుంది. లాభాలు గణనీయంగా ఉన్నట్టే ఉంది, అందులో సందేహం లేదు... బానిసకి భూమిని కౌలుకి ఇవ్వడం ఉందని ముందే చూశాం... పరిశ్రమల్లో కూడా అదే రకం పద్ధతి అనేక విధాలుగా ఉండేది. యజమాని ఓ బేంక్‌ని కౌలుకి ఇవ్వచ్చు, ఓ ఓడని వాడుకునే వ్యాపారాన్ని ఇవ్వచ్చు. అందుకుగాను కచ్చితంగా ఇంత అని చెల్లింపు ఉండచ్చు, లేదా బానిసకి తరుగు (కమిషన్) పద్ధతిలో ముట్టచెప్పచ్చు.[2]

---

1. రోమన్ సామ్రాజ్యంలో బానిసత్వం పేజీ 63
2. రోమన్ సామ్రాజ్యంలో బానిసత్వం పే. 101-102.

''బానిస సంపాదించుకున్నది చట్టరీత్యా అతని సొమ్మే అయేది. ఒకసారంటూ సొమ్ము పోగయితే దాన్ని అనేక రకాలుగా వాడుకోవచ్చు. చాలా సందర్భాల్లో ఈ సొమ్ముని ఆహారం కోసమో, వినోదం కోసమో వాడుకోవడం జరిగింది... అయితే సంపాదించిన సొమ్ము ఏదో చిల్లర మొత్తం పొదుపు అనీ, యథాలాపంగా సంపాదించి, ఉబుసుపోకకి ఖర్చు పెట్టిందనీ అనుకోరాదు. యజమానికి వ్యాపార లాభాలు వచ్చేటట్టు, తనకీ లాభం వచ్చేట్టు చేసిన బానిసకి తన ద్రవ్యాన్ని చాలా లాభదాయకంగా ఉండేట్టు చేసుకునే ఆసక్తి ఉంది. తరచుగా అతనా సొమ్ముని యజమాని వ్యాపారంలో తిరిగి మదుపు పెట్టేవాడు. లేకపోతే దాంతో సంబంధం లేని మరో దాంటో మదుపు పెట్టేవాడు. అతను యజమానితో వ్యవహార లావాదేవీలు నడిపేవాడు. యజమానినీ అతన్నీ భిన్నంగా పరిగణించడం జరిగేది. లేదా అతను మూడో వ్యక్తితో ఒప్పందాలు కుదుర్చుకునేవాడు. తన ఆస్తిపాస్తుల్నీ వ్యవహారాల్నీ నిర్వహించేందుకు తను చట్టరీత్యా తన తరఫున పనిచేసే వ్యక్తిని పెట్టుకోవచ్చు కూడా. అంచేత సొమ్ముతో భూమి, ఇళ్ళు, దుకాణాలు మాత్రమే కాక హక్కులు, అధికారాలు కూడా ఉండేవి.

''వాణిజ్యంలో బానిసల కార్య వ్యవహారాలు అసంఖ్యాకంగా ఉండేవి. వాళ్ళలో చాలామంది దుకాణందార్లు, రకరకాల ఆహారం, రొట్టె, మాంసం, ఉప్పు, చేపలు, సారాయి, కూరగాయలు, చిక్కుళ్ళు అమ్మేవారు. గింజలు, తేనె, పెరుగు, పంది మాంసం, బాతులు, తాజా చేపలు అమ్మేవాళ్ళు. కొంతమంది వస్త్రవ్యాపారం చేసేవారు. పాదరక్షలు, అంగీలు, ఉత్తరీయాలు అమేవాళ్ళు. రోమ్‌లో సర్కస్ మాక్సిమస్ లేదా పోర్టికస్ (ట్రిగెమినస్, ఎస్క్వైలైన్ మార్కెట్, గ్రేట్ మార్ట్ (కావొలిన్ కొండమీద) సుబురా[1] అనే తావుల్లో వాళ్ళ వ్యాపారం సాగేది...

ఏమేరకి బానిస ప్రతినిధులు తమ యజమానుల కోసం పనిచేశారో పాంపేలోని కేసిలియస్ జుకుండస్ ఇంట్లో దొరికిన రశీదులు తెలియజేస్తాయి.

ప్రభుత్వానికి బానసలుండడంలో ఆశ్చర్యం లేదు. ఎంత చెప్పినా యుద్ధం అనేది ప్రభుత్వానికి సంబంధించిందే. బానిస ప్రభుత్వ ఆస్తి అవుతాడు. ఆశ్చర్యకారకమైందేమిటంటే సామ్రాజ్యంలో ప్రభుత్వ బానిసల్ని చాలా గణనీయంగా వాడుకోవడం, సాంఘికంగా వాళ్ళకి ఉన్న స్థానం...''

''సామ్రాజ్యంలో ప్రభుత్వ బానిస అంటే ఎన్నో విధి నిర్వహణల్లో బానిసని నియోగించడం అని. ఒక ప్రత్యేకైన వృత్తి, ఒక సాంఘిక హోదా ఉన్నట్టేనని ఆ పదం అర్థం. ప్రభుత్వ బానిసలు బస్తీ బానిసలు, సీజర్ బానిసలు చేసే పని ఇవాళ పౌర ఉద్యోగాల్లో మునిసిపల్ కార్పొరేషన్లలో, శారీరకంగా

1. రోమన్ సామ్రాజ్యంలో బానిసత్వం, పే. 106.

బౌద్ధికంగా పనిచేసే పై తరగతి, కింది తరగతి ఉద్యోగులు చేసే పని లాంటిది... (ఖజానా) కింది తరగతిలో చాలామంది గుమస్తాలు, అధికార్లు పనిచేసేవాళ్ళు. వాళ్ళంతా విముక్తులు, బానిసలు. ఇక నిర్వహించే వ్యాపారం కూడా విస్తృతమైంది... టంకసాల అక్కడ్నే ఆధిపత్య స్థానంలో ఉండే వ్యక్తి ఒక యోధుడు, టంకసాల నాణేల ముద్రణ బాధ్యత అతనిది. అతని కింద స్వేచ్ఛ పొందిన ఒక వ్యక్తి ఉండేవాడు. విముక్తి పొందిన వాళ్ళకీ, బానిసలకీ కొలువు చేసేవాడు... అయితే ఒక ప్రభుత్వ శాఖ నుంచి మాత్రం బానిసల్ని నిర్దాక్షిణ్యంగా మినహాయించేవారు, ఏదో ఒకటి రెండు సందర్భాల్లో తప్పనిసరి పరిస్థితుల్లో విధిలేక చేర్చుకున్నా, అది సైన్యం. సైన్యంలో వాళ్ళని పోరాడ్డానికి నియోగించేవారు కాదు. ఏమంటే వాళ్ళకా గౌరవం తగదని, సరే యితర ఉద్దేశాలూ ఉండేవనుకోండి. సాయుధ శిక్షణని చాలామంది బానిసలకి ఇవ్వడం ప్రమాదం కదా. అలాకాక శ్రేణిలో కొలువు చెయ్యడం మేరకే అయితే బానిసలు అధిక సంఖ్యలో కనిపిస్తారు. నౌకర్లుగా భోజనాదులు సమకూర్చే శాఖ ఉద్యోగులుగా, రవాణా ఉద్యోగులుగా ఉండేవాళ్ళు. నౌకాదళంలో బానిసలు సామాన్యంగా ఉండేవాళ్ళు''[1]

అదీ రోమన్ సమాజంలో బానిసల యదార్థ పరిస్థితి. ఇక అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో చట్టం దృష్టిలో నీగ్రో బానిసగా ఉన్న రోజుల్లో అతని యదార్థ పరిస్థితి యెలా ఉండేదో చూద్దాం. అతని పరిస్థితి గురించి బాగా తెలియజేసే వాస్తవాలు[2] కొన్ని చూడండి:

''ఏరకమైన విద్వేష విభేదాలు లేకుండా తెల్ల నావికులు, నల్ల నావికులు, సైనికులు విప్లవ కాలంలో పోరాడేరు, కలిసి తిండి తీర్థాలు సేవించేరు అని లఫాయత్ స్వయంగా అన్నాడు. నార్త్ కరోలినాలోని గ్రాన్‌విల్ ప్రాంతంలో ముమ్మొర్తులా నీగ్రో అయిన జాన్ చావిస్ ప్రిన్స్‌టన్ యూనివర్శిటీలో చదువుకుని, తెల్లవాళ్ళ కోసం బడి నడిపేడు. స్థానిక చర్చి అనుమతించడం వల్ల తెల్లవాళ్ళకి మత బోధ చేశేడు. అతని దగ్గర చదువుకున్న వాళ్ళల్లో ఒకడు నార్త్ కరోలినా గవర్నర్ అయేడు. మరొకతను ప్రముఖ విగ్ సెనేటర్ అయేడు. అతని దగ్గర చదువుకున్న మరో ఇద్దరు నార్త్ కరోలినా ప్రధాన న్యాయమూర్తి కొడుకులు. మహత్తర మిలటరీ అకాడెమీ స్థాపకుని తండ్రి అతని బళ్లో చదువుకుని, అతని ఇంట్లో భోజనం చేసేవాడు...

బానిస చాకిరీని అన్ని రకాల పనులకీ వాడుకునేవారు. కొంచెం తెలివైన నీగ్రోలకి వృత్తి పనివాళ్ళుగా శిక్షణ ఇచ్చి వాడుకునేవాళ్ళు. బానిస శ్రమ మామూలు పనివాళ్ళ శ్రమకంటే విపణిలో రెండింతలు ఆదాయం తెచ్చిపెట్టేది. చెయ్యి తిరిగిన పనివాళ్ళకి సొంత సిబ్బంది ఉండేది. వ్యవస్థ మరింత జటిలం

1. రోమన్ రాజ్యంలో భానిసత్వం పే. 130 - 147
2. ఛార్లెస్ జాన్సన్ ''అమెరికన్ నాగరికతలో నీగ్రో''

అవడంతో తమ బానిస నిపుణుల కింద పనిచెయ్యడానికి బానిసల్ని నియమించుకునేవాళ్ళు, చాలామంది బానిసలు తమ మామూలు శ్రమ రాబడిపైన వచ్చేదాన్ని దాచుకుని స్వేచ్ఛని కొనుక్కునే వాళ్ళు.

''పారిపోయిన వాళ్ళ కోసం, బానిసల అమ్మకం కోసం చేసే ప్రకటనలు వాళ్ళ నైపుణ్యానికి సూచికలు. వాళ్ళకి పేద శ్వేత శ్రామికుని కంటే ఎక్కువ వేతనమో లేక వాళ్ళతో సమంగానో వచ్చేది. యజమాని పలుకుబడితో మంచి ఉద్యోగాలు వచ్చేవి. తాపీ పని వాళ్ళు, వడ్రంగం పనివాళ్ళు కాంట్రాక్టర్లని నీగ్రో శ్రామికులకి ముందు అవకాశం ఇవ్వవద్దని కోరుతూ 1838లో ఏథెన్స్‌లో, జార్జియాలో అర్జీలు వెళ్ళేయి. ''శ్వేత జాతీయుడే ఈ దేశానికీ, ప్రభుత్వానికీ అసలైన న్యాయబద్ధమైన, నైతికమైన పౌర యజమాని. ఈ యాజమాన్య హక్కు ఆ శ్వేత జాతీయుల అధ్యయనకాలం నుంచీ అందినటువంటిది. కోపర్నికస్, గలిలియోలు భూమి గోళత్వాన్ని చాటేరు. ఆ గోళత్వ భావన మరో శ్వేత జాతీయుడైన కొలంబస్‌కి పశ్చిమ దిశగా ప్రయాణం చేస్తే భూమి దొరికే అవకాశం ఉందని ప్రేరణ కలిగించింది. అంచేత శ్వేత జాతీయులే ఈ ఖండాన్ని కనిపెట్టేరు. శ్వేత జాతీయులైన వాళ్ళే తిండి లేక అలమటించే వాళ్ళ కుటుంబాలకి తిండినీ, బట్టనీ సమకూర్చేందుకు సొమ్ముని ఇవ్వ నిరాకరిస్తున్నారు మీరు. హేతుబద్ధంగా వాళ్ళకి ఇవ్వాల్సిన పనిని ఇవ్వకుండా నీగ్రోలకి కలిగిస్తూ అలా చేస్తున్నారు.'' 1858 ఇద్దరు శ్వేత నిపుణులు, పనివాళ్ళు అర్జీ పెట్టేరు. ఇతర విభాగాల్లో ఉన్న బానిస యజమానుల నుంచి రక్షణని అర్థించే అర్జీలు అవి. ఆ తర్వాత సంవత్సరం అనేకమంది శ్వేత జాతీయులు, ఒక నీగ్రో దంత వైద్యుడు తమ మధ్య ఉండి శస్త్రచికిత్స చెయ్యడాన్ని అనుమతించిన నగరపాలక మండలి చర్యకి బాధపడ్డారు. ''మాకూ మా జాతికీ జరిగిన అన్యాయాన్ని పరిహరించి తీరాలి. అట్లాంటా పౌరులమైన మేము న్యాయం అర్థిస్తున్నాం.'' 1819లో జార్జియాలోని రిచ్‌మండ్ కేంట్‌లో జనాభా లెక్కలని బట్టి స్వేచ్ఛాయుతులైన నీగ్రోలలో వడ్రంగం పనివాళ్ళు, క్షురకారులు, పడవల్ని బాగుచేసేవాళ్ళు, జీనులు తయారుచేసేవాళ్ళు, వడికేవాళ్ళు, కర్మాగారం పనివాళ్ళు, తెరలు వగైరా తయారుచేసే వాళ్ళు, నేత వాళ్ళు, ముస్తీబు తయారీదార్లు, రంపం యంత్రం పనివాళ్ళు, మరపడవ చోదకులు ఉన్నారు. నీగ్రో చర్మకారుడు చేసిన బూట్లు వేసుకునే అధ్యక్షుడు మన్రో ప్రమాణస్వీకారం చేశాడు. మాంటిసెల్లోలో థామస్ జెఫర్‌సన్ ఇంటి నేలమీద నాజూగ్గా పరచిన పలకల నీగ్రో పనివాడితనం చూసి హారీట్ మార్టినో ఆశ్చర్యపోయినట్టు ఉంది. ఆ పురాతన ఆరామ భవంతి ఇంకా నీగ్రో నిపుణుల నైపుణ్య చిహ్నాలతో శోభగా వుంది. అసలైన ఓక్ కొయ్యతో చేసిన చెక్క పనితో కట్టిన ధృఢమైన భవనాలు అవి. కొయ్య బిగింపు గసికలతో బిగించిన చెక్క పని అది. వడకడంలో నేత పనిలో నిపుణతకల మహిళా నీగ్రోలు మిల్లుల్లో పనిచేసేవాళ్ళు. 1839లో ఆ మిల్లుల్ని ఏథెన్స్‌లో బకింగ్‌హామ్ స్థాపించేడు. వాళ్ళు శ్వేత మహిళల సరసనే ఏ అభ్యంతరమూ, ఏవగింపు లేకుండా పనిచేసేవాళ్ళు.

దక్షిణాదిన ఉన్న స్వేచ్ఛాయుత, బానిస నీగ్రో వృత్తి పనివాళ్ళు ఉత్తరాదిన ఉన్న తమ సోదరుల కంటే బాగా చేసేవాళ్ళు. ఫిలడెల్ఫియాలో 1856లో 1637 మంది నీగ్రో పనివాళ్ళు నమోదయేరు. వాళ్ళలో మూడింట రెండు వంతుల మంది తమ వృత్తుల్ని వినియోగించుకోగలిగారు. దానికి కారణం ''విద్వేషపూరిత దురభిప్రాయాలు.'' 19వ శతాబ్దం ఆరంభం నుంచీ అమెరికాకి ఎడతెరిపి లేకుండా వస్తూ ఉన్న ఐరిష్ వాళ్ళని నీగ్రో బానిసత్వానికి వర్తించే దాదాపు అవే ప్రోత్సాహక ఉద్దేశాలతోనే ముందు తీసుకునే వాళ్ళు, ''కాథలిక్ ఇరిష్‌వాడు ఏ దాంటో నియమితుడవుతాడో అక్కణ్ణుంచి పైకిపోవడం అరుదు. అదే నీగ్రో అయితే విజయం సాధించి ప్రయత్నం చేస్తాడు. ప్యూరిటన్ అయిన ఆలివర్ క్రామ్‌వెల్‌నల్ల బానిసల వ్యాపారం సాగేటప్పుడు డ్రాగ్‌హెడా నరహత్యాకాండలో చంపకుండా ఉన్న ఐరిష్ వాళ్ళని బార్బడోస్‌కి అమ్మెయ్యలేదా?'' అని వాళ్ళ తరపున వాదన వినిపించేది. న్యూయార్క్‌లో, పెనిసిల్వేనియాలో స్వేచ్ఛాయుతులైన నీగ్రోలకి, పారిపోయి వచ్చిన నీగ్రోలకి ఈ ఐరిష్ బృందాలతో ఎప్పుడూ పేచీపడుతూ ఉండేది. ఈ విద్వేషం చాలా తీవ్రంగా న్యూయార్క్‌లో సైనికోద్యోగ ఎంపికలప్పుడు బయటికి చిమ్మింది. ఐర్లండ్ వాళ్ళు మోతలు మొయ్యడం లాంటి సాదా శ్రమపూరిత పనులు చేసేవాళ్ళు. అమెరికాలో తమకు గల ఆ కొద్దిపాటి ఆధారం ఎక్కడ పోతుందోనని నీగ్రోలని పిసరు కూడా రానియ్యకుండా ప్రతిఘటించేవాళ్ళు.''

అదీ రోమన్ బానిస, అమెరికన్ బానిస ఉన్న యదార్థ పరిస్థితి. రోమన్ బానిస స్థితిగతులతో, అమెరికన్ నీగ్రో స్థితిగతులతో పోల్చదగింది ఏమన్నా భారత అస్పృశ్యులలో ఉందా? రోమన్ సామ్రాజ్యంలో ఉన్న బానిస స్థితిలో అదే కాలంలో ఉన్న అస్పృశ్యుల స్థితిని పోల్చడం తప్పుకాదూ. అయినా నేను రోమన్ సామ్రాజ్యంలోని బానిసస్థితిలో ఈనాటి అస్పృశ్యుల స్థితిని పోలుస్తాను. ఇది ఒక పక్క పరమ అధ్వాన్నంగా ఉన్న స్థితినీ, మరోపక్క మహా వైభవోపేతంగా ఉన్న స్థితినీ పోల్చడం. ఏమంటే ప్రస్తుతకాలం అస్పృశ్యులకి స్వర్ణయుగం అని అభివర్ణిస్తున్నారు. బానిస యథార్థ పరిస్థితి, అస్పృశ్యుల యదార్థస్థితి పోలికలో ఎలా ఉంటాయి? రోమ్‌లో బానిసల మాదిరీ ఎంతమంది అస్పృశ్యులు గ్రంథాలయాధికారులుగా, రాతగాళ్ళుగా, హ్రస్వ లిపి లేఖకులుగా నియమితులయేరు? రోమ్‌లో బానిసల మాదిరీ ఎంతమంది అస్పృశ్యులు అలంకార శాస్త్రజ్ఞులుగా, తత్వవేత్తలుగా, బోధకులుగా, వైద్యులుగా, కళాకారులుగా బౌద్ధిక వృత్తుల్లో నిమగ్నమై వున్నారు? రోమ్‌లో బానిసల మాదిరీ ఎంతమంది అస్పృశ్యులు వ్యాపారంలో, వాణిజ్యంలో, పరిశ్రమలో నిమగ్నమై ఉన్నారు? అస్పృశ్యుడి పరిస్థితిని నీగ్రో బానిసగా ఉన్న స్థితితో పోల్చి చూసినా కూడా అస్పృశ్యుడు మెరుగ్గా ఉన్నాడని అనలేం. అస్పృశ్యులు వృత్తి నిపుణులుగా ఉన్న సందర్భం ఉందా? చదువు నేర్చుకునేందుకు బ్రాహ్మణ పిల్లలు తన పాదాల దగ్గర కూర్చుంటూ అస్పృశ్యుడు ఓ పాఠశాల నడిపిన సందర్భం ఏదన్నా ఉందా?

అలాంటిది కలలో కూడా ఎందుకు లేదు? కాని అలాంటిది అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో జరిగింది. రోమన్ బానిసల యదార్థస్థితిని, అమెరికన్ నీగ్రో యదార్థ స్థితిని అస్పృశ్యుడి ఇటీవలి పరిస్థితితో కావాలనే పోలుస్తూ ఉన్నాను. ఏమంటే ఈ నాటి పరిస్థితి అస్పృశ్యులకి స్వర్ణయుగం లాంటిదని అంటున్నారు గనక. ఇవాల్టి అస్పృశ్యుడి పరిస్థితిని ఏనాటి బానిసల స్థితితోనో పోల్చి చూసినా అనాగరిక యుగం అని చరిత్రకారులు పిలిచే నాటి బానిసల పరిస్థితి కంటే పరిమ ఘోరంగా ఉంది. అంచేత అస్పృశ్యులు బానిసలకంటే అధ్వాన్నం. అంటే బానిసత్వం కంటే అస్పృశ్యత మనిషి పురోభివృద్ధికి మరింత హానికరం. ఈ విషయంలో ఒక వైరుధ్యం ఉంది. చట్టం దృష్టిలో అస్పృశ్యుల కంటే అధ్వాన్నంగా ఉన్న బానిసలు యదార్థానికి బాగా ఉన్నారు. చట్టం దృష్టిలో బాగా ఉన్న అస్పృశ్యులు యదార్థానికి బానిసల కంటే అధ్వాన్నంగా ఉన్నారు. ఈ వైరుధ్యం ఎలా అర్థం చేసుకోవాలి? అన్ని సందేహాలని మించిన సందేహం ఏమిటంటే చట్టపరంగా పరమ ఘోరంగా స్వేచ్ఛ లేకుండా పోయిన బానిస దాన్ని ఎలా అధిగమించేడు, అభివృద్ధి చెందగలిగేడు, ఎదగ గలిగేడు? చట్టం ఇచ్చిన స్వేచ్ఛ అస్పృశ్యునికి ఎలా పోయింది. అతని శక్తి ఎలా ఉడిగిపోయింది, అతని అభివృద్ధి దిగజారిపోయింది?

ఈ వైరుధ్యాన్ని అర్థం చేసుకోవడం చాలా సులభం. చట్టానికి ప్రజాభిప్రాయానికీ గల సంబంధాన్ని దృష్టిలో ఉంచుకుంటే ఇది తేలిగ్గా అర్థమవుతుంది. ప్రజా నడవడికని నడిపించే రెండు శక్తులు, చట్టం, ప్రజాభిప్రాయమూనూ. అవి ఒకదానిమీద ఒకటి ప్రభావంతో ఉంటాయి. ఒకో సందర్భంలో చట్టం ప్రజాభిప్రాయం కంటే ముందు ఉంటుంది. అది ప్రజాభిప్రాయాన్ని అదుపు చేస్తుంది, తనకి ఉచితం అనుకున్న తీరులో నడిపిస్తుంది. ఒకో సందర్భంలో ప్రజాభిప్రాయం చట్టం కంటే ముందు ఉంటుంది. చట్టంలోని కాఠిన్యాన్ని అది సవరిస్తుంది. దాన్ని సమతూకం చేస్తుంది. చట్టమూ, ప్రజాభిప్రాయమూ ఒకదానితో ఒకటి ప్రతిస్పందించే సందర్భాలూ ఉంటాయి. ఆ రెండింటిలో ప్రజాభిప్రాయమే బలీయమైంది కావడం వల్ల, చట్టం నిర్దేశించిన దాన్ని శుష్కం చేస్తుంది, పరిగణనలోకి తీసుకోదు. రోమ్‌లో గాని, అమెరికాలో గానీ ప్రజాభిప్రాయమూ చట్టమూ ఒకదానితో ఒకటి పొసగలేదు. అది వాణిజ్య పారిశ్రామిక ఆనుకూల్యాల ఒత్తిడి వల్ల కావచ్చు, స్వార్థపరత్వం కావచ్చు, బానిసల్ని లాభసాటిగా వాడుకోవాలనిపించడం వల్ల కావచ్చు లేదా మానవత్వ విలువల పరిగణన వల్ల కావచ్చు. ఆ రెండు చోట్లా కూడా బానిస చట్టం దృష్టిలో వ్యక్తికాడు. కాని రెండు చోట్లా సమాజం దృష్టిలో మానవునిగా అతను వ్యక్తిగానే ఉన్నాడు. మరోలా చెప్పాలంటే బానిస నుంచి చట్టం వెనక్కి లాక్కున్న వ్యక్తిత్వాన్ని సమాజం అతనికి ఇచ్చింది. అక్కడ్నే ఉంది బానిసత్వానికీ, అస్పృశ్యతకీ మధ్య లోతైన విభేదం. అస్పృశ్యుడి విషయానికి వస్తే సరిగ్గా అందుకు విరుద్ధమైంది జరిగింది. చట్టం అతనికి ఇచ్చిన వ్యక్తిత్వాన్ని సమాజం వెనక్కి లాక్కుంది. బానిస విషయంలో అతన్ని వ్యక్తిగా చట్టం గుర్తించ నిరాకరించినా, సమాజం

ఎంతో ఎక్కువగా అతన్నిగుర్తించనందువల్ల అతనికి చట్టం ఏ హానీ చెయ్యలేదు. అస్పృశ్యుని విషయంలో హిందూ సమాజం వ్యక్తిగా అతని గుర్తింపుని శుష్కం చెయ్యడం వల్ల, చట్టం వ్యక్తిగా గుర్తించినా ఏ లాభమూ లేకపోయింది. చట్టం అధికారం ఎలాంటిదైనా పరిగణించాల్సిన వ్యక్తిత్వం బానిసకి ఉంది. చట్టం ఆదేశించినా అస్పృశ్యునికి వ్యక్తిత్వం లేకపోయింది. ఈ విభేదం మౌలికమైంది. ఈ వైరుధ్యాన్ని ఇది మాత్రమే వివరించగలదు- చట్టపర శృంఖలాలలో కుంగిపోయినా బానిసకి సాంఘిక ఉన్నతి కలగడం, చట్టపర స్వేచ్ఛల ఆసరా ఉన్నా అస్పృశ్యుడు అధోగతిలో పడడం.

బానిసత్వాన్ని నిందించేవాళ్ళు ఓ విషయాన్ని విస్మరిస్తున్నారు. బానిసత్వం ఓ రకంగా వ్యాపారానికి, చేతి వృత్తికి, కళకి ఉమేదువారీతనం (లేదా శిక్షణాకాలం) లాంటిది- అది నిర్బంధం అయినాగానీ. స్వేచ్ఛా హరణానికి రాయితీ ఏమీలేని దారుణ బానిసత్వాన్ని ఖండించాల్సిందే. అయితే ఒకణ్ణి బానిసని చేసి శిక్షణ ఇవ్వడం అనేది స్వేచ్ఛతో బాటు ఉన్న అనాగరికత్వం కంటే మేలు. బానిసత్వం అంటే నాగరికతతో అర్ధ అనాగరికత్వం మార్పిడి చేసుకోవడమే, ఏదో అస్పష్టమైన కానుక. అయినా వాస్తవమైందే. నాగరిక జీవితం ప్రసాదించే పూర్తి అవకాశాల్ని స్వాతంత్ర్యంలోనే సంపూర్తిగా వినియోగించుకోవచ్చు సందేహం లేదు. అయితే బానిసత్వం ఉమేదువారీతనం (శిక్షణాకాలం) లేదా ప్రొఫెసర్ మైరేస్ మాటల్లో ''మరింత ఉన్నత సంస్కృతికి దీక్ష ఇవ్వడం.''

బానిసత్వం గుర్ంచిన ఈ అభిప్రాయం చాలా సబబైంది. ఈ శిక్షణ, సంస్కృతిక అంకురార్పణ అనే వాటివల్ల నిస్సందేహంగా బానిసకి చాలా లాభించింది. అతనికి శిక్షణ ఇవ్వడానికి, సంస్కృతిని పరిచయం చెయ్యడానికి అతని యజమానికి సుమారుగానే ఖర్చు అయేది. ''బానిసత్వానికి గురవడానికి ముందు విద్యా సంస్కృతులున్న బానిసలు ఉండేవారు కాదు. దానికి ప్రత్యామ్నాయం ఏమంటే గృహోపయోగకరమైన పనుల్లోనో, వృత్తి నైపుణ్యంలోనో బానిసలు చిన్న వాళ్ళుగా ఉన్నపుడే శిక్షణ ఇవ్వడం. నిజానికి సామ్రాజ్యానికి ముందు, ఉదాహరణకి పెద్దకాటో సమయంలో, అలానే జరిగింది. ఆ శిక్షణని యజమాని ఇచ్చేవాడు. సంపన్నుల నివాసి సిబ్బందిలో ఇందుకోసం ప్రత్యేకమైన ఉపాధ్యాయులుండేవాళ్ళు. ఆ శిక్షణ చాలా రకాలుగా ఉండేది: పరిశ్రమ, వ్యాపారం, కళలు, విద్య.''

అయితే ప్రశ్న ఏమిటీ అంటే బానిసకి ఉన్నత సంస్కృతిని పరిచయం చెయ్యడం ఎందుకు, అస్పృశ్యునికి అలా ఎందుకు జరగలేదు? ఈ సమస్య అర్థం పర్థం లేనిది కాదు. దీన్ని నేను ఎందుకు లేవనెత్తాను అంటే అంతకుముందే అనుకున్న విషయానికి- అంటే అస్పృశ్యత బానిసత్వం కంటే అధ్వాన్నం ఏమంటే బానిసకి వ్యక్తిత్వం ఉంది, అస్పృశ్యునికి లేదు అన్నదానికి- మరింత వత్తాసు చేకూరుతుందని.

బానిసకి శిక్షణ యిచ్చి, మరింత సంస్కారం కలిగించడానికి యజమాని తంటాలు పడడంలో లాభ దృష్టి ఉంది, సందేహం లేదు. ఒక పనిముట్టుగా నైపుణ్యం గల బానిస నైపుణ్యం లేని బానిసకంటే మరింత విలువకలవాడవుతాడు. అమ్మితే మరింత మంచి ధర పలుకుతుంది, ఎవళ్ళకేనా అరువుగా ఇస్తే మరింత కూలీ సంపాదించి పెడతాడు. అంచేత బానిసకి శిక్షణ ఇవ్వడం యజమానికి మదుపు పెట్టడం అన్నమాట. అయితే బానిస ఉన్నతికి, అస్పృశ్యుని పతనానికి ఈ సమాధానం చాలదు. ఉదాహరణకి బానిస చేతుల నుంచి రోమన్ సమాజం కూరగాయలు పాలు, వెన్న, నీళ్ళు, సారాయి కొనడానికి అభ్యంతరపెడితే? బానిసలు తమని తాకడానికి, తమ ఇళ్ళలో ప్రవేశించడానికి వాళ్ళతో కలిసి ప్రయాణం చెయ్యడానికి ఇంకా అలాంటి వాటికి రోమన్ సమాజం అభ్యంతర పెడితే? అలాంటప్పుడు తన బానిసకి శిక్షణ ఇవ్వడం, అర్ధ అనాగరికత స్థితి నుంచి సంస్కార స్థాయికి పెంచడం యజమానికి సాధ్యమయ్యేవా? ఎంత మాత్రం కాదు. బానిస అస్పృశ్యుడు కాదు కాబట్టి యజమాని అతనికి శిక్షణ ఇవ్వగలిగేడు, పైకి తీసుకురాగలిగాడు. అంచేత మనం మళ్ళీ అదే తీర్మానానికి చేరతాం. అదేమిటీ అంటే సమాజం అతని వ్యక్తిత్వాన్ని గుర్తించింది, దానివల్ల అతను బయటపడ్డాడు. హిందూ సమాజం అస్పృశ్యుడి వ్యక్తిత్వాన్ని గుర్తించలేదు, మానవ సంబంధాలకి అతను అనర్హుడని అంది, అతనితో మామూలుగా వ్యవహరించడానికి అనర్హుడంది. అదే అతని పతనానికి కారణం.

బానిస అయినంత మాత్రాన రోమ్‌లో బానిస మనిషి కాకుండా పోలేదనీ, మానవ సంబంధాలకి శృంఖలాబద్ధుడైనా అర్హత ఉన్నవాడేననీ బానిస పట్ల రోమన్ మతానికి ఉన్న వైఖరిని బట్టి తెలుస్తుంది. చూడండి

''...రోమన్ మతం బానిస పట్ల ఎప్పుడూ విద్వేషపూరితంగా లేదు. దేవళం ద్వారాలు అతని ప్రవేశానికి మూతపడలేదు. పండగల నుంచి పబ్బాలనుంచీ అతన్ని వెలివెయ్యలేదు. కొంతమంది బానిసల్ని ఏవో కొన్ని ఉత్సవాల నుంచి మినహాయించినా, అలాంటిది స్వేచ్ఛాయుతులైన స్త్రీ పురుషుల విషయంలోనూ జరగవచ్చు. వీళ్ళనీ బోనోడియా, వెస్టా, సెరెస్ లాంటి వాటినుంచి మినహాయించేరు. స్త్రీలని అరామాక్సిమాలోని హెర్క్యులేస్ లాంటి వాటినుంచి మినహాయించేరు. పాత కాలపు రోమన్ దేవతలు ఏ ప్రయోజనం నిమిత్తమేనా గణనలో ఉంటే బానిసని కూడా మామూలుగానే కుటుంబంలో కలుపుకునేవాళ్ళు. బానిస కూడా ఆ ఇలవేల్పుల రక్షణ కింద ఉన్నట్టు భావించుకునేవాడు...

...స్వేచ్ఛాయుతులైన స్త్రీలు వెస్టా దేవతకి పూజారిణులుగా ఉండడానికి అర్హులని అగస్టస్ ఆదేశించాడు. బానిస సమాధిని పవిత్రంగా చూడాలని రోమన్ చట్టం నొక్కి చెప్పింది. అతని ఆత్మ కోసం రోమన్ పురాణాలు ప్రత్యేక స్వర్గాన్నీ, ప్రత్యేక నరకాన్నీ సృష్టించలేదు. బానిస కూడా ఆత్మశరీరాలకి సంబంధించి యజమానిలా సృష్టి అయినవాడేనని జువెనల్ కూడా అంగీకరించేడు...''

# చట్టం దృష్టిలో బానిస

మనిషిగా అతనికి ఎలాంటి మచ్చ అచ్చువేసే వాళ్ళు కాదు. రోమ్‌లో మిగతా సమాజం బానిసని విడదీసే సాంఘిక, మతపర అఖాతం ఉండేది కాదు. బాహ్యరూపంలో అతనికీ, స్వేచ్ఛాయుతునికీ తేడా వుండేది కాదు. శరీర వర్ణంగాని, వేషధారణ గాని అతని స్థితిని వెల్లడి చేసేవి కావు. స్వేచ్ఛాయుతుని మాదిరీ అతనూ అదే క్రీడల్ని చూసేవాడు, పౌర పట్టణ జీవితంలో భాగం పంచుకునేవాడు, ప్రభుత్వ కొలువులో ఉండేవాడు. స్వేచ్ఛాయుతులందరికీ లాగా వ్యాపార వాణిజ్యాల్లో నిమగ్నం అయేవాడు. చట్టం దృష్టిలో ఒక వ్యక్తికి ఉన్న యదార్థ హక్కుల కంటే ఎక్కువగా బాహ్యరూపంలో కనిపించే సమానత్వం ఆ వ్యక్తికి మిన్న, ఇది సహజం. బానిసకీ, స్వేచ్ఛాయుతునికీ మధ్య సాంఘికంగా ఏమంత అవరోధం ఉన్నట్టు లేదు. బానిసకీ, స్వేచ్ఛాయుతుడైన బానిసకీ వివాహాలు సామాన్యంగా జరిగేవి. బానిస అయినంత మాత్రాన సమాజంలో అతనికి ఏ మచ్చా లేదు. అతనూ స్పృశ్యుడే, మర్యాదస్తుడే.

బానిసత్వం కంటే అస్పృశ్యత అధ్వాన్నమైందని చెప్పడానికి ఇప్పటిదాకా చూసింది చాలు. దీనితో పోల్చదగిన ఒక్క ఉదాహరణ మధ్యయుగాల్లో యూదుల పరిస్థితి. యూదుల సేవకత్వం ఓ మేరకి అస్పృశ్యుల స్థితి లాంటిదే. అయినా దాన్ని గురించి చెప్పవలసింది ఇదీ. మొదటిది, యూదులపట్ల చూపించిన వివక్షకి ఆధారం ఏమిటో అర్థం చేసుకోవచ్చు, దాన్ని సమర్థించకపోయినా. అది మతం విషయంలో యూదుల మొండితనం వల్ల వచ్చింది. యూదుడు ఇతరుల మతాన్ని కాదు పొమ్మన్నాడు. ఆ మొండితనమే అతనికా దండనలు తెచ్చిపెట్టింది. ఆ మొండితనం వదులుకున్న క్షణం నుంచీ అతనా ప్రతిబంధకాల నుంచి బయటపడ్డాడు. అస్పృశ్యుడి విషయంలో ఇలా జరగలేదు. అతని ప్రతిబంధకాలు అతను ప్రొటెస్టెంట్ అవడం వల్లనో, సంప్రదాయబద్ధుడు కాకపోవడం వల్లనో వచ్చినవి కాదు. ఇక యూదుల ప్రతిబంధకాల విషయంలో చెప్పుకోవలసిన రెండవ విషయం, యూదులు యూదేతరులతో మిళితమవడానికి బదులుగా అలానే ఉండాలని కోరుకోవడం. ఇది వింతగా కనిపించవచ్చుకాని వాస్తవాలు ఈ అంశాన్ని రుజువు చేస్తాయి. ఈ సందర్భంలో చరిత్రలో నమోదైన రెండు సంఘటనలని ప్రస్తావించుకోవచ్చు. వాటిన బట్టే యూదుల వైఖరి తెలుస్తుంది. మొదటిది నెపోలియన్ పరిపాలనాకాలం నాటిది. యూదులకి మానవ హక్కులని ప్రకటించడానికి ఫ్రాన్స్ జాతీయ అసెంబ్లీ అంగీకరించేక యూదు సమస్యని సంఘాల వర్తకులు, అల్సేస్ మత తిరోగమనవాదులు తిరిగి లేవనెత్తారు. ఆ సమస్యని యూదులకే పరిశీలనార్థం అప్పగించాలని నెపోలియన్ తీర్మానించేడు.

''అతను ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీల యూదు ప్రముఖుల సభని సమావేశపరిచేడు. జూడాయిజం సూత్రాలు పౌరసత్వ అవసరాలకి పొసగుతాయో లేదో నిర్ధారించుకోవడానికి ఆ సమావేశం ఏర్పాటు

చేశాడు. ఏమంటే యూదు అంశాన్ని విస్తృత ప్రజా బాహుళ్యంతో సమ్మిళితం చెయ్యాలని అతని కోరిక. 111 మంది ప్రతినిధులున్న ఆ సభ పారిస్ టౌన్ హాల్లో 1806 జులై 25న సమావేశమైంది. పన్నెండు ప్రశ్నలకి సమాధానం చెప్పవలసిన బాధ్యత దాని మీద ఉంది. అవి యూదు దేశాభిమాన అవకాశం, యూదు, యూదేతరుల మధ్య వివాహాల ఆమోదం, అధిక వడ్డీ చట్ట బద్ధత లాంటి వాటికి సంబంధించినవి. అసెంబ్లీ ఉద్ఘాటనలతో నెపోలియన్ ఎంత సంతోషపడ్డాడంటే వాటిని శాసనసభ చట్టాలుగా మార్చేందుకు ప్రాచీన జెరూసలెమ్ మండలి తీరులో శాన్‌హెడ్రిన్‌ని సమావేశపరిచేడు. ఆ శాన్‌హెడ్రిన్‌లో ఫ్రాన్స్ నుంచి జర్మనీ నుంచి, హాలండ్ నుంచి, ఇటలీ నుంచి 71 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. అది 1807 ఫిబ్రవరి 9న స్ట్రాస్‌బర్గ్‌కి చెందిన రబ్బియ్ సింజ్‌హైమ్ అధ్యక్షతన సమావేశమైంది. ఒకరకమైన చార్టర్‌ని ఆమోదించింది. యూదులు ఫ్రాన్స్‌ని తమ సొంత దేశంగా పరిగణించాలని, ఆ భాష మాట్లాడాలని, ఆ పౌరుల్ని తమ సోదరులుగా పరిగణించాలని వాళ్ళకి విజ్ఞప్తి చేసింది. సినగోగ్ అనుమతి ఇవ్వదంటూనే యూదులకీ, క్రైస్తవులకీ మధ్య వివాహాలకి సహిష్ణుత చూపించాలని చాటింది.'' యూదులు తమకీ యూదేతరులకీ మధ్య అంతర్వివాహాలని తిరస్కరించేరన్న విషయాన్ని గమనించాలి. వాళ్ళు అలాంటి వివాహాలకి సహిష్ణుత చూపించడం మేరకే అంగీకరించేరు. రెండవ సంఘటన 1795లో బటేవియన్ రిపబ్లిక్ స్థాపించినపుడు జరిగింది. యూదులలోని దారుఢ్యవంతులైన వాళ్ళు తాము శ్రమించే పరిస్థితుల్లోని ప్రతిబంధకాలని తొలగించాలని ఒత్తిడి చేశారు. ''అయితే మొదట్లో అభ్యుదయకాముకులైన యూదులు పూర్తి పౌరసత్వ హక్కులు కావాలని చేసిన అభ్యర్థనని అమ్‌స్టర్‌డామ్ వాళ్ళు ప్రతిఘటించేరు. అది చిత్రం! పౌరసమానత్వం యూదుతత్వాన్ని పదిలంగా కాపాడుకోవడానికి లేకుండా తీవ్రతరం చేస్తుందని వాళ్ళ భయం. తమ మతానుయాయులు తమ విశ్వాసాలకి అనుగుణంగా విధేయులై పౌరసత్వ హక్కుల్ని వదులుకోవాలని వాళ్ళు అన్నారు. యూదులు సంఘంలో సభ్యులుగా ఉండడం కంటే ఎక్కువగా పరాయి వాళ్ళల్లా ఉండాలని కోరుతున్నట్టే దీన్నిబట్టి తెలుస్తుంది. ''శాశ్వత ప్రజలు''గా ఉండాలనుకోవడం వల్లనే వాళ్ళని వేర్పాటుచేసి దండించడం జరిగింది. అయితే అస్పృశ్యుల విషయంలో అలాకాదు. వాళ్ళు కూడా వేరే అర్థంలో ''శాశ్వత ప్రజలే'' మిగిలిన వాళ్ళకంటే భిన్నంగా ఉన్నవాళ్ళే, అయితే వాళ్ళ వేర్పాటు వాళ్ళ కోరిక మేరకి జరిగింది కాదు. ఇతరులతో కలవకూడదని వాళ్ళు అనుకుంటున్నారని కాదు వాళ్ళకి దండన, ఇతరులతో కలవాలని అనుకుంటున్నందుకు.

అస్పృశ్యత బానిసత్వం కంటే అధ్వాన్నం. బానిసకి సమాజంలో వ్యక్తిత్వం వుంది, అస్పృశ్యునికి వ్యక్తిత్వం లేదు. ఈ విషయం తేటతెల్లంగా చూశాం. అయితే అస్పృశ్యత బానిసత్వం కంటే అధ్వాన్నం అనడానికి ఇదొక్కటే ఆధారం కాదు. ఇంత విశదం కాని కారణాలు ఇంకా ఉన్నాయి. కాని అవి యదార్థమే.

వీటిలో అతి తక్కువ స్పష్టంగా ఉన్నదాన్ని మొదట ప్రస్తావించుకుందాం. బానిసత్వం బానిస స్వేచ్ఛని హరించినా, అతని పోషణ బాధ్యతని యజమాని మీద పెట్టింది. తిండి తీర్థాలకి సంబంధించి, కట్టు బట్టకి సంబంధించి ఆవాసానికి సంబంధించి బానిసకి ఏ బెంగా లేదు. యజమానే వీటన్నిట్నీ సమకూరుస్తాడు, సమకూర్చి తీరాలి. సరే, అదేమంత బరువు కాదనుకోండి, ఏమంటే బానిస తన పోషణకయ్యే దానికంటే ఎక్కువ ఆర్జించి పెట్టేవాడు. అయితే చీకూచింతా లేని పోషణ, తలమీద కప్పు స్వేచ్ఛాయుతులైన ప్రతివాళ్ళకీ కూడా సాధ్యం కాదు. ఈ విషయం ఇవాళ జీతం పుచ్చుకునే వాళ్ళందరికీ తెలుసు. కష్టించి పని చేద్దామనుకున్నా అందరికీ పని దొరకడం లేదు. అయితే పని లేకపోతే తిండి ఉండదన్న సూత్రం నుంచి పనివాడు తప్పించుకోలేడు. 'పని లేదు తిండి లేదు' అన్న ఈ సూత్రం, వ్యాపారంలో ఆటుపోట్లు, ఆకస్మిక అభివృద్ధి, ఆర్థిక సంక్షోభం లాంటి హెచ్చు తగ్గులు ప్రతి స్వేచ్ఛాయుతుడైన జీతగాడూ చవిచూడాల్సిందే. కాని వాటి తాకిడి బానిసకి లేదు, అతను వాటి నుంచి విముక్తుడే. అతని తిండి- బహుశా ఒకటే రకం తిండి- అతనికి దక్కుతుంది, ఆకస్మిక అభివృద్ధి ఉన్నా, ఆర్థిక సంక్షోభం అయినా. అస్పృశ్యత బానిసత్వం కంటే అధ్వాన్నం ఏమంటే బానిసత్వంలో ఉన్న భద్రత, జీవనాధార బాధ్యత దానికి లేవు. అస్పృశ్యుని తిండి తీర్థాలకి, కట్టుబట్టకి, నివాసానికి ఎవళ్ళూ బాధ్యత వహించక్కర్లేదు. ఈరకంగా అస్పృశ్యత బానిసత్వం కంటే అధ్వాన్నం కావడమే కాదు దాంతో పోలిస్తే పరమక్రూరం కూడానూ. బానిసత్వంలో బానిసకి పని చూసిపెట్టే బాధ్యత యజమానిది. స్వేచ్ఛాయుతులైన పనివాళ్ళు ఉండే వ్యవస్థలో పనివాళ్ళు పని కోసం తమ సాటి వాళ్ళతోనే పోటీపడాలి. పని కోసం సాగే ఈ వెంపర్లాటలో అస్పృశ్యునికి న్యాయం దక్కే అవకాశాలుంటాయా? సాంఘికంగా ఉన్న కళంకం కారణంగా త్రాసులోని సిబ్బాలు తనకి వ్యతిరేకంగా మొగ్గు చూపించేటప్పుడు పని దొరికే ఆఖరి పంక్తివాడూ అతనే, మొదట పని ఊడిపోయేవాడు అతనే. బానిసత్వంతో పోలిస్తే అస్పృశ్యత క్రూరం. ఏమంటే ఆర్జనావకాశం ఏమీలేకుండా పోషణభారం నెత్తిన మోసుకోవాల్సిన వాడు అస్పృశ్యుడే. మరోరకంగా కూడా బానిసత్వం కంటే అస్పృశ్యత అధ్వాన్నం. బానిస మరొకళ్ళ ఆస్తి, దానివల్ల బానిసకి స్వేచ్ఛాయుతునికంటే ఆనుకూల్యం కలిగింది. ఆస్తి విలువైనది కాబట్టి యజమాని, ఒట్టి స్వప్రయోజనం దృష్ట్యా బానిస ఆరోగ్యం గురించీ, సంక్షేమం గురించీ ఎంతో శ్రద్ధ పట్టేవాడు. రోమ్‌లో బానిసల్ని చిత్తడి నేలల్లో మలేరియా సోకే తావుల్లో ఎప్పుడూ నియమించేవాళ్ళు కాదు. అలాంటి చోట్ల స్వేచ్ఛాయుతుల్నే నియమించే వాళ్ళు. కొంచెం జాగ్రత్తగా చూస్తే ఇది చాలా సహజమేననిపిస్తుంది. బానిస విలువైన ఆస్తి. ఆ కారణంగా కొంచెం బుర్ర ఉన్న యజమానికి తన లాభం ఏమిటో తెలుసు, మలేరియా లాంటి పీడలకి బానిసని బలిచెయ్యడు. స్వేచ్ఛాయుతుడి విషయంలో అలాంటి జాగ్రత్తేమీ తీసుకోనక్కర్లేదు, అతనేమీ విలువైన ఆస్తి

కాదుగా. దీనివల్ల బానిసకి బాగా లాభించింది. ఎవళ్ళ పట్లా లేనంత జాగ్రత్త అతనిపట్ల ఉండేది. అస్పృశ్యుడి విషయంలో ఇలాంటిదేమీ కలికంలోకి కూడా లేదు. అతన్ని విస్మరించేరు, అతను అలా మాడి తనువు చాలించాల్సిందే.

ఇక రెండవ భేదం లేకపోతే మూడవ భేదం అస్పృశ్యతకీ బానిసత్వానికీ మధ్య ఉన్నటువంటిది ఏదంటే బానిసత్వం బద్ధమైంది కాదు. అస్పృశ్యుడు బద్ధుడై ఉండాలి. ఎవళ్ళేనా మరొకళ్ళని బానిసగా ఉంచుకుందుకు ''అనుమోదం'' ఉంది. అతనికి ఇష్టం లేకపోతే ఉంచుకు తీరాలన్న నిర్బంధం ఏమీ లేదు. కాని హిందువు మరొకళ్ళని అస్పృశ్యునిగా ఉంచే ''ఆదేశం'' ఉంది. ఈ విషయంలో వ్యక్తిగా హిందువు అభిప్రాయాలు ఏమైనా అతనిమీద ఆ నిర్బంధం ఉంది.

★★★★

# డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ రచనలు - ప్రసంగాలు

## సంపుటం. 12

వెల :
సాదా ప్రతి : రూ. 60/-
గ్రంథాలయ ప్రతి : రూ. 100/-

[illegible]

శా[illegible] [illegible] స్థిరమయిందీ అంటూ ఏది లేదు. ప్రతిదీ [illegible] వ్యక్తికీ, సమాజానికి కూడా మా[illegible]

స్థిరత్వం అవసరమే కాని మార్పును పణంపెట్టే స్థిరత్వం కాదు. ఎందుకంటే మార్పు అనివార్యం. సర్దుబాటు ఆమోదయోగ్యమే, కాని సామాజిక న్యాయాన్ని బలికోరే సర్దుబాట్లు [illegible]

స్వర్గమార్గం వలెనే సాంఘిక సంస్కరణా మార్గం కూడా క్లిష్టమయిన ముళ్ళదారే. కులం అనే రాక్షసి [illegible] దారిలో అడ్డు తగులుతుం[illegible] సంహరించే వరకూ రా[illegible] ఆర్థిక సంస్కరణలూ ఉండవు.

- డాక్టర్ బి. ఆర్. [illegible]



సారథ్యం

తెలుగు విశ్వవిద్యాలయం